Bāpi Rāju, Aḍivi

Himabindu

Haidarābāda (Dakṣiṇa), 1946

Record no. 99

Bibliographic Record Target

బాపి రాజు, అడవి.
హిమబిందు / శ్రీ అడవి బాపిరాజు. - హైదరాబాద్దక్షిణ): meezan printing, 1946.
17, (2), 460 p. ;19 cm.
Record no. 99

Bāpi Rāju, Aḍavi.
Himabindu / Śrī Aḍavi bāpirāju. - Haidarābāda(dakṣiṇa): meezan printing, 1946.
17, (2), 460 p. ;19 cm.
Record no. 99

అయిదు రూపాయలు (వి. జి.)

# ప్రవేశిక

## శ్రీ కురుగంటి సీతారామ భట్టాచార్యులు.

1915 సంవత్సరమున "ఆంధ్రకవితా విమర్శన గ్రంథమాలిక" ద్వితీయ కుసుమముగా ప్రకటింపబడిన నా "అలంకారతత్త్వ విచారపీఠిక" యం దిట్లు వ్రాసియుంటిని: "నవలాకారు లెక్కుడుగ బంగాళమునందును, ఫ్రాన్సునందును, లంకాద్వీపమునందును జరిగిన కథలను గొనుటకు కొంచెముగ నైన యాంధ్రులచరిత్రమునుండి యితివృత్తములను గైకొని నవలల వ్రాసిన నాంధ్రోద్యమమునకు నా కెంతయో తోడ్పడుదురని నా యభిప్రాయము." ఆకాలమునుండి యిప్పటివరకు నాంధ్రుల చరిత్రమునందలి యనేకవిషయములు బహిర్గతము లైనవి. ఆంగ్లేయేతరు లాంధ్రుల చరిత్రమును వ్రాయుట తటస్థించినది. మనవారును కొంద రనేక యత్నములు సల్పుచున్నను సమగ్రమైన యాంధ్రులచరిత్ర మింతవరకును రాలేదు. ఈపని నిజముగా నాంధ్రవిశ్వవిద్యాలయమువారు చేయవలసియుండెను. వారలు కార్యాంతరవ్యాపృతులై యున్నారు త్వరలో చేయుదురను నాశకూడ పొడముట లేదు.

నవలలవిషయమై మున్నుటంకించిన నేను వ్రాసినప్పటికంటె చారిత్రకనవలలు కొన్ని వచ్చినవి. ఆంధ్రుల చరిత్రమునకు సంబంధించినవి యత్యల్పసంఖ్యాకములనుటలో విప్రతిపత్తి లేదు. అవియు చారిత్రకసామగ్రి యెక్కువగా గల విజయనగరసామ్రాజ్యమున కిటీవలికాలమునకు సంబంధించినవే యెక్కువగా కానవచ్చుచున్నవి. అంతకు పూర్వపుచరిత్రము సమగ్రముగా రాకపోయినను నవలారచనకనువగునంత రాలేదనుటకు వలనుపడదు. ప్రబంధమునకు ప్రఖ్యాతమగు నితివృత్త బీజమువలె, నవలకును చారిత్రకబీజమున్న చాలును. కాని యావంక నవలాకారుల దృష్టి ప్రసరింపకపోవుటయే లేమికి ముఖ్యకారణము. ఇటీవల చరిత్రమునందు కొంచెము వైరస్యము బొడముచున్నట్టి సూచనలు కలవు. ఇందులకు రెండు కారణములు కనబడును. మొదటిది పెద్దలకు సంస్కృతిపై దృష్టి సడలి

ప్రారంభించినమాట. రెండవది యువకులలో సామ్యవాదము. ఈ రెండును చేరి మనవారిని పూర్వుల మరపింపజేయుచున్నవి. కాని స్వాతంత్ర్యకాంక్ష, ప్రత్యేక రాష్ట్రకాంక్ష, సాహిత్యపర్యాలోకనము కలసి యిప్పుడిప్పుడు దృష్టి వెనుకకు మరల్చుచున్నవి. తనసంస్కృతి, చరిత్రములపై నుండు నభినివేశము జాతికి గర్వకారణమై భావ్యున్నతికి పునాది యగును. ఈ రెండింటిని మరచిన జాతికి నాశన మవశ్యం భావ్యము.

ఆంధ్రులవి నాల్గు సామ్రాజ్యములు. ముందునుండి వెనుకకు వెడలుదము. తుదిది విజయనగర సామ్రాజ్యము. దానివెనుకది కాకతీయసామ్రాజ్యము. చాళుక్య సామ్రాజ్య మంతకంటె వెనుకటిది. శాతవాహన సామ్రాజ్యము మొదటిది. ప్రథమసామ్రాజ్యమైన శాతవాహనసామ్రాజ్యము సంఖ్యలోనే గాక, యున్నతిలోను, విస్తీర్ణములోను, ఐశ్వర్యములోను, విజ్ఞానములోను, కాలపరిమితిలోను, నన్నిటికంటె గొప్పది. అంతకేమాత్రమో కొంచెము తక్కువ దైనను తుదిదైన విజయనగరసామ్రాజ్యముకూడ మిక్కిలి వైభవోపేతము. ఏది యెట్లున్నను ప్రథమసామ్రాజ్యముతో బోల్పదగిన సామ్రాజ్యములు ప్రపంచచరిత్రమున నెక్కువగా లేవు. కాని యీ సామ్రాజ్యచరిత్రమునకు సామగ్రి మిక్కిలి తక్కువగా నున్నది.

ప్రథమభారతీయ చరిత్రకర్తలగు భండార్కర్, రాప్సన్, స్మిత్తులు శాతవాహనులాంధ్రులనియు, వారు కృష్ణాగోదావరీ తీరములనుండియే వ్యాపించి పశ్చిమమున సముద్రతీరమును, నుత్తరమున గంగానదిని తాకిరనియు, సాధనసామగ్రితో నిర్వచించినారు. కాని యనూహాగ్రస్తులగు కొందరు చారిత్రకబ్రువులది సరికాదనియు, నాంధ్రులు తెలుగులు వేరనియు, వారు పశ్చిమమునుండి తూర్పునకు వ్యాపించిరనియు, (నందుకొందరు) ఆంధ్రులు మగధను పరిపాలింపనే లేదనియు మొదలగు నంశములకు ప్రాబల్యము నిచ్చి చరిత్రములను వ్రాసినారు. కాని యిప్పటికిని ప్రథమవాదము తుది గనలేదు. అదియే పలువురచే నంగీకరింపబడుచున్నది. ఆంధ్రులలో కొందరుచారిత్రకులు వెశలి ప్రథమవాదమునకు బలము చేకూర్చుచున్నారు. ఇది ముదావహము.



ప్రథమమున చెప్పినట్లే ప్రథమసామ్రాజ్యముపై చరిత్ర సామగ్రియే మృగ్యముగ నుండగా నవల వచ్చు టెట్లని తలంచిన వారిలో నేనొకడను. తరువాత "హిమబిందు" శారదలో ప్రకటితముకా మొదలిడినప్పుడు మిక్కిలి యాతురతతో చదివిన వారిలో నేనొకడను. కొంతవరకు వచ్చి యాగిపోవుటకు వగచినవారిలో నేనొకడను. మరల నిటీవల "మీజాన్" పత్రికలో ప్రకటింపబడుచున్నప్పుడు చదువుచు సంతసము నొందిన వారిలో నేనొకడను. ఇప్పటి నవలను చదువునపుడు వెనుక ప్రారంభించినది యాగిపోవుటయే మంచిదని నాకు తోచెను. "20 సంవత్సరముల విజ్ఞానము నవలా యితివృత్తమునను, శైలిలోను, కథాసంవిధానమునందును నెంతో మార్పు కలిగించినది. నవల పూర్తియై సంపుటముగ రాలేదే యని చింతించిన వారిలో నేనొకడను. ఇది యంతయు నైనవెనుక చి. బాపిరాజు నన్ను పీఠిక వ్రాయగోరినపుడు నా సంతోషమునకు మేరయే లేకపోయెను. ఇది నాభాగ్య మని యెంచుచున్నాను. ఇట్లు నన్నడుగుటలో మా మైత్రియు నాజ్యేష్ఠత్వము కారణములని నేన విశ్వసించు చున్నాను.

చి. బాపిరాజు ప్రజ్ఞ సర్వతోముఖము. అతని విజ్ఞానము మిక్కిలి విస్తృతము. అతని దేశభక్తి యపారము. అతని రచనాశక్తి యద్భుతము. శాస్త్రవేత్త, కవి, శిల్పి, గాయకుడు. ఇట్టివారు మన యాంధ్రదేశములో ననేకులు లేరనుట పొరబాటు కాదు. ఒక్కొక్కదానిలో నితని మించిన వారుండవచ్చును. కాని యన్నియు సమగ్రముగా విచారించిన నిట్టివారు అరుదుగా నున్నారని గట్టిగా చెప్పవచ్చును. సాతవాహన సామ్రాజ్యకాలమున నాంధ్రులవి విశాల సామ్రాజ్యము, చతుస్సముద్ర వర్తకము కలిగి యప్పటి విజ్ఞానము, సంస్కృతి, శాస్త్రపాటవము కళాపోషణము మిక్కిలి యున్నతస్థితిలో నుండెను. అప్పటి కాలపు నవలను వ్రాయుట యనిన సామాన్యము కాదు. వ్రాయుటకానికి దద్యావత్ జ్ఞాన ముండవలెను. అది యంతయు చి. బాపిరాజునకున్నదనుట నిర్వివాదము. ఈనవలయందలి ప్రతిపుటయు నావచనములను దృష్టాంతీకరించుచున్నది.

ఇప్పుడు మన కున్న నవలలో లక్షణములనుబట్టి సర్వాంగసుందర మనువది రాలే దనిన నెవ్వరికిని కోపకారణము కాకూడదు. సాంఘికనవల లటుంచి చారిత్రక

నవలలను చూచిన నీలోభము విస్పష్టము కాగలదు. నవలలో నచ్చటచ్చట నుదాంతములగు విషాద సంఘటనలను ప్రవేశపెట్టువారును, నీకాలపు అభిప్రాయములను వానిలోనికి దూర్చువారును, ప్రవేశపెట్టిన పాత్రముల కన్నిటికిని గతి కల్పించనివారును, పేర్మి ముక లేని నాయకుల సృష్టించువారును అభూతపూర్వవిషయములను చెప్పువారును, కార్యకారణ భావము లేకుండ సన్నివేశములను కల్పించువారును, కనబడుచున్నారే కాని, సహజసన్నివేశము కల్గి, శీలము గల పాత్రలను కల్పించి, పాఠకుని సముత్కంఠోత్కంఠా సహితుని చేయగల నవలారచయిత లరుదుగా కనబడుచున్నారు. హిమబిందు నవల సాధ్యమైనంతవరకు సర్వాంగసుందరమై, సర్వలక్షణ సంపన్నమై, యుదాత్తమై, తత్కాలచరిత్రప్రతిబింబమై యలరారుచున్న దనుటలో నెట్టి యతిశయోక్తియు లేదు.

సాంఘికనవలకును, చారిత్రికనవలకును నొక్క గొప్ప భేదము కలదు. సాంఘికనవలలోని పాత్రలు మనచుట్టును కనబడును. అందలి సన్నివేశములు మన కనుభూతములు. అనుభవతంత్రుల ప్రయోగించుటతో మనకు తాత్కాలికానందమును కల్పించును. కాని చారిత్రకనవల యట్లు కాదు. కవి యొక్క వాతావరణమును, పాత్రలను, సన్నివేశములను కల్పించి మన మనశ్చక్షువుల యెదుట పెట్టును. దానిని తన భావనాశక్తితో దర్శించినను దర్శింపచేయును. ఎప్పుడైతే ఈ ప్రథమ కార్యమున సాఫల్యము నొందునో ఇంక తాను చెప్పు విషయముల నన్నిటిని నమ్మించి తనను తనవెంట గొంపోవును. ఇట్టికపి నొనర్పు చిరంజీవి బాపిరాజు పాఠకుని తన దాసునిగా నొనర్చుకొను ననుటలో నెట్టి యభ్యంతరము లేదు. చదువుచుండ నచ్చటచ్చట నాంధ్రుల గుణశీల సంపదలను చెప్పినప్పుడు మన వాసనలు పురస్కరించి యుప్పొంగును. జాత్యభిమానము పెంపొంది మనపూర్వులయెడ గౌరవము వృద్ధియగును. చారిత్రకనవల యొక్క యాదర్శమే యది. దానిని బాపిరాజు సంపూర్ణముగా నిర్వహించినా డనుట సత్యమును చెప్పుటయే యగును.

ఆంధ్రుల గుణశీలములు, వారి సిరిసంపదలు, మతసహనము, వారి యుదారహృదయము, వారి విజ్ఞానము, అప్పటి వారి సర్వశాస్త్రాభిరుచి, వారి లలితకళా పోషణము, వారి యాచార వ్యవహారములు, వారివృత్తులు, వారి సాంఘికవ్యవస్థ, వారి వర్తక



వ్యాపారములు. ముఖ్యముగా వారి గ్రామజీవనము, వారి రాజ్యాంగవ్యవస్థ, వారి న్యాయనిర్ణయము. ఇది యది యననేమి—ఆంధ్రుల సంపూర్ణజీవితము నవలయందు ప్రతిబింబించి పాఠకుల కుత్తేజమును కల్పించును. ఆయా విషయములను చెప్పినప్పు డాయా సందర్భములకు తగినభాష యుపయోగించుట యీ నవలయొక్క విశిష్టత.

ప్రథమ శాతవాహన చక్రవర్తి యగు శ్రీముఖుని యాదర్శ మిట్లుండెను: "రాజ్యము చతుస్సముద్ర వలయితము చేయవలె. ధర్మమును నాల్గుపాదముల నడిపింపవలె. ఆంధ్రదేశమును, నార్యావర్తమును సూక్ష్మమై సకల సంపదాకరమై ధర్మపూర్ణమై, పుణ్యవంతమై స్వర్గధామమునకు తుల్యము కావలెను .....ప్రజా వ్యసనము ముందు—ఆత్మవ్యసనము తరువాత." ఇక రాజగురువు నాదర్శము చూడుడు: "శాతవాహన వంశమును నిష్కల్మషము చేసి, దానిచేత నే ప్రపంచ మంతా యేలించవలెను. దేవతాతృప్తి మానవముక్తి ప్రసాదించే యజ్ఞయాగాది క్రతువులు దేశమంతా జరగవలెను. పాషండము, వైదికమార్గ నిరసనము, మోక్షమారము, నరకహేతువు నగు బౌద్ధధర్మము జైనధర్మము నిశ్శేషము కావలెను."

చక్రవర్తి రాజగురువుల యాదర్శము లెట్లు సఫలమయ్యెనో తెల్పుచు, ప్రేమగాథలను రసవంతముగా నిర్వహించి, తదంగముగా నప్పటి సామ్రాజ్య మహోన్నత్యమును, నప్పటి విజ్ఞాన సంపదను, చిత్రించిన నవల యిది. బౌద్ధ వైదికధర్మముల పోరాటము, సామ్రాజ్యముయొక్క మత సహనము చక్కగా పోషింపబడినవి.

చి. బాపిరాజు ధర్మములను విర్వచించినపుడు ధర్మవేత్తయై, యుద్ధములను వర్ణించునెడల సమరశాస్త్ర విశారదుడై, ప్రేమికుల సంభాషణములను తెల్పునెడల రసమూర్తియై, శిల్పచాతుర్యము నుగ్గడించునెడ శిల్పియై, గానము పాడించునెడల గాయకుడై, రహస్యభేదములను నల్లునెడల గూఢచారియై, పరస్పర హృదయమర్మములను తెలుపునెడల మనశ్శాస్త్రవేత్తయై, బాలికల యాట

పాటల విరూపించునెడల బాలుడై, శాస్త్ర చర్చల జరుపునెడల సకల శాస్త్ర వేత్తయై, పాత్రశీలోన్మీలన వేళలో సహృదయుడై, మొత్తముమీద నవలా రచనయందు మహాకవియై వరలినాడు

కొన్ని విశిష్టగుణములను మనవి చేతును. ప్రవేశపెట్టిన పాత్రలన్నిటికి విగతికల్పించుట. ఆనేక నవలలలో నీగుణము మృగ్యము. తరువాత పాత్రల పేర్లు వాని నన్నిటిని ఆంధ్ర శాసనములనుండి గ్రహించినాడు. తదుపరి వాక్చిత్రములచే నాయా సన్నివేశములకు తత్కాల వాతావరణమును కల్పించుట. ఆవల నెన్ని యవరోధములు కల్గినను పవిత్ర ప్రేమ విజయమునొందుట. అన్నిటికంటె గొప్పది విషకన్య పాత్రనిర్వహణము. ముద్రారాక్షసమున విషకన్య నుల్లేఖించుటయే కలదుగాని, దానినిర్వహణమును తెల్పియుండలేదు. చిన్నతనమునుండి దాని నళిచారవాహమాదికము చేతను, విషవైద్యసహాయమునను, నెట్లు సృష్టించెనో, యందులకుతగిన విషాగులను గ్రహించి వాని ప్రయోగముచే దానినెట్లు పూర్ణపరిణామ మొందజేసెనో, తత్పరిణామముతో నది తాకుటను, గు... దగ్గరకు వచ్చుటకు వీలులేనిస్థితి నెట్లొందెనో, మొదలగు విషయములు చదివియే తీరవలెను. విషకన్య యాన్యృతకన్యగా మారుటకూడ నొక యద్భుతవిషయము. బుద్ధివచ్చినతరువాత యాకన్య ప్రపంచమును చూచి, తన సహజప్రకృతిని పారజూచుకొని, తాతగారినెట్లు ప్రతిఘటించెనో, క్రమముగా నామెయందు పరివర్తన మెట్లుకలిగెనో, ప్రేమాంకురమైనవెనుక యామెచిత్తవృత్తి యెట్లు మారెనో, తుదకు దైవికముగ నామెకును శ్రీకృష్ణసాతవాహనునికిని కల్గిన కలయికయు చదువవలెనేకాని చెప్పుటకు వలనుపడదు. విషకన్యాపాత్ర నిర్వహణమునందు కవిచూపిన భావనాశక్తి యప్రతిమానము. కవిశక్తి యెట్టిదో కాని యేసన్నివేశములను చిత్రించునపుడును నేపాత్రనుగూర్చి చెప్పునపుడును పాఠకుడు తన్మయుడైపోవును. ఈ తన్మయత్వమే నవలకు పరమనికషము. తుదకు నవల యింకను లేకపోయెనే యని పాఠకుడనుకొనును. చి. బాపిరాజుయొక్క రసపిపాసయు, ప్రేమహృదయమును, చిత్రకళోపాసనయు, ననుక్షణమును వ్యక్తమగుచుండును.



నిజమైన కవియైన కావ్యమును విషాదాంతముగా చేయడు. ఒకవేళ చేసినను మరణముతో చేయడు. ప్రాచికిని ప్రతీచికిని నిదియొక ముఖ్యభేదము. ప్రాచియందు ప్రతిదినమును సూర్యుడుదయించును. అందుచే నెల్లపుడును సృష్టి నూతనత్వము కన్పట్టుచుండును. ప్రతీచియందు ప్రతిదినమును సూర్యు డస్తమించును. సూర్యోదయ సూర్యాస్తమయములే ప్రాచీ ప్రతీచీ భావ వైలక్షణ్యద్యోతకములు. మృదు హృదయుడగు కవి విషాద సంఘటనలతో కావ్యమును పూర్తిచేయడు. "ఆర్యసూత్ర మానందమే యగును కవికి" అను కవి వాక్యానుసారముగ తుద కానంద పర్యవసాయిగనే కావ్యము నొనర్చును. చి. బాపిరా జతిమృదుహృదయుడు. రసపిపాసయు, శిల్ప చిత్తవృత్తియు కలసి యా హృదయమును మరియును నార్ద్రము చేసివైచినవి. అట్టి యుదాత్త సన్నివేశములను వర్ణించుటకు విముఖుడని యనుకొనుటకు వీలులేదు. విషకన్యా ఘట్టములను చదువునపుడు హృదయమున నార్ద్ర్యము, భయము పెనగొనుచుండును. యుద్ధాది వర్ణనములలో పాఠకుని యెదుట చిత్రములను సృజింపచేయు శక్తి యున్నది. "వజ్రాదపి కఠోరాణి మృదూని కుసుమాదపి" యను నుక్తి బాపిరాజునెడల పూర్తిగా వర్తించును. కాని యానందము సహజ చిత్తవృత్తి. ఆ కారణముననే యెన్ని కథలు, నవలలు వ్రాసినను, నెంత దారుణ యుద్ధఘట్టములను వర్ణించినను, పాఠాంతమున పాఠకునకు మిగులునది యానందమేకాని మరియొక చిత్తవృత్తి కాదు.

ఇతివృత్తమును కొలదిగ సూచింతును. ఆకాలమున వర్ణవ్యవస్థ యున్నను వారిలో నంతర్వివాహాది సంబంధము లుండెను. శాతవాహనులు బ్రాహ్మణులు. చానుగుప్తుడు వైశ్యబ్రాహ్మణ కుటుంబమునకు చెందినవాడు. సువర్ణశ్రీ శిల్పి బ్రాహ్మణ కుటుంబస్థుడు. వీరికందరకును సంబంధ బాంధవ్యము లుండెను. బౌద్ధ వైదిక మతములకు సంఘర్షణము జరుగుచుండెను. శాతవాహనులు బ్రాహ్మణులైనను మతమున బుద్ధానుయాయులై యుండిరి. స్వచ్ఛ వైదిక మతమునకు క్షతి కలిగినదని బ్రాహ్మణులు దుఃఖించుచుండిరి. శాతవాహనులకు తదభిమానమును పోగొట్టవలెనని యత్నించినను ప్రయోజనము లేకపోయెను. వైదికమత

ప్రతిష్ఠాపనమునకై రహస్యముగ కుట్రలను పన్నుటకైనను వెనుదీయకుండిరి. తుదకు వంశము నంతరింప చేసియైనను వైదికమత పునఃప్రతిష్ఠను గావింప వలెనని రహస్యాలోచనములు జరుగుచుండెను. ఈ యాలోచనములకు స్థూల శిష్యులు నాయకుడు. శ్రీముఖుని మనసు మార్పవలెనని యత్నించి విఫలులై యాయన పెద్దకుమారుడును యువరాజును నగు శ్రీకృష్ణుని కడతేర్చి రెండవ కుమారుడగు మంజుశ్రీని దొంగిలించుకొని పోయి వైదిక మతానుయాయిగా విద్యల నభ్యసింపజేసి యాతనిని రాజుగా చేయవలెనని రహస్య కార్యములు జరిగెను. మంజుశ్రీ నెత్తుకొనిపోయి నర్మదా నదీతీరము నందలి పర్వతారణ్య గుహాలలో దాచి యతనికి వేదాది విద్యలను గరపించుచుండిరి.

స్థూలశిష్యులు మనుమరాలగు చంద్రిశాలను విషకన్యగా మార్చి యువరాజగు శ్రీకృష్ణ శాతవాహనునిపై ప్రయోగించి సమయింప తన యధర్వణవేద విజ్ఞానమును, మంత్రశాస్త్ర జ్యోతిష శాస్త్రములను ఉపయోగింప నిశ్చయించుకొనెను. పసిబాలయగు చంద్రిశాలనట్లు మార్ప యత్నించుటయు నది యెటు పరిణమించినదియు వెనుక మనవిచేసి యున్నాను. శాతవాహన చక్రవర్తియొక్క సామ్రాజ్య విస్తరణ కాంక్షయు, బ్రాహ్మణుల వేదమత పునఃప్రతిష్ఠాపన దీక్షయు నీ నవలలోని యితివృత్తమునకు ముఖ్యోజ్జీవకములు. నాల్గు ప్రేమ గాథలకు తదంగములు. ఈ యంగాంగీ భావము నవలయందు చక్కగా విస్తరింప బడినది. తుదకు రెండాశయములును చేకూరినవి. ప్రేమగాథలు ఫలించినవి. సామ్రాజ్యము అభీర మాళవ మగధ దేశములను జయించి విస్తరించెను. సామ్రాజ్యమున బౌద్ధ వైదిక మతములకు రెంటికిని సామరస్యము కలిగెను. బుద్ధుడు తదవతారముగా నిర్ణయింపబడెను. ఈ మహాత్కార్యమున స్థూల శిష్యులకు కుమారుడగు అమృత సోదాన్వితులును, చంద్రస్వామియు బాసటయైరి. ఎప్పుడు బౌద్ధము వైదిక మతాంతర్భూతమయ్యెనో యప్పుడు ప్రత్యేక బౌద్ధమునకు స్థానము లేకపోయెను. ఆనుషంగికముగా నప్పటి చరిత్రము కొలదిగ వివరింపబడినది. శాతవాహనులకు పునాది శ్రీకాకుళము. తరువాత ధాన్యకటకము రాజధాని యయ్యెను. శ్రీముఖుని కాలము నాటికే సామ్రా



జ్యము పశ్చిమమునకు పెరిగి ప్రతిష్ఠాన నగరమువరకు వ్యాపించెను. వీరి వర్తకమునకు పశ్చిమ సముద్రతీర ప్రదేశమున కవసరమయ్యెను. అప్పుడు మగధదేశమును కాణ్వాయన బ్రాహ్మణు లేలుచుండిరి. ఉజ్జయిని సామ్రాజ్యమునకు కప్పము కట్టుట మానెను. ఈ మూడు కార్యములను చేకూర్పవలసియుండెను. ఇంతలో చక్రవర్తి జన్మదిన మేతెంచెను. అందులకై శ్రీకృష్ణశాతవాహనుడు ప్రతిష్ఠాన పురమునుండి విచ్చేసెను.

జన్మోత్సవ వేడుకలలో శకటచోదక పరీక్ష యొకటి. దానితో నవల ప్రారంభమయ్యెను. ఈ పందెమున ముఖ్య పోటీదార్లు సమవర్తి సువర్ణశ్రీలు. సమవర్తి శకటము చారుగుప్తులవారిది. పందెమును గెలిచి బంగారు శకటములో తన కుమార్తెను యువరాజునకు సమర్పింప వలెనని యాయన యుద్దేశ్యము. హిమబిందు సమవర్తులు మేనమామ మేనత్తల బిడ్డలై యొకచో పెరిగి పరస్పరస్నేహమున పెరిగిరి. తాను గెలిచి హిమబిందు మనసును పూర్తిగా చూరగొనవలెనని సమవర్తి యూహ. గెలిచినవానిని మధ్యనుంచి బాలికలందరును నాట్యమాడుట యాచారము. సమవర్తి నోడించి సువర్ణశ్రీ గెలిచెను. సమవర్తికి కావలసిన గౌరవము సువర్ణశ్రీకి జరిగెను. ఊహలు తారుమారయ్యెను. నాట్యములో సువర్ణశ్రీ హిమబిందుల యత్ను లొండొంట కలిసెను. ఇదియే నవలా కథకు నాంది. హిమబిందు హృదయము సువర్ణునిపై లగ్నమగుటయు, నది తెలియక చారుగుప్తుడు తన యూహకు సమవర్తి ప్రతిబంధక మగుటచే వెడలనడచుటయు, శ్రీకృష్ణుని దృష్టిపథమునుండి హిమబిందును తొలగించుట కామెను కూడ దొంగిలించి మంజుశ్రీని యుంచిన స్థలముననే యుంచుటయు, తటస్థించెను. చక్రవర్తి కుమారుని గొంపోవుటచే దుఃఖించుచున్నను చారుగుప్తుని ధన సహాయముచే దిగ్విజయ యాత్ర సాగించుటయు, నందులకై శ్రీకృష్ణుడు ప్రతిష్ఠానమునకు వెడలుటయు, వెన్వెంట విషకన్యతో స్థూలశిష్యులు తానును ప్రతిష్ఠానమునకు వేంచేయుటయు తటస్థించెను.

స్థాలతిష్యుడు విషకన్యా శ్రీకృష్ణుల కలయికతో శాతవాహన వంశ నాశనమునకు చేసిన మంత్రతంత్రములు. వాని పరిహారమునకై జరిగెడు ప్రతిక్రియలు చేరి యొక విచిత్ర సామగ్రి యగుచున్నవి. శ్రీకృష్ణుడు కారణజన్ము డనను నమ్మకము కలవాడగుటచే నట్టి కన్యకనే యన్వేషించుచుండెనుగాని సామాన్య స్త్రీయై యెంత సౌందర్యవతి యైనను, హిమబిందాయన మనసున కెక్కలేదు. అదియేమి విచిత్రమోకాని స్థాలతిష్యుని ప్రేరణము విపరీతమై విషకన్యను చూచినంతనే కృష్ణునిమది లగ్నమయ్యెను. "జననాంతర సౌహృదాని" యను కాళిదాస వాక్యముల కిది తార్కాణము. మహామహులకు కష్టసాధ్యమైనను మహాకార్యమే యాకర్షించును. శ్రీకృష్ణు డట్టివాడు. తన యనుచరులు విషకన్యనుండి యాయన నెంత విముఖునిచేయ యత్నించిరో యాయనమన సామె యందంత లగ్నమై పోయెను. అమృతకన్య యగుట కెంతకాలము పట్టునో యంతకాలమును వేచియుండ నిశ్చయించుకొనెను. ఆయమయు నాయనను తన యుపాస్య దైవము పోల్కి చూచుకొనుచు మంచి కాలమునకై వేచి యుండెను.

హిమబిందువు తప్పించిన సంగతి విని సువర్ణశ్రీ, యామె భావి మహారాజ్ఞి యగునని మాహాచే రక్షింపవలె ననునిశ్చయమును ఉత్సాహమును రెట్టింప గోండు వీరుని సహాయముచే నర్మదాతీర భూములందలి యరణ్యపర్వత కుహరము చేరి, యచ్చట మంజుశ్రీని గని యిద్దరిని రక్షించి నిరపాయస్థలము చేర్చెను. తరువాత మాళవదేశ విముక్తికై జని యచ్చట శ్రీకృష్ణ సమవర్తులతో చేరి యుద్ధమున పాల్గొని, శ్రీకృష్ణుని ప్రాణరక్షణము చేసెను. మాళవవిజయ మైనవెనుక శ్రీకృష్ణ సువర్ణశ్రీ సమవర్తులు పాటలీపుత్రమును ముట్టడించిన శ్రీముఖునికి సాయమొనర్ప వెడలిరి. అప్పటి సంకులసమరమున కోటను పట్టుకొనుటలో వీరిద్దరే ముఖ్యపాత్రలను వహించిరి. చక్రవర్తి హృదయమున వీరిద్దరి శౌర్యమును హత్తుకొని వారిపై ప్రేమ గౌరవములను పెంపొందింప జేసెను. వారి కిద్దరికిని సామ్రాజ్యమున రాజప్రతినిధి పదవులియ్య నిశ్చయించుకొనెను



యుద్ధము ముగిసిన వెంటనే కళ్యాణములు జరుగు నవకాశము వచ్చెను. చారుదత్తుడు తన యుద్దేశమును చక్రవర్తి చక్రవర్తినులకు విన్నవించ వారును వల్లె యనిరి. కాని శ్రీకృష్ణు డియ్యకొనక పోవుటయేగాక, హిమబిందు సువర్ణశ్రీని ప్రేమించుచున్నట్లు చారుగుప్తుడు తెలిపి విధివిధానము ననుసరింప తలయొగ్గుట యేగాక, తన యాప్తబంధువుల యుద్దేశముకూడ నట్లే యుండుటచే, మనమున కించపడలి సంతోషముతో నందుల కంగీకరించెను. సువర్ణశ్రీ యంతలో తన కోరిక తీరమి యాత్రాయుక్తుడై వెడల, హిమబిందువు నాతని వెదుక వెడలెను. ఈ సంగతివిని చారుగుప్తుడును వెన్నంటెను. శ్రీకృష్ణుడును చక్రవర్తి పంపున సువర్ణశ్రీని తెచ్చుటకై వెడలెను. మృగవనము దీక్షాగ్రహణాద్యుక్తుడగు సువర్ణశ్రీని కనుగొని తోడితెచ్చిరి.

ఈ మధ్య నాగబంధునిక యన్నగారి యనుమతిని పురుషవేషమున సమవర్తికి రక్షకోద్యోగమునుపొంది యాయన ప్రాణములను కాపాడెను. స్త్రీయని తెలిసినవెనుక వారిద్దరికిని ప్రణయము హెచ్చెను. ఇంతలో విషకన్య యమృతకన్యగా మారెను. మూడు వివాహములును వైభవోపేతములుగా జరిగెను. శ్రీముఖునికి పాటలీపుత్రమున సామ్రాజ్య పట్టాభిషేకము జరిగెను. యువరాజు ప్రతిష్ఠానమునను, సువర్ణశ్రీ పాటలీపుత్రమునను, సమవర్తి బరుకచ్ఛము నందును రాజప్రతినిధులైరి. బౌద్ధ వైదిక ధర్మములకు రెంటికిని సమ్మేళనము జరిగి బుద్ధుడు కృష్ణావతారమని నిర్ధారణ మైపోయెను. కథ కంచెకుపోయెను, మన మింటికి చేరితిమి.

ఇందు మూడు ప్రణయగాథ లున్నట్లు వెనుక చెప్పితిని. చి. బాపిరాజు హిమబిందును నాయికను చేసినను నాకు శ్రీకృష్ణ విషకన్యలే ముఖ్యద్వయముగా కనపడుచున్నారు. వారి యసామాన్యతయు నందులకు దోహద మగుచున్నది. ఇద్దరును నసామాన్యులే. చంపవేసిన బాణము గళమున పూలహార మయ్యెను. ఇది విచిత్ర సంఘటనము ఈ యిద్దరి కలయిక యొక్క పూర్వాపర రంగములు మహా

విషయ సంకలితములై, యాదిభౌతిక కక్ష్యను దాటినవి. పైకి విరుద్ధముగ కన్పట్టినను లోపలి చిత్తవృత్తులును, స్వభావ శీలములును ఏకములై యున్నవి కేవల బాహ్యసౌందర్యమే వారి పరస్పర ప్రేమాంకుర కారణముకాదు. ఇట్టి నాయకా నాయకుల ప్రణయమే నవలకు మకుటాయమాన మైనది.

కవియే యిట్లు వివరించినాడు: "ప్రేమ రెండువిధములు—నీవు ప్రేమింతువు. కాని ఆ ప్రేమించినవానిని నీభర్తగా కోరవు. ఇది మహోత్తమప్రేమ. రెండవది నీవు ప్రేమించినవానిని భర్తగా వాంఛింతువు. అది ఉత్తమప్రేమ. నీది (హిమబిందుది) రెండవది. మొదటిప్రేమ పురుషుని దైవముగామాత్రము చూచును. (విషకన్యప్రేమ.)" (పుట 384)

ప్రథమ విధమైన ప్రేమనుగూర్చి కవియే "ప్రేమ సావిత్రివలె మృత్యువును జయించును" అనినాడు. నిజముగా విషకన్యప్రేమ మృత్యువును జయించినది.

మరియొకచో నిట్లనినాడు "ఇప్పుడామె భక్తురాలు. ఆమెకు నాయకుడే భగవంతుడు. ఆమెకు భగవంతుని భావము, నాయకుని భావము వేరువేరుగా స్ఫురింపనే లేదు." ఇట్టిది మహోత్తమ ప్రణయము.

హిమబిందు స్వర్ణశ్రీల పరస్పరప్రేమ రెండవరకము. ఇది బాహ్య సౌందర్యముపై నాధారపడి మాటిగా నడచినది. హిమబిందు భారతీయ యువన లక్షణ సమ్మిళితమైన యువతి. ఈమెది కామప్రణయము. హిమబిందు యువరాజునకు భార్యగా నిర్ణయమైనట్లు తెలిపి యామెనుండి విడిపోవలెననియు, దీక్షను గ్రహింపవలెననియు నెంత యత్నించినను ఆమెను మరువలేక పోయెను. బుద్ధమూర్తికి బదులు హిమబిందువే యాయన హృదయము నిండియుండెను. వీరి ప్రణయ ముత్తమ ప్రాపంచిక ప్రణయము.

ఇక మూడవది కేవల సామాన్య ప్రాపంచికమును నాగబంధునికా సమవర్తుల దానిలో నొకవిచిత్రము కలదు. నాగబంధునిక స్త్రీయయ్యు కొన్ని పురుషగుణములు కలది. సమవర్తి నాగుణము లాకర్షించెను. ఆ సామ్యమే వారి ప్రణయమునకు పునాది. ఇందెట్టి విశిష్టతయు లేదు. పై మూడును మెట్లుగా నున్నవనవచ్చును.



నవలయొక్క రచననుగూర్చి రెండుమాటలను చెప్పవలెను. చి. బాపిరాజా శైలి గంగాలహరి. దానివేగము వైవిధ్యము, ఆనందదాయిత్వము అప్రతిమానములు సందర్భానుసార శైలీగ్రథనములో నీకవికి చాల శక్తి కలదు. నవలకు శోభకూర్చుటకై యేమేమి చేయవలెనో యట్టిదంతయు నీయనకు స్ఫురించును. సప్తశతిలోని శ్లోకములను సందర్భోచితములుగా పరిగ్రహించుట యిందులకొక యుదాహరణము. ఆంధ్రులలో సర్వసామాన్యము లయిపోయిన "బావాబావా పన్నీరు, బావనుపట్టుకు తన్నేరు" "వదినే చెడ్డది యెంతో వల్లమాలినదీ" మొదలగు పాటలు పాఠకునికి తప్పక ఆనందము కలుగచేయును.

బాపిరాజా ఉపమానము లొకప్పుడు వాల్మీకిని తలపింపజేయును. "రూపొందిన బ్రహ్మవిద్య" "ఒరనూడ్చి నడవేసిన కృపాణమువలె" సందర్భమున రూప కల్పనమున కట్టియుపమాలు మిక్కిలి సమంజసములై యున్నవి. రత్నములవలె నెడనెడ పొదుగబడియున్నవి. సంభాషణములు కడు హృదయంగమములుగ నుండి పాత్రశీలమున సుచితములైన మంజసములై యుండును. ఎక్కడ చదువుచున్నను కవి శిల్పిగనో, చిత్రకారునిగనో, బాలునిగనో, శాస్త్రవేత్తగనో తొంగి చూచుచుండును. "ఓ వెన్నమ్మగారూ? ఓ మామిడిపండు రసముగారూ? ఓ. చెరుకుపాకరం గారూ? ఈవేళ నైన కొన్ని మిరియములు తినవే! కొంచెము నల్లజీలకర్ర రుచిచూడవే!" అని చదివినప్పుడు కవియొక్క నిత్యయువక చిత్తవృత్తి తాండవించును.

భావవస్తు రచనములందలి విశేషముల నుగ్గడించిన గ్రంథము విస్తరించును. ఈ నవల యిప్పటి కాంధ్రనవలలో హిమాచల శృంగమువంటిది.

ఇట్లు ఆశీర్వదించు
కురుగంటి సీతారామ భట్టాచార్యులు

హైదరాబాదు.
24—4—1948.

# అంకితము

నాస్వప్నాలకు అమృతపయస్సు కురిపించిన

మాతల్లి సుబ్బమ్మ గారికి

సమాలింగిత భూతలుడనై

ఈ కృతిని సమర్పిస్తున్నాను

కుమారుడు అడివి బాపి రాజు

ప్రథమ ముద్రణము 1946

Meezan Printing Works
Hyderabad (Deccan)



శ్రీరస్తు

# హేమబిందు

## ప్రథమ భాగము

### ప్రథమ ప్రకరణము

### వణిక్సార్వభౌముడు

కృష్ణవేణీ ప్రవాహమున నీడ చూచుకొనుచున్న శ్రీ ధాన్యకటక దుర్గాధి లక్ష్మికి, వణిక్సార్వభౌముడగు చారుగుప్తుని మహాసౌధము శిరోవతంసమై విరాజిల్లుచుండెను. అచటి కిన్నారు ధనువుల మూదమందున్న మహా సంఘారామచైత్యమును, చారుగుప్తుని సౌధమును చక్కదనమున నకారు సెల్లెండ్రిగానున్నవి. నున్నని నిగ నిగ లాడు పాలరాతి గోడలపై చిత్రించిన బుద్ధదేవ జాతక గాథలతో నలరారు చారుగుప్త ప్రాసాదము కనులు చల్లజేయుచు రూపెత్తిన శిల్పలక్ష్మివలెనున్నది.

చారుగుప్తుడానాడు వ్యాఘ్రాజినము పరచిన దంతపుపీటపై నుపవిష్టించి, తూలికోపధానములపై నొరిగి, గోష్ఠపాలకుడగు నిందప్రగోపునితో సంభాషించుచుండెను.

చారు: వనశూరసేతి సంచీనకములు ఉజ్జయినిలో పందెము గెలిచి, ఉనిచే బంగారు కట్టుబండిని ఉపాయనముగా తెచ్చినమాట నిజమేకాని, కామందక కలపాలకముల కవి తీసికట్టే. మన జతలనన్నిటిని మా మేనల్లుడు సమవర్తి పరీక్షించి కామందక కలపాలక యుగళమే అన్నిటికి మిన్న యని తేల్చినాడు. సార్వభౌముని జన్మదినోత్సవమునాటి పందెములతో అవతానే కట్టితినో మనకు జయము లభించునన్నాడు. మరి నీయభిప్రాయమేమో—

ఇంద్ర:—చిత్తము. తమ మేనల్లుడుగారు రాజత నిర్ణయ కెన్నడైన ఖండితో [illegible]మాదిరిగా యని సంశయించుచున్నాను.

చారు:—ఆ! రెండు సార్లు బండితోలినాడు. స్నేహితుడగు శశాంకవసుపుత్రుని మ్లేచ్ఛాశ్వములతో సమానముగ రెండు గోరుత్తములు[1] పరుగెత్తెనట. విజ్ఞాన కంఠీరవుడు గూడ నేర్పు, రూపు రేఖలు పరిశీలించి ఉత్తమోత్తమములని సుచుపునుచేత నేకదా ఈ యొంట్లజతకు పదునేనువందల పణాలిచ్చి[2] కొంటిని.

ఇంద్రి:—చిత్తము. అయినచో అంత బలవత్తరమైన జతను మన సారధి నడుప గలడా అయ్యా?

చారు:—నిజమే. ఇదివరకు చారుగుప్తునితో పందెమువేసి యెవ్వరును జయమొంద లేదు. ఇప్పుడు ఈ కోడెల నడుపు మాటేమి గలవాడు లేక మన మోడిపోయిన తలవంపులు. సమవర్తియే బండి తోలుగాక.

ఇంద్రి:—కాని...

చారు:—'కాని' యని మాటాడనూరకుండెదవేమి? అంతకన్న ధాన్యకటక నగరమున సారధి యెవ్వడు? ఆతని నిదివర కొక్కరైన మతి ఓడించిరా! ఎంత పొగరుగల గిత్తలనైన నాతడు సులభముగ లోబరచుకొన్న లేదా?

ఇంద్రి:—చిత్తము! దేవరకు పూర్తిగా నిష్టముండిన నా అభ్యంతర మేమియు లేదు. ఇక నాకనుజ్ఞ.

అని ఇంద్రిగోపుడు చేతుల జోడించి వీడ్కొని చన చారుగుప్తుడు ఏమేమియో యాలోచించుకొనుచుండెను. ధాన్యకటక నగర వర్తకులలో ముఖ్యుడును, శ్రేణిస్సంఘాధిపతియునగు చారుగుప్తునకు పందెములన్నచో ప్రాణము. ఆతని గజాశ్వవృషభ శాలలలో చక్రవర్తిశాలలలో నున్న మృగముల కంతమాత్రము వెనుదీయని ప్రాణులున్నవి. ఆతని శకటములు దేవ విమానములు. ఆతని సేవకులు పరాక్రమవంతులగు యక్షపుత్రులే. ధనరాసులు సమకూర్ప వెంతయో కష్టపడు చారుగుప్తుడు భోగముల ననుభవించుటలో ధనరాసుల నల్పముగా వెచ్చించును.

హిమబిందు కుమారిని మహారాజా నింటికోడలిని కావింప నెంచియున్నాడు. సౌందర్యఖనియు, ఆనందకందము తన బహిఃప్రాణమునగు హిమబిందుకుమారి మహారాజ్ఞి కాకపోయినచో తనకొట్లును కుబేర వైభవము గాల్పనా? తన తనయ కాక, భరతఖండాన ధాన్యకటక సింహాసనాసీనురాలగుట కింకనే బాలికగును? రాకుమారికి లందురు గాక! వారు

1 నూరారు 1200 గజములు

2 ఇప్పటి 12 అణాలు విలువగల వెండినాణెము



తెచ్చెడిదేమి ఇచ్చెడిదేమి. సర్వ విద్యాపరిపూర్ణ సర్వకళాశోభిత దివ్యసుందరగాత్రియగు తనబాల. హిమబిందుకుమారి, చక్రవర్తులు కని, విని యెరుగని మహా నిధులతో అతులవైభవముతో, వచ్చుచుండ ఏ సార్వభౌముడు వొకాలాడ్డును! ఈ కార్యసిద్ధికై తాను రెండవ చాణక్యదేవుడు గావలసివచ్చిన వచ్చుగాక.

ఇట్టి యాలోచనలనేకములు చారుగుప్తుని హృదయాకాశాన వెలుగువలె ప్రజ్వరిల్లిపోయినవి. ఆ ఆశయే ఆతని తపస్సు, ఆతనియైశ్వర్యమా తపస్సాధనము, ఆతని జీవితమా తపస్సిద్ధి కంకిత మైనది.

చారుగుప్తుడు సన్నగా పొడవున ధనువువలె సొంపుగా నుండును తప్త కాంచనవర్ణమువాడు. కమ్మెచ్చులు తీసినట్లుండు అంగసంపదగలవాడు. దీర్ఘమై చివరవంగినగరుడనాసికవాడు. అమిత విశాలమగు ఫాలముగలవాడు. గరుడపక్షికివలె నాసికా మూలము లోతువై, ఆతనికన్నులు దీర్ఘములై, విశాలములై, తీక్ష్ణములై ఎదుటివాని యాలోచన నిమ్నముల జొరబారుచుండును.

పెద్దదగు నాతని బట్టతలపై, అచ్చటచ్చట తెల్లని వెంట్రుకలు నదిలోని రెల్లుపూవుల జ్ఞప్తికి గొల్పుచుండును.

మెడలోని ఆణిముత్యముల పేరును స్వచ్ఛమగు యజ్ఞోపవీతము నాతని బంగారు వన్నెకు మెరుంగులు దిద్దినవి. సువర్ణద్వీప శోణరత్నాలు, సింహళదేశపు గరుడ పచ్చల నాతని కుండలముల మెరుపు లీనుచు కంఠరేఖలలో లీనమగుచుండును.

'బాలనాగీ! బాలనాగీ! చిరంజీవను తోడ్కొనిరా' యని చారుగుప్తుడు కేక వేసెను.

చారుగుప్తుడు కూర్చుండిన మందిరావ గోడలన్నియు రమణీయ చిత్రలేఖనా విలసితములు, రత్నకంబళాచ్ఛాదితములు. నలుప్రక్కల మణిఖచిత ధూపకరండాలనుండి అగరు జవ్వాజి, కస్తూరి ఘనుసారు, మంచిగంధపుపొట్టు యందుగుబంక మొదలగు ధూప ద్రవ్యము పొగలు సువాసనల వెదజల్లుచు చిన్న మేఘాలరీతి ప్రసరించుచున్నవి.

ఇంతలో ఘల్లు ఘల్లని బంగారు చిరుమువ్వల చప్పుడు వినవైనది. అంతఃపురమునకే ద్వారమధ్యమునుండి శృంగారలహరివు, రూపము చాల్చిన చంద్రికిరణము, ఒక్క బాలిక కొండ వాగువలె ప్రవహించివచ్చి చారుగుప్తుని యెదుట వంగి పాదాల నంటినది.

చారు:—సర్వేశ్వరసామ్రాజ్య సింహాసన స్థిరస్తు. అమ్మా! రేపటి యుత్సవములకు పోరాదవు గాదా.

హిమబిందుకుమారి:—అత్తయ్య అమృతలతాదేవి రమ్మని వార్త పంపినది, నాయనగారు

నాసికా సాధారణత్వమును కప్పిపుచ్చి, అందమునకు కన్నులతో నీడుజోడైన యాతని పెదవులు అరుణ కుట్మలత్వము అతని ముఖమండలమునకు కలంకారము దిద్దుచున్నది.

అతని కన్నులను విశాలఫాలమును, సుందర వదనమును వెలిగించునది. అతని భ్రూకుటి. అది యమునాగంగా సంశ్లేష పవిత్రము. అది హిమాచల సుమేరు పర్వతాలింగన సుందరము. అదికన్యాకుమారీ హృదయస్థ ప్రాక్పశ్చిమ సముద్రసంయోగ గంభీరము.

అతని విశాల నయనాలు తీక్ష్ణదృష్టులతో ఆ శిలాంతరాళమును చొచ్చిపోయినవి. అతడు నిట్టూర్పుపుచ్చి చేతనున్న టంకమును అయోఘనమును పక్కనున్న పనిముట్ల మంజూషము నందుంచెను. ఈ సాయంతమున కిది పూర్తి కావచ్చును, అప్పుడే ఆరు ముహూర్తములైనది. కోటలో భేరియు స్తూపఘంటయు మ్రోగించినారు.

“ కొంచెము మెతుకులు నోటవైచుకొని వచ్చి—” ఆ ఆలోచనము లాతని హృదయమున నెరవు లిడినవి.

ఆ మందిరమం దెచ్చట చూచినను పాలరాతి విగ్రహములు వివిధ శిల్పావస్థలలో నున్నవి. చిత్రశోభితములై తోరణ యుతములైన ద్వారకవాటములతో, వర్ణ మనోహరములైన కుడ్యములతో, వర్ణములు కలుపుకొను పాత్రలతో, తూలికాది పరికరములుండు మంజూషలతో శిల్పశాస్త్ర శాస్త్రపత్ర గ్రంథములుంచిన పేటికలతో నామందిరము విచిత్ర సౌందర్యము తాల్చినది.

మిసిమి వయస్సులో నున్న ఆ బాలశిల్పి అటుల నాలోచనాధీనుడై యుండ, ఇంతలో నొక జవ్వని యింటిలోనికి బోవు గుమ్మము కడకువచ్చి “బాబూ, సువర్ణ! భోజనమునకు రావా? మీ తండ్రిగారు కనిపెట్టుకొని ఉన్నారు, మీ అమ్మగారు వడ్డించుచున్నారు” అని పిలిచెను. బాలకుడు ఉలికిపడి—

“ ఇదిగో, అందులకే లేచితిని. అరవముహూర్త నాదము వినబడినది. ఇప్పుడే కాదా?” అని అనెను.

“ఒక నాళికపైగా దాటినది. బాబూ!”

“ఏమిటీ! నాయనగారు బుద్ధారాధనచేసి నా కొరకు కనిపెట్టుకొని యుండుట! పాదప్రక్షాళనముచేసి మడుపులు ధరించుకొని వచ్చెదను, ఎంతమందమతిని” అనుచు నాతడు త్వర త్వరగా దొడ్డిలోనికిపోయెను.

ఇంతలో మహాలి మహానసగృహమునకు బోయి,



“ అమ్మ! కుమారుడు పాదప్రక్షాళనముచేసి శుభ్రవస్త్రములు ధరించి వచ్చుచున్నాడు. అది యెచ్చటి శిల్పదీక్షయో కాని మన సువర్ణకుమారునికి బాహ్యస్మృతియే ఉండదమ్మ!”. అని పలికినది.

“ అయ్యో చిన్నతనాన నాయన ఇంతే, ఆ తండ్రికి కొడుకుగాదూ! పోలిక లెక్కడికిపోవును. వారి జపమైనది, నావడ్డనయు పూర్తియైనది. అబ్బాయి వచ్చి కూర్చుండెనేమో చూడు, వానికి ఇష్టమని మామిడికాయ పచ్చడి చేసితిని.”

మహాలి భోజనాగారములోని కడుగిడి, చూచి, వెనుకకు వచ్చి, “అమ్మా! వచ్చికూర్చున్నాడు. నేను బోయి, అమ్మాయిలకు స్నానాదికముల కేర్పాట్లు చేసెద” నని, యామె గృహమున వేరొక భాగాన కేగెను.

తండ్రికొడుకు లిరువురు భోజనము చేయుచుండిరి. తటాలున ధర్మనంది పుత్రునిగని, “ రేపు సార్వభౌముని జన్మదిన ఖేలనోత్సవములకు వెళ్ళుదువా? ” అని అడిగెను.

“చిత్తము”.

“ ప్రదర్శనములో పాల్గొనుచుంటివా?” సువర్ణశ్రీ మాటాడలేదు.

“పందెగాళ్ళలో నొకడవని వింటిని. బాబూ! శకటవేగ పరీక్షకు నీవు వెళ్ళుటా? నీవు ఎడ్లబండ తోలడ మెప్పుడలవరచుకొంటివిరా?”

సువర్ణశ్రీకుమారుడు భోజనముచేయుటమాని బంగారుకంచాన వ్రేలు వ్రాయుచుండెను. ధర్మనంది తన తనయుడు విద్యాశక్తితోపాటు తన దేహబలము వృద్ధినందించికొనుటయు గమనించుచునే యున్నాడు. మల్లయుద్ధవిశారదులలో మేటి, ఉపసేనానాయకులలో నుత్తముడునగు సోమదత్తుని వ్యాయామ వనములందు, కుమారుడు సుశిక్షితుడై ప్రఖ్యాతి నందుచున్నాడనియు ఎరుంగును. అయినను తన కుటుంబము పూర్వకాలమునుండియు శిల్పవిద్యయందు యశము సముపార్జించుకొనుచున్నది. ఆ దివ్యవిద్యను వదలి పామరజనోచితము తాత్కాలికమునగు వీరవిద్యయందు కాలముగడుపుట ఎంతయవివేకము! ఆత్మరక్షణమునకు, ఆర్తరక్షణమునకు, యుద్ధాసక్తి అవసరమగును. అంతమాత్రమే... అయిన నిప్పుడు...?

“ బాబూ! నీవు దిగులుకొనకు, నిన్ను వీరవ్యవసాయమునుండి మరల్ప పిరికివానినిని కాను. మన విద్య భగవత్ప్రీతికరము. సర్వోత్కృష్టము. తథాగతుని గాథలు శిల్పంలో రూపించి తనకు ద్రష్టకు నిర్వాణమార్గ సోపానములు కట్టుశిల్పి యెక్కడ, వీరవిద్య యెక్కడ? భిక్షులు వాగ్ధార బోధించిన ధర్మమునే, మనము టంకణధారతో ప్రసరింపచేయుదుము.”

ధర్మనందుల ధర్మపత్నియగు శక్తిమతి భర్తనుజూచి "బాబు శిల్పదీక్ష మీకు తెలియదుకాబోలు. చిన్ననాటి మీ శిల్పవ్యసనమంతా జ్ఞాపకము చేస్తూవుంటాడు, పోలిక లెక్కడికిపోతవి! అభయబాహు మహారాజుతో మీరు చేసిన మల్లయుద్ధవినోదాలు జ్ఞాపకము లేవూ ?" యని పలికినది.

సువర్ణశ్రీ జనకుని పవిత్రభావము నిముషమున ద్యోతకము చేసికొనెను, కాని శకటాధ్యక్షులగు మహాశ్రీకి తన విజ్ఞానపత్రమును సోమదత్తులవారు పంపియుండిరే! ఇప్పుడు వెనుదీయుటకన్న చేలతనమేముండును.

కుమారుని మోముతిలకించుచున్న ధర్మనంది "వత్సా! సరియే! కానిమ్ము: మనకుటుంబమున వెన్నిచ్చిన వాడింతవరకు జన్మింపలేదు. నీవు క్షేమముగ విజయివై వచ్చెదవుగాక!" అని ప్రకాశనయనములతో పలికి, భోజనము, పూర్తిచేసెను.

సువర్ణశ్రీ కుమారుడును పైకుబుసంతోషము నడంచుకొన ప్రయత్నించుచు, పితృభక్తి పూతములగు నశ్రుబిందువులు నేత్రముల చోలకరింప భోజన మెట్లెట్లో చేసెను.





# తృతీయ ప్రకరణము

## సేనాధికారులు

సమదర్శి మధ్యమ వర్చస్వి. అయిదడుగుల ఎనిమిదంగుళముల పొడవు, కండలుదేరిన అవయవస్ఫుటరేఖలతో రాతివిగ్రహమునంటి కఠిన దేహము కల పోటుమానిసి. అనేక యుద్ధముల ఆరితేరిన బంటు. మదించిన మాగధమహిషమువలె మత్తిల్లియుండి వాహినీ పతులలో నుత్తముడై, మహారథుడై యిరువదిరెండు వర్షాల పడుచుప్రాయంపు వీరుడై వెలయువాడు.

ఉత్తమాశ్వారూఢుడై, ఎడమచేతినున్న కళ్ళెము గుర్రము మెడమీద వదలి, మెలికలు చుట్టిన మీసాలు తిప్పుకొనుచు, జను లర్పించు స్వాగతాల చిరునవ్వులో నందికొనుచు ఒకనాడాతడు ధాన్యకటక నగరవీథుల హుటాహుటి స్వారిచేయుచు కోటనానియుండు యోధాగార గోపురద్వారముకడకు బోయినాడు. అచ్చట తన దళముతో కావలిగాయు దళపతికి సంకేతము దెలిపి స్వారిచేయుచునే లోపలికి పోయెను.

ధాన్యకటక నగరమునందు కోటలో రెండును, నగరములో రెండును నగరమువెలుపల పదియు యోధాగారములున్నవి. కోటలోని యోధాగారములు రెండును పెద్దవి. ఒక్కొక్క దానిలో అయిదువేల కాల్బలమును, వేయిగుఱ్ఱములును, వేయిమంది ఆశ్వికులును, అయిదు వందల ఏనుగులును, వేయి గజారోహకులును, మావటీలు వేవురును, అయిదువందల రథములును, అయిదువందల రథికులును, సారథిసహస్రమును, చక్రరక్షకులు వేవురు నుందురు. దళపతులు, ముఖపతులు, గణపతులు, వాహినీపతులు, చమూపతులు, ఉపసేనాపతులు సేనాపతులు, అని సైన్యాధికారులు తర తరములైయుందురు. నాలుగు ఏనుగులుగాని నాలుగు రథములుగాని, పదిరెండు గుఱ్ఱములుగాని, ఇరువదిమంది కాల్బంటులుగాని ఏదియైనను దళమనబడును. 1 మూడుదళములు ఒక ముఖము, పదిముఖములు ఒక గణము, మూడు గణములు ఒక వాహిని, మూడు వాహినులు ఒక చమువు, నాలుగు చమువులు ఒక సేన అని ఆంధ్రసైన్యములు విభజింపబడినవి. ఒక్కొక్కసేనకు ఒక్కొక్క ఉపసేనాని అధిపతి. సేనాపతి రెండు సేనలను నడుపగలడు. సర్వ సైన్యములకు నాయకుడు సర్వసైన్యాధ్యక్షుడు.

---

1 ఒక ఏనుగు = 1 రథము = 3 గుఱ్ఱములు = 5 గురు బంటులు.

యోధాగారము సమచతురశ్రాకారమై ఆవరణ షట్కముతో నొప్పియుండును. నడుమనుండు ఆవరణలో సేనానాయకశాలయున్నది. దళపతులు, ముఖపతులు సైనికులతోపాటు ఉత్తమ గృహములలో నివసించెదరు. గణపత్యాద్యుత్తమసేనాధికారులు నగరములో భవనములలో నివసించెదరు.

సమదర్శి అట్లు ఆవరణలన్నియు దాటుచు పోయి సైన్యాధికారి భవనము ముంగిట నిలిచినాడు. అనేక సైన్యాధికారు లీతని చుట్టు మూగిరి. పరుగిడివచ్చిన అశ్వరక్షకుని చేతులలోకి కళ్ళెమును విసరి గుఱ్ఱమునుండి భంగున నుఱికి "ఆంధ్రవీరా!" యని తన్ను సంతోషమున సంబోధించు స్నేహితులజూచి, నవ్వుచు, వారితో లోనికిం జని, ఉచితాసనము నలంకరించినాడు.

"రేపటి మహోత్సవములో విజయము సమదర్శిది" యని ఆనందవసువు నాక్రుచ్చెను.

"సార్వభౌములకు సమదర్శిపై అంతకేగదా అంతప్రీతి" యని ప్రభాతశూరుడు పలికినాడు.

సైన్యాధికారులు తళతళమను వెండిబంగారు చెక్కడపురేకులు పొదిగిన తామ్రశిరస్త్రాణములు తలలందును, మెడలో హారములు, భుజముల కేయూరములు, మొలల పట్టుకోకలు అలంకరించికొని యుండిరి. వారిలో ఆశ్వికులకు కూర్పాసములును, 1 రథికులకు కంచుకమును, 2 పాదచారులకు వారవాణకములు, 3 గజపతులకు దేహత్రాణములును, దేహమునకు విడి విడిగా ధరించు లోహపు గొట్టములు గలవు. కంఠత్రాణములు, నాగోదారికములు 4 అందరును ధరింతురు. ఆ పరాక్రమమూర్తుల నవలోకించిన ఆంధ్రసైన్యములు సకలభారతవర్షమునకు జేలదుర్జయములో తెల్లమగును.

వీరలోకమంతయు వివిధాసనముల నుపవిష్టమైనది.

"సమదర్శి! సర్వసైన్యాధ్యక్షుని భవనము చుట్టుప్రక్కలవారికి యుద్ధమనుమాట వినబడుచున్నదటే?" అని అమలనాథుడు సమదర్శి దిక్కు మొగంబై ప్రశ్న వేసెను.

---

1 నడుమువరకు వుండు ఇనుపచొక్కా.

2 మోకాళ్లవరకు కప్పు గొలుసుల కవచము.

3 చీలమండలవరకు వ్రేలాడు కవచము.

4 చేతులకు తొడుగుకొను ఇనుపచేతులు.



ఆనందవసువు:—సమదర్శి, సమవర్తే. సార్వభౌములు 'సాతవాహన శత్రు సమవర్తి' అని బిరుదమును ఊరికే ప్రసాదించినాడా! చెప్పవయ్యా.

ప్రియదర్శిశాతవాహనుడు తన కొమరునకు సమదర్శియని నామకరణ మిడికొనినాడు. శాతవాహన సామ్రాజ్యముపై ఎత్తివచ్చిన అభీరులపై శ్రీముఖశాతవాహనుడు సమదర్శి సైన్యమిచ్చి పంపినాడు. సమదర్శి అభీరులను పూర్తిగా ఓడించి తరిమివేసి వారి జయపతాకములన్నియు కొనివచ్చి సార్వభౌముని పాదములకడ నర్పించెను. అప్పుడానందహృదయుడై చక్రవర్తి 'సాతవాహన శత్రు సమవర్తి' యని బిరుదమును నిండుసభలో సమదర్శికి చక్రవర్తి ప్రసాదించెను. అందుచే ఆతని బందుగులు, మిత్రులు సమవర్తియనియు పిలుచుచుందురు.

సమ:—ఏమున్నది? మొన్న వేగిరావు వాడు వార్త తెచ్చుటయు, మహామంత్రులవారు శీఘ్రముగ మహారాజ దర్శనమునకేగిరట. సర్వసైన్యాధ్యక్షులకును కబురు పోయినదట.

ప్రభాతశూరుడు:—ఆ వార్త మాళవమునుండి కాదా?

అమల:—మాళవము తిరుగుబాటు చేసిందనే ఊహిస్తున్నాను.

ఆనంద:—ఊరుకోండి మామగారూ! మొన్ననేకదా చండవిక్రములైన వినీతమతుల ఆధిపత్యమున మాళవమునకు సైన్యము లంపుట, అంత కొన్ని దినములకే వార్తాహరులు మాళవము శాంతముగ నున్నదని కబురుకొని తెచ్చుట జరిగినది?

ప్రభా:—ఆనంద! నీకు తెలివితేటలులేవు. ముగ్గురు సార్వభౌములకడ పని చేసిన అమలనాథ సేనాపతులు నీపాటి ఆలోచన చేయలేదని అనుకొంటివా?

ఆనంద:—చేయలేదని కాదు.

అమల:—ఏమో! వృద్ధులమాటలు పసుపువాళ్ళు పాటింతురా? నేను పట్టి పదాతిదళమును నడుపువాడను, ఆతడు గజసేనాపతిఆయె! మా చిన్నతనమున పెద్దలకెన్నడు నెదురుచెప్ప యెఱుగము.

ఆ వీరు లొకరిమొగము లొకరు చూచుకొనిరి.

సమ:—మామగారూ! కోపగించకండి. ఆనంద చనువు కొద్దీ ఏవో తెలివితక్కువ మాటలు అన్నాడు. ఆ దోషమునకు ప్రాయశ్చిత్తం మీరు విధింపవగుదురు. మనలో మనకు అరమరలు కూడవని వీరలోకమునకు మనవి.

ఆనందవసువు విచారమావరించిన మోముతో అమలనాథునికడ మోకరించి "ఈ యపరాధికి దండనమే ప్రసాదము," అని తలవాల్చికొనెను.

అమలనాథు డాతని రెండుచేతులు పట్టుకొని లేవనెత్తి "నాయనా నీవు రెండు రోజులు మౌనవ్రతము దాల్చి మహాచైత్యమున ఆదిశ్రమణునకు దీప మర్పించి ఆంధ్రమహారాజుల పతాకము సర్వదిశల విజయకాంతులతో తేజరిల్ల వలయునని ప్రార్థించుము. కళ్ళెములేని అనవసరోత్సాహమును కనుగొనిన నాకు విచారము కలుగును గాని కోపము రాదు. సుమా" యని పలికినాడు. వీరులందరును లేచి అమలనాథుని అభినందించిరి.

అమల:—ప్రస్తుత మాలోచింపుడయ్యా! రేపు మనలో వృషభశకట పరీక్షకు ఎవ రెవరు నిలబడిరో సమదర్శిని చెప్పనిండు.

సమదర్శి:—సార్వభౌముల పక్షమున వరాలకుడును, మా మేనమామగారి రథము నడుపుచు సేనుడు, కళింగదేశాధిపతి పంపిన శివస్వాతియు నుందురు. మాళవ, ఘూర్జర, మగధ, పాండ్య, చోళ, కేరళ పాంచాలములనుండి దిట్టరులగువారు వచ్చిరట. ఇంకను పెక్కుమంది యున్నారు.

ప్రభా:—గెలిచినవారికి కానుకలమాట చెప్పవైతివి?

సమ:—ప్రతివర్షము నిచ్చునదిగాక, ఈ ఉత్సవమున అన్ని పరీక్షలకు అదనపు కానుకల నిత్తురట సార్వభౌములు.

ప్రభా:—ఉక్ష శకట పరీక్షకు అదనముగా ఏమిచ్చెదరో చెప్పుకోండి. ఇవిగో, పదిఫణాలుపందెం.

చాలమంది వివిధ వస్తునామము లుచ్చరించిరి. ఇంతలో ప్రతీహారియగు నొక దళపతి లోనికి విచ్చేసి నమస్కరించి "జయము జయము వీరశ్రీమంతులకు. ఉపాధ్యక్షులవారు విజ యము చేయనున్నారు. వారి రథము మూడవద్వారము దాటినది" అని నిర్గమించెను.

ఆయుధపాణులగు నలువు రంగరక్షకులు వెంటరా నుపసైన్యాధ్యక్షులగు కాకుండ కులు సంపూర్ణ కవచధారియై విచ్చేసెను. ఒక్కసారిగా సేనాధికారులందరు లేచి నమస్క రించిరి. అందరికి ప్రతినమస్కృతులిడి కాకుండకు లొక దంతపీఠ మలంకరించి వారిని 'కూర్చుండు'డని సంజ్ఞ చేసెను

"రేపటి మహోత్సవమునకు శతస్కంధుడు, ప్రమానందుడు, చండకేతుడు, గుణ వర్మ, రథ, గజ, తురగ, పదాతులతో రక్షకులై వచ్చునది. ముప్పదియేనుగులు, రెండువందల రథములు, అయిదువందల గుఱ్ఱములు, మహాశైలనా స్థలముచుట్టును విడిసి ఉండవలసినది. సార్వభౌముల ఊరేగింపు మహోత్సవమున నూరుఏనుగులు, అయిదువందల రథములు, రెండు వేల పదాతిదళము, వేయిగుఱ్ఱములు కావలికాయునది. అందుకువలయు నాయకులను అమల నాథులవారు ఏర్పాటు చేయుదురుగాక. వారే ఆ ఉత్సవమునకు అధిపతులు. వారి నాయ కత్వమున ఇంక నన్ని సైన్యములు ఊరేగింపు టుత్సవమున పాల్గొనవలసినది. కుంభీరకులు, ఉపపాదులు అనుగ్రహులు, ఉద్ఘాటకులు యీ నలువురు సేనాపతులు చక్రవర్తికి అంగర క్షకులుగా వెళ్ళవలయునని సర్వసైన్యాధ్యక్షుల ఆజ్ఞ. అమరనాథులు ఎన్నికొనిన ఉపసే నాను లూరేగింపు టుత్సవ సైన్యములు నడపునట్లు ఆజ్ఞ. ఆయా యోధాగారాలలో వంతు వచ్చినవారు కావలి యుందురుగాక. తక్కినవారు మహోత్సవమునందు పాల్గొన వచ్చును. ఈ ఉత్సవము నవదినముల నీయాజ్ఞయే వర్తించును. తథాగతుడు మీకు రక్ష" అని కాకుండ కులు యథోచితముగ వెడలిపోయెను.



# తురీయ పరిచ్ఛేదము

## విషబాల

"బుస్సు"మని యా పాము లేచినది. దాని కన్నులలో నవ్వు తాండవ మాడినది. ఆకన్య యాపాము నెత్తుకొని, కుడిచేతితో పడగ నందికొని, తన ముక్కుతో ఆ ఫణిరాజు ముట్టెను ప్రియమారరాచినది. అది భయంకర కాళోరగము. ఆరడుగుల పొడవుతో మిల మిల లాడు నీల నీరధీకల్లోలము. అర్జునుడను ఆ పన్నగేంద్రు డాయోషాతిలకమును అవి సెను. నాగవల్లివలె చుట్టుకొనిపోయెను.

" అర్జునా! నీవు మంచివాడవోయీ! నీకన్నులు వజ్రాలవలె మిల మిల లాడుచున్నవి, నీ తలమానికము తళ తళ లాడుచున్నది, నీ దేహాన నీలరత్నాలు మిరుమిట్లు గొలుపు చున్నవి. నీకును ఉలూపికిని ప్రణయకలహము తీరినదా? నీవు సంతోషాన నింత జ్వలించు చున్నావు? నీ నాల్కలు చాచి నా పెదవుల నంటెదవు. వద్దు! నా కౌగిలి అసహ్యము. ఈ రోజున పరుగు పందెములో నిన్ను ఓడించగలను సుమా!" అని సౌందర్యరాశియగు నాబాల పక పక నవ్వినది.

ఇంతలో మొగలిరేకువంటి శ్వేతోరగియొకటి ఆ బాలకడకు వేగాన ప్రవహించుచు వచ్చినది. దానిని చూడగనే అర్జునుడా కన్యకా హస్తాలనుండి నేలకుజారి ఓంకారరూపమై అడచొచ్చెను. ధవళఫణియు గ్రక్కున నాయువతిపై కెగప్రాకి ఆమె మూర్ధానముండి ఫణము క్రిందకువాల్చి యా బాలిక ముక్కు, బుగ్గలు, పెదవులు, గడ్డము నాల్కలనంటసాగెను.

చంద్రికిరణమువలె మిల మిలలాడు స్నిగ్ధస్విన్నాంగము శ్వేతకాంతుల నీన, నా భుజగి ఆ జవ్వని లేతపొన్నాకు చెవికడ సంగీతస్వనాన బుసకొట్ట నారంభించినది. బాలికయు "ఏమి ఉలూపీ! భర్తపై నేరాలు మాని ప్రేమవాక్యాలు పలుకుచున్నావు! ఆహా! మూడు నాళ్లకలహపు ముచ్చట నేటితో తీరనేమి? ఏది! నాయెదుట ఒకరినొకరు కౌగలించుకొను" డని కోకిల పులుగుపలుకుల కుహు కుహూ లాడినది. తత్క్షణమే యా పన్నగి క్రిందకు జారి అర్జునుని మెలివేసికొనిపోయినది.

ఆ మందిరమునందెల్లయెడల విషోరగములు భయంకరములై తిరుగాడుచున్నవి. పాములు నివసించుటకు గోడలపొడుగునను మట్టితో కృత్రిమ వల్మీకములు నిర్మింపబడినవి. ఆ బాలిక అందలి నాగములతో మాటలాడుచూ నాడుకొనుచు ఒక ముహూర్తకాలము వినోదించి యా మందిరమును వెల్వడినది.

ఒక కక్ష్యాంతరముదాటి యామె తన ఉద్యానవనవాటిక ప్రవేశించెను. అందు నాభి తీగెలు కంచెలయందు దట్టముగా నల్లికొని ఎఱ్ఱని పుష్పములు పూచియున్నవి. శృంగి మదన భేరి, ముష్టి విషక్షీర, విసబొద్ది వృక్షములు అచ్చటచ్చట తమ విషపత్రముల నాడించుచున్నవి. అది భయంకర సుందర వనవాటిక. అది మృత్యుబాలికా నృత్యరంగము.

ఆ వనాంతమున వివిధవర్ణశీర శిలలతో నిర్మింపబడిన జలాశయమున నా కృశాంగి సమీపించి విగతవస్త్రయై, యందు దుమికి, యీదులాడ జొచ్చినది. ఆనీరములందు వివిధ గంధములు, అగ్నికీల సదృశములునగు వివిధవిషాదులు సమ్మిళితము చేయబడియున్నవి.

ఆ తన్వంగి యందు గాలికి నూగులాడు బడబానల జిహ్వావలె నీదుకొన్నది. పిల్లిమిగె ములు, బల్లిటీలు కొట్టినది. ఆవిషదిగ్ధ నీరముల బుక్కిటబట్టి పైకెగజిమ్మినది. మునిగి తేలినది. ఓలలాడినది.

జలక్రీడలైనవెనుక సుప్వనలేచి పదునెనిమిదేళ్ల ముఖుకుప్రాయంపు టద్భుత సౌందర్యమొలుకబోసికొనుచు మెట్లెక్కి గట్టునకువచ్చి, కురుల తడియార్చుకొని ద్విగుణీకృత దేహకాంతితో వెలుగుచు, కాటువేయబోవు పాము నోటికోరవలె తళ తళ మన్నది.

ఆమె సౌందర్యము సువాసనాలహరు లెగబోయు తరులగర్భములోని అగ్నివంటిది. పయ్యాని విషము, విద్యున్మాలినీ విలసితము, ప్రాయము తాల్చిన వ్యాఘ్రరాణి, పదును పెట్టిన నిశితకృపాణము.

కుంతలములను పలిపెముతో ముడుచుకొనుచు దిసమొలతో నొయ్యారముగ నడుగులిడుచు ఆ వనవాటి నంటియున్న భవనమార్గమును జేరినది. ఆమె దేహచ్ఛాయ తప్తకాంచనము. నల్లనై విడబారు కేశభారము జానువుల వరకు వేలాడినది.

పరువములు తొంగిచూచు ఆమె వక్షోరుహద్వయము తరుణకదంబము పూచిన తొలి పూతగుత్తులు. ముగ్ధత్వము వీడని యా బాలికా తనూరేఖలు అపశ్రుతి రహిత రాగమాలికా మోహనతరంగములు. మత్స్యాకారములై దీర్ఘములైన యామె లోచనాల, కలలు తిరుగవు. అవి వైష్ణ్యాంపముఖధగద్ధగితములు. ఆమె అధరోష్ఠములు మధురములు, కరుగని అరణ్యకబింబ ఫలములు, నాభికుట్మలములు.

ఆ బాల తన యభ్యంతర గృహమునకు విసవిస జని సన్నని దుకూలము ధరించి స్తన వల్కలము జుట్టుకొని, నగలుదాల్చి నాభీగంధకదంబికముగు పచ్చిసాంబ్రాణిబంకపొగవేసికొని కుంతలా లార్చుకొనుచుండ నా మందిర కవాటము తెరచుకొని పండుపంటి యొక వృద్ధతపస్వి తేజస్విలోనికివచ్చినాడు. మిస మిసలాడు నా బాలికాసౌందర్యము ఆపాదమస్తకము గమనించుచు, చిరునవ్వుమోమును వెలిగింప నాతడు చేర వచ్చినాడు.



"తాతయ్యా! నాకేమి తెచ్చినాధండీ!" యని యామె యాతని కౌగిలి లోనికి వ్రాలినది.

"కన్నతల్లీ! నీవు నాకోర్కె నీడేర్చు దివ్యముహూర్తము సమీపించుచున్నది సుమీ. అప్పుడు నీ యిష్టమువచ్చినట్లాడుకొని, నాకన్న మొన్నప్ప అమూల్యము, సజీవమూనగు నాట వస్తువు, జీవవస్తువు నీ కర్పించెదను. ఈలోన ఇతరవస్తువులు నీకు వలయునవి ఒసగుచుంటిని గాదా!"

"ఆవస్తువు అందముగా నుండునా తాతయ్యా?"

"ఆ వస్తువు సౌందర్యమునకు దేశ దేశములు తలలొగ్గుచున్నవి."

"ఎప్పుడా ముహూర్తము తాతగారూ?"

"బ్రహ్మ సరస్వతిని విద్యాతేజః పుంజముచే సృష్టించినాడు. కమలాక్షుడు కంటకుల నిర్మూలించుటకై చక్రమును సూర్యరజముచే త్వష్ట కల్పించినాడు. పరివేదనాగ్రస్తుడను నాహృదయతాపమువోసి నిన్ను పెంచికొన్నాను. తల్లీ! నీ కన్నులు జాజ్వల్యమాన హాలాహలధారలయి పోవుగాక! నీ వక్షములు ప్రళయాగ్ని భీకరస్ఫులింగకలశములౌ గాక! నీదేహము జృంభావిస్ఫురన్మృత్యుముఖదంష్ట్ర యగుగాక! ఆ దివ్య ముహూర్తము ఇదిగో వచ్చుచున్నది! వచ్చుచున్నది తల్లీ!"

అతని కన్నులు, ఫాలము భయంకరములగు కాంతులచే ప్రకాశించిపోయినవి.

వణకుచున్న అతని చేతులు తన హృదయానికి చేరియున్న యామె మూర్ధమును తడవినవి.

ఇంతలో "ఘణఘణ" యొక గంట మ్రోత వినవచ్చినది.

ఆ తపస్వికి మెలకువవచ్చి తీవ్రత తగ్గిన కంఠముతో "అమ్మా! పూజావేళయైనది. పరమశివుడు యోగనిద్రనుండి లేచి నా పూజకై నిరీక్షించుకొని యున్నాడు. నేను వెడలెద" అని పలికి రూపొందిన బ్రహ్మవిద్యవలెనున్న యా గదినుండి వెడలిపోయినాడు.

తాతగారు వెడలిపోయిన వెనుక ఆ బాలిక వేరొక కవాటమును తెరచుకొని వివిధములగు ఆటవస్తువులున్న వేరొక మందిరమునకు బోయినది.

ఆ బాలిక బొమ్మలతో నాడుకొనుచు కూనిరాగముల తీసికొనుచు ఆ క్రీడలో మునిగిపోయినది.

వ్యాఘ్ర సింహాదులు కురంగాది జంతువుల తినుచున్నట్లు, దేవి రాక్షసుల వధించుచున్నట్లు కీలుబొమ్మ లనేకములందుగలవు.

బొమ్మల పెళ్లిళ్ళు, బిడ్డ బొమ్మల గుజ్జనగూళ్ళు ఆ పాప చిన్ననాటి నుండియు నెఱుగదు. ఆమె ఆట పాట లన్నిటిలో వీరభయానక రౌద్రములే మెదిపియుండిరి. ఆమె చూపులకు విలయషయోధ నీలిమలు కాటుకలైనవి. ఆమె యూర్పులు మృత్యున్నిశ్వాస భుగ భుగలతో సహాధ్యాయనం చేసినవి.

# పంచమ ప్రకరణము

## శ్రీ కృష్ణ శాలివాహనుడు

శ్రీముఖ సాతవాహన మహారాజు అభయబాహు సాతవాహన చక్రవర్తి ప్రథమ పుత్రుడు. బౌద్ధ శకము 436 వ సంవత్సరమున ధాన్యకటకాన కాశీదేవి గర్భశుక్తి ముక్తామణియై శుభలగ్నమునందు జన్మించినాడు.

శ్రీముఖుడు బౌద్ధశకము 458 వ వర్షమున ఆంధ్రసింహాసన మధివసించి మహా ...తో రాజ్యపాలన మారంభించినాడు.

సార్వభౌముడు బంగారు చాయవాడు. సంపూర్ణముగ ధనువు పొడువుగలవాడు. ...నగుమోము, చక్కని కోరమీసములు, దీర్ఘసమనాసిక, విశాలములై, అరమూతలై ...మలుకాని కళ్ళు, సమఫాలము, పెద్దనోరు, శ్రీముఖుని ముఖము సర్వసార్వభౌమ జయప్ర...సితము చేసినది. కండలు కట్టినదేహము, కొంచెము చిరుబొజ్జ ఆయన విగ్రహాని...నిండు తెచ్చినవి.

శ్రీముఖుడు మతి మూడేండ్లకు పట్టాభిషిక్తుడగుననగా పెద్దకుమారుడు శ్రీకృష్ణున...ృంచినాడు.

శ్రీకృష్ణశాతవాహనయువమహారాజు వెనుక చక్రవర్తికి అయిదేండ్లకు ఇరువుర కుమారికలు ఒకరివెనుక ఒకరు నాలుగేండ్లు భేదముగా జననమొందినారు. ఆ వెనుక ఇద్దర...రులు పుట్టి పురిటిలో సంపుగొట్టి చనిపోయినారు. తర్వాత రెండేండ్లకు అన్న ...కృష్ణునికి పదునారు సంవత్సరముల ఈడున అతనికి తమ్ముడు మంజుశ్రీశాతకర్ణి ...ృంచినాడు.

పదునారవ వత్సరమున శ్రీకృష్ణుడు యువరాజ్యాభిషిక్తుడై ప్రతిష్ఠాన నగరపాల...రము వహించెను.

ప్రతిష్ఠాననగర పాలకత్వము నందిన యువరాజులు మహారాజను బిరుదము వహింతురు

శ్రీకృష్ణ సాతవాహనమహారాజు ఇప్పుడిరువదిరెండు వర్షముల ప్రాయమున సింహ...రమువలె విస్ఫారిత వక్షుడై, మధ్యమోన్నత శరీరుడై, యౌవన పరిమళార్ద్రహృదయుడై, ...హాసిముడై, శత్రు హృదయ విదారకుడై, ప్రతిష్ఠాన నగరాన రాజ్యపాలన మొనర్చు...న్నాడు



సార్వభౌముని జన్మదినోత్సవములకు మహారాజు శ్రీకృష్ణసాతవాహనుడు ప్రతిష్ఠానము నుండి ధాన్యకటకమునకు సేనాపరివృతుడై సర్వవైభవోపేతుడై విచ్చేసినాడు.

యువరాజు ధాన్యకటకనగరానికి మూడు గోరుతము లెగువను కృష్ణాతీరముననున్న విజయస్థలితయను కోటలో విడిదిచేసెను.

వచ్చిన మరునాడు శుభముహూర్తము. శ్రీకృష్ణుడు సపరివారుడై, మాతాపితలకు పాదాభివందన మాచరించ సార్వభౌముని మహాభవనమునకు వెడల సన్నద్ధుడగుచున్నాడు. అలంకరణ మందిరమునుండి మంజులశ్రీమూర్తియై, కిరీట, కేయూరాది సకల భూషణాలంకృతుడై, మందహాసవదనుడై బయలుదేరెను. మౌక్తికాలంకృత దుకూలాంబరావృత ధవళచ్ఛత్రపునీడలు తలపై నారునట్లు తాల్చి ఛత్రవాహనుడు వెనుకనడువ, చామరగ్రాహిణులగు సుందరులు కరకంకణక్వాణన మనోహరముగ నిరుదెసల వీచోపులిడుచుండ, పార్శ్వవర్తినియగు మనోహరాంగి భుజమున ఎడమచేయి నిడి, దక్షిణహస్తమున లీలానీల కుముదము ధరించి వేణుకాహాలాది వాద్యములు మధురగీతములు సెలగుచుండ సాయుధులగు నంతఃపుర రక్షక వనితలు పరివేష్టించి నడువ, శ్రీకృష్ణసాతవాహనమహారాజు ఇట్లు బయలుదేరి గుమ్మము దాటుటకు కుడిపాదమునెత్తినతోడనే ఒక శ్వేతోరగము బుస్సుమనుచు, ఎట్టయెదుట ఆడుచు ప్రత్యక్షమైనది.

భయావృత మనస్కులై ఎచటివారచట ఆగిపోయినారు. పార్శ్వవర్తిని కెవ్వున అరచి రెండుచేతుల కళ్ళు మూసుకొనినది. శ్రీకృష్ణకుమారు డాశ్చర్య హృదయుడై, ఒక్క త్రుటి కాలమట్లే యుండిపోయినాడు.

ఇంతలో నీలాంబుదావృత విశాలాకాశము వెలిగించి, మాయమగు విద్యున్మాలవలె నా శ్వేతపన్నగి వారందరు చూచుచుండగనె మాయమైపోయినది.

అద్భుతాశ్చర్యహృదయులై, వారందరు శ్వేతఫణి తమతమ పాదాలను చుట్టినదేమో నని చేష్టలుదక్కి, ఆ సుందరమందిర పురోభాగమున మలచిన ప్రతిమలవలె క్షణకాలము గన్పట్టిరి.

రక్షకభటులు, దౌవారికులు, పారిపార్శ్వకులు, ముఖపతులు, మంత్రులొక్కసారి సాయుధహస్తులై యా మందిరమంతయు వెదక నారంభించిరి,

శ్రీకృష్ణమహారాజు ఆ శ్వేతపన్నగినే తలంచుకొనుచు, చిరునవ్వు వెలుగులు మరల మోమున నలముకొన పార్శ్వవర్తినితో 'మన ప్రయాణము సాగనిమ్ము' అని యాజ్ఞనిడెను.

అయిదు లిప్తలలో మరల పరివారజనము, మంత్రులు, సేనాధిపతులు యథాస్థానములకు జేరి మహారాజు కనుసన్న ఆజ్ఞగా ముందుకు సాగిరి.

మహారాణిట్లు దుర్గ ప్రవేశ మొనర్చి అంతఃపురముచెంత దనే పరిజనమును నిలిపి, లోని కరిగి, దర్శనసభలో సింహాసనాసీనులైయున్న తల్లిదండ్రుల పాదములకు సాష్టాంగ ప్రణామ మాచరించినాడు.

బుద్ధభిక్షులు, విప్రులు ఆశీర్వాద వచనములు పలుక, శుభవాక్యములు మ్రోయ సార్వభౌముడు, సామ్రాజ్ఞియు సింహాసనములనుండి లేచి, నయనముల ఆనందబిందులు నృత్యమాడ, వంగి కుమారుని చేరియొక చేయి పట్టి లేవనెత్తుచు, 'చిరంజీవివి' సత్వర వివాహితుడవు, సిద్ధసకలాభీష్టుడవు కమ్మ తండ్రీ అని ఆశీర్వదించిరి.

జననీజనకుల నోటినుండి ఆశీర్వాదము వెలువడుచున్నప్పుడు శ్రీకృష్ణకుమారుని హృదయమున తెల్లని పామొకటి ఆడుచు కనిపించినది.

సార్వభౌముని అనుమతిగొని యువరాజు తల్లితో అభ్యంతరమందిరమునకు బోయినాడు.

మహారాణి:—కుమారా! ప్రయాణము కుశలముగ జరిగినదా?

శ్రీకృష్ణుడు:—దేవమూర్తులైన తమ ఆశీర్వాదబలము నాకు వజ్రకవచముగదా తల్లీ!

మహారాణి:—మా కడుపును పవిత్రము చేయుటకు పుట్టిన మూర్తివని నేను వేయి దేవులకు సర్వదా నమస్కరించుకొనుచును తండ్రీ!

శ్రీకృష్ణుడు:—మాతమ్ములు బంగారు తోనల బొమ్మ. మంజుశ్రీమూర్తి జాడలు తెలియలేదు. మీ దుఃఖము ప్రజ్ఞాపారమితము గాన మీరు భరించుకొనుచున్నారు గాని—

మహారాణి:—నాయనా నా కడుపులో ఆబాధ ఎప్పుడును కుములుచు నేయుండును. ఏదుర్మార్గునకు చేతులు వచ్చినవో!

శ్రీకృష్ణుడు:—ధనమున కాశించి ఇట్టి పని జరిగి ఉండదు. అమ్మా! మీరు పరిపూర్ణ ధైర్యము వహించి ఇంకను కొన్ని నెలలుమాత్ర మోపిక పెట్టుడు.

మహారాణి:—నాయనా! నేను పైకి ధైర్యము వహించినా, అసలు నా హృదయము లోని బాధ ఏలాగు తీసివేసుకొగలనయ్యా! నీవు తమ్ముని వెదికి ఆరు నెలలలో మీ అమ్మగారి ఒడిలో కూర్చుండబెట్టెదనని ప్రతిజ్ఞ పట్టితివని వింటిని. తండ్రీ నా చిన్నిబాబును నా ఒడిలో కూర్చుండబెట్టుకొగల భాగ్యము మాకు వచ్చునా! అందుకు మీరందరు ఏమరుపాటు లేక ప్రయత్నములు చేయుచునేయున్నారు. అయినను నా అదృష్ట మెట్లుండునో.

శ్రీకృష్ణుడు:—అమ్మా! మీరు కంట తడిపెట్టకుడు. తమ్ములు బ్రతికి క్షేమముగ నున్నారని తెలుసుకొన్నాను. ఆ సాక్ష్యము అనుమానరహితమైనది. శుకబాణులవారే తెచ్చినారు.



మహారాణి:—అవును తండ్రీ, మహారాజాగారు ఆవిషయమును చెప్పినారు. అందుకనే ఈమాత్రము ధైర్యముగ నున్నాను. నేనును మహారాజాగారును ప్రయాణకమునకు—

శ్రీకృష్ణుడు:—అవును జననీ! తామును, చక్రవర్తియు, ఎప్పుడు బ్రహ్మాండక గౌతమ జన్మస్థలమునకు రాగలరు?

మహారాణి:—సార్వభౌములు ఒకసారి పశ్చిమదేశాలకు రావలెనని యనుకొన్నారు. త్వరలో వారు ఏదియేని నిర్ణయమునకు వచ్చెదరనుకొందును.

శ్రీకృష్ణుడు:—అమ్మా! తమ పాదసేవ చేయుటకు వచ్చుచుండగ, నాకీ దినమున ఒక తెల్లని త్రాచుపాము కనబడినది. దానికి ఫలమేమాయని ఆలోచించుచున్నాను.

మహారాణి:—ఏమిటి తండ్రీ పామా? బుద్ధభగవానుని రక్ష, నీకు పరమేశ్వరానుగ్రహ రక్ష! చిరంజీవ! చిరంజీవ! ఎక్కడ! ఈ పాము కనబడినది? రాచబాటనా?

శ్రీకృష్ణుడు:—లేదుతల్లీ! మహాసనానికి పయనమై, అలంకారమందిరము దాటి వచ్చిన నాకు మందిరాంగణమునందది ఆడుచు ప్రత్యక్షమైనది.

మహారాణి కొమరుని శిరము వాసన పట్టుకొని తన మోమునకాన్చుకొని మరల వదలినది.

శ్రీకృష్ణశాతవాహనుడు ఇంచుక నవ్వుచు తల్లి మోమున చూపు నిలిపి,

'జననీ! తాము మహాసంఘారామానికై కట్టించు విహారము పూర్తియయినదను కొందును. గురువులగు అమృతపాదాచార్యులు దాని నెప్పుడు శుభముహూర్త మెప్పుడు?' అని ప్రశ్నించెను.

'బాబూ! మీ తండ్రిగారును, నేనును సౌందర్యనిధియగు కోడలిని వరియించినాము. ఆ బాలిక చిత్రము ని, నీ యుభిప్రాయము చెప్పవలయును' అని కుమారునివైపునకు తిరిగి యా సామ్రాజ్ఞి చిరునవ్వు తెచ్చుకొనుచు పలికినది.

శ్రీకృష్ణశాతవాహనుడు నవ్వుచు 'శ్వేతపన్నగ సందర్శన ఫలితమా తల్లీ!' అనుచు వంగి తల్లి పాదముల నంటెను.

సార్వభౌముని దేవేరి పుత్రుని నవ్వుచూచి, ఏదియో యర్థము కానిదానిని అవగతము చేసికొన ప్రయత్నించుచు, చిరునవ్వుతో తీవ్రాలోచనకలిపి, సుతుని శిరముపై చేయినుంచినది.

శ్రీకృష్ణశాతవాహనుడు తన తమ్ముని మంజుశ్రీని దొంగిలి తస్కరించుకొని పోవుట లోని ఉద్దేశ్య మొక్క ప్రయత్నించినను అర్థము కాలేదు.

చక్రవర్తి అంతఃపురములలోనికి చొచ్చుకొనిపోయి, మాయావేషములతో, మహాధైర్యముతో, వేయికండ్ల రక్షకభటుల, రక్షకస్త్రీల, కంచుకులద్వారపాలుర, దాసీజనముల మధ్యనుండి ఒక రాజకుమారుని ఎత్తుకొనిపోగల ధూర్తు డెవడు?

ఇది ఒకరి పనికాదు. అత్యంత సమర్థుడైన ఒక పురుషుడు కొన్నివేలమంది సహాయకులతో, అంతఃపురములోని దాస దాసీజన సహాయముతో, కొందరి రక్షకభటులు సహాయముతో జరిపి యుండవలెనికదా శుకబాణులవారు అభిప్రాయమందినారు. వారితో మహారాజును, మహామాత్యులు, సర్వసైన్యాధ్యక్షులు ఏకీభవించినారు.

రాజ్యమునకై ప్రయత్నమా? కసితీర్చుకొను ప్రతీకారమా? ముక్కుపచ్చలారని బిడ్డను కొనిపోవ వారికి వ్యామోహమెట్లొప్పినది. శుకబాణులవారలు దేశమంతయు దుర్భిణితో దుర్వినారు. ప్రభువు అనుమానమును, శుకబాణుల అనుమానమును, స్థూలశిష్యమహర్షి మీదనే ఉన్నది. కాని ఎన్నివిధములైన మాయలు పన్నినను, అనుమానాత్మకమగు ఒక్క చిహ్నమైన స్థూలశిష్యమహర్షి యాశ్రమమునందు గోచరింపలేదట. వారి ఆశ్రమములో వైద్యశాలలున్నవి. సర్వవైద్యమునకై అష్టభిషజులతో బలమున్నదట. మంత్రముల సంకట్టుబడి పెద్దపులులు, సింహములు, చిరుతలు మొదలగు క్రూరమృగములెన్నియో యాతని మృగశాలయందున్నవట.

సర్వశాస్త్రపారంగతులు, విద్యార్థులు, విద్య పూర్తిచేసికొన దేశదేశములనుండి ఎందరో పండితులు, ఋషులు, కాపాలికులు, యోగులు వచ్చుచుందురు. వైద్యమునకు, ముక్తికి, మంత్రోపదేశములకు లక్షలమంది ఆ పవిత్రాశ్రమమునకు వచ్చుచుందురు. పోవుచుందురు. ఆ మహర్షి రాజకుటుంబమున్న ప్రేమకలవారు. తన తాతగారి సహాధ్యాయుడు, సర్వతంత్ర స్వతంత్ర పితామహుడు.

వారణాసిలో, తక్షశిలలో, విష్ణుప్రయాగలో, హృషీకేశములో, నవద్వీపమునందు, ధాన్యకటకమునందు, నర్మదాతీరమున, కావేరీతీరమున ఇట్టి మహాపండితుని, ప్రజ్ఞావంతుని ఎచ్చటను చూడలేము. అయినను స్థూలశిష్యునిమాట తలచుకొన్నచో ఏదియో తనకు భయము కలుగును. శుకబాణులవారు కొందరిని అనుమానించి, నాడు తన తమ్ముని మంజుశ్రీ రాజకుమారుని తస్కరించుకుపోయినవారు వారేనని సిద్ధాంతము చేసినారు. అయినను మూలకారణము స్థూలశిష్యులవారేననియు శుకబాణుల యనుమానము. శ్రీకృష్ణుడట్లు కత్యంతరముల గడచి, చక్రవర్తి యాకాలమున నెలకొనియున్న సాహిత్యమందిరము చేరెను.

తాను తన మాతృశ్రీవారికి చేసిన ప్రతిజ్ఞ నెరవేర్చుకు తీరవలెననుకొనుచు శ్రీకృష్ణుడు తండ్రియగు శ్రీముఖులకడకేగి, నమస్కరించి, జనకునిచే ననుజ్ఞాతుడై వారి ప్రక్క [illegible] నధివసించెను.

శ్రీముఖుడు చిరునవ్వుతో "బాబూ, నీకు ధాన్యకటకనగరాధిపత్యము ప్రీతికరముగ నున్నదా?" యని ప్రశ్నించెను.



"మహాప్రభూ! నావిడిది యథాసందర్భానుకూలమైయే యున్నది. అయితే నొక్క చిన్న సంఘటన జరిగినది. ఎచ్చటనుండియో ఒక తెల్లని త్రాచు నేను తమ దర్శనార్థము వచ్చుచుండ వెన్నంటబడి, ఆగి, మరుసటిక్షణమున మాయమైనది." అని శ్రీకృష్ణుడు జనకునకు విన్నవించెను.

ఇంతలో మాంత్రికుడగు నొక భిక్షు నచ్చటికి వచ్చి "మహాప్రభూ! మహారాణీగారు యువరాజులుంవారికి పాము కనంబడినదనియు, తత్సంబంధ మంత్రోచ్చాటనాదులచే యువరాజ రాజకుమారులకు ఆపద ఘటిల్లకుండ చూడవలెననియు మహాసంఘారామమునకు గురుపాదులకు వార్తనంపిరి. వెంటనే వారు నన్నిక్కడకు పంపిరి" యని విన్నవించెను.

మహారాజు ప్రశ్నార్థకముగ నా భిక్షువునిశంక చూచుచు "దయచేయుడని" యొక పీఠము చూపించెను. అతడు పీఠమధివసించుటయు, "అది పాలవలె, వెన్నెలవలె తెల్లటి పాము" అని యువరాజనియెను.

"మహాప్రభూ శ్వేతపన్నగములు మనుష్యుల కండ్లబడవు. బడినచో నా పురుషునకు గాని, వనితకుగాని ఏదియో ఉత్తమశుభము చేకూరగలదని సర్పశాస్త్రము, శకునశాస్త్రము చెప్పుచున్నవి. శ్వేతపన్నగ సందర్శనమునకు మంత్రతంత్రములేమియు నవసరములేదు. యువరాజులకు త్వరలో శుభము కల్యాణమగునని మా శాస్త్రము చెప్పుచున్నది." అని యా భిక్షువు తెల్పినాడు.

"స్వామీ మీ మాటలు నాకు ధైర్యమొసగుచున్నవి. యువరాజులవారును, నేనును, మహారాణియు, గురుపాదులను, తమకు ఎంతేని కృతజ్ఞులము" అని సార్వభౌముడు పలికెను. ఆ భిక్షువునకు చక్రవర్తి, యువరాజులు నమస్కరింప "బుద్ధదేవుడు మిమ్ము రక్షించుగాక, ధర్మము మిమ్ము రక్షించుగాక, సంఘము మిమ్ము రక్షించుగాక" యని ఆశీర్వదించుచు మహారాణీసదనకు జనియెను.

తన భర్తయు, తన జ్యేష్ఠపుత్రుడును, ఇరువురు తన కన్నతండ్రి దొరికితీరునని ధైర్యము చెప్పుచున్నారు. అబ్బా ఎంతటి చిన్నబాలుని ఆ కఠినాత్ములు కొనిపోయినారు. ధనమునకై [illegible]ంచి కాదు. రాజ్యసంక్షోభము నుద్భవింపచేయుటకుగాదు. అందాలబిడ్డని కన్నతల్లి చేతులనుండి ఊడబెరికి, ఆ తల్లిని దుఃఖపెట్టుటకు మాత్రము ఆ కరుణాహీనులు అట్లు చేసినారు.

ఆ అయిదేండ్ల బాలుడు ఎన్ని కడగండ్లు పడుచుండెనో, అతని బంగారు పసిమేను ఎండిపోయెనో, తల్లియైన ఆ మహారాణికి కన్నులనీరు తిరిగినవి.

ఇంతలో ఒయ్యారముగ నడచుచు మహారాజా కొమరికలగు మాయాదేవియు, శాంతిశ్రీదేవియు, పరిచారికలు కొలువ తల్లికడకు విచ్చేసి, తల్లి పాదములకడ మోకరించిరి. ఇరువురి చెరియొక చేతితో లేవనెత్తి, వారిరువురిని మహారాణి తన హృదయమున కత్తుకొన్నది.

"మాయాకుమారీ! రేపు మీరు సలుపు నాట్యమేమి?" అని మహారాణి అడిగినది.

వర్షము వెలిసి, మబ్బులు మాయమైనవెనుక వెన్నెలవలె, ఆమె మోమున చిరునవ్వులు ప్రసరించినవి.

మాయాదేవి జనకుని పోలిక. శాంతిశ్రీదేవి అచ్చముగ తల్లిపోలిక. వారిరువురు చక్కని చుక్కలు. రాజశ్రీ వారి కన్నులలో ఫాలముల చంపకపుష్పనాశికముల, మందార కుసుమలావణ్యములగు పెదవుల, చిబుకముల, కపోలముల వెలిగిపోవుచుండెను.

వారిరువురు తల్లికి చెరియొకప్రక్కన నధివసించిరి.

మాయాదేవి:—అమ్మగారూ! అన్నయ్యగారు తమ అంతఃపురమునకు వచ్చినారట కాదూ!

శాంతిశ్రీదేవి:—అన్నయ్యగారు మా మందిరానికి ఎందుకు వచ్చినారు కారండీ?

"అరుగో ఈ దారినే యువరాజా వచ్చుచున్నారు."

అప్పచెల్లెండ్రు లేచి ముందుకు త్వరితముగ బోయి అన్నగారి పాదములకు నమస్కరించిరి. శ్రీకృష్ణుడు వారిరువురకు మాయామాతకు చెప్పి, లేవదీసి, ఇద్దరిని చెరియొక చేతితో నడుములు చుట్టి తన కదుముకొని, వారి తలలను తన చెంపలకాన్చి, వారి ఫాలములు ముద్దుగొని, మరియు వదలెను. ఆనందదేవియు లేచి వీరు ముగ్గురికడకు వచ్చెను.

"మా అన్నయ్యగారు ఈ దినము మా ఇంట నాతిథ్యముపొందరా?" అని మాయ అన్నది.

"రండి అన్నగారూ, నేను వీణమీద మీరు ఇదివరకు చూచినతర్వాత ఇరువదియైదు మూర్ఛనలు నేర్చుకొంటిని. అవి అన్నియు పాడి వినిపింతును." అని శాంతిశ్రీ యన్నది.

"నాయనా! మీరు ఈపూట వీరి మందిరానికే భోజనమునకుపొండు, ఈ రాత్రియు, రేపుదయమునను మహారాజా మందిరమున మీకు ఆతిథ్యము." అని ఆనందదేవి యన్నది.



# షష్ఠ ప్రకరణము

## నాగబంధునిక

ధాన్యకటక నగరము కృష్ణానదీ తీరమున [illegible] గోరుతముల [illegible] నున్నది. నదీతీరమునుండి నగరగర్భమున [illegible] గోపురము [illegible].

ఈ మహానగరము చుట్టును అనేక గ్రామములు, వనములు, ఫల పుష్పోద్యాన వాటికలు, ధనికుల, ఉత్తమ [illegible] మహాసంఘ [illegible] భవనములు, [illegible] మందిరములు, మహాగృహములు, సౌధములు [illegible]. ఈ నగరమునకు [illegible] కృష్ణానదీ తీరమున, ద్వాదశ [illegible] ప్రాకారమునందు మహా సంఘారామమున్నది.

మహా సంఘారామము మధ్యమున మహా చైత్యమును, ఆ చైత్యము చుట్టు చైత్య మందిరములున్నవి. మహా సంఘారామమునకు, [illegible] విహారము ఇరువది [illegible] దూరమున నున్నది. ఆ విహారము [illegible] వనాంతరమున బాలికా విద్యాలయ విహారమున్నది. ఉత్తమ విద్యా [illegible] బాలికలందరు [illegible] గ్రహణోన్ముఖులై, ప్రజ్ఞాపారమితా [illegible], [illegible] చంద్రికలవలె, వసంత నవోదయ [illegible] పుష్పములవలె, [illegible] హృదయులై, విద్యామృతాప్లావిత చిత్తులై ఆంధ్రనగరమునకే [illegible] సముపార్జించుచుందురు.

ఆ బాలికలందరిలో ఉత్తమురాలు [illegible], [illegible]. నాగబంధునిక శిల్పాచార్యులగు ధర్మనంది కొమరిత. [illegible] పాడుగరి. [illegible] బంగారు [illegible]. [illegible], [illegible], కత్తిసాములో ప్రసిద్ధాంధ్ర యువకవీరుల [illegible] నామె తీసిపోదు.

ఈ బాలికను [illegible] మోము ఫాలము [illegible] విశాలమును, చిబుకముకడ సన్నమునంది, పవిత్ర బోధిసత్త్వమును [illegible] చేయును.

నాగబంధునిక కడ [illegible] శృంగార [illegible] నిశిత కృపాణ సదృశమగు [illegible] లక్షణములు [illegible]. ఆమెతోడి బాలికలు ప్రాచీన శృంగార గాథా పరిస్ఫురణానంద హృదయులై, అర్ధనిమీలిత నేత్రలై, నిట్టూర్పులు, అజ్ఞాత నాయకుల కలల గాంచుచు [illegible], నాగబంధునిక ఆంధ్రవీర గాథలు, రామాయణ భారతాది గాథలు, భూర్జపత్ర గ్రంథ సంపుటముల తీక్ష్ణదృష్టితో సర్వకాలాపోసనము.

చేయుచుండును. నాగబంధునికకు శిల్పము, చిత్రలేఖనము ఉగ్గుపాల విద్యయాయెను. చిన్ననాటనుండియు జనక హస్తగత శిల్పజ్యోత్స్నపరిపోషితయగు నాబాలిక చిత్రకారిణి యగుటలో నాశ్చర్య మేమున్నది.

నాగబంధునిక అల్లరిపిల్ల. అన్నగారగు సువర్ణశ్రీ కుమారునితో కలసి అశ్వారూఢయై, నగర బాహ్యప్రదేశాలకు విహారార్థము పోయి, అన్నగారితో పందెము వేయుచుండును. ఇంటికడ వారితోటలో అన్నగారితో కత్తిసాము చేయును. చెల్లెలగు సిద్ధార్థినిక నవలీలగ నెత్తి, బంతివలె నెగురవైచి పట్టుకొనుచుండును. సిద్ధార్థినిక కేకలు వేయుచు, "అమ్మా చూడవే! అక్క నన్ను బంతివలె చుక్కలవరకు నెగురవేయుచున్నది," అని అల్లరిచేయును. వారి యన్నయగు సువర్ణశ్రీ పరుగిడి వచ్చి, నాగబంధునికను భుజమునుబట్టి జాడించి నవ్వుచు, చిన్నచెల్లెలి నెత్తుకొని, ముద్దులు పెట్టుకొని, బుజ్జగించి, నాగబంధునిక కందకుండ వారి తోటయంతయును పరుగిడును.

అక్షణాన నాగబంధునిక చిన్నచెల్లెలు చేయిపట్టుకొని, వయసురాబోవు అడుపులీవలె అన్నగారి శిల్పమందిరములోనికి పోయెను.

ధర్మనంది హర్మ్యము, భవనము, శిల్ప సుందిరములు ఒక పిశాల వననాటికయందు మహా సంఘారామమునంటి, ఆ సంఘారామమున కాగ్నేయమున కృష్ణానదీ తీరమున నున్నవి. కృష్ణానది పొంగి, పరవళ్ళు త్రొక్కుచు ప్రవహించివచ్చునపుడు, ధర్మనంది శిల్పమందిర పంక్తి సోపానముల నెక్కి అతల్లి మందిరోత్తర కవాటప్రాంతమునకు వచ్చి, యా యుత్తమశిల్ప విన్యాసముల నవలోకింప తొంగి చూచుచుండును.

జనకుని శిల్పమందిరమునకు ముప్పదిరెండు ధనువుల దూరమున, కుమారుని శిల్పమందిర మున్నది. సంపూర్ణ విన్యస్త శిల్పమైన వజ్రభూగర్భస్థ చంద్రశిలా ఫలకము పదుగురు సేవకులచే నెత్తించుచుండిన అన్నగారికడకు నాగబంధునిక పరుగున వచ్చి "అన్నా నీవు ఏడ్గుబండి పందెమున గెలిచితీరదవు. అట్లు జయుమందినప్పుడు నా కేమిబహుమతి నొసంగెదవు" అని ప్రశ్న వేసినది.

సువర్ణశ్రీ నవ్వుచు, తనకన్న గుప్పెడుమాత్రము తక్కువ పొడుగున్న చెల్లెలి భుజము చుట్టు చేయివైచి, దగ్గరకు తీసికొని, యామె మూర్ధముపై చేయుంచి, శిరోభారము సవరించుచు "చెల్లీ! గిరిపురమునం దుత్తమ లోహకారుడు నిర్మించిన వనితాకృపాణ మొకటి, అగ్నిశిఖవంటి దానిని, శుక్లపక్ష విదియనాటి నెలవంకవంటి దానిని, కానుక నీయగలను సుమా! నీకు నగల యందభిరుచి లేదాయెను, మొన్ననే ప్రసిద్ధ వ్రాయసకాడగు గోపాలకులవాడు తాళపత్ర ముల లిఖించిన దివ్యగుణాఢ్య పండిత విరచితమగు బృహత్కథను కానుక తెచ్చితినాయెను



నీవు వలదంటివి. వ్యాస భగవద్విరచిత భారతమును, వాల్మీకి ఋషిసత్తమ విరచిత రామాయణము నెన్నిమార్లు చదువుచుందువో. ఒక్క సారియైన త్రిపిటకమును చదువవు. నీవు నాకు తమ్ముడవై ఏల జన్మించలేదో!" అని యనుచు పకపక నవ్వినాడు.

నాగబంధునిక:- అన్నా! బుద్ధభగవానుని బోధ నాకువిసుగు జనింపజేయును. అహింసయట, అష్టమార్గములట. కాలము చెల్లినవృద్ధులకే శ్రమణకునిబోధ నచ్చునేమో. నాకు మాత్రము స్థౌలతీర్థ్య మహర్షి బోధనలు ఆనందోత్సాహములు కలుగజేయును. వృషభేశ్వరు డైన కాలకంఠుడు చండవిక్రముడు. ఆయనఅర్ధాంగి దుర్గ వీరధర్మ స్వరూపయైన దివ్య మూర్తి. కాదుఅన్నా!

సువర్ణశ్రీ : వెర్రితల్లీ! నీ యభిప్రాయములు నాన్నగారికి తెలియవు. అవి విన్నచో భయకంపిత హృదయులుకారా?

నాగబంధునిక:- నాన్నగారికి భయమా? అమ్మకే భయములేదే!

సువర్ణశ్రీ:- అవును. నీవు వట్టి మాటల ప్రోవువని అమ్మకు తెలియదా?

నాగ:- నేను మాటలప్రోగునా? నీవు పనులప్రోగువా? నీపనులన్నియు నీ ఎదుటనే యున్నవి. పలుచనివి, గంభీరరాగములులేనివి, రుచులులేనివి చప్పిడి భావాలు తెలియజేయు నీ బొమ్మలన్నియు నీ పనులేగావా?

నాగబంధునిక చప్పట్లు కొట్టుచు పకపకనవ్వెను. సిద్ధార్థినిక అక్కమాటలకు వెరగుపడుచు

"అక్కా! ఇప్పటికిని నీవాడుబాసను నమ్మకము నాకులేదే" అని అన్నది.

సిద్ధార్థినిక మితభాషి. తొమ్మిదియేండ్ల యీడుగల యా చిన్నబాలిక ఎప్పుడు నేదో యాలోచనముననే యుండును. ఇతరబాలికలతో కలసి యాడుకొనదు.

తల్లిదండ్రులు బుద్ధపూజవేళ పాడుకొను ప్రాకృతగీతముల నాబాల యొప్పగించును తనలో తాను పాడుకొనుచుండును. ఆమె కంఠ మతిమధురమైనది. ఆమె యాటగది యందున్న బొమ్మలన్నియు బుద్ధారాధన సంబంధములైనవే. బుద్ధపాదములు, ఛత్రములు, ధర్మచక్రములు చిన్నచిన్నవి, పాలరాతితో, వెండితో, దంతముతో, గంధపుచెక్కతో విన్యాస మొనరించి ధర్మనంది తనయకు బహుమానములిచ్చెను. ఆ చిన్నదియు నవి యలంకరించుకొని యామె పుష్పములు సేకరించి, ఫలములు ప్రోగుచేసికొని, మహాబోధివద్దకేగి, ధూపవత్తియులు సువాసన ద్రవ్యములు తెచ్చుకొని పూజలు సల్పుచుండును. అన్నగారి శిల్పమాలికను

ప్రాణము. నాగబంధునిక కన్నగారివీరవిద్య హృదయానందకరము. అన్నగారేవాడు కవులు రచించు కావ్యానికములు మనోహర గాంధర్వ యుతముగ పాడుకొనునో అప్పుడన్నగారి కడ చేరి, యాతని యొడిలో తలనుంచుకొని, పెద్దవియైన లేడికళ్లరమూతలుగా, అన్నగారి ముఖమును, ఆకాశము నవలోకించుచు సిద్ధార్థినిక తన్మయమున వినుచుండును. అన్నగారు పాటలు పాడుకొనునప్పుడు నాగబంధునిక ఆచుట్టుప్రక్కలకు రాదు.

అన్నగారు శృంగార రసభావపూర్ణములగు పాటలుపాడినప్పుడు నాగబంధునిక "ఛస్ ఈ శర్కరకేళిబండ్లు నాకిష్టముండవు" అని నవ్వుచు వెడలిపోవును. సిద్ధార్థినిక కప్పుడక్కపై అమితముగ కోపమువచ్చును. అన్న పాడుపాట లర్థమై కాదామె ఆనందించుట! అన్నపాటలలో దూరదూరమున యశోధరాదేవి యున్నదని యామె చిరుహృదయమున చిట్టిభావముల, చిన్న ఆలోచనలతో ఉప్పొంగిపోవును.

ఈ రోజున నాగబంధునిక సువర్ణశ్రీ వీపుపై ఒక గుద్దు గుద్ది: "అన్నా! పదిక్షణములే శిల్పము సంగతి మరచిపోకూడదా? రా! వృషభశాలకు పోవుదము. సైల్యా! సుగ్రీవకము లేమి చేయుచున్నవో కనుగొందము. చెల్లి గిత్తలకడకు రానేరాదు. చిన్నదూడలు, ఆవులు, ఆడెయ్యాలి నెరిగ్రీకిల్లికి ప్రాణము. చెల్లీ! ఓ వెన్నమ్మగారూ! ఓ మామిడిపండురసంగారూ! ఓ చెరకుపానకంగారూ! ఈనాళ్లైన కొన్ని మిఠాయిములు తినవే! కొంచెము సల్లజీరకర్ర ఇచ్చి చూడవే. అల్లములవలముకో కపిలినవే. రా! అన్నను పందెము నెగ్గించే కైలాసశిఖరములను చూచెదము రా! జగ్గుమ్మతనము వదలు" అని నవ్వినది.

"ఓ మగకాకా! నీవుగడనెక్కి యాటలాడుము. భీమునివలె ఏనుగుతో బంతులాడుము. తోటకివలె ఉంటిపిల్లలను మూటగట్టుకొనిపో. నిన్ను చూచిన నాకుభయము వేయుచున్నది. అన్నచాటున దాగుకొనవలెను" అని సిద్ధార్థినిక కోపమునటించుచు నవ్వుతో ప్రత్యుత్తరమిచ్చినది.





# సప్తమ ప్రకరణము

## సార్వభౌముని జన్మదినోత్సవములు

ధాన్యకటకమునకు అయిదుగోరుతముల దూరమున కృష్ణానదీకూలమున పురభోగోద్యానమునకు సమీపమున నేమహాఖేలనాప్రదేశమున్నది. అది నూరునూరుపది వర్తనములున్నది. (నివర్తనము సుమారు మూడు ఎకరములు) ఆ విశాలస్థలమున సర్వకాలములయందు మల్లయుద్ధములు, పందెములు, ఆటలు, మొదలగునవి యగుచుండును. ఒకచో మల్లయుద్ధ మొనర్చుచుండును. ఒకచో రథములు పందెములకొరకై పరుగెత్తించెదరు. ఒకచో ధనుర్విద్య నేర్చుకొనుచుందురు. వేరొకచో గుఱ్ఱపుస్వారియందు నిమగ్నులయియుందురు. పలువురు మల్లముష్టియుద్ధాల నలవరచుకొనుచుందురు. ఆ పవిత్రస్థలము మహానీయులకు ఉనికిపట్టయి యుండును. ఆ ప్రదేశమునకు చిక్కిపోయిన బక్కవారిని రానీయరు. అచటికి వెళ్ళలేనందుకు పలువురు ఆంధ్రబాలురు ప్రాణత్యాగమునకైన వెనుదీయరు.

మహోత్సవములేవైన వచ్చినప్పుడచ్చట ప్రదర్శనములు పందెములు జరుగుచుండును. ఆంధ్రమహాదేశ సార్వభౌముడు శ్రీముఖుని పుట్టినదినమున ప్రతి సంవత్సరమును మహోత్సవానేకములందు జరుగును.

నగరమధ్యమున, సార్వభౌముని కోటకు సుమారు రెండునూర్ల ధనువుల దూరమున నగరక్రీడా మందిరమున్నది. క్రీడామందిరమునుచుట్టి నగరవనోద్యానమున్నది. వసంతోద్యానమధ్యమున నొక చిన్న క్రీడాపర్వతమున్నది.

నగరనర్తనశాల యాక్రీడాపర్వత శిఖరముపైనున్నది. పర్వతపాదమునుండి, ఆ చిన్న నగము అరువది అడుగుల ఎత్తు మాత్రము. (క్రీడాపర్వతమనునది పౌరుష నామము.) నర్తనశాలలో, సార్వభౌమ జన్మదినోత్సవ సంగీతసభలు, నాట్యప్రదర్శనములు జరుగును. కోటలో నున్న రాజ్యనర్తనశాలకు, ఆనందమందిరమని పేరు. అచ్చట ముఖ్యనాట్యప్రదర్శనములు జరుగును.

ఉత్తమగాయకులకు, నటకులకు, కవులకు, శిల్పులకు, చిత్రకారులకు భూరి పారితోషికముల సార్వభౌముడర్పించును. దేశమంతయు సంతోషమున నోలలాడును. గ్రామములు, ఘంటాపథములు, పట్టణములు, నగరములు అలంకరింపబడును. కారాగృహముల బంధితుల విడుదలచేతురు. పల్లెల, పురముల, సభలు, నృత్యగాన కావ్యాదివినోదములు ఎడతెగక జరుగును.

విస్తారాంధ్రమహాసామ్రాజ్యమం దెచ్చటను, ఏవిధమగు పన్నులను నెలరోజుల వరకు వసూలుచేయరు. దేశమంతయు నానందడోలికల తేలియాడి పోవుచుండును.

ఖేలనా స్థలములలో ముష్టియుద్ధ, మల్లయుద్ధ, ఖడ్గయుద్ధాది ప్రదర్శనములు, గుఱ్ఱపు పందెములు, రథముల పందెములు, ఏనుగుపందెములు జరుగును. వీధినాటకములు, తోలుబొమ్మల నాటకములు, దొమ్మర విద్దెలు, సాముగరిడీలు, గాథాకాలక్షేపములు ఎన్నియేని జరుగును.

జనులు కోలాహలానంద పరవశులై, శుభ్రవస్త్రములు ధరించి, భూషణాలంకృతులై మద్యాదికములు త్రాగువారును, జూదముల పాల్గొనువారును, ఆఖేటనోత్సాహులునగుదురు. ఆంధ్రసుందరీమణులు అప్సరసలేయై నృత్యగీతాదుల వినోదించుచు ప్రదర్శనముల పాల్గొనుచు, సర్వభూషణాలంకార దివ్యగాత్రలై ఒయారపు నడకల ఏగంధర్వ నగరమునో తలంపునకు దెత్తురు.

ఆంధ్రులకు ఎడ్లబండి పందెములు, (ఈ వలావల ఎడ్లు, మధ్య గుఱ్ఱమునుకట్టిన బండ్ల పందెములు,) రథ పరీక్షలు అత్యంత ప్రీతికరములు. ఈపందెముల పాల్గొనని క్షత్త్రియాంధ్రుడా యుగమున ఆంధ్రమహాసామ్రాజ్యమునం దెచ్చటను గానరాడు.

ఈ వివిధోత్సవముల నానందించుటకు, వివిధపరీక్షల పాల్గొని బహుమతులందుటకు ఆహ్వానములు సందేశగ్రాహకులు శీఘ్రగమన వాహనారూఢులై ఆసేతుహిమాచలమున నున్న దేశములకన్నింటికీబోయి, మహారాజుల, మండలాధిపతుల, సామంతుల, చక్రవర్తుల అమాత్యుల, కలపతుల మహాభిక్షుకుల, ఋషుల, పండితుల, కవుల, గాయకుల, నటుల, వీరుల పోటుమగల నాహ్వానింతురు.

కురు, పాంచాల, సాల్వ, మత్స్య, శూరసేన, మగధ, మాళవ, కుంతల, పాండ్య, చోళ, చేర, కాంభోజ, గాంధార, కామరూప, ఘూర్జర, త్రికళింగ, వంగ, లిచ్ఛవాది, దేశముల కన్నింటికిని, సువర్ణ, యవ, బలి, పూర్వకాంభోజ, సింహళాది ద్వీపములకును, యవన, బాహ్లిక, తురుష్క, పారశీక, రోమక, సీలకా, త్రివిష్టప చీనాది లాటవిలాతులకును సందేశగ్రాహకులు ఆహ్వానముల గొనిపోదురు.

ఆ యా దేశములనుండి వీరులు, పండితులు, రసజ్ఞులు, రసస్రష్టలు, ప్రభువులు ఈ యుత్సవముల పాల్గొని యానందవార్ధి తరంగడోలికల నూగిపోవుటకు, యాత్రలుసాగి చనుదెంతురు.

వృషభశకట పరీక్షకు ఘనబాహు విశ్రుత రథములకు పూన్చిన కైలాసశిఖర సదృశములగు గిత్తల పూన్చి జయాభిలాషులై, దేశదేశములనుండి వీరులరుదెంతురు.



మగధనుండి సుశర్మ కాణ్వాయనుల దళపతి కాత్యాయనుని పంపినాడు. ఉజ్జయిని నుండి మహారథియగు ప్లహావుతు వచ్చినాడు. సౌరాష్ట్రమునుండి పొట్టివియు, బలము కలవియు, లేళ్ళవలె చురుకుగలిగిన పసరముల వివిధవర్ణాలంకృతమగు రథమునకు పూన్చి జీవన ప్రభువీరుడు వచ్చినాడు. నిడుపాటి కొమ్ములుగలిగి వాలుకన్నుల బెదరుచూపుచూచుచు, శ్రమయనునది యెరుగని వల్లగిత్తల గట్టుకొని దక్షిణమునుండి వీరత్తుణి వచ్చినాడు. ఆ కోజాన సంబడి మూడుదేశములు పందెమునకు తమతమ రథికులను పంపినవి.

తెలుగుపోటుమగలగు కౌశులు పదినేనుగురు పందెమునకు వచ్చిరి. సమవర్తి తోన మాము బండినడుపుటకు నిశ్చయింపబడినది. శిల్పకుమారుడను సువర్ణశ్రీ కూడ పరీక్షకై చేరివచ్చెను. పట్టణమంతయు కోలాహలముగా నున్నది.

సమవర్తి జయముగాంచునని అందరికి దెలియును. పట్టణప్రజాసమూహమునకు సమవర్తియనిన ప్రేమమడియెక్కువ. లాటవిలాతులకుబోయి యచ్చట జరిగిన ప్రదర్శనముల విజయ మొంది ఆంధ్రగౌరవము కీర్తి నిలిపినది, సమవర్తియే గాదా? అతడు నడపంజాలని రథములేదు ఎక్కజాలని గుఱ్ఱమును లేదు. అతడు చెప్పిన వినని బలీవర్దమున్నదా?

మహాఖేలనాస్థలమంతయు సౌందర్యవంతముగనలంకరించినారు. ఆంధ్రవైభవమంతయు నచట చిత్రితమయ్యెను. చిత్రవర్ణవస్త్రాలంకృతమై వివిధాకృతమగు ప్రజ భూమిపై వాలిన మహేంద్రచాపముల తలపించెను. ఉత్తరాంధ్రదేశపు సన్ననిదుకూలములు చిరుమబ్బులవలె గాలికి తేలిపోవుచున్నవి. ఆంధ్రదేశమునకు వజ్రభూమియని పేరు. ఆంధ్రులరత్నాలరాజులు, రత్నవర్తకులు రత్నభూషణాలంకారులు స్త్రీలును, పురుషులును ఇప్పుడు మన యుగవాసివలె ఒక్క అందమగువస్త్రమును పాదములవరకు రా కటివస్త్రములు గట్టుకొందురు. ఒకవస్త్రము పైన గప్పుకొందురు, పలిపెములగొందరు తల చీరలుగా ధరించి యుండిరి. కాళ్ళకు బంగారు కడియములు, చేతులకు కంకణములు, మెడలో వివిధములగుహారములుండును. మొలనూళ్ళు ధరించిన యువతులచేనా ప్రదేశము వెలుగు లీనుచున్నది. అనేకులు రాజవంశమువారు తలపై వివిధరూపముల రత్నములు ముత్యాలహారములు పొదిగిన కిరీటములు ధరించియుండిరి.

ప్రేక్షకస్థలమధ్యమున రాజమందిరమున్నది. అనేక దంతహేమ గంధాసనములు అందమరించిరి. అన్నింటికిని మధ్యమున సార్వభౌముని మహాసింహాసనము, దానిం జేరియే రాణుల పీఠములునుగలవు. ఆమందిరమున కివలావల మంత్రుల దండనాయకుల సేనాధిపతుల మందిరములు వారివారిగౌరవముల ననుసరించి వెలుగుచున్నవి. సార్వభౌముని మందిరమునకు కుడిప్రక్కగా అన్నిమందిరములకుద సామాన్యజనము చూచుటకు తగిన పెద్దమందిరమొక్కటి తగు అలంకారములతో నిర్మాణమొనర్చిరి.

రాజమందిరము ఎడమప్రక్కగా మూడు మందిరములావల చారుగుప్తుని మందిరము సూర్యకాంతి మణివలె నా ప్రదేశమున ధగద్ధగాయమానమై యుండి ఆ వచ్చిన లక్షల కొలది ప్రజల చూపుల నాకర్షించుచుండెను. మూడేండ్లనుండి వెలవెల పోవుచున్న ఆమందిరము నేడు పూర్ణాలంకారమనోహరమై సుధర్మను పరిహసించుచున్నది. "రాజమందిరమునకు శోభనది, ఆ మందిరమొక్కటియే" అని వేనవేలు ప్రజలొకరి నొకరు చూచి చెప్పుకొనిరి.

"పదునొకండవ ముహూర్తము ప్రారంభించినారు. సార్వభౌముడు వచ్చువేళ అయినది" అని మహాశ్రీ చండకేతునితో ననియెను. వా రిరువురు గుఱ్ఱములపై నధివసించి రంగస్థలమున నిటునటు తిరుగుచుండిరి. అంత చండకేతుడు పురమార్గమువంక చేయి యడ్డము నుంచి చూచుచు అదిగో సార్వభౌములు వచ్చుచున్నారు అని అఱచెను.

---

# అష్టమ ప్రకరణము

## శకటచోదక పరీక్ష

మహాశ్రీ—ఆ వచ్చునది సార్వభౌములు కారు. ఎవరు చెప్పుమా అంత వైభవమున వచ్చుచున్నది?

చండకేతుడు—ఆర్యా! తెలిసినది, తెలిసినది.! రత్నకలశధ్వజము! ఆర్యచారుగుప్తులవారు. కోటీశ్వరుల వైభవము ఒక్కొక్కప్పుడు భూమీశుల సంపదను మించి పోవును కాదా!

మహాశ్రీ—అవునయ్యా! చారుగుప్తుడు సకలభారత వర్షవణిక్సార్వభౌముడు. ఆయన ఎన్నికోట్లకు నాగదేవుల కాపుంచినాడో? ఎన్ని మందసముల రత్నరాసులున్నవో? వివిధదేశసువర్ణము లెన్ని మందిరముల లెక్కకురాక, ప్రోవులుపడి యున్నవో?

చండకేతుడు—మూడేండ్లనుండి సాధారణాలంకరణరూపమై, ఏ విషయాధిపతికో నుపయుక్తంబయిన యా వణిక్చక్రవర్తిమందిరము ఎంత పరమాద్భుతముగ నలంకరించినారు. ఏమి విశేషమయ్యా?

మహాశ్రీ—విచారమెంత కాలము మానవునకు! అతనిభార్య చనిపోయి మూడేండ్లయినది! ఇప్పుడు కొమరిత పదునారేండ్ల వయసునందినది. అంధ్ర[illegible]



చండకేతుడు—ఆమె యందము మనవారందరి గృహముల తనివితీరని వేడుకతో చెప్పుకొందురు, అంత అందకత్తెయా ఆర్యా?

మహాశ్రీ—ఓయి అజ్ఞానీ, అందకత్తె అనుమాటను కృష్ణానదీగర్భమున పడద్రోయుము. ఆమె అపరాజితాదేవి. ఆమె ప్రజ్ఞాపరిమిత. ఆమె శ్వేతతార! ఆమె అనంతసౌందర్యప్రభావోజ్జ్వలమూర్తి!

చండకేతు—ఆర్యులు కవులగుచున్నారు.

మహాశ్రీ—దివ్యసౌందర్యాభిముఖుడగు వాడు, మొరకుడైనను మహాకవి కాడా చండకేతూ?

చండకేతు—మీ వర్ణన వినువారికే కవిత్వము గంగోత్తరస్వరూపమందాకినీప్రసన్నమై ఉబికివచ్చుచున్నది. శకటాధ్యక్షుల వారూ!

ఇంతలో చారుగుప్తుని రథము, పరివారజనారోహితరథపరివేష్టితమై, అశ్వికగజసంరక్షితమై, భేరీ మృదంగ, శంఖ, కాహళవాద్యములు చెలగ మహోత్సవస్థలము దరిసినది.

చండకేతుడు ముఖ్యపతులతో, గణపతులతో, పదాతివీరులతో, చారుగుప్తుని కెదురేగి, సార్వభౌమవాద్యమేళములు, వణిక్సార్వభౌముని మేళములతో మేళకముగా నగారవముగ తోడితెచ్చి, చారుగుప్తుని మందిరము కడ విడియుటయు, వారందరు రథావరోహణులైరి.

చారుగుప్తుడు ఇంద్రగోపుని భుజముపై చేయివైచి, యానతగాని తన రథమునుండి వినిర్గమించెను.

వేరొక రథమునుండి హిమబిందు కుమారియు, ముక్తావళీదేవియు, నవ్యకళతాదేవియు, చెలియగు బాలనాగియు, అలంకారికయగు తారాదత్తయు నవరోహించిరి. వేరువేరు శకటములనుండి హిమబిందు సేవకురాండ్రు పెక్కండ్రుదిగినారు. అశ్వికులు, మండపము వెనుక కావలికాయుచుండిరి. విచ్చుకత్తులను, శూలములను, ఫలకములను బుచ్చుకొని, అంధ్రకుమారులు మండపముచుట్టును కొలువువిచ్చుచుండిరి. చారుగుప్తాదులు వివిధాసనముల నాసీనులైరి.

రథమునుండి అవరోహణయగుచు హిమబిందుకుమారి మేలిముసుగులేని, వివిధాలంకారయు, వివిధవర్ణ వస్త్రశోభితయు, కోలాహలపూర్ణమైన యా మహాప్రజలను సగర్వముగ పర్యాలోకించినది.

ఆమె అంబాలపోలివు, విలాసములనూట, ఒయారములకుప్ప. ఆమె పరమాద్భుత సౌందర్యమునకు ముగ్ధులై, ప్రజలును దళ, ముఖ, గణ, చమూపతులు, రాజోద్యోగులు మంత్రులు దండనాయకులు, ప్రాడ్వివాకులు, ఒకరననేల అందరును ఆమెనే చూచుచుండిరి

మహాకాంతారనగరపురసని, బంగారు సరిగపూవుల, లతల దుకూలము, పసుపుపచ్చ ఎరుపు వెలుగునీడలచేత చీరధరించి, బంగారుసరిగపూవులగల నీల చీనాంబర స్తనవల్కలము బిగించి, ఆమెపాముకుబుసముపోలు, కాశ్మీర సువర్ణ మృగీరోమకవచము వల్లెగా ధరించినది.

పదువారేండ్ల ఎలప్రాయమున నామె పాటలవర్ణ, జాంబూనదభాసుర; పారిజాత కుసుమసమో పేశలవపుష.

ఆమె దివ్య భాసురత్వము నాలోకించిన యువకులు, పురుషులు ఎందరు నిట్టూర్పులు వదలిరో, ఎందరి గుండియలు కొట్టుకొనెనో, ఎందరెట్టిస్వప్నలోకవిహారులైరో, ఎందరు సమ్మోహనాస్త్రపీడితులైరో? అప్పుడు ప్రజలు సార్వభౌముడు ఇంద్రునివలె, బోధిసత్త్వుని వలె, బుద్ధునివలె అరుదెంచుటయే గమనింపలేకపోయిరి.

శంఖ, వేణు, ముఖవీణ, కాహళాది సుషిరములు, భేరీ, ఢంకా, మృదంగాది వాద్యములు, తాళములు, తప్పెటలు సముద్రఘోషా గాంధర్వము సర్వదిశల నావరింప, యుద్ధోచిత వేషుడై సర్వాలంకార ప్రకాశితుడై, సూర్యుని రథాశ్వములవలె, కైలాసాంభోధివీచికోప మానములై, ధవళతురంగములు సవలీలగ నడుచుచుండ, శాతవాహన ధ్వజమైన సింహము ఆకసమున తాండవమాడ, సకలరత్నఖచిత సువర్ణరథమునారోహించి, అతిరథుడైన శ్రీముఖ శాతవాహన మహారాజు, మంత్రులు, సామంతులు, దండనాయకులు, కవులు. ఆచార్య శ్రమణకులు, ఉత్తమగాయకులు, మహాశిల్పిధర్మనంది, సర్వసేనాధ్యక్షుడు, ఉపసేనాధిపతులు, కొలువ ఇంద్రవైభవముగ విచ్చేసి రాజమందిరము ముందాగి రథావరోహణుడయ్యెను వందిమాగధులు కైవారముల, సార్వభౌముని గుణకీర్తనము చేయుచుండిరి.

సార్వభౌముని రథము పరివారసమేతమై వచ్చుచున్నదనగనే మహాశైలజా ప్రదేశాంతరస్థులగు ప్రజలెల్లరు, జయజయధ్వానములు సలుపుచు, లేచినిలుచుండిరి.

సార్వభౌముడు సింహాసనమధిరోహించుటతోడనే, వందిమాగధులు కీర్తనలు పాడిరి. బ్రాహ్మణులు, శ్రమణకులు సామ్రాట్టునకు ఆశీర్వాదము లొసంగిరి.

ఇంతలో శకటాధ్యక్షులు మహాస్థవిర సార్వభౌమునికడకువచ్చి మాకరించి నమస్కరించి, లేచి, ఈశకటపరీక్షకువచ్చినవారినందరిని సార్వభౌముని సన్నిధి మధ్యదిరప్రాంగణమునకు తీసికొనివచ్చెను. వారందరు సార్వభౌమునికి సాష్టాంగదండప్రణామంబు లాచరించి



తిమతమ నామధేయములు పారిపార్శ్వకుడు వచింప, చక్రవర్తియనుజ్ఞనొంది, తమతమ శకటములకడకుబోయి, వానినారోహించి ప్రారంభస్థానమున ముందు నురకబోవు వృషభముల నయభయముల నిలువవరింపుచుండిరి.

రథపరీక్షామార్గము విశాల సమతలాయతమైనది. దారి పొడుగునను దిమ్మెసచేసి, మార్గమును గట్టిచేసిరి. బయలుదేరిన స్థలమునుండి శకటములు ఒకగోరుతము దూరముపోయి అచ్చట నర్ధచంద్రాకృతిని కుడివైపునకుమళ్ళి, యంతచక్కగనె యమరించిన వేరొకవిశాల మార్గమున వచ్చి, ప్రారంభస్థలమునకు పోయి, మరలనట్లే ఇంకొక పర్యాయము తిరిగి గమ్యస్థానమైన ప్రారంభస్థానమునకు రావలెను,

ఆంధ్రులందరకును తమవారిలో నొక్కడు నెగ్గి తీరునని దృఢనిశ్చయము. శకటములు తేలికగల తరుజాతి కాండముల నిర్మించినవి. లక్షావివిధవర్ణాలంకారములై, భూషణానేకసుందరములై, దేవవిమానోపమానములయి ప్రకాశితములైయుండెను.

ప్రారంభప్రదేశమందవి శ్రేణిగా నిలువబడియున్నవి. కందరములుకట్టి, లేడికాళ్ళ వలె పలుచని కాళ్ళు కలిగి, పొట్టివియు, నెత్తయినవియు, శ్వేత, కపిల, శబల, ధూమ్రలోహితవర్ణ విగ్రహములై, కొమ్ములకు వెండిబంగారు తొడుగులు, కాళ్ళకు వెండిబంగారు గజ్జెలు, నడుములకు పట్టుదట్టీలు, మూపుల వర్ణకంబళములు, కంఠముల బంగారువెండిమువ్వలు ఘంటికలు, మూర్ధముల చర్మపుపట్టీలు, చామిక పువగడలు కలిగిన తోడెలు, గోవృషభములు, ఉక్షములు, భయమునకొన్ని గర్వమునకొన్ని నిశ్చలమునకొన్ని, రౌద్రమునకొన్ని, తొందరపాటుతోకొన్ని నిలచియున్నవి. అవితోకలు ఇటునటునాడించుచున్నవి. అంకెలు వేయుచున్నవి. డెక్కలెత్తి నేలను వ్రాయుచు, కొట్టుచున్నవి. మొరలు చాచుచున్నవి. చెవుల నాడించుచున్నవి, కన్నులతిప్పుచున్నవి.

ఆ శకటములనడుమ, అద్భుతదారు శిల్పసుందరమగు రథమునొక్కండపై పగ్గముల సడలించి బట్టి, లీలాభంగశరీరియై, చిరునవ్వున ధవళంపు జోడెలతో తీయతీయని మాటలాడు శాలకుని, అప్రక్కనే శకటచోదకుడైయున్న కరూరవుడుచూచి మాటలువినినాడు. "శైబ్యా! సుగ్రీవక! ఏమిది? తొందరామీకు?" ఆమాటలకు అవలనున్న శాళింగుడు విని నవ్వి కరూరవుని చూచి కన్నుగీటినాడు.

"తెలుగుతద్దమ్ములకు తొందరపాటు అచ్చటకే యుండవచ్చునులే." యని పాళీభాషను శాళింగుడు కరూరవుని ముఖముచూచి పలికినాడు. సమర రిశాతవాహన తీక్ష్ణశేఖరుడు

సగర్వముగ ఛంగున నరికి తనకంబళి వ్యాఘ్రాసనము నారోహించి, ఖడ్గములువట్టి ఆసీనుడైనాడు చారుగుప్తుని వదనమున సంతోషహాసరేఖలు ఉదయించినవి.

హిమబిందు తన మేనబావ సమవర్తిని జూచి, ఆనందవదనయై "మాబావ నెగ్గుకున్న, ఏక సందేమున జయమందగలార" అని కొన్నది.



# నవమ ప్రకరణము

## శకటవేగములు

ప్రేక్షకులందరు తమతమ యాసనములపై, మొదట నిశ్చలమనస్కులై కూరుచుండిరి. తరువాత వారిహృదయముల నిజమహత్త్వశక్తి దివ్వెడగువా యను నాలోచనలు పొడసూపినవి. ఆ వెనుక సమవర్తి నెగ్గినీవలయునని కొందరిహృదయముల, ఆంధ్రులలో నెవ్వరైనను గెలువవలెనని కొందరిమనోరథముల కాంక్షలు మొలకెత్తి పెరిగి మహావృక్షములైనవి. అందువల్ల మాటలు వాదనలు, కోపములు, హర్షములు, హాస్యములు, వికటహాసములు చెలరేగినవి.

పందె మింకను ప్రారంభము కాలేదు. ప్రజలహృదయములలో విసుగు, ఆవేగము పరువెత్తినవి. నిశ్చలాసీనత విఫలమై ఆసనములలో ఇటునటు తిరుగువారు, వంగువారు, వెనుకకు వాలువారు, చక్రవర్తిమందిరమువైపు చూచి, ఆలస్యమునకు కారణమేమి యని యనుకొనువారు నై యుండిరి.

అంతలో సృష్ట్యారంభమందు దుమ్మూత్తము శబ్దబ్రహ్మముంబోలి, ఒక్కసారి పదునారు శంఖములు "భోం, భోం, భోం, భోం!" అని ధ్వనించినవి.

ఆ ధ్వనికి భీతచిత్తములై నాళవ్రుని ఎద్దులు, కాంభోజాశ్వవృషభములు, అడ్డగోలుగా పరుగిడినవి. శకటములు తలక్రిందులై శకలశకలములైనవి. తక్కినబండ్లన్నియు సమవేగంబున పరువిడి తప్పుచు, పరీక్షాపథమున నడ్డముగ పడియున్న బండ్లను తప్పుకొని, ముట్టి ముందుకు సాగినవి.



ధరకచ్ఛపువీరుని బండిగిత్తలు పడిపోయిన బండ్లను చూచి, ముందుకుసాగక, వెనుకకు తిరిగి, విశ్రామారామములవైపుకు పరుగిడిపోవ, గొల్లుమని ప్రజ లొక్కుమ్మడి అరచిరి. అంత గజదళాధికారి యగు ప్రమానందుడు అచ్చటనే యుండుటచే, ఏనుగుపైనుండి పాశము విసరి ఒక్క ఎద్దును పడగొట్టెను. తోడనే బండి తలక్రిందై పడినది. ఏప్రాణికిని అపాయము రాలేదు.

పరువుదు పందెపుబండ్లు, పడిపోయిన బండ్లను దాటిపోగనె, చలువురు సేవకులు సహదేవశాస్త్రజ్ఞులు, వైద్యులు, అచటకు పరువిడి, శకటశకలములను, దెబ్బలుతిన్న వృషభములను, సారథులను కొనిపోయిరి. ఆస్థలమును తక్కిన బాటతో సమము చేసివేసిరి.

కాళింగుడగు మల్లినాథుని బండి అన్నింటికి ముందు ఘంగుఘంగున పరువిడిపోవుచున్నది. ఆతని వెన్నంటి వీరత్తుని తతాయైయా తనబండిని తోలుకొనుచు, అరవమున నేదియో మాటలాడుకొనుచు పోవుచున్నాడు. వీరత్తునికి ఎడమప్రక్క కేరళ, ఘూర్జర, వంగ వీరులు రథముల పరువెత్తించుచుండిరి. ఆ వెనుక శిల్పపుడు, మువ్వురాంధ్రవీరులు సమముగ బోవుచుండిరి. వారిని వెన్నంటి, సమవర్తి, సువర్ణశ్రీ, మాగధుడును, వారికి కొంచెము ఎడములో చలువురును బోవుచుండిరి.

సువర్ణశ్రీ నవ్వేమియులేని నిర్మలనీలాకాశ చంద్రమూర్తివలె పోవుచున్నాడు.

ఎద్దులన్నియు నూరకెత్తి, ఊపిరులూదుచు, కళ్లుకొలుకుల కెంపులుగ్రమ్మ, చిరుమువ్వలు ప్రక్కపెదవులపరిసరించ, పాలసముద్రతరంగములవలె ధవళకాదంబినీమాలలవలె, గంగానదీ తరంగములవలె గంగడోల్లాడుచుండ మహావాయువేగముల పరుగువారుచుండెను. తేలికయగు శకటము లిటునటు లాడిపోవుచున్నవి. సారథులువంగి, ఎద్దులనదలించుచు, పసరముల ప్రార్థించుచు, కోడెలతోటి సరసభాషణములాడుచుబోవుచుండిరి.

మొదటిసారి సగముదూరము పోవునప్పటికి శిల్పపుని దూడలు పరుగిడలేక ఆగిపోయినవి. మొదటి చుట్టుకడకు పోవునప్పటికి కేరళ, కామరూప, గాంధారుల శకటములన్నియు వెనుకకు పోయినవి. చుట్టి, తిరిగి సగముదూరము వచ్చునప్పటికి, మిగిలినవారు కాళింగుడు, మాగధుడగు శివస్వాతి, సమవర్తి, సువర్ణశ్రీకుమారుడు, ఇంక నిద్దరాంధ్రులు. నాళగ్రత్కాణ్వాయనుని రథములోలు ఓరూరవుడు మాత్రము.

ప్రేక్షకుల ఆలోచనలు బిగుసుకుపోయినవి. ఆమహారంగస్థలమంతయు నిశ్శబ్దభావ మొందినది.

మూకల నాపఁజేయలేక పోయిరి. చక్రవర్తి అంగరక్షకులు కొందరు తమగుర్రముల నా విజయునికడను బరువెత్తించి ఆతనిచుట్టును శూలముల జళిపించుచు నిలిచిరి. వారినెట్లు తప్పించుకొనిరో నల్వురైదుగురు పరిజాపీరులు సువర్ణశ్రీ బండిని కత్తులెత్తుకొని సమీపించిరి.

ఆ బాలుడు తనపైకెగిసిన అశ్వమును నడచుచుకొనుచు, చిరునవ్వు మోముతో నీగడబిడ చూచుచు, తనదూడల పల్కరించుచు, ప్రేమచే వానిమూపురములు, గంగడోలులు, మూట్టెలు దువ్వుచు, వాని ఆయాసము తీర్చుచు, తనకై దుముకువారివైపు చూచుచుండెను. ఎప్పుడీ నల్వురు కత్తులెత్తుకొని తనమీదికి దూకిరో, అప్పుడా బాలుడు చేతనున్న బంగారు కట్లు కట్టిన, మణులుపొదిగిన, పెద్ద పులితోలు తాళ్ళుగలిగిన, దండకశాయుధము పట్టుకొని, ముందు నురుకువాని మోముపై చురుక్కున నంటించెను. "హా" యని యార్చి యాతడు కత్తి పారవైచి చేతుల కశాఘాతంబుచే రక్తము స్రవించు మోముపై నుంచుకొని కూలిపోయెను.

ఇంతలో అపరభీమునివలె మహాకాయుడై, పర్వతమువలె ఉన్నతుడై, ఆజానుబాహుడై, అమూల్య వస్త్రధారియై, పలనోక చిరుగంటలు గలిగిన పెద్దగదను ధరించి, ఒక పురుషుడు రాజాలయముకడనుండి, ఏనుగువలె వడిగనవచ్చి, సువర్ణశ్రీ కుమారునికడనురికి పిడుగుమాటలతో "ఎవ్వరీబాలుని స్పృశింపదలంతురో వారు ముందీ గదాయుధంబు రుచిచూచి మరి యీ ముందడుగు సాగుదురు గాక!" యని పలికెను.

క్షాత్రవిద్యాచార్యుండును, చండవిక్రముండును సమస్త వీరహృదయానందుడును, పవిత్రుడును సోమదత్తుడా నూత్నబాలునికి సహాయియై వచ్చెనని చూడగనే ప్రవాహమువలె వచ్చు ప్రజానీకము పర్వతము అడ్డమురాగా నాగి నట్లయ్యెను. అందరును వెనుకకు తిరిగిరి. అప్పుడు సార్వభౌముని గజ తురగ రథ సైనికులు జవంబున విచ్చేసి మూకల నిటునటు తరిమివేసిరి. సార్వభౌముని కడకు విజయుని గొనిరా రాజాజ్ఞయయ్యెను.

ఈ కోలాహలమంతయు సమవర్తి జూచుచునే యుండెను. జనులు తన్నోడించిన యాబాలునిపై గవిసినప్పుడు సమవర్తిమోము హర్షప్రఫుల్లమయ్యెను. సోమదత్తువచ్చి ఆ కుర్రవానిని ఆపదనుండి రక్షించునప్పుడు సమవర్తి కండ్లు మిఱిమి సోమదత్తునివైపు నదరమర చూచెను.

ఆ బాలుడు తన్ను రక్షింపవచ్చిన తన గురునకు సాష్టాంగాభివందన మాచరించి ఆనందాశ్రువులతో నాతని మోము గిలకించెను. సోమదత్తుడు సంతోషమున తన శిష్యుడగు నా బాలుని బిగ్గ గవుంగిలించుకొని మూర్ధము ముద్దుగొనియెను. వారిద్దరు గజ గమనముతో



రాజమందిరము సమీపించిరి. ఈలోన ప్రజలకు కోపముతగ్గి ఎట్టి బహుమాన మా బాలుడు బడయునో, సార్వభౌము డేమిచెప్పునో ఆ బాలుడెవరో తెలిసికొన కుతూహలము కలిగి, ఎప్పటియట్ల నిర్ణయస్థానముల తమ ఇష్టముచేతనైననేమి, సైనికుల యొత్తిడిచేతనేమి యధివసించిరి. అంతయు నిశ్శబ్దమయ్యెను. చీమ చిటుక్కుమన్న ధ్వని వినిపించునట్లుండెను.

సార్వభౌముని మందిరముకడ అమాత్యులు సచివులు సైన్యాధికారులు మొదలగు గొప్ప యుద్యోగులు సామంతనృపాలురు ఆంధ్రపండితులు కవులు వీరులు అందరు అధివసించి యుండిరి. శ్రీముఖ సాతవాహన మహారాజు దేవేరితో గద్దెపై నధివసించియుండెను. రాజసింహాసనము కుడిప్రక్కగా యువరాజాసనముపై చక్రవర్తి పెద్దకుమారుడగు శ్రీకృష్ణ సాతవాహనుడును ఆప్రక్క పీఠికపై శ్రీముఖుని తమ్ముడగు సుధర్మ సాతవాహనుడును కూర్చుండిరి. వెనుక పరిచారికలతో అంతఃపుర స్త్రీలోకము మణిమయ స్వర్ణపీఠముల నుపవిష్టమై యుండెను.

సోమదత్తు తనశిష్యుని రాజసమ్ముఖముం గొనిపోయినాడు. ఆబాలకుడు సార్వభౌమునకు సాష్టాంగప్రణామ మాచరించి, యాతనిచే ననుజ్ఞాతుడై లేచి నిలువబడెను. అప్పుడు సోమదత్తునిమోము పరికించి చక్రవర్తి యిట్లనియె "వ్యాయామాచార్య! సోమదత్త, ఈ బాలుడెవరు? ఈతని యుదంతమేమి?" అని యడిగెను.

"మహారాజాధిరాజా! ఆంధ్రసార్వభౌమా! సర్వరాజన్య కిరీటమణి ప్రభాస్నాతపాదుకా! జయజయ!! ఈ బాలుడు దేవరశిల్పియై విఖ్యాతిగాంచిన మహాభక్తుడగు ధర్మనంది తనయుడు. సువర్ణకుమార నామధేయుడు. నా శిష్యులలో నుత్తముడు. ఈ తూరొకట పరీక్షకు మా పరిశ్రమాలయ పక్షమున నొకవీరుని పంపుట పూర్వమునుండియు ఆచారము. ఆ విధానమున మహారాజశ్రీ శకటాధ్యక్షులు మాకు లేఖ నంపుటతోడనే పోటీ పందెము నేర్పరచి అందు విజయుడగు వాని యీయుత్సవపరీక్షకు పంపుట దేవరకు విదితము. ఈ సంవత్సర మీబాలుడు విజయుడై ఇచ్చటకువచ్చి ఇక్కడను యశఃకాముడైనాడు" అని విన్నవించెను. అప్పుడొక్కసారి వందిమాగధులు పాడినారు. దుందుభుల మ్రోగించినారు. జయజయధ్వానము లొనర్చినారు. వైతాళికులు కీర్తించినారు. మేళపతులు శంఖ కాహళ నాగస్వరాది వాద్యముల పల్కించిరి.

# ఏకాదశప్రకరణము

## విజయబహుమానము

నిశ్శబ్దమగుటతోడనే సార్వభౌముడు మహామంత్రివైపు చూచెను. మహామంత్రి ప్రధానవైతాళికుని కనుసన్న జేసెను. అప్పుడు తళుకు తళుకుమనుచుండ దీపలక్ష్మీలు, సర్వభూషణాలంకృతలై, హారతుల గొనివచ్చి, పాటలుపాడి మంగళము లిడిరి. ఇరువురు బాలికలు వెంటనే వివిధ సుమమాలల గొనివచ్చి యాతని మెడను వైచిరి.

అంత వీణానాదము మృదంగము వేణుస్వరము వినబడినవి. ఈవలావలనుండి సుందరులగు ఇరువది మంది బాలికలు నాట్యము చేయుచు విచ్చేసి సువర్ణశ్రీ కుమారుని చుట్టును "ధర్మవిజయుడను" అద్భుతాభినయ పూర్వకముగ నాట్యమొనరింప నారంభించిరి. ఆబాలికలలో సార్వభౌముని యిరువురి తనయలు, రాజకుటుంబములోని బాలికలు, సచివుల సేనానాయకుల కుమార్తెలు కోటీశ్వరులగు వ్యాపారుల పుత్రి హిమబిందును కలరు. ఆ నాట్యమునందు పాల్గొనను సత్కుల వంశ సంజాతలగు యువతీరత్నములకే అర్హత.

మంగళవాద్యములు మ్రోగుచుండును, దేవవేషమున నాట్యగురువు ప్రవేశించును.

"ఈ విజయి గీర్తింప
ఈ వియచ్చరులెల్ల
గగన పథములవచ్చి
కాంతితో ప్రసరించి
పూల వర్షము కురిసి
తేలుచున్నారదిగో
ఈ విజయి గీర్తింప"

బాలికలప్సరసలవలె నభినయించుచు,

"ఓయి యౌవనమూర్తి
ఓయి సుందరస్వామి
రావయ్య జయధామి
కావక్షోభవు కమ్ము"
నాట్యమాడుదురు.



నాట్యగురువు :

ఇంద్రుడిచ్చును కీర్తి
చంద్రుడిచ్చును విద్య
వాయుదేవుడు బలము
వరుణుడిచ్చును శక్తి.

బాలికలు నాట్యము సలుపుదురు.

నాట్యగురుని శిష్యుడు మారవేషమున,

"ఎవ్వడవోరీ మానవాధమా!
ఇవ్వనవాటిని నిలుచున్నావూ?

ఇరువురు శిష్యులు అహంకారుడు, స్వార్థుడు అను దేవతలుగా పాడుచు, తాండవింతురు.

"లోకము కొరకై సేవనుమానుము
లోకము నిన్నే కొలుచునురా!"

మారుడు :— మదుడ నేనే, శూరుడ నేనే
మాయలకంతకు నేతను నేనే
జగములన్నిటిని కాలనుత్రొక్కెద
జగములు నన్నే పూజలు సేయును
నన్ను కొలచినను వారికి వైభవము,
నాకము వారికి పాదాక్రాంతము,
ఛత్రచామరము సర్వరాజ్యములు
సర్వసంపదలు వారికె దక్కును
రారా! రారా! విజయరూపుడా!
రారా, వచ్చియు నన్ను కొలువురా!

కొందరు బాలికలు మారుని కొమరితలవలె దివ్యవేషముల ప్రవేశించి :—

జగంబంతట వీరహృదయులు
జిఘృక్షులుగా హూంకరింతురు,
మాదు సౌందర్యమును చూచి
మమ్మునే కామించివత్తురు. ...జగ

మన్మణికిసలయ భావావల్లి
మధురముగ నిను కౌగిలించును
విసముకాదిది పెదవిసుధరా
మొనవకా దేవుడై వెలిగెదవు.          ...జగం.

ఇంతలో రాజపుత్రికలు, హిమబిందు, రాజబంధు తనయలు, అష్టమార్గమార్తులవలె వేశించి నాట్యముచేయ నారంభించిరి.

చక్రవర్తి ప్రథమతనయ మాయాదేవి, విజ్ఞానదేవిగా, ద్వితీయపుత్రిక కాంతశ్రీ సత్యచింతనాదేవిగా, హిమబిందు, ధర్మకర్మదేవిగా, నాగబంధునిక ఉత్తమాశయదేవిగా, ఇతర బాలికలు తక్కిన వారుగా పాత్రధారులైరి.

విజ్ఞానదేవి :—

జన్మంబు మాయరా
జగమే క్షణికమురా
సర్వభోగములవియు
మాయలే ఎరుగరా!

సత్యచింతన :—

జగములో ఎవ్వరికి
సలుపకోయీ హింస
పాప కాంక్షలు నీకు
చూపవుర నిజపథము

ధర్మకర్మదేవి :— .

చేయుమయ్యా నీ కర్మ
చేయుమయ్యా నీ దారి
సత్ఫలితములు నీవి
సర్వ సౌఖ్యాలు నీవి!



ఉత్తమాశయదేవి :—

మూడు రత్నము లివిగో
చూడరా! వేడరా!
నాల్గు సత్యాలనే
నమ్మరా, ఎరుగరా!

సత్యవచనా దేవి :—

అనృత మాడబోకు
ఆనంద మొందరా
కానిచో మాటయే
కంటాన రా నీకు.

న్యాయజీవితదేవి :—

పరధనము వలదురా
పరకాంత వలదురా
వలదురా పరభూమి
వదలరా వాసనలు.

శీలాదేవి :

వలదు భోగము మనకు
వలదు యశములు మనకు
కలలైన జన్మాలు
గాధకథలు మనకు.

ఆనందదేవి :

ఏమి లేకుండుటే
ఎరుగు నిర్వాణంబు
కర్మ రహితంబైన
జన్మ రహితంబౌను
అదియు ఆనందమూ
అదియే నిర్వాణమ్ము.

హిమబిందు కుమారి సమవర్తి ఓడిపోయి రెండవవాడుగా మాత్రము వచ్చుట చూచి, వెలవెలపోయినది. ఆమె హృదయము క్రుంగిపోయినది.

పెన్నిధి పోగొట్టుకొనిన వానివలె కుంగిపోయిన తండ్రిని జూచి, యామె కన్నుల నీరుతిరిగినవి. ఇంతకు నా నూత్న బాలకుడెవ్వరో తన తండ్రికి దుఃఖకారణుడైనాడు. అతడు పిశాచి. రాక్షసుడు. ఆమె ఆబాలకుని ఇచ్ఛామాత్రమున నాశనముచేయ నూహించినది.

విజయము నందుటకుగాని, ఓడి పోవుటకుగాని ఆపందెమున ఎద్దులే కారణ మయినవు, సారథిని కారకునిగా ఎంచి నిందించువారిలో చారుగుప్తుడును చేరినాడు. ఇంతలో అతనికి జ్ఞానోదయమై, తన్ను తానే నిందించుకొనినాడు.

తానెన్నివేల పణములుపెట్టి కొనిననేమి? మహోత్తమ వృషభముల కనుగొనలేక పోయినాడు. ఆ చక్కని గిత్తలెచ్చటివి? ఏజాతివి. తన గోపాలురకు గోరక్షకులకు తెలియకుండ నెచ్చట పెరిగినవి? ఆలాంటి దివ్య వృషభములు లక్షపణముల మూల్యమిచ్చి కొన్న నేమి?

తన స్వప్నములు పటాపంచలైనవి. తాను కాశికునివలె పన్నిన మొదటిఎత్తే విచ్ఛిన్నమైనదేమి? ఇది అపశకునమా? ఛా, ఎన్నిసారులు ఓడిపోయి చాణక్యదేవుడు జయమందలేదు? అదిగో తన బంగారుప్రోవు, దివ్యమూర్తి, హిమబిందు తన్ను జూచి వెంగ పెట్టుకొన్నది!

అని అనుకొనుచు చారుగుప్తుడు కలకల నవ్వుచు, "మనమును విజయునకు కాన్కలీయవలె, హిమబిందూ! హర్షగోపా! అలంకారికుని, కుయవుని ఇటురమ్మను!" అని ఆజ్ఞయిచ్చినాడు.

కుయవానందుడు అద్భుతశిల్పి. అలంకారికుడు. ఆయన మందిరము వెనుకప్రక్కనుండి తుందుమనకువచ్చి, చారుగుప్తునితో రహస్యముగ మాటాడి అశ్వము నెక్కి పురమార్గమున వెడలి పోయెను.

తండ్రిగారి సంతోషము కనుంగొని హిమబిందు హర్షవదనయై నాట్యమున కలంకరించుకొన చక్రవర్తిమందిరము వెనుకనున్న నేపథ్య మందిరమునకు బోయెను.

అచ్చటనున్న యా చకోరాక్షుల–ఆ యిందీవర నేత్రల–ఆ కురంగ లోచనల– నడుమ హిమబిందు మహాపద్మనేత్రయై తారకామధ్య చంద్రబింబమువలె కాంతి లీనుచుండెను. రావి వనములోని వటవృక్షమువలె విడంబించుచుండెను. ఎంటట హిమబిందును సమవర్తి చూచుచునే యుండెను. ఆమె విచార వదనమునతనై సమవర్తి హృదయమును గృంగజేసి



నది. చేయిపెట్టి కలచివేసినది. తన దురదృష్టముచే తనపేనమామను అపజయము కలిగినది కదా! యని యాతడనుకొనెను. ఇంతలో చారుగుప్తుడును నవ్వెను. సమవర్తి మనస్సు చకితమై వికారమునందెను. పదునారేండ్ల ఎలప్రాయపు నాజవ్వని తన మనస్సంకల్పమునకు భావనేత్రమునకు ఇదివరకు గోచరముకాని అవయవ పొంకములతో అత్యద్భుత సౌందర్య రూపమున ఎదుట ప్రత్యక్షమైనప్పుడు అతనికి మరేమియు కన్పట్టలేదు. నాగస్వరమునూదు పాములవాని అభినయముల తదేకదీక్షతో చూచు సర్పమువలె నాతడు హిమబిందు గమనము చూపులతో ననుకరించుచుండెను.

చక్రవర్తి సింహాసన పాదము క్రోల విజయపీఠిక యమరింపఁబడినది. సువర్ణశ్రీకుమారుని నందధివసింపఁజేసి వశిష్టుడాశీర్వాదముచేసి సువర్ణాక్షతలఁ జల్లుటయు, సార్వభౌముడు, మహారాణియు, రాజబంధువులు శ్రీకృష్ణ సాతవాహనమహారాజు, మంత్రులు, సామంతులు, వేదపండితులు, శ్రమణకులు, ధర్మశంది యు నక్షతల జల్లిరి.

హిమబిందు కుమారి తన యపాంగ వీక్షణముల సువర్ణ శ్రీకుమారుని గాంచెను. ఆమె హృదయము ఏలకో దడదడ కొట్టుకొనెను.

ఇంతలో నొక వైతాళికుడు శంఖ మూదెను. అప్పుడా చంద్రరేఖలగు ముగుదలు నాట్యము చాలించి వారి వారి పీఠముల నధివసించిరి. చక్రవర్తి పీఠమునుండి లేచుటయు మహాసభయంతయు లేచెను. శకటాధ్యక్షుడగు మహాశ్రీ సువర్ణ శ్రీకుమారుని చేయిఁబట్టుకొని సార్వభౌముని కడకుఁ గొనిపోయెను. ఆ బాలకుడు చక్రవర్తికి మోకరించిలేచెను. ఒక సచివుడు ప్రతీహారి అందిచ్చు నవరత్న ఖచితమై బంగారు పనితనము కలిగి, కన్యాకుబ్జ లోహకారకులచే నిర్మింపబడి, పదునేను మడతల ముక్కచేపకలిగి పడునుకడ గాలిలో మాయమై, మొలవవైపు యవగింజ పరిమాణము కలిగి, జవ జవలాడు, తళుకు బెళుకులాడు, మహానిశిత కృపాణము, విక్రాంతులు మెచ్చుకొనుదానిని, పదునర హృదయముల కంపింపచేయుదానిని సార్వభౌముడు దుకూలవస్త్రములతో తాంబూలముతో బహుమాన మొసర్చెను. ఒక్కసారిగా భేరీ మృదంగాది వాద్యములు మ్రోయకొల్పబడినవి. మరలనిశ్శబ్దత జనింపగానే, యువరాజు ముందున కేతెంచి సువర్ణశ్రీకుమారుని మహాశ్రీ తనవెనుక తీసికొనిరా మందరముకడకు నూతుడు కొనివచ్చిన యొక కాంభోజాశ్వమును, వలనిదానిని, సన్నని ముట్టెకలదానిని, చామరమువంటి తోకగల దానిని, కెరటములవంటి జూలు కలదానిని, లేడికాళ్ళవలె పాదములు కలదానిని, పంచకళ్యాణములున్న దానిని, [illegible] సువర్ణశ్రీకుమారుని చేతికంది

చ్చెను. మరల దుందుభులు మ్రోగినవి. అప్పుడు మహారాణి పరిచారికవచ్చి, యా బాలుని సింహాసనముకడనున్న రాణికడకు గొనిపోయెను. అప్పుడా సాధ్వి పరమ పతివ్రత "ఇది నీ వివాహమునాడు నీభార్యకిమ్మని రత్నమంజూష నొకటి చెలికత్తెచే నిప్పించెను. సమస్త వాద్యములు ధ్వనించినవి.

ఇంతలో చారుగుప్తుడు ముందునకువచ్చి, ధర్మనంది చేయిబట్టి సువర్ణశ్రీకడకు గొనివచ్చి, "ధర్మనందులవారూ! నీ కుమారుడు సర్వతంత్ర స్వతంత్రుడయ్యా! మీ రిట్టిబాలుని కన్నందుకు ఎంతయు పూజ్యులు. ఈనాడు విజయమందిన మీ కుమారునకు, నేనును చిన్నకానుకను సమర్పించుచున్నాను." అనుచు హర్షగోపుడందిచ్చిన రత్నఖచిత సువర్ణపేటికను మూత తెరచి, సువర్ణశ్రీ హస్తముల నుంచినాడు.

అందు దంతపుటములపై చిత్రించిన పరమపవిత్ర వినయపిటక గ్రంథమున్నది.

సువర్ణశ్రీ ఆ పేటికను కన్నులకు శిరమునకు నద్దుకొని తనప్రక్కనున్న రాజసేవకున కందిచ్చెను.

ఉత్సవమంతయు నైనవెనుక సార్వభౌముడు మందిరముదిగి దుర్గోన్ముఖుడై రాజచింతాపర్ణ మారోహించెను.

విజయసింహుడను సువర్ణకుమారుని అలంకార భూయిష్టమగు అంబారీకల యొక మదగజముపై నధివసింపజేసి అనాగపిధానమున ధ్వజపతాకముల ఊరేగింపు బయలుదేరదీసిరి.



# ద్వాదశ ప్రకరణము

## బంధితుడు

శ్రోణనగమను గ్రామము వేంగివిషయమున గోదావరి నదీతీరమునకు మూడు గోరుతముల దూరమున నున్నది.

శ్రోణనగమను పేరు ఆ గ్రామము ప్రక్కనున్న ఎఱ్ఱటికొండవలన వచ్చినది. ఆగ్రామము ఫలవంతములగు భూములచే, తోటలచే నలరారుచు నూరు బ్రాహ్మణగడపయు, రెండువందల క్షత్రియులైన రెడ్ల గృహములచేతను, ముప్పది వణిజుల ఇండ్లతోను, రెండువందల యాబది చాకలి, మంగలి, కుమ్మరి, మొదలయిన శూద్రగేహములతోను నిండియున్నది.

నూరు బ్రాహ్మణగృహములలో, ఇరువదిఇండ్లు శిల్పబ్రాహ్మణుల ఇళ్ళు.

ఆ గ్రామములోని క్షత్రియులు, శూద్రులు, వణిజులు బౌద్ధదీక్షావలంబకులు. వైదికులు బ్రాహ్మణులు. శిల్పబ్రాహ్మణులు, ఈ వైదిక సంప్రదాయమునందున్నను, బౌద్ధసంప్రదాయమునందున్నను సమానగౌరవము భక్తియు గలవారు.

శ్రోణనగ గ్రామవాసులు చైత్రశుద్ధ పాడ్యమి దినమునందు గ్రామ శృంగాటక ప్రదేశమున, అశ్వత్థనింబ వృక్షసంశ్లేష స్థల శిలావేదికపైన కూడినారు. గ్రామణియును పూర్వసంవత్సర సంఘసభ్యులు వేదికపైన తాటియాకుల చాపలపై నధివసించిరి. తక్కినగల ప్రజలందరు వేదికచుట్టును ఆ నాల్గువీధుల మొగల నేలపై నచ్చటచ్చట గుంపులుగా, విడిగా కూర్చుండియుండిరి.

గ్రామపురోహితుడగు చంద్రస్వామి పంచాంగశ్రవణము నొనర్చెను.

ఆపై నాసంవత్సర గ్రామపాలకులగు గ్రామణిని, పంచసంఘసభ్యులను ఎన్నుకొనిరి. ఎన్నుకొనుట గ్రామవాసులు వారువారు సభ్యులు, వారు గ్రామణులు అని పెద్దగా చెప్పుదురు. తక్కినవారు వల్లెయని కేకలనిడుచుగాని, చేతులనెత్తిగాని తెల్పుదురు.

ఎన్నుకొనిన సభ్యులును, గ్రామణియు 'ధమ్మసుత్త' గ్రంథము చేతనుంచుకొని, ఆ సంవత్సరము తాము శ్రోణనగగ్రామమును ధర్మయుక్తముగా, ప్రజాహితముగా, పరిపాలింతుమనియు, తామా గ్రామప్రజలకు, భగవంతునికి సంపూర్ణ సేవకులమనియు వాగ్దానములు చేసిరి.



ఆ కొండ నెగవేటతోడనే గ్రామ పురోహితుడును తక్కుంగల బ్రాహ్మణులును వేదపనసలు చదివి, వారందరి నాశీర్వదించిరి. పుణ్యాంగనలు పాటలుపాడి హారతులిచ్చి తిలకములిడిరి. వారిపై అందరు అక్షతల జల్లిరి.

అచ్చటనుండి గ్రామోత్సవము లారంభమైనవి. ఆటలతో, పాటలతో, భజనలతో గ్రామమంతయు ఉప్పొంగిపోయినది.

ఆంధ్రదేశమున నం దాదినము ప్రతి గ్రామమునందట్టి ఉత్సవములు, ఎన్నికలు జరుగును

రాత్రియంతయు భగవత్కథా కాలక్షేపము జరిగినది. ఆ వెనుక యక్షనాటకము ప్రదర్శింపబడినది.

కాని పురోహితుడగు చంద్రస్వామి ఉత్సవములందేమియు పాల్గొనక, తలవాల్చికొని, యింటికి వెడలిపోయెను. చంద్రస్వామి, ఆపస్తంభసూత్రుడు, కృష్ణయజుర్వేది, భారద్వాజుడు. అతడు సాంగవేది, ధర్మశాస్త్రకోవిదుడు, ఇతిహాసికుడు, గుహ్యసూత్రోద్దండవిజ్ఞాని. చుట్టుపక్కల గ్రామముల, పురోహితులలో బ్రాహ్మణులలో తలమానికము వంటివాడు. మధ్యమ వర్చస్వి. బక్కపలుచని దేహపుష్టికలవాడు. విశాలవదనము కలవాడు. ధనువువలె రెండుగుప్పెట్లు తక్కువఎత్తుతో, సమనాసికతో, చిన్నకళ్ళతో, పొడుగాటి మెడతో, బుజములకంటు చెవులతో నాతడపర బృహస్పతివలె తేజరిల్లుచుండును.

ముప్పదియేండ్ల ఈడువాడయ్యును, బ్రహ్మచారియగుట నాతనిగృహము నొక ముదుసలి మేనయత్త నిర్వహించుచుండును.

ఇంటికిబోయి దొడ్డిలోనికిజని కూపమున నీరుతోడికొని స్నానమాచరించి, సాయంకాలమాహించి, మడివస్త్రముల గట్టుకొని యాతడు సంధ్యార్చన చేయ గడంగెను.

సంధ్యార్చన పూర్తిచేసికొని, యాతడు తన పూజాగృహము ప్రవేశించెను. మినుకు మినుకుమను అర్చనాదీపకాంతిలో మహావృషభమూర్తి, పదునాల్గంగుళముల తామ్రవిగ్రహమూర్తిగా ప్రత్యక్షమయ్యెను.

ఆ విగ్రహమునకు చంద్రస్వామి సాష్టాంగమిడి, ఏవియో ప్రార్థనాశ్లోకములు పఠించి, లేచి, పద్మాసనము వేసికొని తపస్సుచేయ ప్రారంభించెను.

మేనయత్త, ఫలహారముకొనిచ్చి, తలుపువేసికొనివచ్చి, ఇల్లంతయు సర్దుకొని దొడ్డిలో నులకమంచము వేసికొని, పక్కవేసికొని నిద్దురకూరినది.



గ్రామపు తలవరి మూడవ యామపుకేకలువేయుచు వీధిలో పోవునంతరకు చంద్రస్వామి జపదీక్షాపరుడై యుండెను. జపము పూర్తియగుటతోడనే, లేచి మహేశమూర్తి ఎదుట సమాలింగిత భూతలుడై లేచి, దొడ్డిలోనికి జనెను.

చుక్కలు మిన్కు మిన్కనుచుండెను. దూరమున పొలములలో, నక్కకూతలు వినవచ్చుచుండెను. దొడ్డిలోనున్న వృక్షములు, నిశ్చలములై దేవదేవుడగు నీశ్వరునిగూర్చి తపస్సు చేయుచున్నట్లుండెను.

అయ్యో భరతఖండమంతయు నాస్తికుల పాలయినదే. ఎక్కడి బుద్ధుడు! ఎక్కడి వేదములు. వేదములు పౌరుషేయములట. భగవంతుడే లేడట, బుద్ధుడే భగవంతుడట. అతడే తాను భగవంతుడనుకాను, భగవంతుడే లేడని చెప్పినాడు. కాని ఈభిక్కులు, బుద్ధుడే సర్వసృష్టిస్థితిలయకారకుడైన ఈశ్వరుడు అని అంటున్నారు. కొందరు బుద్ధునిమార్గమే అనుసరించెదరు. కొందరపరద్వైతలవాదులట. కొందరు శూన్యవాదులట. ఈ చార్వాకమతము మశూచిరోగమువలె భరతఖండమంతయు నల్లుకొనిపోయినది. భగవద్గీత, వేదాంతసూత్రములు ఎంత యుత్కృష్టగ్రంథములు! 'ధమ్మసూత్తము'లట ధర్మసూత్రములు కావా? జాతకగాథలట! త్రిపిటకములట! వేదములు, ఉపనిషత్తులు, బ్రాహ్మణములు, ధర్మశాస్త్రములు, ఉపవేదములు, అన్నియు నాశనమైనట్లేనా? వినాశకాలము వచ్చినది. ఏదియో మహాప్రళయము ఆవహిల్లబోవుచున్నది. చక్రవర్తులే బౌద్ధదీక్షాపరులైనప్పుడు ప్రజలగతి యేమి?

శూద్రులందరు బౌద్ధమతావలంబకులై బుద్ధ చైత్య పూజాపరులయ్యారు. ఏలాగు ఈ భయంకరస్థితిని మాయముచేయుట? గురుదేవులు అవతారమూర్తులు. వారే కల్కిఅవతార దేహులై ప్రత్యక్షమగుదురు గాక! అని ఆలోచించుకొనుచు ఇటు నటు నడుచుచుండెను.

ఎవరో వీధితలుపు తట్టినట్లయినది. "ఎవరునార"ని చంద్రస్వామి కేక వైచి ఇంటిలో నుండివచ్చి ముందటి వాకిలిదాటి, సింహద్వార కవాటము తెరచెను. కాగడాలతో కొందరు మనుష్యులు చంద్రస్వామికి కనుపించిరి.

కాగడాల వెలుతురున నూత్న గ్రామణియగు శ్వేతవుడు, గ్రామ సంఘసభ్యులు, ఇరువురు తలారులు, కొందరు సైనికులు నొక దళపతియు నాయనకు గోచరించిరి.

చంద్రస్వామి "ఏమిఇది?" యని ప్రశ్నించెను. శ్వేతవుడు "అయ్యా! నమస్కారములు, తాము చక్రవర్తిపై నేదియో దోషమెంచినారట. అందుకై తమ్ము బంధించి ధాన్యకటక నగరమునకు కొనితేవలయునని, మహాసైన్యాధికారి ముద్రవేసిన యాజ్ఞా భూర్జపత్రి

తుగొని, యీ దళవాయి వచ్చినారు. కాన మీరీక్షణముననే వీరివెంట పోవలయునని మే ముందరము ప్రార్థించుచున్నాము. మీరు మీవంటి ఉత్తమబ్రాహ్మణులను బంధింపకయే తీసికొనిపోదురు" అని మనవిచేసినాడు.

వృద్ధుడగు నా క్షత్రియుని అవలోకించి చంద్రస్వామి "చక్రవర్తిపై దోషమా! నేనా!" యని యనుకొనుచు "చక్రవర్తి శ్రీముఖ శాతవాహనుడు ధర్మమూర్తియే! ఎందరు బ్రాహ్మణుల కగ్రహారముల నాయన సమర్పింపలేదు. ఈ అఖండమహారాజ్యము సుభిక్షమై యా ధర్మరూపుని చల్లనిపరిపాలనములో సర్వసంపదల కాకరమై రామరాజ్యమును దలంపునకు దెచ్చుచున్నదే! వారిపైన నేను దోషమేమి యారోపించగలను?" యని పలికినాడు. అతని మోము వైవర్ణ్యమొందినది. విషాదమేఘము లాతని నావరించినవి.

ఆ దళవాయి చంద్రస్వామిని కనుగొని "స్వామీ! మీరనునది నిజమే! కాని, ఏదో పొరపాటు జరిగిఉండవచ్చును. తమ్ముగూర్చి వృద్ధశ్రోత్రీయులు ఘనముగా చెప్పియున్నారు. మీకు సకలసౌఖ్యముల నొనగూర్చును తీసుకొనిపోదుము. చక్రవర్తి జన్మదినోత్సవము లఖండముగ జరుగుచున్నవి. ఆ ఉత్సవములు పూర్తికాకుండగనె, ఈ అభియోగము విచారింపబడగలదు! ఇప్పుడు జాగుసేయక తాము తొందరగ బయలుదేరినచో, మనము తెల్లవారునప్పటికి ఏ మూడుక్రోశములైన పోగలము. తమకు అందలము సిద్ధముచేయించినాము. మేము అశ్వములపై ప్రయాణము చేయుదుము. ఒక వారములోననే మనము ధాన్యకటకనగరము చేరగలము" అని మనవిచేసి నమస్కరించెను.



# త్రయోదశ ప్రకరణము

## ప్రయాణము

ఆంధ్రదేశమునం దెల్లెడను మహారాజపథములు, ఘంటాపథములు, రాజమార్గములు, బాటలు, విరివిగా ఉన్నవి.

మహారాజమార్గము ఎనిమిది దండములువెడల్పు (దండము=8 అడుగులు, అడుగునకు 8 అంగుళములు) ఘంటాపథము ఆరుదండములవెడల్పు. ఈ బాటపై ఏనుగులు ప్రయాణము చేయును. రాజమార్గము నాలుగుదండములవెడల్పు. వీనినే రథ్యలనికూడ పిలుచుచుండిరి. సాధారణపు బాటలు అశ్వికపథమనియు, ఖరోష్ట్రపథమనియు, చక్రపథమనియు పేరులున్నవి. అశ్వికపథమునకు ప్రక్కనే మనుష్యపథమనియు, పాదపథమనియు, మనుష్యులు నడుచు పథమున్నది. ఈ పథము రెండు అరట్నులువెడల్పు (1 అరట్ని=రెండు అడుగులు) ఈ బాటపై మనుష్యులుమాత్రమే నడువవలసి ఉన్నది.

అన్నిపథములు సర్వకాలములయందు ఉపయోగపడునట్లు రాళ్ళతో సున్నముతో తరతరములుండునట్లుగా నిర్మింపబడినవి. గ్రామము గ్రామము కలుపు సాధారణపథములు గట్టిగా దిమ్మెసచేయబడి ఎడ్లబండ్ల, అశ్వముల యానమునకు ఉపయోగపడునట్లమరింపబడియుండెను.

ఈమార్గము లన్నిటికి పై అధికారి, సర్వమార్గాధ్యక్షుడను ఉత్తమోద్యోగి. సర్వమార్గములు సరియైనస్థితిలో నుంచుటయు, మార్గములప్రక్క అరుగోరుతముల కొకచోట జలగృహముల నుత్తమస్థితిలో నుంచుట, మార్గములవెంట సత్రములు, సత్రములలో భోజనగృహములు, పశువైద్యశాలలు, మనుష్య వైద్యగృహములు, మార్గము నందుచితరీతి జరుగుచున్నట్లు పర్యవేక్షణచేయుట ఇవి ఈ యధికారి విధ్యుక్త ధర్మములు.

ఆంధ్రదేశమున ధాన్యకటకమునుండి మహారాజపథములు నాలుగున్నవి. ఒకటి ధాన్యకటకమునుండి కృష్ణదాటి వాయువ్యమూలగాబోయి, సువర్ణపురము, నాగేంద్రనగరము, పర్వతనగరము, మహానగరములమీదుగా మంజీర్హా నదీతీరముననున్న దంతిపట్టణము చేరి, యచ్చటనుండి గౌతమీ నదీతీరముననున్న గంగాపట్టణమునకు బోయి యచ్చటనుండి ప్రతిష్ఠాననగరమునకు బోవును.

రెండవ మహారాజ పథము ధాన్యకటకమునుండి తూర్పుగా ఇంద్రకీలాద్రి పురమునకు బోయి అచ్చటనుండి ఆగ్నేయముగా కృష్ణానదీతీరమునే భట్టిప్రోలు పోయి, యచ్చటి కృష్ణదాటి ఘంటికాశాలకును అప్పురమునుండి శ్రీకాకులమునకును బోవును.

మూడవమార్గము ధాన్యకటకమునుండి దక్షిణముగా ధనదపురమునకు; నచ్చటనుండి ఉదయపర్వతమునకు, నచ్చటనుండి కాంచీపురమువరకు పోవును.

నాల్గవమార్గము ధాన్యకటకమునుండి ఈశాన్యముగా బోయి, వేంగిపురము, అచ్చటనుండి గౌతమీతీరముననున్న గోతీర్థము కడ గౌతమినిదాటి దక్షిణకోసల రాజధాని పిష్టపురమును పూర్వాంధ్రదేశము ముఖ్యనగరమగు శాతవాహనగుండము, ఆంధ్రగిరిపోయి; అటునుండి త్రికళింగ దేశము చేరును.

చంద్రస్వామిని శిబికారోహిని జేసి శాతవాహన సైన్య దళపతియు, సైనికులును రెండుదినములలో ఇంద్రకీలపర్వతము జేరినారు. ఇచ్చట కృష్ణానది ఇంద్రకీల పర్వతపంక్తి ఛేదించి, శిలామయమార్గమై, వేగవతియై సముద్రతీర భూములైన నాగ విషయమున ప్రవహించి ప్రాచీనాంధ్రప్రభువగు సుచంద్రుడు అవతారమూర్తియగు ఆంధ్రవిష్ణువు, పరిపాలించిన శ్రీకాకులపురమును పవిత్రము చేయుచు మూడు గోరుతముల దూరమున సముద్రమున జేరును. (ఇప్పుడు కృష్ణానది శ్రీకాకులపురమునుండి పది మైళ్ళు తూర్పుగా నది ఒండ్రచే వెనుకకు జరిగినది.)

చంద్రస్వామి ప్రయాణము చేయుచు గ్రామ గ్రామము జరుపు చక్రవర్తి జన్మదినోత్సవములు చూచుచుండినాడు.

ప్రజలందరు మేకలవంటివారు. వారికి నాడొక మార్గము మంచిదందురు. రేపు వేరొక పథము శుభమందురు. ఎల్లుండి మరియొక్కటందురు. వారికి నిలకడ ఎక్కడ. ఈరోజున వెఱ్ఱిభక్తితో నాగదేవులను కొల్తురు. గ్రామదేవతలకు నరపశువునుగూడ బలి యిచ్చుటకు సిద్ధమగుదురు. రేపు బౌద్ధసన్యాసి యొక్కడువచ్చి అహింస బోధించగనే, మాంసాహారము నైన మానుదురు. కాషాయాంబరముల ధరింతురు. నగల నూడ్చివైతురు. రెండు మూడు నూరుల సంవత్సరములలో ఈ పవిత్రభూమి యంతయు నీ చార్వాకమతమల్లుకొని పోయినదే యాగములు జనికిరావట! చైత్యములకుపూజలట.

మనుష్యుడు దేహము వదలినవెనుక నేమున్నది. ఘనమైన భౌతికేంద్రియములన్నియు పంచభూతముల లీనమైపోవలెగదా! ఉపనిషన్మత విరోధముగ బోధించి దేహము [illegible]



యని చెప్పుచు, నా దేహమున ఎముకయు, వెండ్రుకయు, దంతము, నఖముకూడ పూజ నొందవలయునని శాసించిన హీనుడు అర్హతుడట, బుద్ధుడట. చితిపై గట్టబడిన కట్టడము చైత్యమట, అర్థానికి పూజలట, అది త్రిరత్నముల నొకటియట!

అని యూహించుకొనుచు చంద్రస్వామి కృష్ణానదిలో ప్రాతఃకాలమునను గ్రుంకులిడి ఉదయ సంధ్యార్చన యొనర్చి, సూర్యునకర్ఘ్యమిడి, పురస్సరమున వంటయొనర్చుకొని, భుజించి, మరల శిబికనారోహించి బయలుదేరెను.

సాయంకాలమగునప్పటికి వారందరు ధాన్యకటకనగరము జేరిరి.

దళవాయికోట ఈవలనున్న ఉపసైన్యాధ్యక్షుల భవనమునకు గొనిపోయి, అచ్చటనుండి చంద్రస్వామిని కోటలోనికి గొనిపోయి ద్వితీయ ముహూర్తపు భేరీలు మ్రోగకముందె రాజ పురోహితాశ్రమమున ప్రవేశపెట్టెను.

ఆ మరునాడు కోటలో ప్రాడ్వివాక సభాభవనమున చంద్రస్వామి విచారణము ప్రారంభించిరి.

చంద్రస్వామికి అన్ని సౌఖ్యములు రాజపురోహితులొసగిరి. ఉదయాస్తమయముల గాయత్రి జపించుకొనువాడు. తపస్సు చేసికొనువాడు. భగవన్నామ స్మరణానంద ప్రేంఖణమగు గాన పరవశత్వ మందువాడు. చంద్రస్వామి భక్తుడు. భక్తులకు భయము, ప్రఫుల్ల పద్మసూనంబులకు దుర్గంధము, పండువెన్నెలలకు వేడిమి యొచ్చుట ?

పూర్వకాలమునందు న్యాయవిచారణ నేటికన్న వేయిమడంగు లుత్తమముగ నుండెడివి. దేశమునకంతకు మహారాజసభ ప్రధాన న్యాయస్థానము, దానివెనుక ప్రాడ్వివాకులసభ. స్థానీయ, ద్రోణముఖ, ఖార్వతిక, సంగ్రహణయనునవి పోనుపోను చిన్నవి. ఎనిమిదివందల గ్రామములకు ద్రోణముఖమును, రెండువందల గ్రామములకు ఖార్వతికము, సంగ్రహణము పది గ్రామములకు న్యాయస్థానములు; ఈ సభలు రెండువిధములు, ధర్మస్థీయము, కంటకశోధము అనునవి. ధర్మస్థీయము, వ్యావహారిక న్యాయములనే విచారించును. కంటకశోధ సభ వర్తకము, వృత్తి, రాజకీయము మొదలగు విషయముల ధర్మనిర్ణయమొనర్చును. ప్రాడ్వివాకునిసభ ధర్మస్థీయ కంటకశోధ విషయముల రెంటిని విచారించును. అపైన రాజే సభాపూర్ణుడై స్వయముగా న్యాయవిచారణ చేయును

నేడు చంద్రస్వామిని కోటలోనున్న ప్రాడ్వివాకునిసభకు గొనివచ్చిరి. రాజభటు లిరువురు కావలి తీసికొనివచ్చిరి. ప్రాతఃకాలోచిత కృత్యములు దీర్చికొనినపిమ్మట ఉదయము



క్షేమక్షామవి. ఈ పత్రములు, చంద్రస్వామి వ్రాసిన లేఖలు, ఆతనికి వచ్చిన లేఖలును " అని చెప్పి సభాధ్యక్షుడగు వా ప్రాతిస్వామునకు ఒక్కొక్క లేఖయు వినిపింప నక్కఱయున్న సభ్యులలో నొక్కరిని గోరెను.

ఆ లేఖాపత్రముల నెవరు సమర్పించిరో, ఏరు తెచ్చిరో తెలియదు.

" ఓ శీతాచలాసనా ! మేరునిశ్చల ! బుద్ధసన్యాసి చేసిన పాషండబోధలు ప్రజల మనస్సు మారుట చేసినను, మన ప్రయత్నములచే వారు దైవభక్తులగుచున్నారు. గ్రామములు గ్రామములు బౌద్ధమతమునుగొని దేవపూజల మట్టుపరచినవి. వేదగానములు లేవు, పురాణ శ్రవణములు లేవు. హరికథలు లేవు. మహేశ్వరార్చనలు కానరావు. మన దేవులందరును సర్వేశ్వరాత్ముడైన భగవంతుడును ఈ పాషండుని సేవకులట. మన్మథుడు మారపిశాచియై యా " దివ్యమూర్తి " ని భ్రమపెట్టబోయి యోడిపోయెనట. అట్టిది నేడు మరల వేద గానములు, భగవద్గ్రంథ పారాయణము వినుచున్నాము. కొన్ని యజ్ఞముల జరిపించినాము. ఇదివరకు మన చక్రవర్తి బౌద్ధుడు. ఆతనికి వేదమత సంప్రదాయము బోధింపకున్నచో నేమియు లాభములేదు. ఆతనికి పాషండమత బుద్ధి నశించి, దైవభక్తి కలుగునట్లు ప్రయత్నము చేయవలయును. "

ఇట్టి లేఖలు నాలుగయిదింటిని సభ్యుడొక్కడు చదివెను. ఇంకొక లేఖలో వివర " ఆంధ్రరాజ్యమున బౌద్ధరాజ్యమునశించి వేదరాజ్యము ప్రబలమగుగావుత " మని యుండెను. అనేక సాక్షులను విచారించిరి.

" చంద్రస్వామి వేదదేవతలను పూజించును. మహేశ్వరు డాతనికి అధిదేవుడు. " " గ్రామములో జరుగు ఉత్సవముల కతడు రాడు. పంచాయతిసభ్యుల నెన్నుకొను సందర్భమున చంద్రస్వామి ఏవిధమగు ఉత్సాహమును గనబరచలేదు. " " ఆతని యింటికి ఇతర దేశస్థులు క్రొత్తపురుషులు రాసాగిరి. అనేక రాజద్రోహ సభలాతని యింటియందు జరుగుచున్నవని మాకు తెలియవచ్చినది. " " నేను చంద్రస్వామిచే బ్రాహ్మణ మతదీక్ష గైకొంటిని. " " నాకు లేఖలిచ్చి వివిధగ్రామములకు పంపువారు. " అని పలువురు సాక్ష్య మిచ్చిరి. " ఒకనాడు వేంగీపురమున సంచరణుని యింట నిట్టిసభ జరిగెను. నేను చంద్రస్వామితోకూడ అక్కడకు పోతిని. నన్ను వారు సభలోనికి రానీయలేదు. కాని యొక్కసారి సభ్యావమతో నన్న నాకు మంజుశ్రీయను మాట వినబడినది " — అని చంద్రస్వామికి కొంతకాలముక్రిందట సేవకుడుగానున్న యొకడు సాక్ష్యమిచ్చెను.

" అయ్యా ! నేను మహేశ్వరానందుని సేవకుడను. రాజకుమార శ్రీ మంజుశ్రీని తస్కరించుకొని పోయినవారలలో నొకడు మహేశ్వరానందుడు. ఆతడు చంద్రస్వామి సంచరణుండు, సోమదత్తస్వామి మొదలగువారలతో గూడియుండుట చూచితిని. ఆతడు శ్రీ రాజకుమార మంజుశ్రీని ఎత్తుకొనిపోయెనని నాకెట్లు తెలిసెనన ఒకనాడు, అనగా యిప్పటికి నేమారు పదునాలుగు నెలల వెనుక, ఆతడును ఇంకొకడును " మంజుశ్రీని మేము చాలాసాంటిగా కొనిపోయినాము. అంచెల యేర్పాటు విచిత్రముగా చేసినారు మనవారు " అను అన్నమాటలు నాకు వినబడినవి, అటుతరువాత మాటలు వారు సన్నని గొంతుకలతో మాటాడినారు గాన వినంబడలేదు. " అని యింకొకడు తెలిపెను.

పిమ్మట చంద్రస్వామి యీవిధముగా సభ్యులదిక్కు మొగంబై చెప్పెను. " న్యాయాన్యాయ విచక్షణులగు సభ్యులకు నే నేమియు చెప్పనక్కఱలేకుండగనే నాయందు దోషమేమియు లేదని తెలియును. నా అంతరాత్మయందు ఆద్యంతరహితమై, భగవత్స్వరూపమై వెలుగు వేదములే ప్రమాణములని నమ్మకము. ముక్కోటి దేవతలును ఏకబ్రహ్మస్వరూపము కాన, ప్రజల దైవదూరులచేసి, మహాపాపము నెలకొల్పుచు, జంబూద్వీపమునే యమలోకమొనరించు నీ పాషండ బౌద్ధమతము నశియించి ధర్మస్వరూపమగు వేదమతము పునరుద్ధరింపబడవలెనని నా యాశయము. ఇప్పటికిని నాకోర్కె యదియ. వారణాసీపురము, తక్షశిల, పూర్వశైలము, ఉజ్జయిని మొదలగు ప్రసిద్ధప్రదేశముల తిరిగితిని. మూడు వేదముల నభ్యసించితిని. ఉపనిషత్తులు, ఇతిహాసములు మొదలగు సమస్త మహాగ్రంథము లెరిగితి. బౌద్ధమత రహస్యములు గ్రహించ పిటకములు, ధర్మసూత్రములు మొదలగు గ్రంథరాజములు పాటలీపుత్రమున అధ్యయించితిని. కాని బౌద్ధమతమున నాకు ద్వేషము మెండయినది. నా జన్మభూమి కేతెంచిన నాటగోలె నా దేశమున బౌద్ధమతము నాశనముచేసి వేదమతము పునరుద్ధరింప సంకల్పముదాల్చితిని. అందుకై అనేకులకు బోధ చేసితిని. అనేకులు బౌద్ధులను, వారి దీక్ష మాన్పించితిని. ప్రాయశ్చిత్తములు చేయించితిని. కాని అన్ని దేశములకన్న ఆంధ్రదేశమున బౌద్ధమతము లోతుగా వేళ్ళుబారి యున్నది. నాగవంశమువారు క్షత్రియులు. ఈ దీక్ష పుచ్చుకొనినవారు. కాన ప్రాబల్యముగాంచిన ఈ చార్వాక మతమును పెల్లగింప నారొక్కనిచే గాదు. అయినను నావంటివారు అనేకులు నాతో చేరినారు. మా యుద్యమము విజయముగాంచ సిద్ధమైయుండెను. చక్రవర్తికి ముందు మతదీక్ష యీయవలె, దానికై మా ప్రయత్నము. అంతియకాని మాకు సార్వభౌముని పై కుట్రలేల ? మహారాజును మతదీక్ష నొందించవలయునను కుట్రతప్ప ఇతరంపుకుట్రల నెరుగ.

"నేనున్న సభయందు శ్రీ రాజకుమార మంజుశ్రీ మాట వినబడెనని అసాక్షి తెలుపుచున్నాడు. "ఎవరయ్యా శ్రీ రాజకుమార మంజుశ్రీని తస్కరించుకొని పోయినది." అని యప్పుడు మేమనుకొంటిమి. అంతియ. ఇంకొకసాక్షి ఒకడు శ్రీ రాజకుమార మంజుశ్రీని ఎత్తుకొనిపోయినని యనుచున్నప్పుడు తాను వింటిననియు, దానితో నాకు స్నేహమున్నదనియు చెప్పినాడు. అది నిజముకాకొండు. అతడు శ్రీ రాజకుమారుని ఎత్తుకొనిపోయినవాడని మీకు తెలియగలదా? నా లేఖలలోగాని, నా నడతయందుగాని స్పష్టముగా శ్రీ రాజకుమార మంజుశ్రీని ఎత్తుకొనిపోయితినన్న నిర్ధారణయేది! ఎవరు ఎవరో! ఎవరిని ఎవరికో! అసలు అప్రత్యక్ష సాక్ష్యము పనికిరాదని ధర్మశాస్త్రము విధించియుంటలేదా? దైవాంశమగు శాతవాహనవంశముమీద బరులు దాడి వెడలగలరో? అయినచో వారెవరు?" అని చంద్రస్వామి చెదరని కన్నులతో, వన్నెగదురు ముఖముతో, గంభీరమగు అభినయముతో, తన నిర్దోషిత్వము నుపన్యసించెను. ఇంకొక యామము విచారణ జరిగినది.

శిక్ష విధించుటకుముందు ఇరువురు భిక్షులు లేచి "ధర్మచక్రమీ సభాస్థానమున విలసిల్లుగాక! భగవాన్ మహాశ్రమణకుడిందు ప్రత్యక్షమగుగాక." అని ప్రాకృతమున శ్లోకముల చదివిరి. ఇరువురు బ్రాహ్మణోత్తములప్పుడు ముందుకువచ్చి సభాసదుల హృదయమున సర్వవిశ్వము నిండియుండు భగవంతుడగు ఆదినారాయణుండు నిండియున్నాడు. కావున వారు ధర్మదేవతా స్వరూపులగుదురుగాక యని మంత్రములు చదివిరి.

ప్రాడ్వివాకుడు సభ్యుల యభిప్రాయ మడిగెను. అందరును ఈతడు నిర్దోషియని నమ్మజాలమని చెప్పిరి. అప్పుడు మహాపండితుడును, సకల మత ధర్మసారము నెరిగినవాడును, సత్యాన్వేషియునగు నా ప్రాడ్వివాకుడు చంద్రస్వామి నుద్దేశించి "ఓ బ్రాహ్మణోత్తమా! నీవు దోషివికావని చెప్పలేము. కాన నీకు ఒక సంవత్సరము కారాగృహవాసము విధించితిని. నీవు తప్పభిప్రాయము పడిన ధర్మము నన్ను శిక్షించుగావుత!" అని యాతడు లేచెను. సభవారందరు లేచి నిలుచుండిరి.

అంత తేజస్వియు, ధర్మదేవతా స్వరూపుడునగు ఒక భిక్షుకుడా సభాభవనము ప్రవేశించెను. అందరు నాయనకు సాష్టాంగ నమస్కార మాచరించిరి, ప్రాడ్వివాకుడు మోకరించి ఆయన పాదములంటి కన్నుల నద్దుకొనియెను. అంత నాతడు ప్రేమవంతములై, శక్తివంతములై, తేజోవంతములగు తన దృక్కుల నా ప్రాడ్వివాకునిపై బరపి "నాయనా! ఈ కుమారుడు నిర్దోషి కాన యీతని విడిచివేయుము" అని పలికెను. అంత వృద్ధుడగు నా ప్రాడ్వివాకుడు నా మహాపురుషునికడ మోకరించినవాడై "తండ్రీ నేను శిక్ష విధించితిని, తప్పించుటకు నా కధికారము లేదని తమకు తెలియదా" యని ప్రశ్నించెను.



ఆ తపస్వి నవ్వి "ఓయి! పండితకుమారా నాకు మాత్రము ధర్మశాస్త్రము తెలియదా? ఇదిగో సార్వభౌముని ఆజ్ఞాపత్రము" అని యొక తాటియాకుపత్రము తన కాషాయాంబరములనుండి తీసి యాతనికిచ్చెను. ప్రాడ్వివాకుడు దానిని కన్నులనద్దుకొని చూచి, లేచి, యిట్లు చదివెను. "ఏ దోషము లేదని కోణనగ గ్రామకాపురస్థుడగు చంద్రస్వామిని మేము విడిచి పుచ్చుచున్నాము. ఇయ్యది ప్రాడ్వివాకునకు మాముదల స్వహస్తాక్షరాంకిత శ్రీ గౌతమీపుత్ర శ్రీముఖ శాతవాహన మహాశ్రమణ శక 488 పరాభవ సం॥ర చైత్ర శు॥ సప్తమి" అని యున్నది.

అప్పుడు చంద్రస్వామి ముందుకురికి ఆ భిక్షుకునకు సాష్టాంగనమస్కార మొనర్చెను. అతని కన్నులలో నీరు నిండుకుండలై దొనదొన జారినవి.



# పంచదశ ప్రకరణము

## శృంగార విభావము

కామవిజయ నాట్యము, కామవిజయనాట్యమే అయినది. సువర్ణశ్రీ పరిపరివిధముల హిమబిందును ఆ నాట్యమునందు చూచినాడు!

ఏమది బాలిక ?

ఆమె ఇంత అద్భుతసుందరి! ఏమా సౌందర్యము. ఎక్కడిదీ సౌందర్యము. ఈ బాలిక స్వప్నమూర్తియా? నిజమా? ఏ మహాశిల్పి మలచినాడీవిగ్రహమును! ఏ చిత్రకారుడీరూపరేఖలు దిద్దినాడో!

ఆ ఆలోచనలా బాలకునికి కొంత వ్రీడాభావ మంకురింపజేసినవి. ఆ బాలికను చూడలేడు, చూడక ఉండలేడు. అతనికి తక్కిన ప్రపంచమంతయు మాయమైనది.

తనచుట్టును ఆ బాలికలు నృత్యము చేయుచు, పాడుచు, అభినయించుచు, నృత్తభంగికలగుచు, సౌందర్యనిధులై ఎన్నియో యపురూపవిధానముల ప్రదర్శించుచుండిరి.

ఆ ఒక్క బాలికయే నా నాట్యమాడుచున్నది! ఆమె మనోహర కాదంబనీమాలికవలె క్షణక్షణము సుందరాతిసుందరరూపముల మారుచున్నది. ఆమె పొల్కడలివాగులవలె భంగికామనోహర యగుచున్నది. ఆమె వివిధకరణనిమగ్నయై కుసుమమున మందమలయానిలమైనది. ఉదితస్వరరాగకంఠియై ఆ బాల శారదాకరచామీకరవిపంచి యైనది.

ఆమె భుజరేఖలు సువ్వనజారి అంగుళీరేఖలలో వికస్వరమైనవి. బాహుమూల పార్శ్వశోభారేఖలు వక్షోపకేసమున్నతసుందరాకృతులు తాల్చి, వక్రవతనావేగమున డిగ్గనుతిరిగి మధ్యదేశమున నించుక కాలూని, మలుపులై నితంబచక్రముల సుళ్ళుతిరిగి ప్రవహించి, ప్రవహించి పదరేఖల మొగ్గలు తొడిగినవి.

ఇది సౌందర్యమా, సౌందర్యనిధియా, సౌందర్య మూలకారణమా?

అతని హృదయవేగమునకు శ్రుతియైనది హిమబిందు బాలికాచరణ సువర్ణమంజీరవేగము. రెండువేగములు, మహారథచక్రవృత్తులై లయించినవి.

మహావైభవమున భద్రదంతావళమున సర్వమంగళ వాద్యములు మ్రోయ, ప్రజానేకసేవితుడై ఊరేగి, ఇంటికి చేరినాడు సువర్ణశ్రీకుమారుడు. కాని సుందరాతిసుందరమూర్తి ఆ బాలికయే అతని సమ్ముఖమున ప్రత్యక్షము.



తెల్లవారునప్పటికి ఇంటికి చేరిన సువర్ణశ్రీకుమారునికి శక్తిమతీదేవియు, నాగబంధునికా సిద్ధార్థినికలు, మహాలియు, పుణ్యాంగనలు, బంధుస్త్రీలు హారతులిచ్చి, దృష్టితీసి, లోనికి తీసికొనిపోయిరి.

సువర్ణశ్రీ తలితండ్రులకు, బంధుగులకు పాదాభివందన మాచరించెను.

రెండు దినములు గడచినవి.

ఆ బాలుని పరధ్యానము తలిదండ్రులనే యాశ్చర్యపూరితుల చేసినది.

ఎప్పుడును శిల్పగృహమునందో లేక వ్యాయామ ప్రదేశములందో కాలము గడుపువానికి బండిపందెముల గెలుపుచే నిప్పుడీ పరధ్యానమేమి? అని ధర్మనంది యనుకొనెను. ధర్మనంది భార్యనుజేరి; “అబ్బాయి అట్లున్నాడేమి? కారణమేమో నీకు తెలిసినదా?” యని బలుకరించెను. శక్తిమతీదేవి భర్తను కనుంగొని “నాకును ఆశ్చర్యము కలిగించుచున్నది ఏమయియుండును? భోజనము తిన్నగా చేయుటలేదు. ఏవియో రెండు మెతుకులు నోట వేసికొని ఎక్కడెక్కడనో తిరుగుచుండును” అని ప్రత్యుత్తరమిచ్చినది.

ధర్మ:—ఆరీతి పందెములయందు కనిపెట్టితివా?

శక్తి:—పందెము జరిగినప్పటినుండియే?

ధర్మ:—ఇప్పుడు చిరంజీవికి మానసపథమున మహోత్కృష్టమగు మార్పు జరుగుచున్నదని నా తలంపు. పందెములకుబోయి నెగ్గివచ్చినాడు. బాహుబలగర్వ మొందుట కంతకన్న ఏమికావలయును. దేహబలమునకు ఆయుధవ్యాపారమునకు దగ్గిరబంధుత్వము. యుద్ధములో కీర్తిగొనుట సురాపానము చేయునట్టిది. అనాడనేక బిరుదావళులు ధరించిన మేటిమగలగు శూరుల చూచినాడు. తానును యోధుడైనాడు. ఆసమయమునందు వారివలె యుద్ధమున పేరుమోసి మహాసైన్యాధ్యక్షులలో నొకడేల కాకూడదు? ఈ ఆలోచన లోకపాయయై ప్రవహింప వీనికన్నిటికతీతమై, పవిత్రమై, సత్యప్రయత్నములలో నొకటై, పరమాత్ముడగు బుద్ధదేవునకు ప్రియమై, వెలుగునది, అర్హతమార్గములలో నొకటియైనది, తానుచేయు శిల్పపుపని! ఈ రెంటికిని ఇప్పుడు సమరము జరుగుచున్నది. అబ్బాయిని మారదేవుడు పరీక్షించుచున్నాడు.

ధర్మనంది ఇట్లు మాట్లాడుచు నిమీలితలోచనుడై ఒకలిప్తకాలము సర్వము మరచిపోయెను.

శక్తి:—తాను మట్టిపనియందు మేరకుండుట వ్యాయామమా ?

ధర్మ:—[కన్నులు తెరచి] పెట్టిదానా! ఎవరి యుద్ధమున వారు జయమందవలయును. "తేజోమూర్తి" కెవ్వరు సహాయము చేసినారు? చైత్యముపై నేను రచించిన మారుని కథ శిల్పము చూడలేదా? అబ్బాయికి రెండుమార్గములిప్పుడు గోచరమైనవి. ఒకటి ప్రాపంచికము: పూలవాసనలు, పిల్లతేటి గానములు, నీలగిరుల రూపసౌందర్యములు, కాంతామనోహర వాక్యములు, సువర్ణముల తళుకులు, నాట్యముల ధిమికిటలు, నవ్వులు, హాస్యములు సుడిగాలిరీతి, సుడిగుండమువలె మనస్సును భ్రమింపజేయును. ఇంకొకటి: నిమీలిత నేత్రములు, ఆరాధనలు, ఉపవాసములు, దానములు, యాత్రలు, భిక్షులతోడి సాంగత్యము. ఇది చిత్రసమాధినూర్చును. బిడ్డడీ రెంటిలో దేనిని వరించునో?

శక్తి:—ఎవరైన చేయూత నీయకపోయిన, అబ్బాయిదని యేమగును?

ధర్మ:—నీవు చదువుకున్న దానవు. ఎవరికర్మకు వారే కర్తలు. ఈమాత్రము తెలియదా? దశకుశలములు, అష్టమార్గములు మానవుడాచరించునప్పుడు, అరిషడ్వర్గముల జయించుటకు సమర్థుడు కానిచో ఎవరును సహాయము చేయజాలరు. కాముడు, మోహుడు మనుష్యానవ శీలగ నేను బానిసగ జేసికొందురు. చిరంజీవి యీ యుద్ధమున పందెములలోవలె విజయము గాంచెనా మనతులము తరించును—లేదా—?

శక్తి:—మనమిందు చేయదగినది లేదంటురా?

ధర్మ:—భగవంతుని ప్రార్థించుటయే? ఆ "విజ్ఞానస్వరూపుడు" బోధిసత్వుడై యుండియు భక్తుల సంరక్షింపలేడు?

సాయంకాలము క్రీడాశైలమున తల్లియు కుమార్తెలిరువురు కలిసికొనినపుడు శక్తిమతీదేవి నాగబంధునికను గాంచి "అమ్మాయి అన్నయ్యను పలుకరించినావా? ఏమట్లు ఆకులిత వదనముతో నున్నాడో కనుగొన్నావా?" అని యడిగెను.

నాగ:—అమ్మా! నేను మాట్లాడుటకు పోయినప్పుడు మాతో డను యథాప్రకారము పలుకలేదు. పరధ్యానము! నాల్గయిదుసారులు ఏదిదియో చిత్రము లిఖించబోయినాడు. అది తానను కొన్నట్లు లేదనియో, ఏమో చెరిపివేసి ఫలక మొంకమూల పారవేసినాడు.

సిద్ధార్థినిక:—అమ్మా! ఒక్క బొమ్మలు వేయుటే కాదు. విగ్రహముకూడా చెక్కుట ప్రారంభించినాడు. ఒక బాలికరూపమే! కాని తృప్తిగూర్పక కాబోలు. ఆ విగ్రహమును ఉలిసుదలతో రేయి ముక్కలు చేసినాడు.

ఇంతలో మహాలి తన చీరకుచ్చుల మడతలలో ఒక విగ్రహ శిరస్సు గొనివచ్చి శక్తిమతీదేవికిచ్చి చిరునవ్వు నవ్వెను. నాగబంధునిక యా శకలమును తేరిపారజూచి "అమ్మా యీ ముఖము ఎవరిదో నేను చూచినట్లున్నది! ఎవరు చెప్పుమా?" యని తలపోయుచుండ



అప్పుడు తొమ్మిదేండ్ల బాలికయగు సిద్ధార్థినిక ఒక్క గంతువేసి చప్పట్లు గొట్టుచు "ఆ నాకు తెలిసింది! మీరు చెప్పుకొనండి!" అని కిలకిల నవ్వెను.

శక్తిమతీదేవి యా రాతితలను తదేకదృష్టితో తిలకించి "యీ ముఖము నా బాల్య స్నేహితురాలగు ప్రజాపతిమిత్ర మోమువలె నున్నది" యనెను. అప్పుడు మహాలి "ఆ తెలిసినదమ్మా తెలిసినది. చారుగుప్త కోటీశ్వరునితనయ, ప్రజాపతిమిత్ర కొమరిత, హిమబిందు కుమారిక మోము! మొన్న ఉత్సవమునాడు అబ్బాయికి బహుమానమిచ్చినప్పుడు నాట్య మాడిన బాలలలో హిమబిందుకుమారిక యొక్కతె!" అని సాభిప్రాయము నవ్వుచు నామె యేమిదియో చెప్పబోవుచుండ, సిద్ధార్థినిక మోము చిన్నబుచ్చుకొని కన్నుల నీరు తిరుగ "నన్ను చెప్పనీయక మీరందరు చెప్పుకొనుచున్నారు. ఈ మహాలి మంచిదికాదు. మీ ఎవరి జత ఉండను" అని మూతి ముడుచుకొని గబగబ పరుగిడిపోయెను.

ఆమె యట్లు శిల్పమందిరములున్న తోటలోనికి బోయి యొక కేళాకూళికడ పూల వృక్షములున్నచోట పండుకొని వెక్కివెక్కి ఏడ్వసాగెను. ఇంతలో సువర్ణశ్రీకుమారు డామెను దాసి, చెల్లెలనెత్తి తనయొడి జేర్చుకొని, చెక్కిలి ముద్దుగొనుచు కంట నీరు తుడిచి బుజ్జగింపుచు "ఏమమ్మా చిట్టితల్లీ! ఏమిటి యీ ఏడుపు? అమ్మ కోపము చేసినదా? లేక అక్క కలతపెట్టినదా?" అని ప్రశ్నించెను. సిద్ధార్థినిక మరియు వెక్కివెక్కి యేడువసాగెను. అన్నగారు పరిపరివిధముల బ్రతిమాలి ఎత్తుకొని తీసికొనిపోయి తాను తన చెల్లెలికై చెక్కిన యొక బాలకుని బొమ్మను, ముత్యాల యుంగట్టుదానిని, కిలకిలనవ్వు మోముగలిగిన ప్రతిమను ఆమెకిచ్చి "ఇదిగో మీ అబ్బాయిబొమ్మ. అదుగో ఏడవకు. అక్కకు, ఎవ్వరికి ఈయకు" అని యిచ్చెను. తోడనే కళ్ళనీళ్ళు తుడుచుకొనుచు ఆ బాల చిరునవ్వు నవ్వుచు "ఈ అబ్బాయిని అక్కయ్యను, అమ్మను ఎత్తుకోనివ్వనులే. మహాలికి కొంచెమైనా చూపించను. నేనే నీళ్ళు పోసుకొంటాను. నగలు పెట్టుకొంటాను. మరే అన్నా! నీవు చెక్కిన బొమ్మ తలకాయ, వాళ్ళమ్మాయి హిమబిందువని నేను చెప్పబోతుంటే వాళ్ళే చెప్పుకొని నాకు కోపం తెప్పించినారు!" అని యా చిట్టిబాలిక అన్నగారికి చెప్పెను. సువర్ణశ్రీకుమారు డామాట వినుచునే ఉలిక్కిపడెను. చెల్లెలిని సాగనంపి అక్కడనున్న యొక రత్నకంబళిపై దభీలున బడి యదేవిధముగ నాలోచింపసాగెను. ఉజ్జ్వల సువర్ణవర్ణుడగు నాతని కపోలము లెఱ్ఱబారెను.

# షోడశ ప్రకరణము

## హృదయకుసుమపరాగము

ఆ బాలిక హిమబిందు. ఎంతచక్కని పేరు. స్నిగ్ధశ్వేత కాంతిభాసమాన హిమబిందువా ఆ బాల. ఆ తెలుపు ఎరుపులు ఔత్తరాహికములు. ఆమెలో గాంధారరక్తమున్నది. రోమక, యవనజాతులు ఆర్యరక్త సమ్మిశ్రితములై మహోత్తమమూర్తి తాల్చినట్లున్నవి. ఎవ్వరా బాలిక? ఏ రాజతనయ? ఏనందనవనమున అవతరించినదో, ఎంత హొయలున్నది యామె కదలికలలో! ఆమె అద్భుతనాట్య నిమగ్నయయ్యె నన్నంత తీక్ష్ణముగ గమనించినదేల? సాకూతములగు ఆమె చూపుల కొన్నింట ఎన్నియో ప్రశ్నలున్నవి.

ఆమె కన్నులు! ఏ శిల్పియైన వానిని విన్యసింపగలడా? ఆ కన్నులలో వేయి తారకలకాంతులు, ఆమె కన్ను రెప్పలలో పదివేల గగననీలాలు, ఆ బొమలలో వేయి యమునానదీ ప్రవాహధారలు, ఆమె అపాంగములలో లక్ష కల్లోల నర్తనములు, ఆమె భ్రూభంగిమలలో కోటి ఇంద్రధనువులున్నవి. ఆమె కనీనికలలో మహాపద్మనీలపథములున్నవి. ఆమె ఎవరు?

తన శిల్పమ్మున నా బాలిక మోమును వారెట్లు గ్రహించిరి. తనకు పోలిక లేనట్లే కనబడునే! ఆమె రూపమును తన అల్పశక్తి కళగట్టింపగలదా? తన కళానైపుణ్యము చాలు గలదా? అయోఘనము శిల్పిబాలిక చేతికి రెండుమూడుసార్లు దెబ్బలు తగిలినవి. టంకము చేతపట్టినప్పుడు చేయి వణికిపోయినది. తద్రూపభావనామాత్రమున తనలో నింతటి వివశత్వము నకు కారణమేమి? తనవారితో కూర్చుండి సల్లాపము లాడలేదు, తానొంటిగ మండుటెండ వేసవిని మిట్టమధ్యాహ్నమున గాలిలేని సమయమున నిద్రయు బట్టదు. [illegible] యేపనియు చేయజాలదు. తన మానసపథమందు గాలివాన లేవైన రాబోవుచున్నవా? నిశ్చల, శీతల మందానిలసారము లెక్కడున్నవి? గంటలకొలది ఇటునటు తిరిగినను తన హృదయమునకు శాంతి కలుగదు. గ్రంథముల చదువుటకు మనస్సుపోదు. పెద్దచెల్లెలి వీణాగాన మాలకించుచు ఆ స్వనములో కరగిపోవు మనోహరగాన మొనరించునది నందినముగు అలవాటు తనకు నేడు అసహ్యమయినది? తన ఆలోచనలు వాయుద్వంద్వపాతమునై పోయినవి.

ఇంతకు ఎవ్వరా బాలిక? [illegible] ఏమిటంత మనసు [illegible]? ఏమనుకొనగలదు.



ఆతడు కృష్ణ ఒడ్డున కూర్చుండి, మధుమాస విరహాశ్రుశయనగు నా ధవళబాలిక నిట్టూర్పుల నాలించుచు, దూరముకొండల గమనింపుచు, నదీగర్భమునందెల్ల నావరించియున్న ఇసుక తిన్నెల చూపులేని చూపులతో చూచుచు, హిమబిందునే తలపోయుచు కూరుచుండెను.

ఇంతలో నాగబంధుని వచ్చి యన్నగారి కన్నులు మూసెను. సువర్ణశ్రీ 'నాగా! చేతులు తీయవే?' యని విసుగుకొనెను.

“అవును! హిమబిందులో లోకమైపోయిన అన్నగారికి, చెల్లెలంటే విసుగుకాదా మరి?”

“ఏమిమాటలవి నాగా! ఇంతట చాలింపు.”

“అదుగో! కోపంకూడా వస్తున్నదన్నాయికి. అంత ఉలుకయితే పోనీ మాటలాడనులే.”

“ఆ ఏమిమాటలే ఏదో విసుగున అన్నానే తల్లీ! ఇంతలో కోపమా?”

“నాకు ఎంతకోపముగా ఉన్నదనిన? నా స్నేహితురాలు, చారుగుప్తులవారి కొమార్తె, తల్లిలేని పిల్ల, ముక్తావళీదేవి మనుమరాలు అయిన హిమబిందును గూర్చి ఇన్నాళ్ళకా మా అన్న తెలుసుకొనుటకు ప్రయత్నించవలెనుకొనుట అని మా అన్నను, ఆ హిమబిందు తలలోని పూలతో పరుగెత్తి పారిపోవునట్లు కొట్టవలెనని ఉన్నది.”

“ముక్తావళీదేవికి అంత స్వచ్ఛదేహం ఉన్నది. ఆమె తెలుగుజాతి ఆడుబిడ్డయేనా చెల్లీ!”

“ముక్తావళీదేవి యావనవంశజాత అన్నా! ఆమె పోలిక హిమబిందు. హిమబిందు తన అమ్మమ్మకన్న ఎక్కువ స్వచ్ఛమైన శరీరము, అద్భుతమైన అందమును కలది. ఆమె హృదయమును మా అన్న దొంగిలించినట్లు నా అనుమానము ఎక్కువౌచున్నది. అట్లాంటి దొంగతనమునకు శాసనములో దేశాంతరము విధింపబడుచున్నది, ఓ దొంగ అన్నగారూ!”

“ఏమిటి నాగా! నీకు నిజముగా పిచ్చి ఎత్తినది. కులవైద్యులు, ప్రఖ్యాతులు, అపర ధన్వంతరులు, ఆనందులవారు నీకు మందు త్వరగా ప్రారంభింతురు. [illegible] వారికి [illegible] వార్త పంపవలసి ఉన్నది.”

“మా అన్నగారికే మతిభ్రమణము కలిగినది. ఉత్తమ [illegible] మా అన్న యావనవంశజారాలను ప్రేమించుటేమి?”

“[illegible]!”

[illegible]

“ చెల్లీ ! నీవును, హిమబిందువు కలసి చదువుకొనినారా ? ”

“ ఆమెయు, నేనును కలసి చదువుకొన్నాము. ఆమె కోటీశు తనయ ! ”

“ ఆమెలో భారతీయజాతి సుగుణములు, యవ్వనజాతి సుగుణములు మేలు కలయిక పొందినట్లున్నదే ! ”

“ అన్నా ! బాలికలలో సామ్రాజ్ఞిని నా అన్న వరించవలె ! జయములలో అఖండ విజయము నందవలె. ఆ దినమున నీచుట్టు మేమంగరము నాట్యము సలిపినప్పుడు, హిమబిందు నీవంక అట్లు తదేకదీక్షను చూపులుసరపినదేమి ? చారుగుప్తుని బండిని సమవర్తి శాతవాహన సేవాని తోలినారు. ఆయన నీవల్ల ఓడిపోయినారు ! అందుకని ఆమె కొంచెము కించపడి వడికూడ సుమా ! ”

“ ఆమె దేవలోకమునుండి దిగివచ్చిన ఇంద్రాణివలె నేదటే తల్లీ ! ”

“ నీవు ఇంద్రునివలె లేవా ఏమి ? ”

“ సరి ! సరి ! అదేమిమాటలే ? ”

ఇంతలో సిద్ధార్థినిక వారిరువురు కూరుచున్న నల్లరాతి బండకడకు పరుగునవచ్చి వగర్చుచు, నవ్వుచు, “ అన్నా ! వచ్చినది ! వచ్చినది ! ” అని అరచెను.

సువర్ణ:—ఎవరు తల్లీ ?

సిద్ధార్థినిక:—హిమబిందు ! హిమబిందే !

నాగబంధునిక:—హిమబిందా ! హిమబిందు ఎందుకు వచ్చునే వెఱ్ఱితల్లీ !

సిద్ధా:—నేను వెఱ్ఱితల్లిని, నీవు తెలివిగల తల్లివి ! పోనీలెండి. నా మాట ఎవ్వరును ఎప్పుడును నమ్మరు.

సువర్ణశ్రీ చిన్న చెల్లెలిని దగ్గరకు తీసుకొని, “ ఓసి బంగారుతల్లీ ! అక్క చిందితల్లీ ! కాదు ! వెఱ్ఱితల్లీ ! నీమాటే నిజము ! నాగా ! నీకొరకే వచ్చిఉంటుంది. వెంటనే పో ! ”

నాగబంధునిక చటుక్కున పరువిడి పారిపోయినది.

సువర్ణశ్రీ గుండియలు గతులుతప్పి నడచినవి. ఏమది, ఆ దివ్యబాలిక ఎందుకువచ్చినది ? కారణము ! ఆ దేవీమూర్తి తన యింటికే వచ్చినదా ? తన యిల్లు పవిత్రమైనదా ? ఓహో ఆమె వచ్చునా ? నిజమా ?

“ అన్నా ! హిమబిందు, ఆమె అమ్మమ్మ ముక్తావళీదేవి వచ్చినారు. నాగాన్నే, హిమబిందు అక్కడ అడిగినది. నాయనగారి బొమ్మలన్నియు చూచుచున్నారు. నన్ను



కొంచె మటుతీసుకొనిపోయి, ‘ మీ అన్నగారు బొమ్మలు చెక్కునా ? ’ యని యడిగినది అన్నా ! ”

“ అలాగునా చెల్లీ ? ”

“ అవును, నీ చెక్కడాలు చూచునట అన్నా ! నాతోనే చెప్పినది. రా ! నీ మందిరానికి పోదమురా ! అన్నా ! ”

సిద్ధార్థినిక అన్నను చేయిబట్టి లాగినది. అతనికి ఏదియో భయము, ఏదియో ఆశ, ఏదియో శ్రమ కలిగినవి.

“ చెల్లీ ! నీవు పో ! నేను వచ్చెదనులే ! ”

“ అన్నా నీవు త్వరగా రావాలి ? ”

సిద్ధార్థినిక వెడలిపోవగనే, రేఖారహితమైన యాలోచనలు, మూర్తిరహితములగు స్వప్నములు, అతని హృదయమున జన్మించుచున్నవి, మాయమగుచున్నవి.

అతడు చేయలేని బొమ్మలు, పాడలేని గీతాలు దూరాకాశనీల పథాలలో మేఘములై మంద మందగతిపోయి మాయమైనవి.



# సప్తదశ ప్రకరణము

## హేమబిందు కుమారి

సమదర్శి శాతవాహనుడు మహారాజు వంశమువాడు. సమదర్శి తండ్రి ప్రియదర్శి శాతవాహనుడు. అతడు శ్రీముఖశాతవాహనుని తండ్రియగు అభయబాహుశాతవాహనుని పిన తండ్రి కుమారుడు.

శాతవాహనులు ప్రాచీనకాలమందున నే ఆంధ్రదేశానికి ఉత్తరమునుండి ప్రయాణమై వచ్చిన బ్రాహ్మణులు. భారతయుద్ధమైన వెనుక, దేశమున అనార్యజాతులవారైన నాగులు, రాక్షసులు, యక్షులు, కిన్నరులు, కింపురుషులు, వానరులు, పిశాచులు, గుహ్యకులు మొదలగు వారు విజృంభించి రాజ్యములెన్నియో యాక్రమించుకొనిరి. ఆ దినములలో ఆర్యసంప్రదాయములపై అసహ్యత జనించి, సాంఘిక దురాచారాలను ఖండించి, సంఘ సంప్రదాయములయందు ఎందరో మార్పులు తెచ్చినారు. అట్టివారిలో విశ్వామిత్ర సంతతివారైన ఆంధ్ర బ్రాహ్మణులును, చంద్రవంశ క్షత్రియులు, వైశ్యులు, శూద్రులు మొదలగువారున్నారు. వారందరు శైవపూజాధురంధరులు,

ఇట్లు కొన్ని సంవత్సరములు గడచిన వెనుక పరీక్షిన్మహారాజు రాజ్యము వచ్చినది. ఆయన పూర్వసంప్రదాయ గాఢాభిమాని. పరీక్షిత్తు చండవిక్రముడై విజృంభించి, అనార్యుల భూయిష్ఠములగు రాజ్యముల నాశనము చేసి, వైదికాచారము పునరుద్ధరించి అనేకాశ్రమములలో యజ్ఞయాగాది క్రతువుల నొనరింపజేసి, శాసనొనరించి, నాగాదిజాతుల పొగరణచివైచెను.

అతని బాధల భరింపలేక ఆంధ్రులు కళింగదేశము వలసవచ్చిరి. ఆర్యజాతులవారైనను వారు అనార్యులైనందున పరీక్షిత్తు వారిపై దండయాత్రసలిపి, ఓడించి, దేశమునుండి తరిమివేసెను.

తూర్పు సముద్రతీరమున ఇదివరకే సింధునదీ ప్రాంతమునుండి రామాయణకాలము ముందుననే వలస వచ్చియున్నవారు అసురులు. రాజ్యములు, ఆశ్రమములు స్థాపించి, ఆ తూర్పుతీరాననే అఖండపట్టణములు నిర్మించుకొని నాగరికత వృద్ధిచేసికొని యుండిరి.

అసురులు హిమవన్నగ ప్రాంతీయులైన ప్రథమార్యులు. వారు హిమవన్నగజములైన సింధు, గంగా, యమునా నదీతీరముల మహానగరములు నిర్మించుకొని అచ్చటనున్న వచ్చి పాలనచేయుచుండిరి, పరమార్థప్రకులను దక్షిణదేశములకు తరిమి, యా ప్రదేశముల లక్ష్మీ వలనము గావించిరి.



ఈ అసురులను ఆర్యావర్త హిమశైలీయులైన ఆర్యులు దక్షిణమునకు వలసవచ్చి, అచ్చట ఇదివరకే రాజ్యములు స్థాపించియున్న అసురులతో ఘోరయుద్ధములు చేసి, వారిని సింధు నదీతీరమునుండి తరిమివేసిరి. అసురులక్కడనుండి కదలి మెసపొటేమియా, ఈజిప్టులకు, భరతఖండ ప్రాక్పశ్చిమ దక్షిణ తీరములకు సముద్రయానము చేయుచునో, తీరములవెంట ప్రయాణము చేయుచునో వచ్చి వలసలుపోయి రాజ్యము లేర్పరచుకొనిరి.

పరీక్షిత్తుకాలమున తూర్పుతీరములకు వచ్చిన ఆంధ్రార్యులు అదివరకే పూర్వసముద్ర తీరమున వాసముచేయు అసురార్యులతో యుద్ధములుసలిపి, అసురరాజులనిర్జించి తమ రాజులనచ్చట సింహాసనముల నెక్కించిరి. ఆ కాలముననే ఆంధ్రవిష్ణువుగాథ జన్మించినది.

ఆంధ్రవిష్ణువు వంశమువారే ఆంధ్రశాతవాహనులు. ఈ గాథయే బృహత్కథయందు వర్ణితమైనది.

ఆ శాతవాహనవంశమందు ప్రియదర్శి తన పెదతండ్రి కొమరుడును, చక్రవర్తియునగు అభయబాహునకు దక్షిణబాహువై, చండవిక్రముడై, మహాసేనాధిపతియై ఆంధ్రరాజ్యము పడమటి తీరమునుండి ఉత్తరము ఘూర్జరమువరకు గొనిపోయెను. మాళవము జయించి ఆంధ్రరాజ్యములో చేర్చెను. అభయబాహువు ప్రతిష్ఠానమున ప్రియదర్శిశాతవాహనునే తనకు ప్రతినిధిగ నుంచెను.

ఆ దినములలో కోటీశ్వరుడగు వినయగుప్తుడు అభయబాహుసార్వభౌమునకు వామహస్తమై, హృదయమై, తన వైభవమంతయు చక్రవర్తికి దాసిని జేసెను. అతడు ప్రియదర్శి శాతవాహనుని పెక్కువగా ప్రేమించి అతని జైత్రయాత్రలలో సర్వవిధముల బాసటగా నుండెను.

ప్రియదర్శిని ప్రేమించుటలో తృప్తిపడక తన కొమార్తె అమృతలతనా వీరపుంగవునకు కన్యాదాన మొసంగెను.

సమదర్శిశాతవాహనుడు ప్రియదర్శికి ఏకపుత్రుడు. అమృతలతాదేవి కుమారునియందు గాఢప్రేమతో, మాళవయుద్ధమందు వీరస్వర్గమందిన ప్రాణేశుడగు ప్రియదర్శిని తలంచుకొని ఆంధ్రసైన్యమునందు చేర నుతుడనుజ్ఞ వేడినప్పుడు నిష్కృతితో సంగ నిరాకరించినది.

సైన్యమునందు చేర సమదర్శి జనని యనుమతినొంద ఎన్నివిధములైన ప్రయత్నము లొనరించెను గాని యవి విఫలములై పోయెను.

సమదర్శికి పదునేడవ ఏడు వచ్చినది. ఆ ఏడు మహాలయపక్షములకు అన్నగార

భవనమ్మునకు కుమారునితో బోయిన అమృతలతాదేవికి స్వప్నమందు ప్రియదర్శి ప్రత్యక్షమై, “ఆర్యేశ్వరీ! నా పేరునకు నా జాతికి శాతవాహనవంశానికి అపఖ్యాతి తెచ్చుచున్నావా? ఇది మీకు ధర్మమా?” అని ప్రశ్న వేసినాడు.

కలలో ఆ వీరశ్రేష్ఠుడు విచారవదనముతో కనంబడినాడట.

అంతియ! అమృతలతాదేవి ఆ మరుక్షణమునుండి సంపూర్ణముగా మారిపోయి, కుమారునికి సైన్యమునజేర ననుమతి యొసంగుటయేగాక, స్వయముగా శ్రీముఖచక్రవర్తి కడకు బోయి, సమదర్శిని చేయికప్పగించవలసినదనియు, వానికి సైన్యమున ముఖ్యోద్యోగములనిచ్చి యా బాలుని తండ్రియంతవాని జేయవలయుననియు ప్రార్థించెను.

సమదర్శి మరునాడు దళపతిగా ఆంధ్రసైన్యములలో జేరినాడు. ఒక సంవత్సరములో నాతడు, ముఖపతియు, గణపతియు, వాహినీపతియు నైనాడు.

మరుసంవత్సరమాతడు చమూపతియైనాడు. మొదటినుండియు ననేక యుద్ధముల వీరవిక్రముడై యాంధ్రసైన్యములకు యశము సముపార్జించుచు నేడు విఖ్యాతినందిన ఉపసేనాపతులలో నొక్కడైనాడు.

ఆతడు తానెప్పుడు సేనాపతియగుదునా, ఉపసైన్యాధ్యక్షుడనగుదునా, సర్వసైన్యాధ్యక్షుడనగుదునా, అందులకు తన మేటిమగటిమిచూపు సందర్భమెప్పుడు వచ్చునాయని ఎదురు చూచుచున్నాడు.

సమదర్శి తిన్నగా ఒకనాడు చారుగుప్తుని భవనమునకు పోయెను. తన మేనమామ కోటీశ్వరులలో కోటీశ్వరుడు. ధనముమాట యటుండ ప్రపంచమున ననన్యలభ్యమగు మహారత్నమువంటి సుందరాంగికి జనకుడు మేనమామ కుమారిత—ధర్మశాస్త్రప్రకారము తనస్వత్వము. హిమవంతుని తనయను కైలాసనాథుడు వివాహమాడినాడట, సముద్రుని పుత్రికను, సముద్రమునవసించు వటపత్రశయనుడుద్వాహమయ్యెనట అని పురాణములను చున్నవి. చిన్నతనమునుండి తాను హిమబిందుతో ఆటలాడుకొన్నాడు. ఆమె ‘నాకిది కావలె’ నని యనినంత తానది తెచ్చినాడు. ఒకసారి యామె కృష్ణానది కావలియొడ్డుననున్న పచ్చతురాయి పూలగుత్తుల పట్టుకొని రమ్మనినప్పుడు తాను పదునాలుగేండ్లవాడై యున్నప్పుడు కృష్ణానది నీది ఆ పూలు తెచ్చి యిచ్చినాడు. హిమబిందు సంతోషంతో మెచ్చుకొని “బావా నీయంత గొప్పవారెవరును లేరు. నేను నిన్నే వివాహమాడెద” నని తన మెడచుట్టును బాహులతల పెనవేయలేదా? ఆనాటి కౌగిలింత యిప్పటికిని మధుర స్మృతియై మరపునకురాదు. తాను బాహుబలమున అసమానుడు. తన వంశము అనేక



తరములనుండియు ప్రసిద్ధికెక్కిన శాతవాహన వంశము. అతి రథశ్రేష్ఠుడైన ప్రియదర్శి తన తండ్రి. తాను సేనాపతి. నేటరేపటి ఉపసేనాధ్యక్షపదము, సర్వసేనాధిపత్యము, ఆపైనుక?

ఈ యాలోచనలు కన్నులకొక కాంతినీయ, మోమునకొక విలాసముగూర్ప మూర్తికొక ఠీవిజేర్ప, గుఱ్ఱమును మంద మందగతుల నడుపుకొనుచు సమదర్శిశాతవాహనుడు చారుగుప్తుని సౌధము సమీపించెను. కోటనలనున్న యా భవన ముఖద్వారము సమీపించగనే గుఱ్ఱము స్వారితో పోవుటకు మహాతోరణ వామకవాటమును స్వాగతమే ద్వారరక్షకులు తెరచిరి. స్వారిచేయుచునే సమదర్శి నిస్సరణము దాటి ద్వితీయ ద్వారముకడచి ప్రాంగణము జేరునప్పటికి అశ్వరక్షకులు గుఱ్ఱము కళ్ళెమును బట్టుకొన, సమదర్శి అవరోహణ మొనర్చుచు పగ్గపుత్రాడు వారికిచ్చి పాదరక్షలు చప్పుడుకా, మీసములు వడివేసికొనుచు, సభాశాలదాటి అభ్యంతర గృహాంబులలోనికి బోయెను.

అట్లు నడచి నడచి ప్రతీహారుల నమస్కృతులందుకొనుచు, ఆ సౌధశాలలకు, అందున్న సమస్తమునకు ప్రభువునా విసవిస నాతడు లోనికి జనెను. ఒక మందిరముకడ ఆగి, పాదరక్షలు వదలి, యచ్చటనున్న పరిచారికతో తన రాక చెప్పిపుచ్చి అనుమతికై నిలిచియుండ ఆమె లోపలికిబోయి ఒక క్షణములో మరలివచ్చి “రానచ్చునని” తెల్పెను.

సమదర్శిశాతవాహనకుమారుడు ప్రవేశించిన గృహము వైకుంఠమున లక్ష్మీదేవి నివసించు మందిరమువలె ప్రకాశించుచున్నది. బంగారముతో, దంతముతో, చందనతరువులతో సృజింపబడిన పీఠములు, మంజూషలు, కాశ్మీరదేశపు కంబళ్ళు, సహ్యాద్రిపులుల హిమవన్నగ శ్వేత చమరీ మృగముల, వింధ్యాటవీ సింహముల, కామరూప ఖడ్గమృగముల, హిరణ్యద్వీప మార్జాలముల చర్మములతో సొగసుగా నమర్చిన మెత్తటి చర్మములు, శ్రీకాకుళపుపల్యంకపురి అద్దకములు, లిచ్ఛవీదేశ దుకూలయవనికలు, బ్రహ్మదేశమునుండి వచ్చు తళతళలాడు నొకరకపు గడ్డిఅల్లికలు, ఎచ్చటచూచిన కన్నులకు పర్వమొనర్చుచుండెను. సర్జరసము, మల్లిగంధి, జోంగకము, శ్రీవాసము, జాయకము మొదలగు సుగంధముల తయారుచేసి యందుగుబంకతో మోటుపల్లి సన్నని వత్తులకు పులిమి, చేసిన ధూపకళికలు హృదయము మత్తుగొలుపు సువాసనాధూమములను మందిరముల నెల్లెడ విరజల్లుచుండెను. ముత్యముల జాలరులు నవరత్నములు పొదిగిన ఉపకరణము లెల్లయెడల చెన్నారుచుండెను.

# అష్టాదశ ప్రకరణము

## చారుగుప్తుని ఎత్తు

ఇక అభ్యంతర మందిరమున, అమూల్యమగు నొక పర్యంకముపై తూలికల పానుపుపై ఉపధానముల నానుకొని ఊర్వశివలె బంగారుమేని జిగితో గాత్రానులేపనములు మెరుపు లీన, ఒయ్యారమున హిమబిందుకుమారిక చెలులు వింజామరలు వీవ అధివసించియుండెను. మేనబావ వచ్చుటయు దాపుననున్న నొక పీఠముపై కూర్చుండుమని సైగచేసి యాబాల "కుశలమా ?" యని ప్రశ్నించెను. ఆమె కటి ప్రదేశముచుట్టును క్షామాంతకీయము మనోహర నీలవర్ణముల జెలువారుచు నీటి యూట యుబుకుల మడతలలో శృంగార రేఖల కుచ్చులతో చెన్నారియుండెను. గంభీరవక్షము కన్నపడి కనబడనియట్లు పొగమంచులోనుండి అస్పష్టముగా గోచరించు బంగారు కొండలవలె ఊర్పులకు పొంగుచు, తగ్గుచు నుచేలవినీత బద్ధమై యుండెను. మంజీరములు కింకిణీద్వయములు నూపురములు పాదకటకములును, ఆమె పాదములకు మహత్తర హిరణ్య పూజలర్పించినవి. వెలలేని హారములు శంఖమునుచుట్టిన పరివాళలతలవలె మెడనుచుట్టి, వక్షోజోన్నతతలములపై ప్రాలి మిలమిల లాడుచుండెను. మణులు పొదిగిన మేఖల ఆమె వెన్నడుము క్రింద ఆకాశ స్వర్ణదీ భాసమానమై వంకర వంకరల చుట్టి ప్రవహించుచుండెను. బాహుపురులు వేయి శిల్పవిన్యాసములతో నామె బాహువుల జట్టి సౌందర్యతత్వోపదేశము నందుచున్నవి. నవమణివలయిత నీలరత్నలలాటికము రతీదేవి హృదయమై వలపుమంత్రములు జపించుచున్నది.

ఆమెకీనగలున్నను, లేకున్న నొకటే ! ఆమె యందము అకుంఠితము, అనన్యము, అప్రతిమానమునై నగలకే నగయైనది.

కిరిగన్నుల బావగారిని జూచుచు మృదులాధరోష్ఠకాంతులు పరిసరింప కెమ్మదిగ తాంబూలము నములుచు, విలాసముగ ముంగురుల సవరించుకొనుచు, బాలచంద్రుని శిశుకిరణములవంటి వ్రేళ్ళతో పూలచెండుల దొర్లించుచు "బావా యుద్ధవార్తలు చెప్పవూ" అని ప్రశ్నించెను.

"సుందరీసామ్రాజ్ఞివైన మరదలు చెంతకు వచ్చినపుడుగూడ యుద్ధవార్తలేనా ? లోకమోహనమైన నీ సౌందర్యమును జూచుచు ముగ్ధమైపోయే నామనస్సు ఇతరాలోచనలకు తావిచ్చుటలేదు."



"బావా ! నీవంటి మహావీరులకు యుద్ధములని, సైన్యములని, గుఱ్ఱపు పందెములని యుండవలెను గాని స్త్రీ సౌందర్యవర్ణనములో ప్రొద్దుపుచ్చుట నిరర్థకులగు కవుల పని."

"ఆ ! మగల మొన్నటి పందెములమాట జ్ఞప్తికి తెచ్చుచున్నావు. నేనానాడే చెప్పితినిగదా. వానికేవో శాబరమంత్రాలు వచ్చియుండవలెను. కానిచో కామందక, కులపాలకులకు ఓటమి యేమిటి ?"

"అయితే ఆ మంత్రం నీమీద ప్రయోగించాడా ? కామందక కులపాలకములమీదనా ?"

"అదుగో, దోషమంతా నాదేనని తేలుస్తున్నావు నువ్వు. రాతుకొద్దీ గుఱ్ఱమనే మాట నిజమేగాని, బిందూ ! నే నివ్వాళ క్రొత్తగా సాక్ష్యంచేసినానా ? ఇదివఱకెన్నడైనా అపజయమెఱుగునా నీ బావ ?"

"అవును. నా కామందక కులపాలకములే వట్టి పనికిమాలినవీ, ఎన్నడు జయమెఱుగ అవీని. అంతేగా బావా ?"

సమ:—సరే. నీమాట ఎందుకు కాదనవలెను. ఈ ఓటమికి నేనే కారణం. నీవంటి సౌందర్యరాశిమాట కెదురాడడం సరసత్వంకాదు."

హిమ:—సర్వసైన్యాధ్యక్షులు కావలసిన మా బావగారింతలో ఎంత అల్పసంతుష్టులైనారు. సరసాగ్రేసరులనిపించుకోవడంతో తృప్తిపడతావా బావా.

సమ:—బిందూ ! నీ యెత్తిపొడుపు లెన్నటికి చాలించవా ? నీకు సంతోషం కూర్చలేని శౌర్యము, పరాక్రమము, సేనాధ్యక్షపదవీ నాకెందుకు ? చిన్ననాటినుంచీ మన మాడుకొన్న ఆటలూ, పాటలూ, మనము పెంచుకొన్న నెయ్యమూ, ఇవ్వన్నీ ఇలా మఱచిపోయి, నా ఆశలన్నిటినీ యిలా నట్టేట కలుపుతావనుకోలేదు.

హిమ:—అదుగో ! నీకు కోపం వచ్చినది. నా పెంపుడువృషభము లోడిపోయినవిగదా అనే విచారంకొద్దీ నేనేదో అన్నాను గాని నీ శౌర్యసాహసాలు నే నెఱుగనా బావా ? ఆంధ్రసామ్రాజ్యవైరులకు గుండెలో బల్లెమనే కీర్తి ఇంత చిన్నతనంలోనే సంపాదించుకొన్నావు. ఆంధ్రభారతి యావత్తూ నిన్ను చూచి గర్విస్తున్నది. ఆశలన్నీ నీమీద పెట్టుకొని వున్న అత్తయ్య నీ వీరవినోదములువిని ఉప్పొంగిపోతున్నది. నువ్వు కాగలవాడవు, కీర్తికాముడవు అని నీ బంధువులు, స్నేహితులమంతా ఎంతో సంతోషిస్తున్నాము.

సమ:—నీకు ఉత్సాహభంగము చేసినవిమ్మట, ఎందఱు సంతోషిస్తేనేమి ? నా కీర్తిప్రతిష్ఠలన్నీ ఏ దేవిపాదాలచెంత కానుక పెట్టుదామనుకొన్నానో ఆదేవికి నాపట్ల అనుగ్రహం తప్పినది ?

హిమ:—ఎవరాదేవి, అంత నిష్ఠురురాలు ? ఎన్నడూ చెప్పితివికావూ ? సమదర్శిలాటి వాహానులు ప్రేమను తృణీకరించే కఠినాత్మురాలు. బావా ! నాతో చెప్పవూ. మా అక్క కానున్న ఆ యదృష్టవతి ఎవరో ? నేను వెళ్ళి మందలించి ఆవిడను ప్రసన్నను చేసి వస్తాను. అవును గాని మా అత్తయ్యా ఏటాగునా కాబోయే కోడలుగారిని. అవునులే. అత్తయ్యా, నువ్వూ తోడిదొంగలు. మాకు తెలియనివ్వరు. కానిలే. మీరెంతదాచినా పెండ్లినాడైనా చూడకపోముగా. అవును గాని, నువ్వు త్వరగా పెండ్లిచేసుకో బావా ! మా అత్తయ్య కోడలికోసం మొగమాచివుంది. మేమంతా నీపెండ్లి ఎప్పుడెప్పుడని కానుకలతో కనిపెట్టుకొని ఉన్నాము. ఇదిగో, మా నాయనగారీమధ్య పది యోడలమీద సరుకులు పంపితే రోమకమునుండి రెండు లక్షల సువర్ణాలు వచ్చిన వాసరుకుల విలువక్రింద. ఆ సువర్ణములతో ఇదిగో హారం చేయించాను. మాబావ పెండ్లినాడు మా అక్కగారికి కానుకివ్వవలెనని.

అనుచు ఆమె దనచేతికి అందిచ్చిన హారమును సమదర్శి గైకొనెను. తనమాట చోరనీయకుండ నా బాలిక పలికిన పలుకులెల్ల నాతనికి దిగ్భ్రమకలిగించినవి. ఆమె మాటలు నిజమో నవ్వులో ? బండ్లపందెమున నోడితినన్న కారణమున నన్ను నొప్పించుట కిట్లనుచున్నదా ? లేక నిజముగా నాయెడ విరక్తయైనదా ? తన యాశలన్నియు మఱదలిపై నిడికొని, తన కన్నటికైన దక్కెరియగునన్న నిశ్చయముతో నుండ ఇట్లు విరసములారంభించినదేమి ! కానిమ్ము. ఈబాల నీమాత్రమునకే జాణికిపోనిత్తునా ? అనుకొని "బిందూ ! పుట్టనిబిడ్డకు పేరెందుకుగాని, ఈ యపురూపహారము నీకే తగును. దీనిని నీ కంఠమునకే అలంకరింతును" అని చెంతకేగెను.

హిమబిందు "వద్దు బావా ! నా హారం నేనే వేసుకొంటాను" అని పలుకులతో నందుకొనెను. సమదర్శి చిన్నబుచ్చుకొనెను. అతనికి దుఃఖమును, రోషము నలముకొనెను.

తారాదత్త వచ్చి "అమ్మా ! నాయనగారు వచ్చుచున్నారని" నుడివి, సమదర్శిని చురుకుచూపుల చూచి, ఏమియు నెరుగనట్లు వెనుకకు బోయెను.

రక్తచందన పాదరక్షలు చప్పుడుగా, చెక్కడపుబనిలేని ఎఱ్ఱజావ్వికట్టు కేల నూతగాగొని చారుగుప్తుడు వీరున్న మందిరమునకేతెంచెను. ఈ వారముదినములలో నాతడు విచారమున క్రుంగిపోయెను. అతని వెండుకట్టెయెత్తు భగ్నమైనది. కాని అంతటిలో నా నూరకుండ గలసినదేనా ! మొన్న జయశీలుడగు నా బాలుని యెదుట నాట్యమాడునప్పుడు, యువరాజగు శ్రీకృష్ణసాతవాహనుడు తదేకదృష్టితో హిమబిందును జూచినాడు. చక్రవర్తి కద్భుతమైన యొప్పు కార్యము లొకదాని వెనుక నొకటి తాను ఘటింపవలెను. తన వలన నెల్లయు



సమస్తకార్యములు నాతడెరుగవలె, మొన్న తన వేగులవాడు తెచ్చిన జాడనుబట్టి బ్రాహ్మణ బ్రహ్మచారి నొకని పట్టితెచ్చిరి. ఇంకను తన కావిషయమై ఎన్నియో సంగతులు తెలియ వచ్చినవి. కాని యీ సమదర్శి యేమిటి ? పలుసారులు హిమబిందుకడ కీతడు రాజనడు. యువరాజ కంఠయోగ్యమగు నా రత్నహారమున కీతడర్హుడుకాడు. హిమబిందు మనస్సు ఏదుస్స్వహాత్తమున నయిన నీ వెఱ్ఱి మేనల్లునిపై చనువుకొలదీ లగ్నమైనచో తన కలలన్నియు శకలములగును. ఈ బాల్యస్నేహమును త్రెంచుటకే సమదర్శిని దేశాంతరగతుని గావించవలెను. చక్రవర్తి మనస్సును సంతోషవార్ధిలో నోలలాడించగల కులపాలక కామందకములను యువరాజానకు బసదనమీయనెంచిన నవి యోడిపోయెను. కానీ ఇంతమాత్రమున అధైర్యమేల ? మహాకార్యములు నెరవేర్పవలయును. విధిని తన లెంకలలో నొకనిగాజేసి ఆంధ్రరాజ్యమును తన చేతులలో నాడించి, చక్రవర్తితో తాను వియ్యమందవలయును. తన యీ సంకల్పము అమోఘము.

చారుగుప్తుడు గదిలోనికి వచ్చినతోడనే హిమబిందు లేచి, తండ్రికడకు వచ్చి, మోకరించి, నమస్కరించి, లేచి చేయిగొని, సుఖాసీనముపై నధివసింపజేసి యాయనప్రక్కనే తాను గూర్చుండెను. సమదర్శి మేనమామకు పాదాభివందన మాచరించి, నిలువబడియుండ, చారుగుప్తుడు చేయి యూపెను. ఆతడును తన పూర్వపీఠముపై నొరిగెను.

చారు:—సమదర్శీ ! నీకా కామందక కులపాలకములు కావలయునేమో యని మాట పంపినాను. ప్రత్యుత్తరము పంపినావు కావేమి ?

సమ:—మామా ! అట్టి మేటిగిత్తలు నీకడనే యుండవలయును.

హిమ:—నీకడనేల నుండకూడదు బావా ?

చారు:—ఉండు తల్లీ ! నే నాతనికి సమాధానము చెప్పెదను. అవునయ్యా, నాకు వానియందు మక్కువ పోయినది. ఓడిపోయినవని కోపమనుకొందువేమో, అదికాదు. నాకు క్రొత్తజతలపై మక్కువ. మహాకాంతార నగరమున ఈమధ్య మావాడు ఇంద్రగోపుడు అత్యద్భుతమగు జతను కొనినాడట. కతిపయ దినములలో నవి యిచ్చటకువచ్చును. ఆర్యావర్తమునగాని, దక్షిణాపథమందుగాని అట్టి పసగములుండబోవని స్పష్టముగ నాకు తెలియవచ్చినది.

సమ:—అయినచో వానిని తప్పక చూడవలెను.

చారు:—నీకు మాళవముపైకేగు సైన్యమునకు ఉపసేనాధ్యక్షత నిచ్చినారు. చక్రవర్తి ఆజ్ఞాపత్రము నీకందినదా ?

సముద్ర చటుక్కున గంతువేసి లేచి "ఏమిటి మామయ్యా! నిజముగా నీకెప్పుడు తెలిసినది?" అని ప్రశ్నించెను.

చారు:—ఇప్పుడే కేరళపత్తులు వచ్చి నా చెవిలో చెప్పినవి.

హిమ:—(నవ్వుచు) వెఱ్ఱిబావా! బాబయ్యగారు చేసిన పనికి వారిలో ఒకరు చెప్పవలెనా?

సము:—మామయ్యా! నీ యనుగ్రహానికి వేయివేల నమస్కారములు. ప్రయాణ మెప్పుడు? ఎన్ని సైన్యములు? అహో! నాకత్యంత సంతోషముగ నున్నది. నా కా శాసన మెప్పుడువచ్చును? అయినచో నే నింటికిబోయి ప్రయాణ సన్నాహమున నుండెద! కాని నీ ప్రతిన యాడవలె!

అనుచు నాతడు చారుగుప్తునకు నమస్కరించి, సంతోషస్నేహముల వెనుకనుండి తొంగిచూచు దైన్యముతో హిమబిందు ముఖము దెసగాంచి, ఆ బాలికచే ననుజ్ఞాతుడై వెడలి పోయెను. చారుగుప్తు డాతడు పోయినదిక్కున బొమముడితోడి యనాదరదృష్టుల బరపి, పుత్రికవంక జూచి, 'అమ్మాయీ నీవీతనితో చనువుగా నుండుట తగ్గించివేయుము. శత్రు జీవనుడు.' అని తెలిపెను. "లేదు బాబయ్యగారూ! చిన్నతనపు స్నేహమున చనువు" అని హిమబిందు నవ్వుచు పలికెను.



# ఏకోనవింశతి ప్రకరణము

## రహస్యాలోచన

శ్రీముఖశాతవాహనచక్రవర్తి, మహామాత్యుడు అచీర్ణునితో, సర్వసేనా[illegible]తుడు స్వైత్రునితో రహస్యాలోచన మందిరమున మంతనముండెను. శ్రీముఖుడు [illegible]డుగరి. ఆఱడుగుల రెండంగుళముల మనిసి. జబ్బ పుష్టిగలవాడు. సింగముతో ఆయుధములు లేకయే ఒంటరిగా పోరాడునంతటి పోటుమానిసి. పచ్చని దబ్బపండువంటి ఛాయకలవాడు. జుట్టు పొడుగుగ ఉంగరములు చుట్టుకొని వీపుమీదను, భుజములమీదను పడుచుండును. ఒక్కొక్క సారి పలిపెములతో ముడులుగా రచియించుకొని, శిరోభూషణములచే అలంకరింపించు కొనును. కన్నులు మధ్యమప్రమాణములు కలవి. నాగమణులవలె తళ తళ లాడుచు, తీక్ష్ణ కాంతులచే నెదుటివాని హృదయము చొచ్చిపోగలవు. నాసిక గరుత్మంతుని ముక్కువలె పొడుగై మాటలాడునపుడు వక్రములు తిరుగు సుందరమగు పెదవులతో తొంగి తొంగి చూచుచు ఆ వదనమునకు అందమిచ్చును. మీసమును, బవిరగడ్డమును, విశాలఫాలమును అతని ముఖమునకు వన్నె తెచ్చినవి.

ఆలోచన మెండయినప్పుడు శ్రీముఖుడు అస్థిరుడగును. మొలనున్న కరవాలికా సువర్ణమేఖలలపై చేతులు వేయును. ప్రక్కనున్న నిశిత కౌక్షేయకోశముపై దృష్టి సారించును. కిరీటరత్నకాంతులు దశదిశల ప్వ దలయాడించును. అతని మొలకొక దుకూల మున్నది. ఎదను హారములున్నవి. హస్తమున కంకణములు, బాహువుల కేయూరములు కలవు. అతడు మాటలాడునప్పుడు మణికుండలములూగియాడి, భుజములు, మీసములు, గడ్డము కాంతులతో నిండిపోవును. తలత్రిప్పుచు, ప్రభువు అందరి మోములను చుర చుర చూచును.

శ్రీముఖుడు:—నా ఉద్దేశ్యము మనము ప్రథమమున పుళిందులపైకి పోయి వారికి బుద్ధిచెప్పి, యటువెనుక మాళవముపై దండువిడిసిన మంచిదియని. లేనిచో మాళవముపైకి పోవు మనవెనుక నీ పుళిందులు క్రమ్మి అడుగు సాగనీయరు. ప్రప్రథమమున పుళిందులకు బుద్ధి చెప్పితిమా మాళవము సులభసాధ్యమగును.

అచీర్ణుడు:—దేవర యాలోచన లెస్సగ నున్నది. రేపటిదినమున సైన్యసంఘములకు, జైత్రయాత్రాసంఘములకు శాసనములు పంపెదను. సర్వసైన్యములు నాయత్తమైనవెంటనే శుభముహూర్తముచూచి రణభేరీ మ్రోగించెదము గాక.

సైన్యత్రుడు:—మహారాజా! వినీతమతికి బాసటగా సమదర్శి నడుపున ఉజ్జయినికి కొన్ని సైన్యములుపంపుట లగునగదా? త్వరలో సహాయముకావలెనని క్రమేలక వార్తాహరుడు తెచ్చిన వార్త. లేనిచో దుర్గము బలహీనమై సమస్త సైన్యముతో నాతడు ఆహుతికావలసిన మహావార్త మరుదెంచునేమో? అతడు పంపినవార్త దేవరకు విశదము. అజ్ఞ—

శ్రీముఖుడు:—సమదర్శి స్వతంత్రముగా సైన్యములు నడపగలుగుపాటివాడా? వీరుడుకావచ్చును గాని తానై సైన్యమును నడుపగలవాడాయని.

సైన్యత్రుడు:—అందుకు నేను పూట. మహామాత్యుల ఉద్దేశ్యము దేవర కనుగొన వచ్చును.

అచీర్ణుడు:—సర్వసేనాధ్యక్షులమాట బాగున్నది. ఉపసైన్యాధ్యక్షులొక్కరిలోను వినీతమతి మాళవమున, కాకుందుకులు ఈనగరమున, అత్రుఘ్నుడు కళింగమున, అఘబలుడు ప్రతిష్ఠానమున, చిత్రకుడు దక్షిణాపథమున, జఘువ్యాసు సిద్ధపురమున నుండవలసినవారు. మనకు సమదర్శియో మరియొకరో క్రొత్త ఉపసైన్యాధ్యక్షుడు కావలయును. ఆ విషయమున సైన్యత్రులవారే చెప్పవలయును. నా ఉనికిడి సమదర్శియే సేనాపతులందరిలోను తగినవాడని.

సైన్యత్రుడు:—రాష్ట్రికులతో యుద్ధమున సమదర్శి ఉపసైన్యాధ్యక్షునికంటె అద్భుతము లొనరించినాడు, కాన అతడే దీనికి తగును.

శ్రీముఖుడు:—మంచిది. అతని నెప్పుడు పంపెదరు?

ఇంతలో ద్వారముకడనుండి ప్రాతిహార్యుడు "జయము! జయము!! మహారాజాధిరాజాశకు!!! అని వక్కాణించెను. అచీర్ణుడు "లోపలికిరా" యనుటయు వాతడు వచ్చి యందరకును సాష్టాంగ నమస్కృతులొనర్చి "జయము! జయము దేవర యాజ్ఞానుసారము పశ్చిమాధ్యక్షులు చారుగుప్తులవారేగుదెంచివారు" అని మనవి చేసెను. సార్వభౌముడు తలనూపెను. అచీర్ణుడది చూచి "తోడ్కొనిరా" యని ఆజ్ఞయిచ్చెను. చారుగుప్తుడు లోనికి వచ్చి యందరకు నమస్కారములుచేసి, మహారాజునకు మోకరించి నమస్కారమాచరించెను. అందరును లేచిరి. శ్రీముఖుడు చారుగుప్తుని హస్తములబట్టి లేవనెత్తి ప్రక్కనున్న పీఠముపై నధివసింపజేసెను.

శ్రీముఖుడు:—వర్తకసార్వభౌమా! మాళవాధిపతి యేమిచేసెనో యెరుగుదువుగదా! ఇదివరకు మనచే విజితుడై కప్పముగట్టుచుండెను. తిరుగుబాటు చేయుచున్నాడని విని నంతనే వినీతమతిని పంపితిమి. అతనికి జాగ్రత్తపడుమని వార్తావాహకులు వచ్చియుండిరి. ఇంతలో ఏమరుపాటున పుళిందులచే తిరుగుబాటు చేయించి, భోజుల సహాయముగా గొని.



వచ్చి ఉజ్జయినిలోనున్న వినీతమతిని ముట్టడించెను. అతడు ధైర్యముతో కోట కాపాడుచున్నాననియు త్వరలో సైన్యములతో సహాయము రానిచో తాను తన భటులతో వధించి పోవలయునని వార్తావాహుల నంపుచున్నాడు. వినీతమతిని మాళవుడు ఓడించునట. పుళిందులు ప్రతిష్ఠాననగరముపై దండువిడియనున్నారు. నీవు పుళిందులతోను, మాళవముతోను మహత్తరమగు వర్తకవ్యాపారము కలిగియున్నావు. నీ యాలోచన మాకత్యంతము ముఖ్యమైనది.

చారు:—జయము! దేవా! ఈ విషయమంతయు నేను శ్రద్ధగా నాలోచించితిని. కొన్ని సైన్యములు ముందు ప్రతిష్ఠానమునకు యువరాజుగారికి సహాయము పంపవలయును. మనము సర్వసైన్యములతో తరలి నడచి మగధపైకెత్తిపోయి అచ్చట కాణ్వులకు, అగ్నిమిత్రుని సంతతివారికి బుద్ధిగరపి, వెనుక మాళవాధిపతిని నిర్జించి, ఆవెనుక పుళిందుల నడంచి, భోజులపని పట్టించి, వారి రాజ్యము మనము స్వాధీనము చేసికొనవలయును.

అచీర్ణుడు:—అట్లయినచో పుళిందులు వెనుకనుండి మన యాత్ర సాగనీయరుకదా!

సైన్యత్రుడు:—చుట్టును శత్రువులు క్రమ్ముకొనియుండ మనము విరోధులపై బోవుట అపాయకరము. ఈలోపల మాళవమున వినీతమతి సంకటమధికమగును.

శ్రీముఖుడు:—పుళిందు లెప్పుడును ప్రబల శత్రువులు.

చారు:—మీరు తెలుపు కారణములు భయహేతువులుకావు. పుళిందు లడవులు, కొండలు విడిచి సమప్రదేశములలోనికి వచ్చి శిక్షితులైన సైనికుల నెదిరింపలేరు. వారిని నడుపుటకు శిక్షితులగు సేనానాయకులు లేరు, గావున వారివలన భయములేదు. మనము మగధమునకు కళింగము దారి ప్రయాణము సాగించెదము. విరోధులకు మన పోకడ తెలియవచ్చుమునుపే మగధయందుండగలవారము. పుళిందుల నడచుటకు ఆ అడవులలో మనకు చాల కాలముపట్టును ఈలోన వినీతమతి దగ్ధమైపోవును. అంతేకాక ఏను గులదండు అడవిబడినటుల దావానలము కాంతారము చొచ్చునటుల వింధ్యాటవుల బడి పుళిందుల నుక్కడగింపవచ్చును. పైభాగము లోబరచుకొని మనము అటునుండి రా, యువరాజు ఇటునుండి రా, మధ్య పుళిందులు చిక్కుకొనగలరు. భోజులు పూర్తిగ మాళవునకు బాసట కాకమునుపే మనము ఉజ్జయిని నుండవలయు. దీనివలన మనకు చెప్పరాని లాభ మింకొకటి యున్నది.

అచీర్ణుడు:—ఏమది?

చారు:—[సార్వభౌముని దిక్కు మొగంబై మఖ్య మఖ్య మంత్రిని, సేనానాయకుని జూచుచు] ఇది—భరుకచ్ఛము పశ్చిమ సముద్రపు రేవుపట్టణములలో ముఖ్యమైనది. దాని లాభము భోజులు పూర్తిగ అనుభవించుచున్నారు. ఇప్పుడు భోజరాజ్యము స్వాధీనము

చేసుకొని ఒక ప్రతినిధిని భరుకచ్ఛమున నుంచినచో, పాశ్చాత్య దీవులతో వర్తకము మన స్వాధీనము కాగలదు. రోమకాది పాశ్చాత్య దేశములతో వర్తకము మచిలీపట్టణమునుండియు, కోటుపల్లినుండియు జరుగుటచే మనకు అమితనష్టము కలుగుచున్నది. కావున భరుకచ్ఛము ఆంధ్రచక్రవర్తుల స్వాధీనమందుండవలయు.

శ్రీముఖుడు:—బాగు! నీవు వర్తకచక్రవర్తి వనిపించుకొంటివి. నీవు చెప్పినదంతయు నాకు నవగతమైనది. మహామాత్యా! ఈ వణిక్‌శ్రేష్ఠుని యాలోచన ప్రకారము నడుపుట మనకు మేలు. సర్వసైన్యాధ్యక్షా! ఆ ప్రకారము సేనల నడుపుము. మేము సిద్ధముగ నుండ గలము. చారుగుప్తుడు మనతో వచ్చునది. కోశాధిపతికి మహామాత్యు డాజ్ఞలనంపునది. వలయునదంతయు సిద్ధముచేయ యుద్ధసంఘములకు ముదలనీయవలసినది. చైత్యాచార్యులు జయముగోరి బుద్ధభగవానునకు పూజల సలుపునది. ప్రజాలోకము దైవారాధన చేయవలసినది. మరియు—

చారు:—దేవా! తమకు అడ్డము చెప్పుచున్నాను. మన్నింపుడు. యీ జైత్రయాత్రకగు వెచ్చమంతయు చారుగుప్తుడు భరించగలవాడు.



# వింశతిప్రకరణము

## రహస్యసమావేశము

బౌద్ధమతము విజృంభించియున్న కాలముననే వేదమతము పునరుద్ధరింప బ్రాహ్మణులు, ఋషులు, పండితపరిషత్తులు, ఆశ్రమములు ప్రయత్నము చేయుచునేయుండిరి. పండితులగు బౌద్ధసన్యాసులకు కర్మకాండమాత్రులగు బ్రాహ్మణులు బదులాడలేకపోయిరి.

తిమిరమువలె గప్పిన ఈ పాషండమతమును నాశనముచేసి, త్రయీధర్మ దేశము నెల్ల కొల్లుకొట్టలని వా రాలోచనలు సలుపుచుండిరి. అనేక సభలు, సమావేశములు, వారణాశి, నైమిశారణ్యాది పవిత్రక్షేత్రముల జరుగుచుండెను.

కొందరు భగవంతుడు మహాశక్తివంతుడు, అతడే సర్వము చక్కబరచును అని వాదించిరి. కొందరు పురుష ప్రయత్నముండవలెననిరి.

అశోకచక్రవర్తి నిర్యాణమందిన వెంటనే, మౌర్యప్రతిభ నానాటికి తగ్గిపోయెను. బౌద్ధమతమును సామ్రాజ్యమతముగా నొనర్చి, యాత్రికుల, నాచార్యుల, భిక్షుల నంపి చీనా, తుర్కిస్థానము, పారసీకము, బ్రహ్మదేశము, సింహళములందదా మతము నెలకొల్పి మహోన్నతదశకు తీసుకువచ్చిన సార్వభౌముడు గతించుటచే అప్పటప్పట నణగియున్న వేదమతము పూర్వాచార్య సంప్రదాయములు తిరిగి విజృంభించెను. మౌర్యసంతతి రాజగు బృహద్రథుడు మగధ సింహాసన మధిష్ఠించియున్నప్పుడు పుష్యమిత్రుడను అతని సేనానాయకుడు రాజును చంపి తాను రాజై బ్రాహ్మణమతము పునరుద్ధారణ చేయ సంకల్పించెను. అప్పటినుండి సామ్రాజ్య సింహాసన మెక్కిన రాజులు వేదాచారపరాయణులగువారే. పుష్యమిత్రుని సంతతిలో శుంగవంశములో దుడివాడగు సుమిత్రునిమిత్రదేవుడు వధించి రాజయ్యెను. మిత్రదేవుని సంతతివారిని పదచ్యుతులజేసి మంత్రులగు కాణ్వవంశమువారు చక్రవర్తులైరి.

కాణ్వవంశము వారందరు వేదమతము పునరుద్ధరింప దీక్షవహించినవారు. అనేక పండితులు రాజుల ప్రోత్సాహమునను పై మూడు వంశముల ప్రోత్సాహమునను వైదికధర్మోష్టులై అత్యంత పురాతనములగు రామాయణ భారతాది గ్రంథములందు ఋషిప్రోక్తములవలె బౌద్ధమత ఖండనములను ప్రక్షేపించిరి. పురాతనములగు మనుశర్మాదిస్మృతుల దమ యిష్టము వచ్చినట్లు మార్పులొనర్చసాగిరి. రాజతంత్రమందుకూడ నీ యావేశపరులు పాల్గొని వేదమత మునుద్ధరింప సమకట్టిరి. గోదావరి నదికి పశ్చిమోత్తరముగా పదునేను గోరుతముల దూరమున నున్న మహారాష్ట్ర [illegible] యను పట్టణమునందు [క్రీస్తుశకము పూర్వము 74 సంవత్సరమునకు సరియైన] బౌద్ధశకము [illegible] విరోధిన సంవత్సరమున ఫాల్గుణ శుద్ధ ఏకాదశి దినంబున ఒక

భవనమునందు పదమూడవ ముహూర్తమున శౌరసభాశాలవారు శేరి కొట్టకమునపు పది పన్నెండుగురు పురుషులు సభ జేరియుండిరి. వారందరు క్రిందపరచిన రత్నకంబళులపై కూర్చుండియుండిరి.

ప్రథముడు:—కనుక వేంగీపురమునందున్న సంచరణుడు ఇప్పుడేమియు పనిచేయుటకు వీలులేదని మీరంటారు, అవునుగదా? మహేశ్వరానందా!

మహే:—ఏమిచేయగలడు? మన సంచరుణుడు తానై ఏమియు ప్రయత్నింపలేడు. ఇక్కడ చుట్టుపక్కలకు ప్రాణము శక్తి సమస్తమునయిన యాతడు ఈ స్థానబలము తప్పి నంతనే రెక్కలులేని పక్షివలె నయినాడు. ఎంత బలమున్న నేమి? ఎంత సంపద యున్న నేమి? అంగబలముండవలెగదా. చంద్రస్వామి ఉన్నంతవరకు పెద్దల ఆజ్ఞల, నుపదేశముల తూచా తప్పక నిర్వర్తించుచు మన ప్రయత్న మత్యంతాభివృద్ధి చేసినాడు. చంద్రస్వామి కారా గృహమునకు పోగానే సంచరణుని పని అయినది.

ప్రథముడు:—అయితే చంద్రస్వామి విచారణ సంగతి ఏమయినది? ఎట్టి దండనము విధించిరి?

మహే:—నాకింకను ఆ వార్త రాలేదు. ఇప్పటికి చక్రవర్తి జన్మదినమహోత్సవములు జరుగుచున్నవి. ఎద్దుబండి పరీక్షలైనవి. ఆతని విచారణ అపుచేయబడు నేమో నని కోటలో వదంతి. ఒకవేళ విచారణ మవసరములేక నే శిక్షింపబడు నేమోయని కోటలోనున్న మన వేగులవాడు విశాఖుడు చెప్పినాడు. ఏది యెట్లగునో?

ప్రథముడు:—రాజధానియందునున్న బ్రాహ్మణులూరకుందురా? విచారణ లేకుండ శిక్షించుట ధర్మదూరమని చెప్పసాహసించు మతాభిమానులు లేరా?

మహే:—ధాన్యకటకమును గూర్చి సోమదత్తుడు చెప్పవలసినదే.

అందరును మహాపండితుడును, ప్రతిజ్ఞానిర్వాహకర్తయు నగు సోమదత్తస్వామిపై పు చూచిరి. సోమదత్తుడు సామవేదము పాడినట్లీవిధముగ వాక్రుచ్చెను. "ధాన్యకటకము నందున్న బ్రాహ్మణులందరును రాజాభిమానులు. బ్రాహ్మణ నామధేయముకల్గిన పాషండులు, చార్వాకులు, పైశాచ స్వరూపులు. ఒక్కడైనా మహాపండితుడనైన నన్ను గౌరవము చేయరు, లేచి నమస్కారమైనా చేయరు సరిగదా! కూర్చుండి నా మొగమైన చూడరు. నాకు కోపమువచ్చి "రండి, నాతో వాదమునకు" కని పిలిచితిని. ఆ కుంతలు ప్రతి చెప్పరైరి. అయినప్పటికి చంద్రస్వామిని విచారణచేయకుండ దండించుటకు చక్రవర్తికి గుండెలేదయ్యా ధర్మాతిక్రమణం చేయుటకు. అన్ని మతములయందును గౌరవము చూపుదునని ప్రతిసంవత్సరము



మహాపరిషత్సభకు చెప్పుచుండును గాదా! ఆ మాటకిపుడు తప్పినచో నేమగునో దానా? మీకు తెలియదా.

ప్రథముడు:—ఒకవేళ చంద్రస్వామిని విడుదల చేయకపోయినట్లయిన సంచరణునకు సహాయముగా మనలో దిట్టమైనవాని నొకని ఆ చుట్టుప్రక్కల నెక్కడనో యుంచ వలయును.

మహే:—చంద్రస్వామి నిప్పుడు కొనిపోవుట మనకు లాభదాయకమే అయినది. అతడెంత దిట్టరియైనను, చాణక్యసమానుడైనను మనము నిశ్చయించుకొనినపద్ధతి తాతడు కలసిరాడు. అనగా మొట్టమొదటికుట్రకు సంపూర్ణముగా వ్యతిరేకము. అయితే ప్రజలనందర మనలో చేరదీయుటకు, పవిత్రమగు వేదరహస్యములు బోధించుటకు అతనియంత నిపుణు డింకొక్కడు లేడుకాని—

ప్రథముడు:—ఆ సంగతి మొదటినుండియు మహాభాగులు మనతో చెప్పనే చెప్పి నారు. వారి ఉద్దేశముకూడా చెడుగు చేయవలెనని కాదు. మనము చేయుకార్యము ఉత్కృష్ట మైనది. పుణ్యదాయకము, మోక్షదాయకము. ఆదిమానవము వేదముల నుద్ధరించుటవంటిది. వేదోద్ధరణచేయుట సర్వేశ్వరునకు మహాప్రీతికరము. దానిని సాధించుటయే మన లక్ష్యము. తక్కిన పాప పుణ్యములతో మనకు పనిలేదు.

ఒకడు:—అవును స్వామీ! ఇట్టి మహా పవిత్రకార్యము చేయుటలో కొన్ని కష్ట కార్యములు చేయవలసి వచ్చినను వెనుదీయకూడదు. మనము దురుద్దేశముతో చేయుటలేదు గదా?

పండితుడు:—ఇన్ని సంవత్సరములు వేదపారాయణము చేసి, శాస్త్రములు పఠించి, ప్రతిజ్ఞగైకొని యీనాడు నేను వెనుదీయను. చంద్రస్వామిలేని కొరతలేదు. మనము ముఖ్య కార్యము నడపవలసినదే.

మిగిలినవారందరును "నిజము నిజ" మని చెప్పిరి. అందరును ఆవేశపూర్ణులై యున్నా రనియు తన కార్యమునకు తోడ్పడెదరనియు నా సభ నడుపు ప్రధానపురుషునకు దోచినంతట నా విషయమును గూర్చిన సంభాషణ మాని "మనమిక్కడనుండి వివిధములగు మార్గముల ధాన్యకటకము చేరవలయును. మహాయోగి, పుణ్యపురుషుడు, శైలతిష్యులవారు, వారి పవి త్రకార్యము కొనసాగు శుభముహూర్త మేగుదెంచినదనియు, దానిని గమనించుటకు మన మందరము రావలెననియు మొదల పంపినారు. మీరు తప్పనిసరి నెవ్వరిని తీసికొని రావలెను. రేపు త్రయోదశినాడు శుభముహూర్తము" అని యాతడు పల్కెను.

# ఏకవింశతి ప్రకరణము

## పరిత్రాణము

సమదర్శి పోటుమానిసి. చురుకుపాలెక్కు-వ. వెనుకముందు చూడనిసాహసి. తనకిచ్చిన ఆ అక్షౌహిణీ సైన్యముగొని పిట్టను జూచిన డేగవలె దుర్గమారణ్యములబడి రివ్వున పోవచ్చెను. దిగంబరులు క్రూరసత్వులగు రాక్షసులను అరణ్యక జాతివారు [ఇప్పటికిని బస్తరు సంస్థానపు దుర్గమారణ్యములలో నున్నారు. వారిని మేము చూడగలిగితిమి.] ఆ అటవులలో నుండిరి. అమాయకుల స్నేహము చేసికొని వారికన్నియో విచిత్రవస్తువుల కానుకలిడుచు, వారి మన్ననల గ్రహించుచు, తన జాడ పుళిందులకు తెలియకుండునట్లు కష్టతమములగు మార్గములచే రాక్షసులు చూపు నడచిపోవుచు, సమదర్శి రెండు వారములలో మాళవరాజ్యపు సరిహద్దుల చేరునప్పటికొక్క- పుళిందులమూక అతని నడ్డగించెను. కాని అర్జునగాండీవ వినిర్ముక్త మహాశరమువలెపోవు వానికి చిన్న సైన్యమొక లెక్క-యా? ఆ మూకను చీల్చి చెండాడి ఉజ్జయినికి నాల్గు గోరుతల దూరమువరకు నాక్రమించియున్న మాళవ సైన్యములపై మబ్బులేని పిడుగువలె దాకెను. కోటలోనున్న వినీతమతికి సమదర్శి సైన్యముల నడుపుకొని వచ్చినాడని వేగు తెలిపినది.

ఉజ్జయినీకోట చాలా ముఖ్యమైనది. అది దేవనిర్మితమని ప్రతీతి. శ్రీముఖశాతవాహనుని తండ్రి, సమదర్శి తండ్రి ప్రియదర్శి సేనాపతిగా ఉజ్జయినీపట్టణమును మహాసంగరమొనర్చి స్వాధీనమొనర్చుకొనెను. అప్పుడు మాళవాధిపతి నీరసముగనున్నను చాలకాలము అద్భుతముగ కోట కాపాడుకొనగలిగెను. కాని తినుబండారములు నాశనమొందుటచే కోట శాతవాహనునకు స్వాధీనమయ్యెను.

సమదర్శి ఆలోచన యొక్క-టే. కోట ముట్టియున్న సైన్యములలో చాలభాగము తన్నెదిరించిన ఏ సైన్యమునెగ్గునో భగవంతుని కెరుక. పుళిందులు, భోజులు, మగధసైన్యములు, అవంతిదళములు సహాయముగవచ్చుటచే మాళవవాహిని ఉత్తుంగతరంగ పూర్ణ సముద్రమువలె నున్నది. కోటలో వినీతమతికి, భోజనాదికములు తగ్గిపోవుచున్నవి. సైనికులు దినదినము కృశించి హీనబలులగుచున్నారు. ఆయుధసామగ్రి చాలవరకు నాశనమయినది. [illegible] ములు, [illegible] జామదగ్న్యములు, బహుముఖములు, విశ్వకాళికములు, [illegible] ములు, [illegible] బాహువులు, చెడిపోయినవి, చెడిపోవుచున్నవి. కావున వినీతమతి [illegible].



ఇవన్నియు స్ఫుటాక్షరముల నాతని దృష్టివీథిని నడయాడుచున్నవి. తనకడ నొక నెలకు సరిపడిన పుష్కలాహార పదార్థములుకలవు. గోధుమలు, బియ్యము, పప్పు, ధాన్యములు, బెల్లము, ఉప్పు, కారము, నేయి ఎంతయో కలదు. మాంసాదులకు బాతులు, కోళ్ళు, కౌజులు, మేకలు, గొఱ్ఱెలు, లేళ్ళు నున్నవి. ఇప్పుడు కర్తవ్యమేమి? ఏది యెట్లయినను తాను కోటలోనికి చొచ్చుకొనిపోవలె. తనక్రింది సేనాధికారులు, చమూపతులు, దండనాయకులు అందరితో సమాలోచన చేసినాడు. కొందరు చక్రవర్తియే మహాసైన్యముతో వచ్చి తాకునని బెదరించెదమనియు, కొందరు మన మిచ్చటనుండి తాకినను, కోటలోనుండి వినీతమతియు తాకినచో నిరుసైన్యములు విరోధిసైన్యముల నుగ్గాడవచ్చుననియు చెప్పిరి. కాని సమదర్శి యొక్క-టే నిశ్చయించుకొనెను. ఝంఝామారుతముచే సముద్రము మహాభయంకరముగానున్నను నావికుని సామర్థ్యమున నప్రమాదముగాబోవు నౌకవలె, కట్టును చీలగొట్టి చొచ్చిపోవు పరశుముఖమువలె, సమదర్శి మాళవసైన్యముల జీల్చి, కోటద్వారముకడకు బోవుటకు నిశ్చయించెను. ఏ ద్వారముకడకు తాను రానున్నాడో ఆ ద్వారముకడ సిద్ధముగ నుండి గోపురద్వారము చటుక్కున తెరచి కొన్ని సైన్యములు వెలుపలికివచ్చి చీకాకుగూర్పవలెననియు, రాత్రి అమితవేగమున తాను వచ్చెదననియు కోటలోనికి వార్తనంపెను.

రాత్రి పండ్రెండు గంటలగునప్పటికి కోటచుట్టియున్న మాళవసైన్యములతో సమదర్శి తలపడెను. పేరుగాంచిన ఆంధ్రమల్లులు అయిదువేలసంఖ్యవారు పంక్తికి నాల్గువందల చొప్పున బలసి ముందునడచిరి. వారి ఎడమచేత దేహమంతయు గప్పు ఖడ్గమృగ చర్మపు డాలుండును. కుడిచేత తొమ్మిది అడుగుల పొడవుగల వాడి శూలములుండును. మొలను చిన్న కటారి యుండును. వీరందరు శూరులు, గజసత్త్వులు. చావవలెగాని వారు వెనుకకు తిరుగరు. వారిని ఆంధ్రసైన్యాధిపతులు, చక్రవర్తులు ప్రాణాపాయములు వచ్చునప్పుడేగాని వినియోగింపరు. అట్టి ధీరులు ఆంధ్రసైన్యముల ఏబదివేలున్నారు. భారతీయసైన్యములు యుద్ధము చేయునప్పుడు గజముల గజములు, అశ్వముల అశ్వములు, రథముల రథములు దాకింతురు. నేడు సమదర్శి మల్లుల కీవలావల అశ్వదళములుంచెను. దీని వెనుక రథములు, అన్నింటికి వెనుక ఏనుగులనుంచి యుపాయముపై మోహరము పన్నెను.

ఆంధ్రవాహిని అట్లమితవేగమున వచ్చి తాకుటచే మాళవసైన్యములు చీకాకునందెను. అటు చటుక్కున దుర్గమహాగోపురద్వారము తెరువబడి వినీతమతి సైన్యముల వచ్చి తాకుటచే మాళవులు చిక్కుపడిరి. ఈ కల్లోలములో సమదర్శి సైన్యములు జవమున మాళవసైన్యములోనికి చొచ్చిపోవుచున్నవి. ఆంధ్రమల్లులు తమ త్రోవ కడ్డమైనవారినెల్ల శూలముల కెరచేయుచు మరల నా శూలములు లాగుకొనుచు ముందునకు సాగిపోవుచుండిరి. వారి కిరుదెసల అశ్వదళములు పార్శ్వరక్షణ మొనర్చుచుండెను. హిమపాతమువలె వచ్చు నా సైన్యము బారిపడి రిపులు నడపాడ మాసిపోవుచుండిరి. సమదర్శి ప్రళయకాలరుద్రునివలె నుండెను. మహానది ప్రవహించుచున్నట్లు పోవుచుండెను. అతని సైనికులు సింహములవలె పోరాడిరి. మాళవదళములు ఆ రాత్రి యేమరుపాటునకు వెఱగుపాటు తోడుగా గలగుండువడి, దిక్కు తెలియక, పంచబంగాళమై విచ్చిపోయినవి. సమదర్శి సైన్యములకు దారి యిచ్చినవి.

యుద్ధారంభమైన మూడు గంటలకు సమదర్శి సేనలు చెక్కుచెదరక భోజనాది వస్తుసామగ్రితో దుర్గములోనికి చొచ్చిపోయెను. వినీతమతి సమదర్శిని కౌగలించుకొనియెను. కోటలో విజయనాదములు భేరీభాంకారములు మిన్నుముట్టినవి. మాళవసైన్యములు మొగము వ్రేలవైచినవి.

మిడుతలదండువలె గలసియున్న మాళవసైన్యములు మరునాడు ధైర్యవిహీనములై యుద్ధము చేయనారంభించినవి. ఇంతలో సుశర్మచక్రవర్తి పంపిన కొన్ని సైన్యములు వచ్చి చేరినవి. వానితో శివభూతి వచ్చినాడు. అతడు మాళవాధిపతిని గలిసికొని యిట్లనియె. " మహారాజా! ఆంధ్రరాజు సైన్యములలో కొన్ని విడిపోవును. అతని కుమారుడు యువరాజీ పాటికి నిర్వాణపథమునకుజేరి, బుద్ధుని గొలుచుచుండును. ఆ వార్త ఆంధ్రులకు తెలియజేయుటకు మేమే అంచలనుంచినాము. ప్రతిష్ఠానము తత్క్షణము మన స్వాధీనము కాగలదు. మంజుశ్రీ యువరాజు కాగలడు. కాన మనకు భయములేదు. ఆంధ్రసైన్యము లింక కొన్ని నెలలవరకిచ్చటకు రాజాలవు. ఈలోన నీ మూకల నుక్కడంచి మనము జాగ్రత్త పడియెదముగాక. సార్వభౌముని సైన్యములు తేరుకొని వచ్చునప్పటికి కళింగమున సైన్యములన్నియు తిరుగుబాటొనర్చును. విదేహరాజ్యము మనకు సహాయమునంపును. మన మహాసైన్యములన్నియు కలిసి ఆంధ్రరాజ్యముపై దండెత్తి ఆ దేశమును ముక్కలు చేయవలయును. మంజుశ్రీ మన చేతిలోని కీలుబొమ్మ. ఆ ఫలవంతమగు రాజ్యమంతయు మన పాలిటియగును. కాన మనకేమి భయము " అని వచించెను.



మాళవుని మొగము విడివడియెను. ఆంధ్రసైన్యముల కిక శాసటరాదనియు, కోటలోని సైన్యముల హతమార్చవచ్చుననియు, ధైర్యముగా నుండుడనియు, దొంగలవలె ఆంధ్రసైన్యములు రాత్రి, శిబిరములు చొచ్చినవికాని, లేకున్నచో పేరులేకుండ మాసిపోయియుండుననియు సైన్యమంతట చాటిరి. జయజయనాదములు సల్పిరి. మాళవసైన్యములు మహాసంతోషమున తేలియాడెను.

కాని శివభూతి తన పటకుటీరమున నస్థిరుడై గూర్చుండి ఇంకను ప్రతిష్ఠానమునుండి వార్తలేమియు రాలేదేమని మనోవేదన ననుభవించుచుండెను. " ఏమో! ఏమైనదో! ఏమి కానున్నదో? " యని యాతడు పదిసారులనుకొనియెను.



# ద్వావింశతి ప్రకరణము

## ఆశ్రమము

కతిపయ దినంబులకు ధాన్యకటకమున మధ్య కృష్ణాతీరమందు మహాచైత్యమున కొలది దూరములోనున్న స్థౌలశిష్యాశ్రమమునకు మహేశానందాది పండితులు చేరినారు. ఆ ఆశ్రమ భవనములన్నియు రాతివి. ఆ ఆశ్రమము చాలా భాగ్యవంతమైనది. అన్నియు తోటలే. తోటల నడుమ ఆశ్రమగృహాలు, సమస్త ఫలపుష్పములు గల యా తోటలో ఒక భవనమున్నది. వృద్ధుడును, మహాయోగియు, యశస్వియగు స్థౌలతిష్యులవారందు వసింతురు.

స్థౌలతిష్యుల వారాంధ్ర బ్రాహ్మణ వంశములలో సుత్తమోత్తమమైన ఆపస్తంబుని శాఖవారి పెద్దలందురు. తక్షశిలయందు, వారణాశియందు, నైమిశారణ్యమునందు పెక్కు సంవత్సరముల ధ్యానమొనర్చి, యందందు గురుత్వము నడిపి స్వగ్రామమగు కృష్ణాతీరస్థ రాజశైలమున వార్ధకము గడుపుచుండెను.

ఇట్టి మహానుభావుడగు యోగి తిరిగి విచ్చేసినాడని వినినంతనే మహారాజాధిరాజ శ్రీముఖసాతవాహనుడు స్వయముగ నచ్చటికి విచ్చేసి ఆయనకు సకలసౌఖ్యముల సమకూర్చుటకు అనుమతినీయ బ్రార్థించెను. స్థౌలతిష్యులు శాలివాహనసార్వభౌము నాశీర్వదించి, "మహారాజా మీరు బౌద్ధమతావలంబకులు. వేదములు పౌరుషేయములనియు, యజ్ఞయాగాదిక్రతువులు హింసాత్మకములనియు, కర్మకాండ దూష్యమనియు వచించిన పాషండుడు మీకు భగవంతుడైనాడు. కలియుగ లక్షణములు మీ పాలనమున మూర్తిదాల్చుచున్నవి. మేలుకువనొందుట శ్రేయస్కరము. ఆంధ్రవంశోద్ధారక! శాతవాహన వంశకులతిలకా! వృద్ధుడగు నామాట వినుము. మీ హీనాయానము ఇతరయానములు సృజించిన బుద్ధుడు జన్మించిన దినము జూచిన మహాయోగులింకను హిమవన్నగప్రాంతముల తపము సల్పుచున్నారు సుమా! ఇక అనాదియగు వేదముల ఘట్టక నెవరు నిర్ణయింపగలరు? మీ శ్రమణకుడు వాక్రుచ్చిన భావనలు నీతిబోధలు, వేదములయందు లేవా? వేదనిందయొనర్చు నాస్తికధర్మమాది ఈ జాతిని భ్రష్టమొనర్చును. మహాచక్రవర్తులగు హరిశ్చంద్రాది నృపులవలె వేదధర్మప్రతిష్ఠచే యశము సముపార్జించుకొనుము. బౌద్ధదీక్షను వీడి పరబ్రహ్మదీక్షను గొనుము. భారతవర్షము నుద్ధరింపుము. సకలార్య లోక మట్టిచక్రవర్తికై ఎదురుచూచుచున్నది. మీచే రాజసూయంబు సల్పించెద. అగ్నిసమానుడు అర్థశాస్త్రవేత్త. కౌటిల్యుడు చంద్రగుప్తుని సామ్రాజ్యాభిషిక్తుని చేసినట్లు మిమ్ము నీ జంబూద్వీప సార్వభౌమపదమున కభిషిక్తుని జేసెదను." ఈ మాటలని వృద్ధుడగు తపస్వి తేజోవంతములగు తన తీక్ష్ణదృష్టుల శాతవాహనుని మోముపై బరపెను.



సాతవాహనుడు చిరునవ్వు నవ్వెను. స్థౌలతిష్యులు పట్టుదల గలిగిన ఆర్షదీక్షాభిమాని. అని మహారాజెరుగును. "క్షేమతత్త్వమే, అహింసా వ్రతోద్ధారణమే మూలసూత్రముగదా యీ మతమున? ఇందలి పాపమేమియో మహాత్ముడా? శాతవాహనవంశము బౌద్ధమతమునందు అశోకచక్రవర్తి కాలమునుండియు దీక్ష వహించియున్నది. సమస్త మతములవారిని సమదృష్టితో పరిపాలించుచున్నాము. నేడా పద్ధతి మార్చుటకు మాకు కారణమేమియు కనబడదు. కాన మమ్ము క్షమింపుడు. మీరే పూజ్యులగు మా తండ్రిగారితో విద్యలు నేర్చిరి. అత్యంత స్నేహభావముతో మెలగిరి. మహాభాగా! ఈ విషయమున మీతో తర్కింపజాలను. మమ్మనుగ్రహింపుడు" అని చక్రవర్తి వీడుకొనెను.

సానుత్తర చండికాది పండితులు వచ్చిన యీ దినమందు స్థౌలతిష్యుని భవనమునందొక్క మందిరమున నందరును సమకూడిరి. ఆ భవనమునందు విష్ణువు, శివుడు, బ్రహ్మ, ఇంద్రుడు, ప్రజాపతి, మహేశ్వరి, గజలక్ష్మి మొదలగు దేవతల విగ్రహములు గలవు. లింగమూర్తి పానువట్టమునందొకచో ప్రత్యక్షమైయుండెను.

స్థౌలతిష్య మహాఋష్యాశ్రమమునందు శిలామందిరాలలో తాపసులు, పండితులు, వేదవేదాంగ పారంగతులు, సర్వశాస్త్రవేత్తలు కుటుంబములతో నివసించియుండిరి.

విశాల భవనములలో, మండపములలో, వృక్షచ్ఛాయాపీఠములలో, బ్రహ్మచారులు దీక్షతో సర్వశాస్త్రములు అభ్యసించుచుండిరి.

వారితోపాటు ఆశ్రమమున వేరొకచోనున్న బాలికా విద్యామందిరములో అనేకులు బాలికలు సర్వవిద్యలు నేర్చుచుండిరి.

ఆ ఖేలనాస్థలమునందు చతురంగబల నాయకత్వము, వ్యూహారచనము, ఛేదనము, అశ్వారోహణము, రథచోదనము, గజవిద్య మొదలైనవి నేర్పుచుందురు. ఆశ్రమ మధ్యభాగమున కృష్ణానదీతీరమందు యజ్ఞయాగాది క్రతువు లొనరింపబడుచుండును.

స్థౌలతిష్యులు సర్వవిద్యా మహార్ణవ స్వరూపులు. వేదము లాయన ముఖమునందు ప్రజ్వరిల్లుచుండును. వేదభాష్యము లాయన ఫాలమున తేజరిల్లును. ఉపనిషత్తులన్నియు ఆయన చూపులలో తాండవించును. ప్రస్థానత్రయ మాతనిహృదయము. అథర్వణవేదమాతని యూడిగపుగత్తె.

ధన్వంతరివలె అతని దక్షిణహస్తమున అమృతకలశమున్నది. తక్షునివలె అతని ఎడమహస్తమున విషకుంభమున్నది.

స్థాలీపుష్యుని ఆశ్రమమునందు పురాణశ్రవణము, వేదాంతచర్చ, ధర్మశాస్త్రగోష్ఠి, సాహిత్యవిచారణ, ఆయుర్వేద, జ్యోతిష విచారణములు జరుగుచుండును.

సార్వభౌముడీ ఆశ్రమమునకు వలయు సౌకర్యము లర్పించుచుండెను. స్థాలీపుష్యమహర్షి 'నీ అర్చనయే నీకు నాశనము కాగల' దని చిరునవ్వు నవ్వుకొనుచుండును.

స్థాలీపుష్యుని పూజామందిరమున ఎందరో పండితులు, మండలాధిపతులు, భూస్వాములు, మునులు, రాజకీయోద్యోగులు ఆ త్రయోదశినాడు చేరియుండిరి.

స్థాలీపుష్యమహర్షి కృష్ణశ్వేతరువిరాజితమగు అలంకారరేఖాచిత్ర సుందరమగు కాంకురపత్రికంబళిపై వసించి తపస్సు చేసుకొనుచుండెను. మండపమున చేరినవారందరు భక్తితో వివిధ కృష్ణాజినాద్యాసనములపై నధివసించియుండిరి.

స్థాలీపుష్యుడు తపస్సు చాలించి, నీరాజనమర్పించుచు, అచ్చటనున్న సువర్ణఘంటికను దక్షిణహస్తమున గొని క్వణక్వణనినదము చేసెను. ఆ మందిరమున పూజాపీఠమునకు ఎదుట వైపుననున్న ద్వారమున విషబాల ప్రవేశించినది.

తోడనే పీఠముదాపుననున్న పలువురు భక్తులలో నొకడు శంఖమునూదెను, ఒకడు జేగంట గణగణ వాయించెను, ఒకడొక ఝాంకారముపై 'ఢం ఢం' నినాదమొనర్చెను. ఒకడు ఉచ్చైస్స్వరంబున సూక్తపాఠ మారంభించెను, పలువురు భక్తులాతని కంఠముతో దమ కంఠములు మేళవించిరి.



# త్రయోవింశతి ప్రకరణము

## అభిచారము

అచ్చటనుండి స్థాలీపుష్యమహర్షి ఆ మందిరముననే శిరోకరయొక ప్రజ్వలించుచున్న, హోమకుండముకడ ఉత్తరాభిముఖుడై వ్యాఘ్రాజినముపై నధివసించి, గంభీరోచ్చాటనలతో అభిచారహోమము నారంభించెను. ఆ అభిచారహోమము శత్రుమారణరూపమైనది.

“ ఓ యగ్నివాయు సూర్యచంద్ర జలములారా !
మమ్మెవ్వడు ద్వేషించుచున్నాడో,
ఎవ్వని మేము ద్వేషించుచున్నామో,
అట్టివానిని మీ తాపశక్తిచే తపింపజేయుడు,
మీ దీప్తిశక్తిచే మండింపజేయుడు,
మీ దుఃఖదాయకశక్తిచే శోకింపజేయుచు,
మీ తేజశ్శక్తిచే నిస్తేజస్కునిగా జేయుడు ”

“ ఓ విషశక్తీ, నీవు ఈ భయంకర సౌందర్య నారీరత్నమునందు సంపూర్ణవేగముతో కూడుదువుగాక,

ఓ కాలకూటవిషమా ! నీవు లోకాలను దహింతువు, నీ దహనశక్తి మా శత్రువును దహించివేయుగాక,

ఓ దంష్ట్రికరాళ మృత్యుమూర్తీ ! నీ వీబాలికయందు ప్రవేశింపుము.

ఓ సౌందర్యనిధులైన దేవతలారా ! ఈ బాలిక ప్రతి అవయవమునందు, ప్రతి ఇంద్రియమునందు, ప్రతి శక్తియందు ఆవేశింతురుగాక,

“ ఓ ఉషోదేవతా ! నీ వీబాలిక ముఖమగుదువుగాక
ఓ చంద్రమూర్తీ ! నీ వీ బాలిక వదనమగుదువుగాక
ఓ మిత్రావరుణులారా ! మీరీ కన్య రెండు నేత్రములగుదురుగాక
ఓ అగ్నీ ! నీ వీబాల కన్నులతో వెలిగెదవుగాక
ఓ మేరుపర్వతమా ! నీ వీ యువతి స్తనముల శోభింతువుగాక
ఓ నదీ దేవతలారా ! మీరీ బాలిక నాగారులగుదురుగాక
ఓ శచీదేవి ! నీ వీ బాలిక పెదవులపై నర్తించెదవుగాక.

ఓ ఆకాశమా ! నీవీ సుందరి వశమునందు చేయుము

ఓ మరుద్దేవతలారా ! మీరీ యువతి ఉచ్ఛ్వాసనిశ్వాసలయందు మసలుదురుగాక.

ఓ మంత్రిమా ! నీవు మహాశక్తితో మా విరోధుల నీ బాలికకడకు ఆకర్షింపుము. నీ వామె వాక్కులలో, చూపులలో, పెదవులలో, ఆమె స్తనములలో చేరుము.

ఈ బాలిక శర శోగయగుగాక

ఈ సుందరి శ్రీకృష్ణసాతవాహనుని అగ్ని శలభము నాకర్షించినట్లు ఆకర్షించుగాక

ఈ బాలిక శ్రీకృష్ణసాతవాహన విగ్రహమునకు వలయగుగాక

ఈ సుందరి శ్రీకృష్ణసాతవాహనుని మృత్యువగుగాక

ఈ యువతి శ్రీకృష్ణసాతవాహనుని దగ్ధము సేయుగాక !"

అనుచు వశీమంత్రించుచుండ నా బాలిక మైమరచి, ఊగిపోవుచు, రంగులతో ముగ్గులు పెట్టిన పద్మపురంగవల్లిలో నిలిచియుండెను.

ఆ బాలికపై స్థాలతిష్యుడు మంత్రజలము జల్లినాడు. ఆమెనుముట్టి ప్రయోగహస్తము పట్టినాడు.

మధ్యాహ్న మార్తాండునిగలె తేజరిల్లు మోముతో స్థాలతిష్యుడప్పుడు సభ్యులదిక్కు మొగంబై

" ఈ బాలిక దివ్యాస్త్రము
ఈమె ప్రయోగింపబడిన మృత్యువు
స్వచ్ఛమై స్నిగ్ధకాంతులతో మెరయు
నక్షత్రము లామె కన్నులు,

"అందు వెలుగు పూవులు, మృదులను వాసనా లహరీపూర్ణములగు మనోజశరములుకావు, భయంకర దావాగ్ని కీలలు,

" ప్రవాళబింబములా యధరములు, ప్రవాళకాంతులు, కల్యాణాలా పరమ సౌందర్య నర్తనములు; అవి సుధానిధానములు కావు, తక్షకవదన దంష్ట్రాయితములు.

" సమస్తశివపూజలకు ప్రాణరసమర్పించు పావనక్షీరదంబులకు పుట్టినిళ్ళు, ధరాధరములా ? మదగజకుంభములా ? ఈ సుందరీవక్షోజములు; ఇవి దుగ్ధాంబోధి మథనసంజాతామృతకలశములు కావు, కాలకూట విషకుంభములు.

" ఆ దేహమున జాంబూనదరజః పరాగములు రేగుచున్నవి. ఏమిమార్దవము ! తరుణ లతకే కోమలమగునిది అగ్నితప్త కనకక్రకచము.



రూపెత్తిన యీ పరమాద్భుత శిల్పోదయము యీ మనోహరమృత్యువు, యీ సమ్మోహనశాపము, యీ రమణీయాగ్నికీల, యీ మహోజ్వలవిద్యుజ్జిహ్వ, యీ బాలిక. "

స్థాలతిష్యుడు కంపితహస్తముచాచి "పండితులారా! ఈమె నా ముద్దులమనుమరాలు. నా కుమారుని కీమె యొక్కతే సంతానము. నేను నా పుత్రునెట్లు ప్రేమించియుంటినో, నా ప్రేమకు ప్రతిరూపై యాతడెట్లు శుశ్రూష చేసెనో అవి లోకమున కెరుక." స్థాలతిష్యులకు కన్నుల నీరు తిరిగినది. బొటనవ్రేలితో నాతడు బాష్పములు విదిలించికొనెను. "అట్టి మహాపండితుడు సుకుమారరత్నము దివంగతుడైనాడు. మహాపతివ్రత నాకోడలు పతిదేహముతో సహగమనము చేసినది. తలిదండ్రుల ప్రేమకు దూరమైన ఈ శిశువు మదేకగతి, ఈ వృద్ధుడు తదేకగతి. ఈమెను మనయజ్ఞమునకు ధారపోసితిని. ఈమె దేహప్రాణములు, మానము అంతయు జగద్ధాత్రి లోకపావనియగు మహాశక్తికి అర్పించినాను. తండ్రి చంద్రబాలయని నామకరణము చేసెను." స్థాలతిష్యుని కన్నులంత జాజ్వల్యమానమై, "ఈమెను పరమేశ్వరుని కంకితమిచ్చితిని. నా నిధానముగ వైదికధర్మాగ్నిలో కల్పితిని. ఈమెయే మన సర్వవాంఛలను దీర్చు కల్పవృక్షము. ఈమెయే ఈ పుణ్యభూమిని పవిత్రమొనరింప జన్మించిన కామధేనువు."

అతని తెల్లనిగడ్డము, ఊర్ధ్వశిఖరచించిన ధవళ జటాజూటము, పండుపంటిదేహచ్ఛాయ ఇటునటు ఊగిపోయినవి.



# చతుర్వింశతి పరికరణము

## శంఖము

అంతవఱకును జూచుచుండగనే చరితకిషయ ఫణిగోడవలె బలిసియున్న పడుమవాడును, నాగదేశమున కృష్ణామండలాధిపతియు నగు మలయనాగప్రభువు సోమపానము చేసి మత్తిల్లిన కరిశుకస్తువలె లేచినాడు. కండలుకట్టిన తన రెండు చేతులు ముందుకు చాచి, తన చూపులు ఎఱ్ఱనై, విషకన్యకమోము పరికించుచు, ఉన్మత్తుడై, అగ్నిని కౌగిలింపబోవు శలభమువలె, వ్యాఘ్రిమనుజూచి వృత్త్యవశమున దద్విన్యస్తాస్యమున నుఱుకు లేడివలె, ఇతరులు అడ్డుపడులోపల ఆ బాలవంక పరుగిడిపోయి యామెను కౌగిలించి, యామె పెదవులు ముద్దిడబోయినాడు.

ఆ బాలిక భుజములు రెండును గట్టిగ నదిమిబట్టినాడు. వృక్షముల వల్లికామతల్లికవలె నున్న యా విషకన్య యా కర్కశ హస్తపీడనమున కోర్వజాలక, అతని చుంబనమున కోపగించుకొని, తల వెనుకకు వంచినది. ఆమె నిశ్వాసములు భయంకర సుడిగాలి పూత్కారములై, మలయనాగుని నాసికారంధ్రములలోనుండి, తెరచియున్న నోటిలోనుండి లోనికిబోయినవి. సభాసదులిందఱులో నా దురాచారుని చేతులనుండి బాలికను విడిపించిరి.

మలయనాగుడు ఆ విషవాయువుల పీల్చిన వెంటనే కనులు తిరుగ, నోట నురుగులు గ్రమ్మ, చాపచుట్టవలె నేలపై ఢిలుమనబడెను.

సభ్యులందరు గొల్లుమనిరి. చంద్రబాల క్రోధస్వరూపిణియై రోజుచు, ఇటునటు ఊగిపోవుచుండెను. ఆ బాలిక కేశపాశము వదులై ఊగిపోయి, మేఘములు క్రిందికి దిగునట్లు వక్షమున పడిపోయెను. తప్తజాంబూనద కలశములవంటి ఆమె వక్షోజములు పైకి ఉబుకుచు, తగ్గుచునున్నవి.

ఆమె మహోగ్రశక్తియను, భయంకర కాళికాదేవి, ఆమె శివత్రిశూలము, ఆమె చక్రధార!

సభ్యులందరు భీతులై, వైవర్ణ్యమొందిన మోములతో దావానలముజూచు అరణ్య మృగములవలె వణకిరి. స్థాలశిష్యులు విభ్రాంతానందముతో కలకలలాడు పెదవుల నొక శంఖ మొత్తుటయు, నలువురు సేవకులు వచ్చి యా శవమును తరలించిరి.

మలయనాగుడు ఆంధ్రదేశములో నివసించు కొన్ని నాగవంశములకు ప్రభువు. ఆంధ్రార్యులకంటె ముందుగనే ఆంధ్రదేశమునందును నాగులాక్రమించుకొనియుండిరి. ఉన్నతశరీరులు, శ్యామలాంగులునగు నాగులు ఉత్తరభూములనుండి వచ్చి దక్షిణాపథమును



రామాయణముకాలానంతరమందాక్రమించిరి. అంతకు ముందే స్వల్పసంఖ్యాకులగు నాంధ్రార్యులు కృష్ణవేణీ ముఖ ప్రాంతమున నివసించియుండిరి. పాండవకాలమునాడార్యులు విరివిగా వచ్చి నాగదేశము జొచ్చి నాగులతో సంబంధ బాంధవ్యముల నెరపుచుండిరి. ఉలూపి కథయు, పురుకుత్సుని గాథయు నిట్టివియే.

నాగులకు సామంతరాజ్యములుండెను. అట్టివారిలో మలయనాగు డొకడు. నాగులందరును బౌద్ధమతావలంబకులే. కాని పట్టుదల గలిగిన బ్రాహ్మణులు కొందరు వీరికి ఆర్యదీక్షలనిచ్చి తమ వైపునకు త్రిప్పికొని వారిచే విక్కుటమగు సహాయము నందుచుండిరి.

సభ్యులలో భయమిసుమంతయు తగ్గలేదు. మహావనశాల గ్రామమున సభా కార్యక్రమము నిర్వహించిన వ్యక్తి లేచి భక్తియు, భయమును గదిరిన కన్నులతో స్థాలశిష్యుని దిక్కు మొగంబై యిట్లనియె. "మహాఋషీ! మలయనాగుడు నాగులలో నుత్తమవంశ్యుడు, ఆతడు మాయమగుట ప్రజలకును, ఆంధ్రరాజునకును తెలిసినచో మన జీవయాత్రలు ధాన్యకటక పాతాళగృహంబుల గడపవలసినదే! ఇప్పుడు మనకు దారియేది?"

స్థాల:— ఓ శివస్వామీ! నీవు తూగకు కనుగుట తెలిసిపోయినది. మలయనాగుని వపువు ఓషధీరసంబుల చెక్కు చెడకుండును. ఏ భక్తునకు ఫాలనేత్రుడు, సర్వసృష్టికారణుడు, మహాలింగమూర్తి సర్వవిషశక్తులనిచ్చెనో యాతనికా పరంజ్యోతి వాని విరుగుడుల ప్రసాదింపడా? హాలాహల విషంబుల నవలీలగ ద్రావిన లోకేశ్వరుడు విషనివారణమంత్రముల నాతని పాదముల భజించు భక్తులకు సమకూర్పడా? అప్పుడే మలయనాగుని శరీరము ఓషధులచే తడుపబడెను. మహావిషపూరితయగు నా బాల! నా ప్రాణములకు ప్రాణము! నా కోర్కెలకు నిధానము, చంద్రబాలయొక్క నిశ్వాసముల వడిని తగ్గింప ఒక వారము దినములు పట్టును, అంతవఱకు నా [illegible] పడియుండవలసినదే.

ఆ వృద్ధుడు కన్నుల విస్ఫులింగములు రాలుచుండ, ఉచ్చైస్స్వరమున నిట్లనియె. "సభాసదులారా! మీరే యిట్టి ధర్మవ్యవహర్తలుకండు. నా బాలను మహేశ్వరున కంకితమొనర్చితిమి. పవిత్ర వేదమత పుణరుద్ధరణ మహాకార్యమునకు నియోగించిన యీ శుభాంగియెడల పాతక మొనర్ప నెంచిన యీ కర్మచండాలుడు జీవింపవలసినదేనా? జీవమిచ్చినపక్షమున దైవాయుధమగు నీ బాలయందు మరల మరులుకొని మన ప్రయత్నములు భగ్నముచేయడా?"

మహేశ్వరానందుడు:— స్వామీ! ఈతని మరణమెట్లు కప్పిపుచ్చగలము?

స్థాల:— రెండుదినములలో నొక రథము ఈతని శరీరమును ఈతని పురమునకు గొనిపోగలదు. ఊరిబయట చేతనొక కత్తితో నీతడు పడియుండును, ప్రక్కనే నాకడనున్న పామొకటి రెండు తుండెములై కాలికడ పడియుండును. ఆతని కాలిమీద పాముకాటు స్పష్టముగ కనబడును.

అక్కడనుండు సభ్యులకు దేహము జలదరించెను.

శిల్పచక్రవర్తియు, అఖిలభారతదేశ శిల్ప బ్రాహ్మణ వంశమువారిలో మహోన్నత యశోవిరాజిత చరిత్ర కలవాడును అయిన ధర్మనంది ఆ చైత్యమును దివ్యమొనర్చి ధర్మ చక్రములు, చతుర్ముఖములు, ఆయక స్తంభములు నిర్మించెను. ప్రదక్షిణపథ మేర్పరచెను.

ప్రదక్షిణ పథమును చుట్టి ప్రాకారరేఖ ధర్మనంది రచింప నారంభించి, వందలకొలది యున్న తన శిష్యులచే ఊర్ధ్వస్తంభములు, సూచులు, ఆబంధికములు, ఉష్ణీషములు, నిర్మించ ప్రారంభించినాడు.

బుద్ధధర్మము మహాస్థవిర వాదమనియు, మహాసాంఘిక వాదమనియు రెండుమార్గముల ప్రవహించినది. మహాసాంఘికవాదమున ఆంధ్రులు తమకున్నకళారక్తిచే, కళావేశముచే మహాచైత్య వాదము నుద్భవింపజేసికొనినారు.

ఈ శిల్పవాదము భారతవర్ష మంతయు నిండి, యీ జంబూద్వీప మంతటినుండియు శిల్పుల, ఆచార్యుల, శ్రమణకుల, భిక్షుల ఈ మహాపథప్రస్రవణ స్థానమైన ధాన్యకటకమునకు సంవత్సర చక్రము లన్నింటిలో శిష్యులుగా పంపుచున్నది.

ధర్మనంది మహాచైత్య వాదమునకు ముఖ్య శిల్పాచార్యుడు. ఆతని పవిత్రహస్తము రచించిన త్రిరత్నము లయిన పద్మములు బోధివృక్షములు, చైత్యములును, ప్రజ్ఞా స్వరూపములైన జాతక గాథలును లోకవిఖ్యాతి నందినవి.

ఆ సంపూర్ణ జ్యోత్స్నా కాంతిలో సువర్ణశ్రీ తన తండ్రిగారి శిల్పాచార్యత్వమును జూచుచు, ఉప్పొంగిపోవుచు, తన శిల్పపుంబనుల గమనింపుచు, ఆ పనులలో తక్కిన శిష్యుల పనితనమునకన్న ఎన్నియోరెట్లు మిన్నయగు పనితన మున్నను, తన తండ్రిగారి పనితో పోల్చిచూచిన, తన పనితనములో ఏదో అపరిణితి యున్నదని యనుకొనెను

ఈ ఆలోచనలు మైగుబాళింప, ఆతడు ఆపవిత్ర చైత్యము ఎదుట సాష్టాంగపడి లేచి మోకరించి బౌద్ధమంత్రములు జపింప ప్రారంభించినాడు.

అట్టి మహోత్తమ రచనాప్రజ్ఞ ధారణచేసిన ఒక బాలికా రూపముకడ నాతదృష్టి ప్రసరించి, తన తల్లి శక్తిమతీదేవి పోలికలందు గుర్తించినాడు.

తనకు తెలియక ఈ విచిత్ర రహస్యము ఇంత కాలమెట్లు దాగున్నది?

ఆర్యక స్తంభ చూళికా వ్యాజమున దేవిప్రతిమగా తనతండ్రి యౌవనవతియైన తన తల్లి శిల్పచిత్రమును రచించినాడు.

త్రిభంగియై కుబేరాక్షీ వృక్షము నానుకొని లతవలె వంగి, ఎడమచేత లీలాపద్మ విలాసముగ బట్టుకొని, కుడిచేత లీలాపాటలీ పుష్పము ధరించి, స్వాపలతను లీలగా



స్పృశించుచు, జటాశిఖ ధరించి సర్వాలంకారయై, యా బాలిక తోరణశిఖ వాతాయనాంతర్గతాలంకార శిల్పరూపమున విన్యసింపబడియున్నది.

సుందరీమణులగు లతాంగులకును శిల్పమునకున్న యద్భుత సమయ రహస్యములు సువర్ణశ్రీకుమారున కెన్నడు ప్రత్యక్షము కాలేదు.

ఇప్పుడాతని సర్వశిల్పశాస్త్ర మంత్రములొక్కసారి పవిత్రగాన శ్రుతులై స్పందన మొనర్చినవి.

ఆ విగ్రహమును తదేక దీక్షతో గమనించుచు సువర్ణశ్రీ లేత రావిచెట్టువలె నిలుచుండిపోయినాడు. సమున్నత శరీరియైన యా బాలుడు స్వర్గమునుండి దిగివచ్చిన దేవ కుమారునివలె నున్నాడు.

ఆతని హృదయములో శిల్పశక్తి ఊర్మికలై, ప్రవాహములై, ఉప్పొంగి మహా ప్రళయమైనది. అతడు సర్వము మరచినాడు.

ఆ శక్తిప్రవాహములు ప్రవహించి, ప్రవహించి ఒక పవిత్ర క్షేత్రమున వేరొక పుణ్యభూమినుండి ప్రవహించివచ్చిన సురదీర్ఘికా నదీమతల్లియైన ప్రేమశక్తితో సంగమమై పోయినవి. ఆ దివ్యప్రయాగమూర్తియగు నొక దేవి యచ్చట దర్శనం బిచ్చినది. మనోహర గంధ మలయ పవనములు సువర్ణుని చుట్టివేసినవి.

ఆ దివ్యమూర్తి నాట్యదేవతవలె ప్రత్యక్షమై, వివిధాంగహార మనోజ్ఞ రేఖా విలాసినియై, సంపూర్ణ రాగరంజిత మనోజ్ఞ గీతికా గానాభినయ కంఠియై, విద్యున్మాలినీహార చలిత పీనవక్షయై తోచినది.

ఆ మూర్తి నాట్యము చాలించి ఎదుట నిలిచినది. ఆ స్వప్నసుందరివైపు బల పూర్ణములై, మహా నాగములవలె శక్తివంతములై, మనోహర ప్రౌఢరేఖా సమన్వితములై భద్ర దంతావళీ కుంభములవలె భుజములు కలవాడయిన ఆ శిల్పి తన రెండు చేతులు చాచి మోకరించినాడు.

“ఓ శిల్పదేవీ! సకలమనోజ్ఞభావపరిపూర్ణ రూపా, సర్వరాగ నర్తిత కల్యాణబాలా! పరిమళ పుష్పాలంకార వైభవోపేత పారిభద్రతరు మూర్తీ! నీవు ఈ వెన్నెలలో నాకు ప్రత్యక్షమైనావా?” అని అస్పష్టవాక్కుల నా ప్రత్యక్షమువైపు చూచి నమస్కరించి నాడు.

పులకితానంత శిరీష వృక్షమగు నాతని విగ్రహము ఆ వెన్నెలలో ప్రతిరోమ మంజరీ మూర్తివలె తేజరిల్లిపోయినది.

ఆతని కంఠము ఇంకను స్పష్టత తాల్చినది. మధురాభిషేకోచిత శంఖవినిర్గత స్వనములై యాతని మాటలు వెలువడినవి.

"హిమబిందువా నీవు! ప్రఫుల్ల నీరేజహృదయస్థ ప్రాతఃకాల తుషారబిందువువా నీవు!"

అంత నాతని యా స్వప్నమధ్యమునుండి "బాలనాగీ దారి యీ మనవే!" యన్న మాటలు వినవచ్చినవి. ఆత డులిక్కిపడి తలయెత్తి స్వప్నలోకము పటాపంచలై మాయమగా! నెదుట హిమబిందుకుమారి నిజముగ నిలుచుండుట గమనించి, సిగ్గునంది, చటుక్కున లేచి వెనుకకు తిరిగి పారిపోయినాడు.



# షడ్వింశతి ప్రకరణము

## రాగారుణచ్ఛాయలు

సువర్ణశ్రీకుమారుడు తనసౌధమున కెట్లో చేరెను. సర్వనందియిల్లు చతుశ్శాలాంతరమైన హర్మ్యము. ఈ హర్మ్యమునకు రెండు మేడలున్నవి. ఒకమేడ శుద్ధాంతజనము వసించునది. ఆ మేడవెనుక స్త్రీ జనాశ్రయమైన మండప గృహమును, నూతికాగృహమును ఉన్నవి. మేడలమీదకు పోవుటకు రెండు సోపాన పంక్తులుకలవు.

సువర్ణశ్రీ కుమారుడు దక్షిణ సోపాన పంక్తినెక్కుచు సౌధములోని తన మందిరము లోనికిపోయి యామందిరమునకున్న శయనాగారముచేరి పర్యంకమున బోర్లగిలబరుండి మహాచైత్య సందర్శన సమయ దివ్యనాటికను స్మరించుకొనుచు భయపడుచు, ఉప్పొంగుచు, వివిధాలోచనాధీనుడై జాగర స్వప్నవశుడైనాడు.

తనమాట ఆమెవిని యున్మత్తునిగ భావించ లేదుగదా! తానట్లు చేసినాడేమి? తన యింటికి వచ్చిన యా బాలిక యింతటిలో నచ్చటి కెట్లు వచ్చినది? నిజముగ నామె యచ్చటికి వచ్చెనా? ఆమె ప్రత్యక్షము నిజమైన సన్నివేశమేనా? తనలోని కాంక్షయే యట్లు రూపెత్తి వచ్చినదా? నిజముగ నామెయే వచ్చియుండవలయు. ఏలనన, యామెకు కొంచెము ఎడముగ వెనుక వేరొక్క బాలిక కనంబడినది. ఇంకను వెనుక దూరముగ యిరువురి వృద్ధ స్త్రీలమాటలు వినబడెనవి. తానట్లు స్పష్టముగ ఉచ్చరించిన వాక్కుల విని యా దివ్యసుందరి నిజముగ తన్ను మతిహీనునిగ నెంచియుండును.



ఆమె పండువెన్నెలలో పోతపోసిన స్వర్ణవిగ్రహమై ఎదుట సాక్షాత్కరించినది. ఆమెఏమనుకొనిననేమి? అట్టి యతిలోక సౌందర్యమునకు పూజాదికములే కనుక నున్నచో షోడశోపచారము లర్పించి యుండునుగదా!

ఆమెయెక్కడ, తానెక్కడ? వర్తక సామ్రాట్టయిన చారుగుప్తుని తనయయెడ, దరిద్ర శిల్పిబ్రాహ్మణ కుమారుడైన తానేడ.

మరల తనకా బాలిక సందర్శన మిచ్చునా? సౌందర్య ప్రత్యక్షమును పూజా పీఠిక నలంకరింప గోరని శిల్పియుండునా! ఆమె సరగున యీ బీదయింటియందు వాసము చేయగలదా..

ఇంతలో అతనికి మహానస గృహమునుండి గణగణ జయగంట విన్పించినది. తండ్రిగారి అర్చన పూర్తియైనదని యనుకొనుచు సువర్ణశ్రీ లేచి మేడమెట్లుదిగి స్నానగృహమునకు పోయినాడు. పనికత్తె అచ్చట వేడినీళ్ళు తోలిపి పెట్టియుంచినది.

స్నానగృహముకడనున్న అంగ సంస్కారకుడు వచ్చి దేహమంతయు మార్జనలంది ఉద్వర్తన మొసర్చి స్నానముచేయించినాడు.

పురుషస్నానగృహమునకు నాగబంధునిక వచ్చి "అన్నా, యింతయాలస్యము చేసినా వేమి, ఎచ్చటకు పోయితివి, అట్లుమాయమై పోయినావు. నీశిల్పగృహంబునకు వారందరు వచ్చిరి. నీవులేనైతివి. నీకొరకు తోటయంతయు, దొడ్డియంతయు చెల్లి వెదకినది. నీవు అదృశ్యుడవైతివి. పాపము, నాస్నేహితురాలు కొంచెము ఖిన్నమందినదిసుమా, పలాయనమంత్ర పారాయణ కథానాయకుడవైతివేమి," అని మేలమాడెను.

"నీవేళాకోళముల కేమిలే!"

"నావి వేళాకోళములు, తానుపారిపోవుట వీరనికక్రమక్రియయట. ఇంటికి చుట్టములు స్నేహితులు వచ్చినచో పారిపోవు పెద్దమనుషితనము మా అన్నగారిది. ఆ శిల్పమట్టిది, యీ శిల్పమిట్టిది అని నీవు చెప్పనక్కరలేదా."

"ఓ మగపిరికిదుచెల్లీ, నీకు తెలియదా! నీవేల చెప్పవైతివి? ఎవరో శుద్ధాంత కాంతా జనము వచ్చిరట! నేను వారియెదుటబడి యిది యిది, అది అది, అని చెప్పవలెనట!"

"ఎవ్వరికిని ఏమియు చెప్పనక్కరలేదులే. శుద్ధాంతకాంతాజనము, వీరవిక్రమ విహారజనము ఎవరైన వచ్చినప్పుడు మా అన్నగారు లేడి పిల్లవలె బెదరి, చెంగునఎగిరి పొదలలో ఆ నిబిడ కాంతారములో మాయమైపోవునట. ఈ ధైర్యమే కాబోలు మొన్న శకటపందెములో నెగ్గించినది."

ఇంతలో సిద్ధార్థనిక వీరున్న తావునకు వచ్చినది.

సిద్ధా:— అన్నా! నీవుయెచ్చటకి పోయినావు? హిమబిందును, ఆమెఅమ్మమ్మయు, ఆమె మేనత్తయు నాయనగారి బొమ్మలును, నీబొమ్మలును దీక్షతో గమనించినారు. హిమబిందు అక్కను, నన్నును ఎన్ని ప్రశ్నలువేసినది. అక్కయెంతయూ చిత్రముగ మాట్లాడినది.

నాగ:— నేనేమి చిత్రముగా మాట్లాడినానే? ఇంత వెఱ్ఱినాన్నవు. నాకు చెల్లెలవై పుట్టినావేమే! హిమబిందు నిన్నట్లు ముద్దుపెట్టుకొనినప్పుడు నీవంత సిగ్గుపడితివేమి?

సువర్ణ:— ప్రపంచములో అందరును నీకు సిగ్గుపడువారే.

సువర్ణశ్రీ కుమారుడు భోజనమునకై దుకూలము ధరించి పురుషాలంకార గృహమునకుపోయి యచ్చట మార్జనునిచే తలదువ్వించుకొని ముడిరచియింపించుకొని, పైనచీనాంబరమును కప్పుకొని తిలకము దిద్దుకొని, యీవలకు వచ్చునప్పటికి, మహాలియు, శక్తిమతీదేవియు, సిద్ధార్థనికయు, నాగబంధునికయు యెదుటప్రత్యక్షమైరి.

నాగ:— అమ్మా! అన్న భయపడి పారిపోయినాడే.

సిద్ధా:— అన్న భయపడుటేమి? ఎవరో ఆడవారు వచ్చినారు గదాయని ఎచ్చటికో వెళ్ళినాడు.

నాగ: ఎచ్చటికో వెళ్ళినాడు. గబగబ పర్వెత్తుచు యెచ్చటికో వెళ్ళినాడు.

శక్తి: ఊరుకోవేతల్లీ. క్రొత్తవారి యెదుటపడుటకు అన్నకు కొంతసిగ్గువేసిన దానినంత గడబిడచేసెదవేమి?

నాగ: అన్న శిల్పములు చూచుటకువారు వచ్చిరాయెను. పోనీనాన్నే హితురాలీయనకు క్రొత్తా? ఆయునమట్టుమ మేమందరమును నాట్యము చేసితిమి.

మహా: ఉండవమ్మాతల్లీ, అన్నగారినట్లు దుమ్ము పట్టుకొంటివేమి. నీవులేవా, అన్నియు చెప్పుటకు, వారు సువర్ణుని చూచుటకు వచ్చిరా? నాయనగారురచించిన, అన్నరచించిన బొమ్మలు చూచుటకు వచ్చిరా?

సిద్ధా: అమ్మ, అక్కయెప్పుడును నన్ను అన్నను యీవిధముగానే వేళాకోళములు చేయుచుండునే. నాకుఎప్పుడో కోపమువచ్చును. నేనునాన్నగారితో చెప్పితీరెదను.

సువర్ణ: అందరు ఇచ్చట చేరినారు. అచ్చట నాయనగారు ఆరాపాటికి జపముచాలించియుందురు. పసందైన భోజనములకు. అమ్మయును, మహారాణియు వడ్డనకు [illegible]



తండ్రిగారును, సువర్ణశ్రీయు, ముప్పది నలువురు విద్యార్థులును భోజనము చేసిన వెనుక సేవకుడు కరదీపిక చూపించుచుండ, వారందరు ధర్మనంది శిల్పవిద్యాగారమునకు బోయినారు. అచ్చట దంతాసనముపై కృష్ణాజినముపై ధర్మనందివసించెను. చుట్టును కుడ్యములనంటియున్న శాద్వలాసనములపై విద్యార్థులును, సువర్ణశ్రీయు నధివసించిరి.

ధర్మనంది గ్రంధపీఠముపై అలిఖిత భూర్జపత్రి శిల్పశాస్త్ర గ్రంథమునుంచి, అది చూడకనే బాలురకు శిల్పశాస్త్ర జ్ఞానముపదేశింప నారంభించెను. భరత నాట్య సూత్రములు శిల్పసూత్రములు, రూపరచన ప్రమాణము, అంకము, ధారణము, రూపప్రతిరూపములు, మానప్రతిమానములు. దేవతామనుష్య గుహ్యక వానరాది ప్రమాణములు, ఉత్తమపురుష లక్షణములు, స్త్రీ, స్త్రీయాకారములు, పద్మ, సుఖ వీర, యోగ ప్రవిధానములు; అభయ, వరదజ్ఞానాదిముద్రలు; లంబ, లీల, లోలాదిహస్తములు; సమ, ద్వితీయాతిభంగాదిభంగిమములు, పద్మ, పద్మపత్ర, మత్స్య, కురంగ, చక్రవాకాదిలోచన భేదంబులు; గరుడ, సమ, శుక తిలపుష్పికాది నాశికాభేదంబులు, ధర్మనంది దేశికుడై గంభీరకంఠమున ఆపవిత్రసమయమున శిష్యులకుపదేశించెను.

ఈ పాఠము జరుగుతున్నంతసేపును సువర్ణకుమారుని మనస్సు హిమబిందు తన యింటికి వచ్చుట, తానుపారిపోవుట, స్థూపముకడ మరల నాబాలికను సందర్శించుట, ఏవేవో పిచ్చి మాటలు, తానుపలుకుట, ఆమె 'దారియీనునవే!' యనియనుట, ఈ దృశ్యములన్నియు నాతని మనోనయనాల ఎదుట ప్రవాహ తరంగములతీరి ఒకటివెంటనొకటి వచ్చిమాయుచు కాసాగినవి.

# సప్తవింశతి ప్రకరణము

## వసంతసౌరభము

పదునారు సంవత్సరములు నిండి పదునేడవ సంవత్సరము రాబోవు తరుణవయస్సున బాలికలకు వసంతోదయప్రారంభము. ఆవసంతమునందు సౌరభములిడుకొనుచు ఉప్పొంగి వికసించబోవు మల్లికా కుట్మలము హిమబిందు.

చిన్నతనమునుండియు మహారాజ కుమారికలకు జరుగని వేడుకలు, లాలనలు, ముద్దులు ముకిపెములు, హిమబిందునకు నెలనెలకు జరిగినవి.

హిమబిందుతల్లి ప్రజాపతిమిత్రి. ఈమె సర్వభారతీయ దేశములతో వర్తకమొనర్చు కీర్తిగుప్త వణిక్సంభవున్ని కుమార్తె. కీర్తిగుప్తులవారు ధాన్యకటక నగరమునందు విశాలమైన రాజవీధిలో తనభవనము నిర్మించుకొని వర్తకము చేయుచుండెను. ప్రతిష్ఠానమునందు పాటలీపుత్రమునందు, ఉజ్జయినియందు, పిష్టపురము, దంతిపురము, కాంచి మధుర, తామ్రలిప్తి, భరుకచ్ఛము, కౌశాంబి, మహాశకవతి, కన్యాకుబ్జము, పురుషపురము, ప్రయాగ, పుష్కలావతి కాశీ, కపిశ, తక్షశిల మొదలైన ప్రసిద్ధనగరములందు తన వర్తకస్థానముల నేర్పరచుకొని మహోత్తమ వణిక్ప్రముఖుండని పేరుపొందినాడు.

ఆదినములలో గాంధారమున యవనులు రాజ్యము చేయుచుండిరి. యవనవర్తకుడైన దెమిత్రియసును, కీర్తిగుప్తుడును గాఢమిత్రులైనారు. వీరివస్తువులు వారు, వారివస్తువులు వీరు వర్తకమునకై మార్చుకొనుచుండిరి. వర్తకమునకంతయు వ్యవహారమనుచుండిరి. వస్తువులు వర్తకమునకై మార్చుకొనుట, వస్తువులు ఋణమునిచ్చి కొనుట, మూల్యమునకై అమ్ముట క్రయ విక్రయమందురు. వ్యవహారమును ఋణమందురు. ఎగుమతి దిగుమతులు మొదలైనవన్నియు వ్యవహారమే. అమ్మకమునకు, కొనుటకు గలవస్తువులన్నియు పణ్యములు. వస్తువులు వర్తకమునకై అమ్మువారు, కొనువారు, వణిజులు లేక వణిక్కులు.

ఈవ్యవహారములు సల్పువారిలో కుల, మత, జాతిభేదములన్నియు నున్నవి. కాని భారతదేశమునందు యీ వ్యవహారము చేయువారు ముఖ్యముగ వైశ్యులు.

ఈ అరణీయులలో వ్యవహారము చేయువారు వ్యావహారికులనియు, పాశుపాల్యులనియు క్షేత్రసంస్కార్యులనియు మూడువృత్తులవలంబించు వైశ్యులున్నారు.

వ్యవహారము సలువువారలలో క్రయ విక్రయులు వస్తువిక్రయసాలలు పెట్టుకొనువారు, వణిక్కులు వడ్డీవ్యాపారస్థులును, పెట్టుబడిదారులును. సంస్థానికులు యితర దేశములతో ఎగుమతి దిగుమతులొనర్చువారు. వీరినే సార్థవాహులు, సార్థకులు అనియు పిలుతురు. ఈవణిక్కులలో ప్రభువులపక్షమున గనులు త్రవ్వించువారును అటవి వస్తువులను సేకరించువారుగ రెండువిధములవారున్నారు.

నిమియను రాజు వర్తకశాస్త్రమును రచించినాడట. ఆశాస్త్రమునుబట్టి వర్తకులు వైదేహులనుపేరును సముపార్జించుకొనిరి. వర్తకులకు వర్తకసంఘములున్నవి. వానిని సంస్థానములందురు. సంస్థానికములనియు పేరును కలదు.

కీర్తిగుప్తుడనేక జనపదములందున్న సంస్థానములలో ఉత్తమసభ్యుడు. కొన్నింటికి ధ్యక్షపదవి వహించియుండెను.



ఆంధ్రవర్తకులలో కాశ్మీరముతో వర్తకము చేయువారికి కాశ్మీరవణిజ, గాంధారముతో చేయువారికి గాంధారవణిజ మొదలైన పేరులున్నవి. కీర్తిగుప్తుడు నానాదేశ వణిజుడని పేరుపొందినాడు. ఆతనికడ కోశికులు, మాద్రులు, కాశ్మీరులు, గాంధారులు, మాళవికులు మొదలైన వర్తకులు ఎంపకోయుండిరి.

కీర్తిగుప్తుడు గాంధారమునుండి ఉత్తరపథమున పారశీక, బాహ్లిక, తురుష్క, వనాయు, కాంభోజ, కశ్యపసముద్ర, యవన దేశములతో కూడ వర్తకము చేయుచుండెను, అతనికి సర్వభాషలు గళగ్రాహ్యములు. ఏదేశమునకు [illegible] ఆదేశపువాడనియే భ్రమించియుండిరి.

ఈనాడు కీర్తిగుప్తులవారికి డెబ్బదిరెండు సంవత్సరములున్నవి. ఆయనకు ఆంధ్రదేశములో వివిధ ప్రదేశముల ఉద్యానవనములు [illegible] నెన్నో కలవన్ని యున్నవి. ఆర్యావర్తమునందు దక్షిణాపథమందు ప్రతి ముఖ్యనగరమునందును కీర్తిగుప్తునకు వణిక్శాలలు భవనములు ఉన్నవి.

కీర్తిగుప్తుడు ముప్పది సంవత్సరముల ఈడువాడైయున్నప్పుడు, ప్రయాణములొనరించి తక్షశిలానగరముజేరి తనభవనమునకుబోయెను, కీర్తిగుప్తుడు ప్రసిద్ధవర్తకుడగుటచే నాతని రాక వచ్చిన మరుఘడియందు వర్తకలోకమునకంతయు తెలిసిపోయెను. నాలుగు గుఱ్ఱములు పూన్చిన రథము నెక్కి [illegible] స్నేహితుడగు దెమిత్రియసు అతితొందరగ పరువిడివచ్చినాడు.

దెమిత్రియసు శూరసేనియు, మాగధీలు ఆంధ్రభాషయు మాటలాడగలడు. కీర్తిగుప్తునకు యవనభాషయు, పారశీకము బాహ్లికాది మ్లేచ్ఛభాషలు కొన్నియు వచ్చును. వారిరువురు కలుసుకొనగనే ఇరువురొకరినొకరు కౌగిలించుకొనినారు.

దెమిత్రియసు వెంటనే కీర్తిగుప్తుని యాతని భృత్యులతో భోజనము చేయుటకై తన ఇంటికే కొనిపోయెను. ఆయవన వర్తకుని భవనము భారతీయ భవనములవలె నుండలేదు. యవనుని భవనము ఒక అద్భుత వనాంతరమున నున్నది. ఆవనమునందు ద్రాక్ష, ఆలివ, యవనసారంగ, అంజీర, ఖర్జూర, దాడిమ, బాదము, [illegible] మొదలైన ఫలవృక్షములు, లికుచ, రసాల, జంబు, పనస, [illegible], బదరీ, నారికేళ, [illegible] మొదలగు భారతీయ ఫల వృక్షములున్నవి. నాగవల్లాది, అనేక పుష్పజాతులున్నవి. [illegible] అవాని మధ్యవేదికలపై పాలరాతి యవనదేవతా విగ్రహములు కలవు.

భవనస్తంభములు వేరు. భవనము విశాలము. అనేకమందిరములున్నవి. మధ్యశాలలో శృంగారసరస్సులున్నవి. అపాలోయను సూర్యదేవుడు, [illegible] అను చంద్రదేవత ఆఫ్రొదితీయను గ్రీకు శృంగార రసాధిదేవి, జ్యూసు, జ్యూనో అను ముఖ్య దేవదంపతులు, విజ్ఞాన

దేవియగు ఎథీనీ, జీవిత సౌఖ్యదేవుడగు బాఖస్, లోకవార్తాహరుడు హెర్మిస్ దేవకన్యలు మొదలగు పాలరాతివిగ్రహములు, యవనకలశములు అందందు అలంకరింపబడియుండెను. ధూపకరండములనుండి సువాసన ధూపము లెగయుచుండెను.

ఇరువురుకూర్చుండు పరుపుల సుఖాసనముపై వారిరువురధిష్టించిరి. పారశీక సేవకులు జలకలశముల హస్తప్రక్షాళన జల ప్రతిగ్రాహకములు తెచ్చుటయు, వారిరువురు హస్తముల కడుగుకొనిరి. కొందరు బాహ్లీక సేవకులు రెండు భోజనపీఠముల గొనివచ్చి వారిరువురిఎదుట నుంచిరి.

భారతీయేతరమగు మ్లేచ్ఛదేశముల బానిసత్వమప్పుడు విరివిగనున్నది. కొందరు బాలికలగు బానిసలు సౌందర్యదీప్తులగువారు వచ్చి, గ్రీకువాద్యములపై వాయించుచు, యవన, బాహ్లీక, హీబ్రు, పారశీకాదిభాషలలో పాటలుపాడుచు నాట్యమొనరింప నారంభించిరి. భారతీయనాట్యమునకు నానాట్యములకు ఎంతయో భేదముండెను. కీర్తిగుప్తున కివి యన్నియుఁగ్రొత్తవికావు.

అప్పుడు బానిసలగు బలసంపన్నులగు న్యూబియాబాలికలు మోయు యూదబాలికలు వింజామరలువీవ, పారశీక, బాహ్లీకసుందరులు గొడుగులుపట్ట, హస్తాందోళికముపై అత్యంత సుందరియగు నొకజవ్వని వీరిరువురు కూర్చున్నకడకు వచ్చెను. బానిసలగు సేవకులు కొందరు దంతసింహాసనమచ్చటనుంచిరి. అందలముదిగి ఇరువదివర్షముల ఎలప్రాయంపు నామిసిమి. మిత్రారి ఒయ్యారముగ నడచివచ్చుచు నాసింహాసనముపై నధిష్ఠించెను.

దెమిత్రియసు కీర్తిగుప్తునిచేయి పట్టుకొని యామెకడకు గొనిపోయి ఎరుకపరచెను ఈమె, 'పెర్లా' నాచెల్లెలు, ఈతడు "కీర్తిగుప్తుడు నాస్నేహితుడు" అని ఒకరికొకరి ఎరుక పరచెను.

అదిమొదలు కీర్తిగుప్తుడు 'పెర్లా' (ముత్యము) దేవికి తనహృదయము, తన సర్వస్వము ధారపోసెను. పెర్లాకాతడు ముక్తావళీదేవియని నామముంచుకొనెను.

రెండుమూడు నెలలలో వారిరువురికి వివాహముజరిగెను. ఆదంపతులజీవితము సకలానందపూరితమై మహారాగమైనది. కతిపయ మాసముల వారు ఆంధ్రదేశము తరలివచ్చిరి. ముక్తావళిగర్భమున ప్రజాపతిమిత్రి ఉద్భవించెను.

ప్రజాపతిమిత్ర యవన భారతీయసౌందర్యములన్ను సుగుణములను రెంటిని తనలో సంగమమొనరించుకొనినది. ఆమె చిన్నతనమునుండియు ఏ లోకమునుండియోవచ్చిన బాలవలె తేజసొత్తాసై, ఇతరులతో కొలదిసంభాషణమే జరుపుచు, తానొక్కరితయ ఆడుకొను చుండెడిది.



"వెఱ్ఱిది" "విచిత్రమైనది" అను మాటలు చుట్టములు, పక్కములనువారు. "ఎచ్చటి పిల్లనో కొనివచ్చి చేసుకొనిన, వెఱ్ఱిసంతానము పుట్టదుటమ్మా!" యని కీర్తిగుప్తుని అక్కచెల్లెండ్రు.

ప్రజాపతిమిత్రికు యవ్వనమంకురించి దేవలోకమునుండి దిగివచ్చుమూర్తివలె నడి. చదువులో మొదటిబిడ్డ, సంగీతములో ప్రథమబాలిక, నాట్యములో ఊర్వశి.

ఆ పరమ సుందరాంగిని జూచి, చారుగుప్తుడు, ఆమెపాదములమ్రోల తనప్రాణము, ఆత్మ పుష్పాజాపుష్పముల జేసినాడు.

కోటీశ్వరుని తనయుడైనను, సర్వవిద్యాపారంగతుడై, బలసంపన్నుడై, రసగ్రహణ శాలీనుడైన చారుగుప్తునే వరించినది ప్రజాపతిమిత్రి.

వారిరువురి వివాహముతో తులతూగినవి సీతారాముల వివాహమనియు, యశోధరా సిద్ధార్థుల వివాహమనియు పలువురు చెప్పుకొనిరి.

ప్రజాపతిమిత్రి ఇల్లాలిగా నింటికివచ్చినప్పటినుండియు చారుగుప్తుడు ఇతరము సర్వమునంపూర్ణముగ మరచిపోయినాడు.



# అష్టావింశతి ప్రకరణము

## స్వర్ణప్రతిమ

ప్రజాపతి కాపురమునకు వచ్చిన రెండేడ్లకు చారుగుప్తునకు హిమబిందుద్భవించినది.

ప్రజాపతిమిత్రి ఆనందమునకు మేరలేదు. చారుగుప్తుడు సీతదొరికిన జనకమహారాజుకన్న ఎక్కువ ఆనందము నందినాడు. వారిరువురు ఉమ జన్మించిన మేనకా హిమవంతులకన్న ప్రకాశించిపోయినారు. లక్ష్మి యావిర్భవించిన గంగా సముద్రులకన్న ఉప్పొంగిపోయినారు.

కోటీశ్వరేశ్వరుడైన వినయగుప్తుడు శ్రీకాకుళమునుండి, కావేరి పట్టణమునుండి తామ్రలిప్తినుండి, భరుకచ్ఛమునుండి, సువర్ణద్వీప, బలిద్వీప, యవద్వీప, సింహళద్వీప కాకుసద్వీప, మలయద్వీప, నీలద్వీప, అనుద్వీపాది ద్వీపానేకములతో నారకేళ, ప్రవాళ

ప్రజాపతిమిత్ర హిమబిందును చిన్నబాలికగా ఎత్తుకొనురోజులలో, శక్తిమతీదేవి ధర్మనందులవారిచే బాలనెత్తికొనిన మాతృమూర్తిని ధవళశిలా శిల్పముగ విన్యసింపజేసెను. చారుగుప్తుడా రెండవ ప్రతిరూపము తన పూజామందిరమున నెలకొల్పెను.

భార్య దివంగతురాలైన రెండవ సంవత్సరమున అమరనంది, ధర్మనంది ఇరువురు ఇదివరకున్న ఆమె ప్రతిమల విమర్శించి, తమస్మృతి శక్తిని సహాయముగొని ప్రజాపతిమిత్రను పద్మాసనాసీనగా, ప్రజ్ఞాపారమితాదేవిగా నిండుబంగారు విగ్రహముగ పోతపోసినారు. ఆస్వర్ణ సంపూర్ణవిగ్రహము హిమబిందు పూజాగృహమున పూజాపీఠ మలంకరించినది.

హిమబిందుకుమారి దినదినము ఉదయముననే స్నానాదికము లాచరించి సర్వాలంకారయుక్తయై శుభ్రవసనముల ధరించి మాతృవిగ్రహమును పూజసేయును. తన హృదయమంతయు తల్లితో నివేదింపని దినమామెకు లేదు.

పూజయంతయు సలిపి, ఒకనాడా బాలిక ఆ స్వర్ణదేవికడ మోకరించెను. ఆమె రెండుచేతులు తల్లి బంగారు తొడలపైనిడి మోమామె పద్మాసనముపై నుంచెను.

"అమ్మా! పలుకవేమే?"



# ఏకోనత్రింశతి ప్రకరణము

## తల్లి అనుమతి

"అమ్మా, నీవు ఎక్కడున్నావు? ఎక్కడనుండియో వచ్చితివి, అక్కడికే పోయితివి. నన్ను నీగర్భమున కంటివి. ఇంత చిన్నతనములో నన్ను వదలి, నన్ను దారి తెలియనిదానను చేసి మాయమైపోతివి."

ఉత్కృష్ట శిల్పరూపమగు ఆ జాంబూనద విగ్రహము హిమబిందు మాటలకు ఏమి ప్రతివచింపగలదు.

హిమబిందునకు చిన్నతనమునుండియు దూరమైన తోచు ఏదియో ఆశ. అది ధనము కాదు, సంపదగాదు, వైభవముకాదు. మహారాణులు కనివిని యెరుగని నగలామె మందసముల నున్నవి. మానవమాత్రు డూహింపజాలని విచిత్ర వస్త్రాతిశయములామె పేటికలలో



పాము కుబుసములై, పలుచని మబ్బులమడతలై, పుష్పపుటములై, స్వప్నములై, శ్రీమద్రామాయణశ్లోకములై జాలువారుచున్నవి.

చారుగుప్తుడా బాలిక యివి యూహింపగలుగును అని యెరుగరాని పూవుజాతులు, దేశదేశములనుండి సేకరించి వానికి తగు ఎరువుల, శీతోష్ణస్థితుల, హిమబిందు క్రీడావనముల పెంచుచున్నాడు. అవి జపాకుసుమజాతులు. అవి నీలనదీ తరంగడోలార్ద్ర సహస్రదళ కమలములు. ఇవి మల్లికజాతులు. అవి సంపెంగలు. ఇవి శేఫాలికలు. అవి కదంబములు. అక్కడ సూర్యకాంతములు. ఇచ్చట పారసీకమునుండి వచ్చిన గులాబకావళులు. ఇవి సంపూర్ణదాడిమీపుష్పములు. అవి చీనాదేశమునుండివచ్చిన అరుణచేరులు. ఇచ్చట కరవీరములు. అవి సహస్రఫణి ఛత్రఛాయాస్థిత నాగలింగములు. ఇవి వకుళములు. ఇవి మాలతీలతలు. అవి మాధవీలతలు.

తనతోటి చెలులకు పుష్పవనవాటులుచూపి గర్వముపొందుటకు అవి హిమబిందున కుపకరించునవి. పదునేడేండ్లు గడచు మిసిమివయస్సును ప్రాభృతము కొనివచ్చినప్పుడు ఆ వయసున ఆ నూత్నయౌవనపు పుల్కరింపులలో హిమబిందునకు పుష్పవనవాటులు నగలు నాణెములు ఆటలు పాటలు ఆనందము సమకూర్చలేకపోయినవి.

ఒకప్రక్క అప్రాదితీదేవి భౌతికవాంఛలు గాఢకాంక్షలు, ఉడుకురక్తములు, తీరని కోర్కెలు ఆమెకు వరమిచ్చినది. వేరొకప్రక్క సాధుమూర్తియై చతుర్విధ పురుషార్థ ప్రదాయినియైన మాయాదేవి శాంతము, శ్రద్ధ, భక్తులను అరణమిచ్చినది. ఈ రెండు మహాశక్తులు చిన్ననాటనే ఆమెకు తెలియక ఆమెలో మహత్తర గంభీర సుడిగుండముల జన్మింపజేసినవి.

మొదటిదినాలలో తాను సమవర్తిని ప్రేమించితి ననుకొన్నది. ఆమెకు ప్రేమోదంతములు, రహస్యకాంక్షలు, అవ్యక్తాందోళనమును కలిగించినవిగాని యిది ప్రేమ, యిది ప్రేమ కాదని ఎట్లు స్పష్టపరచగలవు?

గ్రీకుబాలికలు పురుషవాంఛలుతీర్చు దివ్య సౌందర్యమూర్తులు. పొంకములు తిరిగిన వారి యవయవముల ప్రత్యణువు పురుషస్పర్శ కాంక్షించును. భారతీయబాలికలు పురుషులకు ఉత్తమపథాలకు చేయికొని నడుపుకొని పోవుదేశికలు.

ఇట్లు గ్రీకు యువతి గాఢకాంక్షలు, భారతీయాంగనా శేముషీ సంపన్నతయు, స్వాతంత్ర్య భావజనిత జన్మ రాహిత్య గాఢాభిలాషయు ఆమె హృదయపథముల ప్రతిస్పందనము కలుగజేయుచునేయున్నవి.

ప్రజాపతిమిత్ర పూర్ణభారతీయాంగన. ముక్తావళి పెంపుడు భారతీయలలన. అయినను ఆమె యవనస్త్రీయే.

హిమబిందు తనకు తెలియరాని ఆవేదన తన్ను పొదివికొనినప్పుడు చిన్నతనములో తల్లికడకు పర్వెత్తి, ఆమెఒడిలో తలదూర్చి, వెక్కి వెక్కి ఏడ్చునది. ఆ అతిలోక లతాంగి తనకోమలిత మూర్ధముపై చేయి నిమురగనె హిమబిందున కారాటము తీరిపోయి ఏదియో దివ్యానందము ముంచివేయునది.

నేడాబాలిక తల్లికడకు పర్వెత్తినది. తల్లి సువర్ణవిగ్రహము. హిమబిందు ఆతల్లి కర్కశ స్తనములపై తనమోమును పొదిగికొని "అమ్మా! నాకీ ఆవేదన ఏమిటే! నాయనగారినిఓడించి దేవతామూర్తివలె ఆబాలకుడు విజయసింహాసన మధిష్ఠించియుండ నేను వెఱ్ఱిదానివలె ఆతని చుట్టు నాట్యముచేసితిని. అది తప్పా అమ్మా?"

ఆబాలిక కన్నుల గిఱ్ఱున నీరు తిరిగిపోయినది. మోమెత్తి తల్లిమోమును చూచుచు "నాకిట్లు ఆ బాలునిచూడ యీ విపరీతపు కోర్కెలేమి అమ్మా!" "ఆబాలుని చూడకపోయిన నేను బ్రతుకలేనను భయము కలుగుచున్నది. అది తప్పుకాదూ? ఏవియో నాయనగారి ఆలోచనల కాతడు అడ్డమువచ్చినాడని నా నమ్మకము. అమ్మా, అట్టి బాలునిగురించి ఆనాటినుండియు నేనాలోచింపని క్షణమొక్కటియు లేదే! అది ఎంతతప్పు."

మరల హిమబిందు కన్నులనుండి ముత్యములు స్రవించి, కరిగి పాటలములగు ఆమె కపోలములనుండి దొర్లిపోయినవి.

"నేనేమి చేయవలెనో చెప్పవా అమ్మా?" తల్లిముఖమును తదేకదీక్షతో చూచు ఆ బాలికకు ఆవిగ్రహము పెదవులకదిపినట్లు తోచినది.

"నీవు పో తల్లీ, అంతయు శుభము జరుగగలదు", అని తనతల్లి చెప్పినట్లామెకు స్పష్టముగ కాకలీస్వనములు వినబడినట్లయినది.

మఱుసటిక్షణమున ఆబాలిక గంతువైచి లేచి మాతృవిగ్రహమునకు సాష్టాంగ నమస్కృతులిడి కలకలనవ్వులు పూలతోనిండిన వృక్షములవలె యామె మోమున ప్రత్యక్షముగా నాట్యమాడుచు ఆబాలిక పూజాగృహమునువీడి, "బాలనాగీ, బాలనాగీ", యని కేకలు వేయుచు పర్వెత్తినది.

ఒక్క చిటికెలో బాలనాగివచ్చి ఎదుట నిలిచినది.

"మా అమ్మమ్మ ఎక్కడనున్నదే?" అని హిమబిందుఅడిగినది.

"భోజన మైనప్పటినుండియు వారు వారిమందిరమున విశ్రమించియున్నారు" అన్న బాలనాగి యుత్తరమిచ్చినది.



హిమబిందు విసవిస నడచుచు తన ముత్తవ గదిలోనికి పోయినది. ఆమె యప్పుడే లేచి మొగము కడుగుకొనుటకు తన స్నానగృహంబునకు చనినది. హిమబిందు బాలనాగి వెంటరా నా గృహంబునకు పోయినది.

ముక్తావళీదేవి పన్నీట మొగము కడుగుకొని పరిచారిక లందిచ్చు శుభ్రవసనములచే తుడుచుకొనుచు నొక పీఠముపై నధివసించియుండెను. ఆమె మాటలలో యౌవనాపభ్రంశోచ్చారణ కొంచెమున్నది.

"అమ్మమ్మా. అమ్మమ్మా" అని ఇంతలో హిమబిందు పరుగిడుకొని అటువచ్చింది. మొగముపైనుండి తుడుచుకొను వస్త్రముతీసి ముక్తావళీదేవి మనుమరాలిని చూచి...

"అమ్మడు! ఇదేమి యిటులవచ్చితివి? ఆ పరుగులేమి? నీ వెప్పుడును [illegible] నీకు ఒక్కక్షణము నిలుకడలేదాయెను. ఏమంత తొందరగ యని ప్రశ్నించినది.

హిమ:_అమ్మమ్మా, నీవు శక్తిమతీదేవిని ఎరుగుదువా?

ముక్తా:_ఎరుగుదునమ్మా నా కన్నతల్లియు, ఆమెయు చిన్నతనమున [illegible] మున మెలగువారు. వారిరువురకు సంగీతమున, నాట్యమున, సాహిత్యమున, జ్ఞానమున, గురువు లందరు నొకరే. శక్తిమతియింటికి నా కన్నతల్లి పోవునది.మా యింటికి శక్తిమతి వచ్చునది. అవియన్నియును ఎప్పటికిని మరుపురావు.

ముక్తావళి కన్నులనీరు గిఱ్ఱున తిరిగినది, ముక్తావళీదేవికిప్పుడు యాబదితొమ్మిది సంవత్సరములు మాత్రమే యైనను, తలయంతయు [illegible] గాఢవిచారమున ముగ్గుబుట్టవలె నెరసిపోయినది.

హిమ:_అమ్మమ్మా, యీ దినమున మనము శక్తిమతీదేవిగారి యింటికి పోవలెనే, వారి అమ్మాయి నాగబంధునికయు నేనును చదువుకొంటిమి. శక్తిమతీదేవిగారిభర్త నెరుగుదువా?

ముక్తా:_ ఆ ఎరుగకేమితల్లీ ధర్మనందులవారు మహోత్తమశిల్పి. మా గ్రీసుదేశపు శిల్పములకన్న వీరిశిల్పములందేదియో విచిత్రత, ఏదియో మహోన్నతి, నాకుతోచును.

హిమ:_అవిఅన్నియు చూడవలెనే!

ముక్తా:_ తల్లీ! యీ మూడేండ్లనుండియు ఎచ్చటికైన కదులుచుంటివా తల్లీ,

హిమ:- అమ్మమ్మా, మనము వెళ్ళితీరవలెను. నాకు అమ్మ జ్ఞాపకమువచ్చి యీ దినమున అతిబెంగచే బాధపడిపోయినాను. మనమెక్కడికైనను వెళ్ళకపోయినచో నాకు మతి యేపోవును.

ముక్తావళి హృదయమున గజగజలాడి అలాగునే అమ్మా. అమ్మాయి అమృతలతకు వార్తపంపెదను. మీ తాతగారలిరువురును సంఘారామమువిడిచి రారాయను. అన్నగారు వినయగుప్తులవారు బౌద్ధభిక్షుదీక్ష తీసికొనెదరని అందరును చెప్పుకొనుచున్నారు. ఈ దినము సాయంకాలము మనము ముగ్గురము బాలనాగిని తీసుకొని శక్తిమతీదేవిగారి యింటికి పోదము లే అన్నది,



# త్రింశతిప్రకరణము

## శిల్పసందర్శనము

హిమబిందుకేలనో భయమువేసినది ఏమియు తోచదు. అలంకారికురాలగు తారాదత్తను పిలువనంపి తనకున్న మంచివస్త్రములను, వస్త్రములను తీయుమన్నది. పాముకుబుసములబోలు సన్నని దుకూలములు చిత్రవిచిత్రవర్ణములు జెలువొందినవి యామె హారముగా దోచినది. పలిపెమూలు నెమలిపింఛికాప్రాభైన సదృశములై జిలుగుల తళుకునునునవి నచ్చలేదన్నది. మిలమిలలాడు మడతల కులుకులీను అంబరములుగని పెదవి విరిచినది. ఎట్టకేలకామె బంగారువన్నె అంతరీయము ధరించినది. వివిధవర్ణ సురేంద్రచాపసౌందర్యముగ సుచేలకము కటిభాగ మలంకరించినది. రత్నతారకలు పొలుపారు సువర్ణమేఖల నొయ్యారంబుగ నెన్నడుముక్రింద మొల నూలుతాల్చినది. వక్షోపరిసానువుల మేఘమాక్రమించునట్లు ఆచ్ఛాదనోత్తరీయము నీలరుచుల వెలుగుగా సొబగుచేసినది. తుల్యరహిత హారపంక్తులు ఎత్తువల్లముల ప్రవాహములుగా రచించినది. చంద్రబింబముపై రోహిణివలె గోహితలలాటికము తాల్చినది.



వేణీభరమును ఆంధ్రస్త్రీలెప్పుడు నూహింపజాలని విధమున రచింపించుకొన్నది. వేణీరచయితలు, మార్జనికలు, అలంకారికలు ఒకజాముపైన ఆమె యలంకారవిజయ యగునప్పటికి నలిగిపోయినారు.

హిమబిందు తీవితో నొరులకడ గంభీరతవహించి సంచరించినను, ఇష్టమువచ్చినవారికడ లోనడంగియున్న బాలికానందము మరుగుపరచలేదు. చంటిపిల్లదానివలె గంతులువేయును, కలకలనవ్వును, ఆటలాడును, చిరుగాలులవలె సంతోషమునై సంచరించును. కూర్మివారి హాస్యమాడును. చిన్నతనమునుండియు పిల్లలులేని చారుగుప్తుని కొమారిత బాలునివలె పెరిగినది. బాలికా విద్యతోపాటు బాలురవిద్యలును నేర్చినది.

నాల్గు ఉత్తమాశ్వములు పూనిన రథము, తెల్లకంబళి ఛత్రముగా గప్పబడినది, చిత్రశిల్పకౌశల్యము కలిగి మెరుగులీనునది, ధర్మనంది మహాభవనముకడ ఆ సాయంకాలము పదమూడవ ముహూర్తనాదము పట్టణములో ననేకప్రదేశముల ప్రతిధ్వనించునప్పటికి వచ్చి యాగెను. అందు స్త్రీజన ముండిరని తెలియుటతోడనే లోనుంచి పరిచారికలువచ్చి వారినెదుర్కొనిరి. తోరణముకడ మహాలియు, శక్తిమతియు ఎవరువీరా యని యాశ్చర్యపడుచు ఎదుర్కొని తెలిసికొనిరి. సేవకురాండ్రు రజితపాత్రంబుల సుగంధజలంబుల నర్పింప కాళ్ళు గడిగికొని లోనికిపోయిరి. పరిచారికలు శుభ్రవసనముల వారి పదములద్దిరి.

వారందరు అభ్యంతర మందిరములకు పోయిరి. అచ్చట సుఖాసీనులై వివిధవార్తల ముచ్చటించుకొనిరి. కొమార్తెను తలంచుకొని ముక్తావళీదేవి వాపోయెను. అందరును కంటనీరు పెట్టుకొనిరి. ముక్తావళీదేవి, శక్తిమతిని పిల్లలెంతమందియని యడిగెను, ఏమిచేయుచున్నారని యడిగెను. వారిరువురు యెరిగియున్న కాంతలగూర్చి మాట్లాడిరి. ఈలోన సిద్ధార్థిని వీరు వచ్చిరని అక్కతో అన్నతో చెప్పుటకు పోయినది. నాగబంధునికి సత్వరమునవచ్చి హిమబిందును కలుసుకొన్నది. హిమబిందును నాగబంధునికయు నెయ్యముతో సంగతులేమియో ముచ్చటించుకొనిరి. నవ్వుకొనిరి. నాగబంధునికకు హిమబిందు నేడేల యింత విచిత్రముగ యింత సౌహార్ద్రముగ తమయింటికివచ్చి తనతో మాట్లాడుచున్నదో అర్థమైనది.

అందరును ఇల్లుచూచుటకు బయలువెడలిరి. వైభవమునకును, వైశాల్యమునకు ఔన్నత్యమునకు చారుగుప్తుని మహాభవనముతో ధర్మనందిసౌధము సరిపోకపోయినను, సౌందర్యమునకు దానితో కేవమాత్రము తీసిపోదు సరిగదా మించియుండును. హిమబిందు కళానిధియగుటచే యా మందిరములు చూచి ఆనందించెను. ముక్తావళీదేవియు, అమృతయు, శక్తిమతియు వెనుక

బడుటచే నాగబంధునికయు, హిమబిందును మురిసిపోయిరి. హాస్యములాడుచు కిఫ్ఫున నవ్వుకొనిరి. చప్పట్లు కొట్టుకొనిరి. అట్లా మందిరములన్నియు తిరిగి బాలికలు సిద్ధార్థినికతో కూడి తోటలోనున్న శిల్పమందిరములకు జనిరి. అచ్చటకు మహాశిల్పభవనములు విశ్వబ్రహ్మ లోకములే! ఆ మందిరములు ఎన్ని సభాభవనము లున్నవో వారు విభ్రమమంది గమనించలేక పోయినారు.

ఆ విశాల శిల్పశాలలలో స్తంభములు గుండ్రముగ నునుపులై పద్మశిరోపరిభాగముల పటలమును మోయుచున్నవి. స్తంభములపై, పటలములపై, చిత్రికలపై చిత్రలేఖనము సహస్రమూర్తియుతములై, వివిధవర్ణ కాంచన సమాహ్వానములై, లలితాంగ హారాంకితములై, సకల చిత్రలేఖన కళాలంకార శిల్పరూప వృక్ష, పక్షి, జంతు, లతా పుష్పసమన్వితములై రసజ్ఞుల వివశుల చేయుచున్నవి.

ఆ మందిరముల ఎందరో విద్యార్థులు పని చేయుచున్నారు, చిత్రములు లిఖించుచున్నారు, రాళ్ళు సరిచూచుచున్నారు, శిల్పకర్మకు ఉచితములైన శిల శాస్త్రవిధానమున సరిచూచుచున్నారు, చెక్కుచున్నారు, కొలతలు చూచుచున్నారు, నునుపుచేసిన రాలపై చెక్కుటకు బొగ్గుచే రూపవిన్యాసము చేయుచున్నారు.

ధర్మనందులవారు కొందరి శిల్పముల సరిచూచుచున్నారు, సరియైన రాల నేరి పరీక్షించుచున్నారు, విన్యాసములు సరిగా యున్నవియు లేనివి కనుగొనుచున్నారు, కొందరికి శాస్త్రమునుండి సూత్రముల వివరించి, ఇదియిట్లు, అదియట్లు అని చెప్పుచున్నారు.

అతిథులై వచ్చిన యా ఉత్తమాంగనల శుభభాగ్య కొనిరా! ధర్మనందియు, బాలకులు లేచి నిలుచుండి వారికి గౌరవ మొనర్చిరి.

ఆ బాలకులందరును హిమబిందు అందము చూచి, పనిమాని గురువుగారున్న వారనుమాటయే తలపక పనులన్నియు మాని, తదేకదీక్షతో నామెను చూడసాగినారు. ఈ దృశ్యము చూచి ధర్మనందియు నాశ్చర్యమందెను.

హిమబిందు, తనముత్తవ చెలికత్తెలతో బాటు శిల్పపుంజముల గమనించి యాశ్చర్యమున మునింగినది. లోని ఉబుకు ఆ ఆరాటమునకు కారణమైన విజయి యగు నాబాల శిల్పియేడి యని యాశ్చర్యమందినది. సిద్ధార్థినిక ఆబాలికతో నవ్వుచూ, తనయన్న తోటలో నున్నవాడని చెప్పినది



వారందరా మందిరములలోని అనేక స్థితులలో నున్న శిల్పము, చిత్రలేఖనము అన్నియు పరిశీలించినారు. ఆ మందిరములనుండి నిర్గమించి, వేరొకచోటనున్న సువర్ణశ్రీ శిల్పమందిరములు చూడబోయిరి.

అచ్చట హిమబిందునకు పరవశత్వమే కలిగినది. ఏమి ఈ బాలుని పనితనము? ఆవి ఆతని శిల్పములో అవి చిత్రలేఖనములా?

ఆదేమిటీ! ఆగోడపై త్రిభంగిగా నిలుచుండిన బాలికామూర్తి ఎవరు? తానే తానేల? ఓహో! అందరును ఆబొమ్మను గుర్తించిరి. హిమబిందును చిత్రలేఖనముగా రచించుట సువర్ణశ్రీకేమి యవసరము? అని ముత్తవముక్తావళి అనుకొన్నది. ఎంత అందముగా నున్నదా బొమ్మ. అచ్చముగ హిమబిందు. ఆమెను అచ్చట నొక దేవీమూర్తివలె రచించినాడీబాలుడు.

అమృతలతాదేవికి, తన మేనకోడలిని ఈ బాలకుడిట్లు లిఖించుట ఇష్టము లేకపోయినది.

హిమబిందు పొందిన ఆశ్చర్యమునకు మేరయే లేదు. ఎందుకీబాలుడు తన చిత్రము లిఖించినాడు? ఎంత పనితనము! ఏమియా చిత్రచమత్కృతి. ఆవస్త్రాదికములు, ఆనగలు పందెము దినమున నాట్య సమయమున తాను ధరించినవే.

ఆమె హృదయము ఏలనో రాగములు పాడినది. అమృతలతాసుందరి ఆలస్యమైనదని కేకలు వేయుచూ త్వరితముగ వారిని బయటకు తోసుకొచ్చినది. హిమబిందునకు కొంతమాత్రమట్లు పోవుటకు ఇష్టము లేదు.

సువర్ణశ్రీ ఎచ్చటను కనబడడేమి? దాగుకొనినాడా? ఊరలేడా? ఎక్కడికైన ప్రయాణమైపోయినాడా? ఆమెకు ఆరాటము ఇనుమడించినది. ఒక అనువున ఆమె సిద్ధార్థినికను మీ అన్నయేడి యని చెవిలో రహస్యమున నడిగినది. సిద్ధార్థినిక పరుగెత్తిపోయి హిమబిందును, ఆమె చుట్టములును వచ్చినారని అక్కతో చెప్పుటకు వేగమున వెళ్ళినప్పుడు కృష్ణాతీరమున నాయనగారుండుట చూచి, యక్కడకుబోయి, యక్కతో చెప్పి పంపించి మరల తాను వచ్చినది. అన్న అక్కడే యుండుననుకొని, ఇప్పుడు నామె యచ్చటుకుబోయినది. ఆతడక్కడ లేడు.

తోటయంతయు వెదకినది. తోటమాలీల నడిగినది. వారిచే వెదకించినది. తమ భవనముల వెతకినది. సేవకులచే వెదకించినది. సువర్ణశ్రీ ఎచ్చటను లేడు. ఏమైపోయినాడు?

ఆమె వచ్చి హిమబిందు చెవిలో అన్న ఎచ్చటికో పోయినాడని చెప్పినది.

హిమబిందునకు ఆశ్చర్యము, కోపము, విసుగు, విచారము వచ్చినది.

ఇంక నామె కేమియు తోచలేదు. తొందర తొందరగ అన్నియు చూచుట ముగించి, 'వెళ్లెదమ'ని శక్తిమతితో నామె యనినది.

నాగబంధునికయు, శక్తిమతియు, వారిని ఇంకను ఉండుమని కోరిరి. ముక్తావళీదేవి శక్తిమతితో నింతవరకు తన తనయనుగూర్చి ఎన్నియో చెప్పి వాపోయినది. ఆమె కన్నుల అశ్రుధారలు ప్రవాహములై పోయినవి. శక్తిమతియు దన స్నేహితురాలి సుగుణముల వేనోళ్ల పొగడుచు, కన్నుల నీరునిండ విచారించినది. అందరికిని అశ్రుధారలు వాకలైనవి.

అమృతలతాదేవి వేగిరము చేయ, వారు మువ్వురును బాలనాగియు బయలుదేరిరి.

కస్తూరిచే సమ్మిళితమగు కుంకుమబొట్టు శక్తిమతీదేవి, ముక్తావళీదేవికిని, హిమబిందునకును మోమునననుంచినది. నాగబంధునిక వారి పాదములకు లత్తుక నలదునది.

పద్మరాగమున నెత్తివారి, చిరుతామర మొగ్గలరీతి మంజులములై, ఆర్ద్రములై, నవ కంబులీను వేళ్లగలిగి, ముక్తావళీ హిమబిందుల ఇరువురి పాదంబులు తన చేతికాంతులతో వియ్యమొందునప్పుడు నాగబంధునిక ఆపాదద్వితీయ సౌందర్యమునకు నాశ్చర్యమందినది. హిమబిందు పాదములు తన యన్నగారి శిరస్సును సత్యాదేవి పాదములు శ్రీకృష్ణుని తాడన మొనర్చునట్లు తాడన మొనర్పగునని యామె యాలోచనల మునింగినది.

గంధమలంది, సువాసనద్రవ్యము లర్పించి. ఘూతీఫలములు, నాగరంగములు, ఖర్జూరములు, దాడిమాదిఫలములు, బాదమిపప్పు, పారపప్పు మొదలయినపప్పులు లవంగ, దాల్చిన ఏలకి, జాజి, జాపత్రి, మొదలయిన సువాసనద్రవ్యములు, సుందరవస్త్రములు, ముక్తావళికి హిమబిందునకు శక్తిమతీదేవి యర్పించినది.

సిద్ధార్థినిక లోనికిపోయి, అయిదు లిప్తలలో పరుగునవచ్చి, హిమబిందునకు సువర్ణపాత్రి నొకటి యత్యంత మనోహర శిల్పవిన్యాసము కలదానిని తన తండ్రిగారమ్మని వారని చెప్పుచు సమర్పించినది. ఆ పనితనమునకు ఆ బాల ఎంతయో ముదమందినది.

వారందరు తమ స్యందన మారోహించి తమ భవనమునకు బోవుచుండ, హిమబిందున కేమి తలంపు కలిగినదో, "అమ్మమ్మ, మహాచైత్యమునకుపోయి, ఆరాధన చేయవలె" నని యున్నది. ఆ మాటలకు ముత్తవ ప్రతి ఆడకుండగనే సూతునకు రథము మహాచైత్యముకడకు పోనిమ్మని ఆజ్ఞ యిచ్చినది.

ఏ మధుర భావ ఫలశ్రుతి నాశించి హిమబిందచ్చటకు పోగోరెనో, అది అచ్చటనే ఆమెకు సిద్ధించి సువర్ణశ్రీ దర్శనమిచ్చినాడు. అది ఏమి విచిత్రమో తనకాతడు సాకరిల్లినాడు.

# హిమబిందు

## ద్వితీయ భాగము

## ప్రథమ ప్రకరణము

### ముట్టడి

సమవర్తి యుద్ధమున అరితేరినబంటు. కాన వినీతమతికి సర్వవిధముల తోడగుటయే గాక, అతడు పశమింపునప్పుడు తానే ఆధిపత్యము వహించి లగ్గలకెగబ్రాకు విరోధులత్రోలి వేయుచుండెను. కోటగోడలను, కందకమునకు విరోధిసైన్యములు దూరముగ, అఖండయంత్ర ప్రయోగశక్తిచే తరిమివేయుచుండెను.

ఒకనాడు సమవర్తి గుర్రముపై నధివసించి, కోటగోడలకు బురుజులకు ద్వారములకు బోవు రహస్యంపు దారులన్నియుగలియు మూలప్రదేశమున నిలచి, తనకడనున్న చారులతో మాట్లాడుచు, నాలోచించుకొనుచుండెను.

ఒకడు:- స్వామీ మనకడనున్న భోజనసామగ్రులు కొంచె మెచ్చుతగ్గగ అయిపోయినవి. శత్రువుల రహస్యచారులు మనము త్రాగునీళ్లలో రెండుసార్లు విషముకలిపినారు. ప్రయత్నము విఫలమైనను ఎప్పటికప్పుడు భయముగానున్నది.

ఇంకొకడు:- ఆర్యా ఉన్న నాలుగు సర్వతోభద్రములు (రాళ్ళువిసురునవి) చూర్ణములైనవి, పదునాలుగు జామదగ్న్యములు (వివిధబాణముల వరపు యంత్రములు) పాడై, ఒక్క యంత్రము మాత్రము ఉత్తరద్వారముకడ పనిచేయుచున్నది. ఆరు దేవదండములు (అనేకములగు పెద్దమేకులతో వాడిగానున్న దూలములను విసరునది) పదునొకండు విశ్వాసఘాతములు (బరువువస్తువులను వేగముగా విరోధుల పిప్పిచేయును విసరుయంత్రములు) శతఘ్నులు, వరాహకర్ణములు, కనాయములు, కర్పణములు మొదలగు ఉపకరణము లయిపోయినవో, అయిపోవుచున్నవో.

మూడవయతడు:- ఇంతవరకు ఒక పది దినములనుండి మనవేగులవారు పైనుండి లోనికి వచ్చుటగాని, లోనుండి పైకిపోవుటగాని జరుగుటలేదు. మూడు రాత్రులలో పనులుగుఱు

చారులను పంపినాము. కాని విరోధులు వారినిగ్రహించి కారాగృహములనుంచి నిజమును నరయుటకు వారిని బాధించుచున్నారని తెలియుచున్నది. ఎంతమంది వెళ్ళినారో అందరి పేరులు తెలియఁజేసినాను.

నాల్గవదళవాయి:- వీరోత్తమా, శస్త్రవైద్యుల మందులైపోయినవి. గాయములు తగిలినవారు అదృష్టవంతులైనచో జీవించవలయును. లేనిచో దివంగతులు కావలయును.

సమవర్తి కన్నులు మిరుమిట్లుగొలిపినవి. అతనికి భయమనునది లేదు. శత్రువులు తన్నుపెట్టుబాధలు అతనికి మరింత ఉత్సాహముకలుగఁజేయును. మీసములు మెలిపెట్టుచు "ఆంధ్ర సైన్యముల నన్నింటిని నురుమాడినను, వారి అస్త్రములు నుగ్గయిపోయినను, వారి అశ్వములు విజయు పొందును. మనకేమియు భయములేదు. చక్రవర్తి నన్ను పంపినవెనుక శుభదినమున బలములు చేరియుండును. అది ఒక వారము దినములనుకొనుడు. వారు అడవులవెంటరారు. సైన్యములనేకములగుట కళింగమునుండి వచ్చెదరుకాన, అక్కడనుండి వచ్చుటకు ముప్పది అయిదు దివారాత్రములుపట్టును. నేనువచ్చి యిరువదియేడు అహస్సులయినది. కావున నింకనొక పదునాలుగుదినంబులు మనము మహారణంబునలిపి చక్రవర్తికై యెదురు చూడవలయును. శాతవాహన పతాకంబగు "సింహము" ఉజ్జయినీ కోటగోడలనుండి పారిపోవునాలుకనదియోపిరితో సార్వభౌమునికై యెదురుజూడదా? ఇది నాయాజ్ఞగా తెలుపుడు, ఒక్క చారుడు నుజ్జయినికోట వీడవలదు. వరితవుడు గంజికాచి, ప్రతివారును మధ్యాహ్నము త్రాగవలయును. యవధాన్యము ముద్ద ఒకపూటను, బియ్యపుముద్ద రెండవపూటను ఉపయోగింపవలయును. విరోధుల ఆయుధములు కర్చుకానిండు. ముఖ్యావసరమగునప్పుడె మనయస్త్రముల నుపయోగించెదముగాక. కోటబురుజులలో కొలదిమందిమాత్రమే యుద్ధము చేయుచుండునది. ఒకనికి కొంచెగాయము తగిలినవెంటనే వేరొకడాస్థలము నాక్రమింపవలయును. ముఖ్యావసరమైనప్పుడు మాత్రము సగముబలముతో యుద్ధమునలిపెదము" అని మేఘగర్జనముల నాతడాజ్ఞాపనల నెరుకజేసెను. అందరును మహోత్సాహముతో 'విజయ! సమవర్తీ విజయ! సమవర్తీ విజయ!' అని జయ జయ వాక్యముల బలికిరి. శంఖముల నొత్తిరి. భేరీనాదములు బయల్వెడలెను.

విరోధులీ జయఘోషములు విని నివ్వెరగందిరి. చక్రవర్తి వచ్చుచున్నాడేమోయని భయపడిరి. అప్పుడు మాళ్వాధిపతియు మంత్రులు తదితరులు నొకసభ కావించుకొనిరి. వారికేమియు తోచుటలేదు. ఏవార్తలు తెలియుటలేదు. ఒకవేళ చక్రవర్తి వచ్చుచున్నాడేమో! ఏదియైనట్లయినను రెండురోజులలోపల ఆంధ్రులనుగ్గుచేసి కోటజొరబడి స్వాధీనము [illegible] తమ ముందుగతి తలంప నవసరములేదు.

# ద్వితీయ ప్రకరణము

## జైత్రయాత్ర

శ్రీముఖ శాతవాహనుని సైన్యములు ఆంధ్రసామ్రాజ్య రత్నమగు ధాన్యకటక నగరమున; కృష్ణానది యావల మహాసైన్య స్థానమున విడిసియున్నవి. మహాసైన్యస్థానము పది గోరుతములపొడవున నున్నది, వెడల్పు మూడు గోరుతములు.

ఆ స్థలమంతయు, ఒక మహానగరమువలె యేర్పాటు గావింపబడినది. చక్కని వీధులు రాజమార్గములు, శృంగాటకములు, వీధుల పొడుగున శిబిరములు, వైద్యశాలలు, వర్తకవీధులు, క్రయవిక్రయశాలలు, వినోదమందిరములు, మదిరమందిరములు, విశ్వకర్మ ఒక రాత్రి నిర్మించిన ఇంద్రనగరమువలె ఆ సైన్యస్థానము వికసించినది.

ఒకచోట గజ యూథములభాగము. అచ్చట రెండువేల గజములున్నవి. దేనికైన హింస తొలుతర్చిన ఊరకుండురేమో కాని, అడవిలోనైన గజముమ భ్రబలకారణముచేత చంపినవానికి, మరణమే దండనము. గజములు పట్టుకొనుట, వానిని పెంచుట, వాని భోజనము, మావటివాండ్రు, గజాలంకారములు, కవచములు, తోత్రకములు, నిగళములు, ఆలానములు, అంకుశములు, వరత్రములు, అంబారులు ఇవి యన్నియు గజాధ్యక్షుని యధికారములో నుండును.

ఒక్కొక్క ఏనుగునకు నలుగురు మావటీలుందురు, ఇద్దరు యుద్ధవీరులు, ఇద్దరు సేవకు లుందురు. భద్రదంతావళమునకు, ఇద్దరు అలంకారికులు, ఎనమండుగురు మావటీలు, నలుగురు సేవకులు. అధివసించువాడు గజసాహిణి. అతనికి కవచరక్షకుడొకడును, ఆయుధరక్షకుడొకడును ఉందురు. భద్రగజమునకు రక్షణగా సాధారణ గజములు రెండు ఈవలావల నుండును.

ఆంధ్రులు విదేశమునుండి అత్యుత్తమమైన ఏనుగులు కొనెదరు. తమదేశములోని రాష్ట్రములైనదశార్ణ, అపరాంతములనుండి ముఖ్య జాతిఏనుగుల సముపార్జించెదరు. సురాష్ట్రమునుండి హీనరకములు వచ్చును. సురాష్ట్రగజములు సరకులు, శిబిరములు మాత్రము మోయుటకు పనికివచ్చును. భద్రజాతి దంతావళములన్నియు విదేశమునుండి వచ్చును.

సైన్య శిబిరములలో గజములకు శాలలు లేకపోయినను, సైన్యము రాజధాని [illegible] ముందున్నప్పుడు వానికి శాలలున్నవి. శాల ఏనుగు పొడుగు ఎంతయుండునో అంత ఎత్తుండవలెను. ఏనుగు ఎత్తులో సగము శాలవెడల్పు. మగ ఏనుగు లన్నిటికి శాలలు వేరు, ఆడ ఏనుగుల శాలలు వేరు. శాలకు వెనకగా శాలయంత ఏనుగు తిరిగిపోవు స్థలముండును. ఏనుగు [illegible] నైన యామముకొక నిద్రపోవును. అందుకని శాలవెనుక ఏ [illegible]

ఏనుగులకు శిక్షితులు వేరు, మావటీవారు వేరు. శిక్షితులు ఉత్తమగజ శాస్త్రజ్ఞులు. మావటివారలలో ప్రథమశ్రేణివారు యుద్ధకాలమందు ఏనుగులను నడుపుదురు. వారికి గజయుద్ధపు మెలకువలన్నియు కరతలామలకములు. ఏవిధమైన అస్త్రము వచ్చినను అది తప్పుకొనునట్లు ఏనుగును నడపవలెను. గజవేగము కాలమునకు తగినట్లు వృద్ధిచేయవలెను. ఏనుగునకు వంట వండువారు వేరు.

సాధారణపు మావటివారు ఉదయమున ఏనుగును నదికి గాని, సరోవరమునకు గాని తీసుకొనిపోయి కడుగవలయును, దినాంతరమందు మూడవయామ మధ్యమందు మరల కడుగవలయును.

వానికి వివిధ విధానములు నేర్పుదురు. యుద్ధగజములకు తక్కిన యోధములతో పాటు నడుచుట, పరుగిడుట, పక్కకు తప్పుట, ఎదురుగ ముఖమునుంచి మూలగా ముందుకు సాగుట, చటుక్కున వంగుట, తొండముతో గజగదాదండము పుచ్చుకొని, గజమును, రథమును, అశ్వికుని తాడించుట, మూర్ధములతో గజముల, రథముల తాకుట, వేగముగా పోయి తాకుట, మూర్ధములకు బిగించిన మూర్ధశూలముతో తలవంచి దేనినైన తాకుట, రెండుకాళ్ళు పైకెత్తి నిలుచుండి దేనినైన కాళ్ళతో మర్దించుట, తొండముతో గజముమీదనుండి రథముమీదనుండిగాని గుర్రముమీదనుండిగాని వీరుల లాగిపారవేయుట కోటగోడల, గోపురద్వారముల మూర్ధముతో తాకుట, గజగదలతో మహాదండములతో తాకి పగులగొట్టుట, తనవారిని ఎత్తుకొని కంఠమున మావటివానికి అందిచ్చుట, చప్పుడు చేయక నడచుట కాళ్ళతో మర్దించుచు నడచుట, అడ్డమువచ్చిన చిన్న గోడలు కంచలు ఎగిరిదూకుట, నదులలో ఉరుకుట, ఈదుట, అగ్నిబాణముల పట్టుకుని మట్టిలో దూర్చి నీటిలోముంచి ఆర్పుట. తిరిగి విరోధులపై విసిరివేయుట, అగ్నిదండముతోడ విరోధుల కాల్చుట, ఇవి యుద్ధగజములు నేర్చుకొనవలసిన యుద్ధతంత్రములు.

ఏనుగులకు వైద్యము చేయువారును భూతవైద్యులునున్నారు. ఆంధ్రసైన్యముల గజాహారము కొలత ఒక ద్రోణము బియ్యము, అర్ధఆఢకము నువ్వులనూనె, మూడుప్రస్థముల నేయి, పదిఫలముల ఉప్పు, ఏబది ఫలముల నారికేళములు, అరటికాయలు, రెండు ఆఢకముల పెరుగు, పది ఫలముల బెల్లము, ఒక ఆఢకము మదిరము, రెండు ఆఢకముల పాలు, రెండు భారముల యవగడ్డి రెండును పావుభారముల అనుపచ్చగడ్డి, భారముతో అరవవంతు వట్టిగడ్డి ఆకు, సప్పుదినుసుల మొక్కలును.

గజసైన్యము వెనుక ముఖ్య యుద్ధాంగము రథము. రథములలో నాల్గు గుర్రములు పూనిన రథములు, రెండుగుర్రముల రథములు, ఏకాశ్వ రథములు అని మూడురకముల రథము



లున్నవి. ప్రయాణమునకు విలాస విహారమునకు రథములువేరు. యుద్ధరథములు వేరు. విలాస రథములకు ఎనిమిదిగుర్రములుకూడా ఒక్కొక్కప్పుడుండును.

యుద్ధరథములు, గట్టిదియు తేలికదైన దారువుతో నిర్మింపబడును. చక్రములు బరువైన, గట్టిదైన దారువుతో నిర్మింపబడును. రథ నిర్మాణము, వానిని మంచి స్థితిలో నుంచుట వానియందుంచవలసిన ఆయుధములు, రథసూతులు, రథాశ్వములు, వారి పోషణ అంతయు రథాధ్యక్షుని అధికారమున నుండును.

రథము వెనక అశ్వ సైన్యము ముఖ్యమైనది. దేశంలోని గుఱ్ఱములన్నిటి విషయము, వానిజాతి, నుడులు, వాని ఈడు, గుణగణములు మొదలైన విషయములన్నియు, ఒక గ్రంథములో వ్రాయుదురు. జాతినిబట్టి, లక్షణగుణములనుబట్టియు గుఱ్ఱముల యుద్ధములో చేర్చుకొందురు.

వేగ, మధ్యవేగ, మందగతిగలవి; తీక్ష్ణ మధ్యమ, శాంత స్వభావములు కలవిగా గుఱ్ఱముల వేరుచేయుదురు. అవి ఉద్భవించిన దేశములబట్టి వానిని వివిధనామముల పిలుతురు. కాంభోజ, సింధు, ఆరట్ట, వనాయు, బాహ్లీక తురంగ, సౌవీర, సాపేయ, తైతల, పారసీకమనియు వాని పేర్లు.

వీనిలో కర్కములగు అశ్వములే రథగుఱ్ఱములుగా పనికివచ్చును. పారసీకాశ్వ వానాయుజ తురంగ జాతులు అశ్వికులకు మంచివి. కాంభోజాశ్వ, సైంధవ, ఆరట్టజ, బాహ్లీకాశ్వములు రథముల కుత్తమమైనవి.

కులీనములు, ఆజానేయములు చక్రవర్తి రథములకు ప్రత్యేకింపబడును.

ఆంధ్రులు గుఱ్ఱములలో మంచి జాతిని నిర్ణయించుటకు, అశ్వముఖము ముప్పదిరెండు అంగుళములుండవలెను, అశ్వముపొడగు ముఖము పొడవునకు అయిదురెట్లుండవలెను, జంఘలు ఇరువది అంగుళములు, ఎత్తు ఎనుబది అంగుళములు, వక్షము చుట్టు నూరు అంగుళములుండవలెను అనిఏర్పరచిరి.

రెండవజాతి గుఱ్ఱములకు, కొలతలలో మూడంగుళములు తక్కువయుండును.

విరోధులు గుఱ్ఱములకు విషమిచ్చి చంపించుచుందురు. అందుకై వాజిశాలలు విశాలముగ, రక్షణకు కట్టుదిట్టములు కలిగియుండును. శాలలలో, కోతులు ఆరోగ్యము కొరకు, పిల్లులు మయూరములు, ముంగిసలు, జింకలు, పాముల చంపుటకు రక్షకు ఉంచుదురు. చిలుకలు మైనపుగోరువంకలు, పికిలిపిట్టలు విషము పదార్థముల నున్నపుడు అల్లరి చేయును. కోకిలలు విషముపారింతములనున్న చనిపోవును. కాజుపిట్టలకు విషాఘ్రాణము చేసిన తెల్లబడును.

# తృతీయ ప్రకరణము

## మహాసభ

ఆంధ్రసైన్యములలో అశ్వములకిచ్చు యుద్ధశిక్షు, వర్తనము, కృపకేణుక, వర్ధమానకము యమకము, నీచైర్గతము, ప్రకీర్ణక, ఊర్మిమార్గ, త్రితాళ, శరభప్లుత, శరభక్రీడిత, సింహాయత కపిప్లుత, భేకప్లుత, ఏకప్లుత, ఏకపాదప్లుత, కోకిలసంచారి, హంస్య, బకచారి, ఘోరణకి మయూర, నాకుల, వారాహ సంజ్ఞాప్రతీకార, మార్గనిక్రమ, భారవాహ, ధారా, ఉపకంఠ ఉపజవ మొదలగు గతులతో, నడకలతో కూడియుండును.

అశ్వము ఎట్టిధ్వనికైనను బెదరకూడదు. ఆశ్వికుడులేకపోయినను యుద్ధముచేయవలెను. ఉత్తమాశ్వము పన్నెండుయోజనములకన్న ఎక్కువ పరుగిడకూడదు. (ఇప్పటి అరువదిప్రాతిక మైళ్ళు) సాధారణముగ పదియోజనమున్నర పరుగిడవలెను. వృద్ధాశ్వములను పనిచేయించక ఆహారమిచ్చి పెంచెదరు.

అశ్వసాదులు గుఱ్ఱమును బాగుగా తోమి కడిగి చందనమలందవలెను. రోజును రెండు పొద్దుల రోత్రపుష్పముల దండలువేయవలెను. ప్రతిగుఱ్ఱమునుగురించి భూతములకుఫలాదులర్పించవలెను. ఉత్తమబ్రాహ్మణులువచ్చి అశ్వనీదేవతలకు వేదమంత్రములు చదువవలయును.

ఆంధ్రపదాతిదళములు నాల్గురకములున్నవి. ఎప్పుడును చక్రవర్తికడ జీతములు పుచ్చుకొనుచునుండువారును; మాండలికాదిసామంతులకడ సర్వకాలము నుండవలసిన చమువులును; ఒక జైత్రయాత్రకై యితరదేశములనుండి భృత్యములకైవచ్చు దళములును, యుద్ధకాలము నందుమాత్రమే చేరు సాధారణ ప్రజానీకము అనువారలా నాల్గు రకములును.

పదాతిదళములలో సైనికులు వారి ఆయుధములనుబట్టి నాలుగు తరగతులక్రింద విభజింపబడియుండిరి. విలుకాండ్రు, దుర్గభేదకులు, శూలికులు, యాంత్రికులు.

విలుకాండ్రకు శిరస్త్రాణము, వక్షకవచము, హస్తపాదఫలకములునున్నవి. వారు నడుమున, కటిభారమున, వీపున, శిరస్సున అంబులపొదులను కట్టుకొందురు. ప్రతివిలుకానికి నాలుగు ధనుర్దండములు, పెదుసారు వింటినారులును, ప్రతివిలుకాని ఎడమచేతికి అంగుష్ఠత్రాణముండవలెను. వారి నడుమునకు రెండు చురకత్తియలును, ఆయుధములతోపాటు ఉండవలెను.

శూలికులకు ఒక శూలము, మూడు శూలముఖములు, ఫలకఖడ్గము, ఛురికలు ఉండవలెను.



యాంత్రికులు సర్వతోభద్రాదియంత్రములు ఉపయోగించెదరు. వానిని రక్షింతురు. వానికి తగిన పరికరములన్నియు సేకరింతురు. వలయునెడల కత్తిగట్టి పోరాడగలరు.

దుర్గభేదకులు దుర్గములకు సొరంగములుచేయుట, లగ్గలకు త్రాటినిచ్చెనలువేసి ఎగబ్రాకుట, కందకములనీదుట, కందకములకు వంతెనలుకట్టుట, దుర్గభేదకయంత్రములుపయోగించుట, దుర్గరక్షణచేయుట, వీనిలో అత్యంతకౌశలముకలవారు.

మహారాజగు శ్రీముఖశాతవాహనుడు తాను జైత్రయాత్ర కరుగుటకు మహాసభను [illegible]పించెను. వివిధవిలాతులనుండి సభ్యులువిచ్చేసిరి. గ్రామణులు, దళనాయకులు, శతనాయకులు, వివిధ సమితిసభాధ్యక్షులు, వివిధ శాఖాధ్యక్షులు, మంత్రులు, బౌద్ధభిక్షుకులు, భిక్షుణులు, పండితులు, వణిక్సమూహాధిపతులు, వివిధ శ్రేణి సంఘాధ్యక్షులు, చిత్రకారకులు, శిల్పులు ఆమహాసభలో స్వత్వముచే సభ్యులు. అందరకు రాజాజ్ఞలు అందగనే అధిపతి సలుపబోవు నుత్కృష్టకార్యమునకు అనుమతి నీయుటకు గాని, వీలులేదనిత్రోసిపుచ్చుటకు గాని విచ్చేసిరి.

విశాలమగు సభాభవనమున మహారాజు సింహాసనాసీనుడైయుండెను. సభికులు కొలువుతీరియుండిరి. ప్రధానామాత్యుడగు అచీర్ణుడు లేచి సభ్యులదిక్కు మొగంబై ఈవిధముగ పలికెను. "మహాసభ్యులారా! మాళవాధిపతి మన రాజ్యమునుండి విడివడి, మహారాష్ట్రపై యుద్ధము ప్రకటించి, యుజ్జయినీకోటలో వినీతమతినిముట్టడించినాడు. మాళవునికి సహాయ్యముగా భోజులు, పుళిందులు, వైదేహులు, మాగధులువచ్చి చేరినారట. ఆంధ్రసామ్రాజ్యము గొడ్డుపోయినదా? గౌతమీకృష్ణవేణీ పవిత్రాంబువులు మీరక్తాల ప్రవహించుటలేదా? ప్రియదర్శియగు నశోకచక్రవర్తికి లోబడక సమముగా రాయబారముల నడిపి స్వతంత్రపూరితమై ఒరులకు తలయొగ్గక విశాలవంతమై ఆంధ్రపతాకమగు సింహధ్వజ భీషణారావంబులం దశదిశల పర్వజేయు మనదేశము నేడు మాళవునిచే పరాభవింపబడవలెనా? ఉజ్జయినిలో మాళవుడు విజయమందును. ఆసైన్యములతో మనదేశముపై విడిదియును. ధాన్యకటకము కృష్ణలో కలియవలెనా? ప్రతిష్ఠానము గౌతమిలో లీనమైపోవునా? కౌశికము [illegible] తరంగములలో మాయమైపోవునా? ఆంధ్రరాజ్యలక్ష్మి ఫాలమునుండి సౌభాగ్యతిలకము మాసిపోవునా? లేక ఆంధ్రసైన్యములు మహారాజా స్వయముగా నడుప, బోయి విజయయాత్ర సలిపి విరోధుల నణంచి ఆంధ్రపౌరుష మెల్లెడల చాటిరావలయునా? తెలుపుడు. ఇంకొకటి. ఈజైత్రయాత్రకగు వ్యయము మహాభాగ్యుడగు చారుగుప్తులవారు భరించెదనని వాగ్దానము చేసినారు."

ఇటులనే సర్వసైన్యాధ్యక్షుడు ఉపన్యాసము సలిపెను. అనేకవేల జనులు ప్రోవై యున్న యామహాసభ జయజయధ్వానములుసలుపుచు మహారాజు ఈ జైత్రయాత్రవిషయమై ఏమియొనరించినను వల్లెయని యొప్పుకొనిరి.

ఆంధ్రసైన్యములు బయలుదేరినవి. శతాబ్దములనుండి ఆంధ్ర వాహినులు భరత భూమిని ప్రసిద్ధిగాంచినవి. చంద్రగుప్తునికాలమున ఆంధ్రులు సర్వస్వతంత్ర గలిగిన పరాక్రమపూరితములగు మహాసైన్యముల కలిగియుండిరి. అశోకునికి మిత్రులైరి. అశోకుని వెనుక భరతభూమిలో ఆంధ్రసైన్యములబలము వేరొండొక రాజ్యమునకులేదు. రెండువేల ఏనుగులు, ఆరువేల అశ్వికసైన్యము, రెండువేల రథములు, రెండులక్షల పదాతిదళములు బయలుదేరినవి. ఎనిమిది వృషభములు, నాల్గువృషభములు పూన్చినబళ్లు సామగ్రులను సేవకులను దాస దాసీజనంబులను కొనిపోవుచుండెను.

ముందు అరువదివేలసైన్యములు బయలువెడలినవి. పదికోశములతరువాత అరువది వేలసైన్యములు సాగినవి. అవన్నియు కృష్ణానదినిదాటి వ్యాఘ్రదేశము కడచి గోదావరి తటకు పోవునప్పటికి తక్కిన ఏనుబదివేలసైన్యములు పోయినవి. గోదావరికడ పడవలు వేనవేలు సిద్ధముగానుండెను. రేవుస్థలములదాటి సైన్యములన్నియు అవతియొడ్డునకు పోయినవి. దక్షిణకోసలము గడచినది కళింగము వెనుకబడినది. తెలివాహానది వారికి శీతలోదకములు ప్రసాదించినది. ఉప్పెనవలె ఎడారులలోవీచు భయంకరమగు ఇసుక గాలులవలె, ఆంధ్రసైన్యములు కతిపయ ప్రయాణంబుల సాగిపోవుచునే యున్నవి.

# చతుర్థ ప్రకరణము

## చైతన్యోదయము

ఆబాలికను పట్టి బాలికగా మాత్రము పెంచినాడు స్థాలతిష్యుడు. ఆమహర్షి మహా విద్యవల్ల ఆబాలికలో పెరుగుచున్న కొలదిమానవత్వము నెమ్మదిగనెమ్మదిగ వెనుకకుపోయి పశువులలో ఉత్తమపశువైన గోవు స్థితికి పోయినది. ఆవెనుక ఆమె ఏనుగుస్థితికి దిగినది ఒక్కొక్కవర్షము గడచినకొలది ఆమె శునకజాతికి పోయినది, మార్జాల జాతికి దిగినది. శార్దూలమైనది. ఈ నాడామె భయంకర శార్దూలోరగము.

స్థాలతిష్యుని అఖండ ఆయుర్వేద పాండిత్యము అమృతబాలకావలసిన ఆమెను కాలకూట విషసన్నిభను చేసినది.



గుజ్జన్నకూడు బువ్వాలందామెకు గరళము తిలబీజ దళభాగము నిచ్చువాడు.

ఆమె పాలలో నాభి యవగింజలో త్రింశతి భాగము కలుపువాడు.

చంద్రబాలకు మూడవ యేడు వచ్చునప్పటికి సౌరాష్ట్రికము తిలప్రమాణ మామె గ్రహింపగలిగినది. ఆమె కైదవయేడు వచ్చునప్పటికి శాక్లికేయము యవగింజ తినగలుగునది. దారదము, వత్సనాభము, ఆమెకు ఫలాహారములైనవి.

చంద్రబాలకు పన్నెండవయేట తొమ్మిదిరోజులు జపతపాది హోమంబులు చేసి స్థాలతిష్యులు మహావిషమైన కాలకూటమును దక్షిణదండ కాటవీ భయంకర ప్రదేశసంజనిత మహానాగదంష్ట్రాంకిత కాకోలము చంద్రబాలయందు ప్రవేశింపజేసినాడు. ఆ భయంకర ముహూర్తమునుండియు ఆమె విషకన్యకయైనది.

ఆనాటినుండియు ఆమె స్పర్శయే, ఆమె ఉచ్ఛ్వాస నిశ్వాసములే, ఆమె పరిసరమే దారుణమృత్యు స్వరూపమైపోయినది. ఆ ముహూర్తములనుండియు పెద్దపులులును ఆమె కడకు వచ్చుటకు బయపడును. ఆమె చేతిలో సాధారణ విషములు అమృతప్రాయములు.

స్థాలతిష్యుని శిష్యులైన విషకులు ప్రతినిమేషమా బాలకు కార్యము పాఠముగ చెప్పుచుండిరి. మృత్యురూపమగు లాలనచేయుట, పలుకులుసూపుట, దరికిచేరుట, వశింపచేయుట యివి అనుదినము నామె నేర్వవలసినదే. ఆమె వివిధ భాషలలో మాటలాడుట యందుత్తీర్ణురాలైనది. ఆమెకు చక్కని సంగీతము నేర్పబడినది.

ఎట్టి శ్రీకుక హృదయముకలవాడైనను, ఆమెను దర్శించిన మాత్రమున ఆమెపలోయలుకనినంతమాత్రమున, ఆమె తీయని పాటవినినంత మాత్రమున కరగి ముగ్ధుడైపోయి ఆమె భయంకరాద్భుత సౌందర్యములో మగ్గిమసియై పోవలసినదే.

మలయనాగుడు ఆమెకు ఆహుతియైన ఆ బాలయతన నివాసము చేరినది. ఆమెకు ఏదియో విషాదము, ఏదియో ఆవేదన. ఆమె హృదయాకాశమునందు కాలమేఘములు ఎచ్చటనో పొడసూపినవి. తన్ను తన తాతగారు ప్రయోగించు దినమునందు విషతన్వతన చుట్టునున్న సభ్యులను జూచినప్పుడు వీరందరెట్లు నసియగుదురను యాలోచన పొడమినది

చిన్నతనమునుండియు తన లాలనలచే మగ్గిపోయిన కురంగశాబక శవములను చూచి నవ్వునది. హస్తస్పర్శచేమాడిపోయిన మల్లికాది సుమములగని కిల కిల లాడునది. తనచుంబనములచే హతమారిన శుకశారికాదుల వపువులుచూచి గంతులువేయునది.

మృత్యువామెకు చెలియలు. అగ్నియామెకు చుట్టము. కాళరాత్రియామె అధిదేవత అమావాస్య ఆబాలిక ఆటలాడుకొనుకాలము. అట్టహాసమామెవిలాసము. భయంకరశాంత మామె ప్రియనాట్యము.

మత్తిల్లిన విగ్రహముగల ఒకపురుషుడు, ఉచితానుచితజ్ఞానసర్వము పాతచిపోయి, నిండుసభలో, అతడు భగవంతుడనుకొను మహాపురుషుడున్నాడని భయమినుమంతయులేక ఆసమయము పవిత్రము అను ఆలోచనయేలేక, తన్ను కామించి తనకడకు పరువిడి వచ్చినాడు, మరుసటి నిమిషమున విగతజీవుడై పడిపోయినాడు.

ఈసంఘటన ఏమియు నావిషబాలకర్థముకాలేదు. ఆమె కామమే ఎరుగనిది. ఆమె సంపూర్ణయువ్వన. ఆమె దేహము, నరనరము, ఆమె వనితాత్వ చిహ్నిత విచిత్రాంగములు విద్యుచ్ఛక్తిచే మేఘములు విలసిల్లినట్లు ఏదానికో జ్వలించుట ప్రారంభించినవి.

స్త్రీపురుష సంబంధమేమిటో ఏమాత్రమామె ఎరుగదు. వానినిగూర్చి ఏరును చెప్పలేదు. వానినిగూర్చి యామె చదువనులేదు.

పాములు, పిట్టలు సంగమించుట రెండుమూడుసారులామె చూచినది. ఆవిధి ఏమియను ప్రశ్నయామె శిశుహృదయమున నుదయించినది. ఆవిషయమామె తన తాతగారి నడిగినది.

రెండు ప్రాణులు ఒకటికడ ఒకటియుండుట కిష్టపడుననియు, అప్పుడవి చాలదగ్గరగ వచ్చుననియు, ఒక్కొక్కప్పుడా రెండుప్రాణులు దేహము దేహముకూడ పెనవేసుకొని కూడ పోవుననియు, దానిని "ప్రేమ" యందురనియు స్థాలతిష్యుడామెకు చెప్పినాడు.

స్థాలతిష్యుని ఘోరవ్రతము సమాప్తినొందవలెనన్న యాబాలకు స్త్రీపురుష సంయోగరహస్యము కొంతయయినను తెలియవలెను. కాబట్టి ఆతడామెను దూరదూరమున నుండి జంతువులలో, పక్షులలో ఉన్నకలయిక దర్శింపచేయుచుండెను.

మహాతంత్రీవాద్యములలో ఒకతీగస్పందించిన, ఆ స్వరమునకు శ్రుతియగు స్వరములన్నియు నొక్కసారి ప్రతిస్పందన మొనర్చును. ఆలాగుననే మృగవ్యాజంబున స్త్రీ పురుషులసంయోగరహస్యము దర్శనమాత్రమున ఆమెకు నేర్పబడుచుండెను.

అందుకనియు, ఆమెకు ఆడుమొగభేదంబు సౌలతిష్యుడు కొంచెము కొంచెముగ నేర్పినాడు. ఆ కారణంబుననె విషబాలపాములతో ఆడుకొనినప్పుడెల్ల వానిని ఒకటికొకటి గాగిలించుకొనుమనికోరునది.

ఒక్కొక్కమాసము వచ్చినకొలదియు నామె జీవితముకొనుక నీడవలె మానవత్వము వచ్చుచున్నది. అది మరిమ్మరి నామెను తారసిల్లినది.

మలయనాగుడు ఏక్షణికమున అతిపురుష కాంతితో తన భుజముల అదిమిపట్టి ఆబాలసత్వయౌవనమును తనలో లయించుకొనవాంఛించెనో ఆ నిమేషమున ఎచ్చటనో దాగికొనియున్న ఆమె స్త్రీత్వమునకు చురుక్కుమను స్పందనము కలిగినది.



ఆ స్పందనముచే నిదురపోవు పామును పాములవాడు నాగసారబుర్ర మొనతో పొడిచినట్లయినది. ఆ స్పందనము వేసవికాలమున భూమిలో నడగియున్న బీజమును, ఆషాఢ ప్రథమ వర్షబిందువు చుంబించునట్టిది. ఆ స్పందనము ఆకు రాల్చిన చెట్టుకొమ్మలో దాగుకొనియున్న లేచిగురును మధుర వసంతమందమలయానిలములు మునివ్రేళ్ళతో దాకినప్పటిది.

ఈ దినములలో ఆమె కప్పుడప్పుడు ఒడలు ఝల్లుమనుచుండును. ఆమె కళ్ళు అరమూతలు పడుచుండును. ఒకచోట నిలువలేదు. నిద్దురపట్టదు. పట్టినచో శరీరము సంపూర్ణముగ మరచి నిద్రించును. ఎవేవో కలలు ! స్వప్నాలకన్నిటికి చివరభాగమున మలయనాగుడు చేతులు చాచి తన్ను వేడికళ్ళతో, మత్తుచూపులతో కౌగిలింప వచ్చుచున్నట్లు కనబడును. ఆమెకు దేహమంతయు నుప్పొంగును. ఏదియో తీయని బాధ వచ్చును. అతడు కౌగిలించిన ఏమి జరుగును ? అని ఏదో వాంఛతోకూడిన ఎదురుచూపు. అతడు సమీపించును. ఆమెకు ఎంతయో భయమువేసి " ఆ, హా " యని కేకలువేయుచు లేచును.

ఆమె చెలికత్తెలగు యోగినులలో గగనియో, కాశ్యపియో, అగస్తియో, ఎవరో ఒకరు చటుక్కున ఆమెకడకు పరుగిడివత్తురు. ఆమెపై చేయివైచి " అమ్మా చంద్రా ! ఏమమ్మా కలవచ్చినదా ? " అని లేపివైతురు.

ఆమె రొజుచు మేల్కొలును. " ఏడి ఆ దుర్మార్గుడు ? " అని ఆమె కన్నులు తెరచి, భయమున కోపమున అడిగి ఇటు నటు చూచును.

గగని:—ఎవరు తల్లీ ?

విషబాల:—మలయనాగుడు !

గగని:—వాడు చనిపోయినాడు. నీకు కలవచ్చినదా ?

విషబాల:—కలా ! కాబోలు ! అమ్మ ! నిజమైనట్లే ఉన్నది. వాడు నన్నెందుకు ముట్టవలె ?

గగని:—నిన్ను ముట్టడు. వాడు నీశక్తివల్ల నాశనమైనాడు.

విషబాల:—నా శక్తియా ?

ఇటుల ఆ బాలకు రెండు మూడు కలలు వచ్చినవి. ఆమెలో పరిమళములు గుబులుకొనుచున్నవి. ఆమెలో తేనెలు చేరుచున్నవి. ఆమెలో మార్దవములు అలముకొనుచున్నవి.

# పంచమ ప్రకరణము

## నేనును ఆడుదాననే!

స్థాలతిష్యాశ్రమమందు ఆ మహాఋషి పూజామందిరశాలలనంటి విషకన్యక గృహములు. వనమును ఉన్నవి. ఆ గృహములకు దారి స్థాలతిష్యముని మందిరమునుండిమాత్రమే యున్నది ఆయన ఆజ్ఞలేనిదే ఏరును ఆ గృహములలోనికి బోవుటకే వీలులేదు.

విషకన్యకారామములను, వనమును చుట్టి ఎత్తైన కుడ్యమున్నది. ఉత్తరమున, తూర్పున ఆ గోడ కృష్ణానది నంటియున్నది.

స్థాలతిష్యుని మందిరమునంటి యొక శాలలో మంత్రానంద తంత్రానందులను ఇరువు రుద్దండులైన శిష్యులు నివసించుచుందురు. వారు మహా విషవైద్యులు, మంత్రశాస్త్రవేత్తలు, మహాయోగులు. వారెరుగని విషములుగాని, ఆ విషములకు విరుగుడులుగాని ఈలోకమునందు లేవు. విషకన్యకను పెంచుటలో, నామెను దారుణమృత్యుకీలగా నొనర్చుటలో ఈ శిష్యులిరువురామెకు విషపుదాదులైరి.

ఆ మందిరములోనికి విషకన్యకా మందిరశాలలనుండి ఒక రజ్జువున్నది. ఆ రజ్జు వొక ఘంటికకు ముడివేయబడియున్నది. ఆ రజ్జువున కొవలికొన విషకన్యక నిదురబోవు మందిరమున నున్నది.

వీరిరువురుకాక, స్థాలతిష్యునికి ముగ్గురు కాపాలికలు, శిష్యురాండ్రున్నారు. వారును మంత్రతంత్ర శాస్త్రములందు ప్రవీణలు, విషవైద్యమున సిద్ధహస్తలు. వారు ముగ్వురు విషకన్యకకు స్నేహితురాండ్రుగా, చెలికత్తెలుగా, గురువులుగా నుందురు.

ఏయవసరము వచ్చినను వారుగాని, విషకన్యగాని ఆ త్రాడు లాగుదురు. వెంటనే మంత్రానంద, తంత్రానందుల గదులలో గంటలు మ్రోగును. ఒకసారి గంట మ్రోగినచో మంత్రానందుడు పోవును; రెండుసారులు మ్రోగినచో తంత్రానందుడు పోవును, నాల్గయిదు సారులు మ్రోగినచో నిరువురు నేగుచుందురు.

మలయనాగుడు చనిపోయిన మరునాడు విషకన్యక ఏదియో మనోవేదన పాలయ్యెను. స్నేహితురాండ్రయిన యా కాపాలికలెన్ని విధముల ననునయించినను ఆమె యూరడిల్లలేదు. ఆమె కన్నుల బొటబొట నీరు కారుచునే యుండెను.



“విషబాలకంట అశ్రులేమి? ఆమెకు హృదయమున బాధఏమి? ఆమెకు హృదయ ముండునా?” అని కాశ్యపియను యోగిని తనతోటియోగిని గగనియను నామెను ప్రశ్నించి నది. మూడవయామె అగస్తి విషకన్యకతోపాటు తోటలో నొక కేళాకూళికడ కూర్చుండి యా బాలికతో మాటలాడుచుండెను.

గగ:—సోదరీ! ఆమె హృదయమును సంపూర్ణముగ కుదించి, వెనుకకు తీసుకొని పోయి భయంకరశార్దూలికన్న హృదయమును చేసినాము. ఈ శార్దూలిహృదయము మానవ శార్దూలిహృదయము. మానవమాంసభక్షణమును మరిగిన శార్దూలము అన్నిజిత్తులెరుగును. ఆ శార్దూలము మానవియైనచో నెటులనో అటులనే ఈ బాలికను మనము పెంచితిమి!

కాశ్య:—ఆర్యా! గగనీ! నాకేదో భయము వేయుచున్నది. మన విద్యలో నెచ్చటనో దోషమాపాదిల్లినది. నీవొక కృపాణమును చేసితివి, పదును బెట్టితివి. ఆ కత్తి నీవెటుల ఉపయోగింతువో అటుల పనికివచ్చును. ఆ కత్తి “నేను వానిని ఖండించను” అనిన నీవేమి చేయుదువు?

గగని:—అవును సోదరీ, అవును. మన గురుదేవులగు స్థాలతిష్యమహర్షి గురుపరంపరలో రెండవవారగు మహాదేవ దేవసోమోత్తరమహర్షి విషకన్యనొనర్చి చాణక్యదేవున కర్పించెనట. ఆ విధానముననే మనము మంత్ర తంత్రాలన్నియు ఉపయోగించితిమి?

అక్కడ కేళాకూళికడ విషబాలయు, అగస్తియు మాటలాడుచుండిరి. విషబాల నీళ్ళలో తన ముఖప్రతిబింబము చూచుచు ఎదుటనున్న యోగిని ముఖము చూచుచు కన్నుల నీరు తుడుచుకొనుచుండెను. ఆమె నడిమిబట్టి అగస్తి అనునయించుచుండెను. అగస్తి హృదయమునను ‘ఏమిది?’ అని ప్రశ్న యుదయించినది.

అగస్తి:—నీవును నేనును ఒకటికాదు.

విష:—[కన్నుల నీరు తుడుచుకొని ఆశ్చర్యమందుచు] మీరు ముగ్వురు బట్టలు లేకుండ స్నానము చేయునప్పుడు నేను చూచితిని. మనకందరకు అవయములన్నియు ఒక్క రీతిగ నున్నవే?

అగస్తి:—కావచ్చును. ఉలూపియు, అర్జునుడును పాములేకద?

విష:—అవును.

అగస్తి:—అవి రంగులలో భేదముగానున్నవా? లేదా?

విష:—అవును. ఆలాగుననే మీరును నేనును రంగులలో భేదించియుంటిమి. అయి నను మనము ఒక్కజాతివారము.

అగ స్త్రి:—ఏజాతివారము ?

విష:—ఏమో ?

గగని యోగినివలన నాహూతుడై స్థాలశిష్యుడంత నచ్చటికి వచ్చెను.

స్థాల:—చంద్రా !

విష:—చిత్తము ! తాతయ్యాగారూ !

స్థాల:—నీకు కంట నీరు వచ్చినదట ?

విష:—వచ్చినది.

స్థాల:—ఎందుకు తల్లీ ?

విష:—తాతయ్యా ! నేను అగస్త్రియు ఒక జాతివారమా ? కాదా ?

స్థాల:—అవును ! అయినా కొన్ని భేదములున్నవి.

విష:—నీకును నాకును సంబంధమేమిటి ?

స్థాల:—నీకేమితోచినవి ?

విష:—నాకా ? ఉలూపికి పిల్లపాము లెన్నో పుట్టినవి. ఆలాగుననే నేనును నీకడుపున పుట్టితిని.

స్థాల:—నాకడుపుననా ?

విష:—లేకపోయిన, నేనన్న నీకంత ఇష్టమెందుకు ? తన చిన్నపాములన్న ఉలూపికి ఎంతో ఇష్టము. వానివైపునకన్నా ఇతరపాములను రానీయదు. అర్జునునికూడ రానీయదు ఆ పాములు కొన్ని తెల్లవి. కొన్ని నల్లనివి. ఆలాగుననే నేనును నీకడుపున పుట్టియుందును.

స్థాల:—ఈ ఆలోచనలతో కంట నీరువచ్చినదా ?

విష:—అవును తాతయ్యా ! ఇంకను ఏవో ఆలోచనలు వచ్చినవి. ఎవ్వరు నన్ను కామించి వచ్చినది మొన్న పూజార్పణవేళ ? ఆతడు నన్ను కామించినాడు. అట్లుచేయుట కామమంటిరిగదా మీరు. వాడట్లు నన్నదిమిపట్టుకొనుట నాకేదియో జల్లుమన్నది. కోపము వచ్చినది.

స్థాల:—కోపమన ఏమిటి ?

విష:—చంపివేయవలయునని అనుకొనుట.

స్థాల:—నీకు తర్వాత కామమునుగూర్చి, ప్రేమనుగూర్చి చెప్పెదను. కాని ఇప్పుడు నీకు కోపమే రావలసియున్నది. నీ వొకరిని చంపివేయవలయును.



విష:—మీరు చంపివేయకూడదా ? ఈ అగస్త్రిగాని, గగనిగాని, కాశ్యపిగాని చంపకూడదా ?

స్థాల:—తల్లీ నీవు నా కడుపున బుట్టినట్లె. నీవు మా అందరిని మించి పుట్టినావు. నీవు కారణజన్మవు. నేను చేయుపని వేరు. అగస్త్రియు, గగనియు, కాశ్యపియు చేయుపనులు వేరు. నీవు చేయుపని మనసందరిని కడుపునగన్న భగవంతునిపని. అట్టిపనులు నేనుగాని, యీ యోగినులుగాని చేయలేరు. ప్రేమించువారే చంపివేయువారు. నీవు ప్రేమించవలెను, చంపివేయవలెను. ఉలూపి అర్జునుని ప్రేమించును. అయినను అర్జునుని చంపుట కెన్నిసారులు ప్రయత్నించి మానలేదు. తన బిడ్డలలో రెండు మూడింటిట మింగివేయుట నీవును చూచితివి కాదా ?

విష:—అవును తాతయ్యా ! నన్ను మీరు ప్రేమింతురు. నన్ను మీరేల చంపరు ?

స్థాలశిష్యుడు హృదయమున వడకెను. ఆయన యొక్క నిమేషమాత్ర మూహించి

“ తల్లీ ! తొందరపడకుము. భగవంతుని ఇచ్ఛ ఎట్లున్న నట్లగును. నీవు సంతోషముగ నాడుకొనుము. మనమందరము కొలదిరోజులలో ఇంకొక ప్రదేశమునకు బోవుదము. అచ్చట ఎన్ని చిత్రములో ఉండును. నీవు చూచెదవు. గోదానదినది, అడవులు, కొండలు అనేక విధములగు పూవులు, చెట్లు, ఇంక నెన్నో వింతలు, ఆటబొమ్మలు గలవచట.

విష:—అవునా తాతయ్యా ! అన్ని ఆటవస్తువులా ! ఓహో ! నాకు ఆడుకొనేందుకు ఒక . . .—ఒక . . . . . . ఆ చచ్చిపోయినవానికన్న అందంగాఉండే బొమ్మను ఈయవా ?

స్థాల:—ఇచ్చెదనమ్మా ! ఇచ్చెదను. ఆడుకొనుటకు బొమ్మనుకాదు ప్రేమించుటకు నుంచి పురుషునే ఇచ్చెదను.

ఆతని కళ్ళవెంట స్ఫులింగములు రాలినవి. ఆ కళ్ళలోని తేజస్సును కనుంగొని ఆ ముగ్గురు యోగినులు గజగజలాడిరి. విషబాల నవ్వుచు, చప్పట్లు కొట్టుచు ఆ వనములోనికి పరుగిడిపోయినది. ఆ వనమంతయు దిరిగి, యా భయంకరాద్భుతసుందరి సాయంకాలమునకు తన మందిరము చేరి యా ప్రక్కశాలలోనున్న గగనీదేనికడకు పోయి,

“ గగనీ ! నేనును ఆడుదాననే ” యనినది.

# షష్ఠ ప్రకరణము

## సుశర్మ

పాటలీపుత్రమున రాజభవనమునందు సుశర్మ చక్రవర్తి సుఖాసీనుడైయుండెను. సుశర్మ రూపసంపదగల్గిన బ్రాహ్మణుడు. కాని ధనువునకు అయిదంగుళములుతక్కువయుండు నాతని నాకాలపువారిలో పొట్టివాడనియే చెప్పికొనువారు. చంద్రగుప్తమౌర్య సార్వభౌముని, అశోకభరతాధిపతిని తలంచుకొనియు, వైదికమార్గనిష్ఠులగు నాదిభూపతుల వైభవము భావించుకొనియు, భరతదేశమంతటి నొక్క యేలుబడికి గొనిరావలెనని సుశర్మ ఉఱ్ఱూటలూరుచుండెను. ఆతని భావమున జంబూద్వీపమంతయు దన క్రీడాస్థలమై గోచరించినది. ఆతని రథచక్రధ్వానములు హిమవన్నగముల దాకి వెనుకకు ప్రతిధ్వనుల నంప, నవి వింధ్య శృంగావళీ గిరికందరముల బలుకరించి, పోయి పోయి, నీలగిరి సానువులతో జెలికార మొనర్చినవి.

ఆ సుశర్మప్రభువు సర్వకాలముల దేవపూజాతత్పరుడై, వేలుపులకు మ్రొక్కుకొనుచుండును, ప్రాణుల బలి యొసంగుచుండును. బౌద్ధమతము నశించి బ్రాహ్మణమతము దిశాల నిండిపోవలెనను ఆశయు, ఒక్క చక్రవర్తి ఏకపరిపాలన, ఒక్క న్యాయము, ఒక్క మార్గము అను దృఢాభిలాషయు ఆతని ఎముక యెముకకును పట్టిపోయెను. బ్రాహ్మణుడు ఏమి చేయ కలుగును? సైన్యాధిపతియై, తన అక్షౌహిణులను విజయాన్వయముల నడుపుటకు శక్తిలేదు. నలుగురిని గూడకట్టికొని వచ్చుటకు దగిన వ్యక్తిత్వము చాలదు. మహామేధావి ప్రతిజ్ఞా నిర్వాహకుడు యశోవిశాలుడగు చాణుక్యునంతవాడు కాడు, కాని సుశర్మకు బుద్ధిబలము లేక పోలేదు. బాహుబలద్వితీయమైన బుద్ధిబలము ప్రకాశించును. చాణక్యునికి చంద్రగుప్తుడు కావలయుంగదా.

సామదానభేదోపాయముల సర్వకార్యంబుల నీడేర్చుకొన సుశర్మ సంకల్పించుకొనెను. పాటలీపుత్రపురంబున బౌద్ధభిక్షువుల సంఘారామంబులకు బ్రతిగా బ్రాహ్మణపరిషత్తుల ప్రారంభించినాడు. అవ్వాని కన్నింటికి నగ్రహారములొసంగెను. పండితులు, శాంతస్వభావులగు భూసురుల కనేకులు కాశ్రయమిచ్చి వారిచే భారత రామాయణాది గ్రంథములలో బౌద్ధమతఖండనల ప్రక్షేపింపజేసి అనేక ప్రతుల సృజించి దేశమున వెదజల్లనారంభించెను. షట్చక్రవర్తుల చరిత్రలను సమకూర్పించిన దీతడే. అంతకుమున్ను అచ్చటచ్చట



నలుడు, హరిశ్చంద్రుడు, సగరుడు మొదలగువారల కథలు, చరిత్రలు చెప్పుకొనువారు. నేడు హరిశ్చంద్ర నలోరాజా అను శ్లోక మొందు నిర్మాణమైనది. వారి కథలు, పురాణేతిహాసముల నందగించినవి.

బౌద్ధమత ప్రతికక్షులగు బ్రాహ్మణుల నేకులు తలలెత్తిరి. ప్రతిదేశమునకు వారు ప్రచ్ఛన్నులై చని అచ్చటి వైదిక ధర్మాభినివిష్టుల నెలకొల్పి వారిసహాయమున ప్రజలకు వేదమతమును క్రొత్త క్రొత్త వ్యాఖ్యానములచే నుపదేశింపసాగిరి. బౌద్ధులపై కత్తిగట్టించుచుండిరి. సుశర్మమహారాజిదియంతయు జూచి, సంతోషించుచు, బాష్పబిందుసంచలితలోచనుడును, హాసపూర్ణవదనుడును నగును.

మౌర్యుల కాలమునాటినుండియు భారతసార్వభౌమత్వమునకు పాటలీపుత్రమే నెలవైనది. పాటలీపుత్ర సింహాసనాసీనుడగువాడే చక్రవర్తి అను భావము రూఢమైనది. బలవంతులగు రాజులనందరి నోడించి, సామంతుల చేసికొని, ఒడ్డోలగంబున నుపవిష్టుడై జయజయధ్వానములు చెలగు నింద్రవైభవ మనుభవించు టెప్పుడు సమకూరునాయను గాఢతృష్ణ సుశర్మను వెఱ్ఱివానిని చేసినదాయెను.

పరశురాముని తలపోసికొని, ఆ మహావీరుని విగ్రహముకడ సుశర్మ యేకలవ్యునివలె తప మొనర్చెను. అత్యంత పురాతనమై, బంగారు పిడియు వజ్రశిరోభూషణమునుగలిగి సుందరమై వేదఘనసారమునలె విపులముఖమగు మహాపరశువును సుశర్మ నేపాళమునుండి సముపార్జించెను. త్రిచక్రమార్గములు, అష్టాదశవక్రములు, నవవిధ ప్రహారములు యేకవింశద్వ్యసప్రయోగములు సుశర్మ సునాయాసముగ గ్రహించెను. ఏ యాయుధపు వేటునైనను ముప్పదిమూడు విధంబుల రక్షించుకొన శక్తికలవాడయ్యెను.

ఆనాడు సుశర్మచక్రవర్తి సుఖాసీనుడైయుండెను. ఆతనితో శివస్వాతియు మరి యిద్దరు క్రొత్తపురుషులును మంతనంబు సల్పుచుండిరి.

సుశర్మ:—శివస్వాతీ! పేరునడచిన పోటుమగడవు నీవేల నోడిపోతివో?

శివ:—చిత్తము. మహారాజాధిరాజుల కేమని విన్నవింతును. ఆంధ్రులు మంత్రవేత్తలు. మాయకాండ్రు. వారు మా పరసరములకు పంపిన తృణ తిలపిష్టక లవణ నాశ్వపాన యవ క్షీర సురా ఘృతో, శృంగిబేరాదు లే మందులు మాకు గలిపిరో. నేనతి జాగ్రత్తగనే ముందా దేశపు పసరములకు కొన్నింటికి రుచి చూపుచునే యుంటిని. అయిన లాభమేమి? ఆ మందులు నా కోడెలకు జవము తగ్గించినవి. త్వరగా నలసిపోయినవి. ఆంధ్రుల నొక్కనాటికి నమ్మరాదు.

సుశర్మ:—ఆంధ్రులంత మాయకాండ్రా.

శివ:—దేవా! ఇంతవరకు మా రాజును కన్నుకప్పి సర్వ కార్యముల నొనరించుకొనుచున్నారు. నెమ్మదిగ నెమ్మదిగ గౌతమీనదీ కూలములుదాటి కళింగమును జొచ్చుకొని వచ్చుచున్నారు. ప్రభువు నిజవంశప్రతిష్టను మఱచిరి. పుష్యమిత్ర నృపతి నోడించిన ఖారవేల సార్వభౌముని ప్రతాప మేమయిపోయినదో? అశోకచక్రవర్తి సైన్యములకు చెలియలికట్టయై అనేకసంవత్సరములు లక్షలకొలది వీరుల బలిచేసి ఆ మహాత్ముని స్నేహముగొన్న నుమపాల భూపతి పౌరుషమేమయ్యెనో? నేడు మా చిత్రశిఖ మహీధవులు తెరపై చిత్రప్రతిమవలె నాంధ్రు లెటులాడించిన నటు లాడుచున్నారు.

క్రొత్తపురుషుడు:—మా శివస్వాతి శకట పరీక్షకుం జనినప్పుడు ఆంధ్రరాజ్యపు గుట్టుమట్టులన్నియు గ్రహించివచ్చినాడు. ప్రమత్తులు, అలసులునగు ముసలిరాజులు, వారి వంశములు, కాలమున లీనమైపోయి, నూత్న ప్రభు మంత్రోత్సాహశక్తులు పొడచూపవలెను. ఈ మహాకార్యమును సాధింప శివస్వాతి ప్రతిన బూనినాడు. మా ప్రజలందరు జినపక్షపాతులు. కాళింగులు జైనులు. ఈ జినస్వామి బోధలచే వీరజాతులన్నియు నీరసించుచున్నవి. పురుషకారశూన్యమై చెడుచున్నది. ఆనందదాయకమై, పుణ్యప్రదమై, సత్యస్వరూపమగు వేదమతము భారతభూమిలో పునఃప్రతిష్టము కావలెను. ఈ మహాకార్యమును తమరు పైన వేసికొన్నచో మేమందర మనుసరింతుము. మహారాజా! ఆర్యధర్మమును దిక్కుమాలినదాని నొనర్పకుడు.

సుశర్మ:—రాజకుమారా! నిజము చెప్పుము. తామింతవరకు నెవ్వరిచేత నోడింపబడలేదని ఆంధ్రులకు గర్వము. వారికున్న సైన్యములు, ప్రతాపములు, అట్టివి జంబూద్వీపమున నేరికి లేవని అందరనుచున్నారు. అట్టివారు కళింగ మాక్రమించుకొన్నచో మాళవ విదేహ నేపాళ కాశ్మీర పాంచాలాది దేశముల్ జయించినచో ఆశ్చర్యమున్నదా? వారి ధాటి కెదిరినిల్చువారెవరు?

శివస్వాతి:—ప్రభూత్తమా! దేవర వచించినది నిజము. మన మందర మాడువారమై యూరకున్నచో నట్లేయగును. ఈ యువకుడు కళింగాధిపతికి మేనల్లుడు. మా సహోదరి నీతని కిచ్చిరి. రెండవయాతడు విదేహాధిపుని తమ్ముని కుమారుడు. ఔఘుల నామధేయుడు. ఇదివరకే నా వేగువలన దేవరకంతయు విశదమై యుండగలదు. కళింగమున నా అధికారమున



రెండక్షౌహిణుల సైన్యములున్నవి. ఇంక ననేక దళముల సేకరింపచేయగలను. నా పెదతాతగారి మనుమడగు కళింగాధిపతి ఆంధ్రరాజునకు స్నేహితుడనుకొని సామంతుడై యున్నాడు. ఔఘుల రాజకుమారుడు విదేహమున నున్న సర్వసైన్యముల నవలీలగ మన పక్షమునకు త్రిప్పివేయగలడు. ఈ యుభయపక్షముల బ్రాహ్మణులందరు మాకు బాసటగా నున్నారు. ఆంధ్రభాను డస్తమించు సమయమాసన్నమైనది. భారతభూమి యందలి యువజన మంతయు మిమ్ము నాయకునిగా వరించుచున్నది. ఆంధ్రులన మీకేనాటివి. అటు విదేహమున నౌఘులుడు, యిటు కళింగమున నేను రాచతంత్రము వశీకరింతుము. మిమ్ము భరతవర్ష చక్రవర్తి నొనర్తుము. వేదధర్మస్వరూపులగు మీరు మగధసామ్రాజ్యమునకు తొల్లింటి వైభవమును సమకూర్చి జగద్రక్షకులు కాగలరు.

సుశర్మ:—మంచిది. స్థాలతిష్యుల యత్నమేమైనదో చెప్పవైతివి. మనము కేవలము శౌర్యము నే ఆశ్రయించుటకంటె ముందుగా ఈ భేదమార్గముల వరయుట మంచిది. మీరింక విశ్రమింపుడు. నేటి రేయి మా సేనాపతులతో, అమాత్యులతో సంప్రదింతుము. ఆవేళకు మీరుగూడ వచ్చిన కార్యనిశ్చయము చేయవచ్చును.

మరల దర్శనము చేయుదునని ఆతడు పలికెను. సుశర్మ కక్ష్యాంతరములకు బోయెను. అశోకచక్రవర్తి కట్టించిన యా యద్వితీయ సౌధపంక్తి, ఆ మందిరములు, ఆ భవనములు, ఆ విభవము దేవతా సార్వభౌమునకుగూడ దుర్లభములు. సుశర్మ యట్లు ప్రతీహారులు దారి చూప నొక భవనమున ప్రవేశించెను.



# సప్తమ ప్రకరణము

## ఆనందమహారాజ్ఞీదేవి

ఆనందమహారాణి ఇక్ష్వాకుల ఆడుబడుచు. వారి రాజధాని ధనదపురము. ఇక్ష్వాకుడగు శాంతమూలమహారాజు శాతవాహనులకు ముఖ్యసామంతుడుగ, మహాసేనాపతిగనుండి అభయబాహుసార్వభౌమునికి సర్వవిధముల చేదోడువాదోడుగ నుండెను. తన యనుగుగారాపు నానందదేవిని యువరాజగు శ్రీముఖునికిచ్చుట యతని తపఃఫలంబయ్యెను. ఆనందదేవి కాపురమునకు వచ్చిన రెండవయేటనే శ్రీకృష్ణశాతవాహనుడు జన్మించెను. మరల నామెకు సంతు అయిదేడులవరకు కలుగలేదు.

శ్రీముఖునకు ఆనందదేవియన గౌరవము, గాఢప్రేమయును. కౌశికీపుత్ర శ్రీముఖశాతవాహనునకును, ఆనందదేవికిని శ్రీకృష్ణుడు జన్మించిన పదునారవ ఏట మంజుశ్రీ రాకుమారుడు బంగారు ముద్దులబొమ్మవలె ఉద్భవించినాడు. వీరిరువురకు నడుమను మాయాదేవియు, శాంతశ్రీదేవియు కొమార్తెలు జన్మించిరి.

ఆనందమహారాణి గర్వమిసుమంతయు ఎఱుగదు, రాజతంత్రములను సునిశితబుద్ధితో విచారణ చేయగలదు. భర్తను బిడ్డలను హృదయమార ప్రేమించు ఉత్తమగృహిణి. ఆంధ్రమహాసామ్రాజ్యమునకు చక్రవర్తినిఅయ్యు నిరాడంబరయై, ఆస్తికురాలై ప్రజల నందరను దన కన్నబిడ్డలుగ చూచు రాజ్ఞీమాత యైనది.

ఇంతలో అంతఃపురముల నాడుకొను మంజుశ్రీ మాయమైనాడు. ఐదేండ్ల బాలుడు, మాటలు నేర్చి, తనవారు, పరులు అని గుఱుతెరిగినవాడు. విద్యాభ్యాసమైనప్పటినుండియు అష్టాధ్యాయినే ప్రారంభించినవాడు ఎటుల మాయమయ్యెను ?

అన్నగారగు శ్రీకృష్ణుడు ధీకుశలుడు, రాజ్యతంత్రజ్ఞుడు, అతిరథుడు, శత్రుపురులయెడ దాక్షిణ్య మిసుమంతయు కనబరచువాడుకాడు. ఆ యన్నకు, దమ్మునకు గుణవైరుధ్య మెంతేనిగలదు. ఆ బాలుడు నీచసేవకునైన కోపపడియెరుగడు. సార్వభౌమ శుద్ధాంత మహామందిరములలో పరిచారికగాని, కంచుకిగాని, దౌవారికుడుగాని, ప్రతీహారిగాని దాసీలుగాని, చెలికత్తెలుగాని, అంగరక్షక వీరాంగనలుగాని, ఆ చిన్నిబాలకుని ప్రేమింపనివారు లేరు. అట్టియప్పుడు ఎవరిచేతులు ఆడెనో ఆ బాలుని తస్కరించుటకు ? ఏమి



కారణము ? తన ముద్దుబిడ్డడు మొన్న మొన్నను పాలు విడిచిన పసికూన ! ఎవ్వడా కఠినాత్ముడు, ఎవ్వతె యా పాషాణహృదయ, తన కన్నబిడ్డను తల్లి యొడినుండి యెడబాపినది ? ఆనందదేవి దుఃఖమునకు మేరలేదు.

ఆ మహాసామ్రాజ్యమునందున్న చారులు, రక్షకభటులు, ఉద్యోగులు, సేనాధికారులు, సాధారణప్రజలు, మంజుశ్రీరాజకుమారుని పోకడ తెలియుటకు ప్రయత్నించనివారు లేరు. జాలికుడు మహామంత్రము ప్రయోగించినట్లు మాయమైపోయినాడు. ఆ విశాలాంధ్ర సామ్రాజ్యమునందెచ్చటను యీషన్మాత్రము జాడ దొరకలేదు. ప్రజలు తమలో దామేదియో గుసగుసలు పోవుటేకాని ఎవరికిని ఇదమిద్ధమని యీగడ తెలియరాలేదు. చారశాఖాధ్యక్షుడగు శుకబాణునిప్రజ్ఞ యించుకయు కొఱగాలేదు. ఇంతలో యుద్ధోపద్రవము వచ్చిపడినది.

హృదయాంతరముల నెట్టిబాధచే కుమిలిపోవుచుండెనో శ్రీముఖుడుమాత్రము నిండు రాజసభలోగాని, అవరోధజన మధ్యమునందుగాని, తన ముద్దుబాలకుడు మాయమైపోయినాడను కించ యింతైనను వ్యక్తము కానీయలేదు. ఆ బాలుడు మాయమైనను ఆ సంవత్సరమును సార్వభౌముని జన్మదినోత్సవములు జరుగనే జరిగినవి.

సాధారణ ప్రజాలోకమునకు మంజుశ్రీ మంత్రించినట్లు, మాయమైనాడనువార్త తెలియనేలేదు. అది తెలియకుండునట్లు కట్టుదిట్టము చేయబడినది. ఒక భయంకరసంఘటన జరిగినయప్పుడు దానికి ప్రతివారును కర్తలుగనె గోచరింతురు. ఎంత సన్నిహితులైనను వారినిగురించి అనుమానములు తక్కినవారి హృదయముల తలలెత్తుచుండును.

శ్రీకృష్ణశాతవాహనుడు గూడ నీ యనుమానములకు గురియయ్యెను. శ్రీకృష్ణునకు తెలియకుండగనే ప్రజ్ఞావంతులగు గూఢచారులు అతని సర్వవిధముల గనుపెట్టి చూచుచుండిరి. కాని శ్రీకృష్ణునికిమాత్ర మేమి తెలియును ?

కౌశికీపుత్ర శ్రీముఖశాతవాహనమహారాజు తన రెండవ పుత్రుడు రాజకుమార శ్రీ మంజుశ్రీ అంత విచిత్రముగ రాణివాసమునుండి తిరస్కరిణీవిద్యచే అంతర్ధానమైనట్లు అగోచరుడగుట మొదట ఆశ్చర్యమునందెను. తర్వాత నాతడు గాఢవిషాదము పాలయ్యెను. అంత మహాక్రోధమానసుండయ్యెను.

పుత్రునిగురించి ఎన్నివిధముల వెదకించినను అతడు బ్రతికియుండి విరోధుల హస్తముల నున్నవాడను సూచనలుతక్క వేరు జాడలేమియు కన్పించవయ్యె. పాములబోలి మహారాజులు ఎట్లు వాపోవగలరు ? శ్రీముఖశాతవాహనుడు తన మహారాజ్యమంతయు అప్రమత్తుడై కనిపెట్టియుండవలె. రాజ్యము చతుస్సముద్రవలయితము చేయవలె. ధర్మము నాల్గు

పాదముల నర్పించవలె. ఆంధ్రదేశము ఆర్యావర్తము సుభిక్షమై సకల సంపదాకరమై, ధర్మపూర్ణమై, పుణ్యవంతమై, స్వర్గధామములకు తుల్యము కావలెను. సర్వకాలము శ్రీముఖుని వాంఛయది. ప్రజావ్యసనము ముందు, ఆత్మవ్యసనము తరువాత.

ఆనందదేవి భర్తకు తోడునీడయైన ఉత్తమ సహధర్మచారిణి, గృహిణి, మహారాణి. ముఖ్య రాజసభలయందామె భర్తతోపాటు అర్ధసింహాసనమున నధివసించుచుండును. శ్రీముఖుడామెను ఆమె యభిప్రాయముల నడుగుచుండును. సమయోచితముగ ఆమె తన భావము వెల్లడి చేయుచుండును.

ఆమె అతి లోకసుందరి కాకపోవచ్చును, కాని యవ్వనమున నామె ముఖములో దివ్యప్రసన్నత, స్పష్టరేఖారచిత నాసికాద్యవయవసౌకుమార్యము శోభిల్లుచుండెను. మహారాణులకు స్వర్గకాంతాసమానులకు కూడా నాలుకద్దు సహజగాంభీర్య మామె సొమ్ము. సర్వాంగోపాంగ స్వాపీశనము చేయునగమకు మంజులతా ప్రశస్తి ఆనాటి యువతులలో నామెను సాటిలేనిదానిని జేసెను. శ్రీముఖుడామెను గాఢముగా ప్రేమించినాడు. ఒంహోయల ప్రేమించి చేసికొన్న వారి వివాహము స్వయంవరమే యనుకొనిరందరును. ఆనాటి ప్రేమ నేటివరకును ఇసుమంతయు తొణకక, తగ్గిపోక, స్నేహవాత్సల్యమిళితమై దినదినాభివృద్ధి గాంచుచు పెరిగినది.

సామంతులు, పరదేశప్రభువులు, ఎందరో రూపగుణసంపన్నలగు తమ బాలల నిత్తుమని రాయబారములంపిరి గాని శ్రీముఖుడు వలదని నిస్సంశయముగ దెలిపి నాటి మహారాజులలో ఏకపత్నీవ్రతుడని పేరందెను.

ఆనందదేవి కా దినముల హృదయమున కలత మరియు పెరిగినది. బాలకుని తస్కరించి పదునేను మాసములైనది. ఆతని జాడ లేదు. అప్పుడే వ్రాయ నేర్చిన యాతని ముద్దుటక్షరములతో భూర్జపత్రలేఖలు మాత్రము నెలకొకటి వచ్చుచున్నవి. ఎక్కడనుండి వచ్చుచున్నవో, ఎవరు తెచ్చి దేవి పూజాపీఠమునందుంచుచున్నారో ఎవరికిని తెలియుటలేదు.

ఉత్తరముల రాకను గుర్తించుటకు నియుక్తులగు గూఢపురుషులు, షండులు, చారిణులు ప్రయత్నించి ఒకదాసిని పట్టుకొనిరి. ఆమె కా యుత్తరమునిచ్చిన యతడామెకు వలపుమగడు. ఆ విటుని యింటి కెవ్వరో ముసుగువైచికొనివచ్చి, ధనము ధారపోసి, ఆ యుత్తరము దేవి పూజాపీఠికపై నాలుగైదు నాళ్ళలో నుంచగోరిరట. ప్రమాదములేదని వారిరువురందుకు సమ్మతించిరట. వారియిరువురిని రాజభటులు కళింగమునకు బంపివేసినారు.



ఇంతలో అపసర్పులు కొందరు చాలసంగతులు సేకరించిరి. చాలవరకు కుట్ర తెలియవచ్చినది. అందులో స్పష్టరూపము తాల్చిన పురుషులు సోనుత్తరుడు, సంపరణుడు, మహేశ్వరానందుడు, చంద్రస్వామియు; వారిలో కల్ల ధర్మశీలుడు చంద్రస్వామిఅని అపసర్పాధికారి తెలిసికొని, మహామాత్యుల ఆజ్ఞపై చంద్రస్వామిని పట్టించి, విచారణకుబెట్టెను. కాని నిజమింతయు దెలియలేదు. సోనుత్తరాదులు సంపూర్ణముగ మాయమైపోయినారు.

మహారాజ్ఞికి చక్రవర్తి ఎప్పటివార్తల నప్పుడే యందజేయుచుండెను. ఆ తల్లి ధైర్యమిసుమంతయు వీడకపోయినను విషాదముమాత్ర మెట్లు పారద్రోలగలుగును? తుదిబిడ్డడు అందాలపాపడు. ఆమే శ్రీకృష్ణుని మహారాజ పుత్రోచితముగ బెంచిన మహారాణి. నేడు తన కడుపుపంటను, ప్రేమనిధిని పెంచుకొను తల్లిమాత్రము. అటులని పెద్దకుమారునియందామెకు ప్రేమ తక్కువకాదు. జ్యేష్ఠపుత్రుడు ఒరులసహాయమపేక్షింపని మేటియని యామె కాతని శిశుదశనుండియు భావము. భీమునిగూర్చి కుంతి ఆరాటమువడినదా?

బాలకుడు మాయమైనాడను విషాదముతోపాటు ఆమెకు నెలలు గడచినకొలదియు నీ యుద్ధములెందుకు అని బాధ మొలకెత్తినది. ఎందుకు ఈ హింసలు, ఈ ప్రజానాశనము.

మహారాణి ఒక శుక్రవారము సాయంకాలము పరివారజనము కొలువ మహాచైత్య సంఘారామమునకు బోయినది. ఆమె రథము తోరణముకడ డిగ్గి పాదచారయై అమృతపాదార్హతాచార్యుల పటకుటీరమునకు బోయెను.



# అష్టమ ప్రకరణము

## కులపతి

అమృతపాదాచార్యులకు కొంచెమెచ్చుతగ్గు ఏబదియేండ్ల వయసుండును. శాంతమే రూపముపూనిన తేజోరాశి. విజ్ఞానసముద్రుడు. వేద వేదాంగ పారంగతుడు. సర్వశాస్త్రవేత్త. త్రిపిటకములు, బౌద్ధదర్శనములు, ఆర్ష దర్శనములు, జైననికాయములు, చప్పన్న భాషలును ఆ ఆచార్యునకు ముఖస్థములు.

ఐనను అమృతపాదులకు పదునేను సంవత్సరముల పూర్వము నడచిన తన చరిత్ర ఏమియు తెలియదు. ఆయన తల్లిదండ్రులెవ్వరైనది ఆయనకు తెలియదు. తన పేరెరుంగడు తన గ్రామమెరుంగడు. ఉపవీతమును, తక్కుంగల వేషమును ఆయన బ్రాహ్మణజన్ముడని ఆయనను రక్షించిన బౌద్ధసన్యాసులకు తెలియ చెప్పినవి.

కుసుమపురమునకు పదునాలుగు గోరుతముల కెగువను గంగాతీరమున బుద్ధుని ప్రియశిష్యుడగు ఆనందుడు నెలకొల్పిన మహాసంఘారామమొకటి యున్నది. ఆ సంఘారామవాసులగు బౌద్ధసన్యాసులు కొందరు ఒకనాడుదయమున కాలోచితస్నానము లాచరింపుటకు వెడలియుండిరి

ఇంతలో ఒక భిక్షువు 'ఓహో' యని యరచి నీటిలో తన చేతికి దొరికిన యొక శవము జుట్టు పట్టుకొని యొడ్డునకు లాగుకొనివచ్చెను. తక్కిన నల్గురును ఆ కళేబరము నెత్తి నీటికి దూరమున పరుండబెట్టిరి. కాని ఆ శవమును పరీక్షించినకొలది వారి యాశ్చర్యము మిన్నుముట్టినది.

అది శవముకాదు. ఒక మనుష్యుని దేహము. లంబికాయోగము దాల్చి జలస్తంభన విద్యచే గాబోలు నీటియందు మునిగి, యా పురుషుడెవ్వఁడో నీటిమట్టమునకు దిగువ కొట్టుకొనివచ్చు కొన్ని లుక్కుపదార్థములలో చిక్కుపడి, ప్రవాహవేగమున వచ్చుచున్నాడు. ఆ దేహమునందున్న తేజస్సు గాబోలు మత్స్యాదికములేవియు ఆ దేహము నంటలేదు. దేహము వెచ్చగనున్నది, నాడి లేదు. ఉచ్ఛ్వాస నిశ్వాసములు లేవు. కన్నులరమూతలుపడి లోనివైపునకు తిరిగియుండెను. శిరముపై ఏదియో పెద్ద గాయముతగిలి పుర్రె ఎముకపైన చర్మమును, కండయును పగిలియుండెను. పుర్రెఎముక స్పష్టముగ కన్పడుచుండెను.



పవిత్రములు అమృతముతో సమములనగు గంగాజలములు ఆ గాయమును శుభ్రపరచి గాయమున నేదోషమును ప్రవేశింపకుండ కాపాడినవి.

ఆ భిక్కులలో ఆయుర్వేద ప్రజ్ఞానిధియైన యొక సన్యాసి సప్తనాడులను పరీక్షించి హృదయస్పందన మాగిపోయినను రక్తము ప్రవహింపుచునే యున్నదని నిర్ధారణ చేసినాడు.

కాని ఆ పురుషుని ఆత్మశక్తి, దేహమునుమించి దేహమును రక్షించుకొనుచు మహాప్రవాహములై, సర్వదెసలకు ప్రవహించుచుండినదట.

ఆ భిక్కులు ఆ శరీరమును ఆశ్రమములోనికి గొనిపోయిరి.

ఆనంద సంఘారామమునకు పెద్దయగు కులపతి మహాయోగియగుటచే లంబికాయోగముచే స్థాణుత్వమునందిన యా పురుషునకు చైతన్యము కలుగజేయు మంత్రములు పఠించి ఓం! ఓం! ఓం! అని ప్రణవోచ్చారణ ప్రారంభించెను. ఓం, ఓం, ఓం, శుద్ధచైతన్యమై, జడమై సర్వము నిండియుండు పరమాత్మయిచ్ఛచే జాగ్రతమై మహాసృష్ట్యున్ముఖమైనట్లు ఆ ప్రణవనాదము ప్రథమమున అస్పష్టశ్రుతియై, అటువెనుక శ్రుతిస్వరూపమంది, విజృంభించి దివ్యరాగమై, అవరోహణమై, ప్రసరించి ప్రసరించి గంభీరగతులు పొంది మహాతేజస్స్వరూపమైనది. లోకమున విస్తరించియున్న యా పురుషుని చైతన్యము విద్యున్మయోన ప్రతి అణువున పరిధ్వనించి, ఆవర్తములందుచు, సమీకృతమై, యింకను దగ్గరపడుచు, ఆతని దేహములో కమ్ముకొన్నది.

అప్పుడా చిచ్ఛక్తి స్పందనమై ఆ దేహమున నణువణువున ప్రసరించినది.

ఆ నూతనపురుషుడు కన్నులు తెరచి చూచినాడు.

ఒక భిక్షువు:—"స్వామీ మీ రెవ్వరు?" అని ప్రశ్నించెను.

నూత్నపురుషుడు వారివంక నేమియు గ్రహింపనివానివిధమున తెల్లబోయి చూచెను.

భిక్షువు:—స్వామీ యీ మందు సేవింపుడు.

ఆ నూత్నపురుషుడు వలదని చేయి యూపెను. ఆతని బొమలు ముడివడెను అప్పుడాతని ఆకారరేఖలు ఏదియో మరచిపోయినవాని విధమున సూచింపుచుండెను.

ఆతనికి చైతన్యము వచ్చుటకుమున్నే వైద్యశేఖరుడైన భిక్కుడు కొన్ని ఓషధులు ఆ గాయముపైనుంచి శుభ్రవలిపెముతో కట్టు కట్టినాడు. ఆ నూత్నపురుషుడు చేతిచే తలకు కట్టిన కట్టులు తడవిచూచుకొని, యిది యేమని కన్నులతో ప్రశ్నించెను.

భిక్కుడు:—"స్వామీ మీకు నీరసముగనున్నదా? అయినచో యీ రసాయనము సేవింపుడు" అని అనునయించెను.

నూత్నపురుషుడు ఏమియు లేదన్నట్లు తలయూపి, తానెవరని అడిగినట్లు కన్నులు విప్పి వారిని తీక్ష్ణముగ చూచినాడు.

ఒక భిక్షుకు, "నీవు మాకు స్నానము చేయుచుండగ దొరికినావు. ఎక్కడినుండియో కొట్టుకొని వచ్చుచుంటివి" అని తెలిపినారు. ఆ నూత్నపురుషుడు తనకేమియు నర్థమగుట లేదను భావమును స్ఫురింపజేయు విషాదయుతములగు చూపుల ప్రసరింపజేసెను.

వృద్ధుడును, మహాతపఃసంపన్నుడును అగు ఆ ఆశ్రమకులపతి ఆతనికానాటినుండియు ఏమియు నెరుంగని చంటిబిడ్డకు నేర్పునట్లు జ్ఞానముపదేశింప నారంభించెను.

ఆ నూత్నపురుషుని పూర్వవాసనలెట్టివియో ఎవరెరుంగగలరు? అవి మహోత్తమములై యుండవలయును, ఆరు నెలలలో ఆతనికి విద్యలన్నియు వచ్చినవి. సర్వభాషలును వచ్చినవి. అయినను తానెవ్వరో అతనికేమి తెలియదు.

స్నానము చేయునప్పుడు పాదములకు తగిలిన కారణమున ఆ నూతనపురుషునకు అమృతపాదులు అని పేరిడినారా ఆశ్రమవాసులు.

అమృతపాదులు మూడేండ్లయినవెనుక భిక్షునర్హమైన సన్యాసదీక్ష స్వీకరించెను. నీటినుండి పైకి తీయబడినప్పుడే అతడు బ్రాహ్మణుడనిమాత్రము వారు గ్రహించిరి.

సన్యాసమునందిన ఐదేండ్లలో అమృతపాదులు, అర్హతులైనారని కులపతి యాతని నాశీర్వదించి బుద్ధసేవ చేయుమని ఆదేశమిచ్చి లోకములోనికి పంపించెను.

అమృతపాదులు గురువును స్మరించుచు, బుద్ధదేవుని ఆరాధించుచు భూమండలమంతయు సంక్రమించి, పరివ్రాజకత్వము దాల్చిన నాల్గేండ్లకు ధాన్యకటకసంఘారామమున ప్రవేశించెను.

జలమునందాతడు దొరుకునప్పటికి ఆతనికి ముప్పది, ముప్పదిమూడు సంవత్సరములుండునని యాతనిగురువు ఊహించినారు.

ధాన్యకటకసంఘారామ కులపతియైన విశుద్ధలక్ష్యాగ్రహితులు అమృతపాదులను తన హృదయాని కద్దుకొని కోటిదేవతల బలమువచ్చినట్లు సంతోషించెను.

విశుద్ధలక్ష్యాగ్రహితులకు తొంబదిమూడేండ్లున్నవి. తాను నిర్యాణమందినవెనుక కులపతి తగినవాడు లేనిచో సంఘారామశిరోరత్నమైన ధాన్యకటకాశ్రమము బుద్ధమహాధర్మము నిర్వహింపలేదని యా వృద్ధాచార్యుల భయము. నేడాభయము తీరిపోయినది.

శ్రీముఖశాతవాహనచక్రవర్తి తమ వృద్ధగురువును దర్శించుటకు వచ్చి, అమృతపాదుల దర్శించి వారికి దాసానుదాసుడైపోయినాడు.

అమృతపాదులు ధాన్యకటకమును చేరిన రెండవయేట విశుద్ధలక్ష్యాగ్రహితులు మహానిర్వాణమందినారు. ఆనాటినుండియు అమృతపాదాగ్రహితులు మహాచైత్య సంఘారామమునకు కులపతియాయెను.



# నవమ ప్రకరణము

## మాతృహృదయము

మహారాణి తన పాపములకు మొరపెట్టినప్పుడు అమృతపాదాగ్రహితులు ఆమె నాశీర్వదించి "అమ్మా! భర్తగారివెంట నీవును యుద్ధమునకు పోవుచున్నావని విన్నాను. పురుషులు స్వభావముచేతనే కఠినులు. వారికి యుద్ధము తప్పనిపని. స్త్రీసహజమగు భయముచే భర్తకొరకు ఆందోళనపడుచున్నావు. భయములేదు తల్లీ. సర్వము శుభపరిణామము చెందును.

మహారాణి:—స్వామీ! యుద్ధమనిన అందరికి భయము. స్త్రీ, అందును బిడ్డలతల్లి ప్రాణనాశనమున కెప్పుడును ఒప్పుకొనలేదు కదా. ఈ భయము నావారకొరకే కాదు. యుద్ధములో నెందరు చనిపోవుదురు! ఎన్ని కుటుంబములు మహాదుఃఖముల కగును!

అమృత:—నిజము తల్లీ! ప్రియదర్శియైన అశోకుడు కళింగదేశముపైకి దండెత్తి పోయినాడు. కాళింగులు పరాక్రమమున నాతని నెదిరించిరి. ఘోరమైన యుద్ధము సంభవించినది. లక్షలకొలది జనులు రణదేవతకు బలియైరి. అశోకుని యుద్ధములలో నంతటి జననష్టమెప్పుడును వాటిల్లలేదు. అదియంతయు అశోకుని నిర్వేదమయ్యెను. అప్పుడాతనికి తథాగతుని బోధ అర్థమైనది. ఆతడు భిక్షుమహారాజైనాడు. మహాశ్రమణుని బోధ జగత్తునే కాంతిమంతము చేసినది.

మహారాణి:—స్వామీ! యుద్ధమున దక్క మనుష్యులు తమ కాంక్షలను, వివాదములను వేరువిధమున తీర్చుకొనలేరా? చక్రవర్తుల ఈ రాజ్యతృష్ణ పాపపుణ్యము లెరుంగని దేవమూర్తులైన పసిపాపలపై విరుచుకొనిపడును గదా!

అమృత:—తల్లీ! నీ మాతృహృదయ మట్టిది. మంజుశ్రీని తస్కరించినవారు ఆ బాలుని యందు దోషమెంచి అటుల చేయలేదు. ఆ బాలుడు చక్రవర్తిబిడ్డవలెనే సాకబడుచున్నాడు. ఎత్తుకొనిపోయినవారి హృదయము నా కిప్పుడవగతమైనది. ప్రలోభమప్పుడు మానవధర్మములు మరచిపోయి రాక్షసత్వము వహింతురు. కాని దేవుడు వారికి ఎన్నియో ఆశలు ప్రత్యక్షము చేయును. వారాతని బానిసలైపోదురు. అప్పుడు అపరోక్షమూర్తి రక్షణ చూపునిందును. తన జీవితముచే లోకసంగ్రహము చేయును. లోకము తరించును. సృష్టిచక్రమిట్లే సర్వకాలము తిరుగుచుండును.

మహా:—ఈ సృష్టిచక్రము త్రిప్పుటకు యుద్ధములే కావలయునా తండ్రీ ?

అమృత:—యుద్ధములవసరములేదు. అట్టి సత్యయుగము మున్ముందు తప్పక వచ్చితీరును.—మహారాజు నేడు జైత్రయాత్ర సాగించుట శత్రుమారణమునకు. రాజ్యసంపాదమునకే గాదు. ధర్మరక్షకు, కుమారరక్షకుగూడ.

మహారాణి:—నేను కఠినాత్మురాలను తండ్రీ ! నాలోని యీ గట్టితనమునకు నేను వెగటుపడుచు నన్ను నేవ గర్హించుకొనుచున్నాను. నా బంగారుపంట్రిని, నా వెన్నెలధానము నేను పోగొట్టుకొనియు, మొండిజీవము ధరించియున్నాను. ఒకవంక భిన్నమై భగ్నహృదయనయ్యు ఈ యుద్ధ మహామారణకర్మము కనులార గాంచుచున్నాను. నన్ను యావస్థలో డించిపోలేక సార్వభౌములు వెంట గొనిపోవుచున్నారు.

మహారాణి కన్నుల నీరు జొంబొటు కారినవి.

అమృత:—అమ్మా ! ఊరడిల్లుము. మన కంటకము ఏమున్న బుద్ధదేవ పాదారవిందములు గాని ఇంకేమి కలవు. చదువుకొన్న ఉత్తమగృహిణివి, విజ్ఞానవతివి. ఈ విశ్వమునందేది శాశ్వతము ? ఇది యంతయు నొక చిదాభాసము. ఈ ఆభాసమునే నిజమని నమ్మెదవా ? ఇది క్షణికము. నిర్వాణమని తెలియుటయే దుఃఖనాశనకారి. ఈ సంసారప్రవాహమున నీవు లాంటి జీవులకు నిత్యము యోగవియోగములు కలుగుచునేయుండును. ఎవరికని దుఃఖింతుము. దేనికని సంతోషింతుము. ఈ సుఖదుఃఖములు రెండును బంధకారణములే. కావున నిర్మమత్వము నాశ్రయింపదగను. లోకమున అన్ని ప్రాణులవలెనే నేను, నా వారలు పుట్టి గిట్టుచుందురు. ఈ సంసారస్వభావము తెలియుటయే సంసారికి తరణోపాయము తల్లీ !

మహారాణి:—అవును. మమత్వము తగ్గినకొలది దుఃఖము తగ్గుచుండును. కానిచో ఇంతమంది మృతికి కారణమగు నీ యుద్ధమున కెట్లు సమ్మతింతుము ?

అమృత:—మహాశ్రమణక బోధ అమృతజ్యోత్స్న కదా ! ఆ వెన్నెల భరింపలేని వ్యతిరేకాత్ములు కొందరు బుద్ధధర్మమునే నాశనము చేయ సంకల్పించినారు. ఆ ప్రయత్నముల నరికట్టవలసిన విధి చక్రవర్తిపై నున్నది. ఆ యజ్ఞమునకే చక్రవర్తి యీ జైత్రయాత్ర సంకల్పించినారు. రాజధర్మమునకు నిష్ఠురత తప్పదు. సుమంతనముని బోధ విషప్రాయముగ కొంత ఆహుతబాగు లెక్కలో మీ శిశువు నెత్తుకొనిపోయినారు. ఈ యుద్ధమువలన జననష్టముండదు. మీ హృదయమునకు అమృతశాంతి చేకూరు శుభదినము లరుదేరనున్నవి. శుభాశంసయే శుభప్రదము తల్లీ !



మహారాణి ఆ దివ్యజ్యోత్స్నకు సాష్టాంగనమస్కారము చేసినది. చైత్యాభిముఖురాలై వెడలిపోయినది. మహారాణి తనతో కొనివచ్చిన వందలకొలది పండ్లగంపలు ఆ మహాపరిషదాచార్యులకును, విద్యార్థులకును అర్పించెను.

మహారాణి యచ్చటనుండి నెమ్మదిగ నడచిపోయి మహాచైత్యము చుట్టును మూడుసారులు ప్రదక్షిణము చేసి ఆయకస్తంభముల యెదుట నామె సాష్టాంగపడినది. "బుద్ధప్రభూ ! నీ అమృతహాసముల నీ ప్రజలందరిపైనను ప్రసరింపజేయుము. నీ దివ్యహాసములోని త్రిశరణములు నా బాలకుడు. ఆతని రక్షింప నీవే దిక్కు. నా ముద్దుబాలకుడు నాకు దొరికిన నాడు నేను ఈ మహాచైత్యమునకు లక్షదీపములర్పింతును. ఈ యుద్ధమున అందరికిని భద్రత చేకూర్పుము. నా ఆత్మేశ్వరుడు నీకు పరమభక్తుడు. వారును నేనును కలిసి తిరిగివచ్చి నీ భక్తులైన శ్రమణకులకు ఎనిమిది విహారములు కట్టింతుము. బుద్ధదేవా ! నీవే రక్ష." అని ప్రార్థించినది.

మహారాణి లేచినది, ఆమె వెనుక అమృతపాదులు, చంద్రస్వామి చేయి పట్టుకొని నిలిచియుండిరి "మహారాణీ ! ఈతడు చంద్రస్వామి. ఉత్తమ బ్రాహ్మణుడు. నీ కొడుకు విషయమంతయు నీకు అవగతము చేయును. ఈతని తమ జైత్రయాత్రలో కూడ వేసికొని పొండు. చదువుకొనినవాడు. తన జ్ఞానముచే తమకు ఉపశమనము చేయును" అని తెల్పినాడు.

మహారాణి చంద్రస్వామికి నమస్కరించినది.

"దీర్ఘసుమంగళీభవ, మహాసామ్రాజ్య ప్రాప్తిరస్తు, నష్టపుత్ర పరిష్వంగ ప్రాప్తిరస్తు" అని ఆశీర్వదించినాడు. గణగణ స్తూపఘంటికలు మ్రోగినవి.



# దశమ ప్రకరణము

## పేరంటము

చారుగుప్తుని భవనమున హిమబిందు తన అభ్యంతర మందిరములో నృపశకములు, నెమళ్లు, మామిడిపిందెలు చెక్కిన సువర్ణ ఖచిత పర్యంకముపై పరుండి కను మూసుకొని సువర్ణశ్రీ కుమారుని భావించుకొనుచున్నది. ఆ దినమున నాతడు తనకు మోకరిల్లినాడు. ఆతడెంత అందగాడు. ఆ మనోహరమూర్తి నిలుచబడియున్నప్పుడు ఆతని మూర్తి ఎంత గంభీరమై, ఎంత తేజోవంతమై కనిపించినది. బోధిసత్వమూర్తివలె వెలిగిపోయినాడు. ఆతని మాటలు విన్నప్పుడు, రూపము తలచినప్పుడు తనకేల గుండె కొట్టుకొనును. ఏమి యాతని విశాల వక్షము!

సువర్ణశ్రీకుమారుడు వట్రువలు తిరిగిన బాహువులతో, ఏనుగుకుంభమువంటి మూపుతో, ఉన్నత శిరముతో, నూగునూగు మీసములు సొబగులీను సుందరవదనముతో ఆమె మనోవీధుల పండువాసములతో వసించినాడు.

ఇంతలో నొక చేటిక వచ్చి "అమ్మా తేరు సిద్ధమయినది. పట్టణములోని కరుగుటకు చెలులు సిద్ధముగనున్నారు. నాకు రానగునా?" అని యడిగినది.

హిమబిందు శక్తిమతీదేవిగారి భవనమునకు పోయివచ్చిన నాలుగు రోజులైనవెనుక మరల నాగబంధునికను, సిద్ధార్థినికను కలుసుకొనవలయునని ఆమెకు గాఢవాంఛ కలిగినది. అందుకై యామె వసంతపూజయని పేరుపెట్టి, నగరముననున్న ఉత్తమ కుటుంబములవారి పిలువ సంకల్పించినది.

చెలి చెప్పుమాట వినియు, అటు చూడక హిమబిందు పరధ్యానమున తలయూప నా చేటిక నమస్కరించి వెడలినది. ఇంతలో నలుగురు చెలులామెకడకు వచ్చిరి. వారందరితో హిమబిందు పట్టణములోనికి పిలుపునకు బయలువెడలెను.

తక్కిన పిలుపులన్నియు నెటుల నెరవేర్చుకొనినదో తిన్నగ స్యందనమును సాయంకాలము మూడవయామ ఘంటలు మ్రోగునప్పటికి హిమబిందుకుమారి శక్తిమతీదేవి భవనమునకు పట్టించినది.

అప్పుడు వారందరికిని కుంకుమ సుమసమ్మిళితమగు పసుపుబొట్టు నొసంగుచుండి, సాయంకాల[illegible] వెలిగింపనప్పటికి తన మందిరమున వసంతపూజ వాయనము లందుకొన పిలిచినది.



అంత నాగబంధునికయు, సిద్ధార్థినికయు, హిమబిందుకుమారియు, నవ్వుచు, ఆడుచు, బాలికల క్రీడామందిరమునకు బోయిరి.

ఆ క్రీడామందిర మొక ముద్దులమూట. సాగరవీచికాసుందరము మహావ వానంద మయము.

"మన మిక్కడ నాట్యమాడెదమా నాగబంధునికా?"

"ఉపకరణములు?"

"మన గజ్జియలే!"

"సిద్ధార్థినిక శ్రుతియు, తాళమును వేయునులే"

వారు నాట్యమాటసాగిరి. వసంతసుమసౌరభములు దిశలపర్విననవి. ఒక్క సాయం కాలము వింధ్యపర్వతసానువుల, శైవాలినీకన్య లిరువురును ఆటలాడుచు, గానమాలాపించుచు సౌందర్య క్రీడాభిరక్తలై మిసమిసలాడునప్పుడు వారి సొబగు మేనితుళ్ళింతల నర్తించు ఇంద్రధనస్సులవలె ఆ బాలిక లిరువురు నృత్యము మొదలిడిరి. సిద్ధార్థినిక చిరునవ్వు నవ్వినది. సిద్ధార్థ యశోధరాసందర్శనము వారభినయించుచు అవ్యక్తమధురస్వనముల పాట పాడసాగిరి.

హిమబిందు:—[యశోధరగా]

ఈ వనములో నాకు ఏమిదొరుకును శాంతి!
ఈ పూలలో వెదుక నేమిదొరుకును భ్రాంతి!

సిద్ధార్థినిక:—[చెలిగా]

మేఘాంచలములందు మేళవించెను
ధవళవర్ణాలు రాగమై పద్మరాగచ్ఛాయ.

హిమబిందు:—[యశోధరగా విచారమున]

రాగమేలేని హృది మూగతనమే, సుమవ
రాగమ్మలద్దు నే భృంగపతిగరులపై

సిద్ధార్థినిక:—[చెలిగా]

వ్యోమ గంగోర్మికాపులకితమ్మగు
హేమపద్మమ్ము, వాంఛించె ధవళ దంతావళము.

నాగబంధునిక:—[సిద్ధార్థుడుగా]

ఈ వనములో నింత వెలుగేలవచ్చెనో,

దివ్యపారభాల్ పర్వెనో,

మధుకరాగాలు కూడెనో.

సిద్ధార్థినిక:—[చెలిగా]

హిమవన్నగాంచలము ఎరుపెక్కె చూడవే !

సిద్ధార్థినిక పాడుట మాని గుమ్మముకడ నిలచియున్న సహోదర సుందరమూర్తిని దరహాసముతో గమనించెను. చిగురుగజ్జెలమువ్వల నిక్వాణమును, మనోహర సంగీతమున తేలియాడి వచ్చు పాటవాకను ఆ యుద్యానవనము నొంటిమై సంచరించు సువర్ణుని చకితుని చేసినవి.

"ఏమే బాలనాగి దారి యివ్వమనవే"

అను పాకూత వాఙ్మాధుర్యము నేడాతని పులకింపజేసినది. సువర్ణా అల్లిబిల్లిగ నల్లిన్న పచ్చని పొదలలో విరిసోయిన సకలగుణాలపేయ సౌరభము దిలకించెదవు గాక. కమలినీ కోమలత్వము, మల్లికాశిశుత్వము, మాలతీలతా మాధుర్యము, దమన మరువకౌషధీ సౌభాగ్యము ఒండకూర్చెడవుగాని రమ్మని వీణావాణిలాకని చెవికడ రహస్యముల తెలిపినట్లయినది.

సువర్ణుని చూచి హిమబిందు అల్లే నిలచిపోయినది. ఏ సందర్భమునకై ఇన్నినాళ్ళు తపింపోచరించుచున్నదో, పరితప్త ప్రాణమున యుపాయములు వెదకినదో, అది రూపొందినతోడనే ఆమెను చెప్పగారాని వివశత్వము కలిగినది. మలయపవనాంకురములు తీపై శరీరము నలుముకొనినవి. సుగంధవీచికలా మెపై విరిగిపోయినవి.

నాగబంధునిక గడసుదనమున రహస్యము గ్రహించివేసినది. "అన్నయ్యా ఈ అమ్మాయిని ఎరుగుదువుగా ? చారుగుప్తదేవుని కుమార్తె, మాకు స్నేహితురాలు" అనినది.





# ఏకాదశ పరిచ్ఛేదము

## సంకేతము

సాయంకాలమున ధాన్యకటక నగరమందున్న హిమబిందు భవనమునకు పెద్దపెద్ద కుటుంబముల పుణ్యస్త్రీలు పేరంటమునకు వచ్చిరి. సభామంటపమున కాశ్మీర కంబళులు పరచియుండిరి. సుగంధకరండములు మనోహరధూపముల వెదజల్లుచుండెను. ఒక్క మరకతమున దొలువబడిన గిన్నెలో పరిమళద్రవ్యములతో బాంధవమునలుపు మంచిగంధమున్నది. బంగారముతో, దంతముతో మలచిన అపురూపదారుపీఠముపై పూలశయ్యము లుంచిరి.

పుణ్యస్త్రీల పాదములకు చెలులు లత్తుకపెట్టిరి. తాంబూలములిచ్చిరి. కలపము లలదిరి. పూవుల నీరుజల్లిరి. పుష్పములు, ఫలములు మొదలగునవి వాయినమిచ్చిరి. కోకిలస్వనముల కొందరు చెలులు రాగము లాలాపింప, కొందరు మృదంగముల వాయించిరి, కొందరు వీణెల మీటిరి. అయినను హిమబిందు ఆ సంతోష సమయమున పరధ్యానయై యుండెను. సాయంతనమున కవరి భవనములకు వారు వారివారి యానములపై వెడలిపోయిరి. హిమబిందు తన అభ్యంతరమందిరమున నొంటిగా పవళించియున్నది.

ఆమె యెట్లయినను సువర్ణకుమారుని మరల చూడవలెను, అతని కన్నులలో తన ప్రతిబింబ మెట్లుండునో ! అతని నెల్లు మాటల ? అతని గనుగొనవలె నింక లేను.

ఆ మోహనాకారుని హస్తము ఇందాక తన భుజమున కంటినతోడనే యొడలు ఝల్లుమని హాయి అను మధురస్వామొక్కటి తన్ను ముంచివేసినది.

హిమ:—బాలనాగీ ఒకసారి యిటురావే !

అనతిదూరముననున్న బాలనాగి పరుగున వచ్చినది. హిమబిందు హేమవైశ్యమును, స్నేహపరిసన్నతయు గూపుల నుట్టిపడ "నా ప్రాణములు నీచేతిలో నున్నవి" అని దాని బుజముపై చేయి వేసెను. బాలనాగి నిముషమున ఆమెభావము అర్థము చేసుకొన్నది.

బాల:—అమ్మా ! నే నవశ్యము ఒక కార్యము నెరవేర్చెదను.

హిమ:—ఏమది ?

బాల:—మీ రూరకుండుడు, సాయంకాలము క్రీడోద్యానవిహారము.

◆ ◆ ◆ ◆ ◆

సువర్ణుని హృదయమున చందన నలమినోయినది. చల్లని మలయపవనములు ప్రసరించినట్లయినది. తన శిల్పములు, చిత్రములు అన్నియు ఆ నాడామె మరల నెంత మోదముతో

తిలకించినది. ఆమె కన్నులు ఎండలోని హిమబిందువులవలె మిలమిల లాడిపోయినవి. తన ప్రక్క ఆమె నడుచునప్పుడు తానామెను శైబ్య సుగ్రీవకములకడకు గొనిపోవునప్పుడు, వాని నామెకు కానుక నిడినప్పుడు, ఆ కానుక నామె పలదనుచు మందహాసమున నెట్టకేల కంగీకరించినప్పుడు తాను లోకమే మరచినాడు, ఆనందమే తానయినాడు. హిమబిందు శిల్పము విన్యసించుచున్నాడు. సౌందర్యాధిదేవత ఆ శిల్పమున వెలయుచున్నది.

ఇంతలో నాగబంధునిక అక్కడికి వచ్చినది. "అన్నయ్యా! సంజచీకటివేళ కృష్ణానదీకూలమున చారుగుప్తులవారి తోటలో ఉత్తరపు గున్నమావికడ కూర్చుండి కృష్ణానది ప్రవహించుట కనుగొన్నచో ఎంతసుందరము, ఎంతవిచిత్రము" అని యూరించినది. సువర్ణకుమారుడది అర్థముచేసుకొన్నాడు. చెల్లెలి చెక్కిలి పుణికి ముద్దుగొన్నాడు. ప్రణయ జీవితావళులకు పండితుల కర్థముగాని మాటలు మంచినీటిప్రాయముగ పరిస్ఫుటములగును.

♦ ♦ ♦ ♦ ♦

హిమబిందు సౌధముపై నిలిచి, చిడిముడి పడుచు సాయంతన మెప్పుడగునాయని వచ్చినచోటికే వచ్చుచు, పోయినచోటికే పోవుచున్నది. ఆమె వదనము ప్రఫుల్లమై రాబోవు సౌఖ్య మెదురుచూచుచున్నది.

కృష్ణవేణి యానాడు తన జడ నీటిపై తేలియాడుచుండ మందహాసంబున నిజముఖంబు కాంతులీన పవనకుమారునితో వేలమాడుచు, లేతమావిచిగుళ్ళు మెక్కుచు, కోకిల పాడు పాటను వినుచు కృశాంగియై ప్రవహించుచున్నది.

కోకిల:—

కుహూకుహూ కుహూకుహూ
కుహూకుహూ కుహూకుహూ
కొసరి పాటల తేనె
పసరు మొగ్గల వగరు
ముసుగు గప్పిన నగవు
 తరిసరేణువులపైన
 అసలారె సంజవేళన్ ॥కుహూ॥

కుహూకుహూ కుహూకుహూ
 ప్రియకోమలి నీవు



ప్రణతు లిచ్చెడు వనము
తృణశూన్య పుష్పాల
దృణనీల పత్రాలు
వణకాడు గీతికలతో ॥కుహూ॥

పికాంగన:—

శారదావల్లకీ తంతీస్వనము నేను
నా కంఠగత గానప్రతిమయే
నందగోపాలాధ రానందవంశమో!

కృష్ణానది:—

కాదు! నా తనయవీవు
నా గమనమాధురీ గరిమయే
నా నీలవేణికా కాముకీయోగమే
జననమందె వనప్రియా మోహనాకృతిరేఖ॥

భృంగము:—

భోం భోం భోం
జన్మరాహిత్య సంపాదనంబు వలదునాకు!
 భవితవ్యమిదియె!
అనుభవించెద, నానందతీవ్రతాపగత
 జీవనై తెరిఖృదనుక
ముందు వలదు!
 ఘోర కష్టాకృతియుగాదె
భవిష్యన్మహార్త మెప్పుడు!!

సంధ్య:—

నాలోన జేరిపొందు?
లీనమగును
ఆనందము, ఆర్తి సర్వస్వంబు నాలోనగాదె!
భూత పరిణామ పునరాగమనచిత్రముల్
నాలోన గలవుగావె
చీకటి వెలుంగులకు
దృఢాలింగనమును నేను.

# ద్వాదశ ప్రకరణము

## కృష్ణవేణీతీరము

సువర్ణశ్రీకుమారుని హృదయము దడదడ కొట్టుకొన ఇటునటు చూచుచు ఆ వనము ప్రవేశించినాడు. కృష్ణవేణీ వినీలజలంబుల నెరసంజె ప్రతిఫలించుట నాతడు చూడలేదు. కోకిలా మధురగీత మతడు వినలేదు. మల్లెలు, శేఫాలిక, హేమపుష్పము, అతిముక్తము, జాజి, మాలతి, మాధవి, నవమాలిక, కుంగము, కరవీరము విరయబూచియున్నవి. ఆతడు వాని దెస చూడలేదు.

ఆతనికోర్కె ఎఱ్ఱనైనది. ఆతని గండఫలకములు చిరుచెమ్మటలుపోసినవి. ఒక్క పావరింప నాతడు చదికిలబడినాడు. ఆతని విశాలవక్షము పొంగిపోవుచున్నది. వనమున విహరించు వసంతునివలె ఆ ప్రదేశమున ప్రణయకాంతులతో తేజరిల్లిపోయినాడు.

చీకటి మందమంద తమోహాసముల తన బాహువులజాచి కదలివచ్చుచు సౌహార్ద్రమానస వక్షములపై నెల్లర నిమురింపజేయ తలంపుగొని తూర్పున నుదయించినది, ఆ సమయంబున నిరువురు బాలిక లొయ్యారపు నడకల నా వనవాటికలోని కరుదెంచిరి.

ప్రేంకణిత తనులతతో విస్ఫారిత నయనములతో నిటునటు చూచుచు వెనుకాడుచు వచ్చుచున్న హిమబిందు వికసించిన పుష్పమైపోయినది.

ఘలుఘల్లుమను చప్పుడు చెవి నెటులసోకినదో సువర్ణశ్రీకుమారుడు సముద్రతరంగము వలె లేచినాడు. ఒక్క యుదుటున వారికడకు పోవువాడై అంతలో కొంచెము సంకోచించెను. "ఎట్టకేలకు, ఎట్టకేలకు" అని వాని మొదవ పెదవులు తడపికొన్నది. ఎక్కడ హిమబిందు; తానెక్కడ? సుందరాంగులలో సుందరాంగియై, వైభవమున మహాలక్ష్మియై, తారాదేవియైన ఆమె తనకడకు వచ్చుచున్నది. సంకేత ప్రదేశమున కా బాలిక లిరువురు వచ్చినారు. సువర్ణకుమారుడచ్చట మన్మథాకారుడై నిలిచియుండెను. హిమబిందు ఆగిపోయినది. కొన్ని నిముసము లెవరును మాటలాడలేకపోయిరి. ఏమి అనవలెను? అని ఇరువురకు.

ప్రేమకు మాటలురావు. పరిస్పరము వలచిన పడుచుజంటల తొలిసమాగమము. అది యొక మధురానుభూతి. ప్రేమపూర్ణమైన హృదయములలో తలపులకు, మాటలకు చోటెక్కడ? వారిరువు రొకరి నొకరు చూచుకొన్నారు. మాటుకొనుచు వా రొకింతతడవు నిలిచిరి.



చూపులకు మాటలు వచ్చునేని వా రా ముహూర్తమున ఎన్నివేల గ్రంథము మాటలాడిరి. వారి హృదయములు పలుకరించుకొన్నవి. చేతులు పెనవైచి గాఢాశ్లేష సుఖ మనుభవించినవి. ఆ వైవశ్యమున వారిరువురు గనులు మూసిరి. మోడ్పుగనులతో నొండొరుల విలోకించుకొనిరి. ఆ యంధవీక్షణములు రెండును ఒక్కటియై ఇరువురను ఒక్కటిగా చూచినవి. ఆ యొక్క వస్తువును వెలుపలిదిగా చూడలేదు. రెండవవారిని తమలోనే చూచిరి. ఆ చూపులో తుదకు తాము కనిపించక రెండవవారే తామై కనిపించిరి. ఆ క్షణమున సువర్ణశ్రీ, హిమబిందు అను నిరువురు లేరు. ఆ విచిత్రానుభవమునుండి తెప్పిరిలి, కనులు తెరచి చూచునప్పటికి హిమబిందుకు విశ్వమంతయు సువర్ణశ్రీమయమై తోచెను. సువర్ణశ్రీకి సర్వము హిమబిందువై కాన్పించెను. ఆ విచిత్రలోకమున బాలనాగి పలాయనము చిత్తగించెను.

ఆవల నిశ్చలమై, నిరంతరమై, సాక్షీభూతమైన కృష్ణాప్రభావము. పైన వినీలాకాశము తారకానేత్రము లప్పుడే విప్పుచున్నది. చెంతను తమపై శాఖాబాహువులుచాచి పుష్పాక్షతలు సల్లుచున్న గున్నమావి. అపుడు వార లొకరినొకరు చూచుకొనిరి. ఇరువురు నొక్కసారి మందహాసమొనర్చుచు చేతులు సాచిరి. చెట్టలుపట్టి ఆ గున్నమావిక్రింద నొరసుకొని కూరుచుండిరి. చిఱుగాలికి గున్నమావియాకులు గుసగుసలు పోదొడగెను. కృష్ణవేణీతటమున చిలుకరళ్ళు జిలిబిలిపలుకు లాడజొచ్చెను. "బిందూ! ఎన్నాళ్ళకెన్నాళ్ళకు! ఎచట నుంటివి ప్రాణమా, యిన్నియుగములు? నీకొఱ కెంతవెదకితిని? ఎంత తపించితిని?" అనుచు సువర్ణశ్రీ యా జవరాలి నెమ్మోమును మరల తనివోని చూపుల జూడజొచ్చెను.

హిమబిందు ఆతని చూడ్కులుగాంచి "అదియేమి, శ్రీ! అట్లు వింతగా జూచెదవు?"

"కాదు, దేవీ! నీవు నీవేనా యని చూచుచున్నాను. నా పూజాపీఠముపై మలచికొన్నది నిన్నా? లేక నీలోనున్నది నా యారాధ్యదేవతయా అని చూచుచున్నాను."

"మీకు నే నిన్నివిధముల కనిపిస్తున్నానేమోగాని, నేనుమాత్రమొక్కతెనే. మీరును నా కొక్కరే"

"నిజమా నీమాట బిందూ! నే నంతట నిన్నే చూచుచున్నాను. నీ వొక్కతవే ఇన్నిచోట్ల, ఇన్నికాలముల నెట్లుంటివి?"

"అవును. మీరున్నచో నెల్ల నేనున్నాను."

"నేను లేనిచోటనో?"

"మీరు లేనిచోటు లేదు."

మరల వారొకసారి కిలకిల నవ్వికొనిరి. పరస్పరము చూచుకొనిరి. గున్నమావిపైనున్న కోకిల యొకపరి కుహూ యన్నది. వారిరువురు నులికిపడిరి. కృష్ణవేణి వెలినురువు నగవు లొలుకబోసికొనుచున్నది. సువర్ణశ్రీ యా బాలిక కరము గ్రహించి, “ బిందూ ! నా భాగ్య మేమనిచెప్పను. ప్రేమసర్వస్వమగు నీ మృదుబాహువల్లరి నాకు మరల నేటికి చిక్కినది. ఇది యూతగా నేను ఈ దేశములను, కాలమును గడచిపోగలను ” అనుచు ప్రియమార నా చివురుకెంగేలు ముద్దుగొనెను.

యవనవంశ పరంపరాగతమైన ఆమె ఉడుకురక్తము పొంగి పరవళ్ళెత్తినది. వారిరువురు లేవబోయినప్పుడు ఆమె వివశయై తూలి అతనిహృదయమున వ్రాలినది. సువర్ణశ్రీ హృదయమున వాంఛయు నొక్క ఉరుకున పైకి విజృంభించినది. అప్రయత్నముగ అతని బాహువు లా బాలికను చుట్టివేసినవి, అతడామెను గాఢముగా తన హృదయమున కదిమికొనినాడు.

ఆమె కన్నులపై, నాసికపై, మృదుకపోలములపై, చిగురులబోలి మసృణములై, పద్మకోరకములై, ఘుసృణములై, మధురములైన యామె పెదవులపై నాతడు చుంబనములు వర్షించినాడు. ఆమె అతని కౌగిలిలో కరిగిపోయి, అతని మెడను చేతులు పెనవైచి, అతని మోము తన మోముకడకు లాగికొని, దీప్తము, అమృతోపమానమగు ముద్దునొండు వరమిచ్చినది.

బాలనాగి దవ్వులనుండి “ అమ్మా ! ప్రొద్దుపోయినది ” అనెను. వారిరువురు ప్రకృతిస్థులైరి.

ఆమెయందు శాంతమై ప్రవహించు ఆర్యత్వము గాఢ వ్రీడాభావముదయింపచేసినవి.

“ రేపీవేళకు – ఇక్కడ – ” అని అనుచు ఆమె పరువిడిపోయినది.





# త్రయోదశ ప్రకరణము

## ప్రేమకలశాంబోధి

కోకిల:—

కుహు కుహూ కుహు కుహూ
కుహు కుహూ కుహు కుహూ
తనువులత కంపిల్ల
తమ్మిరేకులు ముడువ
వనములను దర్శింప
జనుదెరె రేపడుచు
వినుము నా పాటలే సఖీ ॥కుహూ॥

పికాంగన:—

నీ పాట దిక్కులన్ జేరిపోయె
కలిసిపోయితి ప్రేమదుగ్ధవారాశిలో

కృష్ణానది:—

ప్రతిఫలించెను ప్రేమ నాలోన
కాలమే కరిగిపోయినదంట

భృంగము:—

భోం. భోం. భోం.
నాకు మాటలు రావు
పక్షతంత్రులు నావి
స్పందించె ప్రేమరాగాలు

యామిని:

మీ అందరు నా అనుంగుబిడ్డలమ్మ
నా పవిత్రగానమే మీ రూపులందు చేర
నా గంభీరహాసమే తేటవాకలబాట

కృష్ణవేణీ ! నిన్ను చేరిపోయి
విశ్వమున ప్రవహిల్లు శోక వేగమ్మెంత !
నా జడలు ముడిచికొన్నాను
గంగాధరుని పోల్కి నిన్ను నేను
నాలోన చేర్చికొంటి విషాదమును
నీలకంఠునిచందాన నేను.

ఆ ప్రేమికు లిరువురు మరునాడా సంకేతస్థలముననే కలిసికొన్నారు. బాలనాగి ద్వారముకడ రక్షకభటురాలైనది.

హిమబిందు మాటాడలేక త్రపాహృదయియై తలవాల్చి " ఆర్యా ! నేనును మీరు నిట్లు కలిసికొనుట తగదు. నేటితో సరి మనకీ యేకాంతము. అని పలికినది.

సువర్ణశ్రీకుమారుడు:—ఏమి యీ మాటలు తన్వంగీ ! మన మిక్కడ గాకున్న ఎక్కడనైన కలిసికొనవలసినదే. రమణీయమగు విశ్వమంతయు మనకు సంకేతస్థలమే. మన మిక కలసికొనకుండుటెట్లు ?

హిమబిందు హృదయమున కేమియు తోచుటలేదు. సువర్ణశ్రీకుమారుని తాను ప్రేమించిన సంగతి నిజము ! నిజము !! ఆమెది రాజసప్రకృతి. ఏ రసావేశమైన నా బాలలో గాఢముగ ప్రవహింపవలసినదే. ప్రణయమన నేమో ఆమె నేటికి ఎరిగినది. ఆమె నలయించు అస్థిరతకు జాలువారకినది. నిండారి నిర్ధమై, నిర్వ్యక్రమై ఒంటిబారు సువర్ణశ్రీ కుమార జీవిత ప్రవాహమున ప్రవేశించినది. ఏల యా బాలుని తాను ప్రేమించినదో యా కుమారికి తెలియదు. అతని సోయగము మచ్చలేనిది. బలమున నాతడు మంజాశ్రియే. మఱి ? అతనికి సోగమీసములు లేవు. కన్నులలో కెంపువెలుగు లేదు. పెదవుల చివర గుండె లదుర చేయు లఘుహాసము లేదు. ఒకో అతడు దేవతామూర్తి.

సువర్ణశ్రీది నూత్న యౌవనము. రాగరక్తిమ లలము శుభముహూర్తమది. సౌందర్యారాధకుడగు నాతని అచ్ఛహృదయమున భగవతీమనుజరభావ ముదయించినది. దాని నాతడు శిలలో, రంగులలో రూపెత్తించుచుండ, నది సజీవమై హిమబిందున సాక్షాత్కరించినది. అంతటితో నవతుషారార్ద్రమగు నాపూవుమోశ నాతని హృదయమున విరిసినది. ఆ కమలముపై హిమబిందు అధిష్ఠించినది. ఆ దేవి తన్ననుగ్రహించినది. బహుజన్మతపః ఫలమాతని వనుస



శించినది. ఆ దేవి సేవయే అతడు కోరునది. ఆ సేవలో నాతనికి నృష్టియంతయు లసమయమగుచున్నది. దైహికములగు చుంబన పరిష్వంగాదులా సేవాకలాపము.

సువర్ణ:—నాతో మాటలాడవా ?
హిమ:—నాకు మాటలు రావు.
సువర్ణ:—నీ పేరంత మధురమేమి ?
హిమ:—మీ పేరులో అంత బంగారమేమి ?

సువర్ణ:—ఇన్ని రాత్రులు సృష్ట్యాదినుండి వెళ్ళిపోయినవి. ఈ రాత్రి యింత అందముగనుండినదా ?

హిమ:—ఆ కోకిల అంత అందముగ పాడగలిగినదా ఇదివరకు. కృష్ణానది నన్ను చూచుచున్నది. నాకు సిగ్గు వేయుచున్నది.

సువర్ణ:—అయినచో నా యీ హృదయమున దాగుకొనరాదా ?

హిమ:—శిల్పుల హృదయంలో రాళ్ళు, రప్పలు ఉండును. అదిగో ! అంత దగ్గరగ మీరు రాకూడదు.

సువర్ణ:—పోనీలే ! నేను దూరముగనే కూర్చుండెదను.
హిమ:—మీకు దగ్గరయు, దూరము నొక్కటేకదా.

సువర్ణ:—నిజమేకాని నీవు నా కారాధ్యదేవతవు. నిన్ను చేతులార నేను పూజించుకొనవలెను.

హిమ:—ఆ పూజలు మీ యింటనున్న విగ్రహమునకు జేసికొనుడు. నేను బాలికామాత్రను. చారుగుప్తులవారి కూతురను. నన్ను మీరు పూజింపనూరాదు; అంటనూకూడదు.

ఈ మాటలు విని సువర్ణశ్రీ ప్రకృతిస్థుడైనాడు. కుబేరవిభవుడగు చారుగుప్తుని తనయను తా నిట్లనదగునా ? తనవంటి నిర్భాగ్యులకట్టి దేవత యెట్లు లభ్యమగును ?

అతని కళవళపాటును హిమబిందు గ్రహించినది. " పొద్దుపోవుచున్నది " అనుచు లేచి అతని చేయిపై కెంగేలు వైచినది.

అతనికి సిగ్గు వదలును.

ఆయి ఖరీపాళములు వికసించు స్వర్ణదీ తరంగలాలిత దివ్యకమలము తన్ను స్పృశించి నట్లయినది. కరడు కట్టిన మహాశిల్పి కాంతపాశి కృష్ణాతీరమున సౌందర్య శ్రీమూర్తియై కోటి

యౌవన తపఃఫలంబులువోలె విలాసరూపమైన ఆ దేవత నాత డాఘ్రాణించి, హృదయమున జేర్చికొనెను. ఆమె పాదములకు బ్రణమిల్లెను.

ఆమె యద్భుత చీనాంబరపు చీర కుచ్చులలో మోము కప్పుకొని, తలవంచి, మోకరించి, యామె పాదములపై మోమునుంచి, నందనవన వాటికా వికసిత మందార పుష్పదళముల వలె నున్న ఆమె పాదాంగుళుల ముద్దుగొన్నాడు. ఆమె మీగాళ్ళ పెదవులు చేర్చినాడు.

హిమబిందు ఆనంద పులకితయై, చకితయై, పరవశయై, కన్నులు మెరసిపోవ, అశ్రుబిందువులు తిరిగిపోవ, శ్వేతతారాహార సుందరములగు హస్తముల ఆ భక్తుని తలపై నిమురుచు, అతని మోమెత్తి, కన్నుల ముద్దిడుకొని, యాతని పెదవుల దన మనోరాగమును ముద్రించి, "రేపు వద్దు. పై శుక్రవారము" అనుచు త్వరితముగ నడచి యా చీకటులలో మాయమయ్యెను.





# చతుర్దశ ప్రకరణము

## గౌతమి

త్రియంబకేశ్వర జటాజూటవినిర్గతయగు గౌతమీకుమారి నాసికా సంఘారామ క్షేత్రమునకు వచ్చునప్పటికే శైశవము వదలి బాలిక యైనది.

ఆమె ఆటలలో అనంత కాలనర్తనములున్నవి. ఆమె పాటలలో శబ్దబ్రహ్మానంద తరంగములు ఊగిపోవుచున్నవి.

సహ్యాద్రిసానువుల నెన్నియో యలంకరణములామె సమకూర్చుకొని, యా లోయలలో విహరించుచు, ఎందరినో శైవాలినీ బాలికల తనలో లీనము గావించుకొనుచు, ప్రతిష్ఠాన నగరము కడకు వచ్చునప్పటికి యౌవనవతియై, హొయలు మెఱయు క్రీగంటిచూపులతో, కులుకు నడలతో, మందగమనయై నడచి పోవుచున్నది,

ప్రతిష్ఠాననగరమునకు కొలది దూరమున గోదావరీ నదీతీరమున స్థౌలతిష్యమహర్షి యాశ్రమములో రెండవ యాశ్రమమున్నది. స్థౌలతిష్యునికి సకల భారతావనియందును ఇరువదిఏడు ఆశ్రమములున్నవి.

ఒకనాడా ఆశ్రమమునకు ఆంధ్రసామ్రాజ్య యువరాజు శ్రీకృష్ణశాతవాహనుడు క్రీడారథ మెక్కి నలుగురు చక్రరక్షకులు వెంటరా నరుదెంచి, గోపురముకడ రథమునాపి, ందుండి అవరోహించెను.

సార్వభౌముని జన్మదిన మహోత్సవములన్నియు నైనవెనుక ఒక శుభముహూర్తమున యువరాజు ప్రతిష్ఠాన నగరాభిముఖుడై తలిదండ్రుల యనుమతిగొన సార్వభౌముని దర్శనమునకై యనుజ్ఞ వేడినాడు. పారిపార్శ్వకులు వచ్చి సార్వభౌముని సంతోషపూర్వకాంగీకారమును మనవియొనర్చి " దేవా ఇటు, నిటు " అని దారి చూపుచు సార్వభౌముడున్న శ్రీమందిరమునకు గొనిపోయిరి.

" జయ ! జయ !! చతుస్సముద్రవలయిత జంబూద్వీపాధినాథా ! జయ ఇక్ష్వాకు బృహత్ఫలాయన, ఆనంద, సాలంకాయన, మాఢార, వాకాటకాది మహా మండలేశ్వర రాజితమహాసభా ! పూజితమహాశ్రమణపాదుకా ! సర్వ ధర్మ రక్షణ బిరుదాంకితా ! శ్రీ శ్రీ

శాతకర్ణిపుత్ర శ్రీముఖశాతవాహన సార్వభౌమా! జయ! జయ! మాళ్వాభీరాన ర్తకోంకణాది సర్వదేశ విజేతలు శ్రీ శ్రీ ఆనందీపుత్ర శ్రీకృష్ణశాతవాహన మహారాజులంవారు దర్శనార్థము వేంచేసినారు” అని వారు విన్నవించినారు.

మెత్తని హంసతూలికోపధానముల జేరగిలి, మేను వాల్చియున్న సార్వభౌముడు సువర్ణమంచ్చమునుండి లేచి, త్వరితముగ మందిరకవాటముకడకు వచ్చి, పాదాభివందన మాచరించిన పుత్రుని భుజములు పట్టి ఎత్తి, హృదయమున కదిమికొని, వేరొండు సువర్ణాసనముపై తనయు నధివసింపజేసి. తా నధివసించెను.

“మహారాజా! మీరు ప్రతిష్ఠానపురము పోవుటకు ముహూర్తమును కార్తాంతికులు ఏర్పాటు చేసిరట కాదా?”

“చిత్తము ప్రభూ!, రేపటి ఉదయకాలమున రెండు ఘటికలు దాటిన మూడవలిప్తలో ప్రయాణము నిశ్చయింపబడినది.”

“సర్వసైన్యములు సిద్ధముజేసి యుంచుకొనుము. మహారథి విశ్వసేని నాగమహారాజును సైన్యాధిపతి చేయుడు. మనరథులను వ్యాఘ్రనదీ రాజపథమువెంట ఉజ్జయినికి సహాయము పోనాజ్ఞయిండు. మీరు నాగసైన్యముల, ఆంధ్రసైన్యములను తీసికొని, అఘబలమహారాజును సైన్యాధిపతిని చేసి, ఆ వెనుకనే ఆభీరులను దాకి భరుకచ్ఛము పట్టుకొనుడు. అచ్చట కొన్ని సైన్యములతో అఘబలమహారాజును నిల్పుంచి, మీరు ఉజ్జయినికి రండు.”

“చిత్తము మహాప్రభూ! అటులనే చేయుదును.”

అంతటితో సార్వభౌమునకును, మహారాజప్రతినిధికిని జరుగవలసిన తంతు నడచినది. ఇంక వారిరువురు తండ్రికుమారులు.

“తండ్రీ! నీవు జాగ్రత్తగా ఉండవలయును సుమీ. మీ యమ్మయు, నేనును మా కన్నులు నీమీదనే పెట్టికొనియున్నాము. దేశములో కొంతమంది చేయు కుట్రలన్నియు తెలియవచ్చినవి. స్థాలతిష్యమహర్షి మన వంశమునకే విరోధిగా మారినారు. మీ తమ్ముడు మంజుశ్రీని ఎత్తుకొనిపోవుటలో ఆ మహర్షి ప్రోద్బలమున్నట్లు తెలియుచున్నది. ఆయనకు ప్రతిష్ఠానములో వేరొక ఆశ్రమమున్నది. మొన్ననే ఆయన తన శిష్యకోటితో, భక్తగణముతో ప్రయాణములు చేయుచు ఆ ఆశ్రమము చేరినారట.”



ఇంతలో పారిపార్శ్వకుడు “జయ! జయ!! సార్వభౌములకు!!!” అని వినయమున ద్వారముకడ పలికినాడు. సార్వభౌముడా దిక్కు చూచి “ఏమి” అని ప్రశ్నించెను.

“ప్రభూ! మహాదేవి దేవరవారి దర్శనార్థము అనుమతి కోరినారు.”

“ప్రవేశపెట్టు.”

శ్రీకృష్ణుడు ఆసనమునుండి లేచి, త్వరితముగ గుమ్మముదాటిపోయి, వచ్చుచున్న మహారాణి పాదములకు మోకరిల్లి, నమస్కరించెను.

ఆనందమహారాణి చిరునవ్వు మోమును వెలిగింప, పుత్రుని ఆశీర్వదించెను. అతడు లేవగనే ఆమె గుమ్మముదాటి, లోనికరుదెంచి, భర్త పాదములకు నమస్కరించినది. శ్రీముఖుడు దేవిని తనప్రక్క సువర్ణమంచముపై కూర్చుండబెట్టికొనెను.

వారందరధివసించిన వెనుక ఆమె కుమారుని కనుంగొని “తండ్రీ! నీపై నాప్రాణ మంతయు పెట్టికొంటిని. మీ నాయనగారు వీరులు. మరల యుద్ధము సంకల్పించినారు. నీవును యుద్ధమునకు బోకతీరదా?”

శ్రీకృష్ణ:—అమ్మా! రాజబ్రాహ్మణుడనై పుట్టి యింట కూర్చుందునా? అధైర్య పడకుడు. యుద్ధములో నాకు వచ్చిన భయములేదు.

శ్రీముఖ:—అబ్బాయి ప్రతాపమును శత్రుల కిప్పుడే చవిచూపినచో ముందుముందు రాజ్యము నిష్కంటకమగును. నువ్వు అధీరవుకావలదు.

దేవి:—ప్రభూ మీరెప్పుడు ఆలాగుననె యుందురు. నా మంజు ఏడీ?

శ్రీముఖ:—నేను మన చిట్టిబాబును కొలది దినములలో నీ అంకమున చేర్చి తీరెదను.

శ్రీకృష్ణ:—నేనును నాయనగారితోపాటు ప్రతిజ్ఞ చేయుచున్నాను జననీ!

శుభముహూర్తమున శ్రీకృష్ణశాతవాహనుడు ప్రతిష్ఠానమునకు దయలుదేరి వచ్చెను.

ఆనాడట్లు స్థాలతిష్యాశ్రమమున ప్రవేశింపగనె మహర్షులు, పండితులు మహారాజునకు గోపురముకడనే ఎదుర్కొని, ఉచితోపచారములతో లోనికి తీసికొనిపోయిరి. శ్రీకృష్ణ శాతవాహనుని వారట్లు కొనిపోయి ఆశ్రమమునందు పూజామందిరమున ముఖ్యప్రదేశమున వ్యాఘ్రాజినముపై నధివసింపజేసిరి.

ఇంతలో స్థాలతిష్యమహర్షి శ్రీకృష్ణశాతవాహనునకు దర్శనమీయ నా పూజామందిరమునకు లోనుంచి వచ్చుటతోడనే, యాయన లేచి యా మహర్షికి సాష్టాంగ వందన మాచరించెను.

ఎదుట సాష్టాంగపడినబాలుని ఆసాలోచితముగ స్థౌలతిష్యుడు "దీర్ఘాయుష్మాన్ భవ" అని యాశీర్వదించినాడు. వెంటనే ఆ ఆశీర్వాద భావమాయన మనోవీధిని పొడసూపినది. అంత మహాజ్ఞానియు గడగడ వణకినాడు. ఆయన కోపము మిన్నుముట్టినది. కన్నులెఱ్ఱవారినవి. పెదవులు వణకినవి. మహర్షి కొంతవడికి తన క్రోధాదికముల నడంచుకొని, లేని చిరునవ్వు మోమునకు దెచ్చిపెట్టుకొని,

"మహాప్రభూ! లెండు! ఎప్పుడు దయచేసినారు?" అని ప్రశ్నించెను.

"నిన్ననే వచ్చినాను మహాఋషీ!" అని శ్రీకృష్ణుడు ప్రతివచనము చెప్పుచు, లేచి, స్థౌలతిష్యునితోపాటు తన యాసనమున నధివసించెను.

మహాగ్నిశిఖలై ఆంధ్రభూమిని గప్పుతున్న సాయంకాలపు వెలుగులు త్రియంబకేశ్వరుని జటామకుటమునందు పొడసూపినవి.





# పంచదశపరికరణము

## వెలుగు నీడలు

స్థౌలతిష్యుడు:—[శ్రీకృష్ణశాతవాహనుని తేరపారజూచి] మహారాజా! తమరువచ్చి రెండుదినములైనను కాలేదు. సంపూర్ణముగ శ్రమ తీరకమునుపే తాము మా ఆశ్రమమునకు విజయము చేసినారు.

శ్రీకృష్ణ:—మహర్షీ! పని యేమియులేదు. నేను యిచ్చటకు జేరు దినమునకు మూడు దివసముల ముందటనే ఈ ఆశ్రమమునకు వచ్చినారని నా మంత్రి యెరిగించినాడు. తమ ఆశీర్వాదము వరముపొందుటకును, ఇదివరకు మీ రీ యాశ్రమమునం దున్నపుడెల్ల నేను చేయు సేవను మరల చేయ అనుమతి నడుగుటకును వచ్చియుంటిని. ఆశీర్వాదము నందితిని. నేనును, ఈ మహాదాంధ్రదేశమును తమ సేవ కెప్పుడును సిద్ధము.

స్థౌలతిష్యుడు వెడనవ్వు నవ్వుచు, "మహారాజా! ఈ వినయసంపద తమకెంతయు తగియున్నవి కాని శాతవాహనులకు శ్రమణకాశీర్వలమే సర్వాభీష్టములను సమకూర్పజాలియుండ, ఈ బడుగుబాపలకై తామ రెందుకింత శ్రమపడుట? ఈ యాంధ్రభూమిలో బ్రాహ్మణుల కీమాత్రము నిలువ నీడ నిచ్చుచున్నారు. మా కదియే పదివేలు" అనియెను.

శ్రీకృష్ణ:—సార్వభౌములు ఉభయధర్మ సేవకులగుట తమ రెఱుగనిదికాదు. ఉభయుల ఆశీర్వాదములు మేము తలధరింతుము. విశేషించి తమవంటి తపస్సంపన్నుల అనుగ్రహమునకు పాత్రుడనగుట నా భాగ్యము" అనుచు శ్రీకృష్ణశాతవాహనుడు మహర్షి యనుజ్ఞపొంది రథ మెక్కి తన కోటలోనికి వెడలిపోయెను.

శ్రీకృష్ణశాతవాహనుడు వెళ్ళిపోయినప్పటినుండియు స్థౌలతిష్యాచార్యునకు ఆశ్చర్యము, కోపము, అనుమానము, విషాదము ఒక్కసారిగా క్రమ్ముకొన్నవి.

సింహమున్న గుహజొచ్చు లేడివలె నీ బాలుడు తన యాశ్రమమునకు వచ్చినాడు? ఈ రాకలోని భావమేమి? ఇత డేమైన ననుమానపడినాడా? అప్పుడప్పుడు తన యాశ్రమమునకు శ్రీముఖుడును, శ్రీకృష్ణుడును వచ్చుట కలదు. మొన్న జరిగిన చంద్రస్వామి

విచారణలో సోనుత్తరాదులనుగురించి సాక్ష్యములందు వక్కాణింపబడెనుగదా; సోనుత్తరాదులకును, తనకును గల సంబంధము సార్వభౌముని గూఢచారులకు తెలిసినదా? ఇచట మంజుశ్రీ జాడ యేమైన దొరకునని యీతడు వచ్చియుండునా?

తనకు రాబోవు విపత్తునెఱుగక తమ్మునికై దేవులాడుచున్నాడు పాపమీతడు! తా నట్లాశీర్వదించినాడేమి? తన వాక్కు అనృతమగుట ఎట్లు?

అనాలోచితముగ, అప్రయత్నముగ అనిన మాటలే నిజమగునందురు. ఇంతమాత్రముచే దన సత్యప్రతిజ్ఞ అసత్యమగునా? తా నెంత అవివేకియైనాడు. ఉత్తమబ్రాహ్మణునకు సర్వకాలములందు జాగర, స్వప్న, సుషుప్తులయందును నేమరుపాటు కూడదు. ఎంత ప్రయత్నము చేయుచున్నను జాగరూకతలేనివాడు హతభాగ్యుడు. పరమేశ్వరకార్యము పలుపు భక్తులకు ఎట్టి ఏమరుపాటు ఆనహిల్లగలదు?

తనలో ఏమి దోషము గల్గినది? తన దీక్షలో నేమి అధర్మమున్నది? వేదప్రామాణ్యమును, ఈశ్వరభక్తియు సకల జంబూద్వీపమునందు నెలకొల్పుటకు తన తపస్సు తద్యోగ పవిత్రములై, తన్మంత్రజపవరములై, తద్దీక్షావశములైన తనమాటలకీ స్ఖాలిత్యమేల కలిగినది? శాపాక్షరములు వెడలవలసిన నా నోట అమృతోపమానములై ఏ మహాసంకల్పముచే నే డట్లు 'దీర్ఘాయుష్మాన్భవ' యనుస్వరము వెడలినది!

తన మంత్రప్రయోగములు శక్తిహీనములగునా? తన అభిచార హోమములు నిస్తేజములై చల్లబడిపోవునా? వేదకర్మప్రతిష్ఠ ఈశ్వరప్రీతికరము కాకపోవుటెట్లు? ఏమైనను ఈశ్వరార్పణబుద్ధితో తన కర్మ దాను నిర్వర్తించవలెను.

స్థూలతిష్యుడు తిన్నగ లోనికి పోయి గంగాజలములు కలిపిన జలములందు మరల స్నానమాడి, ప్రాయశ్చిత్తవిధి నెరవేర్చి, జపనిమగ్నుడై, ఆ దినమంతయు నుపవాసముండి, రాత్రి రెండవ యామమునను కన్నులు తెరచినాడు.

శ్రీకృష్ణశాతవాహనుడు తన యభ్యంతర మందిరముల చేరుటతోడనే పనికత్తెలు మహారాజెప్పుడైనను బయటకు వెళ్ళి వచ్చినంతనే స్నానముచేయుట యలవాటు గాన వారిని స్నానాయత్తుల జేసిరి.

మార్జనికలు స్నానగృహమునకు గొనిపోయి ఉష్ణసుగంధజలముల యువరాజు స్నానమాడించినారు, పన్నీరుపూల అందాల మెత్తని వలిపెముల తడియొత్తి, సువాసనధూపములు వైచి, శుభ్రవస్త్రములు కట్టి అలంకరించినారు. మహారాజంత విద్యాగృహంబున కేగి,



మెత్తలుపరచిన దంతపల్యంకపీఠమున అధివసించి, రక్షకస్త్రీలకు, తక్కిన సేవకాండ్రకు పొమ్మని కనుసైగ జేసినాడు.

చిత్రిత కుడ్యవిరాజితమై, బహుగ్రంథపేటికాసనాథమై, శిల్పవిన్యాసయుక్తమైన యా విశాలమందిరమున, అత డొక్కడు ఆలోచనాధీనుడై యుండెను.

ఆతని కేదియో భయమును, ఏదియో ఆనందమును, వేదనయు, సుఖమును వెలుగు నీడలవలె హృదయస్పర్శ గావించుచుండెను.

శ్రీకృష్ణశాతవాహనుడు తండ్రికన్న కఠినహృదయముకలవాడు. శ్రీముఖుడు సంపూర్ణ బౌద్ధభావానందుడు. శ్రీకృష్ణునకు ఒక వైపున ఆర్షధర్మాసక్తి, ఇంకొకవైపున నాస్తికమగు బౌద్ధక్షణవిజ్ఞానాభిరతి, ఒకవైపున శత్రునిర్మూలనోత్సాహము, ఇంకొకవైపున ఇవియంతయు మాయయను నైరాశ్యభావము.

ఆతడు సంపూర్ణ యౌవనుడు. వీరవిక్రమోపేతుడు. ముగ్గురు బంగారు కన్నెలాతని హృదయతాపమునకు పన్నీటికలశములవలె వేచియుండిరి. వారు మువ్వురు ఉత్తమకుల సంజాతలు. మహారాణి కాదగిన ఆత్మేశ్వరి ఇంకను అతనికి ప్రత్యక్షము కాలేదు.

ఒకప్రక్క క్షత్రియుడు, ఒకప్రక్క బ్రాహ్మణుడు. * ఆతని రాజభోగప్రాభవమును పలువురు సుందరాంగనల గోరును. అతని బ్రాహ్మణత్వము సహధర్మచారిణియగు వధువునే వాంఛించును.

ఎంతమందియో మహారాజులు తమ బాలల భావ్యాంధ్ర సామ్రాజ్ఞిని చేయ గాఢవాంఛాయుతులై యున్నారని తెలియును. పిల్లనిత్తుమన్న వలదనుట ప్రభుధర్మముకాదు. ఒక భార్యయున్న కాదనవచ్చును. తన ఊహాసభాంచలాలదాటి ఒక మహాశ్వేత పన్నగాసనయగు బాలిక రెండు మూడు నెలలనుండి తోచును. తత్ వ్యంజనారూపమగు భావములు ఆషాఢ మేఘములవలె తన స్వప్నాకాశము నావరించుచున్నవి.

తన యౌవనవాంఛలకు శాంతినీయగలరనుకొన్న మూవురు ఉత్తమకులజలగు బాలల అద్భుత సౌందర్యమూర్తుల కోరికొని తెచ్చుకున్నాడు. వారు రాణులు కాలేదు. తన

* ఈనాటి నియోగులకు పూర్వీకులగు క్షత్రియ బ్రాహ్మణవంశము లెన్నియో ఆంధ్ర దేశమున ఆనాడు మాండలికప్రభుత్వములుగూడ కొన్నింటి వహించియుండెను. ఆంధ్రశాతవాహనులును అట్టి శుద్ధ ఆంధ్ర క్షత్రియ బ్రాహ్మణులు.

కామప్రవృత్తి వారిలో ప్రతిఫలము కోరలేదు. వారు కన్యాత్వ చెర వీడలేదు. వారు మువ్వురాతని హృదయవేదన గ్రహించినారు. ఆతనికి తమ అమృతాంధ్రగానము అమృతము కురిపించినారు. నృత్యవిద్యానందము కాన్కలిచ్చినారు. అనేక గాథాకావ్యరసగంధములు కలశములలదినారు.

వారు దినమునకొక అలంకారము కైసేసికొన్నారు. ఆతని సరసోక్తులచే, మేలపు మాటలచే చెనకినారు. శృంగార హావ భావ విలాసముల నిలువుపూజ లర్పించినారు.

శ్రీకృష్ణశాతవాహనుని మనోవేదన కుపశాంతి కలుగదాయెను. ఆ కన్యలతోడి శృంగారవిహారము లాతనిలో మేల్కొన్న యౌవనోరగము నాడించి జోకొట్టజాలవయ్యెను. వారి కన్యాత్వపు చెరలు వీడలేదు మాత్రము.





# షోడశప్రకరణము

## స్వప్నభంగము

హిమబిందు కలలు కనుచు కూరుచుండినది. ఆహా! తన మనోనాయకుని రసభావములు రూపెత్తునది శిల్పములలో, సౌందర్యములు మూర్తించునది చెక్కడములలో, సర్వలోకము లోని ఆనందము ప్రత్యక్షమగునది బొమ్మలలో. మహావేగముతో, అత్యంత కల్పనాచమత్కృతితో, అద్భుత విన్యాస మహిమతో విగ్రహములు ప్రతిరూపములు, దివ్యస్తూపములు, పవిత్ర త్రిరత్నములు, లతలు, పక్షులు, మృగములు తన మనోహరుడెంత సునాయాసముగ శిల్పమును అల్లివేయగలడు.

ఆతడెంత సౌందర్యమూర్తి! ఆతని కన్నులలో ఎన్ని మహాభావములు నాట్యము చేయుచున్నవో! ఆతని చూపులలో తాను శిల్పింపబోవు ఎన్ని మహత్తరకళారూపములు దర్శనమిచ్చుచున్నవో! ఆతని కనురెప్పలలో ఎన్ని చిత్రలేఖనములు రూపము దాల్చినవో! ఆతని దీర్ఘ సమనాశికలో ఎన్ని రసాస్వాదనలు పుంజీభవించియున్నవో! ఏమి యాతని పెదవులు! ఆ ఆలోచనతో ఆమె వివశయైనది.

స్త్రీలెక్కువ అందకత్తెలని యందురే! నిజముగ పురుషులలోనే అందములన్నియు నెలకొన్నవి. తన పెదవులు సృష్టిలోని సర్వ సౌందర్యములు సేకరించుకొని యుండవచ్చును. కాని తన ఆత్మేశ్వరుని పెదవులలో సృష్ట్యతీతమగు సౌందర్యము అమృతత్వసిద్ధి నందినది.

ఆమె ప్రతి నిమేషమును ఆతని కౌగిలింతల స్మరించుకొని కనుమోడ్చును. ఆతని హస్తస్పర్శచే ధన్యమైన యొడలుగాంచి మురిసికొని ముద్దాడును. తనకును ఆతనికిని జరిగిన విచిత్ర ప్రథమ సమావేశము భగవదుద్దిష్టము. తన తండ్రి కోటీశ్వరుడగుగాక! శ్రీముఖ శాతవాహనచక్రవర్తికి దక్షిణబాహువగుగాక! విశ్వామిత్రునివలె, అపరబ్రహ్మవలె సృష్టికి ప్రతిసృష్టి చేయగలిగిన సుందరాతిసుందరమూర్తి తన మనోనాయకుడైనాడు. ఇంతకంటె ధన్యత ఏమిగలదు? ఈ దైవము నెత్తికోలు నెవరు మాన్పగలరు?

హిమబిందు బాలికయైనను విద్యావతి. సమ్యగ్విచారశీలయయ్యు నపుడప్పుడు బాల్యచాపలాధీనయగును.

అల్లారుముద్దుగ పెరిగిన బిడ్డ. సంకల్పములు జనించుటయే తడవుగ సిద్ధి నందించుకొనజాలిన తనయ. తమ కనుసన్నల రాజ్యచక్రములు త్రిప్పగల కోటీశ్వరులకు మనుమరాలు. గగనకుసుమములుగూడ నామెకు దుర్లభములుగావు. అట్టి యప్పు డామె కోర్కె వెల్లువలు వెన్నెలకరళ్ళు గాకుండు టెట్లు ?

లోకములోని సర్వధనములు వాకలుకట్టించుకొని ఆంధ్రదేశమునకు తరలించుకొనివచ్చు స్వర్ణనదీభగీరథుడైన చారుగుప్తుడు తనయను సామ్రాజ్ఞిని చేయ సంకల్పించినాడు. రాజ్యవైభవము చేకూరని ఐశ్వర్యము వ్యర్థము. ఆంధ్రసామ్రాజ్యమును, ఆంధ్రకోటీశ్వరేశ్వరుల వర్తకమును యమునా గంగా సంగమమై నడుచుచున్నది.

సామ్రాజ్యాభివృద్ధికి ధనము దోహదమా ? ధనాభివృద్ధికి సామ్రాజ్యాభివృద్ధి దోహదమా ? ఎవరు చెప్పగలరు. వెనుక వణిగ్రాజ్యాది రాజ్యములలో కోటీశ్వరు లుండెడివారేమో ? నేడొక్క ఆంధ్రవణిక్కే ఆ ఔత్తరాహవణిజుల సంపదనంతయు దానే దక్కించుకొనగలిగినవాడు. ఆంధ్రచక్రవర్తి జంబూద్వీపచక్రవర్తి యగుగాక ! ఆంధ్ర వణిక్సార్వభౌముని తనయ సర్వజంబూద్వీపసామ్రాజ్ఞి అగుగాక ! ఇరువురు చక్రవర్తులు వియ్యమందుదురుగాక ! శ్రీకృష్ణశాతవాహనుడు చారుగుప్తుని అల్లుడు. చారుగుప్తుని మనోరథమిట్లున్నది. దైవసంకల్ప మెట్లులనున్నదో !

హిమబిందు ఆలోచనామృతపూరముల ఏలోకములకో తేలిపోవుచు, ఏ ఆనందములకో వశీభూతయగుచు, ఏ మాధుర్యములనో కరగిపోవుచు, నవరత్నఖచిత జాంబూనదపర్యంకముపై పరుండియున్నప్పుడు చారుగుప్తుడు రక్తచందన పాదరక్షలు చప్పుడుతో కొమరితయున్న కడకు వచ్చినాడు.

ఒక్క నిమేషమాత్ర మతడు పాల్కడలిలో శయనించిన బంగారులక్ష్మివలె ఆ హంసతూలికాతల్పమున నొరగియున్న త్రిభంగాకృతివిలాసముల ప్రోవు వయ్యారములకుప్ప, సౌందర్యముల నిధియైన తనయను తనివార చూచుచున్నాడు.

“ అమ్మా ఏమట్లు పడుకొంటివి ? దేహమున సుఖముగ నున్నదిగదా ? ”

హిమబిందు ఉలికిపడి లేచినది. తండ్రిని చూచి, మనోరథప్రవాహమును మంచమును విడిచి లేచి ఆయన పాదములకు నమస్కరించి తలవంచి నిలుచున్నది. ఏదియో అద్భుతకాంతి,



ఏదియో అమృతానందము ఆ బాల ఫాలమున నాసికను, లోచనముల, పెదవుల తాండవమాడుట చూచి, ఏదియో అపరిమితానందము సమకూర్చు సన్నివేశము జరిగియుండవలె నీ బాలికకు; అనుకొని యామెను హృదయమునకు జేరదీసికొని మనస్సున నాశీర్వదించి:

“ అమ్మా నీ వా మంచముపై కూర్చుండుము. నే నీ యాసనమున కూర్చుందును. ”

“ నాయనగారూ ఎప్పుడు మీ ప్రయాణము ? ”

“ ఆ విషయాలన్నియు మాటలాడుటకు వచ్చినాను కన్నతల్లీ ! ”

“ నాయనగారూ ! సమదర్శిబావ ఉజ్జయినిలో క్షేమముగ నున్నాడా ? ”

చారుగుప్తుడు తనయమాటలకు లోన కొంత భయమంది, యామె ముఖము నిపుణముగ పరిశీలించెను. తన బాలిక సమదర్శిని ప్రేమించుచున్నదా ? సమదర్శి మేనల్లుడగుగాక, అయిన నేమి ? తన తనయ ఆంధ్రసింహాసనయోగ్య.

“ క్షేమముగనున్నాడు. అక్కడ ఇంతవరకు సేనాపతు లెవ్వరికి ఆపత్తులు జరుగలేదు. తల్లీ ! ఆంధ్రసామ్రాజ్యము తూర్పు తీరముననుండి పశ్చిమ సముద్ర తీరానికి రెండు వందల యోజనముల వెడల్పున్నది. ఉత్తర దక్షిణములకు ఇప్పుడంతయు లున్నది. ఇంక రెండు వందల యోజనములు వృద్ధినొంది తీరును. దానికి నీ బాబయ్యయే కారణమగుచున్నాడు. ”

హిమబిందు ఆశ్చర్యభ్రాంత హృదయమున తండ్రి మాటలు వినుచుండెను.

“ తల్లీ ! ఈ విశాల సామ్రాజ్యమునకు నీవు సామ్రాజ్ఞివి కాబోవుచున్నావు. చారుగుప్తుని తనయ జంబూద్వీప సామ్రాజ్య సింహాసన మధిష్ఠించి, మహారాణులు వింజామరలు వీవ, మహామాండలికరాణులు పాదములు కడుగ, మాండలిక పత్నులు పదములొద్ద మహాసామ్రాజ్యాభిషేకము నందబోవుచున్నది. ”

హిమబిందున కేదియో భయము మబ్బువలె ఆక్రమించినది. తండ్రిమాట లర్థము చేసికొనలేక పోయినది. మాట లుడిగి నిశ్చేష్టయై తండ్రిమాటలు వినుచున్నది.

“ యువరాజు శ్రీకృష్ణశాతవాహనుడు ఎంత అందమైన బాలుడు ? ఎంత విక్రమోపేతుడు ! తండ్రినిమించిన వీరుడు, సకల భారతావనిలో అతని మించిన సుందరు డింకొకడు లేడు. అతని కతడే సాటి. అట్టి కొడుకును కోరికోరి నేనును మీ అమ్మయు తపములాచరించినాము. నోములు నోచినాము. దివ్యచైత్యముల కన్నిటికీ మొక్కుకొన్నాము. నా దురదృష్టముచే మీ అమ్మయే —”

హిమబిందు కన్నుల నీరు తిరిగినది. కొమరిత కంటినీరు చూచి, చారుగుప్తుని కన్నులను నీరు తిరిగినది. హిమబిందు వెంటనే తండ్రికడకు గబగబ వచ్చి, యాతని హృదయమున వాలి వెక్కి వెక్కి ఏడ్చెను.

చారుగుప్తుడు తాను వచ్చిన పని భంగమగునని, తన్ను సమాళించుకొని తనయ నుపశమిల్లజేసి, చెంతనిడుకొని, నెమ్మోము పుడుకుచు నిట్లు వచించెను.

“ తల్లీ ! మీ అమ్మతో నిన్ను నా ప్రాణములకన్న ఎక్కుడుగ సంరక్షింతునని వాగ్దానము చేసియున్నాను. లోకములో నుత్తమునకు నిన్నిత్తునని మొక్కుకొన్నాను. నేడా కాలము వచ్చినది. విష్ణునకు సముద్రుడు లక్ష్మి నర్పించినట్లు, నిన్ను శ్రీకృష్ణశాతవాహన మహారాజునకు అర్పింప సంకల్పించుకొన్నాను. సంకల్పమును పెద్దలందరు ఆమోదించినారు. ”





# సప్తదశ ప్రకరణము

## నాయికా నిర్వేదము

చారుగుప్తుడు తన కొమరిత వెలవెలబోవుట జూచినాడు. ఆమె నిశ్చేష్ట అయినది. విప్పారిన పూలమాలవలె తన చేతులలోనున్నది యున్నట్లే ముడుచుకొనిపోవుచున్నది.

చారుగుప్తుడు “ బాలనాగీ ” అని పెద్ద కేక వేసెను.

ఇంతలో మెఱుపువలె బాలనాగి యచ్చట కురికి హిమబిందునుజూచి, “ అమ్మా ! అమ్మాయిగారూ ! ” అని హిమబిందు దగ్గరకు పరువిడెను.

చారుగుప్తుడు “ వెంటనే పన్నీరు పట్టుకురా ! సేవకురాండ్రతో వైద్యుని పిలిపించు ” అని కేక వేయుచు, తనయ శరీరము నిమురుచుండెను.

బాలనాగి ఒక నిమేషమున పన్నీరము [మంచునీటిలో సుగంధజలములు కలిపినది] తెచ్చి, చారుగుప్తుని చేతికిచ్చి, అచ్చటనున్న ఘంటికను గబగబ మ్రోగించెను.

పలువురు సేవకురాండ్రు పరువిడి వచ్చినారు. బాలనాగి “ వైద్యుడు ” అని ఒక్క కేకతో వారివైపు తిరిగి అన్నది.

చారుగుప్తుడు పన్నీరముతో హిమబిందు మోము తడుపుచుండెను. ఆమె కన్నులు విచ్చి సన్నని యెలుగున “ ఏమిజరిగినది నాన్నా ! ఏమిటీ గడబిడ ” యని అడుగుచు లేవబోయినది.

చారుగుప్తుడు “ తల్లీ లేవకుము. నీకు కొంచెము పైత్యము చేసి కన్నులు భైరవులు కమ్మినవి. కొంచెము విశ్రమించుము ” అనుచు కొమరితను బుజ్జగించుచు తలపై పన్నీటిని నెమ్మదిగ శుభ్రవస్త్రములతో నద్దుచుండెను.

పది విఘడియలలో మహావైద్యుడగు ఆనందులవారు చటుక్కున లోనికి విచ్చేసినారు.

చారుగుప్తుడు లేచి అత్యంత వేదనాభరమైన చూపులు వైద్యుని చూపులతో వియ్యమందించినాడు. ఆనందులవారు నవ్వుచు హిమబిందుకడకు బోయి యామె మంచముపై కూరుచుండి యామె ఎడమచేయి తీసికొని, వేళ్ళు విరిచి, నెమ్మదిగ నామె నాడిని పరీక్ష చేసెను.

అంత నానందులవారు లేచినారు. వెనువెంట శిష్యుడొకడు కొనివచ్చు దండపుబెట్టెను తనకడకు తీసికొనిరమ్మని సైగచేసి, యా పెట్టె తెరచి, యందుండు బంగారపు కరండములలో నొక చిన్న బరణి తీసి, యది తెరచి, తమలపాకును, తేనెను తెమ్మని బాలనాగితో చెప్పెను.

ఆ బరణియందున్న చూర్ణమును చిరుదంతపు పుడకతో తీసి, యది తామలపాకుపై వైచి, తేనెబొట్టు లిరువది లెక్కపెట్టి, పడనిచ్చి, యా చూర్ణమును తేనెతో రంగరించెను. రంగరించిన తన యనామికను తామలపాకుపై తుడిచివైచి, ఆ ఆకును, హిమబిందును లేచి కూర్చుండుమని కోరి, యామె చేతికిచ్చెను ఆ బాలిక ఆ మందును సేవించి, ఆకును బాలనాగి చేతికొసగ నామె దానిని ముక్కలుగ చింపి, ఆవల పారవైచి వచ్చెను.

ఆ మందు పుచ్చుకొనుటతోడనే హిమబిందునకు ఎంతయో బలము వచ్చినట్లయినది.

ఆనందులవారు:—అమ్మాయీ! నీ వే విషయమునను బెంగ పెట్టుకొనకుము. నీ కేమి కావలయునన్న అవి యన్నియు మీ తండ్రిగారు నీకు సమకూర్చలేరా?

హిమ:—బాబయ్యగారూ! నా కేమియు బెంగలులేవు. నాయనగారు యుద్ధయాత్ర కేగుదురన్న బెంగ ఒక్కటిమాత్రము కలిచి తల తిరిగినది. ఆ వెనుక ఏమి జరిగినదో నాకు తెలియదు.

చారు:—తల్లీ! నే నెన్నిసారులు, నెల, రెండు నెలలుగూడ ఇతర దేశములకు యాత్రలు చేసి రాలేదు?

హిమ:—నాన్నగారూ! మీరు వెనుకవెళ్ళినది వర్తకమునకు, నేడు వెళ్ళునది యుద్ధమునకు, ఆ ఆలోచనలు తల తిప్పినవి.

ఆనందులు:—[నవ్వుచు] మీ రిదివరకే మీ బాలికకు చెప్పియుండవలసినది. చటుక్కున చెప్పుటచే స్త్రీసహజ మనోవికారము కలిగినది. ఏమియు భయములేదు. తల్లీ మా తమ్ముడు శ్వేతకేతుడు మీ తండ్రిగారివెంట బోవుచున్నాడు. మా అన్నగారు అపరధన్వంతరి మూర్తి మంతులవారు సార్వభౌమునివెంట నుందురు. నే నిచ్చటనే నీ యోగక్షేమము లారయు చుందును.

హిమ:—బాబయ్యగారూ! మీరుండ నాకు భయములేదు. నాయనగారు చక్రవర్తితో వెడలవచ్చును. అదిగో మా అమ్మమ్మ వచ్చుచున్నది. అత్తయు వచ్చుచున్నది.

ముక్తావళీదేవి గబగబ, గడబిడ చేయుచు "నా తల్లి కెట్లున్నది, నా తల్లి కెట్లున్నది" యనుచు నచ్చటకు వచ్చి, హిమబిందును కౌగిలించుకొని ఘొల్లున నేడ్చినది.



అమృతలత వెనువెంటనే వచ్చి, "అత్తగారూ! మీ యేడ్పుతో పిల్ల మరియు భయ మందును. తండ్రి యుద్ధయాత్ర పోవుచున్నాడని దుఃఖించి మూర్ఛపోయినది. అవును మా అన్నయ్య తా నెందుకు యుద్ధమునకు సిద్ధమగుట. తన కేమి పని?" యనినది.

చారు:—ఉండు అమృతా! నీ కేమి తెలియును. ఆడవారికి రాచరికపు గొడవ లెందుకు?

ఆనందులు:—ఉండుడు. మీ రందరావలికిబోయి వాదించుకొనుడు. ఇచ్చట బిడ్డ సంగతి మరచిపోయినట్లున్నారు. బిడ్డ కేమియు భయములేదు. చారుగుప్తులవారు నిర్భయ ముగ యుద్ధయాత్రకు బోవచ్చును. హిమబిందుభారము నాది.

హిమ:—నాన్నగారు! నాకు భయములేదు.

ఆనందులు:—మీరందరు ఆవలికి వెళ్ళుడు. కొంచెము భోజనదోషమున అమ్మాయికి పైత్యాభివృద్ధి అయినది. అందుపై చారుగుప్తులవారి వాక్యముల నామె తల తిరిగినది. నేను మందులిచ్చుకొనెదను. మీరు మీ పనిమీద వెళ్ళుడు చారుగుప్తులవారూ!

"చిత్త" మని చారుగుప్తుడు వెడలిపోయెను.

సాయంకాలము చక్రవర్తియు, మహారాణియు, చారుగుప్తుడును కొన్ని సైన్యము లతో ఉత్తరదిశగా మహారాజపథమువెంట గోదావరీతీరమునకై మహావైభవమున ప్రయా ణమై పోయిరి.

ప్రయాణమునకు ముందు గుఱ్ఱములకు, ఏనుగులకు కర్పూర నీరాజనము లీయబడెను. కొన్ని లక్షల నారికేళములు బలిగా అర్పింపబడెను. బ్రాహ్మణులకు గోవులు, భూములు దానము లీయబడెను. మహాచైత్యమున కోటి దీపారాధన జరిగెను. చైత్యఘంటికలు నాదములు చేయుచుండెను.

భిక్షుకులు, బ్రాహ్మణులు ఆశీర్వాదములు సలిపిరి. అంతకు తొమ్మిది రోజులనుండియు బ్రాహ్మణులు జయ యజ్ఞములు సలిపిరి. ఆ పురోడాశము చక్రవర్తికి ప్రసాదమిచ్చినారు ఋత్విజులు.

నాగపూజలు జరిగెను. గ్రామముల గ్రామదేవతల భజనలు జరిగెను.

భేరీ భాంకారాది మంగళవాద్యములు సెలగ చక్రవర్తి మహాగజము, సర్వాలంకార భూషితమై, హిమలయోత్తుంగ శిఖరమువలె సాగిపోయినది.

అందధి వసించినవారు చక్రవర్తియు, చారుగుప్తుడును. చారుగుప్తుడును దివ్య కవచ ధారియై అర్జునుని పక్కనున్న శ్రీకృష్ణునివలె వెలిగిపోయెను.

హిమబిందు రాజకుమారికలతో పాటు చక్రవర్తి గజమునకు ఆరతిచ్చినది. ఆమెలో నాటి ఉదయకాలపు విషాదముకాని, నిర్వేదముకాని ఏమియు లేదు. ఆమె తక్కిన బాలలతో పాటు నవ్వుచు, కలకల లాడుచున్నది. చారుగుప్తుడది చూచి, యూరటనంది, సంతుష్టుడై దూరము నుండియే యామెను చిరంజీవ, ఇష్టకామ్యార్థసిద్ధిరస్తు అని ఆశీర్వదించుకొనెను.

ఆమె కామ్యార్థము ?





# అష్టాదశ ప్రకరణము

## అల్లరిపిల్లలు

సార్వభౌముడు ఆంతరంగిక రక్షక సైన్యముతో వెడలిపోవు శుభముహూర్తమునందు ఆ మహోత్సవము గమనించుటకు సువర్ణశ్రీకుమారుడును వచ్చియుండెను. సార్వభౌమునితో ధర్మనందియు, అమృతపాదార్హతులు, మహారాజ పురోహితులు, శ్రమణకులు, బ్రాహ్మణులు మహామంత్రి అచీర్ణులవారు వెడలినారు.

నాగబంధునిక, సిద్ధార్థినికయు, శక్తిమతీదేవియు, మహాలియు, కొందరు పరిచారికలు రథములపై కోటలోనికివచ్చి, ప్రయాణోత్సవముల దిలకించిరి. నాగబంధునికయు, సిద్ధార్థినికయు, మహారాజు గజమునకు, సింహపతాక వాహాయగు మహాదాంధ్ర శాతవాహ దంతావళమునకు, ధర్మనందులవారు అమృతపాదార్హతులు ఎక్కిన భద్రదంతికి తక్కిన రాజులతో పాటు హారతులు సమర్పించిరి.

నాగబంధునికకు తన అన్నయు, హిమబిందును రెండుసార్లు హిమబిందు క్రీడావనమున కలసినారని తెలియును. హిమబిందును, సువర్ణశ్రీయు నొకరినొకరు గాఢముగ ప్రేమించుకొనుచున్నారని స్పష్టముగ నామె కవగతమైనది. ఆమె ఈ పవిత్ర సంఘటన మూహించుకొని పొందిన యానందమునకు మేరలేదు.

ఆ రెండుసార్లు సమావేశానంతరము సువర్ణశ్రీ రాత్రి ఇంటికి వచ్చినతోడనే, నాగబంధునిక అన్నగారిని అతని మందిరమున ఏకాంతమున కలిసికొనినది. ఈనాడు,

“ అన్నా ! ప్రాతర్హిమబిందులు ఉదయారుణకాంతిచే సువర్ణశ్రీకలితములగునట నిజమేనా ? ” అని నవ్వినది.

“ ఓహోహో ! శ్లేషకవిత్వం చెప్తూవున్నదండీ ! మా చెల్లాయి. సార్వభౌములుగూడ నగరమున లేరే, సత్కరించుటకు ! ”

సత్కారములు నాకెవరు చేస్తారు ? బండికుందెములో నీవుకాగా గెలిచితివి గనుక, సార్వభౌములూ, సరసాంగులూ నీకే చేస్తారు సత్కారాలు. బహిరంగసత్కారాలూ, అంతరంగార్పణలూ అన్నీ నీకే జరుగుతూవుండెగదా ! ”

“ అంత యీసెందుకమ్మా, చెల్లీ ! కావలెనంటే నీకుమాత్రం సత్కారలోపం ఉంటుందా ? నాన్నగారు తిరిగి రాగానే వారితో చెప్పితే నీకుగూడా అంతరంగార్పణ

చేసేవారిని క్షణంలో వెదకి తీసుకవస్తారు. కొంచె ఓపిక పట్టు. నువ్వుకూడా ఈ దిగ్విజయానికి బయలుదేరి వెళ్ళుతావనుకున్నాము గాని, ఊళ్లో ముచ్చటలన్నీ విచారిస్తూ కూరుచుంటావనుకోలేదు. ”

“ చాలులే అన్నయ్యా ! నీ మాటలూ నీవూనూ. అంతరంగార్పణకోసం నీవలె అందరూ తహతహపడుతున్నారనుకుంటావు. అంతే. నీవంటి వీరపుంగవులందరూ ప్రమదవన విహారంచేస్తూ, వెన్నెలకుప్పలూ, దాగిలిమూతలూ ఆడుకుంటూవుంటే మాకు ఇచట ఏమి పని యింకా ? మా సావాసకత్తెలనుగూడా కంట్లకు గనిపించకుండా చేశావుగదా ! ఇక యుద్ధాలకు వెళ్ళక ఏమిచేయమంటావు మమ్మ ? ”

“ నీవు అంతటివానవౌదువుగాని, నీ సావాసకత్తెలను నేను దాచానటే చెల్లీ ! నీకు గనిపించకుండా ? ”

“ దాచకపోతే ఎందుకురావడంలేదు హిమబిందు మనయింటికి ? అదివఱకు చీటికి, మాటికీ ఏదో సాకుమీద వచ్చేది యిప్పుడెందుకు రాదూ మఱి ? ”

“ ఇది మఱీ బాగున్నది. హిమబిందు ఎందుకురాదో నా కేమి తెలుస్తుంది ? ”

“ ఔను. నీ కేమి తెలుస్తుంది ! మా అన్న నట్టి సంగనాచి. ఏమీ యెఱుగడు. నోటిలో వేలుపెడితే కఱవనుగూడ లేదు. ఔనా ? పిల్లి పాలుతాగుతూ తన్నెవరు చూడలేదనుకుంటుందట ! ఆ కళ్ళ తళతళలు, ఆ చిఱునవ్వులు, ఆ పెళ్ళికొడుకు కులుకులూ, ఆ ఉప్పొంగిపోవుటలూ ఎవరెఱుగరు ? పోనీ, ఇది అంతా వట్టిదని నాలుకతో ముక్కందుకో అన్నయ్యా, నువ్వు ! ”

“ అది సరికాని, ఊళ్లో వార్తలన్నీ తెలుసుకోవలెనని ఒకమ్మాయికింత ఆతురత ఎందుకు ? ”

“ ఒక అమ్మాయితండ్రి ఊరు విడిచి వెళ్ళిపోవుచున్నాడుగదా, ఇంక ఆ ఇల్లు దోచుకోనవచ్చునని ఒకబ్బాయికి అంత సంతోషమెందుకు ? దారిలో ముళ్ళకంచెలు ఉన్నవని ఎరుగడుకాబోలు. ”

ఇంతలో సిద్ధార్ధనిక అక్కడకు పరుగిడివచ్చి “ అమ్మా ! ఇద్దరుదొంగలూ ఏదో ఆలోచించుచున్నారా. ఇంత తోడిదొంగలు ఎవరి ఇంటిలో దొంగతనము చేయదలచుచున్నారు ? ”



నాగ:—ఒసే చెల్లీ ! అన్న దొంగతనము చేసిరాగా, ఆ సంగతి తెలిసి అన్నను చివాట్లుపెట్టుతున్నాను. నీవుకూడా తప్పనిచెప్పు. అన్న దొంగతనముసంగతి విని అమ్మయు, నాన్నయు ఏమందురు. చుట్టములలో తలవంపు........

సువర్ణశ్రీ:—[విరగబడి నవ్వుచు]

పట్టుడీ దొంగ నో ప్రజలారమీరు !

కట్టుడీ కొట్టుడీ కట్టిడివాని !

సిద్ధా:—నాకు చెప్పవా అన్నా ఆ విచిత్రమేమిటో ?

నాగ:—ఉండవే చెల్లీ ! నీవు చిన్నబిడ్డవు. నీ కెందుకే ఈ విషయములన్నియు.

సిద్ధా:—అన్నా చూడు !

నాగ:—నీవు అమ్మదగ్గరకు పోయి, అమ్మ ఒడిలో పండుకో. పెద్దవారిసంగతులు నీ కెందుకే ?

సువర్ణశ్రీ:—

ఓ హో హో

పెద్ద ఒకతె వచ్చెనండి

సద్దు చేయరాదు పొండి

వడ వడ వడ వణకిపోదు

ముడుతలైన దేహముతో

ఓ హో హో పెద్ద ఒకతె వచ్చెలెండి.

సిద్ధా:—[విరగబడి నవ్వుచు చప్పట్లు కొట్టుచు]

ఓ హో హో !

ముసలి అవ్వ వచ్చె రండు

ముసలి కథలు చెప్పురండు

ఊం ! ఊం ! ఊం ! ఊకొట్టుచు

ఓహో రండు ! బాలలెల్ల,

ఓహో రండు బాలురెల్ల !

సువర్ణ:—నాయనగారు ఈపాటికి ఎంతదూరము పోదురు

నాగ:—విదిశాలిపురము !

సిద్ధా:—గోదావరికడకు !

నాగ:—[వణుకుచున్నట్లు నటించుచు] విదిశాలికి, గోదావరికి ఎంతదూరము మనుమరాలా ?

సిద్ధా:—అమ్మమ్మా ! ఆరు క్రోశములు.

నాగ:—[వణకుచునే] నీకు లెక్కలు సరిగా వచ్చునా ?

సువర్ణ:—మా అమ్మాయి బాగుగా చదువుకొనుచున్నది అమ్మమ్మా !

నాగ:—ఒసే పసికుత్తా ! నీవు మాటలాడకు. క్రోశమనిన ఏమిటి పసిదానా !

సిద్ధా:—గోరుతము.

నాగ:—అర్థము సరియే ! లెక్కచెప్పుము.

సిద్ధా:—అలాగునా, అమ్మమ్మా, ఇరువది నాలుగంగుళములొక హస్తము. ఎనిమిది వేల హస్తములొక క్రోశము. రెండు క్రోశములొక గవ్యూతి. రెండు గవ్యూతులొక్క యోజనము. నాలుగు హస్తములొక ధనువు. వేయి ధనువులొక గోరుతము.

సువర్ణ:—బయలుదేరిన యామములోనే గోదావరితీరమునకు బోవుదురుగాబోలు ? నాయనగారింటికడలేరు. ఈ గృహయజమానిని నేను. బాలికలారా ! మీ మీ మందిరములు చేసుకొని ప్రార్థనలు చేసికొనుడు. నేను అర్చన చేసికొనవలయును.

నాగ:—ఓసి చెల్లీ ! అన్న హిమబిందు హృదయము తస్కరించుకొని వచ్చినాడు. తలవరులకు తెలిసిన ఏమందురు ?

సిద్ధా:—ఏమందురు ?

సువర్ణ:—మీ ఇద్దరకు నోటిశాళములు వేయమందురు.

సిద్ధా:—అన్నా ! ఏది హిమబిందు హృదయము చూపెట్టవూ మాకు ?

సువర్ణ:—ఈ అల్లరిపిల్లల బాధ పడలేకున్నాను. భగవాన్ నన్ను రక్షింపుమయ్యా !

రక్షింపుమయ్యా రమణిరాక్షసుల బారినుండి
వీక్షింపుమయ్యా వేదనపడు పురుషుల దయతో !

నాగ:—

శిక్షింపుమయ్యా చేడెల హృదయము ముచ్చిలించుచెనటుల,
శిల్పులైననేమి వారు—

సువర్ణశ్రీ యచ్చటనుండి పారిపోయెను. నాగబంధునిక పాట నాపెను.

సువర్ణశ్రీ పోయి, స్నానమాచరించి, మహాసనగృహమునకు ప్రక్క భోజనశాలకు బోయి ఎట్లో రెండు మెతుకులు నోటవైచికొని, తన శయనమందిరము చేరెను. నిద్దురపట్టదు.



హిమబిందు తన ఆత్మేశ్వరియగుట నిజమా ? అది ఎట్లు సాధ్యమగును. మహారాజుల తనయ యైనను, తనబోటివానిని కిరీటవంతునైన చూడ నంగీకరింతురేమో ? కాని చారుగుప్తుని కొమరిత ?

ఇది యంతయు స్వప్నభ్రాంతి కాదుగదా ? ఒకవేళ...ఒకవేళ...ఆ బాలిక వారి శకటమును, ఎద్దుబండ్లపందెమున నోడించినందుకు తన్ను పరాభవము చేయదలంచి, ఈ విచిత్ర నాటకమాడినదా ?......అయినచో నుత్తమవంశజాతయగు బాలిక తన కౌగిలి ఎట్లుచేరును ? 'నీవు నా ప్రాణావు' వని బాసలాడగలదా ?......కాదు కాదు, ఏమహాత్తరవిధి సంఘటననో యా బాలిక తన్ను ప్రేమించినమాట వాస్తవము. "కల్లకపటములెఱుగని ఆ ప్రేమ తరంగితవీక్షణములు చూచియు, నా హృదయాధిదేవత నింకను సంశయించుట మహాపరాధము. అతిమాత్రమగు నా భాగ్యమును నమ్మలేని దుర్బలుడనైపోవుచున్నాను. నిజము దేవీ ! ఈ దీనునకు నీవు ప్రసన్నవైతివి. నిజము."

ఈ విషయము తల్లికి చెప్పవలెను. నాగబంధునిక నిజమంతయు తెలిసికొన్నది. ఆమె వలన మాతృశ్రీ యీ విషయము వినుగాక. తండ్రిగారు ఊరలేరు. చారుగుప్తులవారును లేరు. ఆయన ఎట్లు ఒప్పుకొనును ? కాని అల్లారుముద్దుగ పెంచిన బాల కోర్కె నాతడేల చెల్లింపడు.

"ప్రేమ దేవతాస్వరూపిణీ, సహస్రకోటి చంద్రికళామూర్తీ ! ఆత్మేశ్వరీ, నా శిల్ప కమలాలయా ! దరిజేసుకొనుము. నీవాభాగ్యము ననుగ్రహించి నన్ను ధన్యునిజేయుము"

మూడవయామపు కుక్కుటములు కృష్ణయావలి పల్లెలో నరచినవి.



# ఏకోనవింశతి ప్రకరణము

## శుక్రవారము

" అమినతీ దైవ్యాని వ్రతాని ప్రమినతీ మనుష్యా యుగాని
ఈయుషీణాముపమా శశ్వతీనామా యతీనాం ప్రథమోషా వ్యశ్వైత్.

దేవతా సంబంధములగు వ్రతములను అనుకూలింపజేయుచు, మనుష్యులకు సంయోగ వియోగములను కల్గింపుచు, ఇదివరకు కడచిపోయినట్టి, ముందు రాబోవునట్టి ఉషస్సులకు సాటియైన యీ దినమునకు మొదటిదైన ఉషోదేవత మిగుల ప్రకాశించుచున్నది. "

ఆంధ్రరాజ్య రమారమణి సర్వాదిశలను ఆక్రమించుచున్నట్లు ఉషోదేవి మందహాసారుణ కాంతులు ఆశాంచలముల వ్యాపించుచున్నవి.

ప్రతి శుక్రవారపు టుదయమునను హిమబిందు చతుర్విధ పురుషార్థదాయిని అయిన మహాలక్ష్మికి పూజ సేయును. ఏధర్మము లెటుపోయినను వణిక్కులు మహాలక్ష్మీపూజ మానరు.

మహాలక్ష్మి వణిజులయింట నెన్నడో వెలసినది. ఆ దేవి వణిజుల యారాధ్యదేవత. హిమబిందు శుక్రవారము ఉదయమున లేచును. చంపక, మల్లిక, దమనక, వకుళ, కేతకీ ప్రముఖ తైలములతో, పుష్పార్ద్రనలుగుడులతో, పరిమళజలంబుల నభ్యంగన మాచరించి సుదీర్ఘ కుంతలముల చిక్కు తీయించుకొని, వదులు వాలుజడ వేయించుకొని, పూజావస్త్రములు ధరించి, బంగారు పూలసజ్జతో తోటలోనికి పోవును.

మహాలక్ష్మి పూజకు ఆమెయే పూవులు, పత్రి కోయవలెను. ఈ శుక్రవారపు టుదయము ఆమె బాలనాగిని వెంటగొని పుష్పోద్యానమునకు బయలుదేరినది. శుక్రవారము ఉదయము ఆ ఉద్యానవనమునకు రమ్మని బాలనాగి సువర్ణశ్రీకి సందేశమంపినది. తానేమి చేయవలెను ? " ఓ మహాశిల్పీ ! దివ్యసుందరమూర్తీ, నీకును నాకును ఇంతటితో చుట్టరికము చెల్లిపోయినది " అని చెప్పవలయునా ? ఈ బాలకుని, ఈ మనోహరుని, ఈ దేవతామూర్తిని ప్రేమింపక తాను బ్రతుకలేనిమాట నిశ్చయము. తన హృదయమప్పుడే స్థాణుత్వమునహింప నారంభించినది. ఈ రెండు మూడు దినములలోనే తాను చిక్కిపోయినది భోజనము సహ్యము గుటలేదు. దేహమునకు, మనస్సునకు, ఆత్మకు ఈశ్వరుడైనవాని వదలి పరపురుషుని ఏ స్త్రీ స్పృశింపగలదు ? నాయకునిగా భావింపగలదు ? అతడు మహారాజుగాక, చక్రవర్తియగు గాక, భగవంతుడేయగు గాక !



తండ్రి యాజ్ఞను తాను జవదాటలేదు. ప్రత్యక్షభగవంతుడు తండ్రిగదా ! తన జీవితమున కాధారభూతుడు జనకుడు. అతని ప్రతిరూపము తాను. ఆయనఆజ్ఞ తనకు అనుల్లంఘనీయము. అయిననేమి; ఎవరిమనస్సు వారిది; ఎవరిహృదయము వారిది; ఎవరిఆత్మ వారిది. తన తండ్రి యాజ్ఞచే తాను మహారాజ శ్రీకృష్ణశాతవాహనుని ప్రేమింపగలదా ? అయినను తండ్రికీ వెత్తియేమి ?

ఎట్లు సువర్ణశ్రీనివిడిచి తా నుండగలదు ? అతని కన్నులలో తన చూపులు విరియింపక అతని దేహకాంతులలో తన జీవకాంతులు మలచివేయక, అతని మాటలకు తన హృదయమును శ్రుతిసేయక, అతని ఆత్మలో తన ఆత్మ లయింపక మందభాగ్యయై ఎట్లు మనగలదు ? జనకుని యాసలన్నియు తనపైనున్నవి. ఈ కుబేరసంపదయు, ఈ మహదైశ్వర్యము చాలదా. తనకు దన భర్తకు ? మహారాజమహిషియై నింకను ప్రాముకొనునదియేమి ? సువర్ణశ్రీ విముఖుడై, వాడబారి, ఎండిపోయిన తన హృదయమునకు మహారాజ ప్రాభవ మేమిరుచించును ? అయ్యో ! తండ్రికీ విషయమంతయు చెప్పవలెను. తన ఏకపుత్రిక ఆంధ్రసామ్రాజ్య సింహాసన మధిష్ఠించునని పుట్టెడాశతోనున్న ఆ వృద్ధునిహృదయము, తన నిశ్చయము వినినచో, భగ్నముకాక నిలుచునా ? " మదేకగతియై, నన్ను బూవులలోనుంచి పెంచుచున్న ముదసలితండ్రి మాట కెదురాడి, ఆయనకు ప్రాణాంతకమైన ఘాతుకకృత్యము నేనెట్లు చేయగలను ? తండ్రి జీవితమునకిక మిగిలినది తన వివాహసంతోష మొక్కటియేకదా ? నా సౌఖ్యమునకై తండ్రి హృదయము భగ్నముచేయజాలను. బుద్ధదేవా ! నీవే శరణు. నన్నును, నా జనకుని ఎట్లు రక్షింతువో ! "

అక్కటా ! తన సౌఖ్యము, దన తండ్రి సంతోషమేగాని, తన హృదయాధినాథుడగు సువర్ణసుందరుని మాటయే మఱచినది. తన్ను విడిచి తన స్వామి యొక ముహూర్తమైన జీవింపగలడా ? దుర్విధీ ! తన్ను గోటీశ్వరుని తనయ నేలచేసితివి ? కోరినవరుని జెట్టవట్ట లేని నిర్భాగ్యురాలికీ యైశ్వర్యమంతయు నేటికి ? తన్ను పరమ దరిద్రురాలినైన జేయుము; తన స్వామినైన జేర్పుము. ఈ యాంధ్ర సామ్రాజ్యవైభవము, ఈ జైత్రయాత్రలూ తనకొఱకే కల్పితములైనట్టులున్నవి. దైవముగూడ తండ్రి సంకల్పమునకే తోడై ఆంధ్రసామ్రాజ్యమునకీ విజయపరంపరలు సమకూర్చవలెనా ? ఈ యాంధ్రసామ్రాజ్యముగాని, చారుగుప్తైశ్వర్యముగాని ఏ మహేంద్రజాలముచేనైన గొంతతడవ స్తంగతమగునేని తనకీ సంకటము తప్పిపోవును.

"బుద్ధదేవా! నీవే శరణు. అబలను, అల్పబుద్ధిని; నాకు మార్గము జూపుము. నాస్వామిని రక్షింపుము. తండ్రి సంతోషమా ? మా యిరువురి సౌఖ్యమా ?"

ఈ దీర్ఘవిచారమువలన నేమి ప్రయోజనము ? ఏది యెట్లు కానున్నదో అట్లగును.

తుదిసారి ఆ పవిత్రమూర్తిని, ఆ యకలంకసుందరుని, చిరుమబ్బుముంగురులుమూగు వింటినుదుటివానిని సర్వదిశలే మూర్తీభవించి, సర్వకాంతులే పుంజీభవించి, వెలుగు కన్నుల వానిని, శిల్పదీక్షితుడగు ఆమనోహరు నొక్కసారి దర్శించి, అతని పాదముల కన్నులకద్దుకొని, కడసారి కడసారి చూపుచూచి, అతనికడ సెలవుపుచ్చుకొనును. తర్వాతిభారము తండ్రిది, భగవంతునిది.

ఆమె మెల్ల మెల్లగ తోటలోనికి అడుగులిడినది. పూవులు అందముల నొలుకబోసి కొనుచున్నవి. వసంత, గ్రీష్మ మధ్యస్థమగు ఆ దినములు మృదుమధురములై మత్తిలజేయుచున్నవి. కలలోవలె ఆ తోటలో చరించుచున్నదా బాల. బాలనాగితో మాటలాడదు. ఏదియో పూవు గోయును, అది బంగారుసజ్జలో వైచును.

ఇంతలో సుడిగాలివలె, గ్రహణము వీడిన సూర్యుని కాంతివలె, వేసవి సాయంకాలమున చటుక్కున తిరిగిన సముద్ర జంఝూనిలమువలె, నిధులదెరచిన రత్నములకాంతివలె నెచ్చట నుండివచ్చెనో సువర్ణశ్రీకుమారుడు హిమబిందును బిగియార కౌగిలించుకొని తన హృదయమున కదిమి వేసికొనెను.

అప్రయత్నముగ హిమబిందు చేతులాతని చుట్టివేసినవి. దివ్యసుఖభరిత గాఢ పరిష్వంగములో వారిరువురును సర్వమును మరచిపోయిరి. బాలనాగి చల్లగ నొక పూలపొదరింటి మాటున నిలుచుండిపోయినది. తండ్రి మాటలన్నియు మాయమైపోయినవి. హిమబిందు సువర్ణుని అమృత చుంబనములకు ప్రతియిచ్చినది. ఆ పవిత్రక్షణ మొక విశ్వమే అయినది. ఇంతలో ఆ మధురాతి మధుర వైవశ్యమునుండి ఆమెకు మెలకువ వచ్చినది. ఆమె చటుక్కున అతని కౌగిలి సడలించుకొని, దూరముగబోయి కన్నులవెంట జలజల బాష్పబిందువులు ఒలికిపోవ నవనతవదనయై నిలిచినది, పూలసజ్జలోని పూలన్నియు నేలపై నొలికిపోయినవి.

సువర్ణశ్రీ అత్యంతాశ్చర్యమునొంది యామె గాఢవిషాదమును పరికింపుచు "ఏమిది హిమా ?" అని దగ్గరకుచేరి యామె భుజముపై చేయివైచెను. ఆ స్పర్శతో ఆమె మరల మెలకువవచ్చెను. అతని చేతులు నెమ్మదిగ భుజములనుండి తీసివేసి వెనుకకుజరిగి "ఈ జన్మమునకు ఇది తుదిసందర్శనము. ఏపాపపుణ్యవిధి బలవత్తరాదేశముననో యీ విషాదసంఘటన మన కిరువురకు సంభవించినది" అని యెలుంగురాలుపడ పలికి శోకావేగమున మాఱుమోమైనది.



"ఏమి, హిమా ? నీవు నాతో మేలమాడుచున్నావా ? నన్ను పరీక్ష చేయుచుంటివా ? సర్వభూతములు, సర్వదేవతలు సాక్షిగ చెప్పుచున్నాను. జన్మజన్మములకు నీవే నా ఆత్మేశ్వరివి. జన్మపరంపరాగతమైన మన యీ బంధము సనాతనము, నిత్యము మనకింక వియోగ మెట్లు ? ఆత్మాంబుజతరణివి, సౌందర్యాధిదేవతవు, శిల్పరాజ్యగమ్యవు, నా దేహమనఃప్రాణములకు ఏడుగడవు. నాకు నీవు ఒక్కతెవు—"

ఇంతలో బాలనాగి వారిని దరిజేరి "అయ్యవారూ, అమ్మాయిగారితో చారుగుప్తుల వారు "నిన్న శ్రీకృష్ణశాతవాహనమహారాజునకు పట్టమహిషిగా నొసగ దలచినానని జైత్రయాత్రకు వెడలిపోవుముందు చెప్పి ప్రయాణమైపోయినారు. మీరు చిన్నలయ్యు గుణముల పెద్దవారు. ఈ యమ్మ తండ్రిచాటు బిడ్డ! మీరు తొందరపడక ధైర్యముగానుండుడు. రేపేమగునో మనకు తెలియదు. ఈ కష్టము లిట్లే యుండవు. మీ రిరువురు సమ్మేళించుకొనవలెనుగాని సాహసము తలపెట్టకుడు" అనుచుండ హిమబిందు తటాలున తన చేతిలోని పూలసజ్జ గైకొని "బాలనాగీ ! ఇంచుక నిలువవే, నా మనోనాథుని కడసారి పూజింతును. ఈ జన్మమునకు నాకిదియే చరితార్థత" అనుచు నా పూవులతో సువర్ణశ్రీ పాదములు పూజించెను. అందు రెండుపూలు కనుల కద్దుకొని కీల్గంటున తురిమికొనెను.

సువర్ణశ్రీ అట్లే మ్రాన్పడి నిలిచియుండెను. హిమబిందు చూపులతో ననుజ్ఞవేడి, బాలనాగీసహితయై గృహాభిముఖియై అల్లనల్లన నేగెను.

అతని కొడలు తెలియునప్పటికి ప్రొద్దు పడమర తిరిగినది. శూన్యవిలోకనముల నా వనమెల్ల నెవరికొఱకో వెదకుచు నాతడు అచ్చోటు కదలి యేగెను.



# వింశతి ప్రకరణము

## ఆనందులవారు

హిమబిందు ఎట్లు చేరినదో తన మందిరము. బాలనాగి ఆమెను ఎత్తుకొని నడచినది. చెలులందరా విషయము తెలిసి పరుగిడి వచ్చినారు. ఆమెను పూవులప్రోవునుబలె ఎత్తుకొని శయనమందిరమును జేర్చి తల్పమున పరుండబెట్టిరి. వికారములేమియు లేకపోయినను ఆ బాలిక చైతన్యరహితయై పడియున్నది.

వార్త అందినవెంటనే ఆనందులవారు తేరెక్కి పది నిమేషములలో వాలినారు. ఈలోన బాలనాగియు, ముక్తావళిదేవియు పన్నీరముతో హిమబిందు నుదుటిని తడుపుచు చేయుచుండిరి. ఆనందులవారు సెలవిచ్చియున్న ఇతర ఉపచారముల జేయుచు నేయుండిరి.

ఇటుల జరుగునని ఆనందులవారికి తెలియును. ఆ బాలిక జీవితములో ప్రణయాధ్యాయము ప్రారంభించినదని ఆమె నాడిని పరీక్షించిన మొదటి నిమేషముననే ఆయన గ్రహించినాడు. తానామెను మహారాణిని జేయ నిశ్చయించితినని చారుగుప్తుడాయనను జెప్పియుండెను. శ్రీకృష్ణశాతవాహనుడు ఈ వణిక్సార్వభౌముని జామాతయగును. ఆ బాలకుడు సుందరమూర్తి, ధీరోదాత్తుడు. అట్టి యువకుని ఈ బాల ఏల ప్రేమించలేదు. ఆడవారి చిత్తవృత్తులన్నియు గూఢాతిగూఢములు, చిత్రాతివిచిత్రములు.

ఆయన వచ్చియు రాగానే మంజూషనుండి స్ఫాటికకరండిక తీసి, యందుండి చిటికెడు నస్యమొకింత తీసి, దాని నామె నాసికారంధ్రములకడ నుంచెను. ఆ గాలి లోనికిబోయి, వెంటనే పెద్దపెట్టున తుమ్మును తెప్పించినది. హిమబిందు లేచి కూర్చుండినది.

"ఏమిది బాబయ్యగారూ ?"

"ఏమియులేదు తల్లీ ! బాలనాగీ ! అత్తగారూ ! మీరందరావలికిపొండు."

అందరును వెడలిపోయినారు. ఆనందులవారు, తమ మంజూష సర్దివేయుచు, అలవోకగా నడిగినట్లు "తల్లీ! ఆ బాలకుడు ఏమనినాడు. అతడు ఎక్కడికైన పోవలసివచ్చినదా ?" యని ప్రశ్నించెను.

హిమబిందున కానందులవారి ఉద్దేశమప్పుడే అవగతమైపోయినది. ఆమె నీరసపు చిరునవ్వు మోమున ప్రసరింప "బాబయ్యగారూ ! మీదియంతయు ఒక చిత్రము. ఏదియో తల



తిరిగినది, పడిపోయినాను. నాయనగారు వెళ్ళివారన్న దిగులింకను నన్ను వదలలేదు. రెండు మూడు రోజులలో భయము తీరిపోవును" అని బదులు పలికినది.

"ఓసి వెఱ్ఱితల్లీ ! ఎవరిదగ్గరనైనను దాగునుగాని నీ రహస్యములు నాకడ దాగవు. నీ నాడి ప్రణయనాడి. అదియుగాక, నీ చిత్తవృత్తి తెలిసికొనుట వైద్యునకు ముఖ్యావసరము. బాలనాగి నీకు అంతరంగిక సేవకురాలు. ఆమె మాత్రము వినును, నీ బాధకు శ్రుతిగ ఆమెయు బాధపడును. ఆమె నీకు సహాయమేమి చేయగలదు ? నేను ఒక్క వైద్యుడనేనా ? నీ విషయమంతయు నీ తండ్రికి తెలియదేమోకాని, నేను నీ వింతయున్నప్పటినుండియు సంపూర్ణముగ నెరుగుదును. హిమా ! నీవు ప్రేమించు బాలుడెవ్వరు. అతడు నిన్ను తిరిగి ప్రేమించుచున్నాడని నీలోన ప్రతి యణువు స్పందించుచున్నదా ? నీవు శ్రీకృష్ణశాతవాహనుని ప్రేమించుట లేదని నేను స్పష్టముగ చెప్పగలను. నీవు వేరొక బాలకుని గాఢముగ ప్రేమించుచున్నావు. ఉట్టి ప్రేమయే కాదుతల్లీ, ఆబాలుని నీవు నీ ఆత్మనాధునిగ, ప్రత్యక్షదైవముగ పూజ సేయుచున్నావు. కాబట్టి నాకా బాలుడెవరో చెప్పుము. నాకెవరైన నిజము చెప్పవచ్చును. వారు చెప్పుటఏల. నీవేల చెప్పరాదు ?"

హిమబిందు ఎంతయో సిగ్గుపడినది. వెలవెలబోవు నామె మోము మధురకాంతులచే వెలిగిపోయినది. దరహాసము లామె యధరోష్ఠాంచలముల కాశీరత్న మసుములవలె నృత్యములాడినవి.

"బాబయ్యగారూ ! ధర్మ...నం...దు...ల..."

"ధర్మనందులవారి అబ్బాయి సువర్ణుడా ? ఈ జంబూద్వీపమునందట్టి అందకాడు లేడని నా మతము. మహాశిల్పి. ధర్మనందిని మరపించును. తల్లీ ! ప్రస్తుతము మనమున నెట్టి యాలోచన లుంచుకొనకుము. భగవంతునిపై భారమువైచి నిశ్చింతగా నుండుము. నీకు వచ్చిన భయములేదు. నేను నీ పక్షమున ఉన్నాను. భగవత్సంకల్పమెటులున్న నటులగును" అని చెప్పి, ఆనందులవారు ఏదో రసాయనమును మాత్రలుకట్టి యామెకు అపస్మారహారకముగా, చిత్తశాంతికి, నరముల పుష్టికిని ఇచ్చెను.

హిమబిందునకు కావలసినది మందులుకాదు. ఆమెకోరిక నెరవేరుటయే ! అదియే అమృతమామెకు. చారుగుప్తునికోరిక అవిఘ్నమైనది. అతడు కొన్ని సంవత్సరములాలోచించి

ఈ నిర్ణయమునకు వచ్చియుండును. అందుకు మొక్కవోని ప్రయత్నములెన్నియో చేసియుండును. ఆమెలో యుగంధరశక్తియు, చాణుక్యప్రతిజ్ఞయు రెండును ఉన్నవి. యౌగంధరాయణుడు ఆమెనికడ పాఠములు నేర్వవలయు.

తానును, చారుగుప్తుడును, ధర్మనందియు, వినీతమతియు చిన్ననాటనుండియు ఎంతో స్నేహమున మెలంగెడివారు. చారుగుప్తుడును, ధర్మనందియు వియ్యమందుట లక్ష్మీసరస్వతులేకమగుటయే! అయిన లక్ష్మిని రాజ్యలక్ష్మినిచేయ ప్రతిజ్ఞ బూనుకొన్న చారుగుప్తుని మనస్సెవరు త్రిప్పగలరు?

అది యటులుండ ఈ బాలిక మహారాణి కానెంచక, ఇంత వెఱ్ఱియై యీ పేదశిల్పిని వాంఛించినదేమి? విచిత్రమా, నీవ స్త్రీజాతివి! ఈ పరిణామ మెట్లు సంభవించినది? ఇది దైవఘటన! అందుకు చారుగుప్తుడేమి, శ్రీముఖశాతవాహనుడేమి, ఎవరు ఆ దైవఘటనను ఎదురేగగలరు? ఈ బాలికను ప్రజ్ఞాదేవి లీలాపద్మమువలె కాపాడవలయు. విధి విధానమెట్లున్న నట్లగును.

అని ఆలోచించుచుండగనే హిమబిందు "బాబయ్యగారూ! నేను మీ ఇంటికివచ్చి పది దినములపాటుందును. మీ అమ్మాయి నాగనిక మొన్న మా ఇంటికి పేరంటమునకు వచ్చినప్పుడు తనతో నాలుగునాళ్ళుండమని మరియు మరియు వేడికొనినది. అది కాపురమునకు వెళ్ళినతరువాత ఇప్పుడేకదా పుట్టింటికి వచ్చుట. త్వరలో చక్కని పాప నెత్తికొనును. బాబయ్యగారూ నాగనికకు అంత దూరసంబంధము చేసినారేమండీ?" అని యడిగినది.

"తల్లీ, అతడు చోళమాండలికునితో ఇక్కడకు వచ్చినాడు. కాంచీపురవాసి. ఉత్తమ బ్రాహ్మణవంశమువాడు. వారి ముత్తాతవారు శ్రీకాకుళమునుండి కాంచీపురము వలసపోయి అచ్చట ఆయుర్వేదాశ్రమము నిర్మాణమొనర్చినారు. ప్రసిద్ధవైద్యులు. అశ్వినీదేవతలిరువు రొకరై జన్మించిన మహాశక్తిసంపన్నులు. వారు వెళ్ళినవెనుక ఈ బాలుని తండ్రి ఇతడింకను శిశువుగనున్నప్పుడు అడవులకు ఓషధులకై పోయినప్పు డున్మదదంతావళమొకటి ఆయనను మడియించినది. అందుకనియె మా ఇంటికాతడు శిష్యుడై వచ్చినాడు. అతని నాగనిక ప్రేమించినది, నాగనిక నాతడు ప్రేమించినాడు."

"నాగనిక నిజము మాకెవ్వరికి చెప్పినదికాదు. మా బావగారు వచ్చినారా? బాబయ్యగారూ?"



"రాలేదు. వేసవికాలము వెళ్ళినవెనుక వచ్చునట. ఇక్కడ ఎండ లెక్కువగాదా తల్లీ, ముక్తావళీదేవి అత్తగారును, నీవును రేపు ఉదయము మంచిది, అప్పుడు రండి. ఈ సాయంకాలము నాగనికయు, మీ పిన్నియు నిక్కడకు వచ్చెదరులే."

ఆనందులవారు వెడలిపోయినారు. ఆ నాడాంధ్ర మహాసామ్రాజ్యమునందు ఆయుర్వేదము మహోచ్ఛ్రదశయందుండెను. త్రాచుపాముకాటు నందినవానిగూడ వైద్యముచే బ్రతికించుట ఆనాటి వెజ్జులకు మంచినీళ్ళప్రాయము.

ఆనందులవారు అఖండకీర్తిగడించిన మహావైద్యులు. ఆయన ఎట్టి వ్రణములైన శస్త్రచికిత్సచే మాన్పగలరు. ఎముకలు కట్టగలరు. ఎముకలనైన శస్త్రచికిత్సచే బాగుచేయగలరు. మెదడుకూడ శస్త్రచికిత్స చేయగలరు. ఆయన కుదర్చలేని వ్యాధిలేదు. ఆయన ప్రాణము పోయలేరు. అది చేయగలిగినది ఒక్క భగవంతుడేకదా!



# ఏకవింశతి ప్రకరణము

## ప్రణయభంగము

సువర్ణశ్రీకుమారుడు శిథిలచిత్తుడై చుక్కాని లేని నావవలె తిరిగినాడు, అతనికి మతి లేదు. అతడేమి చేయవలెను? బాలికలవలె కన్నులనీరు సంతతధారగా ప్రవహింప, ప్రవహింప, ఆ ధారలతో శోషించి ప్రాణాలు ప్రవహించిపోవునందాక కృశించుట ధీరస్వభావము గాదు. వెడనవ్వులతో, వెర్రివెర్రి మాటలతో, దిసమొలలతో, చెదరిన జుట్టుతో, అస్థిమిత హృదయముతో నున్మత్తుడగుట లఘుమనస్కునికి చెల్లును. ఆశాభంగముచే రౌద్రమూర్తియై, విలయావతారుడగుట కాతడు సాత్వికుడు.

పవడములై, మసృణములగు అతని కేలిగ్రోళ్ళు పల్లవకోమలములగు పాణికముల కూర్గముష్టులచే గాయము లొనరించినవి. ముత్యములై, సొబగునవ్వుల పూలమొగ్గలై, చంద్రకిరణముల సైదోడులగు అతని దంతములు జపారుణము కిసలయకోమలమునగు వాతెఱను నెత్తురులరల జేసినవి. బోనున పెట్టిన అరణ్యమృగమువలె ఆతడిటునటు తిరుగాడజొచ్చినాడు.

సైన్యములు బయలుదేరిపోయినవి. భేరీభాంకారములతో నీసరికి గౌతమిని చేరియుండును. ఆ సేనలవెంటబోయి భగ్నము, శూన్యమునగు హృదయమును వీరరసమగ్న మొనర్పవలయునని కోర్కె ఆతనికి బొడమినది.

సువర్ణశ్రీ గంభీరుడు. అతని హృదయము ప్రేమరసపూర్ణమయ్యును, హావభావములను వ్యక్తముకానీయదు. అతడు హితమితభాషి. ఎన్నడైన ప్రియులతో సుకుమారముగ మేలమాడును. చిన్ని చెల్లెండ్రతో మాత్రము అరమరలేక చరించును. అతని నెయ్యమునకు, దియ్యమునకు చెల్లెండ్రే ఆలంబనములు. గురువులయెడ వినీతుడు. తన వృషభములు శిల్పపుంబనిముట్లే అతని లోకము. రసభావవశంవదుడై తద్రూపసిద్ధికై తన్మయత్వమున దిరుగు నా భావుకునకు నేడీ సంకటము గలిగినది.

బొమ్మలపై మనసుపోదు. వృషభశాలలకు పోయి తాను పెంచు చిన్నగిత్తలను, కోడె దూడలను గదిసి, వానికలతో దలవాని, దుఃఖభారమును వానికి గొంత పంచిపెట్టబోవును.



చెమ్మగిలిన కనులతో నవి యాతనిదెస గాంచి యూరకొన్నవి. శిల్పమందిరమునకేగి ఉపాస్యమగు దేవీమూర్తికడ ప్రణమిల్లి, చేతులు మొగిచి, "దేవీ! అనుగ్రహించినదాన వింతలో మాఱుమోమిడితివేమి? ప్రసన్నవై, కరావలంబనమిడవా?" అని వేడికొన్నాడు. "నీ సేవ మఱచెదనని తలచితివా? ఏపని చేసినను నీసేవయే అనుకొన్నాను. సర్వకర్మములను నీ సౌందర్యముతో నింపవలయుననుకొంటిని. సమస్తమున నిన్ను, నీయందు సమస్తమును జూతు ననుకొంటిని. నీవింతలో ఈసుచెంది, ఆగ్రహింతువనుకోలేదు. నా ప్రేమభావమున కలదితివని పొంగిపోవుచుండ నింతలో క్రుంగదీసితివేమి? కానిమ్ము, దుఃఖమమాత్రము నాకెందుకు మార్గముకాదో చూచెదను. విరహాగ్ని పుటపాకమున నీ కింకను వన్నెలు దిద్దుదును. నీ యగాధ సౌందర్యతలములు స్పృశించుట కిదియే మార్గమేమో."

శక్తిమతీదేవి కుమారుని మార్పు చూచినది. అతడు పరధ్యానమున నుండుట, వాడిన మోము, యెఱ్ఱవారిన కన్నుకొలకులునై, భోజనమునందభీష్టము లేకుండుట గమనించినది. విద్యావంతురాలును, సాధుశీలయు, నిండుంగుండయునగు నామె అతడు హిమబిందును ప్రేమించుచున్న విషయము ఎరుగను. హిమబిందు తన యింటికి వచ్చినప్పుడు తనయందెంత సౌహార్దము చూపినది! చనువుమై, ప్రియమార సంచరించినది. సువర్ణ, ఆమెయు కలిసికొని స్నేహమున మాట్లాడిరనియు, దృఢానురాగ పాశబద్ధులైరనియు నాగబంధునిక చెప్పినది. ఇప్పుడు వీనికి మరల నీ విచారమేమిటి? కృశించిపోవుచున్నాడు బిడ్డ. ఆమె నాగబంధునికను ప్రశ్నించినది.

శక్తి:— సువర్ణ మనస్సు బాధుచేసుకొనుచున్నాడేమిటి తల్లీ!

నాగ:— నాకూ తెలియదు. అడిగిన మాట్లాడడు. ఏదియో పనివంకనన్న ఎక్కడికో పోవుచుండును. ఒక చిత్రము లిఖింపలేదు, శిల్పశాలకు పోవలేదు.

శక్తి:— మహాలిని పిలు.

నాగబంధునిక మహాలిని కొనివచ్చెను.

శక్తి:— బాలనాగితో మాట్లాడినావా మహాలీ?

మహా:— మాటాడినానమ్మా, సువర్ణశ్రీకుమారుడే హిమబిందుకు ప్రాణమట. అతడు లేనిదే జీవింపలేనంత స్థితికి వచ్చినదట. వారు తోటలో కృష్ణాతీరాన కలిసినారట. తండ్రి ఏదియో ఆదేశము నిచ్చినారట. గుండె పగుల్యలగునట్లు విచారమునమునిగి మూర్ఛబోయిన

దట. అతికష్టముమీద మరల సువర్ణుని తుదిసారి కలిసికొన్నదట. అది మొదలు భగ్న హృదయముతో పడియున్నదట.

శక్తి:—ఏమది! ఈ విచిత్ర సంఘటన ఏమైయుండును?

మహాలి:—ఏమోనమ్మా! చారుదత్తులవారి ఆనతి మీ అభీష్టానికి తీరని ప్రతిబింబమైనదని బాలనాగి అంటుంది. హిమబిందు తండ్రికి వ్యతిరేకముగా సంచరింపనిష్టములేక బెంగపెట్టుకొని కృశించుచున్నదనియు చెప్పినది.

నాగ:—హిమబిందు తండ్రిమాట జవదాటదు. మరి అన్నయ్యగతి ఏమగునో! నన్నుగూడ మొగమెత్తి చూడదు. చెల్లాయి చెంతకువెళ్ళితే చేరదీసి పలకరించదు. అదికూడా బెంగపెట్టుకున్నది.

శక్తి:—భయపడకు పిచ్చితల్లీ! అంతటికి బుద్ధదేవుడే కలడు.





# ద్వావింశతి ప్రకరణము

## శ్రీకాకుళ ప్రయాణము

శిల్పులు పిచ్చివారు. ఏదో ఆశయమనుకొని, ఆ ఆశయస్వరూపిణి ప్రత్యక్షముకాక హృదయవేదనపడి,

ఏచోటనున్నావో?
ఏవీటనున్నావో?
నీవెలుగు ధ్యానించి నిలువెల్ల కరిగితిని.
నా హృదయమున వెలుగు
ఊహదాటినమూర్తి
ఎన్ని జన్మలుగడచె, ఎన్ని యుగములునడిచె
నెత్తికాదేనీవు
వెలసితివి నేడనుట
ఆశయసాఫల్య మబ్బినది యేనాట?
సాధనయె నావంతు, సిద్ధితనయదికాదు;
సిద్ధులెవ్వారో?
ఆసిద్ధి ఎట్టిదో!

అని పాడుకొని, తపస్సుచేసి, యోగాసనుడై, సమాధిస్థితి నందినను, ఆ ఆశయము ఎప్పుడును లభ్యముకాదు. లభ్యమైనట్లు మరుమరీచికా భ్రమకలుగునొకప్పుడు. అదియు వెంటనే ముందుకు సాగినకొలది మాయయని వ్యక్తమగును.

ప్రేమభంగము సాధారణమానవులకు ఉత్తమగురువు. అందు రసస్వరూపులు, శారదామూర్తులగు కావ్య, శిల్ప, చిత్ర, గాంధర్వోపాసకులకు మహోత్తమగురువు. హిమబిందునకు ప్రేమ బాల్యమువీడిన యౌవనదశాపరిణతిమాత్రము. అది మరల సరికూర్పరాని భగ్నతనొందినది అనుచు నాతని హృదయపథమున తోచగనె ఒక్కసారిగ నాతని బాల్యమంతయు వీడి, విడిచిన వస్త్రమువలె క్రిందికి జారిపడిపోయినది. ఆతడిప్పుడు ప్రపంచము నెదుర్కొను మనుష్యుడైనాడు.

హిమబిందు తనదికాదు. మనము ప్రేమించిన ప్రాణి మనది యేలకావలయును ? ప్రేమ యింత స్వార్థతాకలుషితమేమి ! తాను ప్రేమించి ప్రేమమయుడగుట చాలదా ? ప్రేమకు ఇంతకుమించిన సిద్ధి యేలకావలయుదు ? నాగబంధునిక, సిద్ధార్థినిక తన కూరిమి చెల్లెండ్రు. చెల్లెండ్రనుండి తానేమి ప్రతిఫలము గోరును ? అన్నా ! యని నోరార వారు పిలుచుట చాలదా ? రేపు తన చెల్లెండ్రకు పెండ్లియగును. వారు భర్తృగృహముల కేగుదురు. అందులకు దన యాభ్యంతరమేమి ? తనకు బాధ యెందులకు ? తమ యన్నాసెల్లెండ్ర ప్రీతి కందువలన గొఱంతగలుగునా ?

హిమబిందు శ్రీకృష్ణశాతవాహనమహారాజునకు దేవేరియగును. ఆంధ్రసామ్రాజ్య సింహాపీఠ మధిష్ఠించును. తనకు సామ్రాజ్ఞియగును. తా నా రాణికి భృత్యుడు, సేవకుడు, నమ్మినబంటు నగును. ఆదేవి తన సేవలందుకొనును. తన్ననుగ్రహించును. ఇంతకంటె దనకేమి కావలయును ?

ఆంధ్రసామ్రాజ్ఞిని దాను శిల్పించును. కర్త్రి చెబూని, ఆంధ్రసామ్రాజ్యము వినరిల్ల జేసి ఆ దేవి పాదములచెంత దాను కానుకపెట్టును. "సువర్ణా ! నీ ప్రేమ కింతకంటె నేమి కావలయును ? " నేను రసభావప్రబోధితుడనై, రసపరతంత్రుడనైనపుడు సృష్టి యేల సేయవలయును ? నాలో నేను ఆనందించి తృప్తి చెందరాదా ? అట్లుకాదు. నా రసభావ మూర్తిని నేను చూచుకొని, నాధియని చెప్పికొని, మురిసిపోవలెను. ఎందరో శిల్పులు రచించిన శిల్పములుగాంచి నే నానందింతును. కాని నాకంతటితో తృప్తిలేదు. నా యానందమును, నా శిల్పమును జూచుకొనవలయును. నా ప్రేమమును నా సంతానమున బహిర్వ్యక్తము జేసికొనవలెను.

" ప్రేమయే ఆనందము. ఆనందమే ప్రేమ. ప్రేమకు బరిపూర్ణత దాంపత్యమునందే సిద్ధించును. ఆనందమే సృష్టికి గారణమగునేని ప్రేమకంటె సృష్టికర్త మఱియెవరు ? నా శిల్పసృష్టి సృష్టియేకాదు. నాకు సాధనములైన శిలలు, వర్ణములు, టంకములు, శబ్దార్థములు నావి కావు. వానిని నావిగా నెంతమ్రలచుకొన్నను వాని స్వభావము మాఱదు. వానిలో నా యానందచ్ఛాయలుమాత్రమే కనిపించునుగాని నేను గానుపించను.

" ప్రేమానుగృహీతుడ నగుదునేని నేను నిజముగా సృష్టికర్తనగుదును. భావైక్యత యైక్యతగాదు. మఱియొక శరీరముతో, ప్రాణముతో, మనస్సుతో నే నైక్యత సంపాదించవలెను. ఆ యైక్యతాకాశమున మా యిరువురి వ్యక్తులు లీనమై ఆనందమున గరగిపోవలెను.



ఆ యానందఫలమే సృష్టి. సువర్ణా ! నీ వా భాగ్యమునకు నోచుకొనలేదు. పరమపవిత్రము, అత్యుదారము, సర్వోత్తమమగు మాధుర్యభావము నీకు దూరమైనది !

" మనోవాక్కులచే నాతో నైక్యమందిన దేవిని నేను విడనాడుటెట్లు ? వెఱ్ఱివాడా ! సువర్ణా ! విడుచుటకు, విడువకుండుటకు నీ వెవడవు ? ఆ దేవి పరమానుగ్రహమెట్లున్నదో !

" నిజము, దేవీ ! మహారాజ దేవేరియగుటయే నీ కభిమతమేని, పిత్రాజ్ఞానువర్తనమే నీకు శాంతినిడునేని నీ శాంతిసౌఖ్యమునకు నే నడ్డమురాను. నిన్ను శిల్పించికొని, సేవించుకొని, నీ కటాక్షవేశమున కర్హుడనగుదునేని నాకదియే స్వర్గము. నా సన్నిధానము, నా సామీప్యము, నా సేవ—నీ శాంతికి భంగముగూర్చునేని నా కదియును వలదు. దేవీ ! ఆజ్ఞాపింపుము. ఏ మారుమూలలనో తల దాచుకొందును. నీ యెదుట బడను. నీ వీక్షణచంద్రాతపము జొరరాని చీకటిగుహాలలో వసింతును. నా కల్పాపీఠమునన్న నీ మూర్తియే నాకు జాలును. నా దేవికి మందిరమగు నా మనోగుహాలోన నేనును వసింతును. నా కా యేకాంతము చాలును. అచటి నా దేవి నాది ! "

ఇట్లు మనోరథప్రవాహముల మునిగి తేలుచుండ శక్తిమతి కుమారునికడకుబోయి " నాయనా ! అన్నముతినుట మానినావు. ఏమిటి నీ హృదయమున బెంగ. మీ నాయనగారు నిన్ను తక్కినవిద్యార్థులకు సహాయము చేయుమని ఆజ్ఞ ఇచ్చినారు. శిల్పగృహముల సమీపమునకే వెడలవు. శూన్యహృదయుడవై ఆటుల పండుకొనియుందువు. ఎక్కడకును వెడలవు. ఆనందులవారికి వార్తనంపెదనన్న వలదందువు. కళ్ళు గుంటలుపడినవి. ఇంకను ముక్కుపచ్చలారని చిన్నవాడవు. ఎందుకుబాబూ ! నీకింతబాధ ? నా మాటవిని నాలుగుదినములు కాకుళము చిన్నమామయ్యగారి ఇంటికి పోయి రాకూడదు ! సముద్రపుగాలి నీకు పడును. మీ పిన్ని కంటకశాలకు రమ్మని ఎన్నిసారులో పిలువనంపింది. మా పిన్నికొడుకు ' ఒక నెల దినములు అన్నవచ్చి కంటకశాలలో ఉండకూడదా ? నాకు కొన్ని శిల్పమర్మములు చెప్ప కూడదా ' అని కమ్మ వ్రాసినాడుకద అక్కడకుపొమ్ము. నీవట్లు బెంగపెట్టుకొని కూర్చుండుటవలన నాకు మతిపోవుచున్నది. విశ్వబ్రహ్మ వరప్రసాదివలె నీవొక్కడవు నా కడుపున పుట్టితివి. నీ స్థితినిజూచి నాకు ఏడుపువచ్చుచున్నదిరా బాబూ ! " అని అన్నది.

" నాకు ఒంట్లో ఏమీ జబ్బులేదు. నాకు బెంగలేదు. ఎందుకు నీవు దిగులుపడతావు అమ్మా ! "

" నాకు అన్నియు తెలియవచ్చినవిరా బాబూ ! అట్టి విషయములన్నియు ఆ భగవానుని ఇచ్చచొప్పున జరుగును. సుఖములు, దుఃఖములుకూడ మనలను పరీక్షించుటకే

వచ్చును. ఈ జగమే దుఃఖము, ఈ జన్మ దుఃఖము, అందు జరుగు సంఘటనలన్నియు దుఃఖములుకావా ! నాన్నా ఈ కామదేవుని పరీక్షలో నెగ్గినవాడే నిజమగు భక్తుడు. నీవు తప్పక శ్రీకాకులమునకు పొమ్ము."

"సిద్ధార్థిని తీసికొనిపోయెదను."

"సరే, అది మంచి ప్రయాణమగును. అన్నగారిమీద ఈగ వాలనీయదు. నిన్ను గురించి అక్కచెల్లెండ్రిరువురు ఒక్కటే వాదన. మంచిముహూర్తముచూచి బయలుదేరి వెళ్ళండి బాబూ !"

మరునాడు సువర్ణశ్రీ చెల్లెలు సిద్ధార్థికను తోడ్కొని, శకటమునెక్కి ధాన్యకటకము నుండి రాజమార్గమున ప్రయాణము సాగించెను. ఆ బండికి నాలుగు ఎద్దులు కట్టినారు. అది చిన్నగదియంత యుండెను. ఆ బండిగూటికి వాతాయనములున్నవి. ఆ బండిలో కూర్చుండుటకు తూలికాసనములున్నవి. పండుకొనుటకు ఈవలావల పరుపులున్నవి. మధ్య పెద్ద కరండములలో పళ్ళు, శక్తిమతీదేవి స్వయముగ చేసిన తినుబండారములున్నవి.

బండివెనుక రెండుజతల ఎడ్లు, ఇరువురు గోపకులుకూడ బయలుదేరిరి. ఎడ్లకువలగు జనుము, జొన్నచొప్ప, కందిపొట్టు, ఉలవలు, తిలపిష్టము మొదలైనవి బండి అడుగుననున్న యరలలో నుంచిరి.

ఆ ఉదయము ధాన్యకటకమున బయలుదేరి రెండవయామము సగము జరుగునప్పటికి బండి నాగగ్రామము వచ్చినది. అచ్చట వారు సత్రమున దిగిరి. సువర్ణుడు సన్నబియ్యము అన్నము వండెను. కూడ కొనివచ్చిన కాకరకాయలతో కూర వండెను. కూడవచ్చిన బుద్ధగోపుడు గ్రామములోనికిపోయి కత్తికితెగని పెరుగు పట్టుకొనివచ్చెను ఈలోన గోపకులకు చిత్రగోపుడు వంటచేసెను. సువర్ణశ్రీవచ్చి పులుసుచేసెను. ఉప్పును, మిరియములపొడిని వేసి సుగంధపుపొడిని జల్లిన ఆ పులుసు సిద్ధార్థినికకు, గోపకులకు అమృతోపమానమైయుండెను. తల్లి ఇచ్చిన పచ్చడులను వేసికొనిరి.

భోజనములైనవెనుక ఎండ మిక్కుటముగ నుండుటచే వారందరా సత్రమున సాయంకాలమువరకు విశ్రాంతితీసుకొని, గాలి తిరిగి చల్లపడగనె, ప్రొద్దు మూడు గడియలున్నదనగ ప్రయాణమును మరల సాగించిరి. అక్కడనుండి రాత్రిజాము ప్రొద్దుపోకుండగనే పాటలపురము [గుంటూరుకడ చేబ్రోలు] చేరినారు. ఆ రాత్రి అక్కడ విశ్రమించి, ఉషఃకాలముననే బయలుదేరి మధ్యాహ్నభోజనమునకు ధనదుపురము చేరినారు.



ధనదుపురము చేరునప్పటికి సముద్రపుగాలి ఎత్తివేయుచుండెను.

ఆ మలయమారుతములు సువర్ణశ్రీకుమారునికి హృదయవేదన మరింత ఇనుమడింపజేసినవి. అచ్చట దగ్గరచుట్టములు చాలమంది యుండుటచే సువర్ణశ్రీయు, సిద్ధార్థినికయు ఆ మహానగరమందు మూడురోజులుండిరి.

ధనదుపురము [చందవోలు] ఇక్ష్వాకుల మండలమునందున్నది. గొప్ప వర్తకకేంద్రము. అనేకులు కోటీశ్వరులక్కడున్నారు. అచ్చట రెండు ఇంద్రాలయములు, ఒక మహేశ్వర సర్వతోభద్రాలయమున్నవి. అవి యన్నియు సువర్ణశ్రీ చూచినాడు.

ధనదుపురమునుండి ఇక్ష్వాకుల రాజధానియగు ప్రతీపాలపురము [భట్టిప్రోలు] చేరినారు. ఇచ్చట నొక మహాచైత్యమున్నది. ఆ చైత్యమునకు పూజలునలిపి, సాయంకాలమునకు కృష్ణదాటి ప్రయాణించి శ్రీకాకుళపురము వారు జేరినారు.

శ్రీకాకులపురమును జేరినవెంటనే వారి అమ్మమ్మ వారిరువురకు దృష్టితీసి లోనికి తీసికొనిపోయినది. చిన్న మేనమామ ఆరితేరిన లోహకారుడు. ఆంధ్రదేశమున అంత ఉత్తమ లోహకారుడు లేడని పేరు పొందినాడు.

# త్రయోవింశతి పరిచ్ఛేదము

## సముద్రతీరము

సువర్ణశ్రీ కృష్ణానదీముఖమున సముద్రయానము సలిపి ద్వీపాంతరములనుండి కొనివచ్చిన వివిధ తరణులను, కూపకముల సరిచూచుచు, వానికిగట్టు రజ్జులు గమనించుచు, క్రొత్తవన్నె దిద్దుచు, వస్తువులతో దోనెకడుపులు నింపుకొనుచు ప్రయాణసన్నాహమునున్న నౌకలను ఎన్నింటినో గమనించెను.

శ్రీకాకుళమునందనేక దేశములనుండివచ్చు వర్తకులు, నావికులు, వీరులు, వింత చూడ వచ్చినవారు, కాపురములు చేయుచుందురు, వచ్చుచుందురు; వెళ్ళుచుందురు. ఆ మహాపట్టణమున నెన్నియో సరకులగృహములు, వర్తకశాలలున్నవి. మంచి నేతశాలలున్నవి. వలువలకు వన్నెలద్దువారి గృహములున్నవి. ఆ దినములలో " శ్రీకాకుళమునకు నిద్రలేదు, చిత్తమునకు శాంతిలేదు " అను సామెత ఆంధ్రదేశమునందు వాడుకగైనది.

ఆ పట్టణమున వినవచ్చినభాషలు కాశిలోనైన వినరావందురు. ద్రావిడము, సింహళభాష, సువర్ణాది ద్వీపముల భాషలు, మాగధి, అర్ధమాగధి, పాలి, చీనాభాష, యవన, రోమక జెండవిష్ట, తురుష్కాదిభాషలు, ప్రతి వీధియందును వినబడును.

ఆ పట్టణమునందుండు కైవర్తదాశజీవరులు సముద్రమునందవలీలగ నెంతదూరమైన నీదగలరు.

చిన్న చిన్న నావలలో, ద్రోణులలో కైవర్తులు సముద్రములోనికి వజుువాతనే వెడలి పోయి, వలలువేసి, చేపలుపట్టి సాయంకాలమునకు తిరిగివత్తురు.

సువర్ణశ్రీ అట్టి పడవలలో నొక యుదయమున బయలుదేరి సముద్రములోనికి పది గోరుతములవరకు పోయినాడు.

అలలకాద్రోణి ఇటునటు ఊగినప్పుడు మొదట సువర్ణశ్రీకి కొంచెము వికారము పెట్టినది. కాని అతడది మనోబలముచే తగ్గించుకొని, సముద్రములోనికి నిర్భయముగ వెడలిపోయెను.

ఒక ముహూర్తము గడచునప్పటికి తూరుపున ఎర్రని చిరువెలుగులు కానవైనవి. అనంతమువలె దృశ్యమైన సముద్రమును, దెసలును, ఆకాశమును. ఈ అనంత మధ్యమున తానీ చిన్నద్రోణిలో! ఎవరికివారే అనంతమధ్యస్థులే. అనంతము ప్రతిప్రాణిని చుట్టియుండును. తక్కిన ప్రాణులా అనంతమున భాగములు మాత్రము.



అనంతమున ప్రాణి ఎటుపోవుచున్నాడు ? ముందునకా, వెనుకకా ? ఈ యాత్రకు అవధిలేదు. ప్రాణము యాతనావిధినుండి తప్పికొని, సంపూర్ణ నిర్వాణానందము నందుటయే అంతమా ?

ఈ యాత్ర దుఃఖమా, ఆనందమా ? ఆనందమునకు మార్గముమాత్ర మానందముగాక, దుఃఖమెట్లగును ? దుఃఖముకూడ ఆనందమునకు వేరొకరూపమా ? వెలుగులో చీకటియున్నది. చీకటిలో వెలుగున్నది.

సూర్యునివెలుగు ఆనందమనుకొన్న, ఆ వెలుగు భాగించిన, సర్వవర్ణములు వచ్చుట విచిత్రము. ఈ సర్వవర్ణములు గిన్నెలలో కలిపి, అన్నియు మిశ్రముచేసిన నలుపువచ్చును. అవి కలుపగా కలుపగా తెలుపువచ్చును.

ఇవియన్నియు ప్రత్యక్షములు. ఈ సత్యమును గురుతించువారే మానవులు. తక్కినవారు కనులున్న గ్రుడ్డివారు.

హిమబిందు ఏల తన జీవితప్రాంగణము ప్రవేశించినది.

దినమునకు ప్రాంగణము చేరడి
ఇనుడు లాభంబేమి దినమునకు ?
అర్థమేమియులేని సంధ్యలు
అర్థమేలేనట్టి రాత్రులు
అవతరించునె ఈ జగంబునకు ?

ఈ పాట ఆతని హృదయమున ఉదయమున వికసించినపూవువలె వికసించినది. ఆతని మనస్సు ఊరటచెందినట్లు అయినది. కాని మహాఝంఝానిల మధ్యమున ఒకప్పుడు చటుక్కున శాంతి ఉదయించును. ఆ వెంటనే ఆ ప్రళయమునకు వేరొక్కముఖము ప్రత్యక్షమగును. ఆలాగుననే సువర్ణునకు ఆ చిన్ననావ ఎంతయో శాంతమును సమకూర్చినట్లున్నది.

ఇంతలో అరుణకాంతుల పెదవులతో, కమలరక్తుల కపోలములతో, దివ్యసుందరియగు ఉషస్సు ఆకాశమున సంపూర్ణముగ ప్రత్యక్షమైనది.

ఆ ఉషోబాలను సందర్శించగనె హిమబిందామె చెలియలివలె సువర్ణునకు తోచినది. ఆతని గంభీరవియోగ విషాదమున ఈ క్షణము గాఢ బాధాపూర్ణమై పోయినది. ఆ బాధ భరింపలేక ఆ సుకుమారుడు కండ్లనీరు కెరటములైపోవ బిగుసుకుపోయినాడు.

అప్పుడొక కైవర్తుడు " అదేమిటి ! ఆలాగున మీ కంటినీరు ఏటిలో గలియుచున్నదేమి బాబూ ! " అని ప్రశ్నించెను.

ఆ శిల్పి చిరునవ్వు నవ్వుచు 'ఏమియు లేదులే. ఈ అందము చూచి, ఆనందముచే కన్నులనీరు తిరిగినది.' అని ప్రతివచనమిచ్చెను.

"అవునండి బాబూ! నిత్యమూ చూచే మాకే ఈ ఉదయము చాల అందముగనున్నది."

"అటులనా! ఈ పాట వినుము!

ఆడవే! కల్యబాలా!
ఆకాశ రంగమున, అరుణయవనిక పైన
ఆడవే కల్యబాలా!
తుంబురుడు నారదుడు తోచిరే ఇరుదెసల
బంధుర సునాదములు జృంభించె తంత్రులన్
ఆడవే కల్యబాలా!
ఏ అనంతార్థములో ఏ క్షణిక భావములో
నీ అంగ హారముల నృత్యాభినయములగు
ఆడవే కల్యబాలా!
వచ్చితివి, ఇంతలో చొచ్చితివి నా బ్రతుకు
మెచ్చుచుండగ గచ్చు విచ్చొదువే బళీ!
ఆడవే కల్యబాలా!"

"పాట చాలా బాగున్నది. మీరన్నట్లు ఈ తళుకులంతలో వెలిసిపోతవి బాబయ్యా!"

"అడుగో సూర్యభగవానుడు. కలలు కల్లలు చేసే దైవము."

"నిజం బాబుగారూ! మాకేమి తెలుస్తుంది?"

ప్రేమయు అంతక్షణికమా? ఈ బాధమాత్రము నిత్యమా? కాదు. ప్రేమయే ఈ బాధగా నిలిచినది. కనుకనే యీబాధ యింత మధురము.

వారి పడవ ఇంకను సాగిపోయినది.

అంతులేని పడవయాత్ర
చింతలేని బ్రతుకెటులగు?

ఆ కల్లోలములలో, ఆ తెరచాప పొంగులో, ఎఱుకవిడక నావ నడుపుకొనుచు, మిలమిలలాడు చేపలను వలవైచి పట్టుకొను ఈ బెస్తలే నిజమగు తత్వజ్ఞులని సువర్ణశ్రీ యను కొనినాడు.

సాయంకాలమునకు డ్రోణి తిరిగి సముద్రతీరము చేరినది.



# చతుర్వింశతి ప్రకరణము

## పరివర్తనము

విషబాలయు, స్థాలతిష్యుడును, తక్కినవారు ధాన్యకటకమునుండి ప్రతిష్ఠాననగరమునకు బోకముందు ఒక విషయము జరిగినది. ఆశ్రమమునకు కృష్ణాతీరమునందున్న కుడ్యము ప్రక్క ఒక చిన్న తోటయున్నది. ఆ చిన్నతోట ఒక కర్షకునిది. అందాతడు నగరమునకై కాయగూరలు పండించుచుండును.

ఆంధ్రదేశమునందీ దినములలో నేమిపంటలు పండించుచుండిరో ఆనాడును ఆపంటలే ఈనాటి వ్యవసాయవిధానములనే పండించుచుండిరి. కృష్ణవేణ్ణా గౌతమీనదుల మధ్యనున్న శాలిభూములు, ఈవలావలనున్న భూములు, వరి, జొన్న మొదలగు పంటలచే నిండియుండెను, సెనగలు, పెసలు, కందులు, మినుములు, నువ్వులు, ఆవాలు, ధనియములు, మిరియములు. ప్రత్తి, గోధుమలు, అలచందలు, కొఱ్ఱలు, అవిసెలు, యవలు, చెఱుకు విరివిగ పండుచుండును. మనుష్యుడు కృషిచేయు భూములేగాక దేవభూములనునవి కలవి. అందు విత్తులునాటుట తరువాయిగ ధాన్యము విరివిగ నివర్తమునకు రెండు మూడు ద్రోణములు [పుట్లు] పండెడివి.

ఆంధ్రదేశమునందున్న ధాన్యపుబంట జంబూద్వీపమునందెచ్చటను లేదు. అందుకనియ ఆంధ్రరాజధానికి ధాన్యకటకమని పేరు వచ్చినది. వరిచేలు కోత అగుచుండుట తడవుగ జనుము చల్లువారు. వరులు మనుష్యునిఎత్తు పెరిగెడివి. జనుమంతకన్నను విరివిగ పెరిగెడిది.

ఆంధ్రులకు కూరగాయలన్న నెంతయో ప్రేమ. అరటులు విస్తారముగ పెంచుచుండిరి. ఆంధ్రదేశమునందా దినములనున్న అరటిజాతులు మరెచ్చటనులేవు. వార్తకకి [ములగ] నాగబలము [బీర] పటోలకము [పొట్ల] శాక్వాకము [బెండ] బింబ [దొండ] వాటకము [బుడమ] దృక్షగన్ధ [బొద్ది] సోనువల్లరి [పొన్నగంటి] అంబష్టము [పులిచింత] సహాస్రవేది [పుల్లప్రబ్బలి] జీవన్తి [పాలకూర] పలాండము [నీరుల్లి] లశునము [వెల్లుల్లి] కారవేల్లము [కాకర] కులకము [చేదుపొట్ల] కూష్మాండము [గుమ్మడి] కర్కటి [దోస] తుంబి [సొర] కందగండీరము [వంగ] లంబనము [తీగబచ్చలి] ఉపోదకి [దుంపబచ్చల] మూలకము [ముల్లంగి] హిలమోచికము [చిలుకకూర] వాస్తుకము [చక్రవర్తికూర] నారికేళము, ఈ కూరలన్న

ఆంధ్రులకు ప్రాణము. ఆనాటికిని ఆంధ్రులు కర్ణికారము [గోగును] ను ప్రియమారగ భక్షించువారు. కందమూలములలో కంద, పెండలము, చామ విరివిగ తినువారు.

కృష్ణయొడ్డున ఆ తోట పెంచు రైతు చిన్నవయసువాడు. అతని తోటలో అరటిచెట్లు, పొట్లు, బీర, దొండపాదులు, అలచందజాతులలో చేరిన పెద్దచిక్కుడు పాదులు విరివిగనుండెను. ఆతోట అరనివర్తమునకు తక్కువగనె యున్నది. అతని పేరు దుర్గయ్య, దుగ్గస్వామి అనియు బిలతురు. ఆతని భార్య కాపురమునకువచ్చి కొన్ని మాసములయినది. ఆమె పేరు బాపనమ్మ బాపిశ్రి యనియు పిలుతురు. కర్షకులలోని బాలికలందరు అందకత్తియలు. అందు బాపనమ్మ మరియు నందకత్తె.

దుగ్గస్వామి ఇల్లు వారితోటలోనే యున్నది. భార్యయనిన యాతనిప్రేమ కృష్ణవేణీ పొంగులవలె గట్లుపొర్లి ప్రవహింపుచుండును.

ఒకనాడు భార్యాభర్త లిరువురు సాయంకాలము సరససల్లాపము లాడుచుండిరి. దుగ్గసామి గంభీరమైన తన కంఠమెత్తి,

అణ్ణాస ఆ ఈః రేంతీ తహసుర ఏహారిస

విహసి అ కవోలా

గోసీవి ఓణ అముహీ అహాసేత్తిపి అం

ణ సద్దధి మో [గాధాసప్తశతి] *

అని నవ్వినాడు. బాపిశ్రికి కోపమువచ్చి ఇంటిలోనికి పారిపోయినది. చీకట్లు విసవిస పైకెగబాకి వచ్చినవి. భర్త పాటపాడినట్లు ఆమెకు పవలు అమితమగు సిగ్గు. వంచిన తల ఎత్తి ఎరుగదు. భర్త ఎన్నిమాటలాడించినను మాటలాడదు. అత్తగారి మాటలకు అస్పష్టముగ ప్రతివచన మిచ్చును.

దుగ్గసామి అల్లరిపిల్లవాడు. అందకత్తియయగు తన నిల్లాలిని వదలియుండుట ఆతనికి వేదనే. ఏదేని వంకతో తనకడకు పిలుచును. ఇటునటుచూచి ఆమె బుగ్గపై ముద్దిడును. ఆమె కోపమున విదలించుకొని పారిపోవును. పగలంతయు ఆమె మూతి ముడుచుకొనియేయుండును. అతడు మరియు నామెను అల్లరిచేయును. ఆమెకు కోపము పెరిగిపోవును.

* చేరి సంతసమున చెక్కిళ్ళు వికసింప ఆజ్ఞలిచ్చు రాత్రులందు నాకు
పగలు వంచియున్న మొగమెత్త దదేయిది అనుచు చెలిని నమ్మ్రటరిది చూడు

[రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారి భాషాంతరము]



రాత్రియగుటయు నామె మారిపోవును. ఆమె ఆనందమూర్తియగును. శృంగారరసాధిదేవతయగును. ఆ దంపతుల ఆనందము దేవతలకే కనుపండువై వికసించిపోవును.

ఆదినము వేసవిదినమగుటచే తోటలో వకుళవృక్షపునీడలో భార్య నులకమంచమువేసి, పక్కవేసి, స్నానముచేసి, శుభ్రవసనములు ధరించిరా వెడలిపోయినది. దుగ్గన్న సోగమీసములు తిప్పి, వికటమందహాసము చేసి, మంచముపై పాదములు ముడుచుకొని గాఢనిద్ర నభినయించుచుండెను.

ఇంతలో బాపిశ్రీ తెల్లని చీర 1. ధరించి, పూవులఉపవీతము 2. వలెవాటువైచికొని, స్తనవస్త్రముచుట్టి, మల్లెపూలు జడముడిని తురుముకొని, వెండి బంగారునగలు తాల్చి, రూపొందిన మోహదేవతవలె నాతనికడకు వచ్చినది.

అతడు గాఢనిద్రయందుండెను. మంచమున నామె పడుచు పండుకొనుటకు స్థలములేదు. ఆమె మంచముదాపున నిల్చి, ఆతనిపై వంగి ఒక పది నిమేషములకాలము పరిశీలించెను. ఆమె తమి పట్టలేకపోయినది. వంగి ఆతని బుగ్గపై చక్కని ముద్దుల రెండు నాటినది. ఆతని ఒళ్ళు ఝల్లుమన్నదికాబోలు, ఆమె మందహాసముచేయుచు

" అళి అపసుత్త అవిణీ మీళి అచ్ఛ

దే సుహ అమర్ఘు ఓ ఆసం

గండపరి ఉంబణాపుల ఇ అంగం

ణపుణో చిరా ఇస్సం " [గాధాసప్తశతి] 3.

అని కోకిలకంఠమున తీయగా పాడినది. ఆ పాటకు కరిగిపోయి, దుగ్గసామి గబుక్కునలేచి, భార్యను కౌగిలించుకొని, మంచముపైకి లాగి, ఆమె మోముపై ముద్దులవర్షము కురిపించినాడు.

... ... ... ... ... ... ... ... ... ...

1. నడుమువరకే 2. విడిపయ్యెద

3. దొంగనిద్దురవాడ ! ముద్దుగొనినట్టి చెక్కిళులరేగు పులకల చెలువుగంటి
గిం కనుమూసికొనెదు ? చోటిమ్ము కొంత మసలనుండను లెమ్మిట్లు మరలనెపుడు.

[రా. అనంత కృష్ణశాస్త్రిగారి భాషాంతరము]

ఈ దృశ్యమంతయు గోడప్రక్క వటవృక్షమెక్కియున్న విషకన్యక పరిశీలించుచునే యున్నది. ఆ యాకుజొంపములలో ఆమె నెవ్వరు కనిపెట్టలేరు.

సాయంకాలమగునప్పటికి దినదినము ఆశ్రమగృహమునుండి ఆమె మాయమగునది. అగస్తియు, గగనియు, కాశ్యపియు ఆమెకై ఎన్నిసారులో వెదకి వేసారినారు.

ఏమగునది ? ఆమెకు తిరస్కరిణీవిద్య యున్నదా ? ఆమెకు తెలియకయే ఆ విద్య ఆమెకు అలవడినదా ? ఆమె తిరోధానమొందు విషయము స్థౌలతిష్యునకు వారిరువురుకూడ చెప్పలేదు.

అట్లు మాయమై రాత్రి మొదటి యామము ముగియులోపలనె ఆమె పామువలె చప్పుడు కాకుండ నా కొమ్మలనుండి జారి ఏలాగున పరువిడివచ్చునో ఆశ్రమ గృహముకడ ప్రత్యక్షమగును.

దుగ్గసామి శాపిశ్రీల ప్రణయగాథ ఆమె హృదయమున హత్తుకుపోయినది. రాత్రి ఎంత పొద్దుపోయినను ఆమె కనులుమూసి కదలికలేక నిద్దురపోయినట్లు నటించుచున్నను మేలుకొనియే యుండును.

పచ్చివిచ్చని ఆమె మనస్సునకు ఆ పడుచుదంపతుల ప్రేమ విప్పారుచున్న కుసుమముల సువాసనలవలె పొదివికొన్నది. శీతలవాయువులు చేమంతికొమ్మలకు పులకరముకలిగించి మొగ్గలదొడిగించును. మలయానిలము మల్లెపొదలకు స్పందనము కలిగించి తెల్లని కుట్మలముల పదమిచ్చును. చంద్రుని చల్లనిజ్యోత్స్నలు కలువకన్నె హృదయముప్పొంగజేయును. విషబాల హృదయమున విషము విరిగిపోనారంభించినది.

తానును ఆ బాలికవంటి బాలికయే. ఆ కాపుబడుచు ఉలూపి అర్జునునిలోవలె దన పురుషునిలో అలమికొనిపోవుచున్నది. తానును అట్టిదేకదా ! తనకట్టిపురుషుడు వచ్చునో !

ఇంతలో ఆమెకు చల్లని వస్తువులమధ్య నిప్పు దాగుకొనియున్నట్లు, ఒక భయంకర విషయము జ్ఞప్తికి వచ్చినది. ఆ కర్షకబాలిక కౌగిలించినట్లు తాను దన పురుషుని కౌగిలించినచో ఆతడు దగ్ధమై పోవలసినదేకదా !

చావనిన ఏమో ఆమె యెఱుంగును. తాను మృత్యురూపము. మనుష్యులను నాశనము చేయుటకే తా నుద్భవించినదికదా ! ఆమె గజగజ వణకిపోయినది.



# పంచవింశతి ప్రకరణము

## చైతన్యశక్తి

విషబాలిక ప్రతిష్ఠానము చేరుకొన్ననాటినుండియు మాటలాడదు. నవ్వు ఆమె ముఖమున నృత్యము సేయదు. ఆమె కన్నులలో ప్రసన్నరేఖలు ప్రత్యక్షముకావు.

ఆమెలో కుములుచున్న బాధ నెమ్మదిగా రాజుకొనుచున్నది. ఆమె కన్నులలో ఏదియో మబ్బులు ఆషాఢ మేఘములవలె ఆవరించియున్నవి. ఆమె పెదవులలో పండని బింబఫలములో, పూచని కాశీరత్నములో, ఉదయించని ఉషస్సులో తొంగిచూచుచున్నవి.

విషబాల ఒకచోట ఒదిగి కూరుచుండును. ఆమె మోకాళ్ళు ముడిచి, వానిపై మోముంచి, రెండు చేతులు మోకాళ్ళకుచుట్టి, కన్నులరమూతలువైచి, చైతన్యరహితమగు బొమ్మవలె నాళికలు, నాళికలట్లు కూరుచుండును.

గురుదేవులు స్థౌలతిష్యులవారి సంకల్పము విషబాలను మహామారణయంత్రము నొనరించుచున్నదని, గగన్యాది కాపాలిక లూహించుకొని భయావృత హృదయులైరి. తాముకూడ ఆమెను దరిచేరనలవిశొప్పి, గురుప్రభావమున, ఈ బాలిక మృత్యుదేవతా విస్ఫారిత భయంకర వదనమగుచున్నదని ఆ కాపాలికలు నిశ్చయించుకొనినారు.

ప్రతిష్ఠాననగరాశ్రమమునకు వచ్చిన మరుదినము మధ్యాహ్నము, విషకన్య గోదావ తీరమునకు బోయి, రాళ్ళు విరజల్లినట్లున్న యా గట్టు దిగి, నదీగర్భమున బండరాళ్ళ మధ్యము సెలయేరువలె ప్రవహించు నా నదీమతల్లి చేరువ నొక శిలపై కూరుచుండి, నీళ్ళలో కాళ్ళుంచి ఇటు నటు ఆడించుచు, నీలములై, స్వచ్ఛములై ప్రవహించు నా నీటిస్రోతుల పరిశీలించుచ నాలోచనారహితయై యుండెను.

ఆ నీటిలో నంత నొక విగ్రహమామెకు ప్రత్యక్షమైనది. ఆ విగ్రహము కిరీట కేయూర, కర్ణకుండల, హార, కంకణాది భూషణ భూషితము. ఆ మూర్తి సమున్నతము ఆ మూర్తి ముఖముమాత్రమామెకు గోచరము కాలేదు.

ఆ సమయముననే స్థౌలతిష్యుడు శ్రీముఖశాతవాహనుని నాశనముగోరి జపించుచున్నాడు.

ఇంతలో ఆమె కాసారజలములందా మూర్తి కరిగిపోవుచుండుట కనుపించినది. ఆ మూర్తిని వెన్నంటి, యౌవన తుషారాగ్రిమును, ఉత్తమాలంకార ధగద్ధగితమును, పరిపుష్ట పరిమళితాంగసుందరమునైన నేరొక్క విగ్రహము ప్రత్యక్షమైనది. ఆ మూర్తి మోముమాత్ర మస్పష్టము.

ఇంతలో మహాగ్ని కీల యొకటి గుప్పు గుప్పున మండుచు ఆ మూర్తిని చుట్టివేసినది, తత్కీలామధ్యమున మహానాగినీ జిహ్వారూపమై, ప్రళయదిన మధ్యాహ్న చండభాను వినిర్గత గభస్తియై తనమోము తోచినది. కొంతవడికి అన్నియు నిర్మల నీల ప్రవాహ సంక్లిష్టములై మాయమైపోయినవి.

ఆమెకు భయము వేసినది. కొంచెము వణకినది. ఇంతలో తామరమొగ్గలవలె పాటల వర్ణసుందరములగు నామె వ్రేళ్ళను పరిశీలించుటకు కొన్ని మత్స్యములు వచ్చినవి. అవి ఆ విషకన్య పాదముల స్పృశించినవో లేవో వెంటనే గిజగిజ లాడి ప్రాణములు విడిచి వెల్లకిలగా తెల్లగా తేలి కొట్టుకొనిపోయినవి. ఆ దృశ్యము చూడగనే, మానస సరోవర సంచరద్రాజ హంసికాకోమలమృదులమగు నామె తెలుపు, ఎరుపుల సువర్ణ కంఠము బిగుసుకపోయి, పాడియార పోయినది. ఆమె చటుక్కున పాదములు తీసికొన్నది.

ఆమె కన్నులు అత్యంత విస్ఫారితములై భయరూపము తాల్చినవి. ఆ చిన్ని చేపలు చచ్చిపోయినవి. అవి ఎంత అందమైనవి. అవి ఎంత చిన్నవి. అవి మిల మిల లాడుచు, చిట్టి తోకల నాడించుచు, ఇటు నటు తుళ్ళున పరుగిడుచు, రాత్రికాలముల తన కానందమొసగు తారలకన్న అందములై ఆడుకొనుచుండినవి. ఇంతలో నవి మంత్రించినట్లు పడసి పోయినవిగదా !

తాను ఎక్కడికిపోయిన అక్కడ అగ్నిశిఖలు బయలుదేరునా ? తానును అర్జునునివంటి భయంకర విషోరగమా ? తన్ను ఇతరులను చంపుటకా తన తాతగారు పెంచినారు.

......ఆనాడు కృష్ణవేణ్ణాతీరమున చూచిన ఆ పురుషుని ఆ బాలిక కౌగిలించినట్లు ఏ పురుషునైన తాను... తాను... కౌగిలించిన, తన చేతులతో అతని చుట్టివేసిన... అతడు... ఈ చిన్న చేపలవలె, మలయనాగునివలె, న...ని...పో...వల...సినదేనా ?

ఆ బాలిక పేరు బాపిశ్రీ అని విన్నది. బాపిశ్రీవలె ఒక పురుషుని తానును కోరుచున్నది. మలయనాగుని కౌగిలి దాను కోరలేదు. కాని తనకు ప్రియమును సమకూర్చునంద గాని దాను కోరి కౌగిలించినను ఆ ప్రియుడు నిలువున కూలిపోవునా ? అతనిని ఏమి చేయుటు ? మలయనాగుడు మరల కనంబడలేదు.



ఆమె ఇంక ఆలోచింపలేకపోయినది. ఎవరో తరుముకొని వచ్చుచున్నట్లు ఆమె అతి వేగమున మహానాగినివలె ఆశ్రమమునకు పరువిడి వచ్చినది.

" గగనీ ! గగనీ ! నాకు భయము వేయుచున్నది. "

" నీ కెందుకమ్మా భయము ? "

" నేను ముట్టికొన్నవారు వెంటనే చచ్చిపోదురు. తాతగారనినట్లు నాశనమై పోదురు. "

" అకేమితల్లీ అట్లందువు ! నేను నిన్ను ముట్టుకొనినను నాశనమగుటలేదే ? "

" నీవు నావలెనే ఆడదానివి. అందుకని నాశనముకావు. "

" మీ తాతగారు మగవారు. మరి వారు నిన్ను ముట్టుకొనుటలేదా ? "

" మా తాతగారు ఎప్పుడును నాశనముకారు. నేను ముట్టుకొనిన గోదావరినది నాశన మగునా ? నేను కౌగిలించిన ఆ కొండలు నాశనమగునా ? అట్లనే మా తాతగారును. "

" ఆ కొండలు, ఆ నదులు మాట్లాడవు. మీ తాతగారు మాట్లాడుదురు ! "

" ఓ వెఱ్ఱిగగనీ ! ఆగగనము నాతోమాత్రము మాట్లాడును. నీవు అందరితోడను మాట్లాడుదువు. కనుక మాట్లాడుట ముఖ్యముగాదు. మా తాతగారు పురుషులుకారు, స్త్రీలును కారు, వారు దైవము. "

" దైవమంటే ? "

" మా తాతగారు, నీవు, అగస్తి, కాశ్యపి మొదలగువారు పూజసేయు దైవము. "

" దానికేమిగాని, ఎవరు నాశనమగుదురందువు ? "

" పురుషులు. నాబోటి బాలికలను గట్టిగా గుండెలకు అదుముకొను నూగుమీసముల పురుషులు. మలయనాగునివంటివారు.

" అమ్మమ్మో ! ఇవి ఎట్లు నీకు తెలిసినవమ్మా ? ఎవరు చెప్పిరి ? "

గగని ఒడలు జలదరించినది. ఆమె కన్నుల భయము నిండినది. ఆమె ఇటు నటు పారచూచినది.

" నేను చూచితిని. వారిరువురు ఎంతో సంతోషముగా నున్నారు. గగనీ ! నిన్నెవ రైన అట్లు కౌగిలించిరా ? స్త్రీ పురుషులు పెనవైచికొనుట అంత సంతోషమా ? మొన్న బండమీద ఈ వూరు ప్రయాణము చేయునప్పుడు మనము ఒక సెలయేటిప్రక్కను ఆగినాము కాదూ ? "

" అవును. అక్కడ ఏమిజరిగినది ? "

"అక్కడ మనకు నొక పొలము, అందు రెండు నేరేడుచెట్లు చూడలేదా ?"

"చూచితిని."

"ఆ నేరేడుచెట్ల నీడ ఒక పొలముకాపు, అతని భార్యయు, ఒక చిన్నబాలుడు, రెండెడ్లబండి చూడలేదా ?"

"నే నంత పరిశీలించలేదు."

"వారందరక్కడ సంతోషముగానున్నప్పుడు వారిని చూచి మన బండివాడొక పాట పాడినాడు. అది వింటివా ?"

"లేదమ్మా ! నాకొడవ నాని ఏమని పాడినాడు !"

"విను,

పొఅపడిఅస్స పఇనో పుత్తిం *
పుత్తే సమారుహ త్తమ్మి
దడమణ్ణుమ్మణ్ణిఆయే విలాసో
ఘరిణీయే సేక్కంతో

[గాధాసప్తశతి]

ఆ పాటలు విని, ఆ పురుషుని, ఆ స్త్రీని, ఆ పాపని చూచి ఎంతో ఆనందమైనది. గగనీ ! నాకును అట్టి పాపడు పుట్టి, నాతో ఆడుకొనునా ? నా ఒడిలో ఒక పురుషుడు వాలిపోవునా ?"

---

* అడుగు దమ్ములందు పడి వేసు పతిపిన్న చిన్ని కొమరుడెక్కి చెలగి యాస అలుక ఎంత తెగని దయ్యును నిల్లాలి మోమునందు నవ్వు మొలచెనపుడు.

[రా. అనంత కృష్ణశర్మగారి భాషాంతరీకరణము]



# షడ్వింశతి ప్రకరణము

## ఉజ్జయిని

ఉజ్జయినీనగరము భారతభూమియందున్న సప్తమహాక్షేత్రములలో నొకటి. ఆ మహానగరము అభయబాహువు శాతవాహనమహారాజు కాలములోనే ఆంధ్రులచే జయింపబడినది.

ఆ పురము చుట్టునున్న కోటగోడలు శత్రువులను అభేద్యములు. కొందకములు అగాధములు. పురమధ్యమున మహారాజు నివసించు దుర్గమున్నది. శత్రువులు నగరము ప్రవేశించినచో, సైన్యములు దుర్గములోనికిబోయి, రక్షించుకొనవచ్చును.

నగర కుడ్యములకన్న దుర్గ కుడ్యములు మరియు బలమైనవి. ఉజ్జయినికోట పట్టుకొనవలయునన్న, రెండుమార్గములే ఉన్నవి. ఒకటి నగరములో తిండి అయిపోవలెను, రెండు నగర రక్షక సైన్యమునకు ధైర్యము పోవలయును.

సమదర్శిశాతవాహనుడు అన్నివిధముల తండ్రిపోలిక. ప్రియదర్శి అవక్రవిక్రమము సంపూర్ణముగ నాతని నాశ్రయించినది.

తన తండ్రి జయించిన మాళవము, తాను రక్షింపలేకబోవుట ఎట్లు ?

వినీతమతికి సమదర్శి యువకుడైనను, సేనానాయకులలో ఉత్తముడని దృఢవిశ్వాసమున్నది. అతడు ప్రియదర్శి కుమారుడు. ఆ సర్వసైన్యాధ్యక్షునికడ ముఖపతిగా, చమూపతిగా, సేనాపతిగా పనిచేసినాడు. అట్టి అతిరథుడు మరల నెప్పటికి ఉద్భవించునో ! సమదర్శి ఉత్తమయుద్ధనీతి చూపుచున్నాడు. అయినను ప్రియదర్శి శక్తి పూర్ణముగ నీతనియందు ప్రదర్శితమానా ? యని యాలోచించుకొనెను. అట్టి ప్రియనాయకుని పుత్రునిపై సర్వభారమునుంచి తాను దోడుపడుట ధర్మమని యాతడనుకొనెను.

శాత్రవపరివేష్టితమై ఉజ్జయినీనగరము మహాసముద్రమధ్యమునన్న దీవవలె నున్నది. ఉజ్జయినిని ముట్టడించిన మాళవ, మగధ, పుళింద, విదేహ, శక, సౌరాష్ట్రసైన్యములు ఎటు చూచినను గోరుతములు, గోరుతములు వ్యాపించియుండెను.

కోటను పడగొట్టుటకు ఒక్కొక్కనాడు ఒకొక్క సైన్యము ప్రయత్నించుచుండెను. ఆ ప్రయత్నము విఫలముకాగానే, యా సైన్యము వెనుకతగ్గి, దూరముగనున్న గుడారములలోనికి పోవుచుండెను.

అప్పుడప్పుడు, ఎనిమిదివైపులను ఎనిమిది సైన్యములును కుడ్యములను తాకుచుండెను. ఆ దినము పోరు మహాఘోరమైపోయి, ఎన్నివేలమందియో చనిపోవుచుండిరి. గోడలపై, బురుజులపై, గోపురద్వారములపై యుద్ధయంత్రములు, ఏనుగులు మఱొత్తుచుండెను.

మాళవసైన్యముల నెందరు హతమారుచున్నను, ఆ సైన్యముల కంతులేదు. కాని కోట రక్షించుచున్న కొలదిమంది ఆంధ్రులు భయంకరయుద్ధము చేయుచుండిరి. అట్టి సమయముల సమదర్శి సమవర్తియే. అతని నాయకత్వము అజేయము. అందరికి అన్నిరూపులై, ఒక్కసారిగా అన్నిచోట్లను కనపడుచు, అతడు చేయు యుద్ధమును దేవతలేవచ్చి చూచుచుండిరి.

మాళవసైన్య నాయకుడైన శివస్వాతియు, మగధ సేనాధిపతియు, పుళింద రాజును, సౌరాష్ట్ర సేనాధిపతియు, ప్రతి రాత్రియందు, మాళవరాజు సువర్ణ శిబిరమున మాళవాధిపతిని దర్శించుచు, యుద్ధవిధానము నిర్ణయించి దాని ననుసరించుచుండిరి.

నగరములో కొద్దిసైన్యమున్నప్పుడే త్వరలో నిర్జించి, కోట స్వాధీనము చేసుకొనలేకున్న, ఇక ఆంధ్రసైన్యములన్నియు వచ్చినచో ఈ రెండుమహాగ్నులమధ్యనుండి మగ్గిపోవలసినదే మాళవాదులు.

సమదర్శికి ఇంతవరకు చక్రవర్తికడనుండి వార్తలేమియు చేరలేదని కొంచెము ఆతురత కలిగినది. ఆయుధము లైపోవుచున్నవి. అగ్గలమీద కరిగించి పోయు సీస మయిపోవచ్చినది. తన సైన్యముతో వచ్చిన కర్మకారులు ఆయుధములను, యంత్రములను నిర్మించుటకు లోహాదులైపోయినవి. నగర ప్రజలలో చాలమంది ఆంధ్రులకు వ్యతిరేకులు. తన సైనికులకు భోజనము, నగర ప్రజలకు భోజనము చూడుట బ్రహ్మప్రళయమగుచున్నది. ధైర్యమే ఎంతకాలము ఆయుధములై, యంత్రములై ఉపకరించగలదు ? విరోధులు ధర్మయుద్ధము పరిత్యజించి, రాత్రియనక, పగలనక, ఒత్తిడి తగ్గించక, ముట్టడి సాగించుచున్నారు.

అందమైన యీ నగరమున, ప్రజలందరు సరియైన తిండిలేక, నిద్రలులేక, ప్రేతములవలె నున్నారు. కవులతో, పండితులతో, గాయకులతో, నర్తకులతో, భక్తులతో, వేదాంతులతో, భిక్కులతో నిండియున్న యీ మహాపురము, భయంకర రోగావిష్టుడగు మహాపురుషునివలె, నిస్తేజమై వెల వెల పోవుచుండెను.

ఇంతలో నొకనాడు సాయంకాలము నగరములోనికి రహస్యచారుడొకడు చిత్రముగా వార్తనంపినాడు. ఆతడాంధ్రచారదళములలో నద్భుత ప్రజ్ఞావంతుడు. అతడు వేయలేని వేషములేదు. మాటలాడని భాషలేదు. ఒక రోజున శివస్వాతి మహావేగమున, అశ్వమెక్కి,



ఉజ్జయినికున్న అష్టగోపురమార్గములలో నొకదానికడకు వచ్చెను. కళింగ సైన్యములలో కొన్ని యచ్చట యుద్ధము చేయుచుండెను. ఉపసేనానాయకులతనికి వీరనమస్కారము లర్పించిరి.

అతడు వారితో యుద్ధరహస్యము లెన్నియో మాటలాడి, స్వయముగ ఆజ్ఞలనిడి, కోట గోడలపైకి సైన్యముల నెసకొల్పెను. కోట గోడపై మహావిక్రముడైన సమదర్శి నిలబడి ఆంధ్ర ధనుర్ధరులచే చాపములు చెవికంటలాగించి, పుంఖానుపుంఖములుగ బాణములు విడిపింపచేసెను. ఆంధ్రులు ధనుర్యుద్ధమునందసమానులు. వారి బాణము లెట్టి కవచములైన అవలీలగ ఛేదించుకొనుచు గుండె దూసిపోగలవు. ఆంధ్రవిజయములకు ప్రధానకారణము వారి ధనుర్విద్యాపాటవమే. ఆ బాణము లవితథోద్యమములు.

శివస్వాతి సమదర్శిని చూడగనే, ఆకుపచ్చని ఈకలతో ఎఱ్ఱని చువ్వతో, గోళశిరస్సు గల బాణమును సువ్వన ధనస్సులాగి, అతివేగమున వదలెను. శివస్వాతి ఆ నమస్కారబాణము వదలుట కళింగదళముల వారెవ్వరు కనుగొనలేదు.

ఆ బాణము రివ్వునవచ్చి సమదర్శి పాదములకడ పడెను. ఆ బాణమును చూడగనె సమదర్శి సంతోషమున నొక గంతువైచి, వంగి, ఆ బాణము తీసికొని, తన పరశుముఖముతో గోళము బద్దలుకొట్టగా, నందుండి యొక భూర్జపత్రము పైకి వచ్చెను. వెంటనే సమదర్శి పత్రమువిచ్చి యిట్లు చదువుకొనెను.

" సేనాపతీ ! ప్రణామములు, సింహము అరణ్యములందు తానున్న గుహ వదలి చిన్నగ ఆ వృద్ధసింహమున్న గుహకడకు పోవుచున్నది. ఆ సమయమున కొన్ని సింహశాబకములు తాము వేటాడిన జింకల బట్టుకొని మూలుగుచున్న ఆ వృద్ధసింహముకడకు కొనివచ్చుచున్నవి. ఏనుగులేమి చేయును, నక్కలేమి చేయును ? అన్నపాదసాక్షిగ అవసరములు ఆరవయామమున ఆరవలోయలో ఆ వృద్ధసింహమునకు దొరకగలవట. నేను నా దారిలో చూచిన దృశ్యము. పచ్చరేకు చిలుకముక్కున దొంతపండుండలేదు. ఒక పద్యమున్నది. "

అని వ్రాయబడియుండెను. చిరిగిపోయిన నాకపటు శివస్వాతి మఱి కాన్పించలేదు. చిలుకయే వచ్చినది. ఇక ఆంధ్రసైన్యములకు కొయి రెట్లు బలము వచ్చును. తిండి వచ్చుచున్నది. చక్రవర్తి ఇంక కొన్ని నెలలు ఆలస్యము చేసిన భయమేమి ? ఆరవలోయ, ఆరవ నగర గోపురము, ఆరవయామము [రాత్రి రెండవ యామము]

అతడు విస విస నడచుచు మహావేగమున వినీతమతికడకు బోయి, ఈ బాణుని లేఖ చూపించెను. వినీతమతి ఆనందమునకు పరిమితియే లేదు. సమయమునకు తగిన సహాయము చక్రవర్తి పంపినాడు. ఆ మహాభాగునివంటి మహాలోచనపరులు మఱి లేరు.

ఆరవ గుమ్మముకడ కళింగసైన్యములు సంభ్రమాశ్చర్యములలో మునిగి మహాయుద్ధము చేసినవి. ఇంతలో కోటగుమ్మము తెరువబడి మెరికలవంటి ఆంధ్రవీరులు ఒక వేయి మంది ఛంగున అక్కడకు వచ్చి కళింగుల దలపడిరి.

"జై అమృతా" అనుచు వేయిమంది కాళింగులు ఆంధ్రసైన్యముల తలపడిరి. ఆంధ్రులు పారిపోయిరి. వారిని వెన్నంటి ఆ కళింగాశ్వికులు, ఇరువది కళింగగజములు, పదాతులు, పది రథములు ఆంధ్రులను తరుముకొనుచు కోట జొచ్చిపోయినవి.

ఆంధ్రులంత త్వరితముగ పారిపోవుదురని తక్కిన కళింగసైన్యము లనుకొనలేదు. వారికి శివస్వామియే నాయకుడై సైన్యముఖమున నుండెను. గుమ్మముజొచ్చిన తమ సైన్యము వెంట దక్కిన కాళింగులు వెళ్ళసాగినంతనె, ముందున్న కళింగ గజవీరులు గజములపైనుండి ఒక్కమాటు తమవారిమీదనె బాణములు పరపిరి. 'జై శ్రీముఖశాతవాహనమహారాజా' అంటూ ఆ గజవీరులు తమ గజముల వెనుకకుతిప్పి, అగడ్తపైనున్న వంతెనమీదనుండి, తమ్మంటివచ్చు ఇతర కళింగసైన్యముల నిలువరించిరి.

సంభ్రమాశ్చర్యములతో కళింగసైన్యములు ఆగిపోయినవి. గజములు వెనుతిరిగి లోనికి బోయినవి. మహాద్వారములు మూసుకొనిపోయినవి. లగ్గలపైనుండి అగ్నివర్షము, బాణవర్షము మహాధారలైనది. కళింగులు వెనుకకు పారిపోయినారు. శివస్వామి "ఎంత మోసము జరిగినది!" అనుచు దల వ్రేలవైచెను.



ఆరవ గుమ్మముకడ కళింగసైన్యములు సంభ్రమాశ్చర్యములలో మునిగి మహాయుద్ధము చేసినవి. ఇంతలో కోటగుమ్మము తెరువబడి మెరికలవంటి ఆంధ్రవీరులు ఒక వేయి మంది ఛంగున ఆక్కడకు వచ్చి కళింగుల డలగించిరి.

“జై అమృతా” అనుచు వేయిమంది కాళింగులు ఆంధ్రసైన్యముల తలపడిరి. ఆంధ్రులు పారిపోయిరి. వారిని వెన్నంటి ఆ కళింగాశ్వికులు, ఇరువది కళింగగజములు, పదాతులు, పది రథములు ఆంధ్రులను తరుముకొనుచు కోట జొచ్చిపోయినవి.

ఆంధ్రులంత త్వరితముగ పారిపోవుదురని తక్కిన కళింగసైన్యము లనుకొనలేదు. వారికి శివస్వామియే నాయకుడై సైన్యముఖమున నుండెను. గుమ్మము జొచ్చిన తమ సైన్యము వెంట దక్కిన కాళింగులు వెళ్ళసాగినంతనె, ముందున్న కళింగ గజవీరులు గజములపైనుండి ఒక్కమాటు తమవారిమీదనె బాణములు పరపిరి. ‘జై శ్రీసుఖశాతవాహనమహారాజా’ అంటూ ఆ గజవీరులు తమ గజముల వెనుకకు మరల్చి, ఆగడ్తపైనున్న వంతెనమీదనుండి, తమ్మంటివచ్చు ఇతర కళింగసైన్యముల నిలువరించిరి.

సంభ్రమాశ్చర్యములతో కళింగసైన్యములు ఆగిపోయినవి. గజములు వెనుతిరిగి లోనికి బోయినవి. మహాద్వారములు మూసుకొనిపోయినవి. దుర్గముపైనుండి అగ్నివర్షము, బాణవర్షము మహాధారలైనది. కళింగులు వెనుకకు పారిపోయినారు. శివస్వామి “ఎంత మోసము జరిగినది!” అనుచు దల వ్రేలవైచెను.



# సప్తవింశతి ప్రకరణము.

## గ్రీష్మాతపము.

నిప్పులు చెరుగుతున్నది రోహిణీకార్తె. తన్నిదాఘమాస బ్రధ్నదేవ మహోష్ణము భరింపలేక, తన పాతివ్రత్యధర్మమునైన తలలపక, సంజ్ఞాదేవియే బాడబియై సముద్రము చొచ్చినది.

ధాన్యకటక నగరవీధులయందు మధ్యాహ్నమొక్క ప్రాణియైన గోచరించుటలేదు. తోటల చెట్లన్నియు చిగురించి క్రొత్తఆకులతొడగినవి. పొలమున నొక పచ్చమొక్కఅయిన కనబడుటలేదు. కృష్ణాదేవి, మహా తపస్సు నొనరించు పార్వతివలె ఆ సైకతముల నొదిగిపోయినది.

వట్టివేళ్ళ తెరలు, పన్నీటి జలములు, కురువేరు విసనకర్రలు, ముఖాతుక్కందము; గంధకుటి, పుండలీకము, అంజనకేళి మొదలగు సుగంధద్రవ్యములు కలిపిన మంచిగంధము. నాగరులు విరివిగ వాడు దినములవి. మేడలపై ఆకాశమే వితానముగ శయనించు రాత్రులవి.

సుగంధ పానీయములు, ద్రాక్షసారాయములు, వివిధ మధువులు మధుశాలలలో విరివిగ విక్రయించు సాయంకాలములవి.

ధాన్యకటకనగరమున కృష్ణాతీర ప్రదేశముల ఉద్యానవనములవలెనున్న పూవుల తోటలమధ్య పానశాలలున్నవి. ఒక్కొక్క పానశాల యొక్కొక్క వనమునందున్నది. ఆ పానశాలలలో రెండు ఉత్తమ కుటుంబములవారికి, ఒకటి విదేశీయులకు, ఒకటి సాధారణులకు. ఆంధ్రమద్యశాలలు నర్తనశాలలు, కళామందిరములును; పూల వితానములమధ్య వట్టివేళ్ళ తెరలలో మెత్తని శయ్యాలతో కూడిన మంచములపై, మృదులములగు ఉపధానములపై వాలి, అచ్చరనులమించు పువ్వుబోడులప్పించు రజితపాత్రముల నుండి వివిధ పానీయములగ్రోల నాంధ్రులకిష్టము. కోకిలస్వనయుక్త వివిధ జంత్రిసమ్మేళన మధురాతి మధుర గాంధర్వము లాలపింతురు గాయనీ పరభృతకంఠులు.

ఆ మద్యశాలలను, రాజోద్యోగులు సర్వకాలముల పరిశీలించుచుందురు. ఎక్కువమత్తు గొలిపించు మద్యము లుండకూడదు. పరిచారకలు, నర్తకీ సమూహము, గాయనులు తక్క వేరు స్త్రీలక్కడకు రాకూడదు. అసభ్యవర్తన మచ్చట పనికిరాదు.

ఆ మందిరములు పూజామందిరములవలె నుండవలయును. ధూపకరండములనుండి పరిమళ ధూపము లెగయుచునా మందిరమెల్ల క్రిమ్ముచుండును. మల్లెలు, మొల్లలు, కుందములు, చంపకాదిపుష్పములు, పోవులు పోవులుగా ఆసనములపై చల్లబడుచుండును.

మాధవకము, కురువేరు గంధసమ్మిశ్రితము కావలెను మైరేయము వట్టివేళ్ల పరిమళము నీయవలయును, ఆసవము కుందసురభిళమై యుండవలెను. సుగంధములగు పానీయములందు సిద్ధముగనుండును. ద్రాక్షసారాయములు వివిధ సుగంధయుక్తములై చిత్రవర్ణోజ్జ్వలములై తపస్వి మనస్సునైన ఎలయించి నోరూరించుచుండును.

హర్షగోపుడొక మధుశాలయందు సుగంధ పూరితమును, అమృత సమానమగు ద్రాక్షమధువు గ్రోలుచు సుఖాసనమున నధివసించి యాలోచించుకొనుచుండెను ఇంద్రగోపుని తమ్ముడు హర్షగోపుడు. హర్షగోపుడు బాలనాగిని ప్రేమించియుండెను. హిమబిందునకు పెండ్లియైనగాని బాలనాగి యాతని పెండ్లియాడుటకు వీలులేదు.

చారుగుప్త గోకులాధిపతియగు హర్షగోపుడు ధనవంతుడు. అతడు మహాచైత్యమునకొక ధర్మచక్రమును స్వయముగ నర్పించుకొనినాడు.

ఆ మధుర సుగంధయుక్త సురామధ్యమున బాలనాగి నవ్వుమోము నాతడు దర్శించినాడు. అతనికి కొంచెము మత్తుఎక్కినది. కొలది దూరమున వినంబడు రావణహస్తవాద్యముతో శ్రుతి గలిపి, ఒక గాయని మధురముగ బాడుచున్నది.

> " ఏలరా ఈ వేదన?
> బేలరా అది బాలరా!
> చాలురా నీ ధూర్తత — ఏలరా ఈ వేదనా ? "

హర్షగోపుడు, బాలనాగిని తలచుకొనెను. ఆ బాలిక మాట్లాడదు, ఆ ముద్దరాలికి దనపై ప్రేమయున్నదని చెప్పక చెప్పినది ఆమె దేవి హిమబిందుకుమారిని ఈమధ్య వదిలియే యుండుటలేదు అనుకొనుచుండెను.

> " నినుతలచి ఏళ్లకన్
> కనుమూయదాచిన్నదీ !
> అనిమిషత్వము చెందిపోనో ఏలరా ఈ వేదనా? "

బాలనాగియు తన్ను తలచుకొనుచుండును. ఆమెయు ఇటులనే బాధపడుచుండునా ? ఎక్కడిమాట ?



ఇంతలో ఆ మదిరశాలాధికారి యొకడు మోమునకు చిరునవ్వుదెచ్చుకొని హర్షగోపునికడకు వచ్చి " ఇంద్రగోపుడు క్షేమముగ నుండినాడా ? " అని ప్రశ్నించెను.

" సుఖముగనున్నాడు. చారుగుప్తులవారి ధనదుపుర గోశాలలు పరీక్ష చేయ పోయినాడు. "

" అమ్మాయిగారు హిమబిందుకుమారి కొంచెమస్వస్థతగ నున్నదని వింటిని. ఎట్లున్నది ? "

" జబ్బేమియు లేదు, తండ్రిగారు యుద్ధమునకుపోయినారని ఆమె బెంగ పెట్టుకొనినది "

" అంతేనా ! అయిన వారి చుట్టము లెవ్వరు రాలేదా ? ".

" ఆ ! కోటీశ్వరుల కుటుంబములలో ఎవరికివారి పనిఉండును. అందరును ఒకసారి వచ్చి చూచినారు. వినయగుప్తులవారు మనుమరాలికి ధైర్యముగ నుండుటకు ఇంటికడనే వసించుచున్నారు. కీర్తిగుప్తులవారు ఒక నిముషము మనుమరాలి నెడబాయుటలేదు. వారిరువురు తమ యాత్రావిశేషములు కథలుగా చెప్పి ఆబాలికకు సంతోషము గొలుపుచున్నారు "

"హిమబిందుకుమారి సౌందర్యము ఏ రాచకన్నెకును లేదు.

" అవును మే మన్వారము తలయెత్తియైన యామెను చూడలేము. ఆమెకు దృష్టి తగులునేమో యని నాకు భయము. ఆతల్లి దేవత. "

" ఇంటిదగ్గిర ముక్తావళీదేవియు, అమృతలతాదేవియు నున్నారట కాదా? "

" అవును. ఎంతమందియున్నను ఆతల్లికేదో విచారమేనని, చెలికత్తెలందరు చెప్పుకొందురు. "

హర్షగోపుడు బాలనాగిని తలచుకొనుచునే వెడలిపోయెను.

అతడు చారుగుప్తుని కోటగోపురము చేరునప్పటికి సూర్యుడస్తమించి నాలిక పైన దాటినది. ఎటుల బాలనాగిని చూచుట? ఆమె తన ఇంటికి రాణిగా రాజ్యము చేయుచుండ ఆమెను బంగారునగలలో రంగారుదుకూలములలో దేవకన్యనుగా తాను మార్చివేయలేడా ? ఆతల్లి హిమబిందుకుమారితో తన బాధ చెప్పికొనిన, ఆమె తనపై జాలిగొనునేమో ?

అనుకొనుచు నాతడు అంతఃపురము దెసకుబోయి, అమ్మాయిగారితో హర్షగోపుడేదియో మనవి చేసుకొనవచ్చినాడని వినతిపంపెను

హిమబిందును, శాలనాగియు తోటలో నున్నారని వార్తవచ్చినది ఒక చెలి హిమబిందుకుమారితో విన్నవించుటకు వెడలినది.

హిమబిందు ఏదియో ధైర్యము వహించియే యుండెను సువర్ణశ్రీ తనకు పరపురుషుడైపోయినాడా ? అతనిపై ప్రేమ నెట్లు నాశనము చేయగలదు. ఆనందుడే వారంతగా ధైర్యముచెప్పినారేమి ? వారిమాటలకర్థమేమి? ఆబాలకేమియు పాలుపోవుటలేదు. ఎటుల నాదివ్యవిగ్రహమును తన హృదయమునుండి చెరిపివేయగలదు తాను చిత్రములు లిఖించుట నేర్చుకొన్నది కాని ఫలకముపై లిఖించిన చిత్రము నెవ్వరుతుడిచివేయగలరు ? ఆ చిత్రముపై సున్నము పూయవలెను ఆసున్నముపై వేరొక బొమ్మవేయవలయును కాని వెనుక అణగియున్న చిత్రమేమగును?

హృదయమున అణగియున్న చిత్రము మరియు సన్నిహితమై జీవితమునే దుర్భరము చేయును. ఏల యాతడు తన జీవిత నాటకరంగమున నాయకపాత్రగా ప్రవేశించినాడు ? తాను మహారాణియగునా? అరాజకమగం హృదయరాజ్యంలో తానే రాజ్యమునకు రాణియగును? తనరాజ్యము సువర్ణశ్రీమయము. నాగనిక సంతోషము అద్భుతానందము తనకు సువర్ణుని మరియు సన్నిహితునిగ నొనరించినది.

తనకోట్లు, కుబేరవైభవము కావ్పనా ? ఆ వైభవము తనకేమి తేగలదు, యీగలదు ? అది తన సువర్ణుని దూరము చేసినది.

హిమబిందు నాగబంధునికను పదిసార్లు రప్పించుకొనినది

“ నాగూ. నేలు నీయింటికి రానేను. నన్ను మాతంగ్రశ్రీ మహారాణి నొనరించునట. నామీదఒట్టు. ఎవ్వరితో నా రహస్యము చెప్పకు. నేను బ్రతికి ప్రయోజనములేదు, ”

“ వెఱ్ఱిదానా ! నీవు నా వదినవు, కొనఊపిరితోనయినా నీకును నీ కయిష్టమగు మహారాణిత్వానికి నేను అడ్డుపడెదను. నా అన్న మహారాజులకన్న అధికుడు అతడు మంజుశ్రీ దేవుడే. అతడు నిన్ను పూజించును. నీమాట ఆతనికి మంత్రమైనది అన్నయ్య నీ దిగులుతో సగమగుట మాని, నా చిన్న మేనమామగారి ఇంటికి మాఅమ్మ పంపినది. వెళ్ళి అక్కడ నేమియూ తోచలేదని మాయి చిక్కి విన్నానే. మా చెల్లితో ఉ గామ్పులలో తిరిగి ఇంటికి వచ్చినాడు. ”



‘బొమ్మలు వేయుచుండెనా?’

‘బొమ్మలులేవు, బూడిదలులేవు. పైన, లోన నాతనికి దారుణపు వేడి!’

”మాతల్లి నన్ను కన్న రెండేడులకు నిర్వాణమందినది పుణ్యాత్మురాలు, నాకా పుణ్యమెప్పుడో!”

“చాల తెలివైనదానవుకదూ! ఇదా నీ యవనరక్తపు ధైర్యము! మా భారతాంగనలట్టి వెఱగుమాటలనరు. బాణుని కొమరిత అనిరుద్ధుని తెచ్చికొన్నది. నీవును నీ అనిరుద్ధుని తెచ్చుకొమ్మ”

కొంతసేపు వారట్లు మంతనమాడినవెనుక నాగబంధునిక వెడలిపోయినది.

హిమబిందు శాలనాగితో తోటలోనికి బోయెను. ఇంతలో చెలి యొకర్తుక వచ్చి ‘అమ్మా! హర్షగోపులు తమ దర్శనం కోరుతున్నారు’ అనెను.

హిమబిందు మోమున విషాదపూరితమగు దరహాసమొదవినది.

‘నాజన్మ మెట్లను దుఃఖభాజనమైనది. శాలనాగీ నీవైన సుఖపడవే!’ యన్నది.

శాలనాగి మోమున సంతోషము, విషాదము, కోపము అన్నియు తెరఎత్తిన నాటకపాత్రలైనవి.

[illegible]

# ద్వితీయభాగము - అష్టావింశతి ప్రకరణము.

## సైన్య వేగము

ఆంధ్రసైన్యములు తరలి నడచుచున్నవి. ధాన్యకటకమునుండి ఘన మహారాత్రమున నా సైన్యములు బయలుదేరినంతనె, ఒకవంక పాటలీపుత్రమునకు రెండవవంక ఉజ్జయినికి శత్రుచారులు వేగుతీసుకొని పోయిరి.

స్థాలతిష్యుని అపకృష్టులు వారికి వార్త గొనిపోయిరి. చోళ. చేర. పాండ్యాధిపతులకు స్నేహవార్తలు వెళ్ళినవి. వారును ఆంధ్రచక్రవర్తి మాళవమునకు బోవుచున్నాడనియే భావించిరి.

కళింగము ఖారవేలుని యనంతరము, ఆంధ్రసామ్రాజ్యమునకు సామంత రాజ్యముగనె పరిగణింపబడుచుండెను. కళింగులు ఆంధ్రచక్రవర్తికి కప్పముమాత్రము కట్టుచు కర్తృకాది స్వామ్యములన్నియు ఆంధ్రులకే.

కళింగదేశాధిపతికి శ్రీముఖశాతవాహనుడు అత్యంతరహస్యమగు సందేశము నొండు తన మంత్రిసత్తముల లంపాకనిచే నంపెను. అందు చక్రవర్తి కళింగము వారిని మాళవమునకు బోవుచు గాన కళింగరాజ్యమునబోవు ఆంధ్రసైన్యములకు దారి సుగమము చేయ సాహాయ్యమును కోరియుండెను. అది ఆజ్ఞతో సమానము.

మాళవరాజధానియగు నుజ్జయినికిబోవు మార్గమున ప్రతిష్ఠాన నగరమున్నది. ప్రతిష్ఠాననగరమునుండి తిన్నగ నుత్తరముగ ఉజ్జయినికి రాజపథమున్నది. ఆపథము వెంట ప్రతిష్ఠానమునుండి ఉజ్జయిని ముప్పది అయిదు యోజనములుండును. కాని దుర్గములగు కాంతారములు పర్వతములుండుటచే రెండులక్షల పుళింద సైన్యము మార్గమున ఆంధ్రులకడ్డుతగులుటకు మాళవులు సిద్ధము చేసినారు. లోయల కీచలావల కొండపలుగో, నదులదాటు భూదేశముల, అడవులలో, నిద్రవదేశముల పుళిందులు తెబ్బులలవలె పొంచియుండిరి. వారికి బాసటగ మ్లేచ్ఛులు ఆభీరులు, పారశీకులు, మాళవులు-పోతుల రాకలు తీరిన చండ విక్రములుండిరి.



ఉజ్జయినికి దుర్గమ భయంకరాటవుల గుండ రెండవమార్గమున్నది. గోదావరీ తీరమునుండి పోవుచు వరదానది గౌతమియందు సంగమించు శబరరాజధానియగు శ్రీ గ్రామమునకు [సిరిమచ] బోయి, యిచ్చటనుండి వరదానది తీరమునను నాగదేశముజొచ్చి, నాలిముఖ్యనగరమగు వాసుకీనగరము [నేటినాగపురము] చేరి, యచ్చటినుండి మాళవదేశము చేరవలయును. ఆదారిని సామాన్యముగ ప్రయాణము చేయుటయే కష్టము. యుద్ధయాత్రకు మొదలే తగదని చెప్పబనిలేదు.

మూడవమార్గము దక్షిణ కోసలమునుండి విదేహము చేరి, విదేహమునుండి శోణానదిని దాటి, శోణాతీరముననే ఎగువకు దక్షిణముగాబోయి, వింధ్యపర్వతపాదము ననుసరించి, యాత్రేణి ప్రక్కగనె అవంతిమీదుగా మాళవము చేరవలయును. కాని అది చుట్టుదారి.

ఏదారిని వెళ్ళునో ఆంధ్రచక్రవర్తి పోకడ ఏరికిని అర్థమగుటలేదు. గోదావరీ తీరమునకు బోయినచో, నొక్క ఆంధ్రవీరుడైన ఉజ్జయిని చేరుటకు మిగులడు. చుట్టుదారిని చేరుటకు మున్నె ఉజ్జయిని శత్రుహస్తగతమగును.

సైన్యము బయలుదేరుటకు కొన్నిదినములముందే ఎఱికలవంటి వేయిమంది యాదాగ్వాస్యులు, మాయావర్తనులు, సంశప్తకులు, ఉజ్జయినీ సైన్యములకు వలయు ముఖ్యసామగ్రిని సేకరించి, మందులవారివలె, కాపాలికులవలె, జైనసన్యాసులవలె, బ్రాహ్మణ, తాపసులవలె, బిచ్చగాండ్రవలె బండ్లతో, ఏనుగులతో, అశ్వములతో బయలుదేరిపోయిరి. ఏదారిని ఎవరు ఎట్లువచ్చిరో! వారందరు ఉజ్జయినిని ముట్టడించు శివస్వాతి కళింగసైన్యమున చేరిపోయిరి.

సముద్రమున గురిసిన వానతుంపురులవలె, తెల్లవారు ఘడియల శాద్వలముల జేరిన హిమబిందులవలె, నారికేళములజేరు జలబిందులవలె కళింగసైన్యమున గలసిపోయిరి.

ఇంతలో వారు నాటకమాడినారు. ఆంధ్రావసర్పణనాయకుడు శుకబాణుడు శివస్వాతి వేషము వేసినాడు. అతనికి చిలుకయని పేరు. అతనిగుర్తు అనుపచ్చ ఈకలు, ఎఱ్ఱని ముక్కుగలబాణము. అతని చారసైన్యమతినిపుణము. ఈచారసైన్యము ఆడినకపట నాటకముచే ఆహారవస్తువులు, మందులు, ఆయుధములు, వస్త్రములు, గజతురగాదులు కోటలో ఎట్లుచేరినది పతిత తెరుంగుదురు.

ఆ వేగినవార్త చక్రవర్తికి వెనువెంటనే అందజేసిరి.

చక్రవర్తి తాను యుద్ధయాత్రకు బయలు దేరుచు శ్రీకృష్ణ శాతవాహనునకు గమ్మ మొకటి పంపినాడు. శ్రీకృష్ణశాతవాహనుడు చక్రవర్తి ఏర్పరచిన మంచిముహూర్తమున వేటకు బయలుదేరినట్లు బయలుదేరవలయుననియు, అతని సైన్యములు వేయి రెండువేలమంది జట్టులుగా విడిపోయి, మహారాష్ట్రము రధిరాష్ట్రము కుంతల దేశము తిరిగినట్లు నటించుచు త్రయంబకేశ్వర పర్వతముకడ చేరవలయుననియు, నచ్చటనుండి అభీరులు కన్నుమూసి తెరచులోపల నొకలక్ష సైన్యము భరుకచ్ఛముపోయి, యది పట్టుకొన వలయుననియు, నచ్చట ఏబదివేల సైన్యముంచి, తక్కిన సైన్యముతో శ్రీకృష్ణశాతవాహనుడు ఉజ్జయినిని ముట్టడించిన రిపుల దాకవలయుననియు, ఆ సమయముననే చక్రవర్తి విదేహమునాటిని అనువదిఅయిదు యోజనములు ప్రయాణము చేయించి రెండులక్షల సైన్యము పంపుననియు, కోటలోనివారు, ఈ రెండు సైన్యములు ఉజ్జయినిని రక్షింపగలవనియు వ్రాసిపంపినారు.

దారిపొడుగునను చంద్రస్వామి సామ్రాజ్ఞి ఆనందీదేవికి, వేదాంతము, పురాణములు చెప్పుచుండెను. బౌద్ధజాతక గాధలు మనోజ్ఞ విధానమున ఉపన్యసింపుచుండెను. బుద్ధుడు కృష్ణుని యవతారమని యాతని భావము ఆ యవతారభావమాతని హృదయమున ప్రవేశింపజెట్టినది అమృతపాదార్హతులు. బుద్ధుడు అమితాభబుద్ధుని అవతారము అతడాదిబుద్ధుడు. ఆది బుద్ధుడు అద్యంతరహితుడు, నామరూపరహితుడగు పరబ్రహ్మమే.

చారుగుప్తుడు దారిపొడుగున చేసిన ప్రయాణ సౌకర్యములు పరమాద్భుతములు రెండులక్షల సైన్యము, ఇంచుకంతైన శ్రమనందక ధాన్యకటక నగరమున నున్నట్లే సౌఖ్యములనందుచు బాణవేగమున సాగిపోవుచుండెను.

శ్రీముఖశాతవాహనుడు చారుగుప్తుని దూరాలోచనకు, ప్రజ్ఞకు, అతని తరగని సంపదకు ఆనందము, నాశ్చర్యము నందుచుండెను.

దంతిపురము మహాచైత్యమున ప్రార్థనలు సలిపిరి. సర్వ సైన్యాధ్యక్షులును స్వతులవారు సార్వభౌముని బంగారు గుడారమునకు బోయి జయవాద మొనర్చి సార్వభౌమునిచే చూపబడిన ఆసనమున అధివసించి.



మహాప్రభూ! మనము కళింగము పొలిమేర చేరునంతవరకు, శత్రువులు మన జోకడ కనిపెట్టలేదు కాని అక్కడనుండి విదేహమునకేగక ఉత్తరముగ బోయినచో వారికి నిజము తెలియదా' యని మనవి చేసికొనెను.

ఇంతలో మహామంత్రి అచీర్ణులు, చారుగుప్తుడు అచ్చటికివచ్చి సార్వభౌమునకు దౌవారికులచే అనుమతి వేడిరి.

అనుమతినంది, యథోచితముగ ప్రవేశించి వారిరువురును ఆసనము లలంకరించిరి.

సైన్యాధికుల వారు తమ అనుమానము వారికి వెల్లడించిరి.

చారు:—తమకు అనుమానమెందుకు మహారాజా! వారిని నిజము తెలిసికొననిండు. పాటలీపుత్రమునందు ఏబదివేల సైన్యముమాత్ర మున్నదని మనకేగుకదా?

అచీర్ణుడు:—ముట్టడించిన మన సైన్యమును, సుశర్మ స్నేహితులువచ్చి తాకరా?

చారు:—అవుగాక, అందువలన భయమేమి? మన సైన్యము ముందర ఆవచ్చు సైన్యము లేపాటివగును?

శ్రీముఖుడు:—నిన్న ఉజ్జయిని వార్తనుబట్టి మన వేగులవారి దళములు కోటలోనికి చేరనవని తెలియవచ్చినవి. పదు నేనుదినముల వరకు భయములేదని శుకబాణుని వార్త.

# ఏకోనత్రింశత్ ప్రకరణము.

## ప్రయోగభగ్నము

అగ్నిమీళే పురోహితం యజ్ఞస్య దేవమృత్విజమ్
హోతారం రత్నధాతమమ్

ఇట్టి మంత్రములతో అగ్నిని అర్చించి, ఇంద్రాదిదేవతలను ప్రార్థించి, స్థౌలతిష్యుడు విషబాలను శ్రీకృష్ణ సాతవాహనునిపై ప్రయోగించు హోమములు సలిపెను. ఆమె పద్మాసన పీఠముపై కూర్చుండియుండ మంత్రములతో, ఆమెకు పాదార్చన స్థౌలతిష్యులు జరిపెను.

ఆమె లోనికి సర్వమృత్యువులు ఆహ్వానింపబడెను.

నిన్ను జూచినంత మాత్రముననే జీవములు హతమొందును గాక.

"నిన్ను స్పృశించినతోడనే మనుష్యులు బూదియైపోవుదురు గాక."

"నిన్ను పొందుటతోడనే విగతజీవులై మనుష్యులు నశింతురు గాక."

అను నర్థముగల మంత్రములు పఠించుచు స్థౌలతిష్యుడామెను ప్రయోగించబోవుచుండ, ఆమె చివ్వున లేచినది.

"తాతగారూ! ప్రయోగించకుడు. నేను ఒప్పను. నేను మృత్యువును కాను" అని అరచినది.

ఆమె కన్నులలో గాఢ విషాదరేఖలు మబ్బులరీతి ప్రసరించినవి. ఆమె సుందరమైన పెదవులు వణకిపోవుచుండెను. ఆమె తన గుప్పెట్లను గట్టిగా మూడుచుకొని హృదయమున కద్దుకొనియున్నది

శార్దూలమును జూచిన హరిణమువలె, పామును చూచిన కప్పవలె, ఆమె గజగజ వణకిపోవుచుండెను,

ఈ ప్రయోగము జరుగు పూజామందిరమున, ఆ ప్రయోగపు తంతుకు వలయు బ్రాహ్మణులు మాత్రమున్నారు, గగని మొదలగు కాపాలికలున్నారు. ఇతరులెవ్వరు నామందిరమున లేరు.



విషబాల మాటలు వినగనే స్థౌలతిష్యులు ప్రళయకాల రుద్రునిభంగి ఒక్కుమ్మడి లేచి, జేవురించిన కనులతో, క్రోధకంపితగాత్రులై.

కాలాదేశమువలె దీర్ఘమగు బాహువుచాచి.

"ఏమంటివి ఉత్సృగచారిణీ!" అని లోకములదరనట్లు కేకవైచినాడు.

"తాతగారూ! నన్ను ప్రయోగింపకుడు." అనుచు భయమును, దిరస్కారమును దోప విషబాల జాలిగొలుపుచు బలికినది.

"నేను ప్రయోగించెదను. నీవు నాశనము చేయుదువు."

"నన్ను నాశనము చేయుడు తాతగారూ."

"మాటలాడకుము" ఆ స్థౌలతిష్యుని కేక మిన్నుముట్టెను.

విషకన్య నిర్భయముగ నిలచి, దండతాడిత భుజంగమువలె తాతగారి కేకకు మరియు నాగ్రహమునంది

"తాతయ్యగారూ, నేనును మీవంటి మనుష్యబాలికను. నాకును కోపము తాపము, ప్రేమ, జాలి, అన్నియు ఉన్నవి". అని ఆమె స్ఫుటాక్షరములుగా బలికినది.

కాపాలిక గగనియు, అగస్తియు, కాశ్యపియు ఆ బాలికదగ్గరకు పరుగిడివచ్చి 'తల్లీ' తాతగారి ఆజ్ఞను పరిపాలింపుము. ఈ కార్యములు మనుష్యులొనరించునవి కావు. దైవకృతములు. దైవప్రీతికరములు. మనము వీనినడ్డరాగదు." అనిరి.

విషకన్యక వారిని విదలించుకొని పద్మపీఠమునుండి దిగి, గబగబ పరుగిడిపోయి "యీ సర్వమును సృష్టించిన ఓ భగవంతుడా, ఓ మహేశ్వరుడా, నీ ప్రీతికొరకా నేను మనుష్యులను చంపవలసినది! నీవు పుట్టించిన మనుష్యులను నీవే చంపి తిందువా? ఈ యకార్యమునకు సాధనమగుటకు నేనేమి జడమునా? నేను ప్రేమించగలను; ద్వేషించగలను. నావలచిన పురుషుని నేను స్పృశింపగూడదా! స్త్రీజన సామాన్యమగు యీ సుఖమునకు నేను దగనా? ప్రేమించని పురుషుడు నన్ను ముట్టుకొననొల్లను. నాపై దురాక్రమణము చేయువాడు హతుడైన నగుగాక. ఎవరో కృష్ణశాతవాహనుని చంపుటకు నన్ను ప్రయోగము చేయుచున్నారట. అతడు నన్ను ముట్టుకొనుటకు నాకు యిష్టముఅగునో? యిష్టము

కాదో? నాకిష్టమైనను అతడు నన్ను ముట్టుకొని చచ్చిపోవునుగదా! శివదేవా! అతని నేను వలతునేని నీవే యాతనికి రక్షకుడవుగమ్ము.”

ఆమె కన్నులనీరు నీలికలువపూవులలో నిలచిన హిమబిందువులైనవి.

“నీవు ఫాలలోచనుడవు. నీవు నీ ఫాలలోచనములో దుర్మార్గులను భస్మము చేయుదువట. అబలయగు బాలికచే మనుష్యులను చంపుటకు నీకు మార్గమే లేదా? నా గొంతుకోసినకాని యీ దారుణ కర్మము నేరవేరదా? ఉమాపతీ! నాకు పతిభిక్ష పెట్టుము నన్ను పాషాణమునైన చేయుము, లేదా, నా స్త్రీత్వమును సార్థకమొనర్పుము. నాకు నాకు భర్తను బిడ్డలను అనుగ్రహింపుము.

విషకన్యక వెక్కివెక్కి యేడ్చినది. స్థౌలతిష్యుడు మారుమాట మాటాడక గగని మొదలగువారిని వెనుకకు పొండని సైగనొనర్చి విగ్రహమువోల బడియున్న విషకన్యకపై మంత్రజలములు చల్లి “శ్రీకృష్ణ శాతవాహన నాశనమునకై యీ బాలికను ప్రయోగించుచున్నాను” అనుచు అగ్నిహోత్రమున సమిధలు, నేయి హోమమొనర్చెను.

మహేశ్వర విగ్రహసమీపమందున్న దీపములన్నియు ఒక్కసారి ఆరిపోయినవి. ఆరిపోయిన దీపపుకొడులనుండి పొగలొక్కసారిగా పైకెగసినవి. స్థౌలతిష్యుడు రిచ్చవడి నిలిచెను. పూర్ణాహుతిని మంత్రవేత్తలు అర్పించిరి. మంత్రాగ్నికిని, భగవంతునకును పూర్ణారతి సమర్పింపబడినది. శంఖంబులు మ్రోగినవి. స్థౌలతిష్యుడు అచ్చటినుండి వెడలిపోయెను.

విషకన్యక చైతన్యరహితయై సర్వమును మరచి ఆవిగ్రహమువోల పడియుండెను. ఆమె చేతులాశివలింగమును చుట్టియున్నవి. భయంకరుడైన మృత్యుదేవునకు భయపడిన బాలకుడగు మార్కండేయునివలె విషకన్యక కాలకాలుడైన శివునే శరణు జొచ్చినట్లయినది.

అనేక యుగయుగాలనుండివచ్చు ఆర్యఋషి ప్రతిభా ప్రవాహమునపుట్టి పెరిగిన కమలమా బాలిక. ఆమెలోని చైతన్యమొక్కపరి స్పందించినది. వ్యక్తావ్యక్తమై ఆమె జ్ఞానము వికసించినది. సర్వభూషణాలంకృతయై, దుకూలాంబర ధారిణియై విరచిత ద్వివేణియై, దహింపబడిన మన్మథునిసతి, రతీదేవివలె ఆమె అచ్చట పడియుండెను.



తమోమయమైన ఆమె అంతరాకాశమునందు చీకట్లు కదలినవి. దూరదూరమున ఎచ్చటనో మిణుకుమిణుకుమను కాంతి కన్పించినది: ఆ వెలుగు పెరిగిపెరిగి శీతలప్రసన్నద్యోతులు వెదజల్లుచు తనగర్భమున దాగియున్న బాలేందుశేఖరుని మూర్తిని స్పష్టమొనరించినది. అతడు తియ్యనిమాటల—

చంద్రబాలా! నీవు నా శరణుజొచ్చితివి. నీవు నేటినుండి అమృతకలశివిగాని మృత్యుశిలవు గావు. బుద్ధుడేమి, వీరుడేమి, ఎవరైనను నా ఛాయలుమాత్రమే. ఇవి యన్నియు నా విలాసములు, అనుగ్రహింపబడితివి పొమ్ము” అనుమాటలు ఆమెకు వినంబడినట్లయినది

విషకన్య చటుక్కున లేచినది. చిరునవ్వు ఆ మోమున కాంతిద్యుతులు లీనినవి. ఆమె లేచి తలవంచుకొని బసలోనికి నడచిపోయినది. ఆమె వెనువెంటనే గగనియు కాశ్యపియు వెడలిపోయినారు.



# త్రింశత్ ప్రకరణము

## పరాస్కంధము

సువర్ణశ్రీ మనస్సునకు ఊరట లేదు. కేవలా దోలాయమానములగు మనస్సులో, బుద్ధిలో, హృదయములో ప్రళయకాల ప్రభంజనములు ఎడతెరిపిలేని బడబానల దావానలములు చెలరేగుచున్నను మహాగ్నిగర్భమగు పర్వతమువలె పైకుశాంతుడై నిర్వికారునివలె తిరిగి యింటికి వచ్చెను

ఆ గ్రీష్మదినమున ధాన్యకంటకము మరియు మండిపోవుచున్నది. సాయంకాలమైనను మలయానిలములు తిరుగలేదు. నగరవాసులందరు గృహముల నుండలేక నదియొడ్డుకు పోవువారును, ఉద్యానవనముల కేళాకూళులకడ కూర్చుండువారును, శీతలోపచారములు చేసికొనువారును నై యుండిరి.

క్రిందటి దినముననే ధాన్యకటకము చేరిన సువర్ణశ్రీ సాయంకాలమున కృష్ణాతీరమున సంచరించుచు ఇంటికిపోవు హర్షగోపుని దూరమున జూచినాడు. ఆ హర్షగోపుని పిలిచి మాటలాడవలయునను కాంక్ష సువర్ణునకు పొడమినది గాని సిగ్గుపడి అటులనే నడచి పోయినాడు.

మరునాడు ఉదయమున సువర్ణశ్రీకుమారుడు లేచి పెరుగులో వెన్న తీయుచున్న తల్లికడకు వెళ్ళినాడు

“అమ్మా, చిన్నమామయ్య ఒకటి, రెండు నెలలలో సముద్రప్రయాణము చేసి సువర్ణద్వీపముదాటి యవద్వీపమునకు పోవునట. ఉత్తములగు శిల్పులచే యవద్వీపమున రాజ్యముచేయు జయశ్రీ శాతవాహన మహారాజు ఒక మహాచైత్యము నచ్చట నిర్మింపజేయుచున్నాడట. ఆ చైత్యనిర్మాణశిల్పి కులపతిగా చినమామయ్యకు సగౌరవముగ జయశ్రీ శాతవాహన మహారాజు ఆహ్వానించెనట. నేను మామయ్యతో యవద్వీపము పోవ సంకల్పించుకొన్నాను.”

“అమ్మరొయ్యో; సముద్రప్రయాణమే! మాతమ్ముడు వెళ్ళుటయే? వాడు వట్టి వెఱ్ఱివాడు. వెళ్ళవద్దని మీ అక్క ఆజ్ఞ యిచ్చుచున్నదని చిన్నమామయ్యకు తక్షణము లేఖవ్రాసి గజవార్త పంపుము.”



“సముద్రయానమంటే అంత భయమేమి అమ్మా? దివ్యశ్రీ సంఘమిత్రాదేవి ధర్మము దిశలన్నియు ప్రసరింపజేయ సముద్రయానము చేసి సింహళాది ద్వీపములకు పోలేదా?”

“బాబూ యీ వెఱ్ఱిమాటలు మాటలాడకు. నీకు దేశములే తిరగవలయునన్న గయాది క్షేత్రములకు పొమ్ము.”

“మెట్టప్రయాణము ముసలమ్మ చేయగలదు. ఓడప్రయాణము భయమా? ఏదో ఒకటో రెండో తప్ప తక్కినఓడలన్నియు సురక్షితముగ ప్రయాణము సాగించుట లేదా అమ్మా!”

“నిన్న మీ నాయనగారు పంపిన ఉత్తరము చూచినావుకదూ నాన్నా?”

ఇంతలో మహాలి వేగమున తెల్లనగు మోమున అచ్చటకు పరువిడి వచ్చినది. ఆమెకు మాటరాలేదు. “హిమబిందు!_” అని కేకవేసినది. శక్తిమతియు సువర్ణశ్రీకుమారుడును ఇరువురు వులికిపడిరి. సువర్ణుని గుండె కొట్టుకొన్నది. ఏమది! ఆమె వచ్చుచున్నదా?

శక్తి:— హిమబిందు!

మహాలి:— దొంగలు ఎత్తుకొనిపోయినారు!

సువర్ణ:— [పెద్దగొంతుకతో] ఎవరిని?

మహాలి:— హిమబిందును!

శక్తిమతి:— ఎవరినీ?

మహాలి:— హిమబిందునమ్మా! చారుగుప్తులవారి కూతురు.

సువర్ణ:— ఓసి నీయిల్లు బంగారముకానూ! వెఱ్ఱివెఱ్ఱి మాటలు మాటాడక తిన్నగా చెప్పు.

మహాలి:— కాదమ్మా, నిన్న రాత్రి యెనిమిది నాళికలు మ్రోగినప్పుడు ఎలా వచ్చారో హిమబిందు కుమారికను దొంగలు యెత్తుకొని పోయినారట!

శక్తిమతి:— ఆఁ! ఆఁ! ఎంత విడూరము!

మహాలి:— ఆమెను, ఆమె ముత్తవతల్లిని కూడా ఎత్తుకొనిపోయినారట.

శక్తిమతి:— బాబూ అది యేమిటో తిన్నగా కనుక్కురా! యేమిటో అంటుంది. అక్కడ సువర్ణశ్రీ కుమారుడు లేనేలేడు.

శక్తిమతి:— అప్పుడే తుఱ్ఱున మాయమయినాడు. చెప్పినది నిజమేనా?

మహాళి:— ఔనుతల్లీ! పట్టణమంతయు గోలగా చెప్పుకుంటున్నారు.

సువర్ణశ్రీ కుమారుడు చారుగుప్తుని భవనమున కొక్కయంగలో వ్రాలినాడు. జనులు ఇసుక రాలనట్లు అక్కడ మూగియుండిరి. రక్షకభటులు కావలియున్న చారు గుప్తుని భవనమెట్లు చేరిరని కొందరు. కక్ష్యాంతరములన్నియు గడచి వారు లోని కెట్లు వెళ్ళిరని కొందరు, నగలు నాణెములు ధనధాన్యములతో తులదూగు నా భవన ములు చారుగుప్తుని కుమార్తెను, ఆమె ముత్తవను తస్కరించుట కడు విచిత్రమని మరి కొందరు, ఇది ఆంధ్రరాజ్య శత్రువులు సల్పిన కుట్రయని కొందరు, చారుగుప్తునికడ వెలలేని ధనముల సంగ్రహింప మేధావులగు చోరశిఖామణు లొనరించిన కార్యమిది యని కొందరు, చారుగుప్తుని విరోధులెవ్వరో రచించిన మాయయిది యని కొందరు పలువిధముల చెప్పుకొనుచుండిరి.

పట్టణము కాపాడుచున్న ఉప వైశ్యాధ్యక్షుడు కొందరు చమూపతులతో, చారులతో వచ్చియున్నాడు. సువర్ణశ్రీకుమారుడు నెమ్మదిగా జనసమ్మర్దము ఒత్తి గించుకొనుచు భవన గోపురద్వారముకడకు చేరినాడు. లోనికి వెళ్ళుటకు ప్రయత్నింప ద్వారమున కావలిగాయు సైనికులు అడ్డగించిరి. అతనికి కోపము వచ్చినది.

"ఉప వైశ్యాధ్యక్షులతో ధర్మనందులవారి పుత్రుడు సువర్ణశ్రీ వచ్చినాడని చెప్పుము."

భటుడు:— ఇపుడు వీలుపడదు. కొంచెము తాళుడు.

లోన నేమి జరుగుచున్నదో చూచుటకు కుతూహలము పడుచున్న జనులందరు సువర్ణశ్రీకుమారుని చుట్టును మూగి లోనికి పోనిండని కేకలిడిరి.

ఈ గడబిడ విని యచ్చట తిరుగాడుచున్న దళవాయి యొక్కడు అక్కడకు వచ్చెను. అతడు సువర్ణశ్రీకుమారుని గని గురుతుపట్టి లోనికి తీసికొనిపోయెను. సువర్ణశ్రీ కుమారుడు కక్ష్యాంతరములు గడచి బాలనాగితో మహాధ్యక్షులగు కాకుం దకులవారు మాట్లాడుట చూచెను. బాలనాగి యేమో చెప్పుచుండెను.

బాల:— మేమిద్దరము చాలాకాలము మాట్లాడుకొనుచు ఆ తోటలో నుంటిమి. ఇంతలో ఎవ్వరొ నల్గురు మనుష్యులువచ్చి గుడ్డలు మా ముఖములకుగట్టి నోట గుడ్డలు



కుక్కినారు. నాకు మతి తప్పిపోయినది. మరల మెలకువవచ్చి చూచునప్పటికి నేనా ప్రదేశముననే పడియుంటిని. నానోట గుడ్డలున్నవి. కాని చేతులు కట్టబడకయుండు టచే నోటనున్న గుడ్డలు దీసికొని కన్నులువిప్పి చూతునుకదా హిమబిందుకుమారిక చుట్టుప్రక్కల నెక్కడనులేదు. తూర్పు తెలతెల్లవారుచున్నది భయముతో బెద్ద కేకలు పెట్టితిని తోటపనివారు, రక్షకభటులు, కొందరు దాదులు పరుగెత్తికొనివచ్చి నారు. వారితో హిమబిందుకుమారిక ఏదని అడిగితిని వారు నీకు మతిపోయినదా పడకగదిలోనె యుండును. ఏల నీవీకేకలు పెట్టుచున్నావని అడిగిరి. పరుగుపరుగున అభ్యంతర మందిరమునకు పోయితిని. ఆమె అచ్చటలేదు. వేసినపక్క వేసినట్లే ఉన్నది. పరుగెత్తుచునే రాత్రిజరిగిన సంగతు లందరికి చెప్పుచుంటిని. దాదులిటునటు పరుగెత్తిరి. ఆమె యెక్కడనులేదు. ముక్తావళీదేవిగారును కన్పింపలేదు వారితో చెప్పుటకు పరుగెత్తుచు వారి శయనాగారమునకు పోవ అక్కడ తెరలు చిందరవంద రగా నుండెను. రత్నకంబళిపై బురదతో వున్న అడుగుల చిహ్నములు కాన్పించినవి. ఇరువురిని చోరులెత్తుకొని పోయినారని గగ్గోలు బయలుదేరినది.

కాకుం:— భవనోద్యానవనములో నేవైపున ఇయ్యది జరిగినది

బాల:— ఉత్తరమున మాలతీలత పొదరిండ్లకడనున్న చంద్రశిలావేదిక ప్రక్క నున్న లతామంటపములో కూర్చుండియుంటిమి.

సువర్ణశ్రీకుమారు డచ్చటకు పరువిడెను. అచ్చట చిందరవందరగా అడుగుల జాడలు కాన్పించినవి. అయ్యవి కోటగోడవఱెనున్న భవనబాహ్యకుడ్యముల వరకు నున్నవి. అచ్చట హిమబిందు వస్త్రమునుండి చిరిగినముక్క కన్పించినది. అప్పుడ క్కడ కొందరుభటులు నొకమంత్రియు నుండిరి. సువర్ణశ్రీ అమితవేగమున సింహద్వా రము వెంబడి భవనకుడ్యములచుట్టి, యెచ్చటనుండి చోరులు గోడలదాటిరో అచ్చటకు వచ్చెను. అచ్చట జనములు ప్రోవై యుండిరి. అతడు నెమ్మదిగా అడుగుల జాడ తీయుచున్న ఒక పర్ణకశ్రేష్ఠుని, ఒక చమూపతిని సమీపించి వారిరువురు అనుకొన్న మాటల వినియెను.

చమూ:— ఈ జాడలు కృష్ణఒడ్డువరకు నున్నవట.

పర్ణ:— అంచెగుఱ్ఱములమీద హుటాహుటిగా పోయియుందురు.

చమూ:— మహామాయా ధురంధరులగు వేగులవాండ్రు జాడ నరయుటకై సాగిపోయినారు. చారుగుప్తుని అశ్వశాలలలో ప్రసిద్ధాశ్వములనెక్కి దళవాయులు కొందరు వారిని వెంబడించినారు.

*

# ఏకత్రింశత్ ప్రకరణము

## చంద్రస్వామి

చంద్రస్వామి స్వచ్ఛహృదయాంగల వ్యాఘ్రదేశాంధ్ర బ్రాహ్మణుడు. త్రియీపాఠి, దార్శనికుడు. వేదాంతి.

చంద్రస్వామి హృదయము స్థాలతీర్థ్యమహర్షి చూరకొన్నాడు. ఆమహర్షి మహోత్తరసంకల్పము చంద్రస్వామిని ఉత్తేజిని నొనరించి, స్థాలతిష్యుని ప్రయత్నములలో నొకనాయకుణ్ణి చేసినది. స్థాలతిష్యునకు చంద్రస్వామి గుణగణములు తెలుసును. అతనిమనస్సు అతిమెత్తన యనియు. రహస్యములు దాచుకోలేనిది యనియు ఆయన గ్రహించినారు. కావున చంద్రస్వామి పండితులను స్థాలతీర్థ్యులు అత్యంత రహస్యాలోచనలకు రానిచ్చువారుకారు.

చంద్రస్వామి స్థాలతీర్థ మహర్షి మహోత్కృష్టపెరుగును. జంబూద్వీపమునగల బ్రాహ్మణులు ఆమహర్షిని శంకరావతారమనియే ఎంచుకొనుచుండిరి. ఆయనపేరు వివిధ ఋష్యాశ్రమముల వివిధనగర, గ్రామ బ్రాహ్మణగృహముల అత్యంతభక్తితో స్మరింపబడునది. స్థాలతిష్యుని శిష్యులు దేశదేశమున మహోద్దండ పండితులై, వివిధ వేదాశ్రమముల కులపతులై, ఆ మహర్షి బోధనల దేశదేశములు ప్రసరింపుచుండిరి.

ఒక్కొక్క అర్హతుని, ఒక్కొక్క మహాపండితుడు తారసిల్లి బౌద్ధధర్మము నిరసింపుచు, వాదనకు వారిని పురుకొల్పి, నిరుత్తరులను చేయుచుండెను.

చంద్రస్వామి భక్తితో తన్ను స్థాలతీర్థ్యమహర్షి చేయుమనినపనులు గాఢాభిమానమున, శ్రద్ధతోడను నిర్వహించుచుండెను.

చంద్రస్వామిని అనార్షవాదులతో వాదనకై వాతనము స్థాలతీర్థుడు నిశ్చయించెను. అతని ననుమానించి అంధ్రాపురసర్పులు మహామంత్రికి నివేదించుటరు. వారు చక్రవర్తికి తెలిపిరి. చక్రవర్తియు చంద్రస్వామిని బంధించి, అతనిపై నేరమారోపించి శిక్ష విధింపవలయునని మొదలనిచ్చిరి.



చంద్రస్వామి ద్రోహియని మనచక్రవర్తికి నమ్మకము కుదరలేదు. చక్రవర్తి అమృతపాదులకడకుపోయి తమ యనుమానములు తెలిపినారు. అప్పుడా అర్హతులు చంద్రస్వామి చరిత్రనంతయు విచారణసలుప, నేరస్థుడు కాడనియు, ఉన్న సాక్ష్యములవలన శిక్షపడవచ్చుననియు. అప్పుడు చక్రవర్తి ఆశిక్షను రద్దుచేయించవలయుననియు. తాము స్వయముగ నా ఆజ్ఞాపత్రిక న్యాయస్థానమునకు తీసికొనిపోదుమనియు తెలిపిరి.

చక్రవర్తి విచారణజరుగు దినమున తమ ఆజ్ఞాపత్రిక, తమగురువులకు సమర్పించిరి.

ప్రాడ్వివాకులు శిక్షవిధించుటయు, అమృతపాదులువచ్చి చక్రవర్తి ఆజ్ఞాపత్రము చూపి చంద్రస్వామిని తీసుకొనిపోయినారు.

చంద్రస్వామి ప్రాణమునకు భయపడలేదు, కారాగారవాసమునకు భయపడలేదు అమృతపాదులను చూడగనె చంద్రస్వామికి స్థాలతిష్యులనుజూచిన గురుప్రేమ కలిగినది.

అమృతపాదులు ధాన్యకటక మహాచైత్య సంఘారామమునకు చంద్రస్వామిని గొనిపోయిరి.

ఎవరీ మహాపురుషుడు. మూర్తినందిన శాంతతేజస్సున ఈ బౌద్ధాచార్యులు అపర బౌద్ధదేవునివలె నున్నా . ఈ పుణ్యపురుషుని చూచిన తన గురుపాదులగు స్థాలతీర్థ్య మహర్షిని చూచినట్లున్నదేమి! వీరికిని వారికి పోలికలున్నవి. ఎత్తు, మోముతీరు, కనులు, కంఠస్వరము, రూపము ఇంతపోలికలున్నవేమి. మహాపురుషులు ఆర్షధర్ములైననేమి, బౌద్ధధర్ములైననేమి ఆట్టిదివ్యస్థితి నందునప్పటికి ఒకేరూపము నందుదురుగాబోలునని చంద్రస్వామి తలపోసెను.

కులము తేడాలులేని బౌద్ధాశ్రమమున చంద్రస్వామి భిక్కులతో కలిసి భోజనమాచరింపక తనవంట తాన చేసుకొనుచుండెను.

చంద్రస్వామికిని అమృతపాదార్హతులకును దీర్ఘమగు వాదోపవాదములు జరుగుచుండెను.

చంద్రస్వామి బోధిసత్వుని జీవితమొక్కటరి సంపూర్ణముగ నాలోచించుకొనెను. శాక్యవంశోద్భవుడై కపిలవస్తునగరమున రాజగు శుద్ధోదనునకు మాయాదేవి జన్మించిన దివ్యపురుషుడు, మాయాదేవి పుత్రుడు బుద్ధునితనయు సిద్ధార్థుడు జన్మించిన

ఏడవదినమున మాయాదేవి నిర్యాణమందినది. ఆబోధిసత్వుని అత్యంత జాగరూకతగ పెంపకము చేయుచు మహాప్రజాపతిగౌతమి పెంచినది. అతని పదునారవఏట. తనయుఁడుది, జగ దేకసుందరి కోలిరాజ్యాధిపునితనయ యశోధరను బోధిసత్వునికి వివాహముచేసిరి. బోధిసత్వుని ఇరువదవఏట రాహులుడను పుత్రుడాయనకుద్భవించెను.

ఇరువదియెనవఏడు వచ్చినంతవరకు సిద్ధార్థుడు భార్యతో తనయునితో రాజకుమారుడు పొందు సర్వసౌఖ్యములు నందుచుండెను. కాని విధివశమున ఆ మహాపురుషుడు ప్రపంచబాధలను దుఃఖమును తనకండ్లారచూచి అనంతవిచారము నందెను.

ఆయనహృదయమున దివ్యసందేశము వినవచ్చినది. సూతుడగు ఛన్నుని సహాయమున ఆదివ్యమూర్తి అభినిష్క్రమణమొనర్చి వైశాలిచేరి ఆరాధకాలామపండితుల శిష్యుడై ప్రపంచ, సృష్టి రహస్యముల నెరుగజొచ్చెను. కాలామపండితులు కపిల మహర్షి ప్రతిపాదించిన సాంఖ్యవాదము ననుసరించు మహాపండితుడు.

ఆయన పాదములకడ సాంఖ్యమునదివి గౌతముడు కాలామపండితుని వీడి బోధిసత్వుడు ఉద్రికరామపుత్ర మహాపండితుల శిష్యుడయ్యెను. రామపుత్రపండితులు కణాదమహర్షి ఉపదేశించిన వైశేషికము ననుసరించువాడు.

అచ్చట వైశేషికమంతయు నభ్యసించినవెనుక బోధిసత్వుడు గయాకడ ఉరువిల్వాశ్రమముచేరి, ఆ ఆశ్రమ కులపతియగు కౌండిన్యమహర్షి శిష్యుడై యోగము నేర్చుకొన నారంభించెను.

ఆయన యోగసమాధులలో ఉండునప్పుడు నైరంజననదిలో స్నానముచేయుచు అధికనీరసముచే మూర్ఛపోవునంతపని అయి ఒడ్డుకువచ్చి సొమ్మసిల్లి పడిపోయెను. అప్పుడే సుజాత బోధిసత్వుని రక్షించెను. అప్పుడు బోధిసత్వుడా యోగవిధానము విసర్జించెను.

ఆ ఆశ్రమప్రాంతమందొక రావిచెట్టున్నది. ఒక దివ్యాతిదివ్య ముహూర్తమున ఆ రావిచెట్టుక్రింద పద్మాసనబద్ధుడై బోధిసత్వుడు పరమసత్యముల కనుంగొనెను.

చంద్రస్వామి ఇట్లు బుద్ధచరిత్రయంతయు తెలిసికొనెను.



# ద్వాత్రింశత్ ప్రకరణము

## ఆంధ్రబ్రహ్మర్షి

స్థౌలతిష్యులవారు చంద్రస్వామి విషయమంతయు ఎప్పటికప్పుడు తెలుసుకొనుచునే యున్నారు. చంద్రస్వామి బౌద్ధశ్రమణకులకడ బౌద్ధధర్మములు, వేదాంతము నేర్చుకొనుచుండెననియు, కాని తన ఆర్షధర్మము విడనాడకయే మెలగుచుండెననియు తెలుసుకొనెను.

ఆబాలకుడు తనకడ ప్రపంచజ్ఞానమంతయు నేర్చుకొన్నాడు. ఒక దృక్కోణమునుంచి దర్శించిన దృశ్యమునందు దోషములు కనబడవచ్చును. ఆ దృశ్యస్థలమునకే బోయి పరిశీలించినచో ఆ దోషములేమియు గోచరము కాకపోవచ్చును.

స్థౌలతిష్యుడు తన ప్రతిష్ఠానపుర ప్రాంతాశ్రమము చేరుకొన్నను తన ప్రియశిష్యుడగు చంద్రస్వామిని గూర్చియే యాలోచించుకొనుచుండెను.

స్థౌలతిష్యుడు పదిసంవత్సరములలో ఆర్యావర్తము, దక్షిణాపథము, సువర్ణద్వీపము, గాంధార, బాహ్లిక, తురుష్క పారశీకాది దేశములన్నియు సంచారముచేసి, కాశ్యపుల, కౌండిన్యుల, పారాశర్యుల ఓడించి వారినందరిని అద్వైతవాదుల నొనరించి, నూరుల ఆశ్రమముల స్థాపనమొనరించి, పండితోత్తముల, మహర్షుల తన వివిధాశ్రమములకు కులపతుల నొనర్చెను.

చంద్రస్వామి బౌద్ధగ్రంథముల [illegible] పాఠమొనర్చెను గాని, హృదయస్థము గావించుకొనలేదు. బౌద్ధ [illegible] పఠించువలయునవియే చదివెనుగాని, వాని తత్వము గ్రహించవలెననుకొనలేదు.

చంద్రస్వామి [illegible] ఆశ్రమము ప్రవేశించి బుద్ధధర్మతత్వము నెరుంగజొచ్చిన నాట [illegible]

"పండితులవారూ! [illegible] ధర్మము సత్యమనియు పరధర్మము భయావహా [illegible] వలంభించి పరధర్మావహా [illegible]"

"స్వామీ! ఒక క్రూరమృగము అహింసాస్వరూపములగు గోవు మొదలగు వానిని చంపబోవుచుండ మనము చూచితిమి. ఆ క్రూరమృగమును మనము నిర్జింపవలయునా వలదా?"

"మీరు క్రూరమృగమును నిర్జింపనవసరము లేదు. మనుష్యుడు సంపూర్ణ అష్టమార్గావలంబియైనచో అతని సత్వము, సత్యము, ప్రేమ క్రూరమృగములోని క్రూరత్వమును నాశనము చేయగలవు."

"అందరు అష్టమార్గావలంబన చేయగలరా స్వామీ?"

"ఎందుకు చేయలేరు. ఆర్యాపథమున తక్కిన మ్లేచ్ఛదేశములకన్న సంస్కారము, జ్ఞానము, దయా, సత్య శౌచాదులు ఎక్కువగా నున్నవా కాదా?"

"జంబూద్వీపమున ఋషులసంతతులు గదా?"

"ఇతర ద్వీపముల ఎవరిసంతతి వారు? భగవంతుడున్నాడని యనినచో అందరును భగవంతుని సంతతియే కదా?"

"భగవంతుని ముఖమునుండి జనించినవారు బ్రాహ్మణులు!"

"మ్లేచ్ఛులు స్వేదమునుండియో, పాదనఖములనుండియో జనించిరి కాబోలు నేమి?"

"కావచ్చును."

"కావచ్చునా పండితులవారూ? ఒకసారే బ్రహ్మముఖమునుండి ఇంతమంది యని లెక్కప్రకారము బ్రాహ్మణులు జన్మించినారు కాబోలు. వారు ఇతర ధర్మముల పాలయినచో వారు ఏపాదజనితులో అయిపోవుదురు కాబోలు? శుద్ధబ్రహ్మము రూప, నామ, గుణాది సమస్తములకు అతీతము కదా ఉపనిషత్ ప్రకారము. అట్టిచో బ్రహ్మ యేమి, విష్ణువేమి? వీరెట్లు వచ్చిరి. అందరిని ... బ్రహ్మవాదమట్లుంచి ఉన్న యీ దుఃఖమయ ప్రపంచమునందున్న దుఃఖము ... పోవుటకు అష్టమార్గము తథాగతుడుపదేశించినది."

"స్వామీ! బుద్ధధర్మమునందును ... జైనాద్యాది వాదములు వచ్చిన కారణమేమి?"

"ప్రపంచమున ఇట్టి ... చేయుండును. సమన్వయము ... క్రొత్తవి ఎక్కడ



నుండియో ఉద్భవించవు. అవియన్నియు రూపముమాత్రము మార్పుచెందు కారణ కార్య జనితములగు భావములు మాత్రము."

ఈవిధములగు వాదనలు అమృతపాదార్హతులతో సలిపి సలిపి, అష్టమార్గములలో ప్రేమ అత్యంత శక్తివంతమైనదని నమ్మకమునకు వచ్చి, సర్వభావములకు, సర్వధర్మములకు సమన్వయము చేయ సంకల్పించెను.

బ్రహ్మపదార్థము నొప్పుకొనని వైశేషికము, ఆర్షము కాలేదా, వైశేషికము, సాంఖ్యము ఉత్తరమీమాంసపూర్వమీమాంస ఆర్షధర్మవాదులు సమన్వయము చేసుకొనిరి కదా? శ్రీకృష్ణభగవానుడు తన గీతలయందు ... యుపదేశించెను కదా? వివిధములైన ఇట్టి యాలోచనలు చంద్రస్వామి నావరించెను.

చంద్రస్వామి అమృతపాదార్హతుల వెన్నెలవెలుగులో ఒదిగిపోయి తనధర్మము విడనాడ పరధర్మము భయావహము కాదనియు, తమధర్మమునదలి ఎందునకు చెందని మూర్ఖులని పరధర్మము భయావహమని శ్రీకృష్ణపరమాత్మని యుపదేశమునకు భావమని ఆతడు నిశ్చయమునకు వచ్చెను. ఆనాటినుండియు ఆతడు చక్రవర్తికి, సామ్రాజ్ఞికి సన్నిహితుడైపోయెను.

స్థాలతీష్యమహర్షి శ్రీచంద్రస్వామి చరిత్రఎప్పటికిప్పుడు తెలియుచునేయున్నది. చంద్రస్వామి ఎట్లా అమృతపాదార్హతుల వాదనలకులోనై తన కర్మకాండలో కొలది కొలదిగ మార్పు తెచ్చుకొనుచున్నాడో అటులనే చంద్రస్వామి వాదనలును బౌద్ధ సన్న్యాసుల హృదయములను మార్పులు తెచ్చెను. మార్పునుబట్టి భావములును మారుచుండును. ఒక్కొక్క శక్తివంతమగు భావమునకు ఒక్కొక్క ముఖ్యవాదనకు, ఒక్కొక్క మూలపురుషుడుద్భవించును. ఇటుల ఏకమార్గమున నడుచు నీ హీనధర్మపరులు వివిధశుధగాములగుదురు. అటులకూడ తన దివ్యప్రయత్నములకు జయము సమకూడును. బహుశాఖాచంక్రమణము ఏధర్మమును భువిని నిలువలేదు.

ఈ ఆలోచనలతో నా మహర్షి తనయాలోచనామందిరమున కృష్ణాజినముపై అధివసించియుండెను.

ఆతని మహోత్కృష్టిలో, ఆర్షధర్మవ్యతిరేకులగువారు నాశనమై, ఆతని అఖండ సంకల్పమున ధర్మము నాలుగుపాదముల నడచి, ఆతని గాఢతపస్సులో సర్వవేద

ములు సర్వ విశ్వమును పవిత్రమొనర్చి మనుజాలే దేవతాస్వరూపులై జగమ్ము పునరావతారమెత్తవలెను.

హిమాలయ భూధర పవిత్రప్రదేశముల దివ్యక్షేత్రములు మొందు తాసాగ్రప్రదేశముల రాకుమారి ఉద్యానవనమున తిరుగాడినట్లు తిరిగినాడు. బదరికాశ్రమమున తపస్సొనర్చెను. కేదారేశ్వరమున జ్ఞానముద్ర ధరించెను.

గంగోత్రి, యమునోత్రి, సింధునదీజన్మస్థానము, మానససరోవరము కైలాస పాదముల ప్రోల తాను పెక్కు సంవత్సరములు తపస్సు చేసినాడు. నేడు తన సంకల్పము ఈడేరకుండుటెట్లు? జంబూద్వీపమునకు పరిత్రాణము కాకుండుటెట్లు?

చాదుగుప్తుడెట్లు బంగారురాసులు కొండలు కట్టించెనో, స్థాలతిష్యుడట్లు బంగారును తన సంకల్పమునకై కొండలు ప్రోవు చేసెను.

అతడు త్రివిష్టపమునందే, గంగోత్రిప్రాంతమునందే బంగారు గనులు త్రవ్వించెను. కైలాస ప్రాంతీయులైన యక్షులాతనితో బంగారువర్తకము చేయువారు. భిక్షులగు వణిక్ శ్రేష్ఠులు, మహారాజులు స్థాలతిష్యుని వివిధాశ్రమములు ధనరాసులు పోయుచుండిరి.

ఈ లెక్కలేని ధనసహాయమున నాతని యాశ్రమముల మనుష్య, పశు వైద్యములు మహోత్తమమగు స్థితియందుండెను.

ధాన్యకటకమున అతిపురాతన క్షేత్రమగు నమ[illegible]నకు ఉత్తుంగ దేవాలయము నిర్మించెను. ఆంధ్రదేశమెల్లెడల నూతనదేవాలయము[illegible] ప్రతిష్ఠ చేసెను.

బహుళమగు నిట్టి ధర్మస్థాపన కార్యముల చేయుచుం[illegible] స్థాలతిష్య మహర్షి ఆలోచనలన్నియు తన మనుమరాలు విషబాలికపైననే యున్న[illegible]విషబాలిక తండ్రియగు తనకొమరుడు ఏటుల తన ప్రాణము విధికి సమర్పించెను. [illegible]పరమార్గమేమి?

విషకన్యక ఏమహత్కార్యమునకై తన తపస్సున వినియ[illegible]య్యెనో యా కార్యము సఫలీకృతమొనర్చి తన సంకల్పమునకు విజయము చేకూర్[illegible]నా? యన్న ప్రశ్న యామహర్షి హృదయము శోధించుచుండెను.

ఇంతకు ఏమగునని యాబ్రహ్మర్షి సర్వవిశ్వము వేచుచుండెను.

# త్రయస్త్రింశత్ ప్రకరణము

## నాగబంధునికా హృదయము

నాగబంధునిక సంపూర్ణారోగ్య సమన్వితయైన యౌవనవతి. ఆమె స్ఫష్టా నదిని వరదలు పొంగి పరవళ్ళతో పోవుచున్నను అన్నగారితో సమముగ ఈదగలదు. గుఱ్ఱపు పందెమున అన్నగారితో సమముగ పరుగెత్త గలదు.

తమ ఇంటనే పెరుగుచు తనకు చిన్ననాటనుండియున్న మహాబలగోండు యొద్ద కడ ఆటవికవిద్య నాగబంధునిక అభ్యసించి. అడుగుల జాడ తీయుటలో, అడవులలో సంచరించు మృగముల పాద కనుగొనుటలో, పక్షుల కూతల వైచిత్ర్యములన్ని ... తేలిగ చెప్పగొనుటలో మేటిదైనది.

అన్నగారితోపాటు చిత్రలేఖనము నేరుచుకొన్నది. సంగీతమునందు గాత్రగానమనిననే ఆమెకు ఎంతయో ఇష్టము. వీణాదులు తాను వాయించవనియు, అవి తాను వినిమాత్రము సంతసమందెదననియు అన్నయు, చెల్లెలును వాయించుచుండ నాగబంధునిక యనినది.

మిక్కిలి కోలమోమున, ఆమె విశాల నేత్రములు సమవాలిక. గంభీరపులుకి మును వర్ణ శ్రీయే పురుషవేషము వేసినాడను భ్రమ కల్పించును.

ఆబాలిక ఎప్పుడును స్వప్నవిషయములు ఆలోచించును. ఆమెకు మైత్రేయి, గార్గి, సంఘమిత్రలనిన మహోత్త గౌరవము. ఆమెకు సత్యభామయనిన పరమప్రీతి. స్త్రీ కత్తి పట్టినగాని లోకమున దుఃఖము నశించదనును. అన్నతో వాదనలు సలుపుచునే ఆబాలిక పెరిగినది.

స్త్రీ ప్రేమించును, తల్లియగును కాని ప్రేమమాత్రజీవియగు బాలిక. ఊరక స్త్రీ మాత్రమగునని ఆమె అన్నతో వాదించును.

“స్త్రీయగు పురుషుని భావమును. పురుషునకు స్త్రీభావమును దుర్భరములు కావా చెల్లీ!”

“ఓయి వెట్టిఅన్నా. పురుషునకు కారము తినువాడును. స్త్రీయనిన వెన్నతినువదియు అవి నీ అభిప్రాయము కాబోలు!”

ఓ!

"అదికాదయ్యా చెల్లిగారూ! స్త్రీయన పెద్దపులియు, పురుషుడన పిల్లియు కావలెనని నీభావము కాబోలు!"

"అవును కాబోలు! కాదోలో, అనబోలోకాని. అనుపురి ఉండకూడదా? వృషభము ఉండకూడదా?"

"అన్నియు ఉన్నవి."

"అందుకని నావాదన స్త్రీ యందు కొంత కర్కశత్వ ముండవలయునని. మన దేశమునందు స్త్రీలు అలంకారప్రియులు మాత్రమై, ఒక పురుషుడు మాత్రము వీరరసహారములకర్హుడగునని తలంచుచున్నారు. అది దేశముల కనర్థదాయకము కాదా అన్నా?"

ఇట్టివాదనలు చెల్లెలికి న్నకును ఎప్పుడును జరుగుచుండెడివి. ఆస్థితిలో నాగబంధునిక సమదర్శి శాతవాహనుని అన్నతో బండిపందెముల సమయమున చూచినది. సమదర్శి శాతవాహనుడు ఆంధ్రవీరుడని, ఉత్తమపురుషుడనియు నామె తలంచినది.

అన్నబండి నాతడు రజ్జువుచే పడవేయ సంకల్పించినాడు. అది అందరును కనిపెట్టలేకపోయిరి. కశాఘాతముచే అన్న సమదర్శి రజ్జువువీడుటయు నామె గమనించెను. అప్పుడామెకు సమదర్శియందు మిక్కుటముగు కోపము కలిగినది. తాను పందెముల రంగస్థలములోనికురికి యాతని ఖండతుండెములుగ నరకివేయవలయునంత బుద్ధి కలిగినది.

అన్నగారి విజయోత్సాహమున ఉప్పొంగి యామెకు సమదర్శిపై కోపము మాయమైపోయినది. సమదర్శి తాత్కాలికమగు తన నైరాశ్యము [illegible]యము కా యథారీతి సంతోషితస్వాంతుడై తాను రెండవవాడుగా వచ్చుటచే అర్పింపబడిన గౌరవములు బహుబతులు అందుచుండెను.

నాగబంధునిక తదేకదీక్షతో సమదర్శిని గమనించుచునే యుండెను. ఆమె హృదయము వేగము వహించినది. ఆమె కన్నులు ఆర్ద్రతవహించెను. తైక్ష్ణములగు ఆ విశాలలోచనాల వెన్నెలవెలుగులు ప్రసరించినవి.

సమదర్శి శాతవాహనప్రభువు ఎవరు అని మహాలివడిగి ఆ సేనాపతి పుట్టుపూర్వోత్తరము లన్నియు ఏదో యాదాలాపముగ నడిగినట్లు తెలిసికొనెను.



విజయియగు నా బాలుని చుట్టును నాట్యముచేయు బాలికలను గుర్తించుచు హిమబిందు నాట్యమాధుర్యమును ఓర్వలేనితనమున జూచుచు, తన్నొకవిధమగు లజ్జతో, ఒకవిధమగు సాభిప్రాయముతో జూచు, ఒకవిచిత్ర సుందరమూర్తి, స్పష్టచాలనకుశల, నాగబంధునికను సమదర్శి గమనించుచు, ఎవరీబాలిక యని ఒకసారి మనమ్మున ప్రశ్నించుకొనెను.

నాగబంధునికను ప్రణయ మలముకొన్నది. గంభీరహృదయ కావున, నేరకని తన భావముల వెల్లడిచేయలేదామె! నిట్టూర్పులు, లోచక ఇటునటు తిరుగుట, తాపోపశమనసేన చేయించుకొనుట మొదలగు విరహిణీ విరహకలాపములా బాలకు నసహ్యము. ఎటులైన తాను పాటలీపుత్ర మహాయుద్ధమునకు బోవును. అచ్చట పురుషవేషమున తనపరాక్రమాదులుచూపి సమదర్శిహృదయము చూరగొనును అని ఆ యోషామణి నిశ్చయమునకు వచ్చినది.

ఆ దినమునుండి హిమబిందుకడకు తానుబోవుటలో హిమబిందుతో గంటయాడుకొనుటలో కాలము గడపుచుండెను.

సమదర్శి ఉజ్జయినిని సంరక్షించు వినీతమతి సేనాపతికి సహాయముచేయ వెడలిపోయెను. అటుల నాతడు వెడలునని హిమబిందుకుమారియే తనతో చెప్పినది. "సమదర్శిబావ పైకి [illegible] విపరీత కాంతికలవాడు నాగబంధూ! అతనికి స్వలాభాపేక్ష [illegible]"

"వట్టి స్వలాభ[illegible] నీ యుద్దేశము?"

"అదికాదు. [illegible] ప్రాణములకైన [illegible] సంశయుడు. అయినను తనకు [illegible] గౌరవములు [illegible] శౌర్యముకలవాడు."

"అది [illegible] యుగములు బ్రతుకగలమ అని సంపాదించ [illegible] కర్చుచేయవలయునా[illegible]"

"[illegible] యునా?"

"[illegible]"

"మా నాన్న గారే అతడు ఉజ్జయినికి వెళ్ళుటకు కారణభూతుడు."

"మేనల్లునికి సర్వవిధముల సహాయము చేయవలసినదే కాదా?"

"అయినా మా నాన్న గారు నేను మా బావను. మా బావ నన్ను తప్పక ప్రేమింప వచ్చునను అన్న భయమున. నాన్న సముద్రునిబావను ఉజ్జయినికి పంపించినారు."

"మీ బావగారు నిన్ను ప్రేమిస్తున్నారా?"

"అదేమిటో నాగబంధూ! మా బావ నన్ను ప్రేమించలేదు. కాని వివాహము చేసుకొనవలయునని ముచ్చటపడువాడు. నా భావములో ఒక్కొక్క యువకునకు ఒక్కొక్క యువతియు, ఒక్కొక్క యువతికి ఒక్కొక్క యువకుడును విధి ఏర్పాటుచేసి యుండునని."

"అయిన పురుషుడేల ఇరువురు మువ్వురు భార్యలను చేసుకొనును బిందూ!"

"స్త్రీ పురుషులు మూడుజాతులుందురు నాగబంధూ! ఉత్తమ, మధ్యమ, అధమ అని. ఉత్తమశ్రేణివారి విషయములో నేను మాటలాడుచుంటిని."

"అర్జునుడు ఉత్తముడా, మధ్యముడా?"

"ప్రేమవిషయమున మధ్యముడే!"

"ఇతరవిషయము లెట్లున్నను, ప్రేమ విషయమునసే నీవు నిర్ణయించిన ఆ మూడు జాతులు అన్నమాట!"

"అవును."

నాగబంధునికిని హిమబిందునకు ఈ సంభాషణ జరిగిన ఎనిమిది దినములకు హిమబిందును ఎత్తుకొనిపోయినారు.

అన్న వెనుకనే నాగబంధునికి హిమబిందు ఇంటికి పోయి అమృతలతాదేవిని ఊరడించి, శాలవాగిని అడిగి అన్ని విషయములు తెలుసుకొన్నది.

అన్న సంరంభమంతయు చూచి యా బాల, హిమబిందు [illegible] అన్న వెడలునవియు, అప్పుడు తానును అతనివెంట సహాయముగ [illegible] బాగుండునను కొనినది. మహాబలగోండుప్రభువు అన్న. తన అన్నగారికి సహాయము చేయునని యామె కు తెలియును. అన్నగారు ఆ చిన్నన్న సహాయము పొందునని యామె యూహించినది.

ఈ సమయమున ఉజ్జయినిలో సముద్రి ఏమిచేయుచుండెను?

# తృతీయ భాగము—ప్రథమ ప్రకరణము

## బెదరింపు

ఒకనాడు సమవర్తికడకు శత్రువులకడనుండి ఒక రాయబారి వచ్చినాడు. వినీతమతియు సమవర్తియు మంతనము సలిపిన వెనుక సమవర్తి రాయబారిని తన మందిరములోనికి రావించెను.

"ఓ సేనానాయకా! వీరాగ్రణీ! నేను నీకు ప్రాణతుల్యములగు కొన్ని విషయముల నెరింగించెదను; నాకు అభయమిచ్చిన వెనుక వానిని మీకు మనవి చేసెదను" అనియు రాయబారి వాక్రుచ్చెను.

"ఓయీ రాయబారము నిండు సభలో సలుపవలయును. అట్టి యప్పుడు నీవు నాతోడమాత్రము మాట్లాడుటకు కోరినందున అనుమతించితిని. రాయబారి ప్రాణ మెప్పుడును సురక్షితము తుచ్ఛులగు వితరులు ధర్మమునను దూరులగుదురేమో! కాని ఆంధ్రవంశము నది. నేను సాతవాహనుడను మేమట్టి యవినీతి యెన్నడును సలుపము నీ ప్రాణము నీయది యు, చెప్పుము, పొమ్ము."

"సమవర్తీ! ఓ నరోత్తమా! మీరు సాతవాహన వంశజులు చక్రవర్తి కాదగిన వారలు. మీకు తెలియని ఆలోచన ఒండెద్దియు లేదు ప్రతిష్ఠానమున యువరాజు నెవరో నిర్జీవుని చేసినారని మాకు వేగు వచ్చినది. నిజమరయుటకై అంచెలపై చారులను పంపినాము. రేపు నిజము తెలియగలదు."

"శాంతం పాపీ!, ఈ అబద్ధపు వేగు తెచ్చినవాని నాలుక కోయి చీలికలు చేయకయుపకేరా ఓయి వెర్రివాడా? ఎవడురా శ్రీకృష్ణ సాతవాహనుని సమయించుటకు దెగించినవాడు?"

"ప్రభువు ఆగ్రహింపకుందురుగాక, మా రాయబారము గడముట్ట నడపనిండు. ధనకటకమున ఈ వార్త తెలిసినది. ఆంధ్ర ప్రభువు యుద్ధయాత్రకై బయలుదేర సంసిద్ధుడై యుండియు నాగిపోయెను మీకు సహాయమురాదు. నాల్గుదినములైన వెనుక మీ సైన్యము సమస్తము రూపుమాసిపోవును. మా సైన్యము దినదినాభివృద్ధి గాంచుచున్నది.

"అయిన నేమందువు?"

"వినుము, మీరు వీరాగ్రేసరులు, యౌవనవంతులు. మీరు మాలోన జేరినచో మీకు మారాజు అభయమిడుటయే గాక ఆంధ్రరాజ్యము సమస్తము జయించి మీకాధిపత్యము కట్టంగలవారు. మా యొడయనికి స్నేహితులై సేనానాయకులై మీరుభువిపరిపాలించెదరుగాక! మీరిరువురు ఉత్తరదేశముల జయించెదరు. ఆప్యులై వేవమతో ద్ధారకులై రాజసూయమునందు పాల్గొనెదరు. ఆయన చక్రవర్తియగును. ఆయనకు మీరు కుడిభుజ మగుదురుగాత"

"ఏమిధార్ష్ట్యము! అటుతరువాత?"

"మీకు రెండుదినములు గడువు ఇచ్చినారు! ఇంతలో మీ సైన్యములు కోట దాటిపోవలయును; ఆయుధములు దిగవిడచి వెడలవలెను. ఆహార పదార్థములు ఒక్క దినమునకు సరిపడునవి మాత్రమే తీసికొనిపోవలయును: మీరు మీ దారినిపొందు లేదా మాళవేశ్వరునికడకు బోయి అగ్నిసాక్షిగ మైత్రిత్వము నెరపుడు."

"ఓరి వాచాలుడా! ఆంధ్రులలో పిరికిపందలు, రాజద్రోహులు మచ్చునకైనను లేరు. మీరాజు చక్రవర్తియా? నేనాంధ్రరాజ్యనగునా? ఏమి యీ అఘటన ఘటనా చాతుర్యము! నీతి కౌటిల్యుని యుక్తిని మించిపోవుచున్నది. పో, ఇంక నీ రాయబారము నాకువలదు. ఆంధ్రులలో ఒక్కనికైన ప్రాణమున్న అతడుకూడ తన బాహుబలము రుచిమాపి మరియు అంతరించును! చక్రవర్తి వచ్చుచున్నాడు. మాకు వేగు వచ్చినది. శుకబాణబలమే వచ్చినది. మీ సైన్యములు నామరూపములులేక నశించిపోవా? ఇప్పటికైన నా మాళవుని తదితర నాయకులతో ఆయుధములు వదలి మా కోటలోనికి శరణార్థులై రానిండు! మీ సైన్యములు విడిపోయి చెల్లాచెదరు కానిండు మీ నాయకులకు ప్రాణదానము చేసెదము. లేదా ఒక్కనినైనను కొనయూపిరితో కూడ పోనీయము, ఆంధ్రసింహనాదము మీగుండె అవియ చేయదా! ఆంధ్రవ్యాఘ్రేంద్ర నిశితనఖములు మీరక్తము సంపూర్ణముగ గ్రోలవా! పో! ఇదియే నీ రాయబారమున కుత్తరము. మీకు ఒకదినము గడువిచ్చినాము. ఆలోచన చేయుడు. నే చెప్పినట్లు చేసి ప్రాణములు దక్కించుకొనుడు. కావున్న ప్రాణము లఱచేతనిడికొని యుద్ధము



నకురండు." అని సమవర్తి మీసము జేవురింప మీసముల వెండ్రుకలు నిక్కపొడువ కన్నులు జ్వలింప నుత్తరువిచ్చెను. అతని చేయి కరవాలమున్ బిడిపైననే తాండవమాడుచున్నది.

"సైన్యాధిపా! ఆగుడు అంత్యసందేశ మున్నది. అయ్యాది తమకు మనవిచేసి మరియు పోయెదను చారగుప్తుడను వర్తకరాజు మీకు మేనమామయట?"

"అగును"

"సౌందర్య నిధియగు హిమబిందాయన కూతురట."

"అగుచో"

"చారుగుప్తుడు ఆంధ్రసింహాసనమున కాదిశేషువట?"

"ఏమిరా నీవాచాలత మీరుచున్నది!"

"ఆ హిమబిందు కుమారి తమకు మిక్కిలి ప్రియతమగు వస్తువట!"

సమవర్తి మాటాడక తీక్ష్ణదృష్టుల నా రాయబారిని గమనించుచు తనగుండెలు అటుల కొట్టుకొనుచున్నవేమా యని ప్రశ్నించుకొనియెను.

"ఆర్యా! ఆబాలిక ఇప్పుడు మాకు బంది అయినది. ఆమెను మీ దేశస్థులే ఎవరో ఎత్తుకొనివచ్చి, మాకు ఒప్పగించినారు, మీ సైన్యము లీదినమున కోటవిడిచి పోవలయును. లేనిచో హిమబిందును ఒక కిష్టువానికిచ్చి వివాహము గావించెదము. రేపటికిని మీరు వదలనిచో ఆమె ప్రాణము లపహరింపము. కాని ఒకకన్ను ఒకచేయి నశింపను. ఆమె కన్యాత్వము చేరును అనుమానింపకుండ ఆమె ముత్తవనుగూడ ఆమెతోబాటు బంధించికొని వచ్చినారట. ఇదియ నా రాయబారము. పని వినియెదను. నమస్కారము. మేముచెప్పిన ఆజ్ఞలు పాలింప మీ సైన్యముల కిష్టలేనిచో మీరొక్కరైన మా శిబిరములకు వచ్చివేసి, మా ప్రభునకు మిత్రులుకండు. ఆర్యా నమస్కారము" అని ఆ రాయబారి వెడలిపోయెను. సమవర్తి కత్తిని యొరనుండి తీసినాడు. మీసములు పెదవుల సందులలోనికి రానిచ్చి కొరుకుకొనినాడు, కోపముచే వణకు దేహముతో, రౌద్రముచే దూమారము కప్పిన మనస్సుతో సమవర్తి విడి తమతికడకు, మహావేగమున వెడలిపోయి రాయబారపు టుదంతమంతయు వాక్రుచ్చెను.

వినీతమతి ఆశ్చర్య నయనములతో సమవర్తిని కనుంగొని "ఓయీ, నేనామాటలను ఏమాత్రము విశ్వసింపను. అంతయు కల్ల. వారికి కోటలోనిసంగతి తెలిసికొన ఊహ కలిగి వీనిని పంపినారు. అదియే నిజము."

"ఆర్యా! నేను జాగ్రత్తపడియే యుంటిని. కోటగుమ్మ మావలనే అతని కన్నులుకట్టి సభాభవనమున కట్లు విప్పినారు. వెడలిపోవునప్పుడు కోటగుమ్మమునకు వెలుపలనే కట్టువిప్ప ఆజ్ఞయిచ్చినాను."

"మంచిపనిచేసితివి! అయిన ఈ రాయబారమునుగూర్చి నీవేమందువు? హిమబిందును పట్టుకొనుట వీరికెట్లు సాధ్యమగును."

"నాకేమియు నమ్మకములేదు."

ఇంతలో శుకబాణు డచ్చటకు వచ్చెను.

సమవర్తి శుకబాణులకు సమస్తము వినిపించి వాని యభిప్రాయ మడిగెను.

శుక:— ఇప్పటికి పది దినములవెనుక హిమబిందుకుమారిని చోరు లెత్తుకొని పోయినారనియు, ఆచోరుల వెంటనే కొన్నిదళములు తరుముకొనుచు పోయినారనియు వార్తవచ్చినది. ప్రతిష్ఠానమునుండి మహారాజు రెండుమూడు దినములలో వేటనెపమున బయలుదేరెను. సైన్యములు నాసికకనియు, అటు వాతాపి నగరమునకనియు బయలుదేరినవి. చక్రవర్తి మహాసైన్యములతో దంతపురముదాటి, మహానదిని దాటి విదేహరాజ్యము చొచ్చినాడు. మగధ రాజధానిలోనున్న సైన్యములు తక్కువ కాబట్టి ఒక సైన్యము మన సైన్యములనుండి విడిపోయి, ఉజ్జయినివైపు తిరిగినది. అదియుకాదు మూలసైన్యము నెదుర్కొనుటకు ఓఘలుడు విదర్భసైన్యములు కొన్నికళింగసైన్యములతో మహానదికడ అడ్డగించినాడట. ఏనుగు తామరతూళ్ళను చిందరవందర జేసి కాసారము చొచ్చునటుల, దావాగ్ని కాంతారమును దహించుచు విజృంభించునటుల ఆంధ్రసైన్యములు ఆసైన్యముల నాశనముచేసి, ముందుకు చొచ్చుకపోయి పాటలీపుత్రము వైపునకు బోవుచున్నవి. నేను ఇంక పది దినములవరకు మనకోటకు భయములేదని నిస్సంశయముగ చెప్పగలను.

వినీ:— "అవును! కాని హిమబిందు విషయము—" అని వినీతమతి ఇంకనూ ఏమియో చెప్పబోవుచుండ ఒకసైనికుడు లోనికేతెంచి వారికి ప్రణామమిడి



"జయము! జయము!!" ఆరాయబారి వెడలిపోవుచు "నేను సమవర్తి సైన్యాధ్యక్షునకు తెలిసిన యుదంతమునకు సాక్ష్యము లివిగో, వీటిని వారికందచేయుడు" అని యీమంజూష మాకిడినాడు. ఇందేమి యున్నదో యచ్చటనే పరిశీలించి మరియు కొనివచ్చినాము. ఇందు దోషమేమియులేదు. అధిపతులు పరీక్షింతురుగాక" అని యాచిన్న పెట్టె వారిమ్రోల నునిచెను. వారామందసము తెరచుటయు నందున్న భూషణములచూచి సమవర్తి హా హా కారమొనర్చెను. నవరత్న ఖచితములైన మేలయిన ఆభరణములు హిమబిందు కుమారికారత్నము ధరించునవియే. వానికడ నొక మొగలియాకుపై లిఖించిన లేఖయున్నది. అది అందుకొని సమవర్తి యిట్లు చదివెను.

"శ్రీ మహారాజశ్రీలు వీరాగ్రేసరులు, మేనబావలునగు సమవర్తి సైన్యాధ్యక్షునకు హిమబిందు నమస్కారములు. నన్ను వీరు మాయింటినుండి హరించి మాఅమ్మమ్మతోగూడ కొనివచ్చినారు. ఇది యే ప్రదేశమో తెలియదు. ఇందు మమ్ము బంధించినారు. మమ్ము వీరు గౌరవముగా జూచుచున్నారు. మేము ధైర్యముగా నున్నాము. కాని మమ్మేమిలనో వీరనేక విధముల బెదరించుచున్నారు. మీకు కమ్మవ్రాయుమని కోరగ వ్రాసినాను. ఇంతవరకే వీరునన్ను వ్రాయనిచ్చినారు.

చిత్తగింపుడు,
హిమబిందు."

అక్షరములు హిమబిందువే! ఇక నమ్మకుండు టెట్లు! వినీతమతికి మోము వైవర్ణ్యమొందెను. "హిమబిందు ప్రాణము రాజ్యములతో సంబంధించియున్నది. జంబూద్వీప వర్తక చక్రవర్తియగు చారుగుప్తునకామె యొక్కతియ కుమారిత. అతడామెకెంతమాత్ర మాపద వచ్చినను, ప్రాణములువిడచును. అతడాంధ్ర సామ్రాజ్యమునకేడుగడ. ఇక నేమున్నది?" అని వినీతమతి మతిలేనిమాటలు వణంకుచు ఒలుకజొచ్చెను. సమవర్తిస్థితి నుడువనక్కరలేదు. అతని నాలికాపుటములు విస్తరించెను. అతడు తన విశాలవక్షమునింకను విపులము చేసినాడు. వ్యాఘ్ర మొక్కటి పరిసరమున సంచరించుచుండ అపుడ పసిపట్టు సింహమువలె అతడు గర్జిల్లినాడు.

అయినను అస్థాన కోపమువలన లాభమేమి? ఏమిచేయగలుగును? తాను ఆమెకై యుజ్జయినీ దుర్గము విడిపోయిన తన రాజ్యమునకు ప్రభువునకు తీరరాని అగౌరవము తెచ్చిపెట్టినవాడగును. హిమబిందు తనకు ప్రాణాధిక. అదియటులుండ, అబల,

ఆర్తి. తానెట్లు పేక్షింపగలడు. ఒకవంక ప్రభుకార్యము, ఒకవంక ప్రియారక్షణము. సమవర్తి కామవశుడై రాజద్రోహము చేయునా? ఏమి చేయవలయును, రాజవశంవదుడై ప్రేమదేవతకే విద్రోహము చేయునా? ఓహో చారుగుప్త తనయా రక్షణముమాత్రము రాజకార్యముకాదా? అవునని నేనెట్లు స్వతంత్రింతును?

"వినీతమతి సేనానాయకా! శుకబాణులవారూ! ఇప్పుడు మీరు నాకేమి యాలోచ చెప్పెదరు? మీరనినట్లు హిమబిందు ప్రాణముతో, గౌరవముతో, మన సామ్రాజ్య గౌరవము రీనమైయున్నది." అని సమవర్తి తలవంచుకొని ముఖము హస్తములచే కప్పుకొనెను.

"అట్లే ఈ యుజ్జయినీకోటతోగూడ మన సామ్రాజ్యప్రతిష్ఠ, రాజులయశస్సు ముడివేసికొని యున్నవి. ఈ కత్తెరలో చిక్కుకొనియున్న మనమేమి చేయవలయునో?" అని వినీతమతి యనెను.

శుకబాణుడు తీవ్రాలోచనలతో వారిమాటలు వినిపించుకొనకయు వినిపించుకొనినట్లు నిలుచుండిపోయెను.



# ద్వితీయ ప్రకరణము

## అన్వేషణ

సువర్ణశ్రీ వెంటనే చారుగుప్తుని భవనములనుండి మరలి ఇంటికి పోయినాడు తల్లిని కలుసుకొని, హిమబిందును ఎత్తుకొనిపోయిన మాట నిజమనియు, ముక్తావళీదేవి గారినికూడ ఎత్తుకొనిపోయిరనియు, ఇంతలోనే వారు దొరకితీరుదురనియు, భయపడ నవసరము లేదనియు చెప్పి లోనికి పరువిడి, వెంటనే కవచాదులు ధరించి, తిలకము తీర్పుమని నాగబంధునికయున్న పెరటిలోనికి అంగలు వేయుచు వెళ్ళెను. ఆ బాలిక అదరిపడి ఎవరాయని చూచినది!

అన్నగారి వేషము చూచి, నాగబంధునిక "అన్నా, ఇదిఏమిటి? ఎక్కడనో దాచి ఉంచిన నాయనగారి చిన్ననాటి కవచము తీసినావు? ఎవరోయని భయమందినాను. వేషము వేయుచున్నావా? లేక ఉత్సాహము పుట్టినదా, మతిపోయినదా?"

"కన్న చెల్లీ! నాకు తిలకముంచుము. చిన్నచెల్లిఏది? ఎవరక్కడ, అమ్మాయి సిద్ధార్థికను పిలువుము. త్వరగా లోనికివచ్చి తిలకము పెట్టుము'"

"అన్నా! తిలకమెందుకు? యుద్ధమునకు రమ్మని నాన్నగారికడ నుండి ఆజ్ఞ వచ్చినదా? లేక సేనానాయకులెవరైన ఆజ్ఞ ఇచ్చిరా?"

"అన్నియు చెప్పుచుందును, నీవు ముందు నాకు తిలకముంచవలయునురమ్ము."

"అమ్మా!" అని నాగబంధునిక కేకవైచెను. తల్లి పూజాగృహమునుండి నిష్క్రమము లోనికి వచ్చినది. ఆమెయు కుమారునిజూచి, ఎవరో ఏమోయనుకొని, దిగ్భ్రమనంది, యట్లనే నిలుచుండిపోయినది. నాగబంధునికయు, సువర్ణశ్రీయు, పకపక నవ్విరి. అప్పుడు పుత్రునినాసవాలుపట్టి "ఇది ఏమిరా నాయనా?" యని యామె వారిరువురి కడకు వచ్చినది

సువర్ణశ్రీ:— అమ్మా! నేను యుద్ధమునకు పోవుటలేదు. హిమబిందును వెదకబోయెదను. కొందరు సేనాధికారులు కొన్ని చమువులు కొనిపోవుచున్నారు. నేనుమపోయెదను. హిమబిందుగారింట శ్రీ ఆనందులవారు కనబడినారు. నన్ను వెంటనే

బయలుదేరి పొమ్మని ఆజ్ఞ ఇచ్చినారు. వెళ్ళుచున్నాను. చెల్లీ, తిలకము దిద్దవే. ఆరతితో అమ్మగారి ఆశీర్వాదము పొందవలెను. జాగుచేయకు.

శక్తి:— పెదుకుటను ఈ వేషమంతయు వేసినావు. పోరాటము ఏమైన జరుగునా ఏమి? అంతమంది వెళ్ళుచున్నపుడు, నీవెందుకురా బాబూ?

నాగ:— అమ్మా! నీకును మతిపోయినదా? అన్నను వెళ్ళనీ! ఇక్కడ ఏమియు తోచక మతిపోయినవానివలె నున్నాడు. వీరులైన ఆంధ్రయువకు లింటిదగ్గిర కూరుచుండు సమయమా? అన్న తీసుకొని వెళ్ళనేని నేనుగూడ సిద్ధము.

శక్తి:— నీవెంతకైన తగుదువు! మగవీరుడవు.

ఇంతలో మహాలియు, సిద్ధార్థనికయు, పలువురు పనికత్తెలు, కొందరు చుట్టములు, సేవకులు అచ్చటకు పరుగిడివచ్చిరి. చిరుగాలివలె వచ్చిన చిన్న చెల్లెలిని నువ్వున నెత్తికొని సువర్ణశ్రీ యామెను ముద్దిడికొని, క్రిందకుదింపి, "తల్లీ! నాకు ఆరతి ఈయవలయును. తిలకమిడవలెను. రా, లోనికి" అని ఇంటిలోనికిసాగినాడు.

యుద్ధములోనికి వెళ్ళుచుండెనేమోయని పనివారందరనుకొనిరి. మహాలికంతయు నర్థమై, లోనికిబోయి, దేవతాగృహమునుండి బంగారు పళ్ళెము, దీపపుకుంది, తెలుపు కర్పూరము, అక్షతలు, పూవులు అగరునూనెయు, తిలకకరండము సిద్ధము చేయుచుండ నచ్చటికందరు వచ్చిరి.

బుద్ధభగవానుని పంచలోహ విగ్రహమందున్నది. ఆ విగ్రహమున కీవలావల పంచానన బ్రహ్మవిగ్రహమున్నది. క్రొత్తపూజ లెన్నివచ్చినను శిల్పబ్రాహ్మణులు అనాదియగు వారి పంచముఖ విశ్వబ్రహ్మ పూజ మానరు. ఆ పీఠముప్రక్క వేరొక్క పూజాపీఠముపై మాయాదేవి విగ్రహమును, శారదాదేవి విగ్రహమును, పార్వతీదేవి విగ్రహము లున్నవి. ఆ పూజాపీఠము శక్తిమతీదేవిది.

శక్తిమతీదేవి నిర్ఘాంతపడి మాటలాడక, తన పూజాపీఠమునుండి కాశ్మీరపుష్పమిశ్రితమగు తిలకము తానే యాతని నొసటనుంచి, కొమరితలలోకూడి, ఆరతినిచ్చి, మోకరించు కొమరుని ఆశీర్వదించుచు అక్షతలు జల్లెను. ఆమె కన్నుల గిఱ్ఱున నీరు తిరిగినది. సిద్ధార్థనికేమియు నర్థము కానందున వెక్కివెక్కి యేడ్చినది. నాగబంధునిక చిరునవ్వు మోమున ప్రసరింప, కన్నులు విస్ఫారితముగా, ఫాలమున కాంతులువెలగ, ప్రభాకలిత వదనయై అన్నను జూచి,



"అన్నా! నీవు క్షేమముగా వెళ్ళిరా. మా అన్న వీరుడని చెప్పుకొన ఎంతో ముచ్చటనాకు. హిమబిందును రక్షించుకొనుము. ఆపని ఇంక ఎవ్వరును చేయలేరు. నేను నీకు తమ్ముడనైనచో, ఈ విపత్తులో నీవెనువెంట వచ్చియుందును. ఆంధ్రశత్రువుల నాశనముచేసి అమృతము కొనివచ్చినట్లు ప్రియురాలిని నీకేతీసుకొనిరా!" యనినది.

శక్తిమతి తలవంచియున్న పుత్రుని శిరముపై చేయినిడి "మహాశ్రమణకుడు నిన్ను రక్షించుగాక. నాయనా! జయశ్రీశోభితుడవై, యశోవిరాజితుడవై తిరిగిరా! అనవసరముగ ప్రాణముల బలిగొనకుము. శరణార్థుల విడిచిపుచ్చుము. నీ శిల్పబ్రాహ్మణ వంశ మర్యాద మరవకు. ఈ రక్షరేకను నీ హృదయమున ధరించుకో, పోయిరా!" అని గద్గదికమున పలికినది.

అశ్వము సిద్ధముగాయున్నదని ఇంతలో వార్తవచ్చినది. సువర్ణశ్రీ, నాగబంధునిక వీపు పైతట్టి, సిద్ధార్థికను ముద్దుపెట్టుకొని, తల్లికి నమస్కృతులిడి, మహాలి మొదలగువారికడ సెలవునంది, సర్వాభరణ భూషితము, సార్వభౌమ బహూకృతమునగు ఉత్తమాజానేయము కడకుపోయి, సూతుడందిచ్చు శిరస్త్రాణమునందుకొని, చివ్వున నా అశ్వముపై నధిరోహించి. సేవకుడందిచ్చు బాణముల పొదియు విల్లు నందిపుచ్చుకొని పొది స్కంధమునకు బిగించుకొని, కేడెము వీపున బిగించుకొని ధనస్సు ఎడమ భుజమునకు తగిలించుకొని, శూలము శూలశిరస్సులు, పరశువు, ఆహారపుసంచి, ధనపుసంచి, వస్త్రపుసంచియు జీనమునకు గట్టిగా సేవకుడు కట్టినది పరిశీలించి, వెళ్ళి వచ్చుచున్నానని కేకవైచి, గుఱ్ఱమును నడిపించెను.

ఎవరీసుందరుడని ప్రజలు అక్కజంపడ రేవుకడ కృష్ణలో సువర్ణశ్రీ గుఱ్ఱమును దింపెను. లంకలపై నడచుచు, అక్కడక్కడ సేలయేళ్లవలె ప్రవహించు కృష్ణపాయలను ఆ గుఱ్ఱముపై పది క్షణములలో దాటెను.

అతడు ప్లుతగతితో పొద్దు నెత్తిమీదకు వచ్చువప్పటికి మహారాజపథమున పది గోరుతముల దూరము పోయెను. అక్కడ నొక సత్రమున నాగి స్నానాదికము లొనరించి, భోజనముచేసి, పది ముహూర్తములచ్చట విశ్రమించెను. గుఱ్ఱమును సేదతేర్చి, ఆహారమిచ్చి, ఒడలంతయు రుద్ది, అశ్వారూఢుడై ప్రయాణము సాగించెను.

అతడు రాత్రి మొదటియామములో మహాగ్రామము చేరెను.



# తృతీయ ప్రకరణము

## మహారణ్యము

నాలుగు రోజులలో సువర్ణశ్రీ మహారణ్య ప్రవేశ మొనర్చెను. అతనికిముందు ఆంధ్ర చమూపతులు ఇటు వెళ్ళిరి అటువెళ్ళిరి అనువార్తతక్క, హిమబిందు జాడ గాని, చోరులజాడగాని ఇంతయైన తెలియలేదు.

మంత్రికల్పనమున వారందరు ధాన్యకటక పరిసరములనే మాయమైపోయిరా? లేక ఆంధ్రచారులను మించిన మాయానుకీణులా ఆచోరులు?

ఏమైపోయినారు? ఆ దివ్యమూర్తిని వారు తమ కర్కశ హస్తములతో అంటిరి కాబోలు? ఆమె ఎంత బాధపడుచున్నదో, ఎంతభయపడుచున్నదో? చిన్ననాటనుండియు కష్టమెట్టిదో ఎరుంగని ముక్తావళీదేవి ఎంత అలమటచెందుచున్నదో? తన సుందరోజ్జ్వల మూర్తి వడలిన పూవువలె సొమ్మసిల్లిపోయియుండును. ఎంతపని చేసిరి దుర్మార్గులు.

చారుగుప్త సర్వస్వము నపహరించుకొనిపోయిన యీ దుష్టులు చోరమాత్రులు గారు. ధనరాసులు దిగవిడిచి బాలికల నపహరింతురా చోరులు! వారికి ముక్తావళీదేవితో నేమిపని? ఇందేదియో రాచకార్యమున్నది. ఇది యంతయు శత్రుకుతంత్రము. ఔరౌరా! ఆంధ్రరాజధానియేమి! రాజదుర్గమునకంటె దుష్ప్రవేశమగు వణిక్సార్వభౌముని ప్రాసాదముచొచ్చుటేమి! ఎంత అరాజకమైపోయినది. శత్రువుల కాంధ్ర రాజధాని యింత అలుసైపోయినదేమి! దేశద్రోహులగు ఆంధ్రులెవరో, ఇంటిదొంగల వలె ఇంతపనిచేసిరికాని శత్రువులెన్ని గుండెలతో ధాన్యకటకమున గాలిడగలరు?

ఆబాలిక పరిమళజలముల నుదయమున స్నానమాడునది. తూలికామృదు వస్త్రములు ధరించునది, సుగంధము నలదుకొనునది, మసృణకిసలయ సదృశములగు పర్యంకముల పరుండునది. అయ్యో బాల శత్రువులచే నెట్టి ఇక్కట్ల పాలైనదో! తానేమిచేయగలడు! ఎచట వెదకగలడు! తనకు దూరదృష్టి, దూరశ్రవణాది సిద్ధులు, ఆకాశగమనాది విద్యలు తెలియవాయెను



ఎంతమంది నడిగినను ఇసుమంతయైన జాడ తెలియుటలేదు. ఆ బాలిక బ్రతికి యుండునా? "ప్రభూ మహాశ్రమణకా! అమెను రక్షించుము. ఆమె క్షేమముగనున్న చాలును. జంబూద్వీపస్థములగు మహాచైత్యములన్నిటికి శిల్పసేవగావించుకొందును."

సువర్ణశ్రీ ఇట్టి ఆలోచనలు ఎడతెగక ఉద్భవించి మాయమగుచుండ, ఒక్కడు ఆ మహాశ్వముపై నవలీలగ క్రోశములు, క్రోశములు గడచి, ముందునకు బోవుచుండెను.

పూవు ఎన్ని యోజనముల దూరముననుండిన నుండుగాక, దాని పరిమళములు పసిపట్టి సూటిగ భృంగబాలుడు ఆ పూవుకడకు పోవును. ప్రేమికులకు, ప్రియురాలి జాడను ప్రణయమధుర పరిమళములు పసిపట్టియిచ్చును.

సువర్ణునకు చోరులజాడ నెవ్వరినడిగినను తెలియరాలేదు. అయినను క్షణక్షణము ఆమె అక్కడ ఉన్నది, ఆమె యిటుపోయినది అని అతని యంతరంగమున స్పష్టముగ తోచుచుండెను. ఐక్యదృష్టినిచ్చునుగదా ప్రేమ!

సువర్ణశ్రీ కుమారుడు గుఱ్ఱమును నందపురము [నందిగ్రామము] గిలనకేర [గార్ల] మంత్రకూటము [మంథెన] దారిని పోనిచ్చి అచ్చట గోదావరినదిని దాటిపోయెను.

నాగులలో జాతిభేదము లెన్నియో యున్నవి. ఆర్యనాగులు ఆర్యజాతులలో నాగపూజ చేయువారు పన్నగులనువారు మ్లేచ్ఛజాతి నాగులు. వారిని ఆర్యానార్య మిశ్రితజాతి అందురు. అనార్యసంపర్కము ఎక్కువ యున్నవారిని గూఢపులదురు. వారే గోండులు. గోండులుండు కాంతారములకు గోండువనమని పేరు.

గోండులు ఆర్యబ్రాహ్మణప్రభువులగు శాతవాహనులయెడ పరమభక్తులు. దక్షిణకోసలమునకు బడమటనుండు దండకాటవిభాగమున శబరులుండిరి. వీరు గాంధర్వపన్నగ మిశ్రజాతికి జెందినవారు. పన్నగ వంశములవారు నాగరపథములందే నివసించుచు ఆంధ్ర శాతవాహనదేశమున శూద్రులైరి. వారు మంగలి, చాకలి, ఉప్పరి వృత్తులవలంభించి యుండిరి.

శబరులకు గోండులకు ఎప్పుడును ప్రబలశత్రుత్వముండెడిది. శబరులు ఆంధ్ర చక్రవర్తులకు భయముచే లోబడి యుండిరిగాని భక్తి ఎప్పుడును వారికి జన్మింపలేదు.

శబరులు మాయావులు. వారు మంత్రవిద్యను గంధర్వులకడ నేర్చినారు. ఆశాబరమంత్ర తంత్రములకు భయపడి గోండులు ఆర్యఋషుల నాశ్రయించి యుండిరి.

కాని గోండులు బహుపరాక్రమవంతులు. గోండుయువకు డొంటిపై సింహమునే ఎదుర్కొనును. గోండు మహాప్రభువు వీరమల్ల గోండమహారాజు శాతవాహన సామంతేశ్వరుడు. ఆతని పుత్రుడు మహామల్ల గోండయువరాజు ధాన్యకటక మహాసంఘారామ పరిషత్తునందు విద్య నభ్యసించినాడు. అప్పుడే సువర్ణశ్రీకిని ఆతనికిని గాఢస్నేహము కలిగినది. మహామల్లుడు సువర్ణశ్రీ ఇంటనే వాసముచేయువాడు. వారిఇంట భుజియించువాడు.

ధర్మనందియు, సువర్ణశ్రీయు దేవతలని, వారి శిల్పముల చిత్రలేఖనముల జూచి మహామల్లుడనుకొనువాడు. గోండుభాషలో తీయని పాటల బాడుచు, అవి సువర్ణశ్రీచే బాడించుచు చిన్నబిడ్డయగు సిద్ధార్థనికను ఒక్క నిమేషమైన క్రిందను దింపక ఆడించుచు, శక్తిమతీదేవికి రెండవకొమరునివలె మెలగినాడు.

నాగబంధునికయు, సిద్ధార్థనికయు ఆతని "చిన్నన్నా" యని పిలుచువారు.

సువర్ణశ్రీ బయలుదేరునప్పుడే మహామల్లుని తలచుకొన్నాడు. అతడప్పుడే యొక ఉత్తమగోండ సామంతుని తనయను వివాహమైనాడనియు, యువరాజ పట్టాభిషేకము నందినాడనియు సువర్ణునకు దెలియును.

తనకు వార్తలంపు విధనము సువర్ణునకు మహామల్లుడే తెలిపినాడు. గిలనకేరపురము పుళిందరాజ్యమునకు దక్షిణముననున్నది. పుళిందులు ఆంధ్రశాతవాహనులకు దాసులయ్యు, నేడు స్థౌలశిష్యుని మహిమవలన వారికి విరోధులై ఆంధ్ర సామ్రాజ్యమును విచ్ఛిన్నముచేయ సంకల్పించియుండిరి. కాని పుళిందులలో కొన్నిజట్టల నాయకులు శుకబాణుని అనుయాయులు. వారును గోండు నాయకులును రహస్యముగ నెప్పటివార్తలప్పటికి శుకబాణునకు తెలియజేయుచుండిరి.

తన స్నేహితుడగు పుళిందయువక నాయకుడొకడు గిలనకేరపురమున నుండు ననియు, నాతడు తనకు వార్తనంపగలడనియు తాను గోదావరికావల ఉత్తరమున మూడు యోజనములు దూరముననున్న నగర్గ్రామమున కలుసుకొందుననియు మహామల్లగోండుడు తాను ధాన్యకటక నగరము వీడునప్పుడు తెలిపియుండెను. ఆనవాలుగా తన దండకడియము సువర్ణశ్రీకిచ్చినాడు.



గిలనకేర పురమున నాగినప్పుడే ఆ పుళిందనాయకుని గలుసుకొని సువర్ణుడు మహామల్లుని దండకడియము సందేశమంపినాడు. నగర గ్రామమున పది దినములు విశ్రమించినాడు. దీర్ఘప్రయాణముచే అలసట నొందిన ఆతని ఉత్సాహమును అలసట తీర్చుకొని పదునుపట్టిన కరవాలమువలె మెరసిపోయినది.

పదవనాటికి మహామల్లుడు పుష్కల మహామేఘమువలె, గజయూథపతివలె, మహావాయువువలె వచ్చి, సువర్ణశ్రీని కౌగిలించుకొనెను.

"అన్నా! ఏమిది, ఈ అడవుల సంచారము చేయుచున్నావు? భగవంతుని శిల్పము, చిత్రలేఖనము దర్శింపవచ్చినావా?"

"మహాబలా! అందుకనియే వచ్చియుందును, నేనొకనాడు నీరాజ్యమున నిన్ను దర్శించెదని యనలేదా? నేడు నిన్ను దర్శించుటకు వచ్చినాను. కాని, సంతోషయాత్రాభిముఖుడనై కాదు. పవిత్ర కార్యదీక్షాపరుడనై వచ్చినాను. నీవుతప్ప ఇంకనెవరును నాకీ దుర్ఘటకార్యమున సహాయము చేయలేరు."

సమున్నతవిగ్రహుడు ఆతిథుడునగు సువర్ణుడును, మహాబలావతారమగువాడును, మధ్యమోన్నతమూర్తియునగు మహాబలగోండుడు బిగియార కౌగిలించుకొన్నారు.



# తురీయ ప్రకరణము

---

## శా పా భ య ము ద ర్శి లు

శ్రీకృష్ణ సాతవాహన కుమారుడు మరునాడు ప్రభాతకాలముననే ఆఖేటవ్యాజమున యుద్ధయాత్ర సలుపువాడై, రాత్రి ద్వితీయయామ మధ్యకాలము వరకు సంగీతలోలుడై యుండెను.

ఒక సుందరి విపంచి మేళవించి వధూగీతముల నాలాపించినది. వేరొక పాటలాధరి మురళిపై తాళరాగపూర్ణ కీర్తనల మ్రోయించినది. పద్మహస్తయగు నారు కాంస్యతాళములు చఱచినది. కలకంఠి యొకర్తె మనోహర గానామృతశైవాలిని యైనది.

రెండవయామము పూర్తియగునప్పటికి రాజకుమారుడు లేచినాడు. సుగంధతైలపోషిత కరదీపికల వెలుగులు దారిచూప నాతడు శయనమందిరమున కేగె. కలశాంభోధి సన్నిభమగు తల్పముపై మేనవాల్చెను. ఆతడు వెనువెంటనే తీయని నిద్దురలో కనుమూసి ఒడలు మరచెను.

చీకట్లు ద్రవించి యామినీ ఘోషమున అలకలై, యామునా వీచికలై, మిన్నుమన్నాక్రమించి, పరవడుచున్నవి.

చీకట్లు ఘనీభవించి శిలలై, గిరులై, మహాపర్వతములై లోకమెల్ల పిగుచుచు పడినవి.

చీకట్లు రూపమునొంది చైతన్యపూరితములై, మహిషములై, వ్యాఘ్రమృగములై, కాలకరయూధములై వేషములు వేసినవి.

అవి యన్నియు మాయమైనవి. చీకట్లన్నియు కలిసి ఒక్కటే చీకటియై పోయినవి

ఆ చీకటిబరువు శ్రీకృష్ణ సాతవాహనుని వక్షముపై ఆవహించి, అతని ఎముకలు రొమ్ము ఎముకలు పిప్పియగునట్లు బిగపెక్కనారంభించినది. నిర్మలనిద్రాపరవశుడై యున్న ఆ యువకునికి భయంకరస్వప్న మొక్కటి ప్రత్యక్షమైనది.

కర్కోటకనాగేంద్రుడు తన శతవదనములనుండి నిశ్వాసలు గ్రక్కుచు, కన్నులు భయంకరజ్వాలలుగా, మహావేగమున శ్రీకృష్ణునివైపు రాసాగెను. వీడఁడగు నా రాజకుమారుడు ఖడ్గము నెక్కడబోయెను. అది ఎచ్చటను కనబడదు. ఖడ్గము దూయబోయెను; పట్టెయొరమాత్రము దొరకినది.



ఆ భీషణోరగము బారినుండి తప్పించుకొనబోయి, పరుగిడలేక యాతడు పడిపోయెను. ఓ, ఓ యను ఆర్తనాదము కంఠపుముడులలో మాత్రమాగిపోయి, గురగురలైనది.

ఆతనికి చెమటలుపట్టి మెలకువ వచ్చినది. ఆ మందిరములోని సుగంధతైలముల వెలుగు దీపములలో రెండు తక్క తక్కినవన్నియు నారిపోయినవి. సగముమందిరము చీకట్లమయమైనది. ఆ గుడ్డివెలుగులో కాలసర్ప మొక్కటి బుసలు కొట్టుచు! ఎటులనా శయనమందిరములోన ప్రవేశించినదో శ్రీకృష్ణ సాతవాహనుని తల్పము కడకు చేరవచ్చుచుండెను.

ఆ సర్పము కలలోనిదా, లేక నిజమాయని శ్రీకృష్ణుడాలోచించెను. భయమనునది ఎఱుంగని యా రాజబిడ్డ నేడు గజగజ వణంకెను. నోట మాటరాదు. పెదవులు, నాలుక గళము పొడియారిపోయినవి. ఆపాము కొట్టు బుసలలో అగ్నిశిఖలు కనిపించినవా మహారాజునకు.

ఆ క్రూరపన్నగము పన్నెండు పదముల పొడుగున నల్లనై, మహాకాళికా వేణివలె, మృత్యుపాశమువలె, విలవిల లాడుచు, నాతని తల్పముకడకు వచ్చినది

విభ్రాంతుడై, చేష్టలుడిగి యా మహారాజు తల్పముపై నటులనే కూర్చుండిపోయినాడు.

ఆ పాము చుట్టచేసికొని పోయినది. అక్కడనుండి పడగ హస్తమున్నర పైకెత్తి నాల్కలు చాచుచు బుసకొనుచు కాటు వేయబోవుచు ఆడిపోవుచున్నది.

శ్రీకృష్ణ సాతవాహనుడు దీపమును జూచు శలభమువలె నట్లే కదలలేక ఆ పాము ఎట్లాడిన నటువైపునకు తల త్రిప్పుచున్నాడు.

అంతకన్న అంతకన్న ఆ పామునకు కోప మెక్కువైనది. ఆవేశముచే పాము ఇటునటు ఊగిపోవుచుండెను!

ఒక్కసారిగా ఆ భయంకర కాలవిషధరము మహావాయువైనట్లు, సర్పాస్త్రమైనట్లు, ఇటునటు పరుగులెత్తి, ఇంకను మంచముదాపునకు వచ్చి ఒక్కపెట్టున తోకపైలేచి మంచముపై దూకినది.

అంత పెద్ద పర్యంకముపై ఏపాము దూకగలదు అన్న ధైర్యముతోనున్న కతమున నా పన్నగపు ఉరుకునకు శ్రీకృష్ణుడొక పెద్ద హాహాకారము సలిపి వెనుకకు పడిపోయెను.

ఆ వెంటనే తెల్లని మొగలిరేకువంటి, గంగోత్తరకడ భాగీరథీ ప్రవాహమువంటి, మహర్షి దీవనవంటి, దేవతల పాణితలముల జగన్మోహినిపోయు అమృతధార

వంటి శ్వేతనాగిని ఒకర్తు మంచముపై కురికినది శ్రీకృష్ణ శాతవాహనుని పాదమున కాటువేయబోవు అకాలసర్పము వెంటనే ఆగి పడగత్తి ఆడుచు కదలక బొమ్మవలె నైపోయినది.

ఆ పాము నెదుర్కొనిన యా నవశ్వేత పన్నగి కోపమెరుగని నిశితసత్యమువలె మిలమిల లాడుచు పడగెత్తి యా కాలనాగము నెదుర్కొని కదలక, మెదలక ఒక్క సారిమాత్రము రామబాణమువలె, మహోగ్ర వీణా నాదమువలె "హుస్" అని మాత్రమనినది.

భయపడి, సిగ్గుపడి, ఓటమి నూనించుచు తల ముడుచుకొని యా కాలనాగము మంచమునుండి క్రిందికి జారిపోయి ఎటులు మాయమైనదో మరల శ్రీకృష్ణునకది గోచరము కాలేదు.

శ్వేతపన్నగి మాత్రము ఒకసారి శ్రీకృష్ణశాతవాహనునివైపు తలత్రిప్పిచూచి యదియు మంచమునుండి యురికి మాయమైనది

భయము ఒక ముహూర్తకాలమువరకు శ్రీకృష్ణ శాతవాహనుని వదలలేదు. కొంతవడికా భయమునుండి వీడడగు యా మహారాజు ఒక్కుమ్మడి లేచి, మంచమునుండి యురికి, దాపున ఉన్న పీఠముపై నుంచిన, బంగారుగంట గణ గణ వాయించెను. దాపుననున్న ఒరనున్న కరవాలము నట్టుకలాగి, గుమ్మముకడకు బోవునప్పటికి బిరబిర తలుపులు తెరచుకొని స్త్రీలు లోనికి ప్రవేశించిరి. వారందరి హస్తముల కత్తులు తళ తళ లాడుచుండెను.

క్రోధపూరితనయనుడై కరవాలము ఝళిపించి ద్వారముకడ తమకెదురైన నృపభువును జూచి, వారు సంభ్రమము నందిరి.

ఇంతలో సేవకురాండ్రు, ద్వారపాలకులు కంచుకులు పారిపార్శ్వకులు శయన మందిరముకడకు వచ్చిరి.

శ్రీకృష్ణశాతవాహనునికి మెరుపువలె ధాన్యకటకమున జరిగిన శ్వేతపన్నగి దర్శన సంఘటన జ్ఞప్తికివచ్చినది.

నిముషమున మనస్సు త్రిప్పుకొని, యాతడు చిరునవ్వు నవ్వుచు,

"ఓయీ! అంతఃపురపాలకునికి వెంటనే ప్రయాణసన్నాహము చేయ మా ఆజ్ఞగా తెలుపుము. స్నానార్థము మేము పోవుచున్నాము. శుభముహూర్తమునకెంత కాలమున్నది?"

"ప్రభూ! ఇంకను మూడు గడియలు వ్యవధి యున్నది" యని కంచుకి మనవి యొనర్చెను.



# పంచమ ప్రకరణము

## మృగపథము

గోండువన యువరాజగు మహాబలగోండుడును, సువర్ణశ్రీయును, మహావేగగమున అశ్వములన్నియు గడచిపోవుచున్నారు "అటవీసంచరణము ఒక మహావిద్య. శత్రువులకు తెలియకుండ ప్రయాణము చేయవలెనన్న. నీవు అటవీ మృగమైపోవలెను. అడవిలో ఆకువై కొమ్మలో కొమ్మ అయిపోవలెను. నీవు పక్షివలె ఎగిరిపోవలెను. ఉడతవు, ఉడుమువు, పామువు అయిపోవలెను. నేను వెనకనే నీకు ధాన్యకటకమునందే ఈవిద్య చాలవరకు నేర్పితిని. "నేను చెప్పినది చేయుము సువర్ణా" యని మహాబలుడనెను.

"మనకు హిమబిందువార్త ఎప్పుడు ఎక్కడ తెలియగలదు?"

"మా గోండు అరణ్యములుతక్క, తక్కిన అరణ్యములన్నియు ప్రస్తుతము విరోధులగు కిరాత జాతులతో నిండియున్నవి. వారికి తెలియకుండ మావాళ్ళు మనకు సర్వ విషయములు తెలియజేయవలెను మీ హిమబిందునే వారి అరణ్యములోనికి కొనివచ్చియున్న యెడల మనకా విషయము తెలియగలదు ఆ గుఱ్ఱముకలన మనకు ఎక్కువ ప్రమాదము సంభవించునని, గుఱ్ఱమును నగరి గ్రామమునుండి గోండు మార్గమున గోండు వనము పంపించుట మంచిదే అయినది."

"గుఱ్ఱమునుబట్టి యానవాలు పట్టరా?"

"గుఱ్ఱము రంగు మార్చివేసినాము. కావున నీ గుఱ్ఱము నానవాలు పట్టలేరు. మేము గుఱ్ఱమును ఎచ్చటనో తస్కరించి తీసుకొని పోవుచున్నామని మన ఎదిరికక్షి వారనుకొనినట్లు చేసినాము."

నీవు నా మిత్రుడవని తెలిసినవెంటనే నిన్ను వారు బాధలకు లోనొనరించెదరేమో, యని భయపడుచున్నాను."

"ఓయి వెఱ్ఱివాడా. నన్ను బాధలు పెట్టగల ఆటవికజాతి యున్నదా? మాకు భక్తులైన రాక్షసులను జాతి యొకటియున్నది. ఆ జాతివారు దండకారణ్య గర్భమందు, వెలుగే దూరని కటికచీకటి నాట్యమాడు ప్రదేశాలలో ఉందురు. వారి జోలికి వెళ్ళుటకు ఆటవిక జాతులలో నాగరికపు జాతులవారికి భయము. నాతో మనకు కనబడక మాటుగు రాక్షసులు గట్టివారున్నారు."

సువర్ణశ్రీ మహాబలులు మూడు దినములవిరామముగ ప్రయాణము చేసిరి. సువర్ణశ్రీ గోండు వేషము ధరించి యుండెను. అతడు గోండుస్త్రీ లద్దిన రంగురంగుల కాపీనము ధరించియుండెను. రంగు రంగు పూసల హారములు మెడను వ్రేలాడుచుండెను. దేహమంతయు వివిధ వర్ణములతో విచిత్రాలంకరణ చేయబడెను, మోము పెద్దపులి ముఖమువలె వర్ణముంపబడెను చేతులకు వెండి దండకడియములు, ఓషధీమూలముల తాయెత్తులున్నవి. వక్షమున చిరుతపులి తోలు వలెవాటువేసెను తలపై రంగు రంగుల పక్షి ఈకెలు. రంగురాళ్ళ గవ్వలుపొదిగిన, ఎలుగుబంటితోలుకిరీటమునుండి పైకొనసి యాడుచుండును.

ఇంతలో వేగు గొనివచ్చిన పరిచారకునితో మహాబలగోండుడు మాటలాడి,

"అన్నా హిమబిందును, ఆమె అమ్మమ్మను తూర్పు దండకాటవి దారినే తీసి కొని పోయిరట" అని సువర్ణశ్రీ కేకరించెను.

"ఏమీ, దండకాటవికే! నేను భయపడినట్లనే అయినది. ఎంత పనిచేసినారు వారింకా ఎంతదూరాన ఉన్నారో! ఎచ్చట నున్నారో క్షేమముగా నుండిరో? మనమచ్చోటికింక నెపుడేగెదము?

"తొందరపడకుము. వీరుడు కోపమును కట్టి నిప్పును దాచుకొనినట్లు తనలో దాచుకొనుము."

"నాకన్నియు చెప్పుము తమ్ముడూ! మనమచ్చటికి త్వరితముగ పోవలెను."

"వారిని ఎత్తుకొనిపోయినది సాధారణాటవికులు కాదు. వారట్టిపనులు చేయరు చేయుట చేతకాదు. నగరవాసులన్ననే మాకు భయము. నగరమునను జూచిననే వేము ముసుకుకొని పోదుము. వారిని ఎత్తుకొనిపోయినవారెవరో చక్రవర్తి విరోధులట."

"మాగధులా?"

"మాగధులో, వంగులో, వారి నిరువుర నెత్తుకొనిపోయి, ధాన్యకటక నగర ప్రాంతమున దాగికొనియున్న శబరులకు వారిరువురని అప్పగించిరట!"

"నేననుకొనినంతయు నైనది. వారికేమియు ప్రమాదము కలుగలేదుగదా"

"వారిని నర్మదా తీరముననున్న స్ఫటికా శిలాపర్వతములపైకి తీసికొని పోయిరట"

"నడు, మనమచ్చటికే పోదము."

"తప్పక అచటికే పోవుదము. ఈలోన మా నాయనగారికి గోండసైన్యమునుండి సింహములవంటివారిని వీర మన సహాయమునకు పంపవలయునని వార్త పంపినాను."



"తమ్ముడూ! నాయనగారికి మన సైన్యములన్నియు సిద్ధముచేయించుమని. వార్తనంపుము. చాల అవసరమున్నది."

"అటులనే అన్నా."

ఆ ఉదయమున వారొక సరోవరముకడ వంటచేసుకొని భుజించి, మరల ప్రయాణము సాగించిరి. ఎంత వేగముగ నడిచినను, ఒక్క ఆకు కదలిక చప్పుడైన కాదు. మహాబలగోండుడు అనుమానమేమైన తోచినప్పుడు. సైగచే సువర్ణుని ఆపి ముందునకుబోయి పరిశీలించి, అచ్చటి చిన్న పక్షి ఈల వేయును. సువర్ణుడప్పుడు ముందుకు సాగిపోయి, యాతని గలిసికొనును. వారిరువురు ముందునకు సాగిపోదురు.

మహాబలగోండునకు పాము చెవులు. ఎంత చిన్న చప్పుడెంత దూరముననుండి వినిపించినను, ఆతని కర్ణములకు సోకును. ఆతడు ముక్కు పుటములు విస్ఫారితముజేసి. ఎట్టివాసననైన పసి పట్టగలడు.

వారట్లు మహావేగమున బోవుచుండ నొక మధ్యాహ్నము వారి ఎదుట నొక బాణమువచ్చి పడినది. గోండుడు వెంటనే ఆగి. భూమిపై వాలిపోయెను. సువర్ణుని గూడ భూమిపై వాలుమని సైగ చేసెను ఆతడును. సువర్ణుడును పాకికొనుచు, దట్టమైన యొక పొదలోనికి దూరిపోయిరి.

మహాబలుడు సువర్ణుని చెవికడ వదనముంచి "మనలను విరోధులగు పుళిందులు కనిపెట్టినారు. ఆ బాణము పడిన్నా? నీవును గోండుడవు అని వారికి తెలుపవలె లేనిచో మనలను బాణములచే చంపివేసెదరట. ఆబాణము వచ్చినవిధమునను, నా ముందర పడుటను, ఆ బాణమునకు కట్టిన ఈకలను అర్థమది" అని తెల్పెను.

"అయిన నిప్పుడేమి చేయవలెను?"

"నీవూరక చిత్రము చూచుచుండుము!" అనిచెప్పి మహాబలుడప్పుడు పెదవులు మూసి పామువలె బుసకొట్టినాడు. వెంటనే దూరమునుండి వేరొక మహానాగము బుసకొట్టినది. ఆకాశములో చిన్న చిన్న ఈటెలంటివి వేలకు వేలెగిరినవి. "కో"యని "హో" యని పడి, పడిపోయిన అరపులు వినబడినవి. తర్వాత నంతయు నిశ్శబ్దము. పాముబుస దీర్ఘమై వినబడినది. మరల నిశ్శబ్దమావహించినది.

సువర్ణున కిది యంతయు భయాశ్చర్యములఁగొలిపినది. "అన్నా! మన విరోధు లందరు మాసిపోయినారు. ఆ శవముల రాక్షసులు భక్షింతురు!" అని మహాబల గోండుడు పలికినాడు.

సువ:—ఛీ! ! నరమాంసభక్షణమే? బుద్ధం శరణంగచ్ఛామి!

మహా:—నరమాంస భక్షణము మాకు మాత్రము ఇష్టమా? రాక్షసుల పాలబడిన వానిగతి అంతియ. మహాబలగోండుడనేమి, మరి ఏ ఒక్క గోండునేమి శబరుడు, పుళిందుడు యుద్ధమున కాహ్వానించుట చావును తెచ్చుకొనుట. రాక్షసులు గోండుల ఆజ్ఞచే వచ్చిరని తెలిసినపై మరల గోండువిరోధి ఈ అడవులనుండునా? రాక్షసుల నోడింపగలవారొక్క గోండులే!"

సువ:—అబ్బ నా హృదయమున కలిగిన వెరపింకను పోలేదు తమ్ముడా! ఏదియో మైమరపు కలుగుచున్నది.

మహా:—నన్ను క్షమింపుము! నీకు నేనీవిషము తెల్పియుండకూడదు. నీవు వీరుడవు. శిల్పచాతుర్యుడవైన అడవుల కేలవత్తువు? హిమబిందును తలచుకొనుము.

సువ:—అన్నియు భగవంతుని చిద్విలాసములు. కానిమ్ము విచారించుటకు నేనెవడను? మన మొక్క ఘడియ ఆలసించినకొలది హిమబిందు ముక్తావళీదేవుల ఇడుములు ఒక్కొక్కటే అధికమగునని నాభయము.

వారంత ఇంకను వేగముతో సాగిపోయిరి.



# షష్ఠ ప్రకరణము

## నా గ రా జు

స్థౌలతిష్యుడు ఓషధీ ప్రభావముచే విషబాలకు గాఢనిద్ర కల్పించెను. విష వైద్య విశారదులగు కొందరు సేవకులు ఆమెను ఏనుగుపై అరణ్య మధ్యమునకు గొనిపోయిరి. శ్రీకృష్ణ సాతవాహనుడు వేట నెపమున మాళవమునకు యుద్ధాభిముఖుడై వెళ్ళుచుండెనని యూహించి యుండనోపు.

శ్రీకృష్ణ సాతవాహనుడు వెళ్ళుదారికి ఒక క్రోశము దూరమున నిబిడమగు నొక కాంతారభాగమున, విషబాలను వదలివేసినారు.

'నీ మలా చుట్టుపక్కల కొన్ని క్రోశములవఱకు నుండవు. ఫలములు కావ రావు కంటకావృతమై, పానీయరహితమై, నిర్జలమై, భీభత్సమగు దుర్గమారణ్యమున నొంటిగ విడిచివేసినందు ఆమె ఇరులను నాకమైపోవుగాక!' అని స్థౌలతిష్యుని యాజ్ఞ.

విషబాల కన్నులు దెరచి చూచినది. కర్కశస్థలమున నామె పడియున్నది. ఒక పెనుబాము మెపై ప్రాకినను చోద్యము చూచుచున్నది. ఆమె ఉలికిపడి లేచి నిలుచున్నది. ఉన్నతములగు చెట్లు మహోరగములబోలు తీగలు. కంటకావృతములగు పొదలు. కఠినశిలలతో నిండిన భూమి. ఆమె కన్నులు నులిమికొన్నది. విహ్వలచిత్తయై యామె కెవ్వున నార్చినది ఆమె కేక ఓ! ఓ!! ఓ!!! ఓఓఓ!!!! అని మారుమ్రోగినది. ఆమె పూర్తిగా వివస్త్రయై యున్నది. ఏమిశిక్ష! విషకాంతుల వెలిగిపోవుఆమె దిగంబర దేహము భయముచే ఓడియముచే ముడుకొనిపోయినది. అరుణోదయమున మలయ పవనములు హాయిగా వీచి ఆమెను సేదదీర్చుటకు వచ్చినవి. కాని ఆచ్ఛాదనరహిత మగు నామె తనువు నవి సోకగనే ఆమెకు గజగజలాడు చలి వచ్చినది ముడివేసి యున్న జటాభారము నామె విడలించినది. అందమగు మంచుశిఖరమును కప్పివేయు నీలమేఘములవలె ఆమె తలకట్టు పాదములంతకు నల్లగా ప్రవహించి ఆమెను మూసి వేసినది. ఒత్తుగా నున్న శిరోజములు నొడలంతయు కప్పుకొని ఆమె కూలబడి నిశ్చేతన యై పడిపోయినది

మరల మెలకువ వచ్చునప్పటికి సూర్యకిరణములు తీక్ష్ణముగా నా యాకు జొంపములనుండి లోనికిజొచ్చి వచ్చి యామె నాస్వాదించుచున్నవి. ఆ బాలిక లేచి కూర్చుండి "నేనిక్కడ నున్నానేమి? నేలవచ్చినాను? ఎప్పుడు వచ్చినాను? ఎవరు తీసుకొని వచ్చినారు? నేనో కేళ చనిపోయినానేమో! ఇది యమలోకంలో నొక భాగముకాబోలు, పూజ్యపాదులగు తాతయ్యమాటకు ఎదురాడినాను, వారికోరిక నెరవేర్పలేదు వారి శాపమే నాకిట్లుతగిలినది. అప్పుడే యమకింకరులీ యమలోకమునకు గొనివచ్చినారు నేనిప్పుడేమి చేయుదును? ఇక్కడనుండి కదలవలెనా! అదిగో ఆ పెద్దనాగుబాము పడగయెత్తి అరుణ కిరణాయమానము చూపులు నాపై బరపుచున్నది ఓ అయ్యా నీవెవరవు? నీవును ఈయమలోకమున నొకబంటువా? ఇక్కడ కూడ సూర్యుడు వెలుగునా? ఉత్తము యమలోకపు సూర్యుడు కాబోలు పూర్తిగా నెవ కిరణముల వెదజల్లలేకున్నాడు. నేనేమి చేయుదు" అని యామె వెఱ్ఱి మాటలాడు కొన్నది.

ఆమె ఇటునటు చూచినది: అక్కడ నాగుచున్న పామును సమీపించి బుజ్జగింపసాగినది, పాములతో ఆటలా మెకలనాటేకదా? ఆ పామును చెంతకు తీసుకొని కౌగిలించినది. ఆ పన్నగేంద్రమును ఆమెను మెలివేసికొని పోయినది. "ఓ నాగరాజా! నీవును శిక్షపడి ఈ యమలోకమునకు వచ్చినావా" అనియామె ప్రశ్నించెను.

నాగరాజు కన్నులు:—అమ్మా నిన్ను చూచిన నీవు మాదానవని తోచుచున్నది. నీవు మా లోకాధిపతియగు వాసుకి పుత్రికవు కావు కదా?

విషబాల:—ఓ అహిరాజా! నీవును ఒంటరిగ ఇట నివసించుచున్నావా?

నాగరాజు నాల్కలు:—అమ్మా! నిన్ను స్పృశించిన కాలకూట విషానంద మూర్తివలె తోచుచున్నావు. సముద్రమున జనించిన హాలాహలమే నీలకంఠుని గళము నుండి యిట్లు నీరూపు దాల్చెనేమో?

విషబాల;—ఓ ఉరగాధిపా! నీపై నెవరికి కోపమువచ్చినది. నీకీ భయంకర పాపలోకముల చెడుబాధల నొందుము అని ఎవరు శాపమిచ్చినారు? నీవును తాతగారున్నారా?

నాగరాజు ఫణిపాదములు;—ఓ సౌందర్యగాత్రీ. శ్రీకృష్ణుని పాదరజమువలె సాక్షాత్కరించినావు.! నీదెహమున హిమశైత్యము, దావాలోష్ణము నియ్యవందు చున్నవి.



విషబాల:—ఓ వాయుభక్షకా! నీకాకలి దహించుకొని పోవుటలేదా! నీ స్నానమెక్కడ? నీగృహముకడ పావనోదకములుగల నదీమతల్లి పారుచున్నదా! అందు చల్లని నీరములు కడుపునిండ త్రాగుచుంటివా?

నాగరాజు చెట్లుపీకి అడొంకలలో నటునిటు పాకజొచ్చెను. విషబాలయు కచభారమునర్దుకొని యాదిక్కునకు పోబోవ ఒక్క నాటిముల్లు కసుక్కున పాదమునకు గుచ్చుకొనుటచే కెవ్వున నార్చెను. తెల్లబోయి యాపాము వెనుక కమిత వేగముతో వచ్చి యామె కాలుమట్టిముట్టి చూచెను. విషబాల నెమ్మదిగ నాకంటకము నూడదీసుకొనెను పాములవారి బాలల కెట్లుసరిపోవును? ఎటుచూచినను ఆమెకు దారి కనబడలేదు. ఆమె నాలుగు నైపుల తిరిగివచ్చినది. కాని దవిహ్వలయమునుగూడ మానుష స్త్రీ నడచుదారి ఏమియు కానరాలేదు.

ఉష్ణమునకు విషబాలిక కూలబడినది. పాలతిప్పని అనుగులు ఆమెట్టున్న దారులన్నియు ముండ్లడొంకలలో కప్పబడియె వెడలిపోయెను.

ఆమె నాల్క ఆరిపోయినది. దాహమని ఆమె నాలుగు నైపుల మోముతిప్పి కనుగొన్నది. పాపము ఆపాము చేయునదిలేక కాబోలు అంతర్ధానమైపోయెను.

అత్యంత పిపాసార్దితయై దిగంబరియగు నాబాల తన తలకట్టె పక్కగా ఒడ లెరుంగక నిద్రపోయెను.

మెలకువవచ్చి చూచునప్పటికి సూర్యుడు నడినెత్తిపై నున్నాడు ఆమె కాకలి దహించుకొని పోవుచున్నది దాహము! ఈ నిర్జనారణ్యములో తన గోడెవరాలకింతురు? ఆ పాము జాడకూడలేదు. మానవుడు విడిన యీ యవ్వన బాలను క్రిమికీటకాదులు కూడ వీడిపోయినవా? ఇంతలో బుసకొట్టుచు గుబురునుండియో యాపాము ప్రాకుచు వచ్చెను ఆమెనోట ఒక కప్పయున్నది. విషబాలిక కా పామాహారము కొని వచ్చెనా కాబోలు!

విషబాల పకపక నవ్వినది. "ఓ ప్రాణస్నేహితుడా! నాకాహారము కొని వచ్చినావా?. కాని నీ ఆహారము నాకు సరిపడదే! నీ ప్రేమయే నాకాహారముగాక. ఈయది నరకమని నాకు తోచుటలేదు. గాఢారణ్యమై యుండునమకొనియెదను. అయిన నేనిచ్చటికెట్లువచ్చితిని? అయ్యో! మా తాతయ్య ఇచ్చట దిగవిడిచి చనలేదు కదా! అమ్మా! నాపేగులు వణకుచున్నవి. నేనేమిచేయుదును? నాకు దిక్కెవ్వరు?" అని గాఢపిపాసమున ఆమెఅతికరుణముగా ఏడ్చినది. ఆమె మరల నొడలుమరచి పడిపోయెను.

ఆమెకు జ్ఞానమువచ్చుసరికి సాయంకాలమైనది. ఎల్లయెడల కారుచీకట్లు క్రమ్మినవి. కీచుచు, కీచుమని కీచురాళ్ళ చప్పుడు అడవి మేకముల అరపులు దూరమున వినబడుచున్నవి విషబాల యిప్పుడున్న అడవిభాగమునకు వన్యమృగములు కూడ రావెరచును. అక్కడ చుట్టుపక్కల రెండామడవరకు నీరములులేవు. ఆకాశమువరకు పెరిగిపోయి, పాతాళమునుండి నీరుత్రావు పెద్ద పెద్ద వృక్షములు, వర్షకాలమున చిగిర్చి పెద్దవియై తరువాత యెండిపోవును. కీటకములకుగూడ దారి యీయని కంటక నికుంజములుతప్ప అచ్చట నేమియు గానరావు

ఆ నాగుబాలి దినమున అటవిలో తిరుగుచు మనుష్యుల అడుగులజాడకనిపించి భయపడియెను. మానవుడెచ్చటను కానరాలేదు. ఆ అడుగులవాసనల నా భుజంగమునకు ఆపగారాని జిజ్ఞాసకలిగి ఆపాదముల జాడనే గనువులు, క్రోశములు గడచి యా విషబాలను కనుగొన్నది. మానవస్త్రీని చూడగనే భయపడి వెనుకకుబాతి, భయము కలిగించు వాసన కొట్టనందున ఆపన్నగము మెల్ల మెల్ల ఆబాలికను సమీపించినది.

ఆకలిబాధచేతను, దాహముచేతను, ఆ విషబాలిక నిశ్చేతనమగు గాఢమూర్ఛలో మునిగినది. ఆమె రాత్రియంతయు నట్లే పడిపోయియుండెను. మరల తెల్లవారినది ఒక యామము గడచినది ప్రకృతియే యామెను సేదదీర్చినది. ఆకలిబాధ ఎట్లో మంపగించినది. దాహముకూడ ఏవిధముననో తగ్గినది. కాని కదలలేనంత నీరసస్థితిలో ఆమె అట్లే పడియున్నది.

మరల నిద్రపోయినది. మధ్యాహ్నమగువేళ విషబాలకు మరల మెలకువవచ్చినది. ఆమెకు కన్నులు విప్పుటకుగూడ శక్తి చాలలేదు. కాని తానొక్కతెయే యచ్చట లేదను నభిప్రాయమామెకు కలిగినది. నాకలోకమునీడి దేవలోకమునవచ్చినట్లామెకు భావమొందుకలిగెను. కన్నులువిచ్చి నాచెదమా యనికోర్కె. కనులు విప్పలేయని నీరసము. పాటిగాలులు ముక్కుపుటముల, గళమును, వాయుకోశముల నాప్యాయించు విషగాలులువీచు నీప్రదేశమున సువాసనాపూరితములై వీచు నీతెమ్మెరలెక్కడివి? అనుకొనుచు ఆమె కన్నులు తెరచినది.

ఎట్టయెదుట మబ్బులు గ్రమ్మియున్న యామె చూపులకు తనపై వంగచూచుచున్న ఒక పురుషుని ముఖము మిరుమిట్లు గొలిపినది. ఆమె మాటరాకపోవుటచే నోరు తెరపి మరల కన్నులు మూసికొనెను. ఇంతలో ఆమె పెదవులపై తీయని పుల్లని, శీతలమగు సుగంధపూరితములగు రసబిందువులు పడినవి. ఆమె నోరు చప్పరించెను. మరల రసబిందువులు ఒలికినవి. ఆమె నాలిక జాపినది. అంతపై ప్రాణము లేచివచ్చు నాగరంగఫలరసము నెవ్వరో పిండినారు



# సప్తమ ప్రకరణము

## ఆచ్ఛోదనము

వేట రాజుల వ్యసనము. బ్రాహ్మణులు ప్రభువులైనా వేట తప్పదు. బుద్ధభగవానుని ధర్మము నాశ్రయించినను రాజులకు వేట ఏల తప్పును.

మృగయావినోదియై శ్రీకృష్ణశాతవాహన మహారాజు పరివారజనసమేతుడై వెడలినాడు. వేటకుక్కలు, డేగలు, గరుడులు, చిందుగులు, ఏనుగులు, కిరాతులు, పాము వాండ్రు కూడ బోవుచుండిరి వారితో ఖడ్గములు, మృగబంధనములు, భారయష్టులు, డప్పులు, వృక్షాదనములు, క్రకచములు, నారాచములు, త్రిశూలములు, ఔషధములు, కాగడాలు, శిబిరములు, మంచములు, ఆసనములు మొదలగు ఆయుధాది పరికరములెన్నియో తెచ్చుచుండిరి.

విషవైద్యులు, కార్తాంతికులు, భిషక్కులు, వంటవారు, ఆఖేటవిద్యాచతురులు తోడరా మహారాజు సేనాపతి ద్వితీయుడై చనుచుండెను.

చిందుగులు వేటాడుటయందు ప్రసిద్ధివహించిన జంతువులు. చిందుగులను, సివంగులనియు పిలుతురు. అడవి ఎఱ్ఱపక్కలనుగూడ చిరుతపులులవలె, బోనులలో పెంచి మృగములను వేటాడించువారు ఆంధ్రులు.

ఆంధ్ర శాతవాహనులు ఉత్తమ బ్రాహ్మణులు. బుద్ధపదారాధనతత్పరులయ్యు, సంధ్యార్చనాదికముల మరువరు. క్రతువుల నాచరింతురు కాని వానిని హింసాపూర్వకముగా జేయరు. శ్రీకృష్ణశాతవాహన మహారాజును స్నానమాచరించి సంధ్యార్చనాదికముల నిర్వర్తించి కవచముధరించి సకలాయుధోపేతుడై శుభముహూర్తమున విప్రాశీర్వాదములు చెలగ ఏనుగు నెక్కబోవుచుండ దూరమునుండి తీయని ఒక బాలికాకంఠము తెల్లవారుగట్ల పాటపాడుచు వినంబడినది

రాజజ్యోతిషికుని తనతో భద్రదంతావళము నెక్కగోరి శ్రీకృష్ణుడు గజారోహణ మొనర్చెను గజములు కదలినవి. వేట పరివారమంతయు గదలినది. శ్రీకృష్ణుడు జ్యోతిష్యునితో తన కలయంతయు తెలిపి దాని ఫలితము వినిపింప ప్రార్థించినాడు. ఒక యరనిమేషము ఆలోచనాధీనుడై యా కార్తాంతికుడు శ్రీకృష్ణునిజూచి,

"ప్రభూ! తమ స్వప్నమును, తాము పయనోన్ముఖులైనప్పుడు వినిపించిన యా మధురగీతాలాప పరమార్థమును సమన్వయించిన, తమకు కొన్ని చిక్కులు వివాహవిషయమై రాగలవనియు, అవి యన్నియు తీరి పరమానందముగ వివాహమగుదురనియు, తమకీ త్రిభువనమున అఖండవిజయము రాగలదనియు, ఆవిజయమునకు ముందు వివాహ విషయమున వలెనే కొన్ని చిక్కులు, ప్రాణాపాయస్థితులు సంభవించుననియు నాకు తోచుచున్నది" యని మనవిచేసెను.

"'స్వప్నములవలన నట్లు చెప్పవచ్చునా? ఈ జ్యోతిష్యాదులు నిజమా?' యన్న ప్రశ్నలు నాలో నప్పుడప్పుడుద్భవించును. ఈ ప్రపంచమంతయు మాయయందురు కాదా? ఈ ప్రపంచ మెంతయున్నది! దీనికాధారము మేరుపర్వతమేనా? ప్రపంచ మధ్యమున జంబూద్వీపమా. ఆద్వీపములో నవవర్షములు, అందు మనము నివసించు భారతవర్షము! అనంతమైన జగత్తులో మన మే పాటి? మన స్వప్నమే పాటి?"

"ప్రభూ! తాము సెలవిచ్చినది సత్యమే. విహాయస్సువలన ఈ సర్వభూమండలము పరిభ్రమింపవచ్చును. లోకాలోకపర్వతములవరకు పోవచ్చును. మనవారు జంబూద్వీపాంతములకుబోయి సువర్ణాదిద్వీపములు చూచి రాజ్యములేర్పరచుచున్నారు. యవన రాజులతో వర్తకములు చేయుచున్నారు. అనేకవర్షములలో చిత్రవిచిత్ర మనుష్యజాతులను, మృగజాతులను జూచుచుండిరి. ప్రపంచమెంత విశాలమైనను సనాతనమైన ధర్మమొక్కటే దీనిని ధరించుచున్నది కదా!"

"అవును! మహా శ్రమణకుని బోధకు, ఆర్యఋషుల బోధకును సర్వవిషయముల నొకేభావము ద్యోతకమగుచున్నను నిర్వాణాది విషయములందు సత్యదర్శనమందు కొలది భేదములు మాత్రము కనబడుచున్నవి. సర్వప్రపంచమిట్లు ప్రత్యక్షమై రాజ్యములకై, సంపదలకై, దారాపుత్రాదులకై, సంతోషములకై, మనమిట్లు తాపత్రయముల బడుచుండియు, నింతయంతయు భ్రమ అని అనుకొనుట ఏల?"

"మహారాజకుమారా! అంతమాత్రమున జగత్తు సత్యముగనా? మనమును సత్యముకాము. ఒక మహాకర్మమున నేమియులేని శుద్ధానందములోనుండి విసృజించిన మన మీ విచిత్ర నాటకమాడుచున్నాము. దానికి ప్రతిఫలమును మనమే. అయ్యు అహంకార మమకార వశులమగుచున్నాము. అదియే దుఃఖనాటకము."



ఇట్లు సంభాషించుచు మహారాజు సపరివారుడై అడవిమధ్యము జొచ్చెను.

ఆదినమంతయు వేటజరిగినది. అనేక మృగములు హింసింపబడినవి, అరణ్యమంతయు గగ్గోలుపడిపోయినది.

ఆరాత్రి మహారాజు చిన్న పట్టణమునకు సరిపడు తన పరివార జనమందరితో నొక శైవాలినీకూలమున, శిబిరములువేయించి విశ్రమించెను.

యామములు యామములాతనికి ఏదియో యాలోచన, యుద్ధమెట్లుండునో? ధను కచ్ఛము పట్టుకొనుట, ఆభీరులతో యుద్ధము, వివాహము! ఈ ఆలోచనలు ఆషాఢమేఘములవలె ఆతని మనఃపథముల సంచరించినవి

కొంతకాలమునకు యౌవన శ్రీమధగుడు నా శాతవాహనకుమారుడు, తన మృదు పల్యంకమునుండి లేచి క్రిందికిదిగి మెత్తని పాదరక్షలు తొడుగుకొని మైనపువత్తిదీపములు వెలుగు దీపస్తంభముకడకుపోయి, యాదీపములకొడులన్నియు సరిచేసి, యక్కడ నొక ఆసనముపై కూరుచుండి, తన్ను కలచివేయు వివిధాలోచనముల జెదరగొట్టుచుండెను

ఎన్నిసారులు దూరముగ త్రోసిపుచ్చినను మరల మరల తన వివాహవిషయము యాతనికి ఎదుట ప్రత్యక్షమగుచున్నది. ఏమి వివాహము? ఎవరితో? మహారాజుల కొమరితలు తనకు వలదు. వారు తన ప్రత్యర్థులకు చెల్లెలుగుదురే గాని తన మనోవేదనతీర్చ శక్తి కలుగువారగుదురా? వారలలో కొందరు అందకత్తియలు నున్నారట. అందచందములు జంతువులకుమాత్రము లేవా?

తమ మండలికలలో అద్భుతసౌందర్యముగలయువతులున్నారని ఎన్నియో సంబంధములు వచ్చినవి. తండ్రిగారు తన భావమేమని కొన్నప్పుడా ప్రస్తావనకు తాను ప్రతి యీయలేదు. వివాహమేమి? కామనిర్వహణమునకు తనకడనున్న బాలికలు చాలరా? అనాఘ్రాత పుష్పములై, కుసుమకోమలదేహలై, పరిమళోచ్ఛ్వాస నాసికాసుందరులైన యా బాలలున్న తన కామాగ్ని కింధనమగుటకు వేయువనితలేల. ఆయిన వారిని తా నంటినదియులేదు. వారి యౌవనామృతరసమునాస్వాదన చేసినదియులేదు. తుచ్ఛానందము కేవలయోగమాత్రమున జనించును. గాఢమై, గంభీరమై, అనంతమై, అత్యంత గోప్యమగు మానసప్రకృతికా సౌఖ్యము తృప్తి నీయగలదా? కుమారులై ధరింప

రాని దుర్గంధముల నోలాడు ఈ కిరాతులలో స్త్రీ పురుషు లానందమొందుట లేదా? ఈ దేహసౌఖ్య మాత్రమునకు అందముగూడ నెందుకు? సాధారణవృక్షములును మహౌషధులు నన్నియు కుసుమించి ఫలించుటలేదా? బీజ ధర్మమంతట నొక్కటియే కదా?

శ్రీకృష్ణశాతవాహనుడు పోయి మంచమున మేనువాల్చి నిదురగూరెను. వేకువనే వైతాళికులు ఉషోదయగీతికల బాడిరి.

వేటజనమందరును లేచిరి. కొంతకాలమునకు సర్వము సిద్ధము చేసుకొని వేట సాగింప బయలుదేరెను మహారాజు శ్రీకృష్ణశాతవాహన కుమారుడు.

ఏనుగుపై నెక్కి కొంతదూరము సాగెనో లేదో ఎదుట నొక గిరినాగు ఏనుగునకు కొలది దూరములో కానవచ్చినది. గిరినాగములన్న ఏనుగులకేమి, సింహములకేమి, మనుష్యులకేమి యన్నింటికిని భయమే. గిరినాగము కంటబడినవాడు దాని బారినుండి పారిపోలేడు. మంత్రివేత్తలు, పాములవాండ్రైనా నాగముల దాపునకైన పోవరు.

మనుష్యునకు కనంబడని యీ పాము నేడింత నిర్భయముగ నడవుల సంచరించుచున్నదేమి యని వారందరు సంభ్రమాశ్చర్యముల నందిరి.

అప్పుడొక పాములవాడు ముందునకువచ్చి, మహారాజుగజముపైపు తిరిగి చేతులు జోడించుకొని "మహాప్రభూ! ఈ పాము దేవర వారిని ఎక్కడకో రమ్మనుమని అడుగుచున్నది. ఈ పాములమాట మే మెన్నడును జవదాటియెరుంగము" అని మనవి చేసుకొనెను.



# అష్టమ ప్రకరణము

## మహా విష సాన్నిధ్యము

ఆ మహానాగము ముందు, వెనుక శ్రీకృష్ణసాతవాహనుడు తన కొలది సైన్యముతోడను వారు అమితవేగమున వెడలజొచ్చిరి. ఉత్తరాభిముఖమై ఆపొదలలో, నిబిడవృక్ష సమూహములలో, నల్లని బండరాళ్ళలో, ఆపర్వతనాగేంద్రుడు వారిని కొనిపోయినాడు.

శ్రీకృష్ణసాతవాహనుని మత్తగజము లెక్కసేయక వేగమున బాఱు నా పన్నగేంద్రు ననుసరించి పోవుచుండెను. వెనుక ఏనుగులన్నియు వచ్చుచున్నవి. గుఱ్ఱములు, బండ్లు, ఎద్దులు, కాలినడకవారు బండ్లతో సమానముగ వచ్చుచుండిరి. ఈ శ్రేణి నాల్గయిదు క్రోశముల పొడవయినది.

యువరాజెక్కిన మదగజముపై మంత్రగురువు, విషవైద్యుడు, పాములవాడును ఎక్కిరి. వారిట్లు రెండు యోజనముల దూరము పోవునప్పటికి దారి దొరుకుటయే కష్టమగు భయంకరారణ్యము చొచ్చిరి. ఆ ప్రదేశము మృత్యుదేవత విహరించు ఉద్యానవన భూమివలె నుండెను. భయమనునది ఎరుగని శ్రీకృష్ణసాతవాహన భద్రదంతావళము 'మందరాద్రి' యను పేరుగలది ముందునకు అడుగువేయుటకు జంకి ఆగిపోయెను. ఏనుగులన్నియు నాగిపోయినవి. శ్రీకృష్ణశాతవాహనున కేదియో వివశత్వము కలిగినది. మావటీల నాయకుడగు మందరాద్రి ధోరణుడు ఏలనో గజగజ వడంకెను.

విషవైద్య మంత్రివైద్యులు వెంటనే తమ గజమునాపి, కూర్చుండబెట్టించి తాము దిగిరి. మందుల మంజూషలోనుండి విషవైద్యుడు ఒక కరడము తీసి, యందు కొన్ని చూర్ణములు వడివడిగా బోసి, చెకుముకి వెలిగించి యా చూర్ణమంటించెను. ఆ కరండమునుండి నల్లటి ధూపములు ఘాటైనవి పొగ మంచులవలె పైకెగసినవి. ఆ కరండమును బట్టుకొని, యా విషవైద్యుడు, ఎండిన యా ముళ్ళపొదలలో ఎటులనో దారి చేసుకొనుచు ముందునకు దూలుచున్న భద్రదంతావళముకడకు బోయెను. అందరికి తుమ్ములు దగ్గులు వచ్చినవి ఆ ప్రదేశమంతట నావరించియున్న భయంకర విష

ఈపొగలచే సమసిపోయినది. మందరాద్రియు, మావటివాడును, శ్రీకృష్ణ సమహారాజును మత్తు తెలిసి ప్రకృతిస్థులైరి.

మహారాజు:—ఏమి ఈ విచిత్రము?

వైద్యుడు:—ప్రభూ! ఈ ప్రదేశమంతయు భయంకర విషగంధ సమ్మిశ్రి వ్నది, సర్వవిషనాశనచూర్ణమను ఈ దివ్యచూర్ణ మొక్క హాలాహల, కాల కూట, వాయువులదక్క, తక్కిన విషవాయువుల నన్నిటి సమయించును. తామును మావటీడును తమ మహాగజమును తూలిపోనారంభించిరి. నాకును ఆ విషవాయువు తగిలినది. వెంటనే మా ఏనుగుపైవారమంపరము 'అమృతరస'మను నీమందును మాత్ర లుగా సేవించి, ఏనుగునాపి, దిగి ఈపనిని చేసితిని.

అప్పుడా భద్రదంతావళము భూమిపై నధివసింపజేసి శ్రీకృష్ణశాతవాహను డును గజావరోహణ చేసెను. ఇంతలో పాములవాండ్రు, కిరాతులు మొదలగువార నేకులా ప్రదేశము కడకు వచ్చుచు దూరముననే యాగిపోయిరి. అందొక్క పాముల వాడు 'హో' యని కేకపెట్టి యుచ్చైస్స్వనముల నిట్లు చెప్పినాడు.

"ఏలినవారు ఉన్నది మహా విషపుగాలులు వచ్చె ప్రదేశము. ఆ చుట్టుప్రక్క లనే, అదిగో ఆవిధముగ అగి. వింతపడె మాచుచున్న ఆ పాపఱేని నివాసము ఉంటె ఉండవలె, లేకపోయిన దొరా అంత చావుగాలి రానెయ్యా!" అని చెప్పినాడు.

"ఇప్పుడేమి చేయవలె!" అని విషవైద్యుడరచినాడు.

"స్వామీ! ఆపొగలు బాగుగా వేయండి. మేమందరము అచ్చటికే వచ్చుచున్నాము." అని ఆపాములవారిలో పెద్ద పెద్దకేక వేసి చెప్పెను వారందరచ్చటికిదారిని సరిచేసుకొనుచు వచ్చిరి. ఈలోన ధూపకరండము లయిదారింటిలో విషనాశక చూర్ణము పొగలు వేయబడినది. రాజకుమారుడు, పాములవాండ్రు, కిరాతులు, విషవైద్య గురువు మంత్రివైద్యుడు మాత్రము కాలినడక నా పన్నగేంద్రమును వెంటనంటిరి.

'అమృతద్రావక' మను ఒక మందు స్ఫటికశిలలోదొలిచిన కలశములో నుంచిన దానిని, విషవైద్యుడు, వలిపెములపై పోసి తడిపి, ఆ వలిపెముల ముక్కలు అందరి ముక్కులకు కట్టి తానును కట్టుకొనెను.



అప్పటికే సూర్యుడు చండకిరణుండై మధ్యాహ్న సింహాసనము నాక్రమింప వేగమున బోవుచుండెను. అందరికిని నాల్కలు తడియారిపోవుచున్నవి. చిరుచెమ్మట లైన వారి దేహముల నుద్భవించుటలేదు దాహముకాకుండ వైద్యుడు యష్టిమధుకా దుల భావన చేసిన మాత్రల నెల్లవారికి నిచ్చెను. అవి ఒక్కొక్కటియే వారు నోటిలో వైచుకొనుచుండిరి వారి దాహము కొంచెము తగ్గజొచ్చినది.

ఇంతలో ఎదుట శుభ్రము చేయబడిన యొక స్థలములో విగతజీవివలె పడి యున్న యొక దివ్యసుందరవిగ్రహము!

ఆ విగ్రహము దిగంబరమై ఒరనూడ్చి పడవేసిన కృపాణమువలె నున్నది.

ఆ విగ్రహపు దీర్ఘవినీలకుంతలభారము చెదరి, యామెపై ఆచ్ఛాదితవస్త్రము లెవపడియుండెను.

ఆ విగ్రహము అమరత్వము దాల్చినరూపమే. అయినను ఏమహావిధి సంఘటన వల్లనో వాడిపోయిన నందనవన పారిజాతకుసుమమువలె నున్నది.

ఆ నాగుబాము విషాదముతో, ఆ పడియున్న విగ్రహముచుట్టు బుసలుకొట్టును వీరందరు నిలుచుండియున్నవైపు చూచుచు, తిరుగుచు త్రొక్కటపడుచుండెను.

ఈ దృశ్యమేమి? ఆబాలిక ఎవరు? ఆమె ఎక్కడిది? ఆమె బ్రతికియున్నదా, చచ్చిపోయినదా? యని యాలోచన లందరిహృదయముల నొక్కసారి జన్మించెను. ఆ వైద్యగురువు పడియున్న బాలికను దూరమునుండియే ఒక నిమేషము తీక్ష్ణదృక్కుల పరికించి "మహాప్రభూ. ఆ బాలిక బ్రతికియున్నది. కొనయూపిరితో నున్నయది. ఆమెకు వెంటనే చికిత్స చేయకపోయినచో, ఆమె చనిపోవును. కాని—కాని—" అని తొందర తొందరగా మాటలాడెను.

"కానిఏమి! వెంటనే, ఆమెను రక్షింపవలెను. రండు పోవుదము—"

విష:— ఆగుడు మహారాజా! ఒక్క అడుగు ముందుకువేయకుడు! ఆమె ఏ మహత్తరవిషమో సోకి అట్లయి యుండవచ్చును. ఆమెదగ్గిరకు పోవుటే, మృత్యువదన మున బడుట.

మహా:—మరి కర్తవ్యమేమి? వ్యవధిలేదు, ఆ దేవాంగన చనిపోవును. మీరు రానిచో నేను పోయెదను. ఏదిరా ఆగొడ్డలి?

అని శ్రీకృష్ణశాతవాహన కుమారుడు ముందు కురికి పోయినాడు. ఋషితుల్యుడగు నా విషవైద్యుడు, మహారాజకుడను పరుగెత్తి వారిని నివారించి, "ప్రభూ! ఒక్క అడుగు ముందు వేసితిరా, తథాగతునిపైనాన! తొందరపడకుడు. నేను ఇంకొక మహా విషమును సేవింతును. ఈ విషమా విషమునకు అమృతమువంటిది ఇది సేవించినవారు మూడు దినములావల వేయి గజనిమ్మపండ్లు సంపూర్ణముగ భక్షింపవలయును! ఆభయంకరవిషము ఈ విషమును నాశనముచేయుచు తాను నశించును ఇప్పుడు నేనుపోయి, ఆ విషమును నా సంచిలోనున్న గజనిమ్మపండును ఒలిచి ఆరసముతో రంగరించి, ఆబాలిక నోటిలో పిండెదను. మీరందరిచ్చటనే యుండుడు. ఆ వ్యాళగ్రాహియు, నేనును పోయెదము" అని వేగముగ బల్కెను.

వారందరట్లు చూచుచుండగనే, విషవైద్యునికడ విషము ఆ ఇరువురు భక్షించి ముళ్ళకంచెలు గొడ్డలిచే ఛేదించుచుపోయి, యా బాలికను చేరిరి. విషవైద్యుడువెంటనే యామెపై తన ఉత్తరీయమువైచి యామె దిగంబరత్వమును కప్పెను.



# నవమ ప్రకరణము

## ప్రణయావేదన.

ఆ విషవైద్యుడు విషబాలకడకుబోయి యామె నాడిని పరీక్షించి, యానాడి బలమునకచ్చెరువంది, ఆమె పెదవులపై గజనిమ్మపండు రసమును పిండినాడు.

ఆ తీయని, పుల్లని, శీతలమగు, సుగంధపూరితములగు రసబిందువులు అమృతరస బిందువులై పడినవి. ఆమె నోరు చప్పరించెను. మరల రసబిందువులు ఒలికినవి. ఆమె నాలుక జాపినది అప్పుడావిషవైద్యుడు తన సంచిలోనుండి నాగరంగఫలము నొక దానిని తీసి ఒలిచి యా తొనలను పిండి, ప్రాణము లేచివచ్చు ఫలరసమును ఆమె నాల్కపై పిండినాడు.

విషబాల "దాహము, దాహ"మని లేచినది. పాములవాడామెను "తల్లీ! అటులనే కదలక పరుండుము. నీకు వలయునవన్నియు మేమిచ్చెదము," అని అనునయించుచు, తన తలపాగాతీసి ఆమె తలకు దిండుగసమర్చి, తనపైగొంగళిని పక్కనమర్చెను.

ఇంతలో విషవైద్యుడు పరుగున సేవకులకడకుపోయి తోలుతిత్తులలోనున్న జలమును ఒక కలశమున సేకరించి విషబాలకడకు వేగముగ వచ్చి యామె మోముపై నీరములుచల్లి. చేతులు, పాదములు జలముల కడిగి, చల్లని ఆ నీటిని, కొంచెముకొంచెముగ ఆమె తలయెత్తి తన యొడిలో పెట్టుకొని, త్రాగించెను,

పాములవాడామెకు ఎండ తగులకుండ ఛత్రము నొకదానిని తెచ్చి అడ్డము పట్టెను.

శ్రీకృష్ణశాతవాహనుడు ఆశ్చర్యమున నిశ్చేష్టుడై, యా విషబాలవైపు తదేక దృష్టితో చూచుచుండెను. ఆమె భయంకర జగన్మోహనాకారము. ప్రళయతాండవ కేళీగ ధృతసంహార సంచలచ్చరణోద్భూతైకాదశ రుద్రాంశుల మహాగ్ని స్ఫులింగములవలె ఆమె వెరసిపోవుచుండ తన చూపులు, ప్రాణము, మనస్సు, హృదయము, ఆత్మయు ఆమె కర్పించివేసెను.

విపులమై, భాగమై, సుదీర్ఘమైన ఆమె కైశ్యశ్రీ నిర్మలశర్వరీ నిశ్చలాకాశము పోలె ఆమె అనంతచైతన్య సౌవర్ణపాటలత్వమును కప్పుచున్నది

ఇంతలో ఆమె దిగంబరయై యున్నదన్న భావమునకు మెరుపువలె స్ఫురించినది. వెంటనే యా మహారాజు తన నడుమునకు చుట్టియున్న దుకూలబృహతికను ఆమె కంఠతరీయముగ నిమ్మని యాయహితుండిక వృద్ధునకిచ్చెను.

"ఓ వైద్యగురూ! ఆమె నెడతీసినంతనే వలయు, రక్షకుల నేర్పాటుచేయుడు. నా అంతఃపుర బాలికల నిరువుర నామెకడ కంపుదునా?

"చిత్తము ప్రభూ! ఆ ఏర్పాటులన్నియు నొనర్చెదను. ఈ ప్రదేశమంతయు సూర్యకిరణములు చొరరాని అంధకారపూరితమైయుండ, దుర్మార్గులెవరో ఈబాలను ఇట దిగవిడిచి ఇటునటు పోకుండ ముళ్ళకోట కట్టినారు."

"అవును! ఆమెను ఎవరో మనుష్యులే ఇక్కడ క్రూరచిత్తులై దిగవిడిచిపోయినారు. ఇంతవరకు, ఆమె శాపగ్రస్తయై భూమికి అవతరించిన ఏదేవిగాయను భ్రమలోనుండి, మానవులకు, ఆమెకు సంబంధము ఊహించనైతిని. ఆమె నాగలోకవాసిని కాదుగదా?"

"ప్రభూ! ఆ గిరినాగము మనగడిబిడిలో ఏమైనది కనుపెట్టలేకపోతిమి మీరనునది నిజమేమో? కానిచో ఈబాలయింత విషయుక్తయయ్యు, ఎట్లుబ్రతుకగలిగినది?

"విషయుక్తయా? అదియేమి?"

"ప్రభూ, ఈమెయందు మహావిషము కూడియున్నది! ఆమె కనుకొలకులు పరీక్షించితిని, నఖములు పరీక్షించితిని, నాలిక చాపినప్పుడా జిహ్వాను తీక్ష్ణముగ పరిశీలించితిని, ఆమె పెదవులు, చెవులతమ్మెలు, ఘ్రాణియుగ్మము, ముక్కుపుటములు అత్యంత నిశితముగ పరిశీలించితిని. మహారాజా! ఈ బాలికయందు సర్వవిషములు జీర్ణించియున్నవి. అవి ప్రస్తుతము విజృంభించియున్నవి. ఆ విషముచే మానవ సంజ్ఞనంత చికాకు పరచినవి!"

"అయిన నీబాలిక ఎట్లుబ్రతికియున్నది! ఆమె ఇంతలోనే చనిపోవునా? ఆమెను బ్రతికించు ఉపాయములులేవా? మీ శాస్త్రములకాపాటి శక్తి చాలదా! ఏగ దుర్మార్గులు, రాక్షసులు, పిశాచములు ఈ బాలికనిట్లు చేసిరో వారిని వేయి ఖండములుగను నరికివేతును. వారిని బ్రతికియుండగనే ఇటులనే తిండిపెట్టక, నీరమియ్యక, ఇట్టి భూమిలో మాడ్చి, గద్దలకు, రాబందులకు బలి చేయుదును!"



శ్రీకృష్ణశాతవాహనుని కన్నులు స్ఫులింగశకలములై పోయినవి. ప్రచండసూర్యగోళములైనవి. అతని కుడిచేయి కరవాలమును దృఢతరముష్టిబంధమున పట్టుకొనినది. అతడు ప్రళయకాల రుద్రునివలె మండిపోయినాడు.

ప్రక్కనున్న మంత్రిగురువు ప్రభువు ఎదుటకువచ్చి, "శాంతింపుము, మహారాజా! మీరు ఉత్తమ బ్రాహ్మణులు! ఇంతకోపమేల మీకు? శాంతము ఎట్టికష్టములనైన నివారించునుగదా? ప్రభూ ఉపశమింపుడు. ఇప్పుడు కర్తవ్యమాలోచింపవలయునుకాదా? ఆబాలికకు ప్రాణాపాయమేమియు నుండదు!—" అని యనెను.

శ్రీకృష్ణ:— మీరెట్లు చెప్పగలరు?

విషవైద్యుడు;— ఆమెకు ప్రాణాపాయమేమియు లేదని నేను నా వైద్యశాస్త్రజ్ఞానమంతయు నాధారముగ ప్రతిజ్ఞచేసి చెప్పగలను ప్రభూ!

మంత్రి;— ప్రభూ! నేను నా మంత్రశాస్త్రప్రమాణముగ ప్రతినచేయగలను!

శ్రీకృష్ణ:— మానవకండరమునకు ప్రాణభయము కల్పించునంతటి విషములామెకుఇచ్చినా రంటిరి. ఆమె ఎట్లు బ్రతుకును? మీమాటలు నమ్ముటెట్లు?

విష;— మహారాజా! అదే విచిత్రము. కారణమిప్పుడు నేను చెప్పలేను. కాని ఎంతటి విషమునైన ఈమె హరించుకొనగలదు.

శ్రీకృష్ణ:— నాకు మీ యసంపూర్ణమాటలవలన మతి పోవుచున్నది! ఈలోన ఆ బాలికప్రాణము పోకుండ చూడుడు. ఆబాలిక ప్రా-ణ-ము-పో-యె-నా, సర్వదేవతలు సాక్షిగ. నా ప్రాణములు మరుక్షణమున నా బొందినుండవు!

ఇదియేమియని చకితులై మంత్రగురువును విషవైద్యులు నొకరినొకరు చూచికొనిరి. వెంటనే, మంత్రగురువు—

"ప్రభూ! ఈ విషగాలులు తమ నరములను క్షోభింపజేసినవి. తాముపోయి, తమ గజమారోహించి కొంచెము విశ్రాంతినందుడు" అని విన్నవించెను.

"గురుదేవా! నాకంతటనుండి విశ్రాంతియనునదిలేదు. ఈ బాలిక జీవితము ఏదియో మహత్తరవిధివశమున, నాబ్రతుకుతో అత్యంత గాఢసంశ్లేషతనందినది. ఆమెకు ప్రాణము నిలిచినద అన్నమీదట నా ప్రాణము తనంత నిలుచును" అని యా బాలుడనినాడు.

విషవైద్యుడు భయమునొందుచు హృదయముతో, చేతులు వడక విషబాలకడకు పోయి, మరల నత్యశ్రద్ధగ నామె ఉచ్ఛ్వాస నిశ్వాసములు, కన్నులు, కపోల, కంఠ,

హస్తతల, మణిబంధ, కర్పూర, పాద, గుల్ఫ, రుపజింహాది నాడులన్నియు పరీక్షించెను. అతడంతలేచి, మహారాజా కడకుబోయి "ప్రభూ! ఈబాలిక బ్రతికియున్నది ఆమెయందుమహాసర్పనాడి వ్యాప్తమైయున్నది. అయినను ఆమెలో భోజనము,నీరము గైకొననినీరసముతప్ప వేరొండు దోషమేమియులేదు ఆరోగ్యము లైనను, ఇప్పుడు కొలదిగమాత్రమున్నవి. ఆమెఇప్పుడు నిద్రపోవుచున్నది. మహావిషదగ్ధయగు నీబాలిక ఇతిహాసములలో, విషశాస్త్రములలో చెప్పినట్లు ఈ...బా...లి...క...వి...ష...క...న్య...క యని వణంకుచు చెప్పి తల వంచుకొనెను.

శ్రీకృష్ణ:—విషకన్యకయా!?"

సింహాగర్జవలె ఆప్రదేశముల మారుమ్రోగ నిట్లడిగినయువరాజు వదనమాలోకించి.

మంత్రగురువు చాణక్యదేవుడు పర్వతకునిపై విషకన్యా ప్రయోగము చేసెనని వినరా మహారాజకుమారా?

శ్రీకృష్ణ:—అట్టిబాలిక ఇక్కడ నెట్లుపడియుండును?

విషవైద్యుడు:— ప్రభూ! ఆమె నాశనముగోరి ఎవరో ఇచ్చట వదలియుండవచ్చును.

శ్రీకృష్ణ:— కార్తాంతికులవారిని పిలువనంపుడు!

వెనుక వేరొక గజముపైవచ్చు కార్తాంతికుడచ్చటకు విరుగుడు మందులు సేవించి కొలది కాలమునకు వచ్చెను.

శ్రీకృష్ణసాతవాహనుడాయన వైపు తిరిగి "పండితులవారూ, ఎవరు ఈ బాల? ఈమె నా కంటబడిన ఫలమేమి? ఇవి గణించిచెప్పుడు" అని యడిగెను.

కార్తాంతికుడంతట తనలో నొకింతసేపు గుణించుకొని "మహారాజా! ఈబాలిక రెండు మూడు సంవత్సరములు ఈస్థితిలోనుండును ఈమె సత్కులవంశజాత. ఈమె జాతకము పరమోత్కృష్టము. ఈమె మహారాణియగును. మీజీవితమునకు ఈమె జీవితమునకు ఏదియో సంబంధమేర్పడు సూచనలున్నవి. ఈమెను వెంటనే వలయునుపచారములతో, తగు కట్టుబాటులతో మనతో కొనివచ్చు ఏర్పాటులు చేయుడు. ఒకశిబికపై ఈమె ప్రయాణము చేయును. ఈ మహావైద్యులీమె రక్షణకై వలయునవన్నియు నిర్వర్తింతురు అని మనవి చేసెను.

విషవైద్యుడు, "ప్రభూ! తాము నా అనుమతిలేనిదే రెండునెలలపాటు ఈమెను సమీపింపమని మాటఇచ్చినచో నేనీభారము వహింపగలనని" విన్నవించెను.



# దశమ ప్రకరణము

## నర్మదానదము

నర్మదానదము ఎంత శ్యామలమో అంత ప్రసన్నము. ఎంతగంభీరమో అంత సుందరము. సింధునది మహాశక్తిమతి. ఆమె అనాదిచరిత్రకలది. ఆమె వేదముల తోడనే ఆవిర్భవించినది. ఆమె అదితిదేవి. దెస దెసల అపరిమిత వెలుగు వాకలై ప్రవహించు మహానది ఆమె. ఆమెగర్భమున దేవనదులే ఇమిడిపోయినవి. ఆమె కాళికారూపిణి. ఆమె సర్వామృతములు తనలో జీర్ణించుకొన్నది. ఆమె దస్యులకు, అసురులకు, ఫణిక్కులకు, యవనులకు ఆశ్రయమిచ్చినది.

నర్మదానది నవోఢ, ఆమె భారతవర్షదేవికి మణిమేఖల ఆమె ప్రసాపూరితారుణరాగ రంజితావనతవదన. యమునాదేవి గంభీరచరిత్ర. ఆమె తర్కశయనున, ప్రేమ ప్రేంఖణితమానస. కృష్ణశిక్యాంకిత వినీలజలజనయన.

నర్మద అల్లరిపిల్ల. ఆమె నాట్యమాడును. కిరాతకన్యలతో ఆ అడవులలో దోబూచులాడును. అడవిపూలే అలంకరించుకొనును. అడవిలతల మేఖల నొనరించును తీయని స్ఫటిక జ్యోత్స్నలలో, ఆ అడవిదారుల వనపత్రవస్త్రాలంకృతయై; దీర్ఘకుంతలములు విరియబోసికొని, ప్రమకుత్సునకై విరహగీతికల బాడుకొనును. గంగానది మహావేగవతి, త్రిపథగామిని పవిత్రాంబుపూర్ణయై మానవ జీవితములనే పునీత మొనర్చును. ఆమె స్నిగ్ధసితాంగ. ఆమె పుట్టుకయే మహారహస్యము ఒకనాడు విష్ణుపాదముల జనించును. వేరొకనాడు మహేశ్వర జటాజూట సంయోగనిద్రాపరవశ. ఒకదినమున జహ్నవి. మరుదినమున భాగీరథి. ఆమె సాగర సింహాసన పట్టాభిషిక్త మహాసామ్రాజ్ఞి, వరుణిని దేవేరి.

గౌతమి నర్మద భర్తనుజేరు దివ్యసంగమస్థలమునకు డెబ్బది యోజనముల దిగువను ఉద్భవించినది ఆమె నర్మదను చెల్లియని పిలుచును. కృష్ణగౌతమినే చెల్లి ఏమిచేయుచున్నదని ప్రశ్నించును. వారి పెద్దక్క సింధునదివార్తలు నర్మదయే గౌతమికి వినిపించును: సరస్వతీనది సంగీతము పాడుమని సేసవిరాత్రులం వినుడని నర్మదా గౌతమీ, కృష్ణా, భీమరథీ, తుంగభద్రా, వేణీ కావేరీనదులు కోరును ఆమె ఆ వీణాస్వరముల వేళవించి తీయని గీతికల పాడును. గంగాయమునాశోణ బ్రహ్మపుత్రికా మహానదులు విస్మయురాండ్రై వినును

ఆనాటిరాత్రి వైశాఖపూర్ణిమ. వెన్నెల కరళ్ళతో విశ్వమెల్ల ప్రవహింపుచున్నది. సువర్ణశ్రీ కుమారుడు గోండు వేషముతో నర్మదానదీతీరమున ఆ తెల్లనిరాలలో **దాగియై**, నీడలలో నీడయై నదీజలమువంక చూచుచు నదీకాంత మహాసౌందర్యము గమనింపుచు గూరుచుండెను.

మహాబలగోండుడు, హిమబిందు నింతవరకు విరోధులుగొనివచ్చి, ఇచ్చటమాయమైనారని సువర్ణునకుజెప్పె. రాక్షసులచే నా ప్రదేశమంతయు గాలించి వెదకింపజేయించి యాతని సపరిమిత్తుడై యుండగోరి, మాయమయ్యెను. ఇన్నాళ్ళ నుండియు మహాబలుని స్నేహమువలన అటవీసంచరణవిద్య సువర్ణునకు చాలవరకు అభ్యాసమయ్యెను. ఆతడు ఎంత ప్రమత్తతతో నున్నట్లు కనబడుచుండెనో, అంత జాగరూకతలో ప్రతిసవ్వడిని వినుచుండెను. సర్వదిశలు పరిశీలించుచుండెను.

“హిమబిందూ, శిల్పదేవీ! నీ వేమైతివి? నీ వెట్టికష్టముల నందుచున్నావో? ఆగర్భ శ్రీమంతురాలవు. వర్ణనాతీత సుందర శ్రీమూర్తివి. శిల్పులు నీ యందమును మూర్తింపగలరా? కవులు నిన్ను కావ్యమున బాడగలరా? దేవీ! ఏమహావిధి మనల నిద్దరగూర్చినది. ఏల నాకు ప్రత్యక్షమైతివి. నీవు నాకడ లేకున్న నా హృదయము సౌందర్య దూరమగును, ఏబాలికనో పెండ్లియాడి బిడ్డలగనుచు జీవితమును సముద్రతీరపు పల్లెసేలవలె పరచుయుంచువానికి శిల్పమెందుకు చిత్రలేఖనమెందుకు, కవిత్వమెందుకు, గానమెందుకు? ” అని లోలోన అస్పష్ట వాక్యముల గొణుగుకొన్నాడు సువర్ణశ్రీ.

“ఈ యాత్ర నీకునై. ఈ మహాటవిలోన,
ఈ గవేషణఫలము ఈవు నా కొఱకేల?”

ఆమెకు తనకు నేమిసంబంధము? ఒక దివ్యదర్శనము ఆకాశమున తోచినది అప్పుడే మాయమైనది.

తానట్టి సన్నివేశము కోరెనా? ఏల తనకా దివ్యదర్శనము కావలెను. దూరదూరమునుండియే పవిత్రాద్భుత సౌందర్యమును, రసజ్ఞ హృదయ తపఃఫలమైనదానిని పూజించుకొనుచుండియుండునే? తనకడ కామె తన్నేల రానిచ్చినది, తన్నేల ప్రేమించినది? ఇంతలో నీ ఎడబాటేమి?

లోకములో సౌందర్యాన్వేషకులు శిల్పి సమీకరించుకొనును ఒకచోట కన్నులు ఒకచోట మోము, ఒకచోట హస్తములు, ఒకచో పాదములు. ఊరువులు, కటి. వక్షము వేరు వేరు స్థలముల సుందరులయందు ప్రత్యేకమగువానిని శిల్పి పరిశీ



లించును వానిలోని దోషములు త్రోసివేసి వానిని ప్రమాణములు చేసికొనును. ఇటులుండ ఏ అపశ్రుతియులేని, మొక్కవోని, అపరాజిత సౌందర్య మొకయెడభాసింప, నా దివ్యదేవి, స్వప్నగతజీవియగు శిల్పికి ప్రత్యక్షమగునయా? అతడు రాశీభూతమైన ఆ అలౌకిక సౌందర్యము సన్నిహిత మొనర్చుకొనలేక పోవుటా? “సువర్ణా! నీ వెఱ్ఱియేకాని ఆంధ్రసింహాసన మెక్కదగిన ఆదేవి యెక్కడ! శిల్పిమాత్రుడవు నీ వెక్కడ! ఆదేవీ సౌందర్య శ్రీని వేనంగుల శిల్పించుకొమ్ము. లోకమెల్ల నా సౌందర్యముతో నింపుము. నీజన్మమునకదియే చరితార్థత” అనుకొని ఆతడు నిట్టూర్పువిడిచెను.

హిమబిందును తాను ఎటులైన వెదకి, యామెను శత్రువులబారినుండి రక్షించి వణిక్సార్వభౌముడు చారుగుప్తున కప్పగించు పుణ్యము లభించుగాక! సార్వభౌముని సైన్యము లీ యడవులలో నాశనమైనవో, వెనుకకు పోయినవో, ఇంకను యుద్ధము చేయుచు ముందునకు వచ్చుచున్నవో?

చారుగుప్తున కా సౌందర్యనిధిని అప్పగించి తాను హిమాలయములకు పోవుట మంచిది. శాక్యసింహజనన పవిత్రప్రదేశముల దర్శించి, ఆ పవిత్ర హిమాలయములో నివసింపనిచో నాయారాధ్య దైవతము నారాధించి, యా[illegible] మనస్సమాధి తనకు లభింపదు ఆదేవిని గండంపగన్నచో ఆ మహోజ్వల మూర్తికి భరత ఖండమంతట నీరాజనముల నెత్తింపగన్నచో నప్పుడుకదా ఆదేవి తన్ననుగ్రహించిన దానికి ఫలము లభించును. ఆదేవి తనకింకనేమి పని మొనసంగగలదు! తద్వాగస్వీకృతికి అర్హత సంపాదించుకొనుటయే తనపని.

ఇంతలో ఆ ఆలోచనా మధ్యమున నీటిలో అస్పష్ట ధ్వనులొనరించుచు, కొండచరియ క్రీనీడలో ఒక పడవ వచ్చుచున్నట్లు చప్పుడు వినవచ్చెను. సువర్ణుని యాలోచనలన్నియు ఆ ధ్వనివైపు తీక్ష్ణతతో ప్రవహించినవి. ఆతడు నెమ్మదిగా భూమిమీద వాలిపోయెను.

ఆ పడవ నది ఆవలివైపునకుదాటి. సువర్ణశ్రీయున్న కొండచరియ గట్టు క్రింద నాగిపోయెను. నెమ్మది నెమ్మదిగ సువర్ణశ్రీ జరిగి జరిగి పదిహస్తముల దూరమునన్న నదీకూల శిలాతలమునకుబోయి, నదిలోనికి తొంగిచూచెను. క్రిందపడవగాని మనుష్యులుగాని కనబడలేదు ఇంద్రజాలము చేవలె వారందరు మాయమైపోయిరి.

ఏమిది. ఈ చిత్రము ? ఏమైపోయిరి? తనకు కలవచ్చినదా? లేక రజ్జుసర్ప భ్రాంతివంటిది కలిగినదా? ఏమిజరిగెను. ఆతడు కన్నులు చిల్లుపడ ఆ చీకటిలోనికి చూచుచుండెను. రెండు ముహూర్తములట్లు జరిగిపోయెను

ఇంతలో నావడవ ఆకొండచరియ గోడలోనుండి వచ్చినట్లు బయలు వడుచుండెను. అందు ఇరువురు మనుష్యులుండిరి. వారు చల్లగ నా పడవను నడిపించుకొని పోయిరి. ఆవలి యొడ్డున కరిగి, ఆ గుట్టలలో, రాళ్ళలో, చరియలనుండి నీటికడను వ్యాపించు తీగలలో, వృక్షములలో క్రీడలందు ఆ పడవ మాయమై పోయెను.

సువర్ణశ్రీ దడ దడలాడు గుండెలతో ఆగుట్టలలో నెక్కి గసపసకుండ ప్రాకుచుపోయి, కొంచెము వీలయినచోట నదిలోనికి దిగజారెను. అక్కడ మొసళ్ళుండునేమోయను భయమాతనికి కలుగలేదు. లోతులుండునో, సుడులుండునో ప్రచ్ఛన్న శిలలుండునో ఒడ్డునకు మరల చేరుటకు వీలుండునో ఉండదోయని యాతడాలోచింపలేదు.

అతడు నెమ్మదిగ ఈదుకొనుచు ఆ పడవ యాగినదని తాను నిర్ణయించుకొన్న ప్రదేశముకడకు పోయెను. నీటివడి ఎక్కువగ నున్నది. అయినను వీరుడగు నా బాలకుడు మత్స్యతరణ విధాన ముపయోగించుచు నెమ్మదిగ నా ప్రదేశమంతయు గాలించెను. ఆ పడవ యెచ్చటమాయమైనదో అతనికి గ్రాహ్యముకాలేదు.

ఇంతలో పెద్ద స్ఫటిక శిలప్రక్క నొకగుహవంటి ద్వారమా శిలాతలమున నీటిమట్టమున గాన్పించినది. ఆ గుహాముఖము, గుహాముఖమని ఏరును కనిపెట్టలేనంత విచిత్రముగ నచ్చట శిలాశిఖరములు నీటిలోనుండి తలలెత్తియుండెను. వానకాలపు వరద లెంతవచ్చినను, ఆగుహలోనికి పడవ కటాకటిగ పోవచ్చును.

సువర్ణశ్రీ యా గుహలోనికి ఈదుకొని పోయెను. అచ్చట పడవ యానుటకై ఎత్తయిన వితర్దికయు, ఆవితర్దికనుండి ప్రేలాడు తాడొకటియు నాతనికి గోచరమైనవి. అతడా త్రాడు పట్టుకొని నీటిలోనుండి వెడలివచ్చి చప్పుడు కొంచెము కాగా ఆవితర్దికపై కెగబ్రాకి, యందు కొంతకాలము చప్పుడుకాకుండ పండుకొని యుండి బల్లివలె ముందునకు కటిక చీకటిలోనికి ప్రాకుకొని వెడలిపోయెను.



# ఏకాదశ ప్రకరణము

## మహా గుహాంతరము

ఆ గుహాముఖమున అడుగడుగు కాపుండు రక్షకభటులలో మొదటివంతువారప్పుడే భోజనమునకు వెళ్ళిరి. రెండవవంతువారు, అప్పుడే వచ్చివెళ్ళిన ఆగంతుకులు తెచ్చిన వార్తల విషయమై ఇతరులతో చర్చించుచునే, కొంత ఆలస్య మొనర్చిరి. ఆ తరుణముననే, సువర్ణశ్రీ గుహలోనికి సగమువరకు బల్లివలె ప్రాకుచు పోయెను.

ఇంతలో మనుష్యులు మాట్లాడుకొనుచు తనవైపువచ్చు సవ్వడివిని, సువర్ణుడు చైతన్యమును వదలి, రాయిలో రాయియై పోయెను గోడను ఒదిగిపోయి ఊపిరైనను వదలలేదు. మాటలాడుకొనుచు ఇరువురు రక్షక పురుషులు, సువర్ణుని ప్రక్కనుండియే నడిచి వెళ్ళిరి.

వారట్లు నడచి నడచి గుహాద్వారమును వెడలిపోయిరి. వెంటనే సువర్ణుడు తథాగతుని ప్రార్థించి ముందునకు ప్రాకుచు సాగిపోయెను. అతడు ఇరువది ధనువులట్లు పోవుటయు గుహాంతము దూరమున తోచినది.

ఎట్టిప్రాంగణమునకు కొనిపోవునో యాగుహ; గుహవెలుపల వెన్నెలవెలుగు తెల్లని పూలపోగువలె కన్పించుచుండెను. అచట నొక వీరుడు విచ్చుకత్తులతో నిలువబడి యుండెను.

సువర్ణశ్రీ పదినిమేషములు తీవ్రాలోచనలో మునింగి, కర్తవ్యము నిశ్చయించుకొనెను. అతడు ఇటునటు తడవినంత రెండు చిన్నరాళ్ళు దొరికినవి. తన నడుమునకు కట్టియున్న చురకత్తియును వదలుచేసుకొని, ఎడమచేత దృఢముష్టిని ధరించి కుడిచేత నా రాయిని నేలపై గొట్టి 'టిక టిక' చిన్న చప్పుడు చేసెను.

గుహాముఖమున నున్న ఆ రక్షకభటుడు స్తంభించిపోయెను. ఇటు నటు పరిశీలించి యాతడు నెమ్మదిగ సువర్ణశ్రీ వైపునకు వచ్చెను. ఆ కటిక చీకటిలోకూడా సువర్ణశ్రీ చూపు మార్జాలదృష్టివలె నైనది. అది అంధసంచరణ విద్యాఫలము.

సువర్ణశ్రీ, లేడిపై నురుకపొంచియున్న శార్దూలమువలె సర్వావయవములు పొం

గభెంగున విరోధిపై నురుక సన్నద్ధుడై యుండెను. ఆజానుబాహుడైన యారక్షక భటుడు తనతో నొక దివిటీ తీసుకొనిరాకపోవుటయే దోషము.

తన ప్రక్కనుండి యాతడు పోవుచున్నప్పుడు చప్పుడు కాకుండ సువర్ణశ్రీ ఆరక్షక భటుని వీపుపై ఉరికి కుడిచేత విరోధినోరు గట్టిగమూసి ఎడమచేయి. మనుష్యుని చుట్టిపోనిచ్చి ఎడమచేయి నొక్కిపట్టుచు, కుడిచేయి మణికట్టు గట్టిగ నొక్కిపట్టెను.

తనగురువు సోమదత్తాచార్యులు నేర్పిన మల్ల యుద్ధపునేర్పు నుపయోగించి విరోధి ముద్దయై ఒరగునట్లు మోకాలు డొక్కలో నొక్కివేసెను. వాని చేతులు బంధించుటయే కొంచెము, మెడనక్కు వాళ్ళను గట్టిగ నొక్కుటయును. అయిన నిమేషములలో స్పృహతప్పి, ఆ మనుజుడు దొరగిపోయెను. క్రిందకు పడిపోవు ఆతని కత్తిని వెంటనే పిడిముడి పిడితో పట్టుకొని. వానిని క్రింద చల్లగ పరుండబెట్టి, వాని నడుమునకు బిగించుకొనిన కాసెకోక నవిరించి, నెమ్మదిగ లాగి, ఒక చివర ఆతని నోటిలో కుక్కి, కిక్కురుమనకుండ బంధించి వేసెను.

తన నడుమునకు చుట్టియున్న తాడుతో ఆ మనుష్యుని కదలలేకుండ గట్టిగ కట్టివేసినాడు. అచ్చటినుండి త్వరితముగ తన అలంకరణ విధమంతయు నూడ్చి యారక్షకభటుని గోండును జేసి, తా నారక్షకభటుని వేషము నైచికొనెను.

ఆ ద్వారపాలకుడు మాళవసైనికుని వేషమున నుండినాడు. ఒక అరగడియలో సువర్ణశ్రీ మాళవసైనికుని వేషమున నిర్భయముగ లేచి గుహవెలుపలికి వెడలిపోయెను

అక్కడ సువర్ణశ్రీ సందర్శించిన దృశ్యము పరమాద్భుతమైనది అది వింధ్య పర్వతములలో ప్రకృతి ఏర్పరచుకొనిన చక్రాకారమగు నొకలోయ. చుట్టును మనుష్యుడు పోకలేని ఎత్తయిన శిఖరములు. పెట్టని మహోన్నత కుడ్యములైన ప్రాంతములు, ఆకాశమువరకు ఉండెను.

ఆ విశాల చక్రాకార కందరా ప్రదేశము ఎనుబది ధనువుల వెడల్పు నూట ఇరువదిధనువుల పొడవున్నది. ఆ భృగుకుడ్యము చుట్టును ముప్పది బిలము లున్నవి. కొన్ని గహ్వరము లయిదారు ధనువు లెత్తున నున్నవి. ఎత్తయిన యా బిలములకు పోవుటకు మెట్లున్నవి.



ఈ పర్వతాంతర్గస్థలమునకు వచ్చుటకు సువర్ణశ్రీ వచ్చుమార్గముతప్ప వేరొండు మార్గములేదనియే యాతనికి తోచినది. ఆ ప్రదేశమునందు మూడు నాలుగువందల జనులుండవచ్చును. అందు బ్రాహ్మణులు, క్షత్రియులు, ఆటవికులు, నాగరజనులు అనేకులు కనబడిరి. కొందరు అక్కడక్కడ నులకమంచములపై పండుకొనియుండిరి. కొందరు తమ తమ గుహాప్రాంగణముల ప్రక్కలు నైచుకొనియుండిరి. అన్నింటికన్న మధ్యగానున్న గుహయొక్కటి సువర్ణుని దృష్టి నాకర్షించినది

ఆ కందరము ఎత్తుగా అందముగా నలంకరింపబడి యున్నది. అచ్చట పలు పురస్త్రీలు నడయాడుచుండిరి. అందు కొందరాంధ్రస్త్రీలవలె కానవయిరి: సువర్ణశ్రీ గుండెలుతోడనే దడ దడ కొట్టుకొన నారంభించెను. ఎప్పుడు తాను కట్టివేసిన మనుష్యునివంటు మార్చుటకు కొత్త రక్షకభటులు వచ్చెదరో, ఆ దీర్ఘకందరాగతుడై పడియున్న తన బందీని ఎవరైన గుర్తించెదరేమో! తా నేమి చేయవలసియుండునో!

ఇంతవరకు తన్నిక్కడకు కొనివచ్చిన యదృష్టదేవతయే తన్ను రక్షించుగాక యని సువర్ణుడు ప్రార్థించుకొనెను. తాను కానరాక మహాబలగోండుడేమి అలమటు చెందునో యనియు నాతడు భయంపడెను

కొంతకాలమునకు మనుష్యులందరు నిద్రమునుగుచుండిరి. పోతపోసిన విగ్రహమువలె, సువర్ణుడచ్చటనే నిలుచుండి యాలోచించుచుండెను. ఇంతలో ముక్తావళీదేవికంఠము స్పష్టముగ వినవచ్చినది. "ఏమిటీ ఏర్పాటులు. ఎంతటి నికృష్టజనులను గట్టివాంఛను తీయుబడవే! ఎన్నిదినములు వేవిధావంచముల బరుదుటు?" అని ఆనిశ్శబ్దములో నా స్థలమునందు ఆ మాటలు మారుమ్రోగినవి.

సువర్ణశ్రీ స్రాన్పడిపోయెను. ఆతనికి సంతోషము విషాదము, కోపము ఒక్కసారి ఉప్పొంగిపోయినవి. తాను వారిదగ్గరకుపోవుట ఉత్తమమార్గముకాదు. ఈ స్థల మెట్లయినను పట్టుకొని తీరవలయును. ఈ స్థలమును రక్షించు సైనికులు నూరునూట ఏబదికన్న ఎక్కువయుండరు. యుద్ధముచేసి, ఈ స్థలము పట్టవలయునన్న హిమబిందుదేవికే ఏమికష్టము వాటిల్లునో? ఎవరో ఒక విరోధి ఈస్థలము తెలిసికొన్నాడని, వారికి తెలిసిపోయినచో నేమిముప్పు వాటిల్లునో. యని. యాతడు తీవ్రాలోచనలో మునింగి ఇప్పుడే వానిని రక్షింపవలె తరువాత కథయంతయు తారుమారు కాగలదు అను నిశ్చయమునకు వచ్చెను.

ఆలోచన పాదములు ఏమి, ఆ టాకక గుహాముఖమునుండి వెన్నెల కొండ శిఖరములపై దాటి యావతలకు ఒరిగిపోయిన కారణమున, చిరువెలుగుతో నిండియున్న యా ప్రదేశములోనికి నడిచిపోవుటయేమి?

ఒకరిద్దరతని వైపు చూచిరి కాని, గుహాముఖమున కావలికాయు మనుష్యుడిట్లు వచ్చుచున్నాడని వారనుకొనలేదు. ఎవరో రక్షకభటుడు ఆ క్రొత్తగవచ్చిన ముసలమ్మను మందలించుటకు బోవుచున్నాడని భావించిరి.

అతడు తిన్నగ ముక్తావళీదేవి కేకలు విన్న గుహాకడకు బోయెను. ఆ గుహ బయట నంతయు చిత్రి చిత్రి వర్ణములచే చిత్రింపబడి యుండెను. ఆ గుహాగ్రం దెన్నియో మృగచర్మములు పరచియున్నవి

అచ్చట ఇరువురు రక్షకస్త్రీలాయుధ పాణులై కావలిగాయుచు నిలిచియుండిరి. సువర్ణశ్రీ అనుమానమేమియు లేనివానివలెనే నిర్భయముగ నటకు బోయెను. కాని అతని ప్రాణము లరచేతనున్నవి.



# ద్వాదశ ప్రకరణము

## పునస్సందర్శనం

కంఠస్వరము మార్చుకొని, కొంచెము బొంగురుపోయిన గొంతుకతో సువర్ణశ్రీ మాగధిలో "ఏమి ఆ ముసలమ్మ కేకలు వేయుచున్నది?" అని ప్రశ్నించెను.

"ముసలమ్మా! ముసలమ్మ కేకలు పెట్టరాదామరి! మేము మనుష్యులము అనుకొంటిరా? పశువులమనుకొంటిరా?" అని ముక్తావళీదేవి కెంపులుగ్రమ్మిన కన్నులతో కోపమున వగచుచు కేకలు వేసినది.

"ఏమికష్టము వచ్చినదవ్వాయి?"

"ఏమికష్టమువచ్చినదా? దుర్మార్గులారా, మీరందరు నాశనమైపోదురు. ఎక్కడి ధాన్యకటకము, ఎక్కడి యీ ప్రదేశము. బోనులలో జంతువులను పట్టుకొని వచ్చినట్లు మమ్మిచ్చటకు కొనివచ్చెదరా!"

"ఊరుకో ముసలమ్మా! కేకలుపెట్టకు మా కార్యము నెరవేరినతోడనే మిమ్ము మీ స్థానములకు పంపివేసెదము."

సువర్ణశ్రీ ఆలోచనలు మెరుపులవలె ప్రజ్వరిల్లి మాయమగుచుండెను. ఇంక కొంత తడవు వారితో మాట్లాడుచున్నచో, మానవ ప్రకృతి సహజమైన విచిత్ర జిజ్ఞాసతో ఆయా గుహాలలో వారు, అచ్చటచ్చట తిరుగాడువారు ఇచ్చట చేర వచ్చును. అంతటితో ఎట్టి ఆపత్తయిన ఘటింపవచ్చును. వారికి ఒనరాక యెతెంచుటెట్లు? వారు ఏమియు గడబిడ చేయకుండుట ఎట్లు? ఏలాగున వారిని తప్పించుకొని పోవుట?

ఈ ఆలోచనలు మహా వాయుసంచలిత సముద్రతరంగములై ఒకదానిపైనొకటి ఒరసి దొర్లుచుండగా, తలయూపుకొనుచు వెనుకకుపోయి గుహాముఖమునుపోక, తిన్నగ నా గుహావలయములో నంత్యగుహ యావలనున్న విశాలస్థలమునకు బోయి, యచ్చట నొక రాతిపక్క కూరుచుండెను.

ముక్తావళీదేవియు, హిమబిందువు వసించు మందిరమునకు కావలికాయు రక్షక స్త్రీలు అచ్చట వచ్చిన రక్షకభటుని మాటలలో అధికారధ్వని గ్రహించిరి. యాతడు మారు వేషముననున్న రాజాధికారి ఎవరో యై యుండునని యూహించుకొనిరి. వారు మాగధ స్త్రీలని వేషభాషలను బట్టి సువర్ణశ్రీ ఊహించిన అంశము సరియైనదే! వారును అతని నొకమాగధ వీరునిగ తలంచిరి.

అతని నడకలో, మాటలో, ముఖమున అధికారము ప్రజ్వలిత మగుచున్నది అతనిమాటను తెరవెనుక మంచముపై ఒరగి పండుకొనియున్న హిమబిందు వినినది. బొంగురుగనున్నను ఆ మాటలలో ఎక్కడో వినిన ధ్వని యామెకు అస్పష్టముగ తోచినది.

ఎక్కడ నామాటలు వినిపించినవి? ఎవరివి? ఆలోచించుకొలది ఆమెకు ఏదియో అనుమానము ధైర్యము కలిగినది.

ఎవరును "మిమ్ము మీ స్థానమును పంపివేసెదము" అని ఇంతకుముందు చెప్ప లేదే. ఆమాటల యర్థమేమై యుండును? అని యా బాలిక ఆలోచింపజొచ్చెను.

సువర్ణశ్రీ కుమారుని వెంట ఆ రక్షకస్త్రీల చూపులు వెంబడించినవని యాతడు గ్రహించినాడు. ఇటులకాదటుల అని. ఎన్నిమార్గములనో యాతడు తోసిపుచ్చి నాడు. వెంటనే యాతడులేచి. త్వరితగతిని గుహాముఖప్రాంతమునుండి నడచుచు అపర్వతనిమ్నాంత ప్రదేశముచుట్టి, అక్కడక్కడ నాగుచు, పనియున్నవానివలె నడచి నడచి, హిమబిందు ఉండిన గుహకడకుపోయి, ఒక రక్షకస్త్రీకడకు చేరి, యామె చెవిలో "ఉజ్జయిని!" యని అస్పష్టముగ పలికెను.

అతడు తన దగ్గరకు వచ్చుటయే గమనించని, యా స్త్రీ. వెంటనే తలవనితలం పుగ "ఏమిటి?" యని రహస్యముగ ప్రశ్నించెను.

సువర్ణశ్రీ కన్నులు మెఱయ పెదవులకడ తనకుడిచేయి మాపుకువేలుంచి, గుస గుసలతోడనే "వారిరువురకు వినబడును! హిమబిందుని వెంటనే ఇచ్చటనుండి సౌరాష్ట్రము తరలింప ఆజ్ఞవచ్చినది. నన్ను పెద్దసైన్యముతో పంపిరి సైన్యము బయట నా కొరకై నున్నది. ఇచ్చటినుండి రహస్యవచనము "ఉజ్జయని!" అనే మిగల నమస్కృతికి మీరిరువురు లోనికిపోయి, వారికి మాటలాడక బట్టలు సర్దుకొమ్మని



చెప్పుడు. "ఉజ్జయిని!" మరువకుడు. జయ జయ శ్రీశ్రీశ్రీ కాణ్వాయన సార్వ భౌమ!" అని మాగధిలో పలికెను.

ఆ ప్రతీహారిణి గుండె జల్లుమనగా ఏదియో విచిత్ర మూహించుకొనినది. తాము సుశర్మ కాణ్వాయన చక్రవర్తికడ ప్రతీహారిణులమని ఎరిగిన, ఆ చక్రవర్తి సందేశ హారుడీ యువకవీరుడై యుండును అని ఊహించుకొన్నది.

"ప్రభువు ఆజ్ఞ ఏమి?"

"ఈ బాలికను ప్రభువే వివాహమాడునట! ఈ బాలిక చారుగుప్త వణిక్సా ర్వభౌముని తనయ! అట్టిబాలికను వివాహమాడినవాడు, ఆంధ్రదేశము చక్రవర్తి డే! వీరందరికి ఈ రహస్యము తెలియదు. వీరికి తెలియకుండ, అనగా మాళవులకు, ఆంధ్రు లకు తెలియకుండ, వనమీ బాలికను సౌరాష్ట్రమిషచే పాటలీపుత్రము చేర్పవలెను!"

"మేము, మాళవస్త్రీలిరువురు వచ్చువరకు కదలకూడదు కదా?"

"అవును నాకు తెలియును! నీవును నీ వనితయును ఊరకుండుడు; మీరు వారి వెంటనే నాతో గుహలోనికి ఒక్కక్షణములో పరుగునరండు. మనలను మాళవులు ఆంధ్రులు అనుమానింపగూడదు!"

"అయినచో, చక్రవర్తి శ్రీముద్ర చూపుము. అదిగదా నా యాజ్ఞ!"

"అవునవును! లోనికరా! దీపపు వెలుతురున చూపెదను నేను. ఆంధ్రులు వచ్చునా?"

"రారు."

"అయ్యయో! సరే, నేను వారితో రెండుమాటలాడెదను. నీకు శ్రీముద్రను చూపెదను. నీవీలోన నీతోటి యామెకు విషయము బోధింపుము!"

అని సువర్ణశ్రీ లోనికి విస విసపోయి. గుహను రెండుగా విభజించు తెరను ఒత్తిగించి. ముక్తావళీదేవిని చూచి, తన నోటిపై కుడిచేయి నుంచుకొని ఎవ్వరుచేత మాటలాడవలదని సైగచేసి. తాను సువర్ణశ్రీనని యామె చెవిలో నూదెను. ఆమె కెవ్వున కేకవేయబోయి. నోటిపై చేతివేళ్ళు కొంగును కుక్కుకొనెను. మాగ మున పక్కపై పండుకొని యుండిన హిమబిందు తేరపార చూచి. "ఓ" యని యరువబోయి. యుక్తాయుక్త విచక్షణా జ్ఞానము కలదికాన, మాటలణచుకొని, మిం

దమునుండి లేచి పరుగునవచ్చి, యాతని భుజములుపట్టి, మొగములోనికి, తీక్ష్ణముగ చూచి, యాతని చిగునవ్వు గమనించి, "అమ్మయ్యా!" యని యాతని కౌగిలింతలో కరగిపోయెను.

ముక్తావళీదేవికి, సంతసము, ఆశ్చర్యము ఒక్కసారి జన్మించినవి. సువర్ణశ్రీ వెంటనే యా కౌగిలిలోనే, హిమబిందు చెవిలో "మీ ఇద్దరు, ఆ రక్షకస్త్రీల వేషముతో, నాతో రండు వారిని లోనికి రప్పించి కట్టివేసెను. అంతయు నీపై నాధారపడియున్నది, హిమబిందూ నేను ఒక బాలికను కట్టగనే నీవుపోయి, రెండవబాలికను కొనిరా. మామ్మగారు రక్షక స్త్రీ వేషము వేసుకొనుచున్నారు." అని మరుమాటలాడక ఆమెను కౌగిలినుండి వదలి గుండె దడదడమన, గాలిలో నడుచుచు, తెర యావలికివచ్చి; మొదటి ప్రతీహారిణిని లోనికి రమ్మనుచు సంజ్ఞ యొనర్చెను.

ఆమె అప్పటికే రెండవ ప్రతీహారిణితో, చక్రవర్తి శ్రీ సుశర్మ కాణ్వాయనుని ఆజ్ఞగావచ్చిన సేనాపతియని చెప్పి, యామెను సిద్ధము చేసి, చక్రవర్తి ఉంగరము ఆనవాలుగ చూచుచును ఎదురు చూచుచుండుటయును, నాసూత్న పురుషుడు లోనికి రమ్మనుమని పిలిచెను

ఆ ప్రతీహారిణి లోకరక్షణ భారతమంతయు తాను మోయుచున్నట్లు భావించుకొనుచు లోనికి పోయినది. ఇరువదిమూడు కలలకాలములో హిమబిందీవలకు వచ్చి రెండవయామెను లోనికి పిలిచెను మరి పదికాష్ఠలలో మొదటి ప్రతీహారిణి వచ్చి పైన నిలబడినది.



# త్రయోదశ ప్రకరణము

## బంధవిమోచనము

ఈ చిన్న నాటకము నెదురువైపునున్న గుహనుండి ఆరుగురు నాయకులు గమనించిరి. బందిగా కొని రాబడిన వారిలలో పెద్దయామె, మొదట ఏదియో కేకలు వేసినదనియు, అల్లరిచేయ ప్రారంభించుటచే గుహాముఖమున కావలికాయు యోధుడు వచ్చి సద్దణననియు వారనుకొనిరి.

అతడు రెండవసారి వచ్చి, అక్కడ కావలిగాయు రక్షకస్త్రీలతో మాటలాడుట వారిలో నొకరికి అనుమానము కలిగినది.

" ఏమయ్యా ఆ భటుడు రెండుసారులు గుహాకడకు వచ్చినాడేమి? "

రెండవయాతడు:—ఎవరు వచ్చినది?

మొదటి:—గుహాముఖమున కావలికాయు భటుడు.

మూడవ:—అవును, భటుడు తన స్థానము కదులుట ఎందుకు. గుహాముఖమున శక్తిముఖుడు లేడే. అతడేమయినాడు?

తక్కినవాడు:—ఏమీ శక్తిముఖుడు లేడా?

మొదటి:—అతడు కనబడలేదు. ఇది ఏదో వింతగనున్నది. నీవు శంఖమూదుము. వెంటనే కత్తులు ధనుర్బాణములు పుచ్చుకొని రండు !

ఒకడు వెంటనే శంఖమునెత్తి, "భోం! భోం!!" అని ఆ గుహాప్రాంగణావరణమంతయు మారుమ్రోగునట్లు ఊదెను.

ఎదురుచూపు నాయకులక్కడి లేరు; కత్తులతో, కటారులతో శూలములతో గుహాలనుండి వీరులు బయటికురికిరి. పలువురు ధనుర్బాణములు ధరించి ఈవలకు పరువిడి వచ్చిరి. మన నాయకులారుగురలో, ఇద్దరు హిమబిందు గుహవైపునకు నలుగురు గుహాముఖమునకు పరువిడిరి.

ఈలోననే సువర్ణశ్రీ ఇరువురు రక్షకస్త్రీలతో గుహాముఖమువైపు పరుగిడెను. పెద్దదైన ముక్తావళి పరుగిడలేక మోకాళ్ళు ఒరిగికొనిపోయి ముందునకు బోర్లగిల పడెను. తరుముకొని వచ్చువారు ఘోల్లున కేకలువేసి, అటకు ఉరికిరి. కాని సువర్ణశ్రీ

యామెను సునాయాసముగ నెత్తి, గుహాముఖమువైపు పరుగిడెను. ఈలోన మొదటి నలుగురిలో ఒకడు గుహాముఖమును ముంగుజేరెను.

రక్షకస్త్రీ కరవాలమును మాత్రము చేత ధరించి. హిమబిందు తూలుచు సువర్ణశ్రీ వెనుకనే పరుగెత్తి వచ్చుచుండెను. మర్పున పదిబాణములు వీరున్నవైపునవచ్చి, పర్వతకుడ్యమునకు తగిలి ఖంగు ఖంగున మోగినవి.

సువర్ణశ్రీ ఆగి, హిమబిందును ముందునకు త్రోసి, ఆమె వెనుక ముక్తావళీదేవితో పరుగిడ నారంభించెను. బాణములు వర్షమువలె కురియ నారంభించెను. ఆ కనుచీకటి వలనను, సువర్ణశ్రీ శీఘ్రముగ పరుగిడుటవలనను, హిమబిందు సుభాగ్యవశమునగాని, ముక్తావళికిగాని బాణము తగులకూడదనిన భావముచే శరములు వదలుచుండుటవలనను వారందరొక పది నిమేషములలో గుహాముఖము చేరిరి. గుహాముఖమున ఖడ్గము త్రిప్పుచు నొకడు నిలిచియుండెను.

సువర్ణశ్రీ ముక్తావళీదేవిని దింపి, వారినిద్దరను సొరంగమునోట నానుకొని ముందుకు పోవుడని చెప్పి, సింహమువలె సురంగాముఖమునందున్న వీరునిపై నురికెను. ఆ ఉరుకుటలో తన చేతిలోని ఖడ్గముచే ఎదుటి వీరుని ఖడ్గమును క్రిందకు గొట్టి, కాలితో వానిని పొట్టపైతన్ని, యాతడు పడిపోవుటతోడనే, ఒక్క ఉరుకున సొరంగమార్గములో ఉరికి, వెనుకనున్న విరోధిని కత్తితో నివారించుచు, సగం ఏడుపుతో, సగం నవ్వుతో ఊగిపోవు హిమబిందును ఒక చేతితో పట్టి "రండని" బుజము కొట్టి ముక్తావళిని రెండవచేతితో పట్టి ముందుకు సాగెను.

ముక్తావళీదేవి పరుగిడలేదు. కావున సువర్ణశ్రీ ఆమెను కుడిచేతితో బుజమున వేసుకొని "మామ్మగారూ! మీరేమియు భయపడకుడు. బోనుదాటి వచ్చినాము. ఇంక పది అడుగులలో నదిఒడ్డుకు వచ్చెదము. అచ్చట నా స్నేహితుడు పెద్దసైన్యముతో ఉన్నాడు. మనము తొందరగ పోవలెను అంతయె." అనిచెప్పి ముందుకు వేగముగ సాగెను

పదియడుగులు నడిచెనో లేదో, సువర్ణశ్రీ కట్టి పరవేసిన శక్తిముఖునకు మెలకువ వచ్చినదికాబోలు నెమ్మదిగ దొర్లుచును గుహాముఖమునకు వచ్చుచుండెను. ముందు వేగముగ పరుగిడు హిమబిందు కాలి కాతడు తగిలె. అతనిపై తల్లక్రిందులుగ



పడి; "హా" యని కేకవేసినది. ఆమెమీద పడినప్పుడేమియైనది తెలియక "హా" యని యాతడు భయమున నరచెను.

ఈ రెండుధ్వనులతో సొరంగమంతయు మారుమ్రోగెను. ఈలోన సొరంగములోనికి విరోధులు తండతండములై కేకలు పెట్టుచు పరుగిడి వచ్చుచుండిరి. బాణములు వర్షము కురియుచు "ఖంగు ఖంగు" మని గోడలకు తగులుచుండెను.

సువర్ణశ్రీ ముక్తావళీదేవిని దింపి "మీరు ముందు వీలయినంత వేగమున పొండు. హిమబిందూ! నీవు మామ్మగారి చేయిపట్టుకొని త్వరితముగబోయి, సొరంగపు మొగమునకు కొంచెము దూరమున ఆగుము. అక్కడ ఇద్దరు కాపుండెదరు. నేను వచ్చిన వెనుక వారిపని పట్టెదను." అని అరచి, పడిన యతనితో "ఆ బాణములు నిన్ను చంపును. నీవు కేకలు వేయుచు నీకట్లు విప్పించుకొని బ్రతుకుము. గోడప్రక్క దొర్లి పొమ్ము" అని కేకవేసి, పరుగిడెను.

ముక్తావళీదేవికి యవనరక్తము ప్పొంగినది. ఈలోన ఆమెకు రక్తనాళముల బాగుగా రక్తము సంచరించినదికాబోలు, మనుమరాలి చేయిబట్టుకొని దారిచూపు, ఆరక్షకస్త్రీ వేషముతో ముందునకు సాగిపోయెను.

కావలికాయువాని కవచమే తన్ను రక్షింప, నమితవేగముగ సువర్ణశ్రీ హిమబిందును ముక్తావళీదేవిని కలుసుకొనెను. వెనుకవారు అతివేగముగ కాగడాలు పట్టుకొని పరుగిడి వచ్చుచుండిరి. వారికిని, వీరికిని ఇరువది ధనువులకన్న ఎక్కువ దూరము లేదు.

ఈకేకలు, గడబిడయు, సొరంగద్వారమునందున్న వారికి వినిపించినవికాబోలు వారు మాళవభాషలో "ఏమిటీ గడబిడ!" యని కేకవేసి చేతనున్న ధనస్సుల నెక్కుపెట్టిరి.

సొరంగమార్గము ఎగుడుదిగుడుగా పక్కలపైన పెద్దరాళ్ళతో నిండియున్నది. వెనుకకువచ్చు కాగడాలు, ముందుపోవు ముక్తావళీ హిమబిందు సువర్ణశ్రీలకు ఒకరకపు గుడ్డిదారిని చూపుచున్నవి. ఎదుట ఇద్దరు బాణము లెక్కుపెట్టి "ఆగుడు" అని కేకవేసిరి

సువర్ణశ్రీ హిమబిందు చెవిలో నేమియో యూదెను. హిమబిందు నిర్భయముగ ముందుకు పరుగిడును. "ఎవరో విరోధులు కొండలమీదనుండి దిగివచ్చిరి కొంద

రము సారంగములోనికి వచ్చినాము. కొందరు మనవారు గుహలలోనుండి యుద్ధము చేయుచున్నారు." అని మాళవభాషలో అరచినది.

తన స్నేహితుడు శక్తిముఖుడును, ఇరువురు రక్షకస్త్రీలు నిల్చు వచ్చుటయు "అపుడు కొట్టుడు పట్టుకొనుడు!" అని వారివెనుక నుండి కేకలువినవచ్చుటయు, అఘో పురవీరుల మనస్సులను కలతపెట్టుటచే, వారు ఇది సిద్ధమని తెల్పికొనలేక, బాణము లెక్కుపెట్టియే వీరందరు మాముందు వెనుక మలుపులో దీపములు వచ్చు వెలుతురు రాదుచుండెను.

ఇంతలో శక్తిముఖుడని వారనుకొన్న వీరుడు విల్లునుండి విడువబడిన బాణము వలె రివ్వువవచ్చి, ఒక రక్షకభటుని కౌగిలించుకొని "కొంపలు మునిగినవి" యని కేకలు వేయుచు అతని పట్టుకొని బర బర నీటికడకు లాగుకొనిపోయి, యాతనితో నీటిలో పడెను.

రెండవయాతడు ఏమిటియని వారి వెనుకనే పరుగిడి చూచుచుండ, హిమబిందింతలో వచ్చి యామనుష్యుని నీటిలోనికి త్రోసెను. ఆతడు నీటిలో మునిగిపోయి, పైకి తేలనప్పటికి, సువర్ణశ్రీ యాతనిపై కురికి గొంతుపట్టుకొనెను.

సువర్ణశ్రీ నీటిలోనికి త్రోసినవాడు గట్టెక్కవలెనని ప్రయత్నించుచుండ, హిమబిందు ఖడ్గపు మొనతో నతని చేయి నరికినది. ఆతడు చేయివదలి నీటిలోనికి జారిపోయెను. రెండవవాడు ప్రాణభయమున గుహాద్వారమునుండి నదిలోనికి గబ గబ ఈదుకొనిపోయెను

ఆతడట్లీదుకుపోవుటచే సువర్ణశ్రీ ముక్తావళీ హిమబిందుల ప్రాణరక్షణమాయెను.



# చతుర్దశ ప్రకరణము

## "నేలయీనినట్లు నిండెదరము"

అట్లా రక్షకభటుడు పాశగతుడై నదిలోనికి ఈదుకుపోవుటయు, అక్కడనే ఒక తెప్పయు. ఆ తెప్పనిండ గోండులుండిరి.

ఆ తెప్పపైన గోండువీరులు, ఈ మనుష్యుడు ఈదుకొనుచు ఎప్పుడు కనబడెనో వెంటనే తెప్పను తెడ్లతో నడుపుకొనిపోయి, యా మనుష్యుని రెక్కపట్టి తెప్పపైకి లాగివేసిరి

వెంటనే మాటలాడక ఆ మహాశిలలవెనుక దాగియున్న సారంగ ముఖద్వారమునకు తెప్పను త్రోయించినాడు మహాబలగోండుడు. అట్లు త్రోయించుచు ఆ పర్వతములలో, లోయలలో మారుమ్రోగునట్లు నెమలికేక పెట్టెను. ఆ ప్రతిధ్వనులకు ప్రతిధ్వనులా యనునట్లు నలువైపులనుండి ఎన్నియో నెమలికేకలు వినవచ్చినవి.

ఆ మరుక్షణమున నది కివలావల గట్లపై, శిలలపై, కొండచరియలపై వేలకు వేలు గోండులు, రాక్షసులు మూగిపోయినారు. పది పన్నెండు తెప్పలు నది కెగువ దిగువలనుండి వేగముగ తెడ్లచే నెదురుగడలచే నడుపబడుచు వీరి తెప్పవైపు పరుగిడి వచ్చుట ప్రారంభించినవి.

ఈలోననే మహాబలగోండుని తెప్ప గుహాముఖమునకు పోయెను. అచ్చట నీళ్ళలో ముక్తావళీదేవిని పట్టుకొని ఈదయత్నించుచు మునుగుచు తేలుచున్న సువర్ణశ్రీని హిమబిందును, వీరిని ముంచబోవుచున్న ఆ రెండవ రక్షకభటుని, సారంగముఖమున గట్టుపై దాగి డాలతో నీటిలోని మనుష్యులను స్త్రీలను పట్టుకొన ప్రయత్నించు వీరులను నీటిలోనికి ఉరుకు వీరులను మహాబలగోండుడు చూచెను. తెప్పను గుహలోని వారును చూచిరి.

తెప్పమీద వారిని నాశనముచేయుటకు ధనస్సు లెక్కపెట్టియున్న గుహలోని వీరులు కొందరు బాణములను వదిలిరి. నలుగురుగోండులు ఆ బాణములు ముఖమున, ఎదురురొమ్మున, భుజమున తగిలి క్రిందకు కూలిపోయిరి. ఒకడు నీటిలోనికి శవమై దొర్లిపోయెను.

గొండులు గుహాగ్రముపైనున్న వారిపై, మహాశిలలను విసిరివేసిరి. అయిదుగురు వీరులా భల్లములుచ్చిపోవ "హా" యని కేకలు వేయుచు పడిపోయి, విల విల పాదములు కొట్టుకొనుచుండిరి.

ఇంతలో వేరొక తెప్ప గుహాముఖమునకు వచ్చెను. దాని వెనుక మరొక తెప్ప వచ్చినది. ఇవి చూచుటతోడనే కాగడాలు పట్టుకొని కొందరు, క్రిందపడవేసి కొందరు సారంగములోనికి పారిపోయిరి.

మొదటనే మహాబలగొండుని తెప్పవచ్చుటవలన. ఇరువురు ముగ్గురు వంగి నీటిలో మునుగుచు తేలుచు ప్రాణసంకటావస్థలోనున్న సువర్ణశ్రీని, హిమబిందును ముక్తావళిని, రక్షకభటుని వారు తెప్పలపైకి లాగివేసిరి.

సువర్ణశ్రీ వారినుండి పారిపోవలెనని ప్రయత్నించిన రక్షకభటుడు నదిలోనికి ఈదుకొనిపోయెనుకదా, అప్పుడే నీటికడకు సారంగమునుండి వచ్చు విరోధులువచ్చిరి వారు తారసిల్లుట గమనించి హిమబిందు చీరవెనుకకు విరిచికట్టి నీటిలోనికి ఉరికినది నీటిలో ఈదుచు అమ్మమ్మను నీటిలోనికి రమ్మని కేక వేసినది.

అటు విరోధు లేమిచేసెదరో యను భయము నీటు నీటిలో ఈదుట ఎరుగని కారణము విచిత్రమును. ఏడ్చుచు గజ గజ వణకుచు ఆ గట్టుమీద ముక్తావళి కూరుచుండుట ఏమి. గుహలోనికి తెప్పయు, ఆమెకడకు విరోధులు ఒక్కసారి వచ్చిరి. ఆ భయముననే యామె నీటిలో దొర్లి పడిపోయెను. విరోధిని ఒక్కతోపుతోసి, సువర్ణుడు ముక్తావళీ దేవికడకు ఒక్కబార ఈతలో ఉరికి, ఆమెను పట్టుకొనెను.

ఆమె సువర్ణుని గొంతు గట్టిగ కౌగలించుకొనినది. సువర్ణుడెంత గజ యీతగాడయిననేమి, ముక్తావళీదేవి గొంతు గట్టిగ పట్టుకొనినతోడనే మునిగిపోయి, ఒక్క ఊపున పైకిలేచి, మరల మునిగి, మరల లేచువచ్చుటకి ఇరువురను తెప్పపైకి ఎవరో లాగివేసిరి. అదివరకే ఎవరో హిమబిందును తెప్పమీదకు లాగిరి.

సువర్ణశ్రీయు, ముక్తావళియు సొమ్మసిల్లి పడిపోయిరి. వారిరువురును రెండు మూడు గుక్కల నీరు మ్రింగియుండిరి. హిమబిందేమియు చెక్కుచెదరక, మహాబల గొండు డిచ్చిన వస్త్రముచే దీర్ఘముగ తన తలకట్టును తుడుచుకొనకయే, సువర్ణుని ముత్తవను తుడుచుచుండెను.



తెప్పలన్నియు నదిలోనికి పోయినవి. సారంగమునుండి వచ్చినబాణము లేమియు తగులకుండగనే వారా గుహాముఖమునుండి ఈవతలకు రాగలిగినారు.

సువర్ణశ్రీ ఇంతలో తెప్పిరిల్లి లేచి, ముక్తావళీదేవికి, హిమబిందుతోపాటు ఉపచారములు చేయుచుండె. తెప్పలన్నియు నావలిగట్టు చేరినవి. అచ్చట కొందరు గొండులతో మహాబలుడేమియో వారిభాషలో పలుక, నొక ముసలి గొండుసాధుడు ముందుకువచ్చి తన మొలనున్న సంచికట్టువిప్పి, ఏదియో యెండిన యాకింత తీసి, ఉత్తమమని మహాబలున కిచ్చెను. మహాబలుడు సువర్ణశ్రీ కుమారునికి, ఆ ఆకునిచ్చుచు ఇది వారి ముగ్గురను నమలుడని చెప్పెను

ఆ ఆకును హిమబిందును, సువర్ణశ్రీయు నమలి మ్రింగిరి. ముక్తావళీదేవి నెమ్మదిగ కన్నులు తెరచి, తలయూపి కన్నులు మూసికొనెను.

"అమ్మమ్మా, ఈ ఆకు ఇంత నమలి మ్రింగుము, అమృతమువలె నాకు పని చేసినది. నోరు తెరచి. కొంచెము నములుము." అని హిమబిందు ముక్తావళినోరు తెరిపించి. యామెచే చిటికెడు ఆకు నమిలించెను. వెంటనే ముక్తావళీదేవి కన్నుతెరచినది. హిమబిందు మరలకొంత ఆకు నమలించినది. ఆమె లేచి కూర్చుండెను.

సువర్ణశ్రీ సహాయమున హిమబిందును, ముక్తావళీదేవియు తెప్పలనుండి క్రిందికి దిగిరి.

అచ్చట గొండువీరు లనేకులు బారులు బారులుగ సేనపువేలు కూర్చుండియుండిరి. ఎవరో మంటలు చేసిరి. మెత్తని తోళ్ళనక్కడ పరచిరి. అందుపై ముక్తావళీదేవిని పండుకొనబెట్టిరి. వారందరక్కడ అధివసించిరి

మహాబల గొండుడు—సువర్ణశ్రీ! నీకేమైతివోయని ఒక్కనిమేషము నేనుభయపడినానుసుమా! ఏలనన, నిన్ను నేను వదలిన ప్రదేశమునుండి నీవు నీకడకు దిక్కి వెళ్ళినది గమనించితిని. అటుపైన మరల వెనుకకు నీగుర్తులు కనుపించినవి. అటునుండి నీటి ఎరువైపు నీవు పోయితి. అచ్చట ఒకచోట గుంపు నీటిలోనికి జారిపోవుట చూచితిని అది ఏమరుపాటువన జారిపోవుటకాదు, జారిపోవలెనని నీవు జారితివని గమనించుటకు నాకు కొంత కాలము పట్టినది.

సువర్ణ—అవును నేను చల్లగ చప్పుడుకాకుండ నీటిలోనికి దిగవలెనని ప్రయత్నించుచుండె. చటుక్కున జారి నీటిలో పడితిని. కాని దెబ్బమాత్ర మేమియు తగులలేదు.

మహా—ఈలోననే, ఆ అడవియంతయు, గోండులు, రాక్షసమిత్రులు వెదకి అక్కడక్కడ కావలికాయు పుళిందులను, శబరులను పట్టుకొన్నారు.

సువర్ణ—మీవారందరు ఎప్పుడు వచ్చినారు?

మహా—నేను మా దేశాభిముఖుడనై వెళ్ళినసంగతి ఎరుగుదువు. రాక్షసుల నీప్రదేశమంతయు వెదుక నాజ్ఞ ఇచ్చితిని. ఇంతలో మన ప్రయాణములో పంపినవార్త అంది, మాగోండులు వచ్చి నన్ను కలిసికొనిరి.

సువర్ణ—ఈ ఆకాశ సంచరణ విద్య చాల అద్భుతమైనది.

హిమబిందు—సువర్ణశ్రీ దేనకృతజ్ఞతయు, ప్రేమయునుట్టిపడగాంచుచు, స్మిత వదనయై, "మేమున్నస్థలమెట్లు కనిపెట్టినారు. ఇతరులందు చొరఅనేరరని వారందరు గర్వపుమాటలు పలికిరే!

సువర్ణ—అయస్కాంత మెక్కడనున్నదో, లోహశకలమునకు తెలియదా కుమారీ? ముక్తావళీదేవి లేచి కూరుచుండి సువర్ణశ్రీని చూచి, "మనమిక్కడనే యున్నచో, విరోధులువచ్చి మనల నాశనముచేయరా?" యని యడిగెను.

మహా—అమ్మా! మేముండ మీకేమియు భీతియము లేదు.

ముక్తా—ఇక్కడనుండి ఎచ్చటకుబోవుట. ధాన్యకటకమునకా?

సువర్ణశ్రీ—మహాబలుడు ఏమి చెప్పిన అట్లు చేయుదము

ముక్తా—ఈ మహాబలు డెవరు?

సువర్ణశ్రీ—ఈతడు గోండుదేశ యువరాజు. గోండుమహారాజు మన చక్రవర్తికి ప్రాణస్నేహితులు. ఈతడు నాకు పరమమిత్రము మామ్మగారూ!

ముక్తా—నాయనా! నా హృదయమున జనించిన భయమింకను దీరలేదు ఇచ్చటనుండి తరలించి మమ్ము వెంటనే సురక్షిత ప్రదేశమున కెచటికైన చేర్పుము.

~~~

# పంచదశ పరిచ్ఛేదము

## పాటలీపుత్రపురము

ఈ మహానగరము గంగాతీరమున మాగధరాజధానియై భారతవర్ష చక్రవర్తులకు పెక్కు శతాబ్దములు రాజధానియై ప్రసిద్ధినందినది.

ఈ మహానగరమునందు నందసార్వభౌములు అఖండవైభవముగ రాజ్యమునేలిరి. వారివెనుక తద్వంశజుడైన చంద్రగుప్త మౌర్యుడఖండ జంబూద్వీపమునకు చక్రవర్తియై తన ఛత్రచ్ఛాయల నెల్లయెడల నింపెను. అతని మనుమడు అశోక ప్రియదర్శి మహాసామ్రాట్టయి బౌద్ధమతావలంబియై భరతవర్షమంతయు రాజ్యము చేయుచు బౌద్ధ ధర్మరాకాపూర్ణ సుధాకరుడై, ఆ మహామతమును వెన్నెలవలె, అమృతమువలె సకల జగమునందు వరదలు కట్టించెను.

ఒకనాడు జంబూద్వీపమునకు అయోధ్య ముఖ్యనగరము మరొకనాడు, ప్రాగ్జ్యోతిష నగరము. వేరొకప్పుడు కుండిననగరము; కురువంశకాలమునకు హాస్తినాపురము. హాస్తినాపురమునుగిడి కౌశాంబియు నటనుండి పాటలీపుత్రము రాజధానులుగా మారినవి.

ఏది ముఖ్యనగరమో, అచ్చట సింహాసనాసీనుడగు వాడు సకల భరత వర్షమునకు చక్రవర్తియగును మౌర్యులలో చివరివాని వధించి పుష్యమిత్ర శుంగుడు చక్రవర్తి యయ్యెను. అంత్యశుంగుని పేరునకు రాజునుచేసి, అతని కాణ్వాయన బ్రాహ్మణమంత్రులు నిజమగు చక్రవర్తులైరి.

తుది కాణ్వాయన వంశజుడు సుశర్మ. తానే చక్రవర్తియని లోకమునకు వెల్లడించెను, అయినను మగధదేశము నందింకనుశుంగుల సేనానాయకులు, శుంగమహారాజుకే జోహారు లొనరించుచు, సుశర్మ కాణ్వాయనుని లెక్కచేయుటలేదు

సుశర్మకును దేశములో పలుకుబడి ఎక్కువగనే యుండెను. అతని సైన్యములు మగధదేశమంతయు నిండియుండెను. ఈ ఇరువాగుల సైన్యములకు, వారి వారి మాండలికులకు సర్వదా పోరులు సంభవించుచునే యుండెను
~~~

దేశ మరాజకమై హిమాలయ ప్రాంతమందలి గంధర్వ యక్షజాతులకు, కామరూపపార్వత నాగులకు, అరణ్యజాతులగు పుళిందాదులకు కొల్లగొనుపని దేశమైపోయినది. ఆర్యావర్తమిట్లు బలవంతుడగు చక్రవర్తి పరిపాలన లేకపోవుటచే వర్తకమును నీరసించిపోయినది. ఒక దేశమునుండి వేరొక దేశమునకు బేహారులు తమ వస్తువులు కొని వెళ్ళుట మానిరి.

వింధ్యకు దక్షిణమున మాత్రమే ఆంధ్రుల చల్లని పరిపాలనమువలన సర్వసంపదలు తులతూగియుండెను. దేశ మొకచో నీరసించియుండిన సర్వభరతవర్షము నీరసించిపోవుననియు పక్కదేశము లరాజకములైన, బలవంతమగు దేశములుకూడ అనేక కష్టముల పాలగుననియు, శాతవాహనులు మహాఋషి వంశజాలనియు, వారివంశము సకల భూమండలమునకు చక్రవర్తులగుట మానవకల్యాణమునకే యనియు ఒకదేశ భాగ్యమా దేశపు వర్తకముపై నాధారపడియుండుననియు, అందు మహోత్తమ వణిక్కులగు ఆంధ్రవైశ్యులే సర్వప్రపంచకవర్తము తమపరము చేసుకొనిరనియు, అట్టి బేహారుల వర్తకము ఉత్తరప్రదేశముల వృద్ధిపొందుటకే వీలులేకుండ పోయినదనియు సర్వధర్మరక్షణకై ఆంధ్రులు దక్షిణాపథముననే కాక, సకల భూమండలమునకు చక్రవర్తులు కాకతప్పదనియు, చారుగుప్తుడు వాదించి శ్రీముఖునకు పాటలీపుత్ర సింహాసనముపై కోర్కెపుట్టించెను.

అతనికి సర్వభూవలయమునకు చక్రవర్తి కావలయునను ఆశకంటె, సర్వభూవలయమునకు శాంతి చేకూర్చవలయునను మహోత్తమ వాంఛ ఎక్కువైనది.

సకలదక్షిణాపథము శాంతివంతమై యున్నది. పాండ్యులు, చోళులు, కేరళులు, కుంతలులు తమలో దానేమియు కలహములులేక శాంతులై యున్నారు. ఒకరిదేశము నొకరు ఏల వాంఛింప వలయును. చిన్నదేశమునకు రాజయిననేమి, మహాదేశమునకు రాజయిననేమి? యశముకొరకై పురుషుడు రాజ్యములు కాంక్షింప వలయునా? పూర్వచక్రవర్తులగు హరిశ్చంద్రాదులు, శ్రీరాముడు, శంతనాదులు, రాజ్యాభివృద్ధిచేసి, అన్నిరాజ్యములు తామే ఏలవలెనని ప్రయత్నము చేసిరా? ఏల ఈనాటి రాజులిట్టి రాజ్యతృష్ణలతో లోకకంటకులగుచున్నారు.



ఇదియంతయు కలిమహాత్మ్యమేనా? ధర్మరాజచక్రవర్తి సభలో భూమిలోని నిక్షేపమునకై తగవులాడిన వారిగాథ నిజమా? మొదటిదినమున "నీది నీది" యని తగవులాడిరట, కలిప్రవేశించిన మరునాడు "నాది, నాది" యని తగవులాడిరట.

రాజులధర్మము సర్వప్రపంచమున శాంతి నెలకొల్పుట. ధర్మము నాలుగుపాదముల నడుపుట. అటుల చేయలేని రాజు సర్వపాపసంభూతుడు. ఈ కాణ్వాయనులు అధర్మమనస్కులైరి. బుద్ధభగవానుడు సంచరించిన పవిత్రభూమియగు ఆర్యావర్తమంతయు వీరివలన అధర్మములతో నిండిపోయినది.

భగవంతుని కనుగొను కర్తవ్యము మనుజునిది. తమ నడవడిచే మహర్షులు, అర్హతులు, జ్ఞానులు, రాజులు లోకమునకు దారి చూపింపవలయును. అధర్మము విజృంభించినవాడు భగవంతుడంతర్హితుడగును. అధర్మము నణచుట రాజులధర్మము. అంతియ. తానుగాని తనపూర్వులుగాని రాజ్యకాంక్షతో ధాన్యకటక శ్రీకాకుళముల నుండి పడమటితీరమునకు విజృంభించినారా? మహామధ్యరధికులు, ఆభీరులు, విజృంభించి దక్షిణాపథమును, నీరసించిన కుంతలమును చెడుచేయ ప్రారంభించినప్పుడుకదా తామా రాజ్యముల నరాజకమునుండి యుద్ధరించినది.

ఈ విధమగు నాలోచనలతో శ్రీముఖశాతవాహనుడు తన మదగజముపై ప్రయాణము చేయుచుండెను.

ఆంధ్రసైన్యములు మహావేగముతో సాగిపోవుచున్నవి. ప్రథమసైన్యములకా నగరము పదునైదు గోరుతములు మాత్రమున్నది. చారులు పట్టుకొనివచ్చిన వార్తలవలన శ్రీ సుశర్మకాణ్వాయనుడు నగరకుడ్యములు, నగరముచుట్టునున్న పదునెనిమిదికోటలు బాగుచేయించి, తనకున్న అరువదివేల సైన్యమును, కౌశాంబీనగరమునుండివచ్చిన ముప్పదివేల సైన్యమును నగరరక్షణకై జాగరూకతమై, నచ్చటచ్చట యుంచినాడనియు, ప్రథమమున ఆంధ్రులు తనపై ఎత్తివచ్చుట నాతడు నమ్మలేదనియు, గయకడకు ఆంధ్రసైన్యములు వచ్చి విడియుటతోడనే, భయపడి నగరరక్షణ సన్నాహములు ప్రారంభించినాడనియు తెలిసినది.

ఆంధ్రసైన్యములో ఆరువదివేల కాల్బలము, వేయి ఏనుంగులు, వేయి రథములు రెండువేల అశ్వికదళము గయకడ విడిపోయి, మాళవాభిముఖమై పోయినవి. ఆసైన్య

ములకు సోమదత్తాచార్యులు సేనాధిపతియై, ఒక మదగజముపై నధివసించి ముందునకు సాగిపోవుచుండెను.

తక్కిన మహాసైన్యమంతయు బుద్ధమహాచైత్యమునకు. మహాబోధి వృక్షమునకు పూజలొనరించి ముందునకు సాగినవి. శ్రీముఖ సాతవాహనుడు దేవేరియగు ఆనంద మహారాణితో మహాచైత్యనమునకు పూజ లొనరించెను.

ధర్మనంది పరమాద్భుతముగ విన్యసించిన ధర్మచక్రము నొకదానిని సార్వభౌముడు అర్పించెను.

చారుగుప్తుడును, వేయి నారికేళములు. భూరిదానములు, లక్షదీపములు నవలక్ష సువర్ణము లామహా చైత్యనమునకు, సంఘారామమునకు నర్పించెను.

ఆంధ్ర చక్రవర్తి గయాక్షేత్రమందు మహాబోధిచైత్యమందు పదిదినములు ఆగినాడు ఆదినములలో మూడవదినమున హిమబిందును చోరులు తస్కరించి, ముక్తావళీదేవితో ఎత్తుకొని పారిపోయినారని వార్తవచ్చినది.

ఆ వార్త వినినవెంటనేచారుగుప్తుడు "హా" యని నేలకొరిగి మూర్ఛపోయెను



# షోడశ ప్రకరణము

## నిర్వేదము

చారుగుప్తుని ఉపశమింపజేయుటకు ముఖ్యమంత్రి అచీర్ణుడు, సర్వసైన్యాధ్యక్షుడు స్వైత్రుడు, చక్రవర్తియు. మూర్తిమంతులవారును ఆ వణిక్ సార్వభౌముని గుడారమునకు వచ్చిరి. చారుగుప్తుని శిబిరము, చక్రవర్తి శిబిరమునకు కొలదిదూరముననే యున్నది. ఆవర్తకుని శిబిరమున నాలుగు గుడారములున్నవి.

వీరందరికన్న ముందరనే పక్కగుడారముననున్న శ్వేతకేతులవారు చారుగుప్తునికడకు పరుగిడివచ్చి వైద్యమొనరించి చారుగుప్తునకు చైతన్యము గలిగించిరి.

చక్రవర్తి;—మాకు నిన్ననే యీవార్త వచ్చినది. మేము నెమ్మదిగ చారుగుప్తులవారికి యీవార్త విన్పింపదలచితిమి. ఇంతలో ఎవరీవార్తను తీసుకువచ్చినది?

చారుగుప్తుడు;—[నీరసస్వరమున]! ప్రభూ. ఇంద్రగోపుడు, గూఢచారులతో మాటలాడుటవలన నీవిషయము తెలిసి అత్యంతభయమునంది. నాకడకు పరుగిడివచ్చి. చెప్పినాడు.

మహామంత్రి:—చారుగుప్తులవారూ! మరేమియూ భయపడనలసిన అవసరము లేదు. పదివేలసైన్యము ఆదొంగలను వెంబడించినారట. ఆ దొంగలు మంజుశ్రీని ఎత్తుకొనిపోయిన స్థౌలతిష్యులవారి శిష్యగణములైయుందురు.

సేనాధ్యక్షుడు:—స్థౌలతిష్యులవారివలన నీపని జరిగియున్నచో ప్రాణమానములకు ఏమియు భయముండదు.

మూర్తిమంతులు;—చారుగుప్తులవారూ! దేశములన్నియు తిరిగినవారు, సముద్రములను మోకాలి బంటిగనొనర్చుకొనినవారు ఇంత చేలవైతిలేమి?

చారుగుప్తుడు:—నాకుసర్వము ఈ బాలిక. నాప్రాణములకైనను వెరువను, నాబాలికకు చిటికెనవేలు బాధపెట్టినను నేను బాణముతగిలిన పక్షివలె గజగజ లాడిపోవుదును

సైన్యా;—నిజము. యవద్వీపాదులకు వర్తకమునకై పోయినప్పుడు నరమాంస భక్షకులైన నక్తంచరులు చారుగుప్తుల శిబిరములపైకి వచ్చినప్పుడు వీరు భయమునందక, తన సేనకు ఆధిపత్యమువహించి ఆరాక్షసులు మరల భారతీయవాములపైకిరాకుండ బుద్ధి చెప్పి నాశనము చేయలేదా?

చక్రి;—చారుగుప్తులవారు, మనమీ పాటలీపుత్రముపై దండెత్తుటమాని. సకల భారత దేశము గాలించి మీతనయను పట్టుకొందము. నాకనుమతినిండు.

శ్వేతకేతులవారు!—నాకేలనో హిమబిందునకు ఏ ఆపదయు రాదనియు, కొలది దినములలోనే ఆమెను మనవారెవ్వరో రక్షింతురనియు, అటువెనుక మనలను ఇచ్చటనే ఆమె త్వరలో కలుసుకొనుననియు, తట్టుచున్నది. నాకిట్టి ఆలోచన లెప్పుడు వచ్చినను అవి నిజమగుచుండును

మూర్తి;—నానమ్మ్రుడు గొప్ప జ్యోతిష్కుడు. ఆతడు చెప్పినదో తప్పదు. నాకు చాల అనుభవము.

చారు:—మహాప్రభూ, వార్త వటుకున్న వినుటచే నామనస్సు కలతనందినది గాని, మరేమియు లేదు శ్వేతకేతులవారు చెప్పినది తప్పక జరుగునని నాకు తెలియును. ధర్మద్వేషులమై. చక్రవర్తిని సకల భూమండల చక్రవర్తిగా పాటలీపుత్ర సింహాసన మెక్కుడని పనము కోరియుంటిమి. అది జరిగి తీరవలయును, నా బాలిక నాకు ఎంత ముఖ్యమో, ఇదియును అంతిముఖ్యము. మనము వెంటనే పాటలీపుత్రమునకు వెళ్ళి తీరవలెను.

మహామంత్రి:—చారుగుప్తులవారూ! ఈ సాయంకాలము లోపుననే మహాభాగుడగు శుకవాణునకు హిమబిందు రక్షణకై మీరు వ్రాసవలసినదని సందేశమంపుడిము

చక్ర;—ఆ ఆలోచన ఎంతయు సమంజసము స్థాలతిష్యుల దుర్నీతి మితిమీరి పోవుచున్నది. ఏమి, ఆముదుసలి బ్రాహ్మణుని ఉద్దేశము ఇట్టి పనులొనరించుటవలన?

మహామంత్రి:—ప్రభూ! వారు మిమ్ములనంత మొందించి, శ్రీకృష్ణశాతవాహన మహారాజుల నంత మొందించి, మంజుశ్రీని చక్రవర్తిని చేయువలయునని. మనదేశమంతయు బౌద్ధధర్మపూర్ణమై ప్రజల నీతిదూరుల చేయుచున్నదట. బౌద్ధధర్మ మధర్మపూర్ణమట.



చారు.—అట్టి ఆలోచన లాయనకున్నవని నాకును తెలియును. కాని ముక్కుపచ్చలారని నాబిడ్డనెత్తుకొనిపోవుట యేటికో!

మహామంత్రి:—మనకు చారులు చెప్పినంతవరకు మనము గ్రహింపగలిగినదిఇదియ మీతాంధ్రదేశమున నొక మహాసంస్థ. శ్రీ సార్వభౌముల శక్తి వెనుక, ఆందుకు బలముగ చారుగుప్తుని శక్తియట. ఆబలమును తగ్గింప హిమబిందును ఎత్తుకొనిపోయినారట.

చారు:—ఆమెను వారేమియు చేయరుకదా, మహామంత్రులవారూ?

చక్ర;—వర్తకచక్రవర్తి మీతనయకేమియు భయములేదు. మేమీ దినముననే ధాన్యకటకమునకుగూడ మా వేగు పంపెదము అచ్చటనున్న సర్వసైన్యమును, వేగువారిని ఉపయోగించి, ఆమె యుండిన తావు కనుగొని, యామెను భద్రపరుపవలయునని.

చారు;—కృతజ్ఞుడను మహాప్రభూ!

చక్ర:—ఇందు కృతజ్ఞులు కాదగినదేమున్నది? ఆంధ్ర చక్రవర్తియే మీయెడ కృతజ్ఞుడు.

చారు:—అటులనకుడు ప్రభూ! దాసుని సర్వస్వము ప్రభువుదేకాదా?

అందరు చారుగుప్తునికడ సెలవునంది వెడలిపోయిరి. చారుగుప్తుడు చక్రవర్తి వెడలిపోవునప్పుడు, లేచి. నమస్కరించి, గుడారము గుమ్మమువరకు సాగనంపి, వచ్చి మంచముపై వాలిపోయెను. శ్వేతకేతులవారు చారుగుప్తుని జాగ్రతగా పరిశీలించి చూచుచుండిరి.

ఎందుకు తనబాలికను చోరులెత్తుకుపోయినారు? తనతో తీసుకుని వచ్చియుండిన ఎంతయు బాగుండియుండును. తానా బాలికను ఇంటికడ వదలివచ్చి, ఎంత తెలివిలేని కార్యము చేసినాడు? తనముద్దుబిడ్డ ఎంత భయమందిపోవునో? ముక్తావళీదేవి అత్తగారుకూడ నుండుటవలన కొంత ధైర్యము కలిగియుండును. ఆమెను యువరాజునకీయ దలచుకొనదిట్లు ఎరికిని తెలియనీయలేదే? అది ఎవరైన గ్రహించినారా? నిజముగ నిది స్థాలతిష్యుని పనియేనా? లేక ధనమునకాశించి ఏతుచ్ఛులయిన నిట్టిపని చేసిరా?

ఈ ఆలోచనలు తన్ను కలచివేయ, "ఇంద్రగోపా!" యని పిలచెను. ఇంద్రగోపుడు పరువిడివచ్చెను.

"ఓయీ! నీవు నా స్వంత సైన్యమునకు అధిపతియగు విజ్ఞానకంఠీరవునకు నా ఆజ్ఞగ తన సైన్యములోని మాయాశీలురు, దక్షులగు యాదార్వాణవర్ణుల, అపకృష్ణుల, గూఢపురుషుల వెంటనేపంపి ఎవరు హిమబిందు నెత్తుకొనిపోయిరో కనుగొనుమని చెప్పుము. ముష్కరులగు సేనాపతుల కొంత సైన్యముతో, నాకుమారితస్కరణమునందు పాలుగొన్న వారిని నాశనమొనరింపుమనుము మన ఇంటికడనున్న యాదార్వాణవర్ణులేమి కనుగొనిరో, వారేల ప్రమత్తులై ఇట్టిమహాహాని నాకు సంభవింజేసిరో కనుగొమ్మనుము. అట్టి ప్రమత్తులను నేను వచ్చువరకు కారాగారమున నుంచునటుల ఆజ్ఞలనంపుము. ఇదిగో నా వ్రేలిముద్ర పో!"

ఇంద్రగోపుడు వేగముగ వెడలిపోయెను. చారుగుప్తుడంత, తన మామగారి తండ్రికి, ఈ విషయమున వారేమిచేయుచున్నారో యది తనకు తెలియజేయుటకును వణిక్కులశక్తులన్నియు నుపయోగించి, హిమబిందెక్కడనున్నదీయు గనుపెట్టి ఆమెను రక్షింప వీళ్ళన్నియు చూడవలెననియు, గజసందేశహారులను బంపెను.

వేగవంతులు, ప్రజ్ఞావంతులునగు గజసందేశహారులు మాళవ, మగధ, సౌరాష్ట్ర కుంతల, విదేహ, విదర్భాది దేశములనున్న తన వణిక్స్థానములన్నిటికి జని చారుగుప్త వణిక్సార్వభౌముని సందేశము నాజ్ఞగా వినిపించిరి.



# సప్తదశ ప్రకరణము

## స్కంధావారము

మహాప్రవాహ మతివేగమున వచ్చి కొండపై బడినట్లు, ఫెళఫెళార్భటుల దావానలము భయంకరకాంతారమును పొదివినట్లు, వర్ష సమ్మిశ్రిత ప్రచండ ఝుంఝూనిలము వటవృక్షమును తాకినట్లు, ఆంధ్రసైన్యములు వచ్చి పాటలీపుత్ర మహాపురమును ముట్టడించినవి.

పాటలీపుత్రమున కొకవైపు గంగానది ప్రవహించుచున్నది. తక్కిన మూడు వైపుల గంగాజలములు నిండిన కందకము. ఆకాశమునంటు కుడ్యములు ఉన్నవి. కోట చుట్టు అయిదువందలడెబ్బది బురుజులున్నవి. నది చుట్టినవైపు మూడు గోరుతములు పొడుగుగాక, భూభాగముపై ప్రసరించిన నగర మహాకుడ్యము తొమ్మిది గోరుతముల పొడుగుననున్నది.

నగరపు కోటకడకు వెళ్ళుటకుముందు, కోటచుట్టు ఎనిమిది చిన్నకోటలున్నవి, గంగానది యావలియొడ్డున నొకటియు, పట్టణమువైపు కుడ్యములచుట్టును ఏడుకోటలు; నగరకుడ్యమునకు అర్ధగోరుతము దూరముచొప్పున నున్నవి.

గంగానదివైపు ఇరువది గోపురములు, తక్కిన భూభాగమువైపు నలుబదినాలుగు గోపురమహాద్వారములున్నవి. అశోక చక్రవర్తి నగరకుడ్యముచుట్టు కట్టిన ఏడు కోటలకు మహాకుడ్యమొకటి కలిపి, దానిచుట్టు శోణానదినుండి, ఒకపాయను కొనివచ్చి పాటలీపుత్రమునకు దిగువను గంగానదిలో కలిపినాడు.

సుశర్మ చక్రవర్తి ఈకోటలన్నియు బాగుచేయించినాడు, కుడ్యములన్నియు బాగుచేయించినాడు, పట్టణముననున్న కోటబురుజులు, గోడలు, పట్టణమధ్యమున గంగానదీతీరముననున్న సార్వభౌమదుర్గము, దుర్గము చుట్టునున్న కందకము అన్నియు బాగుచేయించినాడు. నగరమునందు ధాన్యాది ఆహారపదార్థములు సేకరించినాడు. ఎన్నియో యాయుధవిశేషములు, కోటగోడలనుండి శత్రువులపై కళపెళ కాచిపోయుటకు అవిసె మొదలగు నూనెలు, ఆయుధయంత్రములు సేకరించినాడు.

ఆంధ్రులు పాటలీపుత్రముపై ఎత్తివచ్చెదరని యాతడు కలనైన ననుకొనలేదు. తనకున్న లక్ష యేబదివేల సైన్యములో లక్ష సైన్యము మాళవమునకు పంపినాడు. నేడా సైన్యము వచ్చుటకువీలులేదు. లిచ్ఛవులు, బౌద్ధులు, తనచుట్టునున్న దేశములవారందరు బౌద్ధులు. కాని కామరూపమునకు, వంగదేశమునకు, వారణాసికి, నేపాళదేశమునకు అతివేగమున వార్తలంపుటచే వంగమునుండి ఇరువదివేల సైన్యము, నేపాళమునుండి ఎనిమిదివేల కరకు యక్షసైన్యము, కామరూపమునుండి నాలుగువేల సైన్యమును వచ్చినవి.

మగధదేశమునందు మాండలికులు ముప్పదివేల సైన్యమునంపిరి. ఈలక్ష పదివేల సైన్యము పాటలీపుత్రమును సంరక్షించుచుండ, ఉజ్జయిని పడిపోవుటతోడనే, మాళవ మహారాజు తన లక్షసైన్యముతోడను, శివస్వాతి అరువదివేల సైన్యముతోడను, మాగధసైన్యము లక్షయు, పుళిందాదుల ఆటవికసైన్యములు, జొఘలుని సైన్యము అన్నియు వచ్చినచో, ఆంధ్రసైన్యములు తుత్తునియలైపోవును. ఆంధ్రదేశముపైనెత్తిపోయి, ఆంధ్రులనోడించుటకంటె, ఇదియ ఉత్తమమైనది అని సుశర్మయూహించినాడు.

పాటలీపుత్రమున విజయయజ్ఞములు, దేవతారాధనలు జరిగినవి. అంతకుముందుగనే బౌద్ధులందరు పారిపోయిరి. సంఘారామములు పాడుపడిపోయినవి. మహాచైత్యముల నిదివరకే పాడుపెట్టి నాశనముచేసిరి.

గంగానది వేసవివరదలతో నిండియున్నది. ఉత్తరమున గండకీనది పూర్తిగా ప్రవహించుచువచ్చి, గంగానదిలో కలియుచున్నది శోణానదిలో, గోగ్రలో జలములు చాల తక్కువయున్నవి. వైశాఖమాసాంతపు ఎండలకు, వేడిగాల్పులకు. ముట్టడించిన ఆంధ్రసైన్యములు మాడిపోవుచున్నవి. పాటలీపుత్రనగరము చుట్టున ఎన్నియో తోటలుండుట సైన్యములకు మంచిదైనది.

సైన్యములువచ్చి ముట్టడించిన మూడవదినమునుండి చారుగుప్తుడు ప్రత్యాసారులను చుట్టునుండు గ్రామగ్రామములకు పంపి, కోట్లకొలది తాలపత్రముల తెప్పించి ఏబదివేల శిబిరములు నిర్మించెను మృణ్మయకలశములుకొన్ని కోట్లు శిబిరములందుంచబడినవి.



పాకశాలలు, వీరపానశాలలు, అన్నిచోట్ల విరివిగ నెలకొల్పబడినవి. అంగడులు. విరివిగ నేర్పరుపబడినవి. వైద్యశాలలు ఏర్పాటు గావింపబడినవి. వేరొకమహాపట్టణమే ఎత్తివచ్చినట్లు ఆంధ్రసైన్యములమరింపబడినవి.

చారుగుప్తుడు పదివేల గోవులను, ముప్పదివేల మహిషములను కొనివచ్చెను. అవియుగాక, ఆతడు ధనము వెదజల్లుటచే, చుట్టుప్రక్కల గ్రామాదులనుండి గోపకులు. పాలపశువుల గొనివచ్చిరి. వర్తకులువచ్చి అంగడులుపెట్టిరి. నర్తనశాలలు ఏర్పరుపబడెను గాయకులు, కవులు వచ్చిరి. ఇదియంతయు నిట్లుండ, యుద్ధము విషయములో కోటలు. కుడ్యములు ఛేదించుటకు, ఎత్తయిన దిబ్బలు, చిన్న బురుజులు ప్రతిగా నిర్మింపబడినవి. వానిపై మహాధన్వులగు ఆంధ్రులు ప్రవేశించిరి. సర్వతోభద్రాది యంత్రములు నెలకొల్పినారు.

ఒక్కొక్క ఏనుగుపై పదిమంది విలుకాండ్రుందురు అన్ని ఏనుగులకు సంపూర్ణకవచములున్నవి. ఖడ్గమృగపు చర్మములచే చేయబడి, సున్నగ మైనముపూయబడి ధనువుఎత్తునన్న కేడెములు ధరించి తలపై అడ్డముగ రక్షకభటుడుపట్టు, ధన్వి బాణములు వేయును.

ధనుర్యుద్ధపండితాంధ్రు లప్రతిమానులు కోటగోడలపై సైనికుడు పాదమూపుటేమి బాణము సువ్వునవచ్చి. ఎట్టికవచమునైన దూసుకుపోయి. ఆసైనికుని ప్రాణముకొనును. అట్టి బాణములు మహావర్షపాతపుచినుకులకు పాఠము నేర్పునట్లు ఆంధ్రుల విండ్లనుండి వచ్చి పడుచుండును. కోటగోడలపై, బురుజులపై గోపురములపై పాటలీపుత్రపుర సైనికుడు తలచూప భయపడి పోవుచుండెను.

ఈలోన అగ్నిగోళములు, శతఘ్నులు, శిలాఘ్నులు మహాశిలలు వర్షము కురియుచున్నవి; ఆంధ్రసైన్యములపైకూడ ఆ భయంకరాయుధములు వర్షము కురియుచున్నవి.

ముట్టడి ప్రారంభించిన ఎనిమిది దినములవరకు, ఆయుధ వర్షములతోడనే ఇరువాగుల సైన్యములు పోరాటము సలుపుచుండెను.

ఇంతలో పదవదినమున శుకబాణుని కడనుండియు, ధాన్యకటకము నుండియు వార్తలు వచ్చినవి ధాన్యకటకపురి సేనానాయకులు హిమబిందుజాడలు తెలియుటకు

సర్వప్రయత్నములు చేయుచుండిరనియు, శ్రీ ధర్మనందిగారి కుమారుడు సువర్ణశ్రీ అడవులలో ఆమెను వెదుకబోయెననియు ధాన్యకటకమునుండి వార్తలు వచ్చెను.

హిమబిందు మాళవులచేతిలో బడెననియు, ఆమెచే నుత్తరము వ్రాయించి సమవర్తిని యుద్ధపరాఙ్ముని చేయ ప్రయత్నించిరనియు, ఉజ్జయినిలో ఆంధ్రసైన్యములు ధైర్యముతో పోరుచున్నవనియు, తానుకూడ కొందరిచారులను పంపి హిమబిందును వెదికించెదననియు వార్త పంపినాడు శుకబాణుడు. చారుగుప్తులకు అట్టివార్తలే వచ్చినవి. శ్రీకృష్ణ సాతవాహనుడు అభీరులనోడించి, భరుకచ్ఛము పట్టుకొనినాడట. స్థూలతిష్యుడు, శిష్యగణముతో కాశికాపుర యాత్రకై బయలుదేరినాడట. ఆంధ్రసైన్యములు పోయి ఉజ్జయినిని ముట్టడించిన మాళవసైన్యమును తాకినవట. ఈలోన గోండులు వేలకువేలువచ్చి వేరొకప్రక్క తాకినారట. గోండుసైన్యమువలన మాళవ సైన్యములకు సంభవించిన నాశనము వర్ణనాతీతము.

ఈ వార్తలన్నియు చక్రవర్తితో సమాలోచించుటకు చక్రవర్తి భవనమునకు చారుగుప్తులవారు రథమెక్కి వెళ్ళినారు.

చక్రవర్తి పాటలిపుత్ర మాండలికుని భవనమొకటి యాక్రమించి యందు చేరినారు. అలాగుననే పట్టణము బయటనున్న అనేక భవనములలో, పరిసరములనున్న గ్రామాదులలో సేనాపతులు, మంత్రులు, ధర్మనంది మొదలగువారందరు చేరినారు.

చారుగుప్తుడు చక్రవర్తిచే ననుజ్ఞాతుడై వారి సభామందిరము చేరి, సామ్రాట్టునకు నమస్కరించి, యుచితాసన మధివసించెను. ఇంతలో సైత్రులవారు, అచీర్ణులవారును వచ్చిరి.

చారు:— ప్రభూ! మనసైన్యములు నెమ్మదిగ ముట్టడి సాగింపనెంచినచో ముందుముందు చిక్కులెక్కువయగును. అఖండవేగమున మనకున్న శక్తినంతయు నుపయోగించి, పాటలీపుత్రపురమును ఛేదింపవలయును.

మహామాత్యుడు అచీర్ణుడు:— ప్రభూ! ఆంధ్రసైన్యములు హిమపాతములరీతి, మహాకల్లోలమువలె పాటలీపుత్రముపై విరుచుకుపడుటకే నేను సర్వసన్నద్ధములు చేయుడని సైన్యాధ్యక్షులతో మనవిచేసియున్నాను.

సైత్రుడు:— ప్రభూ! ఇక్ష్వాకులు ఉత్తరపు నదీతీరమునను, పూంగీయులు వారికి బాసటగాను, పల్లవులు వారివంటియు మొనతీర్చియున్నారు. తూర్పునమంజష్టులు



యతులు నాగులు పాహారించియున్నారు. వేంగీయులు వజ్రభూములవారు దక్షిణతీరముననున్నారు. ప్రతీకారపు బురుజులు సిద్ధమైనవి. సొరంగములు త్రవ్వుచున్నారు.

చక్రి:— ఎన్నియైనను, ముట్టడి ఆటపాటలుగ సాగుచున్నది. ఎవ్వరికిని వేడి ఎక్కలేదు ఎక్కడో ఏదియో లోటు కనబడుచున్నది.

చారు:— కోటగోడలదగ్గరకు వెళ్ళుటకు వీలులేకుండా చేయుచున్నారు. మనము కోటలోనికి ప్రవేశింపవలయునన్న నాకు పదిదినములు గడువిచ్చినచో, ఒక యుపాయము చేయగలను. అది మనవిచేసెదను

చక్రి:— ఏమది ఆ ఉపాయము?

చారు:— ప్రభూ, గంగానదే మనకు దారి చూపున

స్వాతుడు;— చారుగుప్తులవారూ, ఆవైపున తొంగిచూచుటకైన వీలులేకుండ చేయలేదా విరోధులు.

చారు:— అందుకనే ఆటువైపు సంపూర్ణముగ మనము ఛేదింపవలె ఎక్కువ నీళ్ళున్నవి.

చక్రి:— ఈ పదిరోజులును ఆటపాటలతో కాలము పుచ్చవలసినదేనా?

స్వాతుడు:— నేనొక యాలోచనచేసినాను, అది తమకు మనవిచేయగలను ధర్మనందులచే పాటలీపుత్రకోటలు, కుడ్యములు మట్టిబొమ్మగా రచింపజేసినాను. అది తమ అందటిఎదుటనుంచి నా ఆలోచన మనవిచేయగలను.



# అష్టాదశ ప్రకరణము

## ముట్టడిపై ముట్టడి

ఉజ్జయిని పట్టణమును ముట్టడించిన మాళవాది సైన్యముల సౌంధ్రసైన్యములు ముట్టడించినవి. ఆదివరకే నాలుగురోజులనుండి పదివేల గోండులు ఎడతెగనిదాడులచే మాళవులను చీకాకుపరచి నాశనము చేయుచుండిరి.

ఈ దాడులు సాధారణ గోండుల దాడులవలెకావు, కొన్ని సంవత్సరములు క్రమశిక్షణ నందిన సంశప్త కాంధ్రులవలె గోండులు యుద్ధము చేయుచుండిరి. ఇంతలో తూరుపువైపునవచ్చి తాకుదురు. విల్లులుధరించి ముంగు తీగెలతో ఒట్టముగా అల్లినతెడకలవంటి కేడెములు ధరించి వచ్చెదరు. కేడెమునొకడు పట్టుకొనును. ఒకడు విల్లును లాగి బాణములు వదలును. ముందుపంక్తివారు వెల్లకిల పండుకొని పాదములతో విల్లు దండమును నొక్కిపట్టి రెండుచేతులతో రెండుచేతులపొడవుగల ఈటెలను వదలుదురు ఆ వెనుక పంక్తివారు మోకాళ్లపై కూరుచుండి బాణముల వదులుదురు. అంతకును వెనుక పంక్తివారు నిలుచుండి అంబుల వదులుదురు. బాణములు మృత్యుదేవతా కటాక్షాంచలములవలె పర్విను. వేలకువేలు యోధులు చనిపోదురు.

ఇంతలో ఆ దండంతయు మాయమైపోవును. తెల్లవారు ఘడియలలో, సాయంకాలపు ఘడియలలో శత్రువుల తాకుచుందురు. ఇంకొకదినమున పడమటివైపున తాకుదురు. వేరొకరోజున ఉత్తరమున ప్రత్యక్షమగుదురు. ఎంతవేగముగవచ్చిదాడి సలుపుదురో, అంతవేగముగ మాయమగుదురు.

పట్టణమునకు పడమటగానున్న శిప్రానది వారిదాడుల నడ్డుకట్టలేదు. మాళవుల సైన్యముల వేలకువేలు సైనికులు మట్టిపాలగుచున్నారు. అశ్వములు, గజములు నాశనమై పోవుచున్నవి. మాళవాధిపతి ఎవ్వరీ గోండులనాయకుడు. ఈ గోండుకేల నింత క్రోధముపూని శత్రువైవచ్చిపడెను? అను ప్రశ్నచే విహ్వల చిత్తుడయ్యెను.

గోండులువచ్చి తాకినవార్త ఉజ్జయినీ నగరములోని ఆంధ్రులకు తెలిసినది. వినీతవతి సమవర్తి శుకబాణాదుల యాశ్చర్య సంతోషములకు మేరలేదు.



ఇంతలో నొకనాటిరాత్రి గోండుడొకడు ఎటులకోటలోనికి వచ్చెనో. సమవర్తి ఎదుట నిలుచుండినాడు. సమవర్తి సంభ్రమంబున నాతని రమ్మని సైగచేసి తన రథంబున కూర్చుండబెట్టుకొని వినీతమతి భవనమునకు బోయెను. వారిరువురు శుకబాణునకు వార్తనంపిరి. అతడు వెంటనే యచ్చటకేవచ్చెను. శుకబాణునకు సర్వభాషలు తెలియును. అతడు గోండునితో సంభాషించెను.

'ఎవరుపంపిరి?'

'సువర్ణశ్రీ?'

'సువర్ణశ్రీ' [ఆశ్చర్యమందుచు]

'ధన్యకటకమున బొమ్మలు వేయువాడు గొప్పవీరుడు మా మహామల్లగోండు మహారాజు స్నేహితుడు.'

'అతడెట్లు మీ దేశము వచ్చెను.?'

'హిమబిందు నమ్మగారిని వెదుకుచువచ్చెను. మా యువరాజు సహాయముకోరెను. వారు రాక్షసుల సహాయమున ఆమెను దాచిన ప్రదేశము గుర్తెరిగినారు. మా యువరాజు వమ్మగొని రాపోయెను. ఈ లోన సువర్ణశ్రీ నర్మదానదీ తీరమునందున్న గుహాంతరమునుండి వారిని రక్షించినాడు దొరా!'

శుక:— [సమవర్తితో] హిమబిందును రక్షించినారట!

సమవర్తి:— హిమబిందును రక్షించినారా? నిజముగా ఆమె క్షేమముగా నున్నదా? ఆమె ఏమనుచున్నది. ఎచ్చటనున్నది? త్వరగా చెప్పుమనుడు శుకబాణుల వారూ!

శుక:— తొందరపడకండి ఓయీగోండువీరా! ఆబాలిక, ఆబాలికతో వచ్చిన ముసలిస్త్రీ క్షేమమా?

గోండు:— దొరా! వారిద్దరు క్షేమం. నాకీ మా మహారాణీ దొరసానివారు పంపిన గోండస్త్రీలు సేవలుచేయుచున్నారు. వారు ఇచ్చటకు నేబదిమైళ్ల దూరమున నున్న నొక గ్రామమున నొకబ్రాహ్మణుని ఇంటనివసించి ఉన్నారు

శుక:— సమవర్తిసేనాపతీ వారిరువురు క్షేమం. ఆరాటపడకుడు.

సమ:— అమ్మయ్య, సువర్ణశ్రీ ఎంతచక్కని పనిచేసినాడు. ఆనాడంతటివీరుడెవ్వడైనాడు. ఆ దినమున బండి పందెములో నన్నోడించినాడు. నేడు హిమబిందును రక్షించినాడు ఈ హారమీ శుభవార్త తెచ్చిన గోండువీరునకీయుడు

వినీ:— ఎంత ఆనందము!

శుక:—గోండువీరా! నిన్నువ్వరించుటకు పంపినారు. నీవు తెచ్చిన శుభవార్తకు మా సేనాధిపతి నీకు బహుమాన మిచ్చుచున్నాడయ్యా!

గోండుడు:—దొరా! సువర్ణశ్రీ మహారాజు దొరయు; మా యువరాజు దొరయు నన్నంపిరి. వారు చెప్పుమనిన ముఖ్యవార్త. ఆ కొండలలోని గుహాగారమును మేము పూర్తిగ పట్టుకొనినప్పుడు, అచ్చట ఆంధ్రచక్రవర్తులవారి కుమారుడు మంజుశ్రీ రాజకుమారుడు మాకు దొరికినాడు. వారును క్షేమముగనున్నారు అని మీతో చెప్పుమని మా దొరలఆజ్ఞ!

శుకబాణుడు:—ఏమిటి గోండుదొరా! నీవు చెప్పినది నిజమా! రాజకుమారుడు మంజుశ్రీయే మీకు దొరికినది? ఓహో ఎంతసంతోషము! [ఆంధ్రప్రాకృతమున] ఆంధ్ర సేనాధిపతులారా! ఈ మహోత్కృష్టమగు వార్త వినండి రాజకుమార మంజుశ్రీ, సువర్ణశ్రీ పట్టుకొనిన గుహాలలోనే దొరకినాడట. ఎంత ఆనందము? నేను చేయలేనిపని సువర్ణశ్రీ చేసినాడు. ఆ బాలుని ఎప్పుడు కలుసుకొందును. ఎప్పుడు కౌగిలింతును—

వినీతమతి, సమవర్తి.— ఏమిటీ మంజుశ్రీ దొరికినాడా? ఎంత ఆనందము, నిజమేనా?

వినీతమతి:— ఓ దొరా! నీవు అసాధ్యుడవు. దేవదూతలవలె నున్నావే! నీకు మా హారములన్నియు ఇవిగో!

సమవర్తి:– ఎవరక్కడ? ఈ గోండమహావీరుని నోటినిండ మిఠాయిలుంచుడు! నాకు నాట్యము చేయ బుద్ధిపుట్టుచున్నది. ఈ హారములును తీసికొనుము. శుకబాణుల వారూ వెంటనే ఈ వార్త పాటలీపుత్రము చక్రవర్తికి అందజేయుడు!

గోండుడు చెక్కుచెదరని మోముతో గంభీరముగ కూరుచుండి, వారిచ్చిన హారముల మెడను ధరించెను.

గోండు:— మీలో 'చిలుకఈటె' అనువారున్నారట.

శుకబాణుడు పకపక నవ్వుచు ఆంధ్రప్రాకృతమున వినీతమతి సమవర్తులతో 'నేను 'చిలుకఈటె' నట వినుడయ్యా!' యని మరియు నవ్వుచు, 'ఓ గోండుదొరా! నేనే యా చిలుకఈటెను' అని యనెను.



గోండుడేమియు నవ్వక 'ఓ చిలుకదొరా! నేను మా మహారాజుకడ నీ ఉద్యోగమువంటి ఉద్యోగమునే చేయుదును. నేను మా మహారాజునుకొలుచు కొన్ని గూఢముల నాయకుడను. నా పేరు 'గాలిదొర' అందురు. గాలివలెవచ్చి, గాలివలె పోగలను. గాలి రాకపోకలు తెలిసితీరును. నా రాకపోకలు నా యిష్టమున్న గాని తెలియనే తెలియదు

శుకబాణుడు నవ్వునలేచి యా గోండుదొరకు, తమ యుపసర్ప నమస్కారము లిడెను. అతడును తమజాతి యుపసర్ప నమస్కారమును రెండుచేతులతో కళ్ళనుమూసి, చెవులుమూసి, నోరనుమూసి చూపించెను.

ఆవెనుక వారిరువురును కౌగిలించుకొనిరి.

'గాలిదొర', గోండుడు:—ఇదివరకే మా దొరలు పాటలీపుత్రమునకు వార్త పంపినారు. ధాన్యకటకమునకు వార్తలు పోయినవి. అటు తూర్పునుంచి సువర్ణశ్రీ మహారాజుదొర గురువు ఆంధ్రసైన్యములతో వచ్చుచున్నారు. వారు నాలుగు దినములదూరములోనున్నారు. పడమటవైపునుండి మహారాజు శ్రీకృష్ణసాతవాహనులవారు వచ్చుచున్నారు. వారు పదిరోజుల దూరములో ఉన్నారు. ఈరాత్రి నేను మా దండును కలుసుకొని మరల మీకు వార్తలను పట్టుకొని వచ్చెదను.

ꕥ

# ఏకోనవింశతి ప్రకరణము

## సైన్యాధిపతి—శిల్పి

శత్రువులను సర్వవిధముల నాశనము చేయుచు, కోటపై ఒత్తిడి తగ్గించుచు, సువర్ణశ్రీ అద్భుతయుద్ధము చేయుచుండెను. ఆతడు గోండువీరుల యుద్ధవిధానమే మార్చివేసెను. ఒక దినమున తెల్లవారు ఘడియలలో గోండువీరులను మూడు జట్లుగ విభజించినాడు. వారినొక్కపర్యాయమే విరోధులమూడువైపులపోయి తాకుడని ఆజ్ఞ ఇచ్చెను.

ప్రథమ గోండయుద్ధవిధానము మాళవాది సేనాపతులకు అవగతమగుటచే, వారందుకు సిద్ధపడియుండిరి. సైన్యశిబిరములకు నాతిదూరమునుండి గూఢచారులు దాగుకొనియుందురు. గోండులు వచ్చుచున్నారనగనె, యూపరిక్క పెద్ద భోగిమంటలు లేచును, మంటలకుదూరమునుండి కుడ్యములవలెకట్టి కట్లనాటునుండి శత్రుధనుర్వీరులు బాణవర్షము కురిపించెదరు.

మంటలుదాటి గోండువీరులు వెళ్ళుటకు వీలులేదు. గోండువీరులకు మంటలావల ఏమగుచున్నది కనంబడదు. అట్లు గోండులు చీకాకునందగనె, వీరి వెనుక చెట్లలోదాగికొనియున్న పుళిందులు ఒక్కుమ్మడి గోండులపై గవిసెదరు. ఆ సంకులసమరములో శిబిరములనుండి అందుకు సిద్ధమైయుండిన వేలకువేలు శత్రువులువచ్చి గోండులను తాకెదరు.

ఇట్లుజరిగిన ఒకరణమున గోండులు వేయిమందవరకు హతమారిరి. సువర్ణశ్రీ హృదయము చివుక్కుమనిపోయినది. ఆతడాలోచించి, ఒకదినమూరకొని, యుద్ధమున గాయముపడినవారిని వైద్యమునకై దూరవుటడవులకు పంపివేసెను!

ఆదినమంతయు ఆలోచించి, రాక్షసగోండునాయకుల చేర్చి వారేమేమి కార్యములొనరింపవలయునో బోధించి పంపెను.

ఆరాత్రియంతయు రాక్షసులు శిబిరములుమట్టుచున్న చెట్లపై కొమ్మలలో దాగియుండిరి. కొందరు రాక్షసులు కుండలలో నీళ్ళు పట్టుకొనిపోయి, నూనెపోసి సిద్ధము



చేసియుంచిన భోగిమంటల దుంగలను, నూనెతడిపినగుడ్డల ప్రోగులపైనను నీళ్ళుపోసి తడిపివేసిరి.

గోండులు తమ మహాశూలములను నూనెలతో తడిపిన గుడ్డలను చుట్టిరి.

అటులన్ని విధముల సిద్ధమై ఒక్కసారిగా మూడువైపులనుండి ప్రత్యూషకాలమున నేవచ్చి, శత్రువుల తమ సింహనాదములచే కలంచివేయుచు, తాకిరి.

యథాప్రకారము మూడువైపుల మంటలంటింపబోయిన నవి యంటుకొనలేదు. ఈలోన గోండుల అగ్నినారాచములు వేగమునవచ్చి, పాకలగుడారముల తగులబెట్టుచుండెను. గుఱ్ఱములు, ఏనుగులు, పశువులు చెదిరిపోయెను. అటు కోటలోనుండి ఆంధ్రవీరులు తలుపుతీసుకొనివచ్చి, తీవ్రముగ తలపడిరి.

ఈ సంకులసమరములో మాళవసైన్యములు ధైర్యముకోలుపోయి చిందరవందరయై పోయెను. వేలకువేలు నశించిపోయిరి.

చెట్లపై దాగుకొనుటకుపోయిన పుళిందులను, ఆ చెట్లపైన ఇదివరకే దాగుకొనియుండిన రాక్షసులు నాశనము చేసిరి.

మరల తెల్లవారుసరికి గోండులేరు, కోటలోనికి ఆంధ్రసైన్యములు తిరిగిపోయినవి. సమరభూమిలో, శిబిరములలో, మాళవసైనికులు, పుళిందులు, వైదేహులు, కాళింగులు, విదర్భులు, శూరసేనుల సేనలు శవములైయుండిరి.

విజయులై గోండులు, రాక్షసులు అడవులలో మాయమైనారు. మాళవుల సైన్యాలు, నూరుగజములు, అయిదువందల అశ్వికులు, రెండువందల రథములు, వేయి పదాతులుగా చిన్న సైన్యములయినవి అట్టిసైన్యములు నాలుగు, నాలుగువైపులకు గోండులు దాగియున్న ప్రదేశములు కనుగొని, వారిని వేటాడుటకు నిశ్చయించుకొన్నవి.

ఈవిషయము సువర్ణశ్రీ గ్రహించకపోలేదు. గోండుసైన్యాలు కనబడియు కనబడనట్లు, వేరువేరు భాగాలై శత్రుసైన్యములను గోండువనదేశమువైపు దూరాటవులకుకొనిపోయి, అచ్చట వారిని చిందరవందరచేసి, నాశనముచేయ సువర్ణశ్రీ, మహాబల గోండులాజ్ఞలిచ్చిరి. ఈ వ్యూహవిధానమునకు నాయకత్వభారము మహాబలగోండునిపై బడినది. సువర్ణశ్రీ మటుమణిగెను. హిమబిందుకుమారియు, ముక్తావళియు, కొలది దిన

మాలధరకు తాము ప్రచ్ఛన్నముగ నివసించియున్న ఇంటనే తలదాచుకొన సువర్ణశ్రీ యుపదేశించెను.

సువర్ణశ్రీ మారువేషమున గ్రామవాసుడై హిమబిందు నివసించు గ్రామముననే యుండెను. అచ్చట నొకఫలకముపై దుకూలమంటించి, దానిని చిత్రరచనకనువగు నట్లమరించి, చిత్రమునొండు రచించెను ఆతనికుంచెల వత్సకర్ణరోమములచే, ఉడుత తోక వెంట్రుకలచే నాతడే నిర్మించుకొనును ఆతనివర్ణము లెక్కసవీలయిన యచ్చట సముపార్జించును. నీలిరంగు, ఇంగిలీకము, సత్తుభస్మము, హరిదళము గైరికము, కాశీసము, ఖజ్జలి, మంజిష, లాక్షారసము మొదలగునవి సముపార్జించుకొనినాడు వానిని నూరి రంగులుగనొనర్చి, తూలికతో నా చిత్రము రచించినాడు

ఆచిత్రమునందు తన హృదయమునే చిత్రించినాడు. ఆకాశమున గంధర్వరాజు తేలిపోవుచున్నాడు. అతనియెదుట వీణవాయించు గంధర్వాంగన త్రిభంగాకారయై పద్మాసనాసీనయై యున్నది. దిగువ కొండలమధ్య చెరువుకడ తపస్సుచేయు నొక బాలకుడు.

ఆచిత్రమతి మనోహరము ఆకాశమున మేఘములు, పక్షులు, కొండలలో జంతువులు, వృక్షములు బాలతపస్వికడ పాములు, పూలమొక్కలు, చెరువులో పద్మములు, ఆకులు, కొంగలు, అంచలు ఇవియన్నియు చిత్రభావమునకు శ్రుతిగనున్నవి.

ఏనాటికైన తనకు సన్న్యాసమే. భిక్షుకత్వమే! ఆమెను రక్షించి ఆమెతండ్రికి నప్పగించుటతోడనే తన ధర్మనిర్వాహణము పూర్తియగును. అటుపైన ఆంధ్రదేశమునకు అతి దూరమున, ఏసంఘారామక్షేత్రముననైన ధర్మమును, సంఘమును కొలుచుచు నుండవచ్చును.

హిమబిందు తనకు దేవత. ఆమె ప్రజ్ఞాపారమితాదేవియే! ఆమెను దూరమునుండి పూజచేయును. తాను కామమయమగు హృదయముతో నామెదేహమును కాంక్షించియుండెను. ఆమెయు తన్ను ప్రేమించినది. తన్ను ఆమెకూడ కామమయమగు హృదయమున కాంక్షించియుండునా? ఉండదు. ఏలనన అట్లు కాంక్షించియున్న ఇతరులనెట్లు ఉద్వాహముకా నిచ్చగించినది?

ఆమె ఇతరుల వివాహమాడ ఇచ్ఛగించియుండునా? తండ్రిమాట జవదాటలేక అట్లు ఒప్పుకొనియుండునా? ఏదిఅయిననేమి, ఆమె ధర్మమునపరకీయ. తనప్రభువునకు కోడలు కాబోవుచున్నది. భావి ఆంధ్రసామ్రాజ్ఞి.



ఆమెను మనసులోనైన తాను తలంపగూడదే! ఎంతప్రయత్నించినను ఆమెను మరువలేని నీరసత్వము తనగుణములందు ఏర్పడినది. అట్లుమరచుట కుపాయమేమి? అమృతపాదార్హతులు తనకుపశమనమీయలేరా? తనగురువు సోమదత్తాచార్యులు వచ్చుచున్నారు. వారికడ నేర్చినవిద్య నేటికిట్లు ప్రదర్శితమగుచున్నది. ఈయాత్రయు ప్రభుసేవ యొనర్చి తన ప్రభు ఋణమును, గురుఋణమును, హిమబిందును రక్షించి ప్రేమ ఋణమును, ఎచ్చటనైన సంఘారామమునకు శిల్పమర్పించి పితౄణమును-తాను తీర్చుకొనుగాక. అటుపైన హిమాలయములే తనకు శరణ్యములు.

హిమాలయశిఖరములు, మహానదులు, మహోన్నత ప్రదేశములు, హిమము, ఏ అగ్నిపూరిత హృదయునకైన పరమశాంతిని ప్రసాదించగలవు.

ఆలోచనలంగుబాళించు మనసుతో సువర్ణశ్రీ రెండు దినములవరకు హిమబిందు కడకు బోలేదు. ఆమెను దర్శించుట ఆమె ఆజ్ఞవల్లనే. కాబోవు మహారాణిఆజ్ఞ అనుల్లంఘనీయముకదా!

సువర్ణశ్రీ వెళ్ళుటతోడనే హిమబిందు మోము రాకాచంద్రబింబమువలె వికసించెను.

అంతటివరకు ముత్తవతో నామెవాదనలు సలుపుచునేయుండెను. తాను శ్రీకృష్ణసాతవాహనుని గాని, మరి ఏరిని గాని వివాహమాడననియు, తానుభిక్షుణినియై మహాశ్రమణకుని సేవ చేసెదననియు, అమృతపాదార్హతులు తనకు గురువగుననియు నామె ఖండితముగ ముక్తావళీదేవితో చెప్పినది

ముక్తావళీదేవి యవనవంశజాత. ఇంద్రియభోగము, విహారసౌఖ్యము నామెయేవగించుకొనదు ఆమెకు భక్తియున్నది. ఆమెకు భగవంతుడులేడను బౌద్ధబోధ -ర్ధము కాలేదు. శనికన్న గురువు బలవంతుడగుటచే, ఆతడు భగవంతుడయ్యెను గురువుకన్న బుద్ధదేవుడు బలవంతుడైనవాడు కదా ఆతడు భగవంతుడగుట, ఇటుల ఆమె వాదించుకొనును. శని, గురువులు యవనదేవతలు. హెరాక్లీసు మనుష్యుడే దేవుడైనాడు. డైనోసీయసు మేరుపర్వత నివాసియని గ్రీకులవాదన.

యవనులు భారతదేశమువచ్చి యచ్చట అర్యసంప్రదాయముల వర్గము చేసికొనలేక ఎట్లో కొన్నిటిసమన్వయ మొనర్చుకొనిరి. భారతీయుల మహేశ్వరుడే వారి జ్యూస్. [ద్యౌఃపిత] మహేశ్వరుని అంకమునుండి డైనోతయసు అను స్కంధుడు పుట్టినాడు.



# వింశతి ప్రకరణము

## ముగ్ధకోపన

యవనులు భారతీయ దివ్యప్రపంచమును, వేదాంతమును ఏమియు అర్థముచేసికొనలేకపోయిరి. అందుకనియే ఎన్నియో యవకతవక భావములు వారి కుద్భవిల్లినవి.

ముక్తావళీదేవికి తన యన్న మొదలగువారికన్న భారతీయభావములు ఎక్కువగ అర్థమైనను, తన మనుమరాలు తాను భిక్కుణియగుదునని యనుట ఏలనో అవగాహము చేసికొనలేదు. ఆడవారు సన్యాసులగుటయేమి పురుషులయిన నేల సన్యాసింపవలెను!

సువర్ణశ్రీ వచ్చుటతోడనే హిమబిందు లేచి, యాతనికడకు వచ్చి "ఓ శిల్పిశేఖరా! ఇన్నిదినములు ఆలస్యముచేసివచ్చిన మీయుద్దేశమేమి? యుద్ధమున నంతవెర్రిప్రేమ ఎక్కడినుంచి వచ్చినది? ఉత్తమకళలన్నియు మరచిపోదురా. మీరును గోండులవలె అడవి మనుష్యులగుదురా?" యని ప్రశ్నించెను.

ముక్తావళీదేవి:— ఏమయ్యా, ఎంతకాలము మేమీ గ్రామమందుండుట? నాయనా! నీకింకను ఈ యుద్ధమునందు పాలు పంచుకొనవలయుననియే నా పట్టుదల. ఈ గ్రామమునందు మమ్ముంచుటవలన విరోధులెవరయిన గ్రహించి, మరల మమ్ముల నెత్తుకొనిపోవుదురేమో!

సువర్ణశ్రీ:— ఈగ్రామముచుట్టును మహావీరులైన గోండులు కావలికాయుచున్నారు. విరోధులెవ్వరు యీ గ్రామమునకు రాలేరు. వచ్చినవారు హతమారిపోవును. మీకేమియు భయములేదు. సంశప్తకులైన పదివేలగోండులు నాశనమైనగాని మిమ్మెవరు తేరిపారచూడగలరు?

హిమబిందు:— అమ్మమ్మా, నాకు ధాన్యకటకనగరము పోవుట కిచ్ఛలేదు. నాకీ అడవులలోనే ఉండిపోవలెనని యున్నది.

ముక్తా:— అది ఏమి, వెఱ్ఱితల్లీ, వట్టి మతిమాలినదానవై పోవుచున్నావు.



హిమ:— అమ్మమ్మా, నాకు మతిలేదు, నిజము. పిచ్చి ఎత్తుచున్నది. నేనీ అడవులలోనైన నుండవలయును. భిక్షుకురాలినైన గావలయును, లేనిచో దేహమును త్యజింపనైనవలయును.

ముక్తా:— ఛీ! ఛీ! ఎంతమాటంటివి. నీ వీ దినమున నామనస్సును పూర్తిగ పాడుచేయ దలచుకొంటివా తల్లీ! నా యీ ముసలితనంలో నిన్ను చూచుకొని బ్రతుకుచుంటిని. నీవలన నీతండ్రియు, నీతాతలును జీవములు నిలుపుకొనియున్నారు.

సువర్ణశ్రీ:— హిమబిందుకుమారీ! ఈ భయంకరసమయములో అట్టిమాటలనుట తగునా? ఈసాయంకాలము తూర్పునుండి చక్రవర్తి పంపిన ఆంధ్రసైన్యములు మాగురువులగు సోమదత్తాచార్యుల నాయకత్వమున వచ్చుచున్నవి. ఇంకను రెండు మూడు దినములలో ప్రభువులగు శ్రీకృష్ణసాతవాహనులు తమ సైన్యములతో పడమటదిక్కునుండి వచ్చుచున్నారు. ఆవెంటనే మిమ్మిరువురను పాటలీపుత్రమునకు సైన్యములిచ్చి పంపివేయగలను.

హిమ:— మీరట్లుపంపివేయునది నా శవమును మాత్రము.

సువర్ణ:— బుద్ధా! బుద్ధా! ఎంతమాటంటిరి, ఈ దినమున మీకీ విచిత్రచిత్తవృత్తి సంభవించినదేమి? హాస్యమునకైన అట్టిమాటలనగూడదు.

ముక్తా:— నేను ఏనూయియో, గోయియో చూచుకొనవలసియుండును. ఈదినమున హిమమాటలు నాహృదయమును బ్రద్దలుకొట్టుచున్నవి. నాకు తప్పక మూర్ఛవచ్చును మూర్ఛలో ప్రాణములు పోవును.

హిమ:— ఈ మహాసేనాధిపతి నన్ను పంపివేయునట! తన చెల్లెలితో ఆడుకొనిన నన్ను మీరు అని గౌరవించుచున్నారు. నేనేమియు మాటలాడను. నేననినమాటలన్నియు తప్పులు. మీయిష్టమువచ్చినట్లు చేయుడు నేనుపోయి పండుకొనెదను.

హిమబిందుకన్నుల నీరుగ్రమ్మ అతివేగమున పరుగిడిపోయి, మంచముపై గుభాలునపడి, వెక్కి వెక్కి ఏడువజొచ్చినది.

సువర్ణశ్రీ, ముక్తావళీదేవులు ఒకరిమొగమొకరు చూచుకొనిరి.

ముక్తా:— సువర్ణశ్రీ! నీఋణము మే మెప్పుడును తీర్చలేముతండ్రీ! నీవు గుహాబంధనమునుండి మమ్ము రక్షించినదినము మొదలు రెండు మూడు అహోరాత్రములు

ఆనందముచే పొంగి పొరలిపోయినది. నీవు మమ్మి గ్రామమున వదలి వెడలిన నాటి నుండియు అల్లరి ప్రారంభించినది. నేనాబంధనమున వృద్ధురాలగువరకు ఉండిపోయిన ఎంత బాగుండెడిది. అనుట మొదలుపెట్టినది తనకు పెండ్లివలదట, పెటాకులువలదట. ఏరాత్రియో లేచి తాను అడవులలోనికి పారిపోవునట. ఇంకను ఎన్నియో మాటలని నన్ను భయంకరస్థితికి తీసుకొనిపోవుచున్నది.

సువర్ణ;— మామ్మగారూ! మరేమియు కలతనందకుడు. మీరు ధైర్యము వహించి ఉండనిచో ఆమెకింక దిక్కెవ్వరు? పరమసాధ్వియైన ఆమెతల్లి, శరీరము చాలించిన నాటనుండి మీరే ఆమెకు తల్లియైరి. చిన్నతనమున అనినమాటలకు అర్థము లేదు

ముక్తా;— తండ్రీ! నీవుమాత్రము చిన్నవాడవుకావా? నీ చరిత్రియే నాకద్భుతమగుచున్నది. మా గృహమున నీవు రచించిన శిల్పములు, చిత్రలేఖనములు చూచినాను, విశ్వబ్రహ్మవంశ జాతుడవైనందులకు, విశ్వబ్రహ్మయే నీలో అవతరించినాడు. ఇటు మహావీరుడవు, ఎన్ని మహాసైన్యములువచ్చిన ఆగుహను పట్టుకొనగలరు! నీవు మాళవులను చికాకుచేయు విధము అనన్యము. శక్తిమతీదేవి కడుపున అరిరత్నములు నీవై ఉద్భవించినవి తండ్రీ!

సువర్ణ;— మామ్మగారూ, నన్ను పొగడకండి,

ముక్తా:— నాయనా, హిమబిందును తండ్రి మహారాణిని చేయుచున్నాడు శ్రీకృష్ణసాతవాహనునకు మా అమ్మాయినీయ సంకల్పించినాడు! చక్రవర్తి కాదనలేడు. ఇదివరకే ఒప్పుకొనినాడని మా అల్లుడు చెప్పినారు. నాతల్లికి సర్వవిద్యలు తెలుసును. హిమ సంగీతము పాడుట నీవు వింటివో లేదో! ఏరాగముపాడిన తదనుగుణములయిన విచిత్రములు సంభవించును. శైలాలి కృశాశ్వసూత్రములామెకు కంఠస్థములు. గ్రామణి శాఖ్య అమ్మాయి వ్యాఖ్యానముతోకూడ చెప్పునది. జతులు, రాగములు, గాంధార గ్రామము, పరిమమహాశబ్దము ఆమెకు సంపూర్ణముగ తెలుసునుగదా! ఈతల్లి మృదంగము వాయించగలదు. వీణను స్పందించి ఆమె పాడునప్పుడు రాళ్ళేకరిగిపోవును. భరతనాట్య సూత్రములకు వన్నె తెచ్చునట్లు నాట్యమాడగలదుగదా! మా యవన దేశములలోగాని, మన ఖండమునందుగాని యిట్టి సుందరాంగియైన బాలికను ఎందును చూచియుండను నీవీరహస్యముగ్రహించియేజాబోలు నాతల్లిబొమ్మనులిఖించినావు,



సువర్ణశ్రీ:— మామ్మగారూ! హిమబిందుకన్న సకలభారతవర్షమునకు సామ్రాజ్ఞి కాదగినవారు వేరొక్కరులేరు. భగవంతుడామెను రక్షించి ఆమెను సామ్రాజ్ఞిని చేసి తీరునుగాక!

ముక్తా:— తండ్రీ! అదే నాకోరిక.

సువర్ణశ్రీ:— నేను అనుజ్ఞ తీసికొనెదను, మామ్మగారూ!

ముక్తా:— నీవు హిమబిందుతో చెప్పి మరియు వెళ్ళుము. లేదో నన్ను చంపివేయును

ముక్తావళీదేవికి హిమబిందు సువర్ణుని ప్రేమించుచున్నదని స్పష్టముగ తెలియును. ఒకనాడు ప్రేమించినవారి హృదయమునకు ప్రేమించు ఇతరుల హృదయములు స్పష్టముగ తెలియునుగదా! తాము గుహాలో బంధితులైయున్న సమయమున ఒక్కని మొహము హిమబిందు సువర్ణశ్రీ నేను తలంపకయుండలేదు సువర్ణశ్రీయే వచ్చి తమ్ము రక్షించునని ప్రతిదినము ఎన్నిసార్లో అనునది. వెనుక బాలనాగి మాటలవలననే హిమబిందు సువర్ణశ్రీని ప్రేమించుచున్నట్లు తాను గ్రహించినది ఇట్టి సంఘటన కలుగుట బుద్ధభగవానుని యిచ్ఛయేమో! తండ్రియేమో బాలికను శ్రీకృష్ణసాతవాహనునకీయ సంకల్పించినాడు. ఏమికానున్నదో!

ఈదేశమున బాలికలు తండ్రిమాట జవదాటరు. ప్రేమించినవారో ప్రేమించిన వారిని భర్తయని యనుకొందురు. నేను మాయొక్క ఈయవనదేశము యవనబాలికల కేమి తెలియును? వారు భోగప్రియులు. పురుషుని ఆటవస్తువులు. ఒకనికి భార్యగానుండి తాము కామించినవారితో రహస్య సంబంధము కలిగియుండుటకు యవనస్త్రీ వెఱవదు. ఆర్యస్త్రీలు ఎంతపవిత్రమైన హృదయముకలవారు. ఒప్పుకొని ఒకనిని పెండ్లిచేసికొనినచో తమ సర్వస్వమును వానికి ధారపోయుదురు. ఆ దివ్యధర్మము పాతివ్రత్యమట! ఎంత ఉత్కృష్టధర్మమిది! గ్రీకుదేవతలు, ఆంధ్రదేవతలు తనయందు ప్రేమగలవారగుటచే తన్నీవిధమున ఆర్యస్త్రీ నొనరించినారు,

ముక్తావళీదేవి యిట్లాలోచించుకొనుచు ఆబ్రాహ్మణుని గృహమున ముందటి సావిడినుండి దొడ్డిలోనికి వెడలిపోయినది, సువర్ణశ్రీ అదివరకే హిమబిందుకడకు పోయినాడు,

హిమబిందు మంచముపైనుండి వెక్కి, వెక్కి ఏడ్చుచున్నది. సువర్ణశ్రీ నెమ్మదిగ వచ్చినాడు. అస్పష్టస్వరమున "హిమబిందూ" అని పిలిచినాడు. హిమబిందు పలుకలేదు మరల స్వరము నింకకొంచెము హెచ్చించి సువర్ణశ్రీ "హిమబిందూ! నీవిట్టుల చేయుట న్యాయముకాదు. విధిసంఘటన ఎవరు తెలిసికొనగలరు? త్వరలో నీ తండ్రిగారికడకు నిన్ను పంపించెదను" అని అనెను. హిమబిందు మంచముపైనున్న దిండ్లకు మోమునొత్తుకొని కఠినస్వరమున "నీవు మా తండ్రిగారికడకు పంపనక్కరలేదయ్యా; సోమదత్తాచార్యులవారు వచ్చుచుంటిరని చెప్పియుంటివిగదా! వారే మా ప్రయాణమునకు వలయు ఏర్పాటులన్నియు చేయుదురు." అని మరియు రోదించినది.

సువర్ణశ్రీ కోపము నభినయించుచు, "అవును, నేను ప్రాణమునకైన వెరువక మిమ్ముల రక్షించితిని ఇప్పుడు నా అవసరమేమి మీకు? ఇక నాముఖమైన మీకు చూపించి మీమనస్సును కష్టపెట్టను లెమ్ము." అని ఖండితముగ ననెను, హిమబిందు నవ్వుచు లేచి కూర్చున్నది.

"నీవు రక్షించుటేమిటయ్యా, మహాబలగోండుని సహాయమున రక్షింపగలిగితివి. అదియు ఒకగొప్పయే? నీముఖమును నాకు చూపనక్కరలేదు. ఒకటిమాత్రము జ్ఞాపకముంచుకొనుము. ఈ జన్మమున నిక హిమబిందును ప్రాణముతో చూడలేవు"

సువర్ణశ్రీ ఎప్పుడును కంటనీరు పెట్టనివాడు కన్నుల నీరు గిఱ్ఱున తిరుగ ఆ నేలపై చతికిలబడిపోయి, రెండు చేతులు ముఖమున కడ్డము వేసికొని. కంటనీరు పెట్టుకొని. లేని చిరునవ్వు ముఖమునకు తెచ్చుకొని "హిమబిందూ, నీ వింత అల్లరిపిల్లవైనందుకు మాచెల్లెలివైనచో—? అవి ఏటి మాటలు?"



# ఏకవింశతి ప్రకరణము

## హిమాలయ శిఖర ప్రత్యక్షము

హిమబిందు సువర్ణశ్రీస్థితిని చూచినది. ఆశ్చర్యమునంది, మనస్సు వ్యాకులమునంద నాతనికడకువచ్చి, యాతని రెండుచేతులుపట్టి లేవనెత్తి, అతనికడ తాను మోకరించి. "ప్రభూ! మీరు దేవతలు! బోధిసత్వులు. నేను సమస్తదేవతలుసాక్షిగ బుద్ధభగవానుని సాక్షిగ సర్వధర్మములుసాక్షిగ ప్రతిజ్ఞచేయుచున్నాను! నేను వివాహమాడినచో. నాహృదయమునిండి, నా జీవితమే తానయి, నాఆత్మాధీశ్వరుడైన వానినే వివాహమాడుదును! లేనిచో నేను భైక్షుకదీక్షనంది బ్రహ్మచర్యసేవ చేయుచుందును. నా ప్రాణమును నేను ఎప్పుడును బలిగా సమర్పింపను" అని సువర్ణుని పాదములు పట్టి. అందమైన ఆ పాదములపై తన మోమునుంచి ముద్దుగొని, లేచి, 'యింక మీపనిపై మీరుపొండు" అని తెలిపినది.

సువర్ణశ్రీ సంభ్రమాశ్చర్య దివ్యానందములకు లోనై. సర్వము మరచి. పది క్షణముల్లో నిలువబడిపోయి, కన్ను అరమూతలుగా, సర్వము హిమబిందయిపోవ, పరమసుందర విగ్రహ స్వర్ణపాటలారుణకాంతులు, దీర్ఘ పక్ష్మాంచల వికీలకాంతులు, మంజిష్ఠ రాగసంశ్లిష్టసృక్కులరేఖాసమన్వితాధరోష్ఠ లోహితద్యుతులు తన్నలమివేయ చేతులు హృదయమున కద్దుకొని. అచ్చటనుండి కదలి ఎటుపోవుచున్నదియు తెలియక, యాకాపురీపథమున నే యా గ్రామాంచలముల పాటలు పాడుకొనుచు ప్రవహించు సుందర శైవాలినీతీరమునకుబోయి, ఆకొండలలో, ఆవనవృక్షములలో, ఆశిలలలో, ఆసాయంకాలము తాను దివ్యమూర్తియై. చంద్రలోకములోని సుధాకరునివలె అధివసించెను

అతని ఆనందము రూపరాగరహితమైనది. అతని ఆనందము సాయంకాల నటేశ్వర పాదపద్మపాటల వర్ణాంకితమైనది. అతని ఆనందము విశ్వపథ ప్రసారిత దివ్య శబ్దాదిత్యమైనది.

"ఓ దేవీ! నిన్ను వలచిన బ్రతుకు
నిన్ను కొలిచిన ఆత్మ
నిత్యమై లోకముల
సత్యమై నిలుచునే!

ఓ దేవీ! నిన్ను పాడిన కవియే,
నిన్ను మూర్తించుకొని
పూజించు శిల్పియే
పుణ్యమూర్తులు వారు!"

ఈ మహదానందము భౌతికోపాధియై తుచ్ఛమగునా? పురుషుడు స్త్రీని స్త్రీని పురుషుడు ప్రేమించుట, పూజించుట దోషమా! సిద్ధార్థుడు యశోధరాదేవిని ప్రేమించలేదా! పూజింపలేదా? వారి శృంగారపూజాఫలమై వరప్రసాది రోహిలుడు జన్మించలేదా?

జగదేకసుందరి హిమబిందు తన్ను ప్రేమించుచున్నది. ఇంకొకని ప్రేమించజాలనను భావమేనా తనకీయానందము ప్రసాదించినది. అది స్వార్థరూపమగు తుచ్ఛకామము కాదా? ఆ బాలిక శ్రీకృష్ణసాతవాహన మహారాజునకు జనకదత్తమైన పవిత్రమూర్తి తనకామె పవిత్రమూర్తిమాత్రము పూజాస్వరూపిణిమాత్రము.

హిమాలయ శ్వేతశృంగ దివ్యదర్శనము శిల్పికి పులకరము కలిగించునా, పరమదృశ్యము మోహించు కళాశీలి నీచభావసంకలితుడా? కాదు. శిల్పి ఎట్టి దివ్యమూర్తుల సృష్టింపగలడు? అసదృశ సౌందర్య మానవమూర్తి సందర్శన జనితహృదయభారములు. అసదృశ సౌందర్య ప్రకృతీవిలాస సందర్శన జనితభావముల విద్యుత్తు మొంది, ఒక అతిలోక సాదృశ్యనిర్మాణ మొనరించుకొని నిర్వాణాంచలపథాలకుబోవు అష్టమార్గావలంబియగు అర్హతుల దివ్యచిత్తవృత్తి ప్రమాణములుగైకొని రూపకల్పన చేయవలయునుగదా శిల్పి!



అందుకై మహాజీవితము శిల్పి జీవించివలయునుకదా! ఇంక తన శిల్పిజీవితము ఉత్తమపథాల నడుపగలుగునుగాక.

హిమబిందు పూజాపీఠస్థయగు దేవి ఆమె మహారాజ్ఞియగును సామ్రాజ్ఞి యగును. అట్టి మహోన్నతపదమునుండి, శిల్పిమాత్రుని నీచజీవితమున కా బాలికను దిగలాగుట మహాపాపమేయగును. హిమబిందు దేవీ-శ్రీకృష్ణసాతవాహన-జీవితప్రవాహసంగమము సర్వభారతవర్షమునకు కళ్యాణప్రదమైనది. అట్టిజగత్కల్యాణ పవిత్ర సంఘటనకే శిల్పివిఘ్నము సంకల్పించగలడు!

హిమబిందు మరల తన్ను చూడకుండుగాక. తానామె కంటబడకుండ యుద్ధవ్యవసాయదీక్షితుడైయున్నచో, సర్వము శుభాంతమగును. ఆవెనుక ఇచ్చటకు కొంతదూరమున మహాసంఘారామక్షేత్రమొకటి యున్నదట. అచ్చటికి దేశదేశములనుండి శిల్పులు వచ్చుచుండిరట. అందు తానొకడై బుద్ధభగవానుని అర్చించునుగాక.

ఆనిశ్చితమునకువచ్చి, గ్రామాభిముఖుడై పోవుచుండ, హిమబిందాతని కెదురైనది. అతని ఆశ్చర్యమునకు మేరలేదు.

"ఓ శిల్పీ, మీ శిల్పభావములకు పుంజములు సేకరించుకొనుటకాయేమి, ఈ సాయంకాల వాహ్యాళి వెడలినారు?"

"నానాట యటుండనిమ్ము. నీవీ సంధ్యాకాలపుమసక చీకట్లలో ఒంటిగా బయట వెడలితివేమి?"

"ఔను. నిర్భయము పురుషులసొమ్ము గడపకదలజాలని భీరుత్వం స్త్రీల కలంకారము."

"హిమబిందుకుమారీ! విరోధులెల్లయెడల నిండియుండిరని—"

"పదివేల గోండు స్నేహితులంతటా తామే యున్నారని నిర్భయమున వచ్చినాను. ఇదిగో వినండి—" అని హిమబిందు భరద్వాజపక్షివలె కూత వేసినది. వెంటనే సంపూర్ణాయుధోపేతులగు నలుగురు గోండులట ప్రత్యక్షమైరి.

సువర్ణశ్రీ వారినిజూచి, నవ్వుకొని 'ఈ రహస్య మెప్పుడు గ్రహించినావు. ఆకూత నీకెట్లు పట్టుబడినది?" యని ప్రశ్నించెను.

" మమ్ము గుహాబంధనమునుండి విడిపించుకొని తీసుకువచ్చునప్పుడు, మీరును, మహాబలగోండుయువరాజును సాంకేతికములపిలుచుకొనునప్పుడు నేనువినలేదుకాబోలు. మహాబలగోండుడు నాకు గురుత్వం చేసెను అన్నట్లు-మీరెప్పుడు నాకు చిత్రలేఖనము సంపూర్ణముగ నేర్పుటకు? ఇంకను పొద్దుపోలేదు. అదిగో ఆ సెలయేటిగట్టున రాతిపై కూర్చుందము. (గోండుభాషలో గోండులను జూచి) మీరుపోయి, ఈ పరిసరములనే కాచియుండుడు "

వారిరువురొక శిలాంతికముపై కూర్చుండిరి సువర్ణశ్రీ ఏమిమాటలాడగలడు హిమబిందు మూగనోముపట్టిన యాతని భావభరము నెఱింగి.

" శిల్పాచార్య! నేను రచించిన ఈపాట వినుడు." అని అత్యంతమనోహర స్వనమున.

"కుసుమ మొకటి అర్చనకై
కోసికొనె దొరకబాలిక,
మధుర సౌరభాంచితమై,
మధుపూర్ణము దానిఎడద.
పూజింపగ నాపుష్పము
పొలతితీసె, కుసుమములో
మధుపానం బొనరించెడి
భ్రమర మొకటి నామెచూచె.

అళిమూచూచిన పువ్విది
అర్చనకై పనికిరాదు.
అనుచుబాల అపుష్పము
అంజలితో వదలె నదిని.
అభృంగము అపుష్పము
అనందమై జీవితమై



ఆలలనూగి ప్షురుల తేలి
కలసిపోయినార్థు జలధి__"

అని పాడినది

ఆపాట ముగియునప్పటికి, హిమబిందు చిత్తవృత్తి యంతయు నాతని కవగతమైనది. ఆబాల

" శిల్పమూర్తి! నీవు సర్వకళాకోవిదుడవు. నీకు తెలియని మహత్తరరహస్యమే మున్నది. నాకు కొన్ని అనుమానములున్నవి తీర్పగలవా? "

" హిమబిందూ, నాకేమి తెలియును? శిల్పరహస్యములు మాజనకుడు తెలుపుచుండ వినవలెను. సర్వకళలకు దేశికులు వారు "

" అవును. సంఘారామవిద్యాపరిషత్తునందు మాకు వారు శిల్పసూత్రములు, నాట్యసూత్రములు, నందికేశ్వర నాట్యశాస్త్రము, గాంధర్వవిద్య-అన్నియు పాఠములుచెప్పినారు. నేను నిన్ను తీర్చుమనిన అనుమానములివి. ఒకరిని ప్రేమించి నీపై ఇంకొకరిని ప్రేమింపవలనుపడునా? ప్రేమింపకయే వివాహమాడదగునా? మనసు నీయకుండ మేనిచ్చుటపాపంకాదా? ఈ ప్రశ్నలే నాగుహాబంధన జీవితములో సర్వకాలము నాలోచించుకొనెడిదానను. ఇంకొకటి, ఈ ప్రశ్నల కుత్తరములిచ్చుముందు ఒకటి మరచిపోద్దు ప్రభూ! మనము పాటలీపుత్రము చేరువంతవరకు, నన్ను మీరు విడిచియుండకూడదు. ఎరుగుదురుగదా స్త్రీలు భీరువులని నన్నేకాకినిచేసిన ఏమగుదునోయని భయమగుచున్నది"

# ద్వావింశతి ప్రకరణము

## ఉజ్జయిని విడుదల

సోమదత్తాచార్యుని సైన్యము లొకవంకవచ్చి తాకినవి: ఇంకొకవంక గోండులువచ్చి తాకిరి. పోరు సంకులమయ్యెను. మాళవులు మహాభీకర సంగ్రామము చేసిరి ఆంధ్రసైన్యములన్నియు ఒక్క భయంకరాయుధరూపమునవచ్చి తాకినను, సోమదత్త, సువర్ణశ్రీ మహాబల గోండుల ధైర్యము రణకౌశలము వేలవేలు మూకల నాశనమొనర్చుచున్నను, మాళవసైన్యములు వెనుకంజ నిడుటలేదు.

దుర్గద్వారములు తెరచి సమవర్తి వినీతమతి శుకబాణాసులొక ప్రక్క మాళవుల రూపు మాపుచుండిరి.

యుద్ధము మూడుదినము లీవిధమున జరుగుచున్నప్పటికి శ్రీకృష్ణశాతవాహన మహారాజు ఏబదివేల సైన్యముతో మాళవుల పడమటిదిక్కునుండి వచ్చి తాకినాడు. ఆయోధనము ప్రళయతాండవమైనది. ద్వంద్వ యుద్ధమే అభిసంపాత విధానమైపోయినది.

సోమదత్తాచార్యుడు సైన్యములతో వచ్చుటతోడనే సువర్ణశ్రీ పోయి, యాతని పాదముల కౌగిలించినాడు. సోమదత్తుడు మహానందమున సువర్ణశ్రీని కౌగిలించుకొని "తండ్రీ హిమబిందును ముఖ్యముగ మంజుశ్రీ కుమారుని రక్షించినావట. నేను నిన్ను గూర్చి ఊహించినవన్నియు నిజముచేసినావు. ఎన్నడో మాయమైపోయిన మంజుశ్రీని తిరిగి సంపాదించియిచ్చిన నీసేవ ఆంధ్రసామ్రాజ్యము నుద్ధరించినది. నీవు నాకు ఉపసైన్యాధ్యక్షుడవు. మహాబలగోండుని సేనాపతిని చేయుచున్నాను. వ్యూహము తోమరస్వరూపము. ఈమూడులక్షల శత్రువులను నిశ్శేషముగానాశనముచేయవలయును. నేను సైన్యముఖమున, నీవు కుడివైపున, మహాబలుడు తన గోండులతో ఎడమవైపున. తక్కిన అధికారులందరు ఆయాస్థానములనుందురు." అని సోమదత్తుడు సువర్ణశ్రీని మహాబలుని కౌగిలించుకొని భద్రదంతావళము నధిష్ఠించి, సేనాముఖమునకు పోయెను.



ఆంధ్రులను తెరలు తెరలైవచ్చి మాళవు లెన్నిసారులు తాకినను తోమరవ్యూహమును మంత్రయైన చలింపక శత్రువ్యూహములోనికి చొచ్చుకుపోవుచుండెను.

ఆంధ్ర సైన్యములకు ఉజ్జయినీ నగరమునకు ఇక రెండున్నర క్రోశములు మాత్రమే యున్నది. ఇంతలో శ్రీకృష్ణశాతవాహనుడు మహావేగముతోవచ్చి పడమటిదిక్కున తాకుటయు మాళవసైన్యముల నాశనదేవత పరవళ్ళెత్తినది.

తమ సైన్యమునకు ఏడు గోరుతముల దూరమున శ్రీకృష్ణశాతవాహనుడు మహాసంభ్రమముతో విరోధులతాకి, విరోధి వ్యూహములోనికి చొచ్చుకు వచ్చుచున్నాడని తెల్సియగనె, సోమదత్తుడు సువర్ణశ్రీని పిలిచి "నాయనా. నీస్థానమున శతస్కంధు డుండును, నీవుపోయి మహారాజున కంగరక్షకాధిపతిగ పనిచేయుము. మాకు దారిలో చారులవలన తెలిసిన యుదంతమంతయు సమాలోచించిన స్థూలతిష్యులవారు, మాళవులు శివస్వాతి సుశర్మ శూరసేనపతి మొదలగువారు పుత్రుడన్న సార్వభౌముని, శ్రీకృష్ణశాతవాహన మహారాజును మడియించి, మంజుశ్రీ కుమారుని ధనకటక సింహాసన మెక్కించి, బౌద్ధధర్మమును నాశనముచేసి వేదధర్మమును తిరిగి నెలకొల్ప నెంచి యుండిరి. ఈవార్త చక్రవర్తికి వేగుపంపినాను. నీవా కుట్రను ఛేదించి ముక్కలు చేసినావు. సామ్రాజ్ఞి ఆనందదేవి నిన్నెంతకొనియాడునో! ఆమెకు మంజుశ్రీ యనిన అంతప్రేమ. మంజుశ్రీ నెచ్చట దాచినావు?"

"గురుదేవా! ఇది మీ ఆశీర్వచనము. ఇందు నాశక్తి ఏమియులేదు. మహాబలగోండుని సహాయము లేనిచో నేను కాలుకదల్పలేకపోయెడివాడను. హిమబిందు నిక్కడకు పదునొకండు గోరుతముల దూరముననున్న గ్రామమున నుంచినాను. అయిదువేల గోండులాగ్రామమును కాపాడుచున్నారు. ఆ గుహలో దొరకినవారి నందరిని చావగా మిగిలినవారిని బద్ధులచేసి గోండువనము పంపితిని. రాజకుమార శ్రీ శ్రీ మంజుశ్రీని దాదులతో బ్రాహ్మణులతో, బౌద్ధసన్యాసులతో ఎనిమిదివేలగోండులు రక్షణమున హిమబిందున్న గ్రామమునకు రెండుగోరుతముల దూరమున వేరొకగ్రామమున నుంచితిని. నేను మూడునాలుగు దినములకొకసారచ్చటకుపోయి, అన్నియువిచారించి రాజబాలకుని వినోదపరచి వచ్చుచుంటిని, నిన్న నేవారాబాలుని హిమబిందు ముక్తావళీ దేవులకడకు కొనిపోదురు."

"మొదటినుండియు హిమబిందు ముక్తావళుల కడనే యా ప్రభువును ఏల పెట్టితివికాదు?"

"మొదట హిమబిందుముక్తావళుల రక్షించి రక్షకులతో నా గ్రామము చేర్చినారు. దొరకినట్టి గుహాను గోండుల సహాయమున, పట్టుకొనగనందు మంజుశ్రీ దొరకినాడు. ఆబాలుని ఉజ్జయినీ ప్రాంతముల శిప్రానదీ తీరముననున్న స్థాలతిష్యులవారి యాశ్రమమున పెంచుచుండిరట. శాతవాహన సేనాధిపతియగు సమవర్తి ఉజ్జయిని చేరిన వెంటనే శత్రువులు మంజుశ్రీని గొనివచ్చి, ఆ గుహలో నుంచినారట. ఆబాలకు డెవరో హిమబిందునకు ముక్తావళీదేవికిని తెలియదట. అతని పెంచు బ్రాహ్మణి నిజమంతయు మాకు జెప్పినది. ఆమె చంద్రస్వామికి చెల్లెలట. మీ రెరుగుదురుకాదు ఆ చంద్రస్వామిని?"

"ఆ ఎరుగుదును. ఎంత అద్భుతమైన కుట్ర చేసినారు. సరే నీవు వెంటనే పోయి, నా ఆజ్ఞగా శ్రీకృష్ణశాతవాహన మహారాజును అంగరక్షకాధిపత్యము వహింపుము. శుభవార్తలన్నియు ప్రభువుతో చెప్పుము."

సువర్ణశ్రీ వెంటనే గురువుగారి సెలవునందెను. ఉజ్జయిని సైన్యముల తాను మహాబలగోండునితో చీకాకు పరచుదినములలో; తన ఉత్తమాశ్వమును గోండు దళము నుండి రప్పించుకొనియుండెను. నేడా మహాతురంగము నధిరోహించి, వేగముగ చుట్టుదారుల శ్రీకృష్ణశాతవాహనుని చేరబోయెను.

మధ్యాహ్నమునకు సువర్ణశ్రీ శ్రీకృష్ణ శాతవాహన మహారాజును కలిసికొని వీర నమస్కారమిడి, సోమదత్తులవారి భూర్జపత్రమందిచ్చెను. ప్రభువా పత్రము నామూలాగ్రముగ చదువుకొని, సువర్ణశ్రీని ఏనుగుపై నెక్కించుకొని గాఢముగ కౌగిలించుకొనెను.

"ఏమయ్యా. వృషభశకట పరీక్షయందు నీవే నెగ్గినావు. అన్నిట జయలక్ష్మి నిన్నే వరించుచున్నది. మా తమ్మునిగూడ రక్షించితివి. ఈ హారము లన్నియు, నీ మెడను వేయనా? మా కుటుంబము నీ ఋణము ఎట్లు తీర్చుకొనగలదు? జయ! ఆంధ్ర సామ్రాజ్య మహామాండలికా! హిమబిందును రక్షించి మా రాజ్యరనేమ కాపాడితివి! మాకు అంగరక్షకాధిపతివగుటయేకాదు, నిన్ను ఉపసైన్యాధ్యక్షునిగా నొనరించి



నాము. కాకుండకులవారితో సోమదత్తాచార్యులతో, వినీతమతి మండలేశ్వరులతో, శత్రుఘ్నులతో, అఘబలులతో, చిత్రకులతో జఘన్యులవారితో, సమవర్తితో సమానుడవైతివి. అఘబలప్రభువుని భరుకచ్ఛమున నుంచి వచ్చితిని. వారు లేనిలోటు నీవు తీర్చెదవుగాక" యని శ్రీకృష్ణసాతవాహనుడతి సంతోషమున నుడివెను.

మహారాజ దంతావళమునుండి దిగి సువర్ణశ్రీ తన యశ్వము నధిరోహించి ఉపసైన్యాధ్యక్ష చిహ్నాంకమైన ఛత్రము పతాకము ధరించు అంగరక్షకులు వెంటరా శ్రీకృష్ణసాతవాహనుని యనుమతిని సైన్యమును గరుడవ్యూహముగా తీర్చి, మాళవుల దాకెను.

మాళవులు చక్రవ్యూహాకారమున ఉజ్జయిని చుట్టును దట్టముగ గ్రమ్మి ఆ భేద నిధాన మవలంబించిరి. వారి సైన్యముల మొదటి శ్రేణిలో ఏనుగులు, వెనుక శ్రేణిలో ఏనుగుకు ఏనుగుకు మధ్య రథములు, ఆ వెనుక ఆశ్వికులు, వారిని పొదివి వెనుకకు కాల్బలములు, వారి వెనుక సర్వతోభద్రాదియంత్రముల దిబ్బలు. మహారథములు నుంచిరి. ఈ మహారథములు పదహేను ఇరువది హస్తముల ఎత్తున నుండును. ఆ వెనుక ఆశ్వికులు, కాల్బలములు. ఆ వెనుక ఏనుగులు మరల కాల్బలము, యంత్రముల దిబ్బలు, మహారథములు. ఆ వెనుక కాల్బలము ఏనుగులు మహాశకటములు. (మహాశకటములన పెద్దదూలములు, వానికి చక్రములుండును. ఆశకటము తోసుకొనిపోయి గోడలు, తలుపులు బద్దలుకొట్టుదురు.)

ఈ చక్రవ్యూహము పదిగోగతముల మందమున్నది. ఆ మందమున ఛురికవలె సోమదత్తుని సైన్యములు చొచ్చుకొని పోవుచున్నవి. చక్రవ్యూహమటుముక్కలగుచుండగానే ఇటు శ్రీకృష్ణసాతవాహనుని సైన్యముపై మాళవసైన్యములు విరుచుకుపడినవి. ఆ మహా సంగ్రామమభిసంపాతముగాక ఆహవమై, సమితియైపోయినది.

ఒక సారిగా శ్రీకృష్ణసాతవాహనునిపై పలువురు యోధు లురికిరి. ఆంధ్రసైనికులు, యోధులు, వీరవరులు తమ వ్యూహమును వదలరు. వారి క్రమశిక్షణ లోకప్రసిద్ధము. వారు చెక్కుచెదరరు.

పలువురు యోధు లిల్లుకవిసి, మహారాజుపై బాణములు పుంఖానుపుంఖములుగా బరపిరి. అంగరక్షకులు నిలిచి పోరుచు ప్రాణములు వదలి పడిపోవుచుండిరి. అప్పు డంగరక్షకాధిపతియైన సువర్ణశ్రీ విరోధులందరకు నెచటజూచిన నచట దానే ప్రత్యక్షమగుచు ఎడమచేతి భల్లమున పొడుచుచు, కుడిచేతి కత్తితో నరుకుచు, తన

కవచము తూంట్లుపడి గాయములగుటకూడ గణింపక రక్తసిక్తాంగుడై మహారాజు గజమును రక్షించుచుండెను.

ఆతని వెన్నంటి అంగరక్షక సైన్యము మహావిక్రమము చూపుచున్నది. మహారాజు చెవికంట లాగి వేసిన ఒక్కొక్క బాణము ఒక్కొక్కవీరుని ప్రాణము గొనుచున్నది

అప్పుడొక మహాగజముపై నెక్కి శివస్వాతి స్వయముగ చక్రవర్తి ఏనుగును తలపడినాడు. ఆ ఏనుగులు రెంటికి మహాయుద్ధమావహిల్లినది. తొండములవాల్చిన మహాగదలతో తాడించుకొన్నవి: భయంకర దంతముల పొడుచుకొన్నవి. చివర కుంభమును కుంభముతో దాకి, తొండములు పెనవైచికొని మహాయుద్ధ మొనరించుచుండ ఆంధ్రసైన్యముల నాహాకారము లుప్పతిల్లినవి.

కళింగసైన్యముల జయజయధ్వానములు మిన్నుముట్టినవి. సువర్ణశ్రీ మొదలగు అంగరక్షకులు, సేనాపతులు, వీరులు దూరముగ నిలిచి చూచుచుండిరి. ఇంతలో అందరు వలదనుచున్నను సువర్ణశ్రీ యంకట తన పరశువెత్తి గుఱ్ఱమును ముందుకురుముకించి, చిత్రగతుల శివస్వాతి మహాగజము కడకుపోయి, తన అశ్వమునకు హాని జరుగకుండ నడుపుచు, ఆగజమును పార్శ్వమునందు తాకినాడు. ఆతని హుంకారపూరిత గాఢపాతముల, నాగజకవచము బద్దలై, ఆ ఏనుగు పార్శ్వమునందు భయంకరమగు గాయమై రక్తము మహాప్రస్రవణమై ప్రవహించినది

ఆ గాఢగాతముచే ఏనుగు గాసిచెంది, వెనుకకుతిరిగి సువర్ణశ్రీని కదియుటయు, సువర్ణశ్రీ యందుకు సిద్ధముగ నుండుటచే ఒక్క మహాప్లుతమున తన బలమును కలిపినాడు. శ్రీకృష్ణుని గజము శివస్వాతిదంతావళమును క్రింద కూల్చినది. ఆంధ్రులు ఆకాశమంట జయజయధ్వానములు చేసిరి.

అదిమొదలు ఆంధ్రసైన్యములు రెండును ఒకజాములో ఒకటి నొకటి కలిసికొన్నవి. సమవర్తి, వినీతమతి, శుకబాణుడు నగరమునుండి తమ సైన్యములతో వచ్చితాకిరి. మాళవసైన్యములు పంచబంగాళమై పరుగువారుట ప్రారంభించినవి. రాత్రి మొదటియామమునకు శత్రువులు ఒకలక్ష హతమారిరి. తక్కినవారు పారిపోయిరి. వేలకువేలు ఆంధ్రసైన్యముల శరణుజొచ్చిరి. ఉజ్జయిని శత్రునిర్ముక్తమైనది.

# త్రయోవింశతి ప్రకరణము

## శుభవార్తలు

పాటలీపుత్రమును ముట్టడించి విజృంభించుచున్న చక్రవర్తికి, చారుగుప్తునకు సువర్ణశ్రీకుమారుడు హిమబిందు, మంజుశ్రీ, ముక్తావళీదేవుల రక్షించెననియు నచ్చట నుండి పదివేల గోండులతో ఉజ్జయినీపురమును జేరి మాళవులను నాశనముచేయుచు, నగరములోని ఆంధ్రసైన్యములకు ఒత్తిడి తగ్గించినాడనియు, సోమదత్తాచార్యులు తన సేనలతో వెళ్ళి ఉజ్జయినికడ మాళవుల తలపడినాడనియు వార్తలువచ్చినవి.

చారుగుప్తుని ఆనందము వర్ణనాతీతమైనది. ఆవార్త తెచ్చిన చారునికి పదివేల సువర్ణములు బహుమానమిచ్చెను. సైన్యముల నంటియున్న వివిధ భిక్షుకులకు మూడుదినములు అన్నదానము చేయ ఇంద్రగోపునకు ఆజ్ఞనిచ్చెను. ఒక్కొక్క సైనికునకు, మావటీనికి మూడేసిసువర్ణములీయ నేర్పాటులుగావించెను బుద్ధగయ క్షేత్రమునకు లక్షసువర్ణములు దానము పంపెను. బౌద్ధ సంఘారామములకు నెలదినముల గ్రాసములు అర్పింప నేర్పాటలు చేసెను. బ్రాహ్మణులకు గోదానాదికములు వేలకొలది చేసెను

శ్రీముఖసాతవాహన, ఆనంసరాణుల ఆనందము వర్ణనాతీతము. మంజుశ్రీ దొరకినాడని ఆనందమున, అమృతమందాకినియై మహారాణి, వార్త తెచ్చిన చారునికి నిలువుదోపిచ్చినది. అంతఃపుర పరిజనులకు దుకూలములు, ఆభరణములు పంచిపెట్టించెను. బౌద్ధభిక్షువులకు, బ్రాహ్మణులకు చక్రవర్తి పాటలీపుత్ర పరిసరముల నున్నంతకాలము సంతర్పణలు, సమారాధనలు జరుపవలయునని ఆజ్ఞయైనది. విజయానంతరము జరుగు మహోత్సవములకన్న నధికముగ ఆంధ్రసైన్యముల ఉత్సవములు జరిగినవి.

మంజుశ్రీకి బంధనవిముక్తి నొనరించిన మహావ్యక్తి సువర్ణశ్రీ యని తెలియగనే చక్రవర్తి ధర్మనందికి వార్తపంపి, తన మందిరమునకు రప్పించుకొని, యాతని కౌగిలించుకొనెను.

"ధర్మనందులవారూ, మీ పుత్రుడొనరించిన యుపకృతి మా జన్మమునందెవ్వుడును మరచిపోము. శకటపరీక్షయందు జయమందిననాడె యాతడు మహాపురుషుడని మే మూహించితిమి."

"ప్రభూ! తమకరుణ ఇది. మా వాడు వీరబలగోండమహారాజు తనయుడైన మహాబలగోండుని సహాయమున, రాజకుమారులను, సౌభాగ్యవతి హిమబిందును, మహాభాగుడగు కీర్తిగుప్తులవారి పత్ని ముక్తావళీదేవిని విడిపించినాడు. గోండులసహాయమే సర్వము సాధించినది."

"ఓహో! మంచివాడవయ్యా ధర్మనందీ! కుమారుని పరాక్రమము కప్పిపెట్టుకొనుచుంటివి కానిమ్ము! గోండులు మనకు స్నేహితులని, హిమబిందును వెదుకపోయిన మన సేనాపతులకేల తోచలేదు? గోండులసహాయముతో మీచిరంజీవి మాళవుల చికాకుపరచుచున్న విధాన మప్రతిమానమని శుకబాణులవారి కమ్మలో నున్నది. రావయ్యా మనము చారుగుప్తులవారికడకు పోవుదము" అని సింహాసనమునుండి లేచెను.

ఇంతలో నాజమువచ్చిన చారుడొకడును, వానివెంట సేనాపతి యొకడును ద్వారమున వేచియున్నా" రని ప్రతీహారిణియొర్తు జయధ్వానముపలికి, నమస్కరించి విన్నవించినది. సార్వభౌముడు త్వరితముగ నా చారుని కొనిరమ్మని ఆజ్ఞనిచ్చి మరల సింహాసన మధివసించెను. ధర్మనందియు తన యాసనముపై కూర్చుండెను.

చారుడును, సేనాపతియు లోనికివచ్చి సార్వభౌమునకు ధర్మనందికి వీరనమస్కారము లిడిరి. చారుడప్పుడు తన శిరస్త్రాణమున దాచియుంచిన భూర్జపత్రమును సార్వభౌమునకు మోకరించి యర్పించెను. సార్వభౌము డాలేఖను విప్పిచూచి "శుభము! శుభ" మని కేకవేసి, ముద్రాంకితము చూచి, "ధర్మనందీ! మా కుమారుడు శ్రీకృష్ణశాతవాహనమహారాజు వ్రాసిన యుత్తరమిది, దీనిని చదువుడు!" అని ధర్మనందిచేతి కిచ్చెను. సేనాపతిని కూర్చుండుడని యాజ్ఞనిచ్చుచు, చారుని తనకడకు రమ్మని తనకంఠ ముక్తావళినితీసి "నీవు తెచ్చిన శుభవార్తకిది మా బహుమాన" మని వానికొసంగెను.



ధర్మనంది యిట్లు చదివెను;

"మహాశాతవాహన వంశ భానులు శ్రీశ్రీశ్రీ శాతవాహన సార్వభౌములగు పితృపాదుల పాదారవిందములకు ప్రణమిల్లి, కుమారుడు శ్రీకృష్ణుడు మనవి చేసుకొనుచున్నాడు. ప్రభూ! ఉజ్జయిని ముట్టడి అంతమొందినది. మాళవపతి, శూరసేనపతులు పారిపోయిరి. శత్రుసైన్యములో మూడువంతు నాశనమైనవి. ఒకవంతు మాచే పట్టుపడినది. ఒకవంతు పారిపోయినది.

ఈ యుద్ధ విజయమునకు మొదటికారకుడు శిల్పచక్రవర్తియగు ధర్మనందులవారి తనయుడు సువర్ణశ్రీ. మహామండలేశ్వరుడు, ఉపసైన్యాధ్యక్షుడు నగు ఆకుమారుడే నా ప్రాణములు రక్షించినాడు. ఆతడే తమ్ములు మంజుశ్రీని రక్షించినట్లు శ్రీ సోమదత్తాచార్యులు తమకు మనవి లేఖను పంపియున్నారు. శ్రీ చారుగుప్తులవారి కొమార్తె శ్రీ హిమబిందు దేవిని, వారి ముత్తవ శ్రీ ముక్తావళీదేవిని రక్షించిన విధానము చిన్నతనమున మేము విన్న నరవాహనదత్త విద్యాధరచక్రవర్తి కథను జ్ఞప్తికి తెచ్చును. తదనంతరమున మహాబలగోండ కుమారప్రభువు సహాయముతో నర్మదానదీ కూలమున నున్న రహస్య కందరాంతర ప్రదేశమును పట్టుకొనినారు.

"సువర్ణశ్రీ కుమారవీరులు శ్రీ హిమబిందు దేవిని, శ్రీ ముక్తావళీదేవిని ప్రప్రథమమున రక్షించిన దాగుహానుండియే! ఆగుహ మనవారల కైవసమగుటతోడనే మా తమ్ములు మంజుశ్రీ ప్రభువందు దొరకినారు. మా అనుంగు తమ్ములు క్షేమము. శ్రీ అమ్మగారిని, శ్రీ నాన్నగారిని ఎప్పుడు చూచుట అని తొందర చేయుచున్నారు. తమ్ముల నెత్తుకవచ్చిన విరోధులు ఇన్ని సంవత్సరములు మహాప్రభువు వలెనే పెంచినారు. తమ్ములను దాచియుంచిన గుహ సుందర పాతాళమందిరమువలె ; నుండునట. ఆ మందిరము వేయిసంవత్సరములు వెదకినను ఏరును కనిపెట్టలేరట! అట్టిది సువర్ణశ్రీ కుమారులు కనిపెట్టినారు. నిన్నటియుద్ధమున నే నధివసించిన దంతావళము విరోధిగజముచే పరాజయమంది, నాశనమంద సిద్ధముగనున్న సమయమున, అదివరకే యుద్ధములంది అఖండవిక్రమము చూపుచు, సంశప్తక సమరమునాటి యర్జునునివలె విజృంభించియున్న సువర్ణశ్రీ, విరోధి ఏనుగుపై కవిసి భల్లెముచే దాని మేను గాడునట్లు నాటెను. నాగజ మప్పుడా దంతావళమును గూల్చినది. సువర్ణశ్రీకుమారు డట్లొనర్పకపోయినచో నేమయ్యెడిదోయని తలచుకొన్నచో నొడలు జలదరించుచున్నది. సువర్ణశ్రీకుమారుల నెంత పొగడినను చాలదు. ఆయనకు గాయములు చాలతగిలినవి. కాని మొప్పమే

మియుండెదా. గొండులావీరునికి వైద్యము చేయుచున్నారు మాతమ్ములు తమ్మును. అమ్మగారిని చూడ వాంఛించుచున్నారు. స్థౌలతిష్యులవారి కుట్రయేనట తమ్ముల తస్కరించుకొనిపో చేసినది. శ్రీ హిమబిందు కుమారియే సువర్ణశ్రీ మండలేశ్వరులకు సేవ చేయుచున్నది. తమ్ములు నిన్నటివరకు వారితో నుండెను. ఇప్పుడు నాకడ నున్నారు. స్థౌలతిష్యులవారు తమ్ములకు పండితులచే విద్యలు గరపించుచుండిరట. రాజద్రోహ నేరమునకు పాల్పడి, ఇప్పుడు శ్రీశ్రీ అమృతపాదార్హతుల కడనున్న చంద్రస్వామిగారి చెల్లెలును, భావమరిదియు తమ్ములకు పోషకులు. వారెన్నియో రహస్యములు మాకు నివేదించినారు. అవన్నియు తమ సముఖమునకే! వినీతమతుల మాళవప్రభు నొనరింప తమకు నా మనవి సమవర్తి శాతవాహనప్రభుని విదేహరాజ్యమునకు మహామండలేశ్వరుల నొనరింపను విన్నవించుచున్నాను. వినీతమతి ప్రభువును ఇచ్చట నేబదివేల సైన్యముతో నిలిపి, నేమందరము తమ పాదసన్నిధికి రేపటిదినమున బయలుదేరుచున్నాము. శుభవర్తమానములు శ్రీ చారుగుప్తులవారికి, శ్రీ ధర్మనందుల వారికి అందజేయ దేవరవారిని వేడుకొను పాదసేవకుడు కుమారుడు ఆనందపుత్ర శ్రీకృష్ణసాతవాహనుడు."

ఈ ఉత్తరము చదువుచున్నప్పుడే ధర్మనంది గొంత డగ్గుత్తికపడెను. అతని కన్నుల నీరు తిరిగినది. సార్వభౌముడు లేచి తనతో లేచిన ధర్మనందిని గాఢముగ కౌగిలించెను. "శిల్పసార్వభౌమా! మీ వంశమునకు సర్వదా మావంశము కృతజ్ఞము. మా పుత్రుకోర్వరను మాకు తిరిగి ఇచ్చిన మీపుత్రికి తిరిగి నేమేమి ఈయగలము. ఈ పాటలీపుత్రమున నాతడు మా ప్రతినిధియగుగాక!" యని ఉచ్చైస్స్వరమున బలికెను.

ధర్మనందియు ఆ శుభవర్తమానము కొనితెచ్చిన చారునికి తన కంఠహారము బహుమానమిడెను.

చక్రవర్తి ఆ చారుని కొనివచ్చిన సేనాపతిని ఉపసైన్యాధ్యక్షునిగ నొనరించి తనప్రక్కనున్న రవ్వల పొదిగిన ఛురికను బహుమానమిచ్చెను. ఆ చారుడు యాదార్వ వర్ణనాయకుడైనాడు.

ఆ దినమున మహోత్సవము లొనరింప చక్రవర్తి ఆజ్ఞలు. అంచెలపై గోరుతములు, గోరుతముల దూరముల వ్యాపించియున్న ఆంధ్రసైన్యము లన్నిటికి చేరినవి. పాటలు, నాటకములు, సంగీతసభలు, ఎన్నియో జరిగినవి.

ధర్మనంది తథాగతుని ప్రార్థించుచు ఆరాత్రి గడపెను.

# చతుర్వింశతి ప్రకరణము

## స్వప్నము

"మహాప్రభూ! నాకొమరిత హిమబిందును, యువరాజ శ్రీశ్రీ శ్రీకృష్ణసాతవాహన మహారాజునకు కళత్రముగ నర్పింప నేను ప్రభువుల నాజ్ఞ వేడుటయు తామందుకు సంతోషముగా నియ్యకొనిరి. శ్రీశ్రీశ్రీ ఆనందదేవి మహారాణివారును శుభమనినారు. ఈవిషయము శ్రీశ్రీశ్రీ యువరాజులవారికి తెలియజేయవలదా యని తెలిసికొనుటకు, తమకడకు వచ్చియున్నాను" అని చారుగుప్తుడు విన్నవించెను.

"వర్తకచక్రవర్తీ, శుభము. మీ యుద్దేశము నాకవగతమైనది. యువరాజును శ్రీ చిరంజీవి సౌభాగ్యవతి హిమబిందు కుమారియు ఉజ్జయిని కడ కలిసికొనిరిగాన అచ్చటికే యీశుభవార్త పంపినచో యువరాజునకు, రాగోదయమై, మనసంకల్ప మీడేరుట సుకరమగును."

"ప్రభూ! తాము చక్కగ నాలోచించినారు. నా హృదయమును తాము గ్రహించినారు."

"మంచిది! కాని తమపుత్రిక ఈవిషయ మెరుగునా?"

"ఎరుగును మహాప్రభూ! నేను ఈ చైత్రయాత్రకు బయలుదేరక పూర్వమే అమ్మాయికి తెలియజేసితిని. ఆమె ఆనందమందినది. ఇట్టిభర్త లభింపనుండ ఉప్పొంగని కన్యయుండునా?"

"మీతనయ అపురూపసుందరి యనియు, సకలగుణాభిరామ యనియు, సర్వశాస్త్ర పారంగతయనియు, నైకకళాకోవిదయనియు వింటిమి. ఈయేటి శకటపరీక్షా మహోత్సవమున నాట్యమాడిన బాలలలో నామె యొకరితకాదా?"

"సత్యము! సత్యము!"

"సంతోషము! ఆమె దివ్యబాల గగనమునుండి దిగివచ్చినట్లున్నది. అట్టిబాలిక మహారాణి యగుటచే ఆంధ్రదేశము మా పెద్దకోడలగుటవలన మాకులము గూడ తరించును."

చారుగుప్తుడు వెంటనే వ్రాయసకానిచే చక్రవర్తి శ్రీకృష్ణసాతవాహనునకీ శుభవార్త నందజేయునట్లు కమ్మను భూర్జపత్రముపై వ్రాయించి, అది సామ్రాట్టుకడకు పర్యవేక్షణకై పంపినాడు. చక్రవర్తియు నది చదివికొని శ్రీ శ్రీ శ్రీ కాళికీపుత్ర శ్రీముఖనామాంకిత ముద్రవేయించి, నమ్మినచారులచే వెంటనే యాశుభలేఖ పంపించ వలసినదిగ ముఖ్యమంత్రికి పంపెను

చారుగుప్తుడు చిరతరమగు తనకోరిక ఈడేరుసమయ మరుదెంచెనని ఆనందాకాశ పథసంచారి యయ్యెను.

ఈ సువర్ణశ్రీ రక్షింపక శ్రీకృష్ణసాతవాహనుడు రక్షించి యుండవలసినది, తనబాలికను. బాలికల హృదయము మైనమువంటిది. ఒక్కొక్క సమయములో బాలిక యొకనిజూచి మరులుగొనవచ్చును. అది ఆమె హృదయమున నెలకొన్నచో మఱి మరల్పజాలము. తనబాలిక శ్రీకృష్ణసాతవాహనుని చూచెను. అతడు మహావీరుడు. పరమసుందరుడు. భావిచక్రవర్తి. తనకోరిక బిడ్డకు దెలిపియే యున్నాడు. పెద్దలమాట జవదాటిఎరుగని ఆ సుశీల ఈపాటికి తనహృదయమంతయు యువరాజున కర్పించియుండును.

అందును స్థౌలతిష్యులవారు-అత్తగారగు శ్రీ ముక్తావళీదేవినికూడ తస్కరించి కొనిపోవుట మేలయినది. మామగారగు కీర్తిగుప్తులవారు, తనతండ్రిగారును తన అత్తగారును ఆలోచించికదా, ఈ మహాసంకల్పము పూనినది. ఆమె తన మనుమరాలిని వేయికన్నుల కాపాడుచుండును. హిమబిందును ఎత్తుకొనిపోవుటయు మంచిదయ్యెనది. ఉజ్జయినీ నగరముననే ఆబాలిక విజయరమా స్వయంవృతుడగు యువరాజును చూచును. అతడును అతిలోకసుందరియగు తనబాలికను చూచును.

చక్రవర్తి శుభవర్తమానమందగనె. శ్రీకృష్ణుని మనస్సు హిమబిందుపై సంపూర్ణముగ లగ్నమగును వారిరువురును కలసి పాటలీపుత్రమువరకు ప్రయాణముచేయుటయు ఈ కార్యమున కానుకూల్యము సంపాదించును.

పాటలీపుత్రము తమవశ మగుటతోడనే జరుగు సకల జంబూద్వీప పట్టాభిషేకోత్సవ సందర్భమున తన తనయునకు, శ్రీకృష్ణసాతవాహన మహారాజునకును ప్రధాన మంగళము జరుగగలదు. ఆ యుత్సవము లోకోత్తరమగుగాక.



చారుగుప్తుని పరిచారకుడొకడు లోనికి జనుదెంచి "స్వామీ! తమ్ము చూడ అమృత పాదార్హ్వాతులు చంద్రస్వామి ద్వితీయులై వచ్చుచున్నా" రని విన్నవించెను.

తోడనే చారుగుప్తుడు ఆసనమునుండి లేచి, ద్వారముకడకు వేగముగబోయి, ద్వారమును సమీపించిన అమృతపాదార్హ్వాతుల పదముల కెరగెను. లేచి చంద్రస్వామికి నమస్కరించెను.

అమృతపాదార్హ్వాతులు "బుద్ధ! బుద్ధ" యని యాశీర్వదించిరి. చంద్రస్వామి "దీర్ఘాయుష్మాన్ భవ. సంవాకల్ప సిద్ధిరస్తు" అని ఆశీర్వదించెను. వారందరు లోనికిబోయిరి

చారుగుప్తుడు:—దేశికులు ఈ శిష్యుని అనుగ్రహింప విచ్చేసినారు.

అమృతపాదార్హ్వాతులు.—వణిక్సార్వభౌమా! ఈ ప్రత్యూషమునందు నా కెన్నడురాని స్వప్నమొకటి వచ్చినది మీరు వేగమున నొక మహానగరమునకు బోవుచుండిరి. మీ హస్తముల పూలునిండిన పూర్ణకలశమున్నది. అట్లుపోవుచున్న మీకు నేనెదురైతినట. నాహస్తమున శ్వేతపన్నగి యొర్తున్నదట. తమ్మాపన్నగము చూచుటతోడనే కన్నులు కెంపులుగమ్మ బుసకొట్టుచు నాచేతినుండి జారి ఎదుట ఆడుచు నిలిచినదట నేను భయములేదనుచున్నను మీరు వెనుకకు తిరిగినారట. మీ హస్తములనున్న పూర్ణకుంభమును ఒక మహాగరుడుడు వేగముగ పరతెంచివచ్చి కాలదన్నుకొని పోయెనట. నాకు వెంటనే మెలకువవచ్చినది. నేను చంద్రస్వామి పండితుల ఆ స్వప్నభావము నడిగితిని. వారనునది నాకెంతయు నాశ్చర్యము గొల్పుచున్నది!

చారు:—వారేమనినారు స్వామీ?

అమృత:— వారే వచియింతురుగాక!

చంద్రస్వామి:—చారుగుప్తులవారూ! నాకు శ్రీ భగవానుని స్వప్నము విచారింప నొక్క విషయము తోచినది. కాని స్వప్నములు నిజమగునా?

అమృత:—అటులనకుడు! స్వప్నములు రానేరావు. వచ్చిన వానికేదియో పరమార్థముండును. అనారోగ్యకారణమున వచ్చుకలలకు అర్థముండకపోవచ్చుగాక. కొందరు ఆయుర్వేదపండితులు ఆ స్వప్నముల ననుసరించి, రోగమేదియో స్పష్టముగ తెలియవచ్చునందురు.

చారు:—పండితులవారూ! తమభావము తెలియజేయుడు.

చంద్ర:—చిత్తము. మీరు మహాసంకల్పమొకటి పూనినారు. ఆ సంకల్పము కొరుదారిని పోవును. అట్లుపోవుటకు కారణము శ్రీ శ్రీ భగవానులే. భగవానులనుట కన్న వారినుండి వెడలిన ఒక విచిత్ర సంఘటన కారణమగును. కావున నది శుభాంతము కాక తీరదు.

చారుగుప్తునకు ముచ్చెమటలు పోసినవి. నోట తడియారెను. గుండె దడదడ కొట్టుకొనెను. అమృతపాదార్హతులు చారుగుప్తుని తీక్ష్ణముగ నొక నిమేషమాత్రము చూచి, నవ్వుచు "ఏమండీ చారుగుప్తులవారూ! ఈ మాటలకే ఇంత భయపడుచున్నారా? స్వప్నములకు ధీరులు భయపడరు. భయపడవలసినది మనలోని కల్మషములకు కాదా? మనయత్నములు ఫలింపక అన్యథా యైనంతమాత్రమున, మానవుడు వ్యథలపాలు కావలసినదేనా? సర్వము శుభమునకే" యని అనునయించెను

చారుగుప్తుడు తేజోధైర్యము మోమున ప్రతిఫలింపజేసికొని, చిరునవ్వునవ్వుచు అమృతపాదార్హతులకు నమస్కరించి, "భగవానులవారీ శిష్యుని క్షమింతురుగాక. అందరము ప్రపంచము శాశ్వతమనుకొని కార్యముల నారంభింతుము. ఆ కార్యము భగ్నమైనచో వ్యాకులమొందుదుము. దుఃఖములకు వెరచు స్వభావము నాకులేదు. అయినను భయంకరమగు నొకవిషయము నా హృదయమును వ్రక్కలుచేసినది. ఆ విచారమును నా కన్నతల్లి హిమబిందును పెంచుకొనుటలో మరచిపోతిని. బిడ్డకు ఏమైన ఆపద వాటిల్లిన నాబ్రతుకు హుళక్కి!"

చంద్రస్వామి చారుగుప్తుని చూచి "వర్తకచక్రవర్తీ! నీతనయకేమియు హాని రాదు. ఆమె మహదానందము నందును. ఆమె ప్రపంచపూజ్యత నందును. ఆమెయు ఆమె భర్తయు లోకకల్యాణరూపులగుదురు. ఆమె భర్త ఎవరగుదురో ఆవ్యక్తిని నేను తెలియజేయలేనుగాని, ఈ కాలమునకు ముహూర్తము కట్టి చూచితిని. ఆమె భర్త దిగంత యశోవిశాలుడగును మహా విక్రముడు. శుద్ధసత్వరూపుడు. మనోవాక్కాయ బుద్ధ్యహంకారముల నాతని ప్రేమించి నిబాలిక పెండ్లియాడును" అని మోము పరమతేజమ్మున వెలుంగ దివ్యవాక్కులు పలికినాడు.

అమృత:—వర్తకచక్రవర్తీ! నీతనయ ఆనందముకన్న నీకు వేరు ఆనందమేమి యవసరము?

చారు:—నిజము భగవాన్, నాతనయ ఆనందమే నా యానందము.

# పంచవింశతి ప్రకరణము

## ఎవరు మహారాణి కావలసినది?

ఉజ్జయిని శత్రువిముక్తమైన పదునైదురోజులకు శ్రీముఖసాతవాహనుని లేఖ శ్రీకృష్ణసాతవాహనునకు అందినది. ఆలేఖ చదువుకొనుటతోడనే యత్యాశ్చర్యమంది యువరాజు తనమందిరమున కూర్చుండలేకపోయినాడు.

"మాకుమారులు చిరంజీవులు యువరాజు శ్రీ శ్రీకృష్ణసాతవాహన మహారాజును ఆశీర్వదించి వ్రాయునది. తండ్రీ! మీ విజయమునకు మేమెంతయు సంతసించితిమి. ఇచ్చట మహోత్సవములెన్నియేవి జరుగుచున్నవి. అన్నిటికన్న ముఖ్యమగ సంతోషవార్త చారుగుప్తుని తనయను శత్రువులబారినుండి రక్షించుట. ఆ బాలికతోపాటు శ్రీ ముక్తావళీదేవిగారును రక్షింపబడుట. మీతమ్ముడు చిరంజీవి శ్రీ మంజుశ్రీ కుమారుడు కందరమున దొరకుట అద్భుతవిషయము. మీతల్లి యానందముచే మైమరచిపోయినది. మాకును అత్యానందము కలిగినది.

"చారుగుప్తులవారిని మీరెరిగియేయుందురు. భూమికి ఆదిశేషువాధారమైనట్లు శాతవాహనవంశమునకు చారుగుప్తులవారాధారులు. అన్నివిధముల వారు మనవంశమునకు అతి సన్నిహితులైనారు. వారికి ఒకర్తె తనయ. ఆమెయేకదా హిమబిందుకుమారి. ఆబాలిక మహాలక్ష్మి. ప్రజ్ఞాపారమితాదేవి అవతారము. సౌందర్యమున ఆమెకు ఎవరు దీటురాగలరు? అన్నిట ఆమెకామెయే సాటి. శాతవాహన వంశమునకు కీర్తిని, తేజస్సును కొనిరాగలిగిన ఆబాలికను మీకు దేవేరిగా సమర్పింప చారుగుప్తులవారు మాఅనుజ్ఞ వేడినారు. మేమును మీ తల్లిగారును తత్క్షణ మంగీకరించితిమి. అట్టి సుగుణరాశిని, అతిలోకసుందరిని భావ్యసామ్రాజ్ఞిగా బడయగలుగుట మహాభాగ్యము. కుమారా. మిమ్ములనందర త్వరలో కలుసుకొన కుతూహలము నందుచున్నాము. ఇట్లు శ్రీ శ్రీ శ్రీ కౌశకీపుత్ర శ్రీముఖ నామాంకితము.

ఈ కమ్మ శ్రీకృష్ణసాతవాహనుని సంపూర్ణముగ కలంచినది. తాను హిమబిందు కుమారిని సువర్ణశ్రీ శకటవిజయమందిన దినమున చూచినాడు. ఆమె అద్భుత సౌంద

ర్యవతి యనుమాట నిజము, కాని ఆ సౌందర్యము తనకాశ్చర్యము మాత్రము కలిగించినది. ఆమెయందు యవనసౌందర్యము, ఆంధ్రసౌందర్యము మధురముగ మిశ్రమమందినవి. కాని ఆమెను తానానాడు చూచినప్పుడు తనలోని రసార్చనమైన పులకరింప లేదు. ఆమెనొక దేవీవిగ్రహముగ జూచు భావమైన తనకు కలుగలేదు. మహాశిల్పి విన్యస్తమగు చైత్యాలంకార శిల్పముగ మాత్రమామె తనకు ప్రత్యక్షమైనది. తాను అనేకులగు ప్రభుకుమారులవలె కామోపభోగములు వాంఛింపలేదు. తన ఆత్మేశ్వరి దివ్యదర్శన మగునంతవరకు తనలో ప్రణయభావ మంకురింప నేలేదు.

ఆబాలిక, ఎవరామె? ఆమె విషకన్యయా? - మృతకన్యయా!

"ఓ దేవీ! మహోజ్వలమూర్తీ! నీవు నాకీ జన్మమున ప్రత్యక్షను కాకయున్నచో నేనీయుద్ధమున ఏ శివస్వాతిబాణముననో ప్రాణములువదలి యుండుదును. ఓదివ్యసుందరగాత్రీ! ఓ పరమ వనితావతారమా! ఇన్నాళ్ళు నీవు దాగియున్నది నాకొరకేనా? విన్ను నాపై ప్రయోగించుట నా అమరత్వమునకే! నాకు నీ దర్శనమే కాకయుండినచో ఆంధ్ర సామ్రాజ్యమునకును నాకును సంబంధమే లేకయుండును!"

అని తనలో తాను మాట్లాడుచు విషవైద్యునకు వినతిపంపెను, ఆ విషవైద్యుడు మహారాజు పాలిటికి బోధిసత్వుడే! విషవైద్యుడు తన సమ్మతిని పంపినాడు. శ్రీకృష్ణుడు ఉజ్జయినిలో తాను నివసించు మహారాజభవనమున కనతి దూరమున మందిరమునందా ధన్వంతరికి విడిది సమకూర్చెను. ఆ ధన్వంతరి భవనము నంటియే అంతఃపుర మొకటి యున్నది. అందు విషబాల నివాసము,

విషబాల సౌందర్యమిప్పుడు వర్ణనాతీతము. మధుర పరిమళ పూరిత హిమవాలుకా రూపమందిన సౌదామనివంటి ఆబాల! విషరహిత దివ్యపన్నగియై ఆబాల నిష్కంటక కేతకీ పుష్పమై! తనచేతికందు టెన్నడో!

కాని ఆమెలో విషములింకను తగ్గలేదు ఆమెకడకు వెళ్ళిన ప్రాణి కొలది కాలములో నశించును. ఆమె సంస్పృష్టినందిన ప్రాణి అందర్ధకాలమున నశించును ఆమెచే లాలింపబడిన శుకశారికాహరిణాది ప్రాణులు వెంబనే ప్రాణములు గోల్పోవును.



విషవైద్యునికడకు పోయి, శ్రీకృష్ణుడా ఋషిసత్తమునకు నమస్కృతులిడి యచట నొక యాసనముపై నధివసించి.

"స్వామీ! ఆ చంద్రబాలాదేవిని దర్శించి మూడు దినములయినది, ఏడు దినములు ఆ రాణిని దర్శింపకుండుట యాతన యగుచున్నది. ఈ దినమాదేవిని దర్శించి తీరవలయును"

ప్రభూ! ఏడుదినములోపిక పట్టుడు"

"నిజమేకాని ఈలోపల అత్యవసర విషయమొకటి వచ్చినది. నేనా దేవిని చూడకతీరదు. మీ విద్య యంతయు ప్రదర్శించు సమయమరుదెంచినది స్వామీ!"

"చిత్తము! అటులయిన నాకొక జామువ్యవధి దయచేయించవలయును. దివ్య ఓషధులు వారిచే సేవింపవలయును. నేను దినదినము తమకిడు ఔషధములేగాక,

ఇంకను మాధురకముల చూర్ణములు అమృతఫల సురచే సేవింపచేయవలయు, వత్సాదని, సోమవల్లి, నిర్గుండి, శ్వేతసురస, మధూలికా, కర్పూరసిలాజిత్తు, ఇంకను హిమపర్వతోద్భవములగు తొమ్మిది మూలికలతోడను రచించి అమృతమగు మహౌషధమును తమ కర్పింపవలయును, అటువెనుక, దివ్యలేపము తమ ఒడలికి అలందవలయును ఇంత తతంగమైనగాని తామాబాలికను సందర్శింప కూడదు. తమకు ఏడుదినములకొకసారి ఇచ్చు ఔషధములు దేహలేపములు ఇప్పుడు చాలవు,"

"మంచిది స్వామీ! అవియన్నియు చేయుడు"

ఈ తతంగమునన్నియు నెరవేరినవెనుక, జామున్నర ప్రొద్దెక్కిన తరువాత శ్రీకృష్ణసాతవాహనుడు విషకన్యకను చూడబోయెను. అతనిహృదయము మహావేగమున కొట్టుకొనుచుండెను. అతనికేదియో వివశత్వము, అతన్నికేదియో మహామధుర పరిమళస్పర్శ.

అతడా బాలికను చూడబోవునప్పుడెల్ల ఈ దివ్యానుభూతికలుగును ఆ అరణ్యమున నాబాలిక తనకు పెన్నిధివలె దొరికినదని యువరాజు భావించినాడు ఎన్ని నాళ్ళు తానీపవిత్రఫలమునకై ఆవేదనపడినాడు ఈ బాలిక విషకన్యకయగుటయే తన తపఃఫలమా? ఈబాలకై తానింతకాలము ఎదురుచూచినది ఆ హిమబిందునుద్వా

పామాడుటకేనా? ఇప్పటికి రెండుమూడు తరములనుండి సాతవాహనులేక పత్నీవ్రతులై లోకారాధన మొనరించిరి. తనకుమాత్రమిరువురు భార్యలేల?

ఆ విషకన్య దొరికిననాటనుండియు నీ యుద్ధయాత్రలో దన వెంట నేయున్నది. ఆమె శిబిరములువేరు. పాములవారిని, విషవైద్యులను ముగ్గురు నలుగురు పనికత్తెలను ఆమె సేవకై నియమించిరి. వారికిని విరుగుడు ఔషధములసేవ సర్వకాలముల నుండవలయును. ఒక్కొక్క సేవకురాలు ఏడుదినములకన్న ఆ విషకన్యకకడ ఎక్కువ కాలము సేవయందుండరాదు. సేవ చేసివచ్చిన సేవకురాలు, రెండు నెలలు వైద్యమొనరించుకొనవలెను. అందుకనియే విషవైద్యులు విషకన్యకకడ ముగ్గురికన్న ఒక్కొక్కసారి ఎక్కువ పరిజనులుండకుండ కట్టుదిట్టము చేసిరి.

వారందరు పాములవారిస్త్రీలే. అటుల వంతులుగా సేవచేయు వనితలు నలుబదిమంది ఏర్పాటు కావింపబడిరి వారందరికి శుభ్రవస్త్రములు ఆభరణములు ఒసగబడినవి. వారికి నాగరికత అలవరింపజేసినారు. ఒక మహారాజకుమారికడనుండు ప్రతీహారిణులవలె, చెలులవలె వారపరిమత్తులై చరించుట నభ్యసించిరి.

విషకన్యకాంతికమున పనిచేయువారుగాక తక్కినవారందరు, ఆభవనమునందు వేరువేరు పనులుచేయవలెను. విషకన్యకకు వంట చేయుటకు ఒక బ్రాహ్మణ కుటుంబము నే నుంచిరి.

ఆవాడు శ్రీకృష్ణసాతవాహనుడు విషకన్యకా దర్శనార్థియైపోవును ఈ బాలికయా, హిమబిందా. సాతవాహన రాజవంశమందు వధువుగ నడుగు పెట్టును అని ప్రతిజ్ఞ చేసికొనెను.



# షడ్వింశతి ప్రకరణము

## వీణాగానము

విషకన్యక శ్రీకృష్ణసాతవాహనుడు తనకడకు వచ్చుటకుముందు వీణవాయించుచు ఆనందమందుచుండెను. ఆమెచేతనున్న వీణ కాండవీణ. కాండవీణ, కర్కరి, 'వాణవీణ' వేదవాద్యములు ఆంధ్రులకు కాండవీణయనిన పరమప్రేమ. వారు కాండవీణను మయూరిగానొనర్చి రత్నఖచితముచేసి, పన్నెండు స్వరభేదములకు పన్నెండు తీగెలను బిగించెదరు. ఆవీణ ఎక్కుపెట్టిన ధనస్సువలె వంగియుండును. ఏమేళము వాంఛింతురో ఆమేళమునకు సరిపోవునట్లుగ తీగలన్నియు శ్రుతి కలుపవలెను.

విషకన్యకను వేదసంప్రదాయసిద్ధమైన సామగానమే స్థాలతిష్యులు నేర్పించినారు. వేదగానసంప్రదాయమునకు వ్యతిరిక్తము లౌకికవిధానము. బ్రాహ్మణగానవిద్యావిశారదులకు ఆర్షసంప్రదాయము బౌద్ధులకు లౌకికవిధానము ప్రీతికరములు. సాతవాహనులు బ్రాహ్మణులు బౌద్ధులును. కాన వారికి రెండు సంప్రదాయములు ప్రేమపాత్రములే.

లౌకిక సంప్రదాయమున ఆంధ్రులు శుద్ధస్వరములతో కనకాంగి మూర్ఛనను లోకమున వెదజల్లిరి.

సామగానమున తారాశ్రుతినుండి మందరమునకు వచ్చి దిగుదురు. లౌకికమున మందరమునుండి తారకుపోదురు. సామము అవరోహణము. లౌకికము ఆరోహణము.

లౌకికమున మాగధులొక విధానమవలంబించిరి. ఆంధ్రులు మరియొక విధాన మవలంబించిరి. ఔత్తరాహులు మధ్యగ్రామవాదులు, పంచమము సాందీపినియై మూడవ శ్రుతిస్థానము చెందును ఆంధ్రులు షడ్జగ్రామవాదులు పంచమము నాలుగు శ్రుతులలో ఈ గ్రామము మహదానంద స్వరూపమైనది.

ఆర్షమగు సామగానమున 'వాణవీణ' ఎక్కువగ నుపయోగించెదరు. సామగానరీతిని వివిధములగు పాటలుపాడువారికి చతుస్స్వరయుక్తమున సంవాదియై, వాదియై వివాదియై తోడిరాగమున పాటలుపాడుదురు అవరోహణ ప్రారంభములే ఈ పాట

లుచు. ఈ పాటకులును ఉద్ధాత అనుద్ధాత సర్వసంయుక్తముగనె పాడుదురు కాని వీరు సామగానమునందువలె మందరాతిస్వార్యములు లేక పాడుదురు.

భారతయుద్ధానంతరమున కలిగిన మహాప్రళయమునను జాతిసంకరమునను లౌకిక విధానము పెరిగిపోయినది. బౌద్ధమతము దానిని ప్రోత్సహించినది. కాని బౌద్ధులైన ఆంధ్రశాతవాహనుల కాలమువచ్చువరకు దానికి ఎక్కువపోషణ లేకపోయినది. అతిపురాతనమగు వేద సంప్రదాయము నాశనమగుచున్నదని స్థౌలతిష్యులు మహాపండితులచే పరిష్కరింపజేసి నిషాదస్వర ప్రారంభమగు సామగాన గ్రామవిధానమున సంగీతశాస్త్రమును పరిమభివృద్ధి నందింపజేసిరి. సామగానమున కైలాసేశ్వరునైన నాట్యము చేయింపగలదు విషకన్యక.

అంతర్గాంధార యుక్తమై, ఔడవమైన ఆభోగిరాగముతో సామగాన వాగ్గమున:—

“నీవే శివ వల్ల
నేనే నీ పదపూజను
మానవమునై వ్రాలెదనిట.
గానములోనే రాగమునీవై
రాగములోనే స్వరమును నేనై
దివ్యములగు నీ చూపులె ఈశా
దీనను నను మండింపగలేవా! నీవే”

ఆపాట పాడుకొనుచుండగనే ఆమె కన్నుల నీరు పద్మములందు చేరిన హిమబిందువులవలె మిలమిల లాడిపోయినది తన జన్మసాఫల్యమునకు ఈ కృష్ణశాతవాహన మహారాజు అవతారమెత్తిన పరమశివుడు. హాలాహలమును ఈశానుడు తనకంఠమున నిలిపికొన్నాడట. హాలాహల విషసదృశయైన తన్ను తనపాదములకైన నా ఈశానుడు పిలుపుకొనునా? కాలకూట విషవదనమగు మహానాగమతనికి అలంకారమట. తన ఈ ఈశానునకు తానలంకారమెట్లగును? అతడమృత స్వరూపుడు. తాను మృత్యుకల. పరమేశ్వరుడు తన్నీ దివ్యమూర్తికి ఏల దృశ్యముచేసినాడు. ఆ మహారణ్యమున దుర్భరతపసాపరురాలైన తనకు అంతమేల వరముకాలేదు? ఈ దివ్యమూర్తికి తానెట్లు



సేవచేయగలదు. దూరముననుండియైన ఈ మహారాజుతో మాటలాడుటకు వీలులేదు. తనకు సేవచేయు నీ పరిచారికలే, మహర్షియైన ఆ వైద్యుని సహాయముపొందియు తన కడకు వచ్చుటకు గజగజ లాడిపోవుదురు. క్రిమికీటకాదులుకూడ తనకడకు వచ్చుటకు భయపడును.

తన్ను కుట్టిన చీమయు చచ్చిపోవునుగదా! తాను భవనగవాక్షములనుండి తోటలోనికి తొంగిచూచినప్పుడు ఆ తోటలోని బాలబాలికలు వెన్నెల కిరణములవలె ఎంతచక్కగ నాడుకొనుచుందురు. వారిదికూడా ఆనందము. జన్మము మృతితో అంతము కాదుగదా? అయినచో తానిదివరకే మరణమును హృదయమున కద్దుకొనియుండును. ఈ మహారాజు తన్ను ప్రేమించుచున్నాడు. అతని చూచిన మొదటి క్షత్తులోనే తననాథునిగ ప్రేమించినది.

ప్రేమ ఎంత దివ్యానందదాయకము. తనతాతగారు వచించిన మోక్షమున్నదియో లేదో, తెలియదు. ఆ మోక్షము శుద్ధానంద స్వరూపము! ఆ విషయమును గూర్చి తానేమి చర్చింపగలదు? కాని ఇన్నినాళ్ళకు తనకు నిజమగు ఆనందమేమియో తెలిసినది. శ్రీకృష్ణశాతవాహన మహారాజును నాశనముచేయ తన్ను ప్రయోగించినారు తాతగారు! ఆ శ్రీకృష్ణుని తానిట్లు ప్రేమించుటయేమి! ఇట్టిది జరుగునని భయమందియేకదా తన్ను ప్రయోగింపవలదని తాతగారిని తానాదినమున వేడికొనినది! తాతగారు చేసిన పనియు మంచిదేయైనది కాకున్న తానీ ప్రభువును, ఈ దివ్యమూర్తిని ఎట్లు చూడగలుగును? ప్రయోగమన, నాశనమన, ప్రేమయన ఏమిటియో అదివముల తనకు తెలియునవి కావు!

పాటమాని ఆలోచనావశయైయున్న విషకన్యకడకు శ్రీకృష్ణశాతవాహనుడు వచ్చినాడు. అతడు దివ్యునివలె భాసిల్లుచుండెను. అతడు వచ్చుటయు, చకితయై విషకన్యక లేచి, దూరముగనుండియే నమస్కరించుచు, మోకరిల్లినది.

శ్రీకృష్ణుని కన్నులవెంట నీరుతిరిగినది ఆమె అదిచూచినది.

విషకన్యక:—ప్రభూ! ఎందుకా కన్నులనీరు (ఆమె మాటలాడువిధమే ఈదినములలో మారిపోయినది.)

శ్రీకృష్ణశాతవాహనుడు:—దేవీ! నీకు సర్వసౌకర్యములు జరుగుచున్నవా?

విష:—వచ్చినప్పుడెల్ల అట్లడిగెదరు నాకేమిలోపమని? ఆలోపము నీ సౌకర్య

ములు తీర్చగలవా? అట్టి శంకతోడనా మీకన్నులనీరు?

శ్రీకృష్ణ:—అదికాదు చంద్రా! కన్నుల నేదియోపడి నీరుతిరిగినది. వేరుకారణములేదు. మీ తాతగారినిచూడ నీకు కోరిక పుట్టుటలేదా?

విష:—మా తాతగారిని నే నెట్లుచూడగలను. నాకేమియు ఆ ఆలోచనలు కలుగవుప్రభూ! మీరెందుకు ఈసారి పూర్తిగ ఏడుదినములు ముగియకుండగనె వచ్చినారు.

శ్రీకృష్ణ:—నేను ఏడుదినములు గడుపుట బ్రహ్మప్రళయమగుచున్నది. దినదినము చూచుటకు వీలులేకపోవుచున్నది.

విష:—అమ్మ! దినదినము నీవిషకీటకమును చూచుటకువచ్చి మీరేల ఆపదపాలగుదురు?

శ్రీకృష్ణ:—ఆపద సంభవించకుండ దినదినము నిన్నుచూచుటకు రావలెను. లేనిచో నా సర్వస్వము మహాసముద్రమున పడిపోవుచున్నది

విష:—(నవ్వుచు) అయినచో నావంటి యొక సాలభంజికను చేయించి, దానిని దినదినము చూచుకొనుచుండుడు.

శ్రీకృష్ణ:—సాలభంజికనా! ప్రతిమలు నాకెట్లు తృప్తినియ్యగలవు చంద్రికాబాలికా? నేను నిన్నే పూజింపవలయును.

విష:—నన్నా! నన్ను పూజింపకూడదు. పాముతో ఆటలాడెదరా? అగ్నిని ఒడిని ధరించెదరా? ఎవ్వరైనను మృత్యువును పూజించెదరా?

శ్రీకృష్ణ:—నీవు మృత్యువని ఎవరుచెప్పిరి?

విష:—మా తాతగారే యనిరి.

శ్రీకృష్ణ:—మీ తాతగారెంతమూర్ఖుడు. అంతతపస్వి ఇట్టిఘోరమున కెట్లు పాలయినాడు? ఆమాటలకేమి పోనిమ్ము. నీమందిరమునకు నేను వచ్చుచుండ నీవు దివ్యగాంధర్వ మాలాపించుచుంటివి. ఏదీ! వీణపై నాయీ సర్వవేదనలు మరచునట్లు వాయింపుము. చంద్రదేవీ! నీ గానచంద్రికామృతాస్వాదినై దివ్యత్వమందెదను గాక.

విషకన్యక సంతోషమున, సిగ్గున తన రత్నకంబళిపై నధివసించి యాకాండవీణను చేతదాల్చి మధురసుధాగానాలాపన మారంభించినది



# సప్తవింశతి ప్రకరణము

## గాంధర్వ ప్రభావము

గీతిగానేన యోగస్స్యాత్ యోగాదేవ శివైక్యతా
గీతజ్ఞో యది యోగేన సయాతి పరమేశ్వరం.

(సూతసంహిత)

ఆమెకిప్పుడు గానమునకు పరమార్థము గోచరించినది. ఇంతకుమున్నామెకు పాటలు బాల్యక్రీడలు. యౌవనము వచ్చినవెనుక, పరభృతము తనవెంటికి మారులు గొల్పు విధమున, అప్రత్యక్షుడైయున్న తననాయకుని కొరకై ఆమె పాటలుపాడినది గానముచే కాలక్షేపము చేసినది.

నేడు నాయకుడు ప్రత్యక్షమైనాడు. ఇప్పుడామె సిందూజవ్వని. ఇప్పుడామె భక్తురాలు. ఆమెకు నాయకుడే భగవంతుడు, ఆమెకు భగవంతుని భావము, నాయకుని భావము వేరువేరుగా స్ఫురింపనేలేదు.

ఆమె ఆలపించిన భైరవిరాగము సామగానప్రాయము ఆమెకంఠమున వెన్నెలలు కురిసినవి. మల్లెలు, జాజులు శేఫాలికలు గుత్తులు గుత్తులై విరిసిపోయినవి. ఆమె నాదమున అమృతనదులు పొంగుచు, పొరలుచు, గట్టులమీరి ప్రవహించుచు వచ్చినవి.

ఆమె పాటపాడువిధానమున తారకాకాంతుల నొరసికొనిపోయి వెలుగువానలు కురియుచున్నట్లుండెను. పాటపాడు నామె పెదవులు, నాట్యమాడు కల్యబాలికా నృత్తగతులవలె నుండెను. తప్తజాంబూనదమున శోణవర్ణము కలసినట్లున్న యామె గళము, ఆమె పాడునప్పుడు, ముడుచుకొనియుండి విడివడబోవు బంగారు కమలకోరకముపై ఉదయార్క కిరణములు ప్రసరించినట్లుండెను.

ఆమె ఈకొలది దినములలో కొంచెము చిక్కినది. ఆమె ఈ నెలదినములలో కొంచెము పొడుగెదిగినది.

ఆమెలో నేదియోని యొక దివ్యమగు తృప్తి భాసమానమైపోయినది.

ఆమె అందము వర్ణనాతీతమగుటవలన ఆమె ప్రతిఅణువును మోక్షార్థుడగు మహర్షి వలె, శ్రీకృష్ణశాతవాహనుని కై ఆర్తి చెందుచుండెను.

ఆమె నీటినుండి వెలువడివచ్చి రెక్కలుచాచి ఎగిరిపోబోవు కొదమరాయంచ వలె నుండెను. ఆమె యజ్ఞశాలలో ఋత్విజుల సువర్ణపాత్రనుండి యజ్ఞాగ్నిలో నొలుకు సోమరసధారవలె నుండెను.

ఆమె ఆకాశమహాపథాల అఖండవేగమున తేలిపోవు తారకను వెన్నంటు కాంతి ప్రవాహమువలె నుండెను.

ఆమె ధరించిన బంగారు రంగువస్త్రములు దివ్యదుకూలమును ఆమె స్వర్ణకేసరపుష్పములు తలలో ధరించి కేశభారమును ఊర్ధ్వశిఖాస్వరూపమున ముడిచి యుండెను.

ఆమె మోము కోలనై, ఆమెకన్నులు అరమూతసోగలై, ఆమెనాసిక సముద్ఘుమై. ఆమెచెవులు బంగారు మేఘాల తరకలైనవి.

ఆమెలోని కాంతి, మోహినీదేవీ హస్తాంచితామృతకలశము. ఆమెలోని ప్రేమ పారిజాత సుమగర్భ కింజల్కము.

కాండవీణాతీగల స్పందించు నామె హస్తాంగుళులు, పూర్ణిమనాడు గగనమధ్యమున సంయోగమందు సూర్యచంద్రకిరణాలు.

అతంత్రీ వినుర్మక్తస్వరమున మేళవించి యాబాలిక

నీవుగలుగు టాత్మనమ్మి
నిలిచితి పూజాగృహమై
పన్నగేంద్ర భూష! నాకు
నిన్ను చూచుచుంట ముక్తి"

అని పాడినది.

ఎన్ని రూపులో వహించి
ఏగుదెంచు నిన్నెదుగక,
తలవాకిలి యొరజేసి
నిలిచియుంటి నీకొఱకై
నీవు......



నిన్ను పూజసేయుటదియె
నీకు సేవ సలుపుకాంక్ష
వరము, జన్మఫలము నాకు
పరమయోగమదియె నాథ!
నీవు......"

ఈ బాలిక నెట్లు తాను విడిచి యుండగలుగును? తనకు రాజ్యము లేల యువరాజత్వ మేల, ఈబాల తనరాణి కానిచో? ఈ బాలికామూర్తితో నిండిన తనహృదయమున వేరొక్క బాలిక రాణి ఎట్లగును? హిమబిందుకుమారి తనచెల్లెలు మాయాదేవి వలెనే కానుపించును దనకు.

తండ్రికి తానేమి ప్రతివచన మీయగలడు? తాను చారుగుప్తుని మోమెట్లు చూడగలడు? తనకు రాజ్యమేవలదు. మంజుశ్రీ రాజగుగాక. రాచపుట్టువు ఇంతటి పరతంత్రమా? వారు ప్రేమింపకూడదా? రాముడు సీతను ప్రేమించి యుద్వాహము కాలేదా? దశరథాదులు రాముని బలవంతము నెదిరించిరా? బోధిసత్వుడైన సిద్ధార్థుడు యశోధరాదేవిని కోరి తన అర్ధాంగిని చేసుకొనలేదా?

ఇంతకు, ఈమె అమృతకన్య యగుటెట్లు? లోకములో నీమెను తిరిగి విషరహితగా జేయువారెలేరా? స్థాలతిష్యులు చేయగలుగుదురా? కలిగినను అట్లు చేయుట కను మతింతురా? ఏదిమార్గము?

ఈబాల తనకు అర్ధాంగి యగుటకే వీలులేనిచో తాను సర్వస్వము వదలి బౌద్ధభిక్షువైపోవు, ఏసింహళమునకో చీనాదేశమునకో, త్రివిష్టపమునకో, వెడలిపోయి లోకమును, ధర్మమును ఆరాధించుటమేలు.

"ప్రభూ! నాపాట ఎట్లున్నది?"

"నీపాట సరస్వతీదేవీ వీణాగానమునకు పరీమళమును జల్లుచున్నది చంద్రబాలా!"

"ప్రభూ! ఏల మీరు నాకడకు పదియుసారులు వచ్చెదరు?"

"దేవీ! ఎంత చెలువు నీవు! నీవ నాసర్వస్వము; నేను నీవాడను నిన్నువిడిచి యెట్లు కేగుదును?

"మహారాజా! నేను మృత్యుదేవతను. నన్నేల కోరుదురు? నాకు మీనామ స్మరణమే చాలు. మీరూపమననమే చాలు ఈజన్మమున నాకింతకంటె భాగ్యములేదు. మిమ్ము దూరముననుండి పూజింపుదు, మీ నామము స్మరింపుదు. అగస్త్య నగనులవలె యోగినినై యుండెదను!"

"అప్పుడు నేనును నీతోడ యోగినై తపస్సు చేసుకొనెదను."

"మీ రాజ్య మేమగును?"

"నీవున్నచోటనే నా రాజ్యము."

"మహారాజా! నాకు రాజవైద్యులెన్నియో విషయములు చెప్పుచున్నారు. ఎంత చిత్రము ఈ ప్రపంచము! ఎన్ని సౌందర్యములగు విషయములున్నవి! నాయెదుట యామినీ తమస్సులు విడిపోయి. ఏదియో మహత్తర ప్రపంచము, ఎన్నియో అందముల పరిశ్యతమగుచున్నది. దీనిపై మీరు విరక్తి చెందనేల"?

"దేవీ! ఈ విచిత్రప్రపంచం నాకంటితో నీకుజూపి, నీ హృదయముతో నేను భవించినగదా రక్తి? కానినాడిదియెల్ల శుష్కమే నాకు."

"మీకంటితో ఎట్లు చూపింపగలరు?"

"ఈ సమిద్ధరము సముద్రయానము చేసి ఏవేవో విచిత్రతీరాలకు పోదుము. వనము హిమాలయ పథములకుపోయి, ఎన్నియో ఉదయముల దర్శింతము. మన మిరువురమే! నీవు నాచేయిపట్టుకొని. నేను నీ హృదయమున, నీవు నా బాహువులలో, నీవు నా సర్వస్వమునందు"

"ఓ దివ్యమూర్తీ! మీరువెళ్ళిన మహారాత్రమునుండి మీరువచ్చు దినముదాక మీకై ఎదురుచూతును. మీరువచ్చి వెళ్ళిపోదురు. మరలమీకై ఎదురుచూతును. ఈజన్మమున నాకిదియే మహాభాగ్యము"

"నన్నుచూచి, ఆనందశిఖర పథాంచితుడనై, వెళ్ళిపోదును. నీవె నా ఎదుటు. నీవె నా ఊహల. నీవె నా స్వప్నముల. నీవె నాహృదయమున నిన్నుచూతును. మరల వెళ్ళిపోదును. నేను వెళ్ళుదును, నాప్రాణము! నాఆత్మ. నీకడ ఆ నయనములలో, ఆ కపోలములలో, ఆపెదవులలో, ఆ లోచన పద్మాంచలములలో, ఆ పెదవుల రక్తములలో! ఎట్లు నిన్ను విడిచి యుండుదు?"



"నా ఆత్మేశ్వరా!"

"నా ఆత్మమూర్తీ! నాయీ కౌగిలింతకురా! ఈ దివ్యప్రేమలోనే ప్రాణము వీడుటకల్ల. నీ ప్రేమాబలమే నన్ను రక్షించును. నా పూజయే నిన్ను, నా పూజాపీఠముననున్న దేవిని నాహృదయమున చేర్చును!"

"వలదు దేవా! వలదు ముప్పము."

"ముప్పమైన నేమి. ప్రాణము పోయిననేమి? ఈ దివ్యానందానుభూతి కోరి మాద్రిదేవిని చేరిన పాండురాజు గాథ నెఱుగవా?"

"వద్దుప్రభూ! వద్దు. మీరటులనే యుండుడు నాపూజామూర్తికి, నా శివునకు, నా భగవంతునకు కళంకము రానీకుడు!"

శ్రీకృష్ణపాణివాహనుడు గడగడ వడంకి, కన్నులుమూసికొని, యామందిరము వెడలి అంగలువేసికొనుచు నడచిపోయెను. విషబాల నిల్వున కూలిపోయెను.



# అష్టావింశతి ప్రకరణము

## పునస్సందర్శనములు

పాటలీపుత్రముకడ పోరు మిన్నంటిపోవుచుండెను. ఒకదినము జరిగినకొలది ఆంధ్రుల ప్రతాపము, వేగము, ఉద్ధృతము, మిాదుమిక్కిలి యగుచున్నది. రాత్రిందినములు అరువదిగడియలు ఎడతెగని ఆ ముట్టడిచే అభేద్యమగు పాటలీపుత్రనగరము ఇంద్రుని వజ్రఘాతముచే కొండల రెక్కలు ముక్కలగుచున్నట్లు, ఒక కోట వెనక, వేరొకకోట మహానగరము చుట్టునున్న ఏడుకోటలు నశియయ్యెను

ఈ రెండునెలలలో ఆంధ్రసైన్యములు చెక్కుచెదరక, అలసత నొందక పోరాడుచున్నవి. సుశర్మ కాణ్వాయనుడు మొక్కవోని ధైర్యముచే పోరాడుచుండెను. ఉజ్జయినికడ ఓడిపోయిన మాళవసైన్యములలో పదివేలమంది కరకుమానిసిలు అమావాస్య చీకటిరాత్రులలో పాటలీపుత్రనగరములోనికి గంగపై పడవలలోవచ్చి చేరిరి.

వారు సుశర్మ చక్రవర్తికి, ఎంతయో ధైర్యము కొనివచ్చిరి. మాళవులలో పారిపోయివచ్చిన తక్కిన సైన్యములు, ఆంధ్రులను వెనుకనుండి చీకాకుపరచుచు నాశనము చేయుచు, పాటలీపుత్రముపై ఒత్తిడి తగ్గించెదమని మాటనిచ్చిరి

ఆ మాళవుల సైన్యములు మహావేగముతో వచ్చుట, ఆంధ్రుల నోమూల తాకుట, మరల నంత వేగముతోడనే వెడలిపోయి మాయమగుట, ఇట్టి యుద్ధవిధాన మవలంబించెను. ఆ యుద్ధవిధానమువలన ఆంధ్రులు చీకాకునందిరి. దాదాపుఒక వేయిమంది ఆంధ్రసైనికులు, అశ్వికులు నాశనమైరి.

అటుల రెండుసారులు జరుగునప్పటికి శ్వైత్రులవారు. కాండీర, శాక్తీక, యాష్టీక, నైస్త్రింశిక కాంతికాది, అశ్వికముఖ్యములను నూరింటిని జంఘాకరిక ముఖములుగా నేర్పాటుచేసి, మాళవాభిముఖముగా నంపి, వారి ఉనికితెలిసి వారిని తలపడుటకును వార్తాహారులచే తనకు వార్తలంపుటకును, ఏర్పాటుచేసెను.

ఇంతలో ఉజ్జయినినుండి శ్రీకృష్ణసాతవాహనుడు, మంజుశ్రీసాతవాహనుడు, సోమదత్తాచార్యులు, సమవర్తి, సువర్ణశ్రీ, హిమబిందు, ముక్తావళీదేవి, విషబాల, మహాబలగోండుడు మొదలగువారు సైన్యములతో పాటలీపుత్రము వచ్చిచేరిరి.



ఆంధ్రసైన్యముల మహోత్సవములు జరిగెను. చక్రవర్తియు, మహారాణియు కుమారుల నిద్దర కౌగిలించుకొనిరి.

మంజుశ్రీ ఎదిగినాడు. బాలుడు, తల్లిఒడిలో చేరి___

"అమ్మగారూ, మిారు క్షేమముగ నుండిరా. నాకోసము బెంగగొనిరా? బెంగ ఎందుకు జననీ! నేను ఆడపిల్లనా? అన్నగారు ఒక్కరు మిమ్ములవదలి పాటలీపుత్రమున ఉండలేదూ?" అని చక్కని తీయని, మాటలుపల్కినాడు. ఆనందదేవి పుత్రుని గాఢముగ హృదయమున కదుముకొని, అతని మోమంతయు ముద్దులుపెట్టి "నాతండ్రీ! ఎంత పెద్దమాటలు నేర్చినావు?" అని అనెను.

"అదేమి అమ్మగారూ! అట్లనెదరేమి? పెద్దయేమి? చిన్నయేమి? అందరి ఆత్మలును ఒకటియే! నీవు పరమాత్మవు, నేను పరమాత్మను. మాయచే మనము వేరువేరై, మనము బద్ధులమని అనుకొనుచుంటిమి మిారు భగవద్గీత చదువలేదా?"

"ఓయి నాయన? నాతండ్రి తత్వవేత్త అయినాడా? ఎవరు నేర్పిరయ్యా నీకీ చదువులు?"

"స్థౌలతిష్యులవారు. ఇంకను ఎందరో ఋషులు. నన్ను పెంచిన బ్రాహ్మణోత్తములు ఎన్నివిద్యలు నేర్పిరమ్మా నాకు! తల్లీ! మిారు భాసుని నాటకములు, వాల్మీకి రామాయణము, వ్యాసుని మహాభారతము చదివినారా? అవియన్నియు నేను నేర్చుకొనుచున్నాను. మిా నాయనగారికిని కొన్నిఘట్టములు పాడి వినిపించెదను"

"ఓహో నాతండ్రి ఎంతటి పండితుడైనాడు! ఇన్ని నెలలు ఏమిచేయుచుంటివి? ఎవరు నీకు బువ్వపెట్టిరి?"

హిమబిందును చారుగుప్తుడు తనహృదయమున కద్దుకొని, ఆనందముచే, భార్య ప్రజాపతిమిత్రి తలంపుల దుఃఖముచే కండ్లనీరు వరదలైపార తల తడిపెను. హిమబిందు వాపోయినది ముక్తావళీదేవి వెక్కి వెక్కి ఏడ్చినది.

తరువాత వారి ఆనందమునకు మేరలేదు. చారుగుప్తుడు చిన్నబిడ్డవలె గంతులు వేసినాడు

సువర్ణశ్రీ ధర్మనందికడకుపోయి. యాతని పాదముల కెరగెను. ఆ మహాశిల్పి కుమారుని గాఢముగ కౌగిలించి, మనస్సులో బుద్ధదేవుని ప్రార్థించి, యాతనివదలెను.

శ్రీకృష్ణసాతవాహనుడు, సోమదత్తాచార్యులు, సమవర్తి సాతవాహనులు చక్రవర్తికి ఉజ్జయినీ యుద్ధవృత్తాంతమంతయు నివేదించిరి శ్వైత్రులవారు, అచీర్ణులవారు అచ్చటనే యుండిరి.



# ఏకోనత్రింశత్ ప్రకరణము

## స్థాలతీర్ష్య మహర్షి

“చేయుటయే మనపని. కాని దానిఫలము మనదికాదు; అది భగవంతునిదే అనిగదా వాసుదేవుడు గీతయందు ప్రవచించినాడు. గీతామహావాక్య ఆశయప్రస్థానమగు మహాపథము, కంటకావృత్తమైననేమి యనిగదా గీత వచించును. భగవంతుడే యట్లొనరించెను. భగవంతుని దారియే మాయ. కంసుని, నందుని, యశోదను, గోపికలను, కాలయవనుని, జరాసంధుని, శిశుపాలుని, కౌరవులను, అందరు జీవులను నిముష నిముషమున మాయచేసినంపి, వక్రగతుల నడచిన భగవంతుడే మాయలమారియైనప్పుడు, మోహినియై రాక్షసుల మాయచేసి, దేవతలకు మాత్రము అమృతము పంచినప్పుడు, జగన్మోహినియై, భస్మాసురుని భస్మమొనరించుకొనజేసినప్పుడు, వేదములు, ఉపనిషత్తులు, గీత, బ్రహ్మసూత్రములు, పరమశివారాధన, భగవద్భక్తి, ధర్మము. వీనిని పునరుద్ధరించుటకు. నేనేమార్గమైన నవలంబించవలెను” అని యాలోచించుకొనుచు స్థాలతీర్ష్యుడు శిష్యగణపరివృతుడై పాటలీపుత్ర పురాభిముఖుడై ప్రయాణము చేయుచుండెను.

శాతవాహనవంశమును నిష్కల్మషముచేసి, దానిచేత నీ ప్రపంచమంతా పాలింపవలె! దేవతాతృప్తి, మానవముక్తి ప్రసాదించే యజ్ఞయాగాదిక్రతువులు దేశమంతటా జరగాలి. పాషండము, వైదికమార్గనిరసనము, మోక్షదూరము, నరకహేతువగు బౌద్ధధర్మము. జైనధర్మము విశ్లేషంకావాలి. ఈదినముల వర్ణభేదమే పోయినది. “చాతుర్వర్ణ్యం మయాసృష్టం” అనే భగవంతుని వాక్యమును, నాశనము చేసినారీబౌద్ధులు. వారే నాశనమగుదురు.

తన మనుమరాలు విషకన్యను శ్రీకృష్ణశాతవాహనుడు వెంటబెట్టుకొనియే తిరుగుచున్నాడు. కాని ఇంతకలమాతడు నాశనమందకపోవుటెట్లు!

ఎవరా సువర్ణశ్రీ? ధర్మనందికుమారుడా? ఆ ధర్మనంది సువర్ణశ్రీల విషయమావలకనుంగొనబడును. ఆతడు హిమబిందును వెంటాడుటయేమి? తన నర్మదాశ్రీమ



రహస్యమాతడెట్లు భేదించెను? హిమబిందు మంజుశ్రీల కాతడు బంధముక్తి చేయుటయేమి? ఇదియంతయు విచిత్రమే. భగవంతుడేమి చిత్రసంఘటన కల్పించి ఈ నాటక మాడించినాడో?

ఉజ్జయినికడ మాళవులు ఓడిపోవుటయు మంచిదేయైనది. లేనిచో వారు సర్వవిధముల భగవంతుని కార్యమునకు అడ్డుతగిలియుందురు కాని పాటలీపుత్రముకడ బౌద్ధులు నాశనమయి తీరవలెను. శ్రీముఖశాతవాహనుడు నాశనముకావలెను. శ్రీకృష్ణుడెట్లును నాశనమైనట్లే! మలయనాగప్రభువును శాతవాహనులు చంపించిరని కింవదంతి వ్యాపింపజేయుటవలన ఆంధ్రనాగులందరు అనుకొనిన దినమున ఆంధ్రసైన్యములపైతిరుగబడి శాతవాహనులను వారిఅనుయాయులను నాశనముచేయుదురు. మంజుశ్రీనిమాత్రము వారు రక్షింతురు. ఆంధ్రసైన్యములలో నాగులు లక్షమందియున్నారు. ఎందరో సేనానాయకులు, ఉపసైన్యాధికారులుగా ఉన్నారు. మైత్రులవారూ, నాగప్రభువేయైనను బౌద్ధుడు. ఆతడే మలయనాగుని వెనుక చీవాట్లు పెట్టియుండెను. ఆతడే మలయనాగుని చక్రవర్తి యాజ్ఞచే చంపించెననికదా తాను వదంతిపుట్టించెను?

ఎవరీ అమృతపాదార్హతులు? చాలా గట్టివాడు బౌద్ధధర్మమును, ఆర్యధర్మమును ఆతడంత చక్కగ సమన్వయము యుట తన ఉద్యమమునకు భంగము కలిగించినది. చక్రవర్తి రెండుధర్మములను సమముగ జూచుచున్నాడు. అది తన మహోద్యమమునకు ఎన్నియో చిక్కులు తెచ్చినది. ఈ అమృతపాదులు బౌద్ధధర్మము నిజమైన ఆర్యధర్మమని వాదించునట

బ్రతికయున్న ఆర్యజాతి యుగయుగమునకు మార్పుచెందునట. కృతయుగానంతరము మహర్షులు ఉపనిషద్రూపమున వేదదేవతలకు స్వస్తి చెప్పిరట. అంతటితోడనే వైదిక దేవుల మహాత్మ్యము ప్రజల హృదయములనుండి తొలగిపోయెనట! ఓహో ఏమి వాదన

త్రేతాంతమందు ఉపనిషన్మతములోని భక్తిధర్మము యోగధర్మము. సాంఖ్యమైన ద్వైతభావము తలయెత్తినవట.

ద్వాపరాంతమందు అన్నింటిని సమన్వయముచేయు భగవద్గీతను భగవంతుడే స్వయముగ బోధించెనట. కలియుగములో ఇట్టి అవతారములెన్నియో రావలెనట. బుద్ధుడట్టి అవతారమట.

ఇది నిజమని నమ్మినారు ఎంతమందిరో పండితులైన బ్రాహ్మణులే. ఈవిషయమున అమృతపాదునితో తాను వాదించి తీరవలయును! ఈ అమృతపాదుని తాను ఓడించి తన ధర్మమునకు జేర్చగలిగినచో తనజన్మము సార్థకమందును.

ఈ ఆలోచనలతో స్థౌలతిష్యుడు తన గజముపై ఆరోహించి ప్రయాణము చేయుచుండెను.

ప్రతిష్ఠానమునుండి గయాకడకు అతడు శిష్యగణముతో, నూరు ఏనుగులతో వచ్చుసరికి, ధాన్యకటకమునుండి వచ్చు కొన్ని కుటుంబములచ్చట కలుసుకొన్నవి. ప్రియదర్శి శాతవాహనుని భార్య అమృతలతాదేవి, ధర్మనంది కుటుంబము కొందరు గోపసైనికుల వెంటబెట్టుకుని ప్రయాణముచేయుచు వచ్చుచుండిరి. ఆజట్టులో భిక్షుకుడగు వినయగుప్తుడు శ్రీమంతుడగు కీర్తిగుప్తుడును ఉండిరి కీర్తిగుప్తుని స్వంతభటులు, ఏనుగులు, అశ్వికులు, సేవకులుండిరి.

క్షేత్రగయలో స్థౌలతిష్యుడాగిపోయెను. స్థౌలతిష్యుని కలుసుకొని కీర్తిగుప్తుడనేకవిషయములు మాటలాడెను. తన మనుమరాలిని తస్కరించిన దీ అపర విశ్వామిత్రుడేయని యాతని హృదయమున స్థౌలతిష్యునిపై కోప ముదయించినమాట నిజమే కాని మరల నేమిచేయుటకీ వృద్ధ దూర్వాసుడు పాటలీపుత్రమునకు పోవుచున్నాడో యని కీర్తిగుప్తుడు కళవళపడెను.

ఆతనిపేరు వినినంతనే అమృతలత మండిపోయెను. ఎక్కడనుండి దాపురించినాడీ ప్రళయరుద్రుడని యామె యనుకొనెను.

ఈ రెండుజట్టులు కలిసి ఒకేదినమున పాటలీపుత్రమును ముట్టడించిన శిబిరముల జేరిరి. పాటలీపుత్రపురమునకు ఇరువది మైళ్ళ దూరమున గంగానదీ దిగువను ఒక గ్రామమునందు స్థౌలతిష్యులు స్థావర మేర్పరచుకొనినారు.

ధర్మనంది శిబిరమునకు శక్తిమతీదేవియు, యామె ఇరువురు కొమార్తెలు చేరినారు. సువర్ణశ్రీ తల్లిపాదములకు సాష్టాంగనమస్కార మొనర్చి లేచి యామె కన్నులనీరు తిలకించి,

"అమ్మా, ఎందుకాకంటనీరు?" అని ప్రశ్నించెను.

"నాయనా నీవు క్షేమముగ నుంటివి. అదియే పదివేలు."

నాగబంధుక:—మాఅన్న ఎంత గొప్పవాడయినాడు?



సిద్ధార్థినిక:—ఇప్పుడగుటయేమి? ఎప్పుడును గొప్పవాడే?

నాగ:—ఓహోహో చిన్నచెల్లెలుగారు అన్నగారిని వెనుకవేసుకొని వచ్చుచున్నది.

శక్తి:—ఉండండి తల్లీ, నాన్నా నిన్నుగురించి కథలువిన్నాను. బృహత్కథలోని వీరులవలె పేరుపొందినావు తండ్రీ!

నాగ:—తన నాయికను తాను రక్షించుకొనినాడు.

సువర్ణశ్రీ:—నాకు నాయికలేదు నాగూ! నాకు నా శిల్పమే నాయిక.

సిద్ధా:—అటుల అనుచుంటివేమి అన్నా?

సువర్ణుడీలోననే సిద్ధార్థినికను ఎత్తుకొని గాఢముగ హృదయమున కదిమికొని, ఎగరవేసి, మరల పట్టుకొని, యాబాలిక బుగ్గలపై కొన్నివేల ముద్దులవర్షము కురిపించి మరియు దింపెను. నాగబంధునికను తల నిమిరి ముద్దుగొని, భుజములుపట్టి ఆడించి వీపునచరచి వదలెను.

ధర్మనంది భార్యనుచూచి, "ప్రయాణము సౌకర్యముగ జరిగినదా?" యని ప్రశ్నించెను.

శక్తి.—ఆ! అమృతలతాదేవియు, కీర్తిగుప్తులవారు, వినయగుప్తులవారు మాతో వచ్చియుండిరికదా? అందులో కీర్తిగుప్తులవారి ఆదరణము వర్ణనాతీతము. ఆయన సువర్ణుని చూడవలెనని ఎంతయో కుతూహలము కనబరచినారు. ఆయనకు దారిపొడుగునవచ్చు వార్తలన్నియు మొట్టమొదట మాబసకుపంపి చెప్పుచుండువారు.

ధర్మ:—కీర్తిగుప్తులు ఉత్తమపురుషులు. ఆయన హృదయము ప్రేమమయము

నాగ:—కాని అమృతలతాదేవిగారు దారిపొడుగునా చిరచిర లాడుచునే యున్నది. అమ్మా! ఆవిడకెప్పుడును అంత విసుగెందుకో?

సువ.—అమ్మా, మనయింట విద్యార్థులందరును క్షేమమా? పందెపుగిత్తల నేమి చేసివచ్చితిరి?

నాగ:—మరల శకటపరీక్ష నెగ్గవలెనని యున్నది అన్నకు. పందెము గెలుతువేకాని ఇంకొక హిమబిందు నెచట తెతువు?

ధర్మ:—అదియేమితల్లీ! నీవు రెండుసారులు హిమబిందుమాట చెప్పితివి. హిమబిందుకుమారిని శ్రీ చారుగుప్తులవారు శ్రీకృష్ణసాతవాహన మహారాజునకు దేవిగా నర్పింతురు. చక్రవర్తియు, మహారాణియు నొప్పుకొనినారు

సువ:—మేము ఉజ్జయినినుండి వచ్చినవెంటనే చారుగుప్తులవారు నన్ను కలిసికొని, తన కొమరితను నేను రక్షించినందుకు, నాకు కోటి ఘణములీయ సంకల్పించుకొన్నాననియు, భావి యువరాజ్ఞి కాబోవు నామెను రక్షించి లోకమునకు నేను ఎంతయో యుపకారమును చేసినాననియు చెప్పినారు నేను నా విద్యుక్తధర్మము నెరవేర్చినాను. నాకు కోటిఘణములు వలదనియు, నవి మధ్యవన మహాసంఘారామమునకు, వ్యాఘ్రినదీ సంఘారామమునకును ఇచ్చుట మంచిదనియు చెప్పితిని.

ధర్మ:—అవును. చక్రవర్తి ఈ వివాహము నంగీకరించెను. మహారాణి ఆనందించెను. శ్రీకృష్ణసాతవాహనమహారాజు, హిమబిందుకుమారియు ఎంతయో ఆనందించుచున్నారు. ఈ విషయములు నాకు చారుగుప్తులవారే చెప్పిరి.



# త్రింశత్ప్రకరణము

## పాటలీపుత్ర పతనము

యుద్ధమతితీవ్రముగ సాగుచున్నది. ఆంధ్రులెంత జాగరూకత వహించినను మాళవసైన్యములు గంగమార్గమున పాటలీపుత్రములోనికి చొచ్చుకొని పోవుచునే యున్నవి. పాటలీపుత్రము బలము పొందుచునేయున్నది.

శకబాణులవారి ఎత్తుగడలన్నియు విఫలమగుచున్నవి. ముట్టడి కొన్ని నెలలు సాగినచో ఆంధ్రులకే నష్టముగాని పాటలీపుత్రపురములోని వారేమియు చెక్కుచెదరరు. యువరాజుచే ఉపసైన్యాధ్యక్షపదవియుక్తుడైన సువర్ణశ్రీ ఒకనాడు వారి అనుమతిని సర్వసేనాధ్యక్షుని సందర్శించెను.

సైన్యత్రులవారికి సువర్ణశ్రీ వీరనమస్కారమిడి వారియాజ్ఞను ఒక పీఠమలంకరించి యిట్లు మనవిజేసెను. "మహారాజా! మాళవులు మనలను ఏమరించి పాటలీపురములోనికి తండతండములుగ పోవుచున్నారు. వారిని నగరములోనికి చేరనీకుండ ఒకే ఉపాయము తట్టినది. మనము పాటలీపుత్రమును పట్టుకొనవలెనన్నను, దేవియే మనకు ఉపకరించవలెను. గంగాదేవిమార్గము చాల కష్టమైనను ఆతల్లిని తోడ్పడ చేసికొన్నచో పాటలీపుత్రనగరము పది యామములలో మనకు హస్తగతము."

"చక్రవర్తి సైన్యనష్టము ఎక్కువకాకుండ కోటను పట్టుకొనవలెనని ఆదేశించి అమృతపాదులవారు ఇట్టి జననష్టము భగవత్ప్రీతికరము గాదని, నిర్వాణదూరకారిగుణము నీ ఉపాయము జననష్టము తక్కువగు ఉపాయమై ఉండవలెను."

"మహారాజా! ఇంతవరకు గంగ అవతలి కోటను మనము పట్టుకొనలేదు. ఆకోట పట్టుకొనునట్లు వేలకొలది సైన్యము దానిని చుట్టుముట్టవలయును. ఇంతవరకు నదిలోని పడవలు మనకు వేయికన్న ఎక్కువలేవు. నేనీమధ్య గంగానదికి ఎగువను ప్రయాణముచేసి రెండువేల పడవలను మూల్యమిచ్చి కొని తీసికొనివచ్చి ఇవికాక ఈ పరిసరములనున్న గ్రామములనేకములు తిరిగి చిన్నచిన్న అడవి

బూరుగుచెట్లు, బాడిదచెట్లు మూల్యమిచ్చి నాల్గయిదువేలు కొన్నాను. ఇవియన్నియు బండ్లుకట్టి మనశిబిరములకు ఆయా గ్రామవాసులు తీసికొనివచ్చుచున్నారు. ఈ వృక్షములన్నియు తెప్పలుగాకట్టి గంగానదిలో వేయవలెను. ఈ తెప్పలపై, పడవలపై నదినిదాటుటకు వేలకొలది సైనికులు సిద్ధముగ నుండవలయును. ఆ సైనికులందరు మాళవసైనికుల వేషముల నుండవలయును. శ్రీ శుకబాణులవారు మాళవసైనికుల సంకేతము తెలుగవలెను, వారికి మహాబలగోండుడు సాయముండును."

"ఈ ఆర్భాటమంతయు నెందులకు?"

"మనము మాళవదండు నొకదానిని పాటలీపుత్రపురములోనికి చొరనీయవలెను. వారి వెంటనే మాళవవేషములనున్న మనవారు చొచ్చిపోవలెను వారివెంట తక్కిన ఆంధ్రసైన్యములు మనసంకేతముల తెలుపుకొనుచు నగరములోనికి చొచ్చిపోవలెను. ఈలోన భూమిదెసపు సైన్యములవారు, కోటగోడలు ముక్కలుచేయుటకు ప్రయత్నము చేయుచున్నట్లు అల్లరి చేయుచుండవలెను. ఒకసారి లోనికి సైన్యములు పోగానే—"

"పట్టణము రెండు గడియలలో మనవశమగును. స్థౌలతిష్యులు వచ్చినప్పటి నుండియు, మాళవసైన్యములు, పాటలీపుత్ర సైన్యములుకూడ విజృంభించినవి. నీయుపాయము మంచిదే, లోనికిపోవు దండుకు నాయకులుగా నీవును. మీగురువు సోమదత్తాచార్యులు, సమవర్తికుమారులును, మహాబలగోండుడు నాయకుడుగా ప్రభాతశూరుడు ఆనందవర్మ, చండకేతుడు, గుణవర్మ, శతస్కంధుడు, పరిమానంగుడు మొదలగు ఉపనాయకులు వెళ్ళుడు. కాని అతి జాగరూకతకలిగి జయము సముపార్జించవలెను."

"మహారాజా! అందరునాయకులు, ఉపనాయకులు, ఈమధ్యాహ్నము, తమ సమాలోచన మందిరమున కలుసుకొన ఆజ్ఞ ఈయకోరుచున్నాను."

"మంచిది! సువర్ణశ్రీ! మంచిది. మిమ్మందరి ఇచ్చటకుచేర్ప చారులు ఆజ్ఞలు పట్టుకొని వత్తురు. ఈవిషయము సంపూర్ణముగ సమాలోచనచేసి, ఎవరేపనిని, ఏసమయమున, ఎచ్చట, ఏవిధముగ నిర్వర్తింపవలయునో నిర్ణయించుకొనినగాని, కార్యనిర్వాహణమునకు దిగకూడదు."



సువర్ణశ్రీ మహాసైన్యాధ్యక్షునికడ సెలవుపుచ్చుకొని, తన హయము మధిరోహించి, శిబిరమునకు బోయెను.

వర్షకాలము వచ్చుటచే వానలు కుంభవృష్టిగ కురియుచున్నవి. గంగానది, వరదలై తెల్లటి బురదనీళ్ళతో ప్రవహింపుచుండెను ఈదురుగాలి విపరీతముగ వీచుచున్నది. శోణానదియు పొంగివచ్చినది. ఆకాశము సర్వకాలము మబ్బులతో నిండియే యున్నది.

వర్షములు యుద్ధనిర్వహణమున కంతరాయమును గల్పించుచున్నవి. గ్రహణి మొదలగు రోగములు ఆంధ్రసైన్యముల బాధించుచున్నవి. వైద్యులకు వారి శిష్యులకు పని ఎక్కువఅయినది.

సువర్ణశ్రీ మహాసైన్యాధ్యక్షులతో మాటలాడినపిమ్మట నాలవనాటిరాత్రి కన్ను మిన్ను కప్పి జోరున వర్షము కురియుచున్నది. ఆ వర్షములో రెండువందల నావలు, సైనికులతో, తోళ్ళుకప్పిన సామానులతో కిటకిటలాడుచు, పాటలీపుత్ర గంగాతీరమున నొక గోపురద్వారము చెంత నాగినవి.

ఆ వర్షప్రవాహములో పడవలలోనివారొకరు శంఖమొకటి, "భోం, భో భోం, భో భో భోం" అని యూదిరి. అంత లోననుండి నింకొక శంఖము ప్రతిధ్వనిగా "భోం, భోం" అని పలికినది. అంత పడవలలోనుండి కాహళియొకటి, "టు, టు, టూ, టూహూ" అని అరచినది. ఇంతలో నెమ్మదిగ, గోపురమహాద్వార కవాటములనున్న చిన్నకవాటమొకటి తెరువబడినది. ఒక్కొక్కపడవ గోపుర సోపానముల కడకు వచ్చుట, అందుండి సామానులతో సైనికులుదిగి, ఒక్కొక్కరు ఇరువురు, ముగ్గురు లోనికి పోవుచున్నారు అటుల రెండువేలమంది వెళ్ళిరి; మూడువేలమంది వెళ్ళిరి; సోపానములకడ వేలకొలది పడవలు మూగిపోయినవి. జనము దిగుచునేయున్నారు. లోనికి పోవుచునేయున్నారు.

ఆవల భూభాగమువైపు ఆంధ్రులు వర్షమని వెరవక, ఏనుగులచే, శకటములచే అస్త్రములచే, శస్త్రములచే నగరకుడ్యముల పొడవుననున్న ఇరువది, ముప్పది గోపురములకడ తలపడిరి. ప్రతి బురుజుపైన శతఘ్న్యాది అస్త్రములువచ్చి, బురుజుగోడలను బద్దలుకొట్టుచుండెను మాళవులు, మాగధులు, శూరసేనులు కోటగోడలపై విజృం

భించి బాణములు, శతఘ్నులు, రాళ్ళు, యంత్రములు ఎడతెగక ప్రయోగించి ఆంధ్రుల నాశనము చేయుచుండిరి.

అయినను ఆంధ్రులవేగము, ధాటియు తగ్గలేదు. గోపుర మహాకవాటమొకటి ఆంధ్రుల ఆఘాతికి ఫెళఫెళ విరిగిపోవునట్లుండెను. ఆ గోపురముకడ చక్రవర్తి శ్రీముఖుడు స్వయముగ తన మత్తదంతావళముపై నధిరోహించి యుద్ధము నడుపుచుండెను.

వేరొక గోపురముకడ స్వైత్రులవారు నాయకత్వము వహించిరి. శ్రీకృష్ణ సాతవాహనులు మరియొక గోపురముకడ విజృంభించి యుద్ధమును సాగించుచుండిరి.

ఒక్కసారిగ పొంగివచ్చు గంగానది ముంపులవలె, శోణానది పొంగులవలె ఆంధ్రసైన్యములన్నియు, ఆరాత్రి ఆ అఖండవృష్టిలో, పిడుగులై, మెరుపులై, మరుత్తులై, ఘుమ్ములావరక మహామేఘములై పాటలీపుత్ర నగరకుడ్యములపై గవిసినవి.

ఆవృష్టిలో క్రింద శత్రువులేమాచున్నది మాగధులకు, మాళవులకు తెలియుట లేదు. ఆంధ్రులకు గోడలమీదనున్న శత్రువులసంఖ్యయు తెలియుటలేదు. అశ్వఘోషలు, గజఘీంకారములు, వీరుల సింహనాదాలు, మహాప్రళయ నాదములైపోయినవి.

గోడలమీదవారికి 'శత్రువులు చొరబడినారు' అన్న మహాధ్వనియొకటి వినబడసాగెను.

గంగ ఒడ్డుననున్న ఆ సింహద్వారములోనికి అనంతమై మాళవులు ప్రవేశించుచుండుట అచ్యుత సేనాపతికిని సైనికులకు నానందమైనది. కాని సంతతధారగా వేయి, రెండువేలు, మూడువేలు, నాల్గువేలు మాళవులు వచ్చుటకా సేనాపతి యక్కజంపడి, మాళవసేనాపతిని మీరెంతమంది సైనికులతో వచ్చినారని యడిగెను. రెండువేల అయిదువందలమంది వీరులుందురని యాతడు చెప్పెను.

"మీరు లెక్కపెట్టలేదేమో ఇప్పటికి యిదారువేలమంది వచ్చినారు. ఇంకను పదిపదిహేనువేలమంది పైనబడుచున్నారు. మహావర్షము కురియుచున్నది. విరోధులు రాకుగదా! గోపురద్వారములను మీ సేనాపతులు కొందరు పూర్తిగ తెరచివేసినారట. ఈపాటికి ఎనిమిదివేలమంది లోనికి వచ్చియుందురు."

"ఏమిటిది! ఇదియేదో మాయాగనున్నది. చూచెదముగాండు."



ఇంతలో కోటబురుజు మూలముననున్న వీరి మందిరములోనికి ఇరువురు సేనాపతులు, కొంతమంది సైనికులు బిలబిల నడిచివచ్చినారు "ఇదియేమి యని," ఈనాయకులనుచుండగనే "అయ్యా, నేను సువర్ణశ్రీ సేనాపతి, మిమ్ములనిరువుర మా సైనికులు బంధింతురు" అని అనుచుండగనే, ఆ మాళవసైనికులు వీరిని బంధించినారు.

నాలుగువేల మాళవసైనికులు వచ్చుటకే పావుకోశము దూరములోనున్న వేరొక నదీతీర గోపురముకడకు వేగిబోయి, ఆగోపుర కవాటములు తెరచిరి.

సమవర్తి, ఉగ్రుడై తనతోవచ్చు ఒక బాలవీరనాయకుని సహాయమున నెదిరించు సైనికుల ఆయుధముల లాగించుచు, మహావేగమున నగరములోనికి మూడువేల సైనికులతో పోసాగెను.

సోమజితుడు మూడువందలగజముల నదిలో ఈదించుకొనుచు గోపురద్వారమున నగరములోనికి చేరి, నదీతీరమందున్న బురుజుల పట్టించుచుండెను.

శుకబాణుడు వేయి అశ్వికులతో మహావేగమున చక్రవర్తి యుద్ధము చేయు బురుజుకడకు పోవుచుండెను. గోండులతో మహాబలుడు, గంగప్రక్కనున్న, భూఖండముపైనున్న గోపురమును పట్టుకొనెను.

ఈ గడబిడ యగునప్పటికి నగరములో గగ్గోలుబయలుదేరెను. ఆ కటిక చీకటిలో వర్షములో ఏమిజరుగుచున్నదియు నెవరికి తెలియక, ఆదినమున వంతులేక యుద్ధవిశ్రాంతి గైకొను నాయకులు కవచములు తాల్చియు, తాల్చకయు, ఆయుధముల సేకరించియూ, సేకరించకయు, తమతమ భవనములవీడి తమ సైన్యాగారములవైపు పోదొడగి, వీధుల నిండిపోయి ఆంధ్రులకు పట్టుబడిరి.

చక్రవర్తి పోరాడు గోపురద్వారము ఇంతలో ముక్కలయ్యెను. ఆంధ్రులట నుండి లోనికి రాసాగిరి శుకబాణుల అశ్వికులు అచ్చటనున్న మాళవులను చెండాడుచు నిరాయుధుల చేయుచుండిరి.

పాటలీపుత్రి నగరము ఆంధ్రుల వశమైనది



# చతుర్థ భాగము

## ప్రథమ పరిచ్ఛేదము

### నాగబంధునిక

నాగబంధునిక తల్లితో, చెల్లెలితో కలిసి పాటలీపుత్రపుర సామీప్య ధాన్యకటకమందలి శిబిరమునకు వచ్చినది. అన్నగారిని కలుసుకొన్నప్పుడామె పొందిన యానందమునకు మేరలేదు. కాని బాలికా కపోలములవలె కపోలములు గలిగి, ఎప్పుడూ శిల్పభావముల నాలోచించుకొను సువర్ణుని మోమిప్పుడు తీక్ష్ణ కాంతియుతమై ఆమెకు భయము గొల్పినది.

ఒకనాడు నాగబంధునిక అన్నరూపము తీవ్రపరిశీలన దృష్టితో చూచినది. అతడు బదిరిగడ్డము పెంచికొనినాడు. మీసము తుమ్మెదరెక్కలవలె మిలమిలలాడుచు బదిరిగడ్డమున గలిసిపోవుచుండెను. స్నానమాచరించునప్పుడతని దేహకండరములు వింధ్యపర్వతాగ్రములవలె ఉబికిపోవుచుండెను. అతని విశాల యురము మానుపు గుర్తులతో (?) విశాల తామ్రపర్వత సానువువలె కాంతిల్లుచు తోచినది.

అతని ప్రతి అంగము వజ్రశక్తిని మూర్తించుకొని ఆమెకు ప్రత్యక్షమైనది. తన అన్న కన్నులలో నేడు స్వప్నములు లేవు. మనోహర రూపదర్శన జనితానంద కాంతి తరంగములు లేవు. యౌవనస్పృష్ట మధుమాస మత్తతలు లేవు. ఆ కన్నులలో నిశితకరవాల ధారారోచిస్సులు వజ్రనిపాత తళతళలు పగవడులై ప్రత్యక్షమైనవి. ఆ కాంతి తెరలవెనక ఏదియో నిశ్చయము, ఏదియో నిస్పృహ, ఏదియో భగ్నస్వప్నము దూరాన నడయాడుచున్నట్లు బాలకు తోచినవి.

అన్నకు దేహమును తోము మర్దనికను అవలకుపంపి వీరవ్యవసాయ కుశలయైన నాగబంధునిక సువర్ణశ్రీకి శరీరము తానే తోముచు, "అన్నా! యుద్ధమునందు మనవారు ఎక్కువ జాగ్రత్త వహించుచున్నారేమి?" యని ప్రశ్నించెను.



"చక్రవర్తి జననష్టమున కియ్యకొనడు. సైనికులు అనవసరముగ ప్రాణముల బలియీయరాదు. విరోధుల ప్రాణముల బలిగొనరాదు. సాధ్యమగునంతవరకు బందీల చేయవలయును."

"కోటలో భోజనాది వస్తువుల తగ్గించి పాటలీపుత్ర పురవాసుల లోబరచుకొనవలయుననియా?"

"అదే మా యుద్దేశ్యము. చక్రవర్తి ఆజ్ఞలట్టివి. అమృతపాదాచార్యులవారి ఆదేశమట్టిది."

"ఉజ్జయిని యుద్ధమందును ఇట్టి యుద్ధనీతియే గమనించిరా?"

"ఆ!"

"మహాబలగోండు అన్న నిన్న మన శిబిరమునకు వచ్చినప్పుడు నిన్ను గురించి అన్నియు నడిగినాని."

"అవును అతడు నాకు తెలిపినాడు నాగూ!—"

"ఎందుకు అన్నా? నీ హృదయములోని ప్రశ్నలు నాకన్నియు వ్యక్తమైనవిలే."

"నా హృదయములోని ప్రశ్న యేదియో యున్నది. అది సాకర్థము మాత్రము కాలేదు."

"నా హృదయమున ప్రశ్నయేమున్నది అన్నా? నీవు హిమబిందు కుమారిని నేను చూచితినా యని అడుగదలచితివి. ఆమెయేమనినది, ఎట్లున్నది ఇది నీ ప్రశ్నలు నిజము కాదూ?"

సువర్ణుడు మెత్తని శల్లాలచే దేహము తుడుకొని, నాగబంధునిక వస్త్రము లందీయ ధరించుచుండెను.

"అవును చెల్లీ! హిమబిందుపై ప్రేమ వదలలేను. హిమబిందుదేవి యువరాణి కాబోవుచున్నది. అదియె నాకు సంతోషము. ఆమె ఆనందమే నాకు కడుగూర్చునది."

"ఓహో ఎంతటి ఉదారహృదయము అన్నకు?"

"నామాట అటుంచు నీ హృదయమున ఉన్న ప్రశ్న ఇదియని నేను ఊహించుచున్నాను."

"అది వట్టి ఊహామాత్రమే యగును"

"కానిమ్ము, నీవు సమవర్తిని గురించి యడుగదలచితివి. తథాగతుని తలచి నిజము చెప్పు. అవునా కాదా?"

"అవును అన్నా! చిన్నతనమునుండియు నాకు నీవే ఎక్కువ స్నేహితుడవు. నా స్నేహితురాండ్రెవ్వరికిని చెప్పని రహస్యములు నీకు కదా చెప్పుచుంటిని."

"సమవర్తి ఉత్తమవీరుడు, మహాపురుషుడును. ఉజ్జయినికోట నాతడు రక్షించిన యుద్ధనీతి, యుద్ధవిధానము, ఆ మహానగరప్రజల నాతడు కాపాడినరీతి, వారిపై ఆవీరుడు వర్షము కురిపించిన ప్రేమ ఆంధ్రసైనికులపై యా సైన్యాధ్యక్షుడు తండ్రి వలె కాపాడిన చరిత్ర ఒక్క మహాప్రబంధమునకు కావ్యవిషయ మగుతీరును."

"మగధదేశములో నుంటివి, నీవు మగధుడవై పోయితివా ఏమి?"

"ఓసి వెఱ్ఱిపిల్లా! మంచివారిని గురించి చెప్పుటలో మాగధులైన నేమి, మనవారైన నేమి? సమవర్తికి ఉత్తమస్థితి నందవలెననియు కాంక్షయున్నది. అతడు హిమబిందును వివాహమాడ సంకల్పించుకొనుటయు తన ఆశలను సిద్ధి సమకూర్చుకొనుటకే!"

"హిమబిందుకు ఆయనకు వివాహమెట్లు?"

"హిమబిందు నాతడు ప్రేమింపలేదు. సమవర్తి ధర్మహృదయుడు. అతనికి ఎవ్వరిపైనను ప్రేమ కలుగనేలేదు. అతడు ప్రేమికుడైన, వేరొక బాలిక నుద్వాహమగు అధర్మ చిత్తవృత్తి కలవాడు కాడు. ఆర్యగృహస్థునివలె వివాహమాడిన భార్యను తన ప్రేమచే ముంచివేయును."

"ప్రేమింపక వివాహమాడినవెనుక ప్రేమ కలుగుటెట్లు అన్నా!"

"ప్రేమ రెండువిధములు చెల్లీ! ఒక పురుషుడు, ఒక స్త్రీయు ఒక మహాప్రేమకు ఫలభాగులై జన్మింతురు. వారు కలుసుకొందురు ప్రేమింతురు. ఆమెకు అతడే దైవము, అతనికి ఆమెయే దేవి. ఆమె వినా అతడు పరవనితను కన్నెత్తి చూడలేడు. ఆమె తన సహధర్మచారిణి కానినాడు అతడు భిక్షుకుడే! కాశ్మీర కుసుమవర్ణ వస్త్రధారి ఆమెయు నంతియ."

"అవును అన్నా!"



"ఇంక రెండవజాతివారు! ఆజాతి యువతీయువకులకు వివాహాత్పూర్వము నాయకునిగాని, నాయికనుగాని ఎన్నుకొనరు, ప్రేమింపరు. వారు ప్రేమోన్ముఖులై మాత్రముందురు. వారు వివాహమాడినవెనుక యువతులు తమతమ భర్తలను, యువకులు తమతమ భార్యలను గాఢముగ ప్రేమింప ప్రారంభింతురు"

"అన్నా కామసూత్రములకు నింతగంభీర వ్యాఖ్యానము లెప్పుడాలోచించుకొంటివి? ఇంక నాహృదయము దర్శింపుము. నేను ఎద్దుబండి పందెములనాటనుండి, పందెమున రెండవవానిగ వచ్చిన యా మహాపురుషుని చూచితిని. అతనియందు మనస్సువెంటనే లగ్నమైనది. అది ప్రేమయన్న భావమే నాకుద్భవింపలేదు. ఆయన వెంటనే యుజ్జయినికి యుద్ధయాత్రికుడై వెడలిపోయెను. అంతకన్న అంతకన్న ఆవీర పురుషుని మూర్తి నా జీవితమంతయు ప్రసరించి నిండిపోయినది. అన్నా ఆయన వినా నాకు ఇంకొకరన్న భావమేలేదు."

"అదా తల్లీ! ధాన్యకటకమున అమ్మను తొందరచేసి, పాటలీపుత్రమునకు పోవలెనని, ఊదరకొట్టి, ఇక్కడకు లాగుకొనివచ్చితివి!"

"అవును. ఉజ్జయినిలో వారు విజయమందుదురని నాకెందులకో అననుమానమైన ధైర్యము. వారు ఇచ్చటకు వత్తురనియు ఊహించితిని!"

"చెల్లీ! ఇప్పుడేమి కర్తవ్యము?"

"ఏమియులేదు. నేను నీసైన్యమున అంగరక్షక ఉపచమూపతిగ జేరుదును. నీవు నాకు వారి సైన్యమున జేర మహాసైన్యాధ్యక్షుల అనుమతిని వారికడకు పంపుము."

"అమ్మ ఏమనును? నాయన ఏమనుకొందురు"

"అది వారికేల తెలియవలెను. నేను పురుషవేషమున, వీరపురుషోచితాలంకారముల నీతో ఇచ్చటను, అచ్చటకు పోవుట నాయనగారెరిగి ఊరకుండుననియు, అమ్మ నవ్వుచు ఒప్పుకొనుననియు నీవ ఎరుగుదువు."

"చెల్లీ, నాప్రేమయు, నీప్రేమయు ఫలరహితములే యగునో, ప్రేమమహాశ్రుతిలో స్వరములేయగునో. అటులనే కానిమ్ము! ఏదీసిద్ధ?"

"అది రథముపై సార్వభౌముల మహాశిబిరమునకు రాజపుత్రికలతో నాడుకొన పోయినది."

"అందుకనా మనశిబిరము నిమ్మకు నీరువోసినట్లున్నది?"

# ద్వితీయ ప్రకరణము

## ఎవ్వరీ వీరుడు?

సువర్ణశ్రీ తనవెంట నొకబాలవీరుని గొని సైన్యాధ్యక్షులవారి దర్శనము చేసుకొని "మహాప్రభూ! ఈబాలుడు మాబంధువు. ఈబాలకుడు శ్రీ సమవర్తి సేనానుల కంగరక్షాధిపతిగనుండ తాము ఆజ్ఞదయచేయ వేడుకొనుచున్నాను. అంగరక్షక శిక్షణ నంది, అంగరక్షకులలో ఇట్టివాడింకొక్క వీరుడులేడని ప్రసిద్ధినందినాడు." అని మనవి చేసెను.

"సేనాధ్యక్షా! ఈబాలకుడు సమవర్తి సైన్యాధ్యక్షులనే ఎన్నుకొనుటకు కారణమేమి?"

"సమవర్తికి చురుకుపాలెక్కువ. నిర్భయముగ ముందునకు చొచ్చుకుపోవును. అట్టివాని వెంట నుండుటకే బాలుడు కోరుచున్నాడు."

"కానిమ్ము. ఏదికారణమైననేమి. ఒక్కొక్కరికి ఒక్కొక్కరియందు ఎక్కువగౌరవము, ప్రీతియు కలుగును."

వెంటనే సర్వసైన్యాధ్యక్షులు భూర్జపత్రముపై నంచె పక్షిపాత్రిను ముంచి సమవర్తికి కమ్మ లిఖించినారు. వారిముద్ర ఆయన అంగరక్షకాధికారం అందు అచ్చువేసి, ఆపత్రము సువర్ణశ్రీకి అందిచ్చెను. సువర్ణశ్రీయు, ఆబాలుడును సర్వసైన్యాధ్యక్షులకు వీరనమస్కారములిడి సమవర్తి శిబిరమునకు బోయిరి.

సమవర్తి ఆవేళయందు మహాగోపురముకడ ప్రచండయుద్ధ మొనరించుచుండెనని వార్త తెలియవచ్చినది వెంటనే ఆ బాలవీరుడు సువర్ణశ్రీ మోము చూచి, "అన్నా! నీవు నీపనిపై వెడలిపొమ్ము. నేను సమవర్తిప్రభువును దర్శించి యీ యాజ్ఞాపత్రము వారికి సమర్పింతును" అని తెలిపినాడు

"పొమ్ము నాగూ. నీతో మనవీరులను పదిమంది గోండునాయకులను కొని పొమ్ము!"

ఆ బాలవీరుడు సంపూర్ణకవచధారి తన ఉత్తమాజానేయ మధివసించి, తనవీరులను తీసికొని, మహాగోపురముకడ జరుగు యుద్ధమును జేరబోయెను.



ఆబాలుని హృదయము ప్రథమమున ఆభీకర యుద్ధమునుగాంచి కొంచెము వెరపునందెను. కాని యాతడు వెంటనే సమాళించుకొని, ఆంధ్రదళపతులకు, చమూపతులకు, ముఖపతులకు సర్వసైన్యాధ్యక్షుల ఆజ్ఞాపత్రము చూపించుచు, కోటనుండి నువ్వున ప్రాణబలికోరివచ్చు నిశితశరముల తప్పించుకొనుచు, ఫలకమునుఒడ్డుచు, కవచముకలిగిన తనగుఱ్ఱమును విచిత్రగతుల నడుపుకొనుచు, సమవర్తిని ఊహించుకొనుచు ముందునకు పోయినాడు.

సమవర్తి తాత్కాలికముగ నక్కడేర్పరచిన ఒకచిన్న మట్టిబురుజుపైనుండి యుద్ధము నడుపుచుండెను. ఇంతలో అతని యుద్ధప్రతీహారియైన చారుడొకడు, సమవర్తి నిడాసి, "మహాప్రభూ! సర్వసైన్యాధ్యక్షుల ఆజ్ఞగొని, యొకవీరు డరుదెంచినాడు" అని మనవిచేసినాడు.

"ప్రవేశపెట్టుమని" సమవర్తి ఆజ్ఞనిడి యుద్ధయంత్రముల ప్రయోగించు యాంత్రికులకు నాజ్ఞలిడు పనిలో మునిగిపోయెను."

"మహాప్రభూ! జయము, జయము!" అను మధురస్వరము వెంటనే వినవచ్చెను. ఆమధురమూ, గంభీరము, నిషాదస్వర పూరితమైన యామాట విన సమవర్తి యాశ్చర్యమంది యావైపునకు చూచెను."

ఎదుట చిరునవ్వుతో, సంభ్రమ గౌరవపూరితదృష్టుల పరపు సుందరుడగు నొక బాలవీరుడు, సర్వాయుధోపేతుడై, కవచధారియై ఎదుట నమస్కారమిడుచు నిలిచియుండెను.

"ఎవరయ్యా నీవు?"

"మహాప్రభూ! తమసేవకుడను. సర్వసైన్యాధ్యక్షుల యాజ్ఞాపత్రము గొనివచ్చితిని." అని ఆ బాలకుడాపత్రము సవినయముగ సమవర్తి కందించెను. సమవర్తి ఆపత్రము చుట్టవిప్పి, చదువుకొని "ఏమయ్యా నిన్ను నాకడ నంగరక్షకాధికారులలో నొకనిగ నియమించినారు. నీవయసు పదునేను వత్సరములకు మించియుండదు. నీవు నన్నెట్లు రక్షించగలవు?" అని ప్రశ్నించినాడు.

"మహాప్రభూ, నేను అంగరక్షకులలో మేటిని."

"మాటలువేరు, పనులువేరు. నీవు బాలుడవు. ముక్కుపచ్చలారలేదు. ఆ చెంపలనుండి పాలింకను స్రవించుచున్నట్లే యున్నది."

"సైన్యాధ్యక్షా! నాయనిని పరిశీలించుడు నేను తమకు ఉపయోగించుచో ఉంచుకొనుడు లేనిచో పంపివేయుడు."

"ఒకసారి నీవు చేరినవెనుక పంపివేయుట ఉండదు. సరే పనియందు ప్రవేశింపుము!"

"కృతజ్ఞుడను!"

వెంటనే ఆ బాలవీరుడు సమవర్తి అంగరక్షకులలో నొకడయ్యెను. ఆ బాలకుడు సమవర్తిపై ఈగనైనవాలనీయడు. తన్నుమాత్రమే తోటివీరులు పరిశీలనాత్మకము చూపులు సతతమును ప్రసరింపుచేయుచుండ అతడు తన చిన్నవిల్లును నువ్వునలాగి కోటగోడలనుంచి బాణములు, అగ్నివర్షములు కురుపించు గండల నొక్కొక్కరిపై తన బాణముల నేయుచుండెను.

ఆ బాలుని బాణములు ఎందరిప్రాణముల గొన్నవో! సమవర్తి యా బాలుని కౌశల్యమున కచ్చెరువందుచు సాయంకాల మగుటచేత యుద్ధము రాత్రి సైన్యాధ్యక్షున కప్పగించి, తనశిబిరమునకా బాలవీరునితో వెడలిపోయెను.



# తృతీయ ప్రకరణము

## చిన్న చెల్లెలి మాటలు

ఆ బాలుని యందము ఒక బాలిక యందము. ఆ విశాలనేత్రముల ఏవో స్వప్నములున్నవి. ఆ స్వప్నములు యుద్ధసమయమున కరిగి వీరకాంతుల బ్రజ్వరిల్లును. యుద్ధమునందు ఎదిరి వాని ప్రాణముగొనక, కాలునో, చేతినో నొవ్వనేయును, లేనిచో నిరాయుధునిచేయు ఆ బాలుని హృదయమున మెత్తదనము సగపాలు పంచుకొనియుండ నోపునని సమవర్తి అంగరక్షకాధిపతిగ వచ్చిన యా నూత్నబాలకుని గూర్చి ఆనాడనుకొనెను.

ఆ బాలను తాను శిరస్త్రాణమైన తొలగింపక, ఏవేవో మాటలు గొణుగుకొని, పలువాతనే మరల వచ్చెదనని వెడలిపోయెను.

ఆ బాలకుడు మాటలాడకను, మాటలో బాలికా కంఠము ప్రతిస్వనించినది. ఎవరీ బాలకుడు, తన్నా బాలకుడు భక్తిపూరిత దృష్టులచూచువాడేమి? ఇందేదియో రహస్యమున్నది. సువర్ణశ్రీ సేనాధిపతి పోలికలెన్నియో యున్నవి. రెండుమూడు పర్యాయము లీబాలుని ధాన్యకటమున నెప్పుడో చూచినట్లున్నదీ. ఎవరైయుండును?

ఈ ప్రశ్నతో సమవర్తి యుద్ధమునకు బోవువాడు. ఆ బాలకుడు కూడవచ్చుచు ఒకదివ్యశక్తి మనుష్యుని రక్షించునట్లు తన సేనాపతిని రక్షించుచు, విరోధుల గర్వమణచుచు మహాయుద్ధమొనర్చుచున్నాడు.

నాగబంధునిక ఇంటికివచ్చి తన శిరస్త్రాణాదికములు విసర్జించి సుగంధము కలిసిన వేడినీటిస్నానము చేసి, పాటలుపాడుకొనుచు సమవర్తిని తలపోయుచు ఎదియో మహానందమున తాండవించి పోవుచుండును.

ఒకప్పుడామె దాపుననె యున్న యన్నగారి శిబిరమునకు చెల్లెలితో పోవును. అన్న తన శరీరమున నేర్పడిన గాయముల వైద్యునిచే అస్త్రవైద్యము వ్రణవైద్యము

చేయించుకొనునప్పుడామె వైద్యునకు సహాయము చేయును. సిద్ధార్థనిక "అన్నా హిమబిందు నేను వెళ్ళగనె నన్నంత గాఢముగ హృదయమున కదుముకొని పెదవుల పైముద్దుపెట్టునేమి?" యని ప్రశ్నించెను.

నాగ:_నువ్వందమగు బాలికవు_

సిద్ధా:_అయిన నీవేల నన్ను కౌగిలించుకొని నాకు ముద్దులీయవు.

నాగ:_చెల్లీ, నువ్వు నాచెల్లెలివి. నేను నీయందమున కెప్పుడును మెచ్చుకొనకూడదు.

సిద్ధా:_నీవును అందమైనదానివే, నిన్నెవరు కౌగిలించి ముద్దుగొందురు.

సువర్ణశ్రీ:_మంచి ప్రశ్న వేసినావు చిట్టితల్లీ!

నాగ:_ఓయి వెఱ్ఱిఅన్నా. నీచెల్లెలుకాదా మఱి. మంచి ప్రశ్నలును వేయును, మనకు అతి సన్నిహితములగు విషయములును జెప్పును.

సువర్ణ!_నీవిషయములు చెప్పలేదని నీకు కోపము.

వైద్యులైన శ్వేతకేతులప్పుడు పకపకనవ్వుచు, "ఈ యువతీ యువకులైన అన్న చెల్లెళ్ళకు ఒక విచిత్రరోగ మావహించినది. పాపమిరువురును ఆ చిన్నబిడ్డను బాధించుచున్నారు. నాగబంధునికా! నీవును అన్నవలె వీరవిక్రమ విహారము చేయుచుంటివటగాదా?" యని కన్నులగీటుచు ప్రశ్నించెను.

నాగబంధునిక తెల్లబోయి, "ఈ రహస్యమెట్లు తెలిసినది మామయ్యగారూ!" యని ప్రశ్నించెను.

శ్వేతకేతు:_ఏరహస్యము? నీవీరవిహార విషయమా, నీ విచిత్రరోగ విషయమా?

సిద్ధార్థనిక:_అక్కకు రోగమా? అమ్మతో చెప్పవలెను. ఎక్కడే అక్కా నీకు రోగము?

శ్వేతకేతు:_వేళాకోళమున కన్నాను సిద్ధూ! అక్కకు రోగములేదు. గీగము లేదు

సిద్ధార్థనిక "అమ్మయ్యా! భయమువేసింది అక్కకు రోగమని మీరనగానే మామగారూ!" యని తన అక్కను బోయి కౌగిలించుకొనెను. నాగబంధునిక చెల్లెలిని గాఢముగ హృదయమున కదుముకొని పెదవుల ముద్దుగొనెను.

శ్వేతకేతు:_అదిగోనమ్మా మీయక్క నీయందము మెచ్చుకొనుచున్నది. ఇప్పుడు నీపోలిక ఎవరిదో?



నాగ:_మామయ్యగారూ, మీవన్నియు వేళాకోళములే!

శ్వేతకేతు తన మందులసంచియు మంజూషయు సేవకుడు కొనిరా పకపక నవ్వుచు వెడలిపోయెను.

సువర్ణశ్రీ:_చెల్లాయీ! దినదినమూ హిమబిందుగారి గుడారములకు బోవుచున్నట్లున్నావే?

సిద్ధా:_అవును అన్నా! నన్ను హిమబిందు దినదినము రమ్మన్నది. నాకు తానే తలదువ్వును. బాలనాగినిగాని, అలంకారికనుగాని దువ్వనీయదు, అలంకరింపనీయదు. తనఒడిలో కూర్చుండబెట్టికొనును.

నాగ:_అన్నకు అక్కడ జరిగిన విషయములన్నియు చెప్పవేతల్లీ! అందులో ముఖ్యమగు రాజ్యవ్యవహారము లున్నవి.

సువర్ణశ్రీ:_అవును నీవు పురుషవేషమున___

నాగ:_అన్నా!___

నాగబంధునిక చెల్లెలికి కనబడకుండ అన్నకు కన్నులతో చెల్లెలినిచూపి, తన పెదవులపై తర్జనినుంచి సైగచేయును.

సిద్ధార్థనిక పెదవులు పూమొగ్గవలె ముడుచుకొని, "అన్నా! పోనీ, అక్కమగవేషము సంగతి నాకు తెలియదా? మొన్న హిమబిందుగారి శిబిరములకు సమవర్తిగారు వచ్చినారు. ఆయన నన్నుచూచి, కనుబొమలు ముడిచి, నా మొగము తేరిపారచూచి, 'ఈబాలిక ఎవరు?' అని హిమబిందువదినను అడిగినాడు_" అని చెప్పుచుండెను.

నాగబంధునిక ఆమెమాటకు అడ్డమువచ్చి, "హిమబిందువదిన ఏమిటే?" యని ప్రశ్నించినది.

సిద్ధా:_హిమబిందు నాకు వదిన! నన్నట్లు పిలువమనినది. నాకు వదినఅయితే నీకుమాత్రము కాదా?

నాగ:_(పకపకనవ్వుచు) నాకును వదినే!

'వదినయె చెడ్డది ఎంతో వల్లమాలినదీ
వదినకు అన్నకు మాటలు కుదరగ నేలేదూ'

(అని పాడినది)

సిద్ధా:_హిమబిందువదిన చెడ్డదికాదు. సమవర్తిగారితో వదిన 'ఈబాలిక ధర్మనందిగారి చిన్నకొమరిత' అని తెలిపినది. ఆయన 'ఈమెకు అన్నలెంతమంది' యని అడిగినాడు. వదిన 'ఒక్కడే!' అని ప్రత్యుత్తరమిచ్చినది. అప్పుడు సమవర్తిగారు

"అటులనా, ఇరువురనుకొంటిని. ఏలనన ఈ బాలిక మోమును, నాకీక మాతన అంగరక్షకుడు వచ్చినా డాతని మోమును ఒక్క పోలికనున్నవి" అనినాడు.

సువర్ణశ్రీ:_ఓహో! సమవర్తి నిజమునకు దగ్గరగ వచ్చుచున్నాడు.

సిద్ధా:_నిజమేమిటి అన్నా!

సువర్ణశ్రీ:_ఆ నవీనవీరుడు మనకు దగ్గర చుట్టములే తల్లీ!

సిద్ధా:_ఆ క్రొత్తవానిని నేనెరుగుదునా?

నాగ:_ఎరుగుదువు, ఎరగవును. అది మనకేలనే! హిమబిందెట్లున్నది?

సిద్ధా:_బాగుగనె యున్నది. కాని ఎప్పుడును ఏదియో యాలోచించును. బాలనాగిని నాకొరకై పంపును. నేను వెళ్ళగనె నన్నొక నిముషమైన వదలదు.

సువ:_నీవు సమవర్తిగారి శిబిరమునకు పొమ్ము ఆయనయు నిన్నువదలడు.

ఇంతలో సమవర్తి శాతవాహనసేనాపతి సువర్ణశ్రీని చూచుటకు వచ్చినాడని ఒకదళవాయి గుడారము గుమ్మముకడనుండి తెలియజేసెను. అతనివెనకనె సమవర్తియు ద్వారమునుండి లోనికి వచ్చినాడు. నాగబంధునిక యచ్చోట తనశిల్పము చేసిన విగ్రహమువలె కదలలేక నిలుచుండిపోయినది.

సమవర్తి నాగబంధునికను జూచి అపరిచితజనముండిరని వెనుకకుపోవ సంకల్పించుట కనుగొని సువర్ణశ్రీ నవ్వుచు, "లోనికిరండి! సంకోచింపపనిలేదు. ఈ బాలిక మా చిన్నచెల్లెలు ఇదివరకే హిమబిందుగారి శిబిరములకడ చూచినారు. ఈమె మా పెద్దచెల్లెలు.

సమవర్తి తెల్లబోయి, మాటకై ఒకనిమేషము వెదకి. "నాకడకు వచ్చిన ఒక బాలకునిగూర్చి మిమ్మడుగ వచ్చితిని. సైనికులవారు మీరు గొనివచ్చిరని తెలిపినారు!" అని వచించెను.

సువర్ణశ్రీ:_ఈనా పెద్దచెల్లెలు చటుక్కున పురుషుడైపోవును. ఆనాటి ఎడ్లపందెము కాలమునుండి మీకు బాసటగ విరోధుల తలపడవలెనని కోరికోరి నేడది ఫలవంతము చేసికొన్నది.

సమవర్తి ఆశ్చర్యమంది, "ఏమి—మీ—మీ—చెల్లెలా! అందుకనె.— అందుకనె—పోలిక—" అని వాక్యము పూర్తి చేయకుండగనె నిలిచెను

నాగబంధునిక తటాలున మాయమయ్యెను. సువర్ణశ్రీయు సమవర్తియు ఆవైపునకు చూచుచు చిరునవ్వులు మోములపై ప్రసరింప ఒకరినొకరు చూచుకొనిరి. సిద్ధార్థినిక "అక్క పారిపోయిందేమి?" అని ప్రశ్నించినది.



# చత్వార ప్రకరణము

## సువర్ణశ్రీ పలాయనము

"ఎవరీవిషకన్యక? ఈ విషకన్యకకు, మహారాజా శ్రీకృష్ణునకు సంబంధమేమి? ఈ విషకన్యను ప్రయోగించుటయేమి?" అని చారుగుప్తుడు పాటలీపుత్రమునందు తాను బసచేసిన భవనమున, ప్రార్థనామందిరమున బుద్ధపాదుకల పీఠమున కెదురుగనున్న ఆసనముపై అధివసించి,

"ధర్మం శరణం గచ్ఛామి

సంఘం శరణం గచ్ఛామి" అని ప్రార్థనసల్పుచు మనమున వివిధాలోచనల పాలాయెను.

మహారాజుకడనున్న అనుయాయులు ఆ విషయము నిగూఢరహస్యముగా నుంచుటచే తనకు చూచాయగమాత్రము తెలిసినది.

హిమబిందుకుమారి వివాహవిషయమున ఎందరు పెద్దలు హెచ్చరించినను తనకు వివాహ మక్కరలేదనియు, తాను బ్రహ్మచారిగమాత్ర ముందుననియు యువరాజు ప్రతివచన మిచ్చినారట.

తనబాలిక యందము అతిలోకముకదా! ఇంతవరకు దేశదేశములనుండి ప్రాణసమానురాలగు తన తనయను తమబాలుర కిమ్మని మహారాజులు, కోటీశ్వరులు వర్తమానము లంపుటలేదా?

ఆంధ్రబాలురలో తనబాలికనుచూచి మతిపోని బాలుడొక్కడుండెనా? ఇందేదియో విచిత్రమున్నది. త్వరలో యువరాజుచే ననుమతినంది, వివాహనిశ్చయ మహోత్సవమీ పాటలీపుత్రములో జరిపింపవలయును.

ఈ సువర్ణశ్రీ పాటలీపుత్రము చక్రవర్తి వశమగుటకు కారణభూతుడైనాడే. ఎంతటి చిత్రమైన ఎత్తువేసినాడు. ఎంత పెద్దసేనాధికారికిగూడ నట్టియుక్తియే తోచలేదేమి. మొన్న చక్రవర్తి ఆ అఖండ జయోత్సవమున సువర్ణశ్రీని జయకిరీటధారి నొనరించినాడు. ఆబాలుడు దివ్యునివలె వెలిగిపోయినాడు.

లవకుమారి అతని జయోత్సవమున అంత ఆనందమందినదేమి? తన్ను రక్షించిన యువకుడు పాటలీపుత్ర పతనమునకును కారకుడైనాడని కాబోలు. సోమదత్తాచార్యులును తానే జయమందినట్లు ఉప్పొంగిపోయినారు.

ఈ ఆలోచనతోడనే చారుగుప్తులవారు జపము ముగించుకొని తమ మందిరములోనికి పోయినారు.

అక్కడ సమవర్తి యుండెను. చారుగుప్తుడు లోనికి వచ్చుటయు, సమవర్తి పెదమామకు నమస్కరించి, ఆయన రత్నకంబళిపై అధివసింపగనె తానును కూరుచుండెను.

“మామయ్యగారూ! ఆంధ్రులు అఖండవిజయ సంపన్నులగుటకు మీరే కారకులు. మీ పరమసంకల్పము శతధా విజయమందినది. ఇంక హిమ వివాహవిషయము తేల్చవలసి యున్నది”

ఇంతలో లోనినుండి అమృతలతాదేవియు, భిక్షుకుడైన వినయభిక్షువును ఆమందిరములోనికి వచ్చిరి

అమృతలతాదేవి:— అన్నా! నీవు మావానికి హిమను ఇత్తువని మేమందరము ఆశించియున్నాము. మా సమవర్తి విజయపరంపర నీవు వింటివికదా! ఇంక అందరును ఇచ్చటనే యున్నారు. సమవర్తికి హిమబిందునకు మనువు నిశ్చయముచేయించి, వివాహోత్సవము చేయింపుము.

వినయ:— కుమారా! నా ఉద్దేశము అదియే! నేను నీకు సలహానిచ్చుచున్నది తండ్రినై కాదు. భిక్షువునయ్యు మా గురువులగు అమృతపాదార్యులు నిందుల కియ్యకొనుటచే నిట్లు చెప్పుమంటిని.

చారు:— చెల్లీ! నీమాటయు, నాన్నగారిమాటలు ఎంతయు సముంజసములే! అయిన నేను చిరంజీవ, సౌభాగ్యవతి హిమబిందుదేవిని శ్రీకృష్ణశాతవాహన మహారాజునకీయ నిశ్చయించి, చక్రవర్తిగారికి నామనవి నివేదించితిని. అందుకు చక్రవర్తులును, సామ్రాజ్ఞి ఆనందదేవి మహారాణియు సంతోషమున సమ్మతించినారు

అమృత:— ఆఁ!

సమ:— ఏమిటీ! అదియా నీ ఉద్దేశము! అది ఉత్తమమార్గమే! కాని నాకు తెలియవచ్చిన విషయములు కొన్ని ఉన్నవి. అవి నీకు కొలదికాలముననె వ్యక్తమగును.



అమృతలత కోపముతో సమవర్తి ఏదో బరువుపోయిన హృదయముతో

వినయభిక్షులవారు. “నాయనా! నీ ప్రయత్నము ఉత్తమమైనదే! కాని అమ్మాయి అమృతలతను అడిగివలె నీపని చేయవలసినది. నేననునది ఏమియులేదు హిమ సంతానవతియై, దీర్ఘసుమంగళియై, బుద్ధభగవదారాధన పరురాలై మనవలసినదని నా ఆశీర్వచనము; నేను వెళ్ళుచున్నాను” అని కుమారుడు పాదాభివందన మాచరింప, నాశీర్వదించి వెడలిపోయిరి.

చారుగుప్తులవారు హిమబిందును కలిసికొన నామె మందిరములోనికి బోవుటయు, అంతకుముందే హిమబిందు రథమెక్కి కీర్తిగుప్తులవారి మందిరమునకు బోయెనని తెలిసినది

చారుగుప్తుడు విసిగికొనుచు, చక్రవర్తిని దర్శింపబోయినాడు.

హిమబిందు కీర్తిగుప్తులవారి భవనములో, వారి మందిరమున తాతగారి ఒడిలో తలనుంచి వెక్కివెక్కి ఏడ్చుచున్నది

అతడామె తల నిమురుచు, “నాతల్లీ ఎందుకు ఏడుపు? నీహృదయము నాకవగతము కాలేదనా? నీతండ్రికి యౌవనమనోరథము లర్థముకావు. అతడు ధనముకొరకు దేశముల తిరిగినాడు. నేను ఆనందముకొరకు, ఆతనికి ధనముకొరకు దేశములు తిరిగినాను. నా ఇంటనున్న అపురూప విచిత్రములను మూల్యమునకు కుబేరులు కొనజాలరు. నీతండ్రి కుబేరుల కిప్పియ్యగలడు. కన్నతల్లీ! నేను నీతండ్రినిట్లంటి ననుకొనకుము! అతడు నీతల్లిని ఆత్మసమానముగ ప్రేమించినాడు కాని ఆమెను మృత్యుంజయగ చేయలేకపోయినాడు. ప్రేమ సావిత్రివలె మృత్యువును జయించును. ఆమెను తనకొరకుమాత్రము ప్రేమించినాడు. ఆమె కారణజన్మ వెడలిపోయినది. గంగ శంతనునివిడిచి వెడలిపోలేదా? తనరూపం ప్రేమించిన శంతనుడుసమయభంగముచేయగలిగినాడు. గంగ ఆతనివీడి వెడలిపోయినది. తల్లీ! నాతల్లియు మనలనువీడి వెడలిపోయినది” అని తనలో తాను ఆమెకు వినబడునట్లు మాట్లాడినాడు.

హిమ:— నా ప్రేమ ఎట్టిది తాతయ్యా!

కీర్తి:— తల్లీ! నీ ప్రేమలో ఇంకను నీవు కొంచెమున్నావు

హిమ:— ఆఁ!

కీర్తి:— అవును కన్నతల్లీ! నేను చెప్పవలసిన సమయము వచ్చినప్పుడు, మోమాటములేక చెప్పెదను.

హిమ:—తాతయ్యా! నేనేమిచేయుదును? సువర్ణశ్రీని వివాహము చేసికో లేనివాడు. నాప్రాణమే పోవునేమో!

కీర్తి:—తల్లీ! ప్రేమ రెండువిధములు. నువ్వు ప్రేమింతువు. కాని ఆప్రేమించిన వానిని నీభర్తగా గోరవు. అది మహోత్తమప్రేమ.

హిమ:—అది ప్రేమయేమిటి? అది గౌరవము. స్నేహము.

కీర్తి:—రెండవది, నీవు ప్రేమించినవానిని భర్తగా వాంఛింతువు అది ఉత్తమప్రేమ. నీది రెండవరీతి నేను చెప్పిన మొదటి ప్రేమ, పురుషుని దైవముగా మాత్రము చూచును. రెండవరీతి ప్రేమగలవారు, వివాహమైన వెనుక భర్తనే క్రమముగా దైవమునువలె ప్రేమించుటయు కలదు. కావుననే నీవు సువర్ణశ్రీని ప్రేమించియు, నీతండ్రి నిన్ను శ్రీకృష్ణశాతవాహనునకిత్తునని చెప్పగనె ఊరుకొనగలిగితివి. కావుననే ఇట్టి రసాభాస యగుచున్నది.

హిమ:—తాతయ్యా! నీవుచెప్పినది నిజము కాని ఇప్పుడు నేనేమి చేయగలను?

కీర్తి:—తల్లీ! నీవలన తప్పులేదు. నీలోని యౌవనరక్తముదే తప్పు. నేను మీయమ్మత్తవను భారతీయనారిగా నొనరించుటకు ఎంత తపమొనరించితినో తెలియునా? చివరకు విజయమందితిని. నీతల్లి నాకొమరిత! మీ అమ్మమ్మ కొమారితకాదు నీవు మీ అమ్మమ్మకు, నాకును మనుమరాలివి. నీతండ్రికూతువు.

హిమ:—తాతయ్యా! నా హృదయమంతయు, నీకు విప్పిచెప్పితిని. నీకేమి చేయుమన్న చేసెదను. ఒక్కటిమాత్రము నిజము. నా అంతరాత్మయో ఏదియో నాకు చెప్పుచున్నమాట నిజము. నేను కోరినపురుషుడు నాకు భర్త కానిచో, నా తాతవలె నేనును దీక్షగైకొందును. లేదా, నాప్రాణము ఈబొందివిడును. నాకా శిల్పియే దైవము, మిత్రుడు, భర్త. నా అనుమానములన్నియు వీడినవి. ఆతని నామము తలపని నిమేష మొకటిలేదు. నిద్దురయేలేదు! స్వప్నములు, స్వప్నముల నా దివ్యమూర్తి!

ఇంతలో కీర్తిగుప్తులుపంపిన చారుడొకడు తిరిగి వచ్చినాడని కంచుకి చెప్పినాడు. కీర్తిగుప్తుడు లోనికిరా ననుమతి నిచ్చుటయు, నాతడు వచ్చెను

"అయ్యా, సువర్ణశ్రీ నిన్ననే పాటలీపుత్రమువీడి ఎచ్చటకేని పోయెనట" అని చెప్పెను.



# పంచమ ప్రకరణము

## సుశర్మ ప్రస్థానము

పాటలీపుత్రపురము ఆంధ్రుల వశమైన దినముననే, సువర్ణశ్రీకుమారుడు మహావేగముతో నగరదుర్గమును పదివేలమంది సైనికులతో ముట్టడించెను. గంగానదీతీరమున తూర్పుగ, తీరస్థకుడ్యములకు నూరుధనువుల దూరమున చంద్రగుప్త సార్వభౌముడు నగరదుర్గమును నిర్మించెను.

ఈ దుర్గము ఒక చిన్నినగరమంత విశాలముగనున్నది. ఈ దుర్గముచుట్టును గంగానదిలో నుండి ఒకశాఖను కొనివచ్చి లోతును వెడల్పునుగల పరిఖగానొనర్చి దుర్గసంరక్షణ చేసినారు. ఈ దుర్గమునకు నాల్గువైపుల నాల్గు ద్వారములు మాత్రమున్నవి.

చక్రవర్తి సౌధములు, హర్మ్యములు, మహాభవనములు, రాజోద్యానములు ఎంతో సుందరములుగా నశోకచక్రవర్తి నిర్మించినారు

నేడు ఆంధ్రులు పాటలీపుత్ర మహానగరమును స్వాధీనము చేసికొనగనె సుశర్మ కాణ్వాయనుడు ఏబదివేలమంది సైన్యముతో సేనానాయకులతో రాజకోటస్థుడై, యుద్ధము సాగించుచుండెను.

సువర్ణశ్రీ యుద్ధముచేయుచు, దుర్గసింహద్వార గోపురమునే తలపడెను. సమవర్తి, సోమదత్తాచార్యులు, స్వైత్రులవారు తక్కిన మూడుగోపురములకడ విజృంభించిరి. సువర్ణశ్రీ యుద్ధవిధానమును గమనించుచు ఆతని కనేకవిధముల బాసటయై చక్రవర్తియే ఇరువదివేల సైన్యముతో వెనుక నిలిచియుండెను.

సువర్ణశ్రీ వేగము మహావేశపూరితమైనది. ఆతని ఆవేశమే ఆంధ్రవీరులను గూడ ఆవేశింప ఘోరయుద్ధ మొనర్చుచుండిరి. కందకములో పుట్టెలువైచిరి, నావలు రెండుమూడు బళ్ళపైకట్టి తీసికొనివచ్చి పరిఖలోవైచిరి కోటగోడలపైనుండి వచ్చు అగ్నివర్షమునకు, బాణవర్షమునకు నున్నని దళసరి ఖడ్గమృగపు జర్మములచే, ఎనుబోతు

చర్మములచే సంతరింపబడిన కేడెముల వితానమే రక్షగా సైనికులు నావలపై గోడల దగ్గరకుపోయి ద్వారముచేరబోయి వానిని ఛేదింప గడగుచుండిరి.

యాంత్రికాయుధములు సంతతధారగా కోటలో కురియుచుండెను. సువర్ణశ్రీ స్వయముగ ఒక ఏనుగుపై నున్నిశయ్యలమరించి ఆపైన ఇనుపఫలకములు కప్పి అందు పూర్ణకవచధారియై కూరుచుండి, పైన ఉక్కుకేడెముల ఛత్రములవలె గజరక్షకులు పట్టియుండ కోటలోనికి నా గజమును దూకించెను. ఆ మహాగజమునకు మహాకవాట విధ్వంసినియన్న బిరుదనామమున్నది. ఆ దంతావళము కరమున ఇనుపగుదియబూని గోపురద్వారమును ముక్కలగునట్లు తాడన మొనరింపసాగెను.

పైనుండి వ్రాత్యవర్షము కురియుచుండెను. ఒక గడియలో ద్వారములు వివిధములగు తాకుడులవలన ముక్కలైవిడినవి. ఆంధ్రసైన్యము "జై సువర్ణా" యని లోనికి జొరబడెను. వెంటనే చక్రవర్తి నూరుగజముల సింహద్వారముకడకు దూకించెను. పుట్టెలు, పడవలు వందలకొలది నిండిపోయినవి. వేనకువేలు సైన్యములు లోనికురికినవి. కాణ్వాయనసైన్యము లాఘాటికాగలేక వెనుకంజనిడినవి. చక్రవర్తియే కోటలోని కడుగిడెను. తన మహాధనుస్సుతో చక్రవర్తి నిరంతర బాణవర్షము చేయుచు ప్రాణములు గొనుచుండెను.

ఆ సంకులసమరములో, చక్రవర్తి వైతాళికులచే "ఆయుధములు పడవేసినవారి రక్ష" అని కేకలు వేయించుచుండెను. ఒక్కసారిగా ఆ ద్వారముకడ యుద్ధము చేయు ఏడువేలమంది హతశేషులు తమ ఆయుధముల క్రిందపడవేసిరి.

సువర్ణశ్రీ నూరుగురు మహావీరులతో, కాణ్వాయనచక్రవర్తి గజారోహియై యుద్ధము నడుపుచోటికేగి, "కాణ్వాయన మహారాజా, ఇంతటితో యుద్ధముచాలును. మీ భటులందరు నిరాయుధులైనారు. యుద్ధముమాని తమసేనల కాజ్ఞ ఇండు. తమ్ము బంధించము. చక్రవర్తి గౌరవము లొసగబడును" అని కేకవేసెను.

సుశర్మ కాణ్వాయనునకు పాటలీపుత్రనగరము పట్టుబడుటతోడనే వైరాగ్యముదయించి యుండెను. తనసేనలయందే తనకు నమ్మకము లేకయుండెను. కావున సువర్ణశ్రీ అట్లుపలికిన వెంటనే యుద్ధవిరమణ భేరీ చఱపించెను.

ఆ భేరీనాదములు వినగనే, సుశర్మచక్రవర్తి సైనికులు ఆయుధములను క్రింద పారవేసినారు.



సుశర్మచక్రవర్తి విచారవదనమున గజావరోహణ మొనర్చెను. సువర్ణశ్రీ ఆ ప్రభువునకు సాష్టాంగ దండప్రణామంబులిడి, లేచి "మహాప్రభూ రండు తమ దర్శనము చేయ మా చక్రవర్తి కాంక్షించుచున్నా" రనెను.

శ్రీముఖచక్రవర్తియు పాదచారియైవచ్చి, సుశర్మచక్రవర్తికి వీరనమస్కారమిడెను.

ఇరువురు బ్రాహ్మణులు, చక్రవర్తులు. ఒకరు ఓడినారు, ఒకరు జయమందినారు. సుశర్మ శ్రీముఖునకు ప్రతినమస్కారమిడెను. శ్రీముఖచక్రవర్తి సుశర్మ కడకు పోయి, యాయనను కౌగిలించెను.

ఇరువాగుల సైన్యములవారును జయజయ ధ్వానములు కావించినారు.

సుశర్మ:—మహారాజా మా కాణ్వాయనయుగ మింతటితో అంతరించినది. కాని దాక్షిణాత్యులగు మీరిప్పటినుండి ఏమి పాలన మొనరింపగలరు. మీరు బౌద్ధులై వేదముల నగౌరవ మొనర్చిరి. యుగయుగములనుండి పవిత్రమైయుండిన ధర్మముల నడుగంటించి, ఘృణ్యబాహ్యమైన ఈ చార్వాకమతమును, సర్వనాశనముకొరకు విజృంభింపచేసినారు. మీ బుద్ధుని ధర్మము శాశ్వతమగునా? వేదములే పరబ్రహ్మస్వరూపములు అవి నాశనముకావు. ఈదినముకానిచో, రేపుమీ బౌద్ధధర్మము నాశనమైపోవును ఈ జంబూద్వీపమునందు బుద్ధధర్మమే లేకుండ నాశనమగుగాక! మాధర్మము మేము నిర్వర్తించుటకు మీరనుమతించినచో మేము వానప్రస్థమునకై హిమాలయములకు పోగలము. లేదా మీ యిష్టమువచ్చినట్లొనరింపు" డనెను

శ్రీముఖుడు:—చక్రవర్తీ, మీరు మీధర్మము నిర్వర్తించినారు. మేము మా ధర్మము నిర్వర్తించినాము. 'మేమొనరించినది ధర్మబద్ధము. మీది కాదు.' అని మేమనను. తాము తప్పక హిమాలయములకు పోవచ్చును. మనము ప్రయత్నము చేయవలెను. తర్వాత కర్మమెట్లు నిర్దేశించునో యట్లుజరుగును తామెప్పుడు ప్రయాణము చేయ నిశ్చయింతురో యప్పుడ మీ కిష్టమగునవన్నియు గొనిపోవచ్చును. మేము మీ సేవకులము మీ అతిథులము.

సుశర్మ:—మహారాజా సెలవు తీసికొందుము. వేదధర్మమును, బౌద్ధధర్మమును సమానముగ పాలింపుడు. అదియ మాకోర్కె అని యంతఃపురములోనికరిగి హిమాలయప్రస్థాన ప్రయత్నమున నుండెను.

ఈ విజయమునకు సువర్ణశ్రీ కారకుడని చక్రవర్తి యాతనివంక దిరిగి, తన మెడ లోని విద్రుమమాలను ఆతని కంఠమున వైచెను.

విజయులైన ఆంధ్రులు మహోత్సవములొనరించుట ప్రారంభించిరి.

సువర్ణశ్రీ నగరములో తండ్రిగారు విడిదిచేసిన భవనమునకు బోయెను. తన ధర్మము నెరవేర్చినాడు. ఈ మహాయుద్ధము తన ప్రాణములు కాంక్షించినచో నీయుటకు సిద్ధమయ్యె మరియు ముందుకు చొచ్చుకుపోయినాడు. ఎప్పటికప్పుడు కొన్ని గాయములు తగిలినమాట నిజమే. ఒక్క గాయమును ప్రాణముకోనలేదు. తాను యశము నాశించినాడు. ప్రాణనష్టము ఆశించినాడు. రెండును తుచ్ఛములే. ఒకటి సంభవించినది. ఒకటి సంభవించలేదు.

పొమ్మన్నను పోని యీ ప్రాణము తీపి. దానిని వదలలేము. ప్రాపంచికానందము కావలెను. అందమైనభార్య కావలెను. ఎంత చిత్రమైనది మానవజీవితము?

ఈ ఆలోచనలతో తన వైద్యునిచే గాయములకు ఔషధములచే కట్లు కట్టించుకొని, ఆలోచించి, ఆలోచించి, తల్లిదండ్రుల సెలవుసంది తాను యాత్రలుసలుపుచు ధాన్యకటకము చేరెదనని వెడలిపోయెను.



# షష్ఠ ప్రకరణము

## అమృత పాదులు

సర్వదక్షిణాపథ చక్రవర్తిని సర్వభారతవర్ష, సర్వభూమండల చక్రవర్తిగా అభిషేకింప మహాప్రయత్నములు జరుగుచున్నవి. దేశదేశముల మహారాజుల, భూపతుల, మహామాండలికుల, మహాఋషుల, పండితుల, అర్హతుల, సంఘారామాచార్యుల, వివిధపరిషత్తుల కులపతుల, మహాభిక్షుకుల, భిక్షుల, భిక్షుణుల, జైనసన్యాసుల, దిగంబర శ్వేతాంబరుల, జైనమహర్షుల, పర్తకచక్రవర్తుల యవనుల, సామంతుల ఆహ్వానించుటకు, పండితులు, మంత్రులు, సేనాపతులు వివిధదేశములకు శ్రీముఖునినిమంత్రణమున వెడలిరి.

పాటలీపుత్రము మహావైభవముగ నలంకారికులు అలంకరించుచుండిరి. స్వర్ణసంధి ఆ అలంకారికులకు ఆజ్ఞలిచ్చుచుండెను.

చక్రవర్తికి ఎటుచూచినను విజయమే. అయినను తన పెద్దకుమారుడు విషకన్యనొక బాలికను ప్రేమించుచున్నాడనియు, నామె యాతని ప్రేమించుచున్నదనియు, కాని ఆబాలిక విషకన్యయగుటయే వారి సమాగమమునకు అడ్డువచ్చినదనియు చారులచే శ్రీముఖుడు వినినాడు. తన స్నేహితుడు, సోదర సమానుడు, ఆంధ్రమాజనకుడు, ఉత్తమపురుషుడగు చారుగుప్తుని పుత్రికను వివాహమాడజాలనని యువరాజు తనతల్లితో చెప్పెనట. చక్రవర్తికీసమస్య హృదయాందోళన కారణమయ్యెను.

చారుగుప్తుని నిర్వేదము తానెట్లు భరింపగలడు. శ్రీకృష్ణుని తన ఆజ్ఞచే హిమబిందు కుమారినికూడ వివాహమగునట్లు చేయవచ్చును. అవసరమైన అట్లు చేయవలసి యున్నది.

శ్రీకృష్ణుడు విచిత్రమైనబాలుడే! ఆ విషకన్యను తక్క ఇంకొక్క బాలిక నుద్వాహము కాడట. తాను రాజ్యమునైన వదలివేయునట.

ఎవరావిషబాలిక! ఆమెను తానొకసారి చూడవలసియున్నది. ఆబాలిక స్థాలతిష్యుని శిష్యురాలట మనుమరాలని కొందరనిరి. ఎటి మనుమరాలో! ఆ దూరాం

నుడు తన మనుమరాలిని విషకన్యగా నెట్లు చేయగలిగినాడో! వెనుక చాణుక్యుడట్టి విషకన్యల విరోధి నాశనమునకే ప్రయోగించువాడట. స్థౌలతిష్యులవారికి తన కుటుంబమన్న నింత కోపమేమి?

తాను శ్రీకృష్ణునికి ఈ నిరంతర మృత్యుసన్నిహితత్వ మెట్లు సహింపగలను. విషకన్యను యువరాజుకడనుండి తొలగించి మరల స్థౌలతిష్యుని అంతికమునకు పంపగలయునా? అయినచో, యువరాజునకు మిక్కుటముగ కోపమురావచ్చును. కాని రొతిగిరొతిగి ప్రేమాస్పదుడగు నా బాలుని చావున కనుమతించుట ఎట్లు?

ఈ విషసమస్యను విడదీయగలిగిన మహానుభావుడు అమృతపాదార్హతులే! వారి దర్శనము చేసినచో నుత్తమమనుకొనును. చక్రవర్తి రథమునెక్కి, పాటలీపుత్ర పురమునున్న మహాచైత్య సంఘారామమునకు వెడలిపోయెను.

అమృతపాదులకు చక్రవర్తి తమ్ము దర్శింపవచ్చుచున్నారని తెలియగనే చతుశ్శాలలోనికివచ్చి, అచ్చట రత్నకంబళులు పరిపించి ఉపధానములు వేయించెను.

ఇంతలో చక్రవర్తియు వచ్చెను. అమృతపాదులకు నమస్కృతులిడి, ఆశీర్వాదమంది, కంబళిపై చక్రవర్తి యధివసించుటయు, అమృతపాదులును ఎదుట కూర్చుండిరి.

"ప్రభూ! తాము వచ్చిన కారణము?"

"విషకన్యకా శ్రీకృష్ణుల సంబంధవిషయమై తమతో నాలోచింపవచ్చితిని."

"ఆ విషకన్యకకడకు నేను వెళ్ళితిని. యనురాగమెరుగని నాకు అవ్యాజపుత్రికాప్రేమ ఆకన్నెపై యుదయించినది"

"విషకన్యకగదా! ఆమె సామీప్యమే మృత్యువనినారు."

"నేను విషపు విరుగుడులతోడనే వెడలితిని. ఆ బాలిక సాత్వికమూర్తి. స్థౌలతిష్యులవారిని నేనెప్పుడును దర్శనము చేయలేదు. ఆయన మాహాత్మ్యము ఆంధ్రులనేకులు విభ్రాంతులై చెప్పుకొందురు. అట్టి ఉత్తమఋషి మనుమరాలు ఈ బాలిక! ఈ బాల నెట్లు విషకన్యను చేయగలిగిరో?"

"అదియే, నాకును ఆశ్చర్యము గొల్పినది. శ్రీకృష్ణుని నాశనముచేయ నీబాలిక నా మహర్షి ప్రయోగించెనట స్వామీ!"

"అవును! ఆ విషయములన్నియు బయటపడినవి, మహారాజా! శ్రీకృష్ణుడు ఆ బాలికను ప్రేమించుచున్నాడనుటలో నాశ్చర్యమేమియులేదు. ఆమె సౌందర్యమతిలోకము"



"హిమబిందుకుమారి సౌందర్యవతి కాదా స్వామీ?"

"కావచ్చును. హిమబిందు శిల్పసూత్ర లక్ష్యభూత, సౌందర్యసర్వస్వము. కాని ఈ విషకన్యలోని సౌందర్యము ఒక మహోత్తమ్మాత్మాభితప్తమగు మూర్తిత్వము. సుందరరేఖా సమన్వితమూర్తి, ఒక్క హిమబిందుమూర్తికి తగ్గునేమో! కావుననే యువరాజు తన సర్వస్వముతో నీమెను ప్రేమించుచున్నారు."

"ఆ బాలిక విషబాలయగుటవలన ఆత్మాభిదత్తత కుంటుపడిపోదా?"

"ఆమెను విషకన్యను చేయుటలో, ఆమె దేహము విషయుక్తమైనది. ఆమె హృదయము ఆమెలోని ప్రకృతి. ఆమె బుద్ధియు, అహంకారమును విషయుక్తములు కాలేదు. ఆమెలోని మనోబుద్ధ్యహంకారాల వృతములేయైనవి, అమృతమునిండిన నీచపాత్రతో మనము పోల్చవచ్చును. ఆపాత్ర విషముతో నిర్మించినారనుకొందము. అట్టిది ఈ బాలిక."

"విషకన్యకకు శ్రీకృష్ణునకు వివాహమెట్లు గురుదేవా?"

"అదియే ఆలోచింపవలసిన విషయము మహారాజా! నేను స్థౌలతిష్యులవారిని సందర్శించి వారి హృదయమును కరిగింప ప్రయత్నింతును. ఆపై భగవాన్ బుద్ధదేవుని కరుణ!"

"ఆచార్యదేవా! చారుగుప్తుడు ఆంధ్రదేశమునకు శేషునివంటివాడుగదా!"

"అవును!"

"అతనికి సర్వప్రపంచము హిమబిందుకుమారి!"

"అవును!"

"ఆమెను యువరాణినిచేయ ఆ బాలిక చిన్నతనమునుండియు నాత్రితపస్సు. అందుకై ఆమెకు సర్వవిద్యలు నేర్పించినాడు ఆ వర్తకచక్రవర్తి. ఆమెకై తన అనంతములైన సర్వైశ్వర్యములు నర్పింప సిద్ధముగనున్నాడు."

"ప్రభూ! బాలికలు సర్వసాధారణముగ నీడువచ్చిన వెంటనే ప్రేమాభియుక్తలై యుందురు. ప్రేమ వ్యక్తిరూపమున సాక్షాత్కరింపదు. ఆ సమయములయందు ఒక బాలికను వరు నేర్పాటుచేయుదురు పెద్దలు. ఆ బాలిక తనవరుని ప్రేమించును కాని ఒకసారి యుక్తవయస్కయగు నొక బాలిక వరుని తాన ఎన్నుకొని, అతనిగాఢ

ముగ ప్రేమించినచో ఆ బాలికను వేరొక్కరికిచ్చి వివాహముచేయుట. ఆ బాలికచే వ్యభిచార మహాదోషము చేయించుటయే!"

"చిత్రము ఆచార్యదేవా!"

"హిమబిందు తన సర్వస్వము ఒకబాలునికి దత్త మొనర్చుకున్నది. ఆ బాలుడామెను ప్రేమించుచున్నాడు. అట్టిబాలికను యువరాజునకెట్లు ఇత్తురు. చారుగుప్తుడైన అధర్మమున కెట్లియ్యకొనును."

"అట్లనా! ఎంతవిచిత్రము! ఎవ్వరా బాలుడు?"

"మన సువర్ణశ్రీ!"

"సువర్ణశ్రీకుమారుడు. అతని నెవ్వరు ప్రేమింపరు? ఇది గాఢాలోచనము సలుపవలసిన విషయము ఆచార్యదేవా!"

"ఆలోచనమున కేమియున్నది. సువర్ణశ్రీ మహాశిల్పి. భక్తుడు సర్వశాస్త్ర పారంగతుడు, వీరసింహము. చారుగుప్త దేవుడు అంత మహాసామ్రాజ్యమునకు మూలము సువర్ణశ్రీశక్తి."

"అవునుస్వామీ!"

చక్రవర్తి వెడలిపోయెను. అమృతపాదులు ఆలోచనాధీనులయ్యెను.

స్థౌలతిష్యులు సనాతన ధర్మతేజస్సు. అనార్షములైన మార్గములవెంట మానవులు నడుచునప్పుడట్టి మహోత్తమపురుషు లుద్భవింతురు. సనాతనమార్గము వక్రగతి నంది మానవాభ్యుదయమున కిసుమంతయు నుపకరింపక, కర్కశమై, మృత్యురూపమందినప్పుడు బుద్ధభగవానునివంటి అవతారపురుషు లవతరింతురు. అవియు కర్కశమైనప్పుడు, సనాతనత్వము నూత్నపుష్టి చేకూర్చుకొని, ఆ అధునాతనత్వ వక్రగతిని ఖండించును. ఈ రెండుశక్తులిట్లు పోరాడుకొనుచు లోకమును ముందునకు నడిపించుకొని పోవుచుండునుగాబోలు ననుకొనుచు అమృతపాదార్హతులు సమాధిలోనికి పోయెను. ఆయనమోము చంద్రికాంతివలె వెలిగిపోయెను.



# సప్తమ ప్రకరణము

## సమవర్తి హృదయము

సమవర్తి నాగబంధునికను చూచుట యేమి యామెను ప్రేమిం...... పొంగారి యుద్ధకుశల, ఆనందహృదయ, స్పష్టసౌందర్యరేఖా సమన్విత. వీరవిక్రమోపేత!

అందమైన యువతులు మూడుజాతులవారని సమవర్తి అనుకొనినాడు. ఒకజాతివారు పూవుల ప్రోవులు, వెన్నతో తేనెలు రంగరించినవారు:

ఇంకొక జాతివారు వజ్రముల ప్రోవులు, మూడవజాతివారు తేనెలును, కరగించిన బంగారును కలియబోసి మూర్తినందినవారు.

మొదటిజాతివారు అతి ఆర్ద్రహృదయులు, రెండవవారు కర్కశహృదయులు, మూడవవారు, సమహృదయులు, నాగబంధునిక మూడవజాతి బాలిక. ఆమెఎంత గంభీరమగు చరిత్రకలది? ఆమె యుద్ధము అప్రతిమానము. తన్ను గోవర్ధన పర్వతమువలె రక్షించును. శ్రీకృష్ణ పార్థసారథివలె అఖండధైర్యము సమకూర్చును ముందునకు తన్ను విజయయానము చేయించును.

యుద్ధము చేయునప్పుడు నాగబంధునిక బాలికయన్న భావమాతనికి కలుగునది కాదు. ఆమె ఆతనితో కలసి యాతనికవలవలె యుద్ధము చేసినది. ఆమెకు గాయములు తగిలినవి. తనకును తగిలినవి. కాని ధనుంజకర దావాగ్ని శిఖలవలె వారిరువురు సమముగ ముందుకు చొచ్చిపోవువారె.

వారిరువురి హృదయములు ఆనందమయములు. వారు ఒకరినొకరు ప్రేమించుకొనుచున్నట్లు ఒకరికొకరికి తెలియును.

ఆమె వీరకుమారుడై తెల్లవారగట్లనె సమవర్తి శిబిరమునకు వచ్చునది. ఈబాలిక నెట్లు యుద్ధమున కనుమతించుట. తనతో తీసుకొనిపోవుట? అని ఆతడనుకొనును. ఈ మహావీరువితో భుజము భుజము కలిపి యుద్ధముచేయు భాగ్యము సర్వభాగ్య

ములను మించిన పరమోత్తమ భాగ్యమని యామె యనుకొనెను ఇరువురు యుద్ధమునకు బోదురు.

పాటలీపుత్రపురము పట్టుకొను మహాయత్నము జరుగునాడు. నాగబంధునిక సమవర్తులతో సమముగ విరోధులతో తలపడినది. ఆమె ఆరోజు అపరాజితాదేవియే! చకపకమని నవ్వుచు.

“ ఆంధ్రవీర రారా!
అరిపైనే దుముకరా !
పుష్పపురము నీదేరా
పురంజయుడ వీవేరా ! ”

అని పలుకుచు తన ఉత్తమాశ్వమును ముందుకు సమవర్తి గుఱ్ఱముతో సమముగ దూకించినది. పుష్పపురము ఆంధ్రుల వశమైనది.

నాగబంధునికయు సమవర్తియు తిరిగి తమ సైన్యముల నడుపుకొనుచు వచ్చుచుండ నాగబంధునిక గుఱ్ఱము ఒక శవముపై కాలువేసి తూలిపడిపోయినది

“ అయ్యో! ఇదేమిటి అనుచు సమవర్తి ఘోంగున తనహయమునుండి ఉరికి నాగబంధునికను సమీపించి, నువ్వున యామెనెత్తుకొని, “నాగబంధునికా! నాగబంధునికా! ” యని వేదనాపూర్ణమగు అరపు అరచినాడు. నాగబంధునిక పదిని మేనులు చైతన్యరహితమై యాతని చేతులలో కదలలేదు.

వెంటనే యుద్ధవైద్యులువచ్చి, యామెను ఆపరిసరములనున్న ఒక భవనవితర్దికపైన సమవర్తిని పరుండబెట్టుమనిరి ఒక వైద్యుడు ఆమె సమవర్తి చేలకునుండగనె ఆమె పెదవులపై దివ్యలేపరూపమునను్న దివ్యౌషధము నొకదానిని వ్రాసినాడు. ఒక ఔషధనస్యమును ఆమెముక్కుపుటములకడ నుంచినాడు.

ఆమెను ఒక అరుగుపైన సమవర్తి పరుండబెట్టెను.

ఆమెకు వెంటనే మెలకువవచ్చి, చూచుకొనుసరికి ఆమెతల ఆతని తొడపై నుండుటయు ఆతని ప్రణయభయార్ద్రదృక్కుల ఆమె మోముపై ప్రసరింపుచుచేతితో ఆమె నుదురు తడుచుచు, “ నాగబంధునికా! నాగబంధునికా!” అని అస్పష్ట వాక్యముల పిలిచినాడు.



నాగబంధునిక ప్రథమమున కలయనుకొనినది. తర్వాత తనకును సమవర్తికిని వివాహమైనదనియు, ఇది వివాహానంతరము తనప్రియభర్త తన్ను అనునయించుచున్నాడుకాబోలుననుకొనుచు సిగ్గుపడుచు “ప్రాణేశ్వర! ” అని చేతులు చాచి ఆతని తలవంచి యాతని పెదవులు ముద్దుకొనెను

సమవర్తి ప్రణయ మహావేగమున కదలిపోయి, ఆమెపై వ్రాలి తన హృదయమున కదుముకొని, ఆమెను గాఢముగ చుంబించెను

ఆమె పడినవెంటనే యామె శిరస్త్రాణమునుతీసినారు కొందరు. దీర్ఘమై ఒత్తయిన యామె కచభారము ముడివీడి మేఘమువలె ప్రసరించిపోయినది అప్పుడు ఆచుట్టుమూగిన వీరులు, ముఖపతులు, గణపతులు మొదలగువారామె బాలికయని గుర్తెరిగినారు.

“ ఈబాలిక ధర్మనందులవారి కొమరిత, సువర్ణశ్రీ సేనాధ్యక్షుల చెల్లియట ” అని సమవర్తి వైద్యునకు తెలిపియుండెను

నాగబంధునికకు పూర్తిగ మెలకువవచ్చి నువ్వునలేచి. “ఇదియేమి ఇచ్చట నుంటిని. ఏమి జరిగినది సేనాపతీ! యని యామె యాశ్చర్యమున నడిగినది.

నాడిచూచి వైద్యుడాబాలికకు ఏమియు ముప్పులేదని వెడలిపోయెను. ఎచ్చటను ఏఎముకయు విరగలేదనియు, నట్లు విరిగినచో, నాడిగతి కేరసుననియు నావైద్యుడు సమవర్తికి చెప్పి. తనపనిపై తానుపోయెను.

నాగబంధునిక గుఱ్ఱము భక్తిగురు చూపులతో తన యజమానురాలిని చూచుచునిలుచున్నది. ఇరువురును తమతమ బసలకు వెళ్ళిపోయిరి.

నాగబంధునికకు పూర్తిగ మెలకువ వచ్చినప్పుడే తాను సమవర్తిని ముద్దుగొంటినని యెంతయో సిగ్గుపడెను, ఆనందమందెను, కుంగిపోయెను, ఉప్పొంగిపోయెను. ఆమె పూర్తిగ తన యోషావేషము ధరించి, సిద్ధార్థినికను నువ్వునయెత్తుకొని, యామెను హృదయమున కదుముకొని ఆమె పెదవులముద్దుగొనెను.

సిద్ధార్థినిక అక్కను తిరిగి కౌగిలించి “అక్కా! నీవు యుద్ధము చేయుచున్నావటగా, నాకు అన్న చెప్పినాడు. నీవు సమవర్తిగారిని ప్రేమించుచున్నావటగా” అని యడిగెను.

"ఛీ ఛీ! అవేమిమాటలే సిగ్గులేని తల్లీ!" అని నాగబంధునిక నవ్వుచు చెల్లెలి బుగ్గ నులిమినది. సిద్ధార్థినిక నవ్వుచు. "దొంగక్కా! అన్న నాకన్నియు చెప్పినాడులే!" అని యన్నది.

"అన్న దుర్మార్గుడైనాడేమో! అన్నతో మాట్లాడకూడదు!" అనిఅన్నది.

"అన్నతో మాట్లాడవు, అన్నదగ్గరకు రాకపోడే అన్నకు భయమా ఏమి? మాటలు మాటలువచ్చి అన్న అమ్మకు చెప్పుచున్నప్పుడు నేను వింటిని."

"ఆదేనా! తల్లీ?" అని తల్లిప్రశ్నింప నాగబంధునికపోయి ఆమె పాదాలకు నమస్కరించినది. శక్తిమతి కొమరితను ఆశీర్వదించి "అమ్మా నాయనగారితో నీవిషయము చెప్పినాను. నాయనగారు వెంటనే శ్వేతకేతులవారిని వెంటగొని చారుగుప్తులను, కీర్తిగుప్తులను, వినయభిక్షులవారిని, శ్రీ చక్రవర్తులను చూచివచ్చినారు. అమృతలతాదేవిగారిని నేనును కలసికొంటిని, ఆమె తనతండ్రినికలిసికొని ఏవిషయము తెలిపెదననినది.

శక్తిమతీదేవి నాగను బిగియార కౌగిలించుకొని మూర్ధమును ముద్దుగొన్నది. నాగబంధునిక సిగ్గుగులుకు యేదియో స్వప్నములుగనుచు నిలుచుండిపోయినది.

సిద్ధార్థినిక గంతులువేయుచు, 'ఇంక బావమీద పాటలు పాడవచ్చును. ఎంతో చక్కగా!

బావా బావా పన్నీరు
బావనుపట్టుకు తన్నేరు"

శక్తిమతి:—బావ మళ్ళీ తన్ననహో?

సిద్ధార్థినిక:—అమ్మా! ఎక్కడైనా మగవారిని ఆడవారు తన్నుట ఉన్నది. ఆడవారిని ఎవరుతన్నెదరేమిటే?

శక్తిమతి:—ఎవరు తల్లీ మగవారినితన్నిన ఆడవారు?

సిద్ధా:—సత్యభామ తన్నలేదా శ్రీకృష్ణుని.

శక్తిమతి:—సత్యభామ శ్రీకృష్ణునిభార్య కనుక తన్నవచ్చును మరవలు తన్నునా?

సిద్ధా:—పోనీ బావను అక్క తన్నును. బావను నేను ఊరడించెదను.

నాగబంధునిక :— చెల్లీ నీవేతన్నవే నీకు అనతి ఇస్తాను.



# అష్టమ ప్రకరణము

## పెళ్ళి రాయబారాలు

యుద్ధమగుటయేమి సమవర్తి కడకు తల్లివచ్చినది. "నాయనా! మనముపోయి హిమబిందును నీకిచ్చి ఉద్వాహమొనరించుటెప్పుడు అని మాయన్నగారి నడుగవలయును. మానాయనను కలుసుకొని ఇక్కడకు తీసికొనిరా! ఇంకను పెద్దలనుకొనిరా!" యని యామె కొమరుని కోరెను.

అమృతలత కోటీశ్వరుని తనయ. కోటీశ్వరేశ్వరుని చెల్లెలు. ఆమె మహారాణి వలె పెరిగినది. మహారాణియైనది. ప్రతిష్ఠానమునకు మహారాజైన ప్రియదర్శి శాతవాహన మహారాజుభార్య! శాతవాహన రాజ్యవంశము మెట్టిన యామె సహజ గర్వహృదయమునకు మరియు గర్వము సమకూడినది.

ఆమెపుత్రుని సప్తమాతృకలొక్కటై కుమారస్వామిని ప్రేమించినట్లు ప్రేమించినది. జననిప్రేమ కొమరుడెరుగును. సమవర్తి తల్లిమాట కెప్పుడును ఎదురాడలేదు. తాను నాగబంధునికను ప్రేమించినాడు. తల్లి హిమబిందును తనకై వాంఛించియున్నది. ఆమె తనయన్నను నిర్బంధించును, ఏదిఎట్లగునో?

అందరును పోయి చారుగుప్తునడిగిరి. అమృతలతాదేవితో చారుగుప్తుడు నిష్కర్షగ హిమబిందును శ్రీకృష్ణశాతవాహన మహారాజున కిత్తునని తెలిపివేసెను. సమవర్తి ఆనందమున నిట్టూర్పువిడిచెను. వినయభిక్షు కొమరితనుచూచి, "తల్లీ! నాకు చారుగుప్తుని హృదయమప్పుడె యవగతమైనది నీవు కోపమేల చెందెదవు. సమవర్తి హృదయము నాకవగతమైనది. అతడు ధర్మనంది తనయను ప్రేమించుచున్నాడు. ఆమెయు వీనిని ప్రేమించుచున్నది. సువర్ణశ్రీ తాను కాశికాదిపురములకు ప్రయాణమైపోని ముందు నాకడకువచ్చి "తాతగారూ శ్రీ సమవర్తి మహారాజును, మా చెల్లెలును ఒకరినొకరు ప్రేమించుకొనుచున్నారు. ఆర్య శ్రీ చారుగుప్తులవారు కొమరితను శ్రీకృష్ణమహారాజున కిత్తుమని నిశ్చయించిరి. నేనును హిమబిందుకుమారియు ధాన్యకటకమున నున్నప్పుడొకరినొకరు ప్రేమించుకొంటిమి. కాని చారుగుప్తులవారు కొమరితకు తన నిశ్చయము తెలిపిరి. మేము విడిపోతిమి. మహారాజునకు రాణియగు బాలికను నేను ప్రేమించుటయేమి యని కుంగిపోతిని. నేను దేశయాత్ర చేసెదను. స్వామీ! తాము సమవర్తి ప్రభువునకు నాగబంధునికకు వివాహమగునట్లు ప్రయత్నిం

చుడు. తాము ఆశీర్వదించినచో కార్యము సఫలమైతీరును. సెలవు!" అని తెలిపి వెడలిపోయినాడు. కాబట్టి నీవు నీకొమరుని ఆనందము మనస్సున తలచుకొనుము. అతనితోడిదే నీలోకము. పుత్రుని యానందమే నీ యానందము. నీపుత్రుడు మహావీరుడు. అతిరథుడు. అతని నేదో రాజ్యమునకు చక్రవర్తి పట్టముగట్టును. సువర్ణగిరి యగు ముసికనగరదేశము మహోత్తమమైనది. ఆ మహారాజ్యమునకు నీ తనయుడు ప్రభువగునని చక్రవర్తి భావము. ఆవిషయము మహామంత్రులవారు సెలవిచ్చియున్నారు" అని బోధించెను.

అమృతలతాదేవి తండ్రియగు వినయభిక్కుల మాటలన్నియు విన్నది. ఆమె ఆశలన్నియు కూలిపోయినవి. జగదేకసుందరియగు బాల తనకు కోడలగునని యూహించినది. తనకుటుంబమున ఉన్న కోటులన్నియు తనకొమరునకు వచ్చునవి యనుకొన్నది. సార్వభౌములకే ఏడుగడయగు తనయన్నగారు తనకొమరుని సార్వభౌములకు సమమొనరించును అనుకొన్నది. ఆగాధ కాంక్షాపూరిత స్వప్నములన్నియు విరిగి నేల కూలినవి. ఆమె భర్తను తలచుకొని, తనతల్లిని తలచుకొని వెక్కివెక్కి ఏడ్చినది.

లోకమున నెవ్వరికిని వెరువక తల్లికిమాత్రము వెరచు సమవర్తి తల్లిదుఃఖమును దర్శించుచు కలగుండుపడ చేష్టలుడిగి నిలుచుండినాడు.

ఆశలు, స్వప్నములు కోర్కెలు మానవులకుండుట సహజము. కాని అవి సంపూర్ణముగ స్వాభిమానములు, స్వార్థపరములు నయినచో మానవుడు తుచ్ఛుడైపోవును. సువర్ణశ్రీ హిమబిందును ప్రేమించెను. ఆమె తనకుకాదని తెలిసియు నామెను రక్షించెను. ఒక్కటియు కోరక ధర్మమార్గమున నడచు పురుషుడు వీరోత్తంసుడు. సువర్ణశ్రీ యట్టివాడు.

సమవర్తి కనులుమూసుకొనెను. తాను ప్రేమించుచున్నది నాగబంధునికను. హిమబిందు తనసొత్తు అని అనుకొని, ఆమె దివ్యసుందరవిగ్రహమును చూచి, యామె అగణితసంపదను ఎరిగి, యామెను భార్యగ ఊహించి, కాంక్షించి వ్యధలపాలయినాడు. నేడు అన్నియు తారుమారైనవి. ఉత్తమఫలవృక్షము భూమి చీల్చి పైకివచ్చినట్లు తనస్వార్థమును చీల్చి నాగబంధునికాప్రేమ వెడలి తన జీవితదారులు క్రమ్ముకొనిపోయినవి. ఇప్పుడు తల్లి ఏమనునో, ఏమియాజ్ఞనిచ్చునో?

వినయభిక్కులేచి కొమరిత మూర్ధముపై హస్తముంచి, "తల్లీ! భగవాన్ సమంతభద్రుడు మానవలోకమున కిచ్చిన యుపదేశములు నీయెడల నిష్ఫలములగుటయేనా?" యనినాడు.

సమవర్తి తలవాల్చి క్రుంగి కూర్చుండియున్నాడు. అతని తీక్ష్ణముగ చూచినది ఆతల్లి. ఆ వెక్కిళ్ళు చెవడించినవి. అమృతలత చిరునవ్వున "నాయనా! నాకు



సర్వమును నాతండ్రి ఈబాలుడే! వాని ఆనందమే నాయానందము. కానిమ్ము అన్నియు నీవే ఏర్పాట్లు చేయుము. (కొమరునికడకుపోయి) నాయనా నీవు వీరాగ్రగణ్యుడవు. నీవు నీ తండ్రిగారిపేరు నిలబెట్టిన ఉత్తముడవు. నీకు పారితోషికము నీహృదయేశ్వరినే నేనర్పింతును" అని పలికినది.

వినయభిక్కునకు వారిరువురు పాదాభివందన మాచరించిరి. అతడు వారినాశీర్వదించి, తాను గురువగు అమృతపాదులను దర్శింప వెడలిపోయెను

కొన్నినాళ్ళయినవెనుక శక్తిమతీదేవియు, మహారాణి ఆనందదేవియు మహామంత్రిభార్యయు, ఇతర ఆంధ్రనారీమణులతో పరిచారికలతో సమవర్తి యుద్ధావంతరము పాటలీపుత్రపురమున వసించు భవనమునకు వేంచేసిరి. అమృతలత యానందమున వారిని సర్వమర్యాదల నెదుర్కొని ఉచితాసనముల గూర్చుండచేసెను.

మహారాణి:—అక్కగారూ, మేము మీకడకు వివాహరాయబారము వచ్చినాము.

అమృతలత:—మహారాణీ, తాము స్వయముగ మా ఇంటికి విచ్చేయుట మాకందరకు తులలేని గౌరవమొసంగుట. మనవిచేయండి సామ్రాజ్ఞీ!

మహారాణి:—శక్తిమతీదేవి తమపుత్రికను శ్రీ సమవర్తిప్రభువునకు సమర్పింప తమ యనుమతివేడ వచ్చిరి.

ఆంధ్రమహారాణులు, మహారాజులు ఏవిషయమును తాము స్వయముగ మాటలాడరు. వారి ప్రతినిధులువచ్చి విషయములు ఏర్పాటుచేయుదురు. ఇప్పుడు ఆంధ్రసామ్రాజ్ఞి తానే స్వయముగ రాయబారియై వచ్చుట తనకెంతయో గౌరవము లభించినదియని అమృతలత ఆనందమందెను. అమృతలత తనకాసంబంధము ఎంతయో ఆనందదాయకమని తెలుపుచు, సంబంధము నిశ్చయము చేయవలసినది తనయన్న చారుగుప్తులవారే యని తెలిపినది.

మంత్రిగారిదేవేరి అమృతలతాదేవి ప్రతినిధిగ మహారాణికి, శక్తిమతికి సపర్యల నందిచ్చెను. మంత్రిభార్యను కొందరు సపర్యలనందిచ్చిరి.

చారుగుప్తునికడకు ధర్మనందియు, శ్వేతకేతువను మహామంత్రియు ఈ వివాహము విషయము రాయబారము వచ్చిరి. చారుగుప్తునకు వినయభిక్కు అమృతలతాదేవి యుద్దేశము తెలిపియుంచుటచే, చారుగుప్తులు సంతోషమున ఈ సంబంధమున కియ్యకొనిరి.

రెండుదినములైనవెనుక ఒక శుభముహూర్తమున అమృతపాదులు, చారుగుప్తులు, మహామాత్యుడు, మహాసైన్యాధ్యక్షుడు, ధర్మనంది, సైన్యాధికారులు

భిక్షులు, పండితులు, కోటలో మహారాజ సమాలోచనమందిరమున చేరి సమవర్తి నాగబంధువికల వివాహమును నిశ్చయము చేసిరి చక్రవర్తియె తాంబూలముల నిప్పించెను.

పలుపోకలబోవు ఆలోచనలతో సముచితవేషుడై, ఉత్తమాశ్వము నధిరోహించి సమవర్తి ధర్మనంది వసించు హర్మ్యమునకు పోయెను. సువర్ణశ్రీని చూడవలయుననియే యాతనియుద్దేశము అంతరాంతమున నాగబంధునిక కనబడదాయన్న యాలోచన!

అతడు లోనికి "సమవర్తి వచ్చినాడని" వార్తనంపెను. సేవకులు గుఱ్ఱముకడకు పరువిడివచ్చి గుఱ్ఱపుకళ్ళెమునందిపుచ్చుకొనిరి. శిల్పవిద్యార్థులుదారిచూప లోనికిపోయి సభామందిరమున నాతడు ఉచితాసనము నధివసించియుండెను.

సిద్ధార్థినికకు సమవర్తి వచ్చినట్లు తెలియదు.

"బావా బావా పన్నీరు
బావనుపట్టుకు తన్నేరు"

అవి పాడుచూ సభామందిరమునకు వచ్చి సమవర్తిని చూచి చటుక్కున ఆగి పోయెను

సమవర్తి "సువర్ణశ్రీ ఎచ్చటనమ్మా?" యని నవ్వుచు అడిగెను.

"మా అన్న సమదర్శి చుట్టుప్రక్కల క్షేత్రముల దర్శింప స్నేహితుడగు మహా బలగొండ యువరాజుతో పోయినాడు."

"అయ్యో! అతనితో మాటలాడవలెనని వచ్చినానే!"

"అలాగునా! మా అక్కవచ్చి మాటలాడునండీ" యని యామె తుఱ్ఱుమనెను

ఇంతలో "ఎవరండీ!" యని చెల్లెలు మనచుట్టములు వచ్చినారని చెప్పుటచే కనుగొనవలెనని నాగబంధునిక ఆ మందిరములోనికి వచ్చినది.

లోనికి ఆశాల వచ్చుమార్గము సమవర్తి వెనుకవైపున నున్నది. ఆశాలికి లోనికివచ్చుటతోడనే ఎవరో కూరుచుండి యుండుట గమనించి "ఎవరండీ!" అని మాటల ప్రశ్నించెను. సమవర్తి ఉలికిపడి లేచి నిలుచుండి ఆమెవైపుతిరిగి, ఆమెను చూచెను.

"ఎవరండీ" అన్నమాట, అచ్చటనే ఆగిపోయినది. ఆమె గుమ్మముకడ నిలుచున్నది. సమవర్తిని చూడగనే, యామె చకితయై లజ్జారుణిత వదనయై తలవాల్చి నిలుచుండిపోయినది

# సప్తమ ప్రకరణము

## ముక్తావళీ దేవి

ముక్తావళీదేవికిపుడు అరువది సంవత్సరములున్నను ఏబదిసంవత్సరముల స్త్రీవలె కనుపించును. ఆమె కీర్తి గుప్తుని భవనమున సగము యవనాలంకారాది మ్లేచ్ఛాచారముల గొనివచ్చినది. యవనశిల్పులను కొందరిని రప్పించి తన కోటలన్నిటిలో యవన భవనములుకూడ నిర్మాణము చేయించెను. ఆశిల్పులే ఆంధ్రచైత్యములలో తమ విధానములను అక్కడక్కడ విన్యసించిరి. అప్పుడే గాంధారించుటయన శిల్పము చెక్కుట యనుమాటకూడ ఆంధ్రభాష చొచ్చినది.

పాటలీపుత్రమున అతని చిన్ననాటనే కీర్తిగుప్తులు ఒక మహాహర్మ్యము నిర్మాణము చేయించెను. వినయగుప్త చారుగుప్తులకును అచ్చట మహాభవనములున్నవి. యుద్ధానంతరము ఎవరిభవనములలో వారు ప్రవేశించి, యాయన్నియు మరల బాగు చేయించుకొనినారు. సమవర్తి చారుగుప్తుల భవనములలో నొకదాన ప్రవేశించినాడు.

కీర్తిగుప్తులకు డెబ్బదియేండ్లు దాటినను, ప్రపంచ మానందమయము. ప్రాపంచ మానవ లేమియున్నదో ఎవరికెరుక, కాబట్టి బ్రతికియుండగనే ఆనందములన్నియు ననుభవింపుము అన్న వాదము, యవనవేదాంతి ఎపిక్యూరియను ప్రతిపాదించినదానిని నమ్మినాడు. కావుననే అతడు భోగముల ననుభవించుటలో గ్రీకులకే పాఠములు నేర్పుచుండెను.

గ్రీకులు తమదేవతలను భారతీయ దేవతలతో పోల్చుకొని వారేవీరని నిశ్చయమునకు వచ్చిరి కొందరు యవనులు బౌద్ధదీక్షగైకొనిరి. అటుల బౌద్ధదీక్ష గైకొనినను ఆ బౌద్ధాచారముల జీవితము నానందముగ ననుభవింపుము అన్నభావము మిశ్రితముచేసి ఒక నూతనవాదము గొనివచ్చిరి.

కీర్తిగుప్తులవారు చక్కగ మాట్లాడ నేరుపుగలవారు. ఎట్టివారి హృదయమునైన చూఱగొను అమృతవాక్కులవారు. కీర్తిగుప్తుని ముక్తావళీదేవి పూజించునది.

భర్త యామెకు భగవంతుడే. కాపురమునకువచ్చిన ప్రథమసంవత్సరముల భారతీయాచారములకు సంకటము పడునదికాని రానురాను భారతీయాంగనలకే పాఠములు నేర్పు భారతీయత్వ మామె కలవడినది.

ముక్తావళీదేవిని హిమబిందును సువర్ణశ్రీ కొండగుహా బంధనమునుండి విడిపించి నప్పటినుండియు నామె సువర్ణశ్రీ చరితమంతయు జాగరూకతగ గమనించుచునే యుండెను. సువర్ణశ్రీని తనమనుమరాలు గాఢముగ ప్రేమించుచున్నదని ఆమె విశేషముగ ధాన్యకటకముననే గమనించియున్నది. తనయల్లుడు హిమబిందును శ్రీకృష్ణసాతవాహన ప్రభువునకీయ సంకల్పించుకొనెననియు. హిమబిందు మూగదానివలె నందున కియ్యకొనెననియు వినినప్పుడామె ఎంతయో ఆశ్చర్యమందెను.

ఆనాటినుండి హిమబిందు హిమబిందుగ నుండుటలేదని యామె గమనించుచు వచ్చినది. ముక్తావళి దేశమైన ఏథెన్సులో రాజులను విపరీతముగ గౌరవించుట ఎరుగదు. అక్కడ ఉత్తమవర్గమువారుగ, బానిసవర్గమువారుగ సంఘమున ఏర్పాటయి యున్నది. రాజవంశము లక్కడలేవు. కాని మాసిడోనియాలో రాజవంశము విజృంభించినది. ఆరాజు సేనాపతులు వివిధదేశముల రాజులై రాజవంశ ప్రారంభకులైరి.

ఈ దేశముల రాజులు ధర్మపరులు ప్రజలలో, ఎక్కువగౌరవము పొందువారు. రాజులకన్న బ్రాహ్మణులు మరియు గౌరవమందుదురు. రాజులును, బ్రాహ్మణులును అయిన శాతవాహనప్రభు వంశమునకు పిల్లనిచ్చుట ఎవ్వరికైన వర్ణనాతీతమగు గౌరవము. అందుకనియే తనయల్లుడు శ్రీకృష్ణమహారాజునకు పిల్లనీయ సంకల్పించినాడని ముక్తావళీదేవి గ్రహించినది.

తన అనుగుతల్లి అఫ్రొదితీని రతిదేవిని వికారులుగ చూపింపగల సౌందర్యము కలది, సౌశీల్యమున సీతా మాయాదేవులకు చెల్లెలనదగిన ప్రజాపతిమిత్ర లోకము వీడిపోయినది. ఆమెతనయ, తనముద్దుల మనుమరాలు జగదేకసుందరి, శ్వేతతారాదేవీ సదృశసుందరి, విద్యల ప్రజ్ఞాపరిమితాదేవి, హిమబిందుకుమారిక కొరకై తాను బ్రతికియున్నది

తనభర్త కీర్తిగుప్తుడా దినములపడిన బాధ లోకముల చీకట్లనింపినది. అయినను తనతోపాటు భర్తయు తమ హిమబిందునుచూచి దుఃఖము దిగమ్రింగి, లోకమే



శూన్యమై, దుఃఖపాతాళమున క్రుంగిపోయిన యల్లుని ఊరడించువారు. అప్పటినుండియు హిమబిందును తానే పెంచినది.

భార్యాభర్తలిరువురు అల్లునిఇంటను తన యింటను సమముగ కాలముగడుపుచు హిమబిందుతోడిదే తమలోక మనుకొనుచుండిరి.

ఆబాలిక నేడు సువర్ణశ్రీని ప్రేమించి తనహృదయము కృంగిపోవుచున్నది. ఈవిషయమే ముక్తావళీదేవి భర్తనెప్పుడు హెచ్చరించుచుండెను.

ముక్తావళీదేవి:—మీరీవిషయమున నేమియు జోక్యము కలుగ జేసుకొనకున్నచో దానిగతి ఏమికావలయును?

కీర్తిగుప్తుడు:—ఏమియుకాదు, నేను ఎప్పటివిషయము లప్పుడే తెలిసికొనుచున్నాను. శ్రీకృష్ణసాతవాహన విషకన్యలప్రేమ జగద్విదితమైపోయినది. సార్వభౌమునికి మధ్యవర్తులతో యువరాజు తన యభిప్రాయము నిస్సంశయముగ తెలియజేసినాడు.

ముక్తా:—అయిన హిమబిందునకది యేమిలాభము. ఆమె అతని ప్రథమభార్య కావచ్చును. విషకన్య రెండవభార్య కావచ్చును. హిమబిందు ధర్మపత్నియు విషకన్య ప్రేమపత్నియు అగుదురు.

కీర్తి:—యువరాజు తండ్రివలె ఏకపత్నీవ్రతుడు.

ముక్తా:—చక్రవర్తి యువరాజునకు విషకన్యకావివాహ మెట్లంగీకరించును? ఆమె ఊర్పులే మృత్యుదేవత ఆహూతింపులనినారు.

కీర్తి;—అందుకు దేవీ! వారికేమి తెలియును మానవజీవిత తత్త్వము! విషకన్యను వినా యువరాజు మరొకరిని వివాహమాడడు. విషకన్యను వివాహమాడ లేనినాడు శ్రీకృష్ణసాతవాహన మహారాజు రాజ్యమునే త్యజించును.

ముక్తా:—మనఅల్లుడు చారుగుప్తుని యాలోచనలేక మహారాజు విషకన్యను కోడలినిగా చేసుకొనును? అల్లునిమనస్సు తపస్సు, సర్వస్వము బిందును మహారాణిని చేయవలెననికదా?

కీర్తి:—అవును ముక్తా! (కీర్తిగుప్తుని హృదయము అతి ఆర్ద్ర తనందినప్పుడు భార్యను ముక్తాయని పిలుచును.) కాని చారుగుప్తుడు శ్రీకృష్ణమహారాజు హృదయము

ఇంతయైన యాలోచింపలేదు. తానొకటి తలచును దైవమొకటి తలచును. స్థౌలతిష్యులవారు ప్రపంచాద్భుతుడు. బౌద్ధసన్యాసులు దేశదేశములకు బోధకులై పోవుచుండ, ఆర్యఋషులను వారివెనుకనే పంపి వేదము, వేదాంతము, వేదరహస్యములు ప్రపంచకమునకు నేర్పపంపినాడు. నేను యోర్దనుదేశముపోవ నచ్చట స్థౌలతిష్యుని శిష్యులుండిరి. తురుష్కమున, పారశీకమున, బాహ్లీకమున నేను అనేకులగు స్థౌలతిష్యుల చూచితిని. అట్టిపురుషుడు చక్రవర్తిపై కత్తిగట్టెను. చారుగుప్తుడు స్థౌలతిష్యునిశక్తి నమ్మి చేయు దీక్షవహించి, సఫలీకృతుడైనాడు. చక్రవర్తిపై కుట్రలు నాశనము చేసినాడు వ్యతిరేకించిన సామంతుల నుక్కడగింప జేసినాడు. ఆంధ్రసామ్రాజ్యమునకు ధరుకచ్ఛము సముపార్జించి పెట్టినాడు. ఆంధ్రచక్రవర్తిని జంబూద్వీపమునకు చక్రవర్తిని చేయుచున్నాడు. అట్టిఅప్పుడు చక్రవర్తి మనయల్లుని యాలోచన వినును. చారుగుప్తుని కోర్కెనే పాలించును.

ముక్తా:—ఇంక నాతల్లి కుంగి, కృశించి, హృదయము శకలము చేసుకొనవలె నన్నమాట! మీరు నామాట వినండి ప్రాణేశ్వరా! ఎప్పుడును నా కోర్కెలు తీర్చుచున్నారు. మీరు తలచుకొనినగాని ఈ సంకటవిషయము చక్కబడదు. హిమబిందు లోలోననే కృశించి తనతల్లిని చేరిపోవునను భయము వేయుచున్నది.

కీర్తి:—ముక్తా! నీవు యౌవనస్త్రీవి. ఆర్యనారీమణులశక్తి నీవెరుగవు. మాన దేవి ప్రజాపతే తనకొమరితను రక్షించుకొనును. అయినను ఈలోన నేను శ్రీకృష్ణ మహారాజుతోడనే రహస్యములు విడిచి యన్నియు మాటలాడెదను.

ముక్తావళీదేవి తనఅనుగుబిడ్డ ప్రజాపతిమిత్రవిగ్రహముకడకుపోయి ద్యోశపితను. ఉపో దితీవి ప్రార్థించెను.



# దశమ ప్రకరణము

## జ్ఞానయుద్ధము

అమృతపాదులు:—తథాగతుడు "చత్వారి ఆర్యసత్యాని" నాలుగు సత్యములను గురించి ఇట్లు చెప్పినాడు స్వామీ; ప్రపంచమునందు దుఃఖమున్నది. మనము పుట్టునప్పుడు బాధ నందుదుము. బ్రతుకునందు అవస్థలన్నియు దుఃఖమయములు. ముసలితనము దుఃఖమయము. చావు దుఃఖము. మనము కాంక్షించినవి మనకు లభింపకపోవుట దుఃఖము. మనము ప్రేమించినవారి ఎడబాటు దుఃఖము.

స్థౌలతిష్యులు:—అవునయ్యా, ఇవి పామరునకు దుఃఖములు. జ్ఞానికి దుఃఖములు కావుగదా?

అమృత:—అక్కడికే వచ్చుచున్నాను. రెండవసత్యము దుఃఖమునకు కారణము, తృష్ణ. తనకై బ్రతుకుట. సమస్తము తనకై వాంఛించుట. కాబట్టి జీవితము వేదనాభరితము. ప్రతినిమేషము మనము ప్రతివిషయమును, కాంక్షించుచున్నాము.

స్థౌల:—ఈ సంగతులు చెప్పుట బౌద్ధధర్మము. ఇవి ఎట్టి పామరుడైనను చెప్పవచ్చును.

అమృత:—చిత్తము! మూడవసత్యము ప్రతిమనుష్యుడు దుఃఖనివృత్తికై ప్రయత్నముచేసి తీరునని. అది ఎట్లు సంభవించును? మనలోని కాంక్షలను చంపుకొనుటచే కాంక్షలు తృప్తిపరచుటచే అడగిపోవు. ఇంధనములు వేసిన అగ్నివలె అవి ఇంకను ప్రజ్వరిల్లును.

స్థౌల:—ఈ బాల బోధ వినిపింపవచ్చినావురా నాకు?

అమృత:—కాదుస్వామీ! ప్రారంభము చిన్నపిల్లవాని బోధవలెనే యుండును. ఆత్మవిచారము ప్రాపంచిక సత్యములనుండి ఉద్భవించును.

స్థౌల:—కానిమ్ము, కానిమ్ము; మీ ఆడమ్మల ఆత్మవిచారణ జ్ఞానమునంతయు విని కొంచెము నవ్వుకొందును.

అమృత:—స్వామీ! నాల్గవ సత్యము ఆర్య అష్టాంగమార్గము, ఈ విధానము కాంక్షలను నాశనము చేయును.

స్థౌల:—మీ అష్టాంగమార్గము నాకు తెలియును. ప్రతిమనుష్యుడు ఈనాలుగు సత్యములు ఒప్పుకొని తీరవలయునా?

అమృత:—స్వామీ, అవి ఒప్పుకొని తీరవలయునని తథాగతుడు సెలవీయలేదు. మనుష్యుడు ప్రపంచము, జీవుడు, దుఃఖము, చావు, మనస్సు విశ్వము, ఇవి ఏవి, ఎందుకు అనుకొనుచు సర్వవిషయముల గూర్చి తనలో తాను విచారించుకొనవలయును ఇది ధర్మమునకు మొదటిసూత్రమని సెలవిచ్చినారు.

స్థౌల:—ఆ ముక్కలు చిలుకపలుకులవలె నాకు చెప్పవచ్చితివా?

అమృత:—తాము బౌద్ధధర్మ మేమియని పృచ్ఛచేయుటచే ప్రారంభించితిని. తాము ప్రశ్నల వేసినచో, నేను ప్రతివచన మిత్తును. లేదా ఈరీతిగ, ఈవిషయమును గూర్చి చెప్పుమని ఆజ్ఞ చేయుడు, అటుల నొనరించెదను.

స్థౌల.—మంచిది. నీ యిష్టమువచ్చినట్లు కానిమ్ము

ఈ విధముగ స్థౌలతిష్య మహర్షికి, అమృత పాదార్హ్వాతులకు వాదోపవాదములు ప్రారంభమైనవి.

అమృతపాదార్హ్వాతులు విషకన్యను గూర్చి స్థౌలతిష్యుని అడుగుటకు ఆయన ఆశ్రమమునకు ఒక మధ్యాహ్నకాలమున వెళ్ళినారు. వారట్లు వెళ్ళిన రెండు గడియల వరకు మహర్షి దర్శన మాయనకు గలుగలేదు.

అమృతపాదులు మహర్షికి నమస్కరించి ఆశీర్వాదమంది, ఒక కృష్ణాజినముపై నుపవసించెను.

ఈమాట ఆమాట లయినపిమ్మట స్థౌలతిష్యుడు మీ బౌద్ధమత మేమిటని పృచ్ఛ చేసినాడు. అచ్చటనుండి ఈవాదన బయలుదేరినది.

ఈ భిక్షుకుడు, ఈ పతితుడు తనతో వాదింపవచ్చెనాయని స్థౌలతిష్యుడనుకొనినాడు. స్థౌలతిష్యుని జ్ఞానమనంతము. బౌద్ధధర్మములన్నియు నాయనకు తెలపిండి. ప్రస్థానత్రయము ఆయనకు గళగ్రాహము. వేదములు వేదాంగములు, స్మృతులు, శాస్త్రములు, పురాణములు, ఇతిహాసములు ఆ మహాత్మునియెదుట నాట్యమాడును. ఈ పిచ్చివానిని మూడుమాటలతో దూదిఏకి పంపుదునని యాతడనుకొనెను.



ఈ ముదుసలి మహాతపస్వి. సర్వతంత్ర స్వతంత్రుడు, ఓహో! ఏమి వీరితేజస్సు! ఇట్టి మహానుభావుడు తన మనుమరాలిని విషబాలగ నెట్లొనర్పగలిగెను. ఈయన హృదయమున ఇంతకోపమెట్లు నిండియున్నది. ఈయన ఆర్యధర్మము బోధించువేగాని స్థితప్రజ్ఞుడుమాత్రము కాదు. అని అమృతపాదార్హ్వాతులు అనుకొనినాడు.

స్థౌల:—నీవాదన దుఃఖముతో ప్రారంభించునా?

అమృత:—స్వామీ! నావాదనకాదు. ఇది ప్రతిమనుష్యుని హృదయములోని వాదన! ఎవరికివారు విచారించుకొనవలెను. మథించినగాని వెన్నరాదు. రెండు కఱ్ఱలరాపిడివలనగాని అగ్ని జనింపదు. అటులనే మనుజుడు అతనిచుట్టునున్న సర్వసృష్టి ఇవి ప్రత్యక్షములు.

స్థౌల:—అవి నిద్రబోవువాని కున్నవా?

అమృత:—లేవు? అట్లు లేకబోవుటకు కారణమేమి, మరల నిద్దురలేవగనె అట్టి ప్రపంచమె ప్రత్యక్షమగుటకు కారణమేమి? ఆసృష్టియు, ఆ ప్రపంచమును అటులనే యున్నవనియు, తానుమాత్రము నిద్రబోయి, లేచితిననియు మనుజుడేల యనుకొనవలెను? ఈ ప్రశ్నలు విచారించుకొనుటలో మనుష్యుడు నిజము గుర్తెరుగుచున్నాడు.

స్థౌల:—మీరు వేదము లపౌరుషేయములని నమ్మరని మాకు తెలియును. నీ ముద్దుమాటలు విన మాకుచాల కుతూహలమగుచున్నది.

అమృత:—ఈ విచారణకు అవధి, ఆశయము సాఫల్యమగువరకు.

స్థౌల:—ఆశయమెట్టిది? సంతోషమేకాదా? దుఃఖము లేకయుండుటయేనా?

అమృత:—అవును. అది ప్రాపంచికముకాదు. ప్రపంచములో దుఃఖము లేకపోవుట యనునది ఎచ్చటనుండును! ఎప్పుడుండును! మనకు సద్గతి యున్నదా లేదా యనుప్రశ్న అవసరములేదు సద్గతియు, ఒకగతియే. గతికి అతీతమగుస్థితి కావలెను.

స్థౌల:—గతియు, స్థితియు ఒకటికాదా? నీరుగతి ఆవిరి. ఆవిరి మేఘస్థితినందును. అచ్చటనుండి నీరుగతివర్షము వర్షము, వాపీకూప తటాక సముద్రస్థితినందును, ఇవియన్నియు నొకటికదా?

అమృత:—ప్రాపంచికముగ నొకటికాదు, గుణముగను ఒకటికాదు. ఆవిరిగుణము వేరు మేఘగుణము వేరు, వాపీకూప తటాకాదుల రూపముననున్న జలముగుణము వేరు,

స్థాల:—కాని జలభావము ఒకటియేనా?

అమృత;—అవుగాక!

స్థాల:—అవుగాక ఏమి, మీ మొగము. అటులనే పరబ్రహ్మ మొకటి, తక్కిన వన్నియు అతని ఆభాసలు. అవి అజ్ఞానముచే, మాయచే కలిగే భ్రమ!

అమృత:—ఎవరికిస్వామీ?

స్థాల;—జీవునకు.

అమృత:—జీవుడును ఆభాసయేకాదా?

స్థాల:—అతడును.

అమృత:—మాయాజాతమగునది. ఆభాస, మాయాజాతమగునది అజ్ఞానము, మాయాజాతుడే జీవుడును ఆ జీవుడును అజ్ఞానమును ఒకటి ఐనప్పుడు జీవునకు అజ్ఞానమేమిటి స్వామీ?

స్థాలతిష్యుని ముక్కుపుటములు విస్ఫృతములయ్యెను. “ఓయి అజ్ఞానీ, నీకు స్వప్నము వచ్చుచున్నది. స్వప్నములో ఇది స్వప్నమే. సరియైన నిజమిది కాదు అవి ధైర్యము తెచ్చుకొనుచుందువు. స్వప్నములో స్వప్నము సంగతి ఎరుగవా?” అని గంభీరస్వరముల నరచినాడు.

అమృతపాదులు చిరునవ్వునవ్వినాడు.



# ఏకాదశ ప్రకరణము

## “నికి దేశిక”

శ్రీ స్థాలతిష్యుడు, అతిజాగరూకతతో అమృతపాదులను పరీక్షించెను. ఎవ్వరీతడు? ఈతని మోము తనకు పరిచితమై తోచును. ఈతనిపై ఏదియోదయ తనయందావిర్భవించుచున్నది. అయిన నీతడు చార్వాకుడు, విమతుడు, అనార్షధర్మయుక్తుడు కావున గర్హ్యుడు. అంతఃకరణ ప్రవృత్తికి, సత్యమునకును వైరుధ్యము కలిగినప్పుడు, అంతఃకరణప్రవృత్తిని నాశనము చేయవలయును. ఇట్టివాడే ఆ సిద్ధార్థుడు. అతడు బౌద్ధుడట, ఇదియే కలిమాయ వేదములను గర్హించినవాడెల్ల ఒకమహాగురు వగుచున్నాడు. అసత్యదర్శనములన్నియు నట్లే ఉద్భవించినవి.

అయినను ఏల తనకీ బౌద్ధునియందు కరుణకలుగవలెను. ఏ పూర్వ సంబంధముండియుండును?

స్థాల:—స్వామీ! పూర్వాశ్రమమున మీ రెవరు?

అమృత:—నాకేమియు తెలియదు?

స్థాల:—అదేమయ్యా! తెలియక పోవుటయేమి. అట్లనుట మీ బౌద్ధధర్మమా, లేక తపస్సుచే అట్లు మరచిపోదురా?

అమృత:— స్వామీ! మీరన్నది ఏదియుకాదు నాకేకారణముచేతనో పూర్వ స్మృతి పోయినది. ఆ సంఘటన నాతలకుతగిలిన దెబ్బవలననై యుండవచ్చును.

స్థాల:—దెబ్బఎందుకు తగిలినది?

అమృత:— నేను గంగానదిలో దొరికినానట. ఈ మహానదికి ఎగువభాగముననున్న అన, పాటలీపుత్రపురమున కెగువనున్న బౌద్ధాశ్రమవాసులకు గంగలో దొరికితినట!

స్థాలతిష్యు డాశ్చర్యభరితుడై “ఎక్కడ మీకు దెబ్బతగిలినది?” అని అడిగెను

అమృతపాదులు తనయెదుట కుడివైపున పైభాగమును చూపించెను. స్థౌలతిష్యుడు ఆ మానిపోయిన పెద్దమచ్చను అచ్చట చర్మమును కుట్టిన విధానమును చూచెను.

స్థౌల:—ఏదినమున మిమ్మా భిక్షుకులు రక్షించిరి.

అమృత:—ఇచ్చటికి పదునెనిమిది వత్సరములకు పూర్వము, వైశాఖమాసమున, శుక్లపంచమినాడు.

స్థౌల:—ఏమి? మరల చెప్పుడు! శుక్లపంచమినాడు! గంగానదిలో! నా యనా! నీవెవరైనది ఏమియు జ్ఞప్తిలేదా! నన్ను పరికించి చూడుము. ఒక చిన్నబాలిక జ్ఞాపకములేదా? ఒకచక్కని తల్లి, నీభార్యయని జ్ఞాపకములేదా? ఓహో నాతండ్రీ! గంగలోనా నీవు దొరికినది అవును! లేనిచో నాహృదయ మేలనట్లు ద్రవించిపోయినది! తండ్రీ! నీకేమియు జ్ఞప్తికి వచ్చుటలేదా?

అమృత:—ఏమియు జ్ఞాపకమునకు వచ్చుటలేదు. స్వామీ! మిమ్ము దూరమునుండి రెండుమూడుసారులు చూచితిని. అదియే జ్ఞాపకము.

స్థౌలతిష్యుడు అతివేగమున పరుగిడు హృదయమును కుదుటపరచుకొని, ఒకవిధమగు యోగములోనికి పోయినాడు. అమృతపాదార్హుని హృదయంతయు నేమిటి, పెద్దవారికి మనస్సు అప్పుడప్పుడు చంచలించును. అది కాబోలుననుకొని ఊరకుండెను. స్థౌలతిష్యుడు చిరునవ్వున కన్నులు తెరచి,

"సరే, మీరు వేదములే భగవంతుడు, అవిఅనాది అని ఏలనమ్మరు? వేదములపై మీధర్మము నేల నాధారము చేసికొనలేదు?" అని ప్రశ్నించెను.

అమృత:—వేదములు పౌరుషేయములు. ధర్మనిశ్చయము చేయువాడు మనుజుడు. తనకుదానే నిశ్చయము చేసుకొనవలెను.

స్థౌల:—మంచిది! నీకు ఒకరు చదువుచెప్పవలయునా! అక్షరములు నేర్పవలయునా!

అమృత:—అంతవరకే!

స్థౌల:—అదిమాత్ర మేల?

అమృత:—అది లేనిచో పూర్వజ్ఞాన మెట్లలవడును?



స్థౌల:—కాబట్టి నీ భవిష్యత్ జ్ఞానమునకు, వెనకటిజ్ఞాన మాధారము. దానికి, అంతకు పూర్వపుజ్ఞానము, అట్లు పోనుపోను ప్రథమమనుష్యుల కుద్భవించిన జ్ఞానము మనకాధారమా కాదా?

అమృత:—చిత్తము. ఆ ప్రథమకాలమున వివిధప్రదేశముల వివిధజాతుల మనుజులుండిరి. వారిందరికి జ్ఞానముండెను. ఆయా జాతులనుండి ఉద్భవించినవారికి, ఆయా జ్ఞానము లాధారమయ్యెను.

స్థౌల.—ఆ జాతులన్నిటి మూలమగు నొకజాతి యున్నదా?

అమృత:—ఉండవచ్చును.

స్థౌల:—ఆయా మనుజులందరు ఉద్భవించు ఆధారతత్వ మొకటియుండునా?

అమృత:—ఉండవచ్చును

స్థౌల:—ఆ తత్వమేమిటి?

అమృత:—ఈ విచారణ, ప్రస్తుత మవసరముగాదా? ఈ విచారణ మనుష్యుడు చేసికొనును. మంచిదే! కాని జ్ఞానతృష్ణతో చేసినచో, తృష్ణయు విచారమగునుకదా? కాక తనదుఃఖమును నాశనము చేసికొనుటకైన నాను, తనదుఃఖము, ఆ దుఃఖము పోవు విధానము, తనగమ్యస్థలము, తెలిసికొనగలడు.

స్థౌల:—అవునయ్యా, ఆ తెలిసికొను విచారణలో మూలాధారమునకు పోయినగాని అసత్యమిది సత్యమిది యని ఎట్లు నిర్ధారణ చేసికొనగలుగును?

అమృత:—అట్లగుగాక! తెలిసికొనినవెనుక మనమేమి చేయవలయును? తెలిసికొనగనే మనుష్యునిపని తీరిపోవునా? ఆతని దుఃఖము క్షయమెట్లగును? కావున ఆది క్షయమగు విధానము నవలంబింపవలదా?

స్థౌల:—సత్యము! నీరునకు, సముద్రనీరమునకు మధ్య కొన్నిపదార్థము లడ్డమున్నవి. ఆ అడ్డము తీరుటే నీరము స్వస్వరూపమందుటకాదా! కనుకనే విచారణయు, జ్ఞానము ముఖ్యము. అటువెనుక ఆ అసత్తును తొలగింపవలయును. ఆ తొలగించునది తానే! తొలగించుటకు వేరుధర్మ మున్నదనిన ఈ ధర్మమునకు, తొలగించుటయను క్రియకు, మనకు ఆధారమగు వేరువస్తు వుండవలయునా? ఈ పృథక్త్వమే సత్యమునకు సాదృశ్యము కల్పించునేని అవి నాశనమగుచున్నవి. నాశనమగునవి సత్యములు కావుగదా?

అమృత:—స్వామీ! మీరు చెప్పినవన్నియు మేము ఒప్పుకొందుము.

స్థౌల:—జ్ఞానముకలవాడు ఒప్పుకొనవలయును. అయినచో సత్యమై అన్నిటికి ఆధారమగునది బ్రహ్మము.

అమృత:—అందుండి ఈ విశ్వము వచ్చెనా?

స్థాల:—అందుండి వచ్చుటయేమి? అదియే ఇది.

అమృత:—అయినచో ఈ దుఃఖము అదియేనా? ఈచావు అదియేనా? ఈ ఈతిబాధలు, ఈ తాపత్రయములు, ఈ ఈషణాత్రయములు, ఈ అరిషడ్వర్గములు అదియేనా?

స్థాల:—ఆపదార్థమున కాభాసలే ఇవి.

అమృత:—మీరు బ్రహ్మమనుడు, మేము నిర్వాణమందుము అదికాదుస్వామీ మొదటికారణములేదు. ఈ కారణపరంపర "ప్రతిద్య సముత్పదం పశ్యంతితే ధర్మం పశ్యంతియో ధర్మం పశ్యంతి-సబుద్ధం పశ్యతి" అన్నట్లు ఈకారణ పరంపర అర్థ మెరిగినవాడే బుద్ధుడు. ఈ కారణములలో నొక్కొక్కటికి తక్కిన వాధారములు. తక్కినవానికి, ఇదియు తక్కినవియు ఆధారములు.

స్థాల:—ఇదియేకాదా సాంఖ్యము చెప్పునది నీవుచెప్పు విచిత్రమేమియున్నది. ప్రకృతి సహితుడగు పురుషుడు సృష్టి. ప్రకృతిత్యక్త పురుషత్వమే జీవుని కర్మరాహిత్యము. కారణమనంతమయినచో, కారణవిముక్తి ఎట్లు? నిర్వాణమెట్లు?

అమృత:—"కర్మజం లోకవైచిత్ర్యం" సర్వకాలము సృష్టిలో మార్పు జరుగుచున్నదిగదా? "నోచ నిరోధోస్తి న చభవోస్తి సర్వదా అజాతం అనిరుద్ధంచ, తస్మాద్ సర్వఇదంజగత్" సృష్టిలేదు, నాశనములేదు. మొదలులేదు తుదలేదు.

స్థాల:—ఓయి వెఱ్ఱివాడా, మార్పు జరుగుచున్నదియు అసత్యము. ఈవస్తువులున్నవియు అసత్యము. అసత్యములుకాని సత్యము ఒకటిలేదా. నీవు సంసారము సత్యమందువు. మార్పు సత్యమందువు. అయినచో కర్మ సత్యముకాదా? ఇంక కర్మక్షయమై నిర్వాణమెట్లొందగలవు? నీ నిర్వాణమున "నిర్వాతి నిర్గచ్ఛంతి దుఃఖాదయో స్మిన్నితి నిర్వాణం" అనిగదా! దుఃఖాదులు దీనియందు నిర్గతమగుననిగదా? ఎంతటి క్షుద్రాశయము!

అమృత:—దుఃఖాదులన జన్మపరంపరగదా?

స్థాల:—జన్మపరంపరరిత్యము నిజమయినప్పుడు నీకు నిర్వాణమెప్పుడువచ్చును? నీవేమవుదువు? ఎందుగలసెదవు? నీవు వేఱుగా నుందువా? ఇదిగదా శూన్యవాదము

స్థాలతిష్యుడొక్క నిమేషము మవన్నున ప్రార్థన సలుపుకొనెను వెంటనే తనకడనున్న దండముతీసి "దుర్మార్గుడా! కుత్సితవాదమునకు నీకిదే శిక్ష" యని, వెనుక తలపై తగిలినచోటనే మరల బుఱ్ఱ పగులునట్లు తూచికొట్టెను, "హా!" యని అమృతపాదార్హతులు తలపగిలి, రక్తముస్రవింప చైతన్యరహితుడై పడిపోయినాడు.



# ద్వాదశ పరిచ్ఛేదము

## పూర్వస్మృతి

స్థాలతిష్యుడా దెబ్బకొట్టి, అమృతపాదులు పడిపోగనే సింహమువలె లేచి, వెంటనే ప్రక్కనున్న గంటవాయించెను. కాషాయాంబరధారులగు శిష్యులు పరుగు రచ్చటకు బరుగిడివచ్చిరి. వీరి వాదప్రతివాదములు వినుచు, దూరముగ కంబళులపై, కృష్ణాజినములపై నాసీనులైయున్న భిక్షుకులు అమృతపాదులు పడిపోగనే, యచ్చటకు పరుగిడివచ్చి చైతన్యరహితుడైయున్న తమ ఆచార్యుల నల నొకరు పట్టుకొనిరి. ఏడ్చుచు కాషాయోత్తరీయము చింపి, వెల్లువలై ప్రవహించు గాయముపై ఒకరదిమి పట్టుకొనిరి. తక్కినవారు వేదనతో చుట్టును మూగిరి.

స్థాలతిష్యుడు వారినందరిని అదలించి, యోగ స్వరూపమగు చిరునవ్వుతో, అమృతపాదులపై అతికరుణార్ద్రమగు చూపుల పరపి, "తండ్రీ! నీకు పూర్వపుస్మృతి కలుగుటకై ఈవిధాన మవలంబించితి. ఈశ్వరుని ప్రేమ ఎట్టిదో చూచెద" ననుచు, వెంటనే అతిజాగరూకతతో, తన వైద్యగృహమునకు గొనిపోజేసి, యచ్చట నొక మంచముపై పరుండబెట్టించి, అస్త్రపేటిక తెరచి, అందుండి నిశితమగు నాయుధముల దీసెను. వేరొక రజితమంజూషనుండి ఒక కాచపాత్రి గ్రహించి, అందుండి ఒక తైలము నా అస్త్రములపై పోసెను.

అమృతపాదుల గాయమునుండి రక్తము స్రవించిపోకుండ మొదటనే ఫాలమునకు దిగువనే ఆవృద్ధతపస్వి వస్త్రముచే బిగించి కట్టెను. శిష్యుడొక డింకొక కాచపాత్రి నందీయ, అందుండి మరియొక తైలవిశేషమును స్థాలతిష్యుడా గాయముపై పోసెను. వెంటనే రక్తము కరగిపోయి, గాయము నిర్మలమైనది.

అమృతపాదులు లంబికాయోగము వేసికొనిరి కాబోలు, నుదుట గుడ్డ కట్టకుండగనే రక్తము స్రవించుట మొటదనే మానినది గాయముకడనున్న రక్తమాత్రము స్రవించిపోయినది.

లలితములై, సూర్యకిరణ సదృశములై, శక్తివంతములైన తనవేళ్ళపై స్థాలతిష్యుడొక తైలమును పోసికొని, ఆ తైలమును రెండుచేతులకు పులుముకొని, నిశితములై, మహాపురుషుల తపస్సులవలె మెరయుచున్న రెండు శస్త్రముల తీసెను.

ఆ మహర్షి తీక్ష్ణదృష్టిచే అమృతపాదులను చూచెను. అతడు లంబికాయోగములోనికి పోయివాడు. అతడు జీవించియు శవము. అతని హృదయమునందు చలనము లేదు. ఊపిరిలేదు. కంటిపాపలు వెనుకకు తిరిగిపోయెను. దేహము చల్లబడి కొయ్యబారిపోయెను. కాని సూక్ష్మాతి సూక్ష్మమగు నాతని ప్రాణనాడిమాత్రము దేహమెల్ల ప్రసరించియే యుండెను. స్థాలతిష్యుని కనులు వెలిగిపోవుచుండెను. మంత్రములు జపించుచు, ధ్వనిరహితముగ పెదవులు కదులుచు, ఆ శస్త్రములచే గాయముకడ కపాలశల్య మాతడు ఛేదించెను. ఆ శల్యమును వాల్గువైపుల గోసి ఆ శల్యపుముక్కను తీసి ప్రక్కనుంచెను. ఆలోన అనేక సూక్ష్మ నాళములున్నవి. వానిలో కొన్ని తెగి అచ్చట రక్తము ఒక్క తిలలో పదవభాగమంత గడ్డకట్టియుండెను. ఆ కరడుకట్టిన రక్తకణభాగమును తీసివేసి ఆ ప్రదేశమంతయు అతి సున్నితముగ శుభ్రముచేసి నాళములను సర్ది, ఎముకకుట్టి, ఆమీద ఔషధలేపనమొనర్చి, చర్మమునుగుట్టి కట్టు కట్టెను.

తొలుపరచిన ఆ మంచమునుండి అమృతపాదులను వేరొక పల్యంకముపై పరుండబెట్టి, అమూల్యమగు నొక తైలమును హృదయముపై నెమ్మదిగ పూయించెను.

ఈ శస్త్రచికిత్స యంతయు ఒక అర్ధఘటికా కాలముమాత్రము పట్టినది.

అచ్చటనుండి స్థాలతిష్యుడుపోయి గంగాజలములో స్నానముచేసివచ్చి, శుభ్ర వసనములు ధరించి అమృతపాదులకడ కృష్ణాజినాసనముపై కూరుచుండి ప్రణవమంత్రోపాసకు డయ్యెను.

ఆమంత్ర పునశ్చరణము మహావేగవంతమై, శుభ్రమై, దివ్యపథసంచారియైనది. ప్రణవము లోకాల నిండినది. మహాపథముల సర్గమించినది. విశ్వముల ప్రజ్వరిల్లినది;

“ఇదం విష్ణుర్విచక్రమే త్రేధా నిదధే పదం సమూఢ్హ మస్యపాంసురే” అను మహావిష్ణు పథములవరకు ప్రసరించినది.

సాయంకాలమైపోయినది. స్థాలతిష్యుడు సమాధిలోనికి బోయెను. అతనికి



లోకములు లేవు. సృష్టిలేదు. అతనికి ఏమియు లేదు. అతడే అంతయు నైనాడు. అతడే సత్యము. అతడే జ్ఞానము. అతడే జ్ఞాని. అతడే జ్ఞేయము నైనాడు.

అటు లంబికాయోగమునమున్న అమృతపాదులకు సర్వము శూన్యము. అతడా శూన్యమున ఒక మహత్త్వము ఆ మహత్త్వము, ఆశూన్యము ఒకటియైనవి. అతని జ్ఞానము అతనిలో లయమైనది. అతడు శూన్యములో లయమైనాడు. లంబికాయోగము వీడినది.

అచ్చటనుండి అమృతపాదులకొక స్పందనము తోచినది. విశ్వమంతయు నాక్రమించుకొన్న ఒకసూక్ష్మ దీపకళికయైనాడు. ఆ దీపకళిక విశ్వరూపమగు ఆదిత్యమైనది. ఆదిత్యము, ఒక మహాతేజఃపుంజమైనది. అందుండి లోకము లావిర్భవించినవి. లోకములనుండి భూమి, భూమియంతయు తానైనాడు, తానా భూమియందున్నాడు. ఆ భూమిలో జంబూద్వీపము, అందు భరతవర్షము, అందు కాశికాప్రదేశము తాను గంగలో పడవలో పోవుచున్నాడు. అతనితో ఆ నావలో, ఒక పెద్ద, ఒక పుణ్యస్త్రీ, వేరొక పుణ్యాంగన ఇరువదిరెండు వత్సరముల సాధ్వి. ఆమె చేతులలో ఆటాడుకొను పదిమాసముల పసికూన ఒక బాలిక

ఆ తేజశ్శాలి వృద్ధుడు తనతండ్రి. ఆయన ప్రక్కనున్న యామె తనతల్లి, తనభార్య ఆజవ్వని. ఆమెచేతిలోని బిడ్డ తనబిడ్డ. తాను, ‘చతుస్సాగర పర్యంతం గోబ్రాహ్మణేభ్యశ్శుభం భవతు అంగిరస, భార్మ్యశ్వ, మౌద్గల్యత్రయార్షేయ మౌద్గల్యసగోత్రోద్భవుడై, ఆపస్తంబసూత్రుడై, యజుశ్శాఖాధ్యాయియైన నందిదత్తుడు. ఇంతలో ఆ పడవ మునిగినది. ఏమయ్యెను? అంతయు తమస్సు ! !

ఇంతలో అమృతపాదులు కన్నులు తెరిచెను. ఎదుట ! ఎవరు? తన తండ్రిపోలిక మహాయోగముననున్న తేజఃపుంజము !

అమృతపాదులు కళ్ళు తెరచుట ఏమి స్థాలతిష్యుడును కళ్ళు తెరచెను.

స్థాలతిష్యుడాయనను మాటలాడవలదనియు, కదలవలదనియు, సంజ్ఞ యొనర్చి లోనికిపోయి, తేనెతో రంగరించిన ఒక ఔషధము కొనివచ్చి, అమృతపాదులచే సేవింపచేసెను.

“ నాయనా! నీ పేరు నందిదత్తుడుకాదా ? ”

అవునని అమృతపాదులు తలయూచెను.

"నీ భార్యపేరు, అపరాజితాదేవికాదా ?"

"అవునని" అమృతపాదు లస్పష్టముగ ననెను.

"నేనెవరు ?"

"నా పితృపాదులు !"

స్థూలతిష్యుని కన్నుల నీరు తిరిగినది. ఆయన కంఠమున ముడులుపోవ ఒక్క నిమేషమటులుండి, శాంతించి "తండ్రీ, నిద్రపో! తర్వాత అంతయు చెప్పెదను !" అనెను,

"నాయనగారు! పడవలో మునిగిపోయిన వారందరు క్షేమమా?" అని అమృతపాదు లస్పష్టధ్వని ప్రశ్న చేసిరి.

స్థూలతిష్యుడు మాటాడవలదని పెదవులకడ చూపుడువేలుంచెను.

ఔషధ ప్రభావముచే అమృతపాదులు నిదుర గూరిరి.

స్థూలతిష్యుడు రూపెత్తిన బ్రహ్మతేజమువలెనట్లనే నిలుచుండి, రూపెత్తిన బౌద్ధమూర్తియై యున్న కుమారుని చూచుచుండెను.

ఇతడు, ఈ ప్రియబాలకుడు, తనకన్నతండ్రి—ఈ రీతిగ దొరకినాడేమి? ఈ సంఘటనలోని మహాభావమేమి? తన పూర్వజ్ఞానమే పోగొట్టుకొని, బౌద్ధ సన్యాసియై, ఆచార్యుడై అర్హతుడై కులపతియై, సర్వభారతీయ బౌద్ధసంఘములకు ఏడుగడయైనాడు. తాను ఆర్యధర్మదీక్షాపరతంత్రుడు తనపుత్రుడు బౌద్ధధర్మాభిరతుడు తాను త్రయీపఠన పవిత్రవదనుడు. ఈతడభిధర్మాది మహాగ్రంథ పఠనపవిత్రుడా? లేక అపవిత్రుడా?



# త్రయోదశ ప్రకరణము

## అన్వేషణ

సువర్ణశ్రీ ఎక్కడకు పోయినాడు? ఏమాయినాడు? ఎందుకట్లు విడలిపోయినాడు? తనకు సువర్ణశ్రీయే కావలెను. తనకు సామ్రాజ్యమెందుకు, సామ్రాజ్ఞీత్వమెందుకు? సువర్ణశ్రీ తన నాథుడై, తానాతని శిల్పము చిత్రలేఖనము చూచుచు, ఆనందమున దివ్యపథములకు పోవుచు, తన అద్భుత గాంధర్వమున అతని నోలలాడించుచు, అతనిచే చైత్యములు నిర్మాణము చేయించుచు, ఈజన్మము నొక మహాదానందప్రవాహమును చేసుకొనగలుగుటయే చరితార్థత!

తానును సువర్ణశ్రీ కుమారుడు భారతవర్షమంతయు యాత్రలు సలుపవలెను. బౌద్ధక్షేత్రములు దర్శించవలయును. ఈ ధనమెందుకు, రాజ్యమెందుకు? ఒక మంచివానికన్న ఇంకొక మంచివాడు ఇంకనెక్కువ బాగుగ రాజ్యము పరిపాలింపగలుగునా? రాజులు రాజులుకదా, రాజ్యములకై మహాయుద్ధములు సలిపి ప్రజానష్టము గొనివచ్చుచున్నారు.

తనతండ్రికీ కోట్లకోట్లువచ్చినవి. ఇతరుల ధనమును వ్యాపారము పేర హరించుట వలనగదా! రెండుపణములకు కొన్నవస్తువు, పదిపణముల కమ్మును. ఒకచోటినుండి వస్తువులు మరొకచోటికి చేర్చుటలో పడినపాటు రెండుపణములు విలువయుండును అనుకొన్నను, లాభము ఆరుపణములు మిగులుచున్నవి. ఈరీతిగ పోగైనపాపమే తనతండ్రి మహాసంపదయంతయు.

తనకై, తనధర్మముకై తనబిడ్డలకై, లోకమునకై, భగవంతునకై, జీవితము ధారపోయనియువతి జన్మము వృథాయనికదా అమృతపాదార్హతులు చెప్పినది. ఈభావములు హిమబిందు హృదయములో నెలకొన్నవి.

ఆమెకు తగని ఆవేదన. నిలుచుండలేదు. కూరుచుండలేదు. పాటలీపుత్ర పురమునయున్న సంఘారామములు చైత్యములు, ఎన్నిసారులో తిరిగినది అమృతలతాదేవితో. ధాన్యకటకమునుండి వచ్చిన బాలనాగిని వేపుకొని తినుచున్నది.

"బాలనాగీ, ఎటులనే!" "బాలనాగీ నాకు జ్వరము తగిలినట్లున్నది, చూడవే!" "బాలనాగీ! నాకు మంచివిషమును కొనిరావే" ఈరీతిగ బాలనాగి పలిగిపోవుచున్నది.

... లజాగి ఏమిచేయగలదు? ఆమె ఇటు పరుగిడును, అటు పరు... సురాలితోపాటు ఆమెయు నానాబాధలన్నియు పడుచున్నది. అవి ...ను మనస్సునకు వచ్చును. తానును హర్షగోపునకై బాధనందుచుంటినని ...కొనును. హర్షగోపుడు వచ్చునట. అతని విశాలవక్షము ఆమె హృదయమున ...చును. తన్నావక్షమున కదియించిన అతని పృథుబాహుద్వయ మామె హృదయ...ధములతో ...చి దేహముప్పొంగును. హిమబిందునకు వివాహమైనగాని తాను వివాహము చేసికొనరాదు.

హర్షగోపుడు తన్నుద్వాహమగుటకు ఇంద్రగోపుడు అనుమతించినాడట. తన తల్లిదండ్రు లిదివరకే అనుమతించిరి.

తనతండ్రి, మంచి వ్యవసాయదారుడు చారుగుప్తుని గ్రామములో ముఖ్యగ్రామమైన జయపురియందు పెత్తనమాతనిదే. చారుగుప్తుని పొలమున్నియు ఎంత చక్కగా పండించును!

ఆ గ్రామమే అందమైనది. అది శ్రీకాకుళమున కెగువను కృష్ణాతీరమున నున్నది. వ్యవసాయము, పొలములు దున్నుట, కలుపుతీయుట, పంటకోయుట, నూర్చుట, ధాన్యాదులింటికి తెచ్చుట, సంక్రాంతి! ఎంతచక్కనైన పాటు! ఆపాటును అందగింపజేసే పాటలో!

తన ఇల్లు వేరుగానుండును. తనకెన్ని పశువులుండును! అవి అంబాఅని అరచును. ఆవులపాలు తాను పిదుకును. తన భర్తయు పితుకును. బిడ్డలు "అమ్మా గుమ్మపాలు" అందురు!

"శాలవాగీ!" అను హిమబిందు కేకతో శాలవాగి కలలు ఎగిరిపోయినవి.

హిమబిందు పరుగునవచ్చి, "శాలవాగీ రావే! నా బట్టలన్నియు సర్దు. గొండు చీరల నిరువదింటిని సిద్ధము చేసితిని. మనరథము సిద్ధము. నేనును, నీవును వెంటనే బయలుదేరవలెను. ఈ రాత్రి రాత్రే, గంగయొడ్డునే బయలుదేరి కాశీపురము పోవుచున్నాము. వారణాశీ పురమునకడ, బుద్ధదేవుని ప్రథమాశ్రమమైన సారనాథవనమున్నది. అచ్చట అతిపవిత్రమైన మహాచైత్యమున్నది. ఆ చైత్యము అశోకచక్రవర్తి నిర్మించినాడు. మనమాక్షేత్రము దర్శించి రావలయును. తండ్రిగారికి తెలియదు. మనరథము మహావేగమున పోవును. లే! లే!" అని తొందరపరచెను.



వారారాత్రి ప్రయాణమైరి. మహావేగముతో వారిరథము మహారాజపథమున వెడలిపోవుచుండెను. తెల్లవారుసరికి వారొకపట్టణము చేరిరి. అచ్చటనుండి హంసవలెనున్న ఒకచక్కని నావను మాటలాడుకొని, వారు గంగానదిలో పడవప్రయాణము సాగించిరి.

తనస్వామిని తాను కలుసుకొనుటకు పోవుచున్నది. విమానములు, గంధర్వాశ్వములు బృహత్కథాకథా సందోహములో మాత్రమున్నవి. లేనిచో ఈ మరుక్షణములో అచ్చటికిపోయి వాలియుండునుకదా?

ఆ సుందరశ్రీ వికాసితవదనుడు, తనమనోనాథుడు వారణాశీపురప్రాంత కురంగవనమున నుండునా? అచ్చటినుండి కౌశాంబికో, కుశనగరమునకో, లుంబినీవనమునకో పోయియుండునా? ఎక్కడకుపోయినను, తాను నిర్నిద్రయై ఏడులోకములు వెదకియైన తనప్రాణేశుని తాను వెదకి పట్టుకొనును.

ఆ శిల్పకుమారుడు పురుషులలో మహాకిరీటము. ఆయనకన్నులలో చిత్రలేఖనములు కలలు తిరుగును. ఆ శిల్పినవ్వులలో కావ్యములు గానముచేయును. ఆయనరూపమున సర్వశిల్పములు చైతన్యమునందును.

తానెంత యదృష్టవంతురాలు. ఆ దివ్యమూర్తి తన్నుచూచిన ప్రథమక్షణమందే తన్నుప్రేమించెను. తన్ను శిల్పమూర్తిని చేసెను. తన్ను చోరులు ఎత్తుకొనిపోయినప్పుడేమియు వెరువక తన్ననుసరించి, విరోధుల నుక్కడించి తన్ను రక్షించెను. తనకై అత డుద్భవించినాడు, అతనికై తానుద్భవించినది.

తండ్రి తన్ను శ్రీకృష్ణమహారాజున కుద్వాహ మొనరించెదనని తనతో తెలిపినప్పుడు, వెంటనే హృదయమునకే ప్రాణముపోయి నేలపైపడిపోక, సిగ్గులేక తల యూపినది. తనలోని యువనరక్తము మల్లుచేసినది. "ప్రభూ! ఆత్మేశ్వరా నీకెంత ప్రియద్రోహము చేసితిని! ఆనాడు తోటలో ఈ కర్కశహృదయ వచించిన మాటలకు నీవు ఎంత కుందినావో!" ఈ ఆలోచన ఆమెహృదయమున మెలిపెట్టుటయు ఆమె కన్నులార్ద్రములయ్యెను.

ఒకవైపు తనప్రభువగు శ్రీకృష్ణసాతవాహన మహారాజున కిచ్చెదరనుకొనిన బాలిక! ఆబాలిక ఆవివాహమున కొప్పుకొనినట్లు కనబడుట. ఈ రెండును ఆమహాభాగుని ఇటుల దేశాలపాలు చేసినవని యామె యనుకొనెను.

ఒకవేళ నందమహారాజు దీక్ష గయికొనినవెనుక సుందరీదేవిగతియే తనకును పట్టునేమో! తన హృదయేశ్వరుడు, తనమంజుశ్రీ భిక్షువేమైనచో ఓ సనంతభిక్షా! నీ పరమసేవకు అర్థమేలేదని ఆమెకన్నుల నీరు కారిపోయినది.

“బాలనాగీ! మన యానమును తొందరగ పొమ్మనుము. త్వరగ మనల కాశీపురికి తీసుకొనిపోయినచో, వారు కని, విని, ఊహించలేని పారితోషికమిత్తునని తెల్పవే!” అని ఆమె తొందరపెట్టెను.

రెండు రాత్రులు, రెండుపవళ్ళు పడవలోనే ప్రయాణించిరి. పడవలోనే బాలనాగి వంటచేయుచుండెను. చారుగుప్తుడువచ్చి, హిమబిందును వెనుకకు గొనిపోవునేమో యనుభయమున హిమబిం దట్లొవరించినది.

ఒకచోట తండ్రి రథములతో గుఱ్ఱములతో, ఏనుగులతో పదిగోరుతములు దూరమున వచ్చున్నాడని ఒక గోండుడువచ్చి చెప్పినాడు. ఆమె వెంటనే పడవనాపి తానును బాలనాగియు, గోండులు గంగ అవలిఒడ్డునదిగి, వెనుకకు కొంతదూరము పోయి, నదిఒడ్డునుండి మహావేగముతో, రెండు గోరుతములు తీరము వదలివెళ్ళి, అచ్చటనుండి చుట్టి గ్రామములవెంబడి కాశీనగరము ప్రయాణము చేసిరి. చారుగుప్తుడు గంగాతీరముననే కాశీనగరము ప్రయాణము చేయుచున్నాడని గోండులు వార్తలు తెచ్చిరి.

హిమబిందు మరల సంకేతముచొప్పున నదీతీర గ్రామమునకు వచ్చిన నావనెక్కి ఒకదినము ప్రయాణముచేసి కతిపయదినములకు వారణాసి చేరెను.

వారణాశినుండి ఆమె వెంటనే గోండులతో హరిణ వనాశ్రమము చేరినది. అచ్చట ఒక అతిథిగృహమున వారిద్దరు వసించి, గోండులను సువర్ణశ్రీ ఎచ్చటనుండెనో తెలిసికొనిరమ్మని పంపినది.





# చతుర్దశ ప్రకరణము

## నూత్నాశోదయము

చారుగుప్తుని ప్రపంచము, ఇసుకతో కట్టిన బొమ్మరిల్లువలె కూలిపోయినది. తనబాలికను యువరాజ్ఞిని చేయవలెనని ఉవ్విళ్ళూరిపోయినాడు. హిమబిందు శైశవమునాడే అతనిలో నామహాస్వప్న మావేశించెను. అందుకై అతడెత్తిన ఎత్తులు, చేసిన సంపాదన, రాజానుగ్రహప్రాప్తికై పడినపాట్లు లోకవిఖ్యాతినందినవి.

ఆంధ్రచక్రవర్తికి నాతనిపైనున్న గౌరవము, ప్రేమ, ఇంక దేనియందును లేకపోయినది. చారుగుప్తునితో నాలోచింపకుండ నేకార్యమును చక్రవర్తి తలపెట్టలేదు.

మహారాజ్ఞికి కావలసిన విద్యలన్నియు హిమబిందునకు నేర్పించినాడు. చారుగుప్తుడు సకలశాస్త్రములు, చప్పన్నభాషలు, ఆంధ్రప్రాకృతము, పాలి, సంస్కృతము, మాగధి, శౌరసేని మొదలగువానిలో నామెను పండితురాలినిచేసినాడు. త్రిపిటకములు, ధర్మచక్రప్రవర్తనసూత్రము, అభిధర్మసూత్రము, మహాపరినిర్వాణసూత్రము మొదలగు సూత్రములు, నికాయములు, జాతకగాథలాది బౌద్ధగ్రంథములన్నియు ఇతిహాసాది సంస్కృతగ్రంథములన్నియు హిమ చదివినది. అశ్వారోహణము, కత్తిసాము, విలువిద్య, రథచోదకత్వము మొదలగు విద్యలయందామె ప్రజ్ఞావంతురాలు. నాట్యము, చిత్రలేఖనము, గాంధర్వము, సాహిత్యము వీని యన్నిటియందును ఆమె అపరప్రజ్ఞాపరిమిత, సరస్వతి.

ఇట్టి బాలికను జగదేకసుందరిని శ్రీకృష్ణుడు తనకు వలదనినాడు. ఆ విషబాలయే తనకు కావలెనట. రాజులహృదయములు ఏమాత్రము నిలకడలేనివి. ఋతువులలో గాలివాన లెప్పుడువచ్చునో చెప్పవచ్చును. రాజధర్మము నిర్వర్తించువారి హృదయము లెట్లుపోవునో ఎవ రెరుంగగలరు?

తనశ్రమయంతయు వ్యర్థమైనది. తన ఆశలు, తపస్సులు రిక్తఫలములు పండినవి. తనబాలిక సువర్ణశ్రీని వివాహమాడునట, తనబాలికకు, శిల్పియగు సువర్ణశ్రీకి ఎక్కడికెక్కడ! తాను వర్తకచక్రవర్తి. సాధారణ చక్రవర్తులు త్రొక్కిచూడని

దేశములు తాను జయించినాడు. భారతవర్షమునందేల, సకలభూమండలమున తనతో సమానులగు ధనవంతులు లెక్కకు వత్తురో, రారో!

ధనమిచ్చి సామ్రాజ్యములు కొనగలవాని పుత్రికయై, బొమ్మలు చెక్కుకొను శిల్పబ్రాహ్మణుని బిడ్డను తనబాలిక వలచునది!

రాజుల హృదయములకన్న మరియు విచిత్రవర్తనములు, అగాధములు స్త్రీచిత్తములు. ఎవరు తనకు సహాయము చేయగలరు, ఎవరు ఆలోచన చెప్పగలరు? చక్రవర్తి తనలోపాటు విచారించును. తన చండశాసనముచే కుమారుని ఆజ్ఞాపించి హిమబిందు నుద్వాహమగునట్లు చేతునని యాయన వాగ్దానమిచ్చినాడు. కాని ఆ బలాత్కార వివాహముచే నేమిప్రయోజనము?

ఆ మృతపాదులు వేదాంతము బోధించినారు, తాను శ్రీకృష్ణునికి వేదాంతము బోధించి మనస్సు తిప్పెదననినారు. మహారాణి ఇట్టి సంఘటన కెంతయో వాపోయినది. తన కుమారుని ప్రాధేయపడి యొప్పించెదనన్నది. ఇట్టివారే తనకు సహాయము చేయలేనిచో ఇంక నెవ్వరీ ప్రపంచమున సాయపడగలరు.

తానధర్మాభిరతుడుకాడు. రాజమార్గమగు సత్యమునే తాననుష్ఠించును. ఎందుకు తనకీ అవమానము బాధ, ఆశాభంగము కలుగవలెను? తన తనయకిట్టిగతి పట్టవలెను?

తన పూర్వకర్మమా? తన తనయ పూర్వకర్మమా? కర్మనతిక్రమించు నధికారము తనకు, తన తనయకు లేదా? తన తనయయూ తనకోర్కె నిరాకరింపనని వాగ్దానమిచ్చినది.

విషకన్యల విషయము కథలలో వింటిమి. ఇప్పుడట్టిసంఘటన నీ స్థాలతిష్యుడు ప్రత్యక్ష మొనరించెను.

ఆ విషకన్య తానేవిధి నిర్వర్తింప ప్రయుక్తయైనదో అది చేయవలెను. లేదా తానే నశించిపోవలయును. ఈ బాలిక స్థాలతిష్యుని వసుమురాలట, ఈమె ఆ రెండు పనులను చేయలేదు. ఇది ఏమిచిత్రము!

స్థాలతిష్యుడు రాజవంశమును జయింతునని బయలుదేరెను, ఏమియు చేయలేకపోయినాడు. తనకుమాత్రము తీరని అపకారము చేసినాడు. తనబాల నెత్తుకొని



పోయి, సువర్ణశ్రీని ఆమెను జతకూర్చినాడు. విషకన్యను ప్రయోగించి శ్రీకృష్ణ యువరాజు మనస్సు విరచినాడు.

బుద్ధభగవానుని దయ ఇట్టిదా? వేదములలో, ఉపనిషత్తులలో, పురాణములలో తెలుపబడిన దేవతలను, పరమేశ్వరుని నిరసించిన ఈ ధర్మమును నమ్మినవారికి ఇట్లు యగును కాబోలు. నేను కాశికానగరమున యుగములాదిగ వెలసిన విశ్వేశ్వరునే నమ్మవలసినదా?

ఆతని ఆవేదన తీర్చువారెవ్వరు. అప్రయత్నముగ నాతని కన్నులనీరు స్రవించినది. ఆతడు వెంటనే తన రత్నస్థగితమంజూష తెరచి స్వర్ణవిగ్రహరూపయై యున్న ప్రజాపతిమిత్రను కనుంగొని, కన్నులకాప్రతిమ నద్దుకొని వెక్కివెక్కి రోదించినాడు. ఆతనిగుండె లదరిపోయినవి. ఆతని కంటినీరు పాదప్రమాణ మెత్తునున్న యా విగ్రహమును అభిషేక మొనరించినది,

"ప్రాణేశ్వరీ, నీ ముద్దులబిడ్డను చక్రవర్తినిచేయ సంకల్పించితివి. అందుకై అనంతమగు నా సంపదనంతయు గడ్డిపోచగనెంచి వెచ్చింపనెంచితి. నా చేతనైన ప్రయత్నము చేసితిని. ఆత్మేశ్వరీ! మహారాణులకన్న ఉత్తమురాలా! నీ వేల నన్ను వదలిపోతివి. హితకరమైన నీ ఆలోచన నాకు దూరమైపోయినది. నీబిడ్డ దిక్కులేనిదైనది. బ్రతికియున్న యీ తండ్రి అప్రయోజకుడు, అసమర్థుడునై జీవచ్ఛవమైనాడు"

చారుగుప్తుడు చైతన్యరహితుడైనాడు. ఇంతలో ఆతనికి తెలివివచ్చినది.

ఎదుట సశరీరయై ప్రజాపతిమిత్ర నిలిచియున్నది. ఆమె కన్నులలో దివ్యకరుణ వెన్నెలవెలుగులను జల్లుచున్నది చారుగుప్తుడు అదరిపడి "నీవు వచ్చితివా! ప్రాణేశ్వరీ! ఈ దీనునికి ప్రత్యక్షమైనావా? తిరిగి రూపెత్తి ఈ ప్రపంచమునకు వచ్చినావా?" అని గోలపెట్టెను.

ప్రజాపతిమిత్ర ఇట్లు పలికినట్లాతనికి వినంబడినది. "ప్రభూ! ఏలనంత బాధపడెదరు? మనబాలిక ప్రేమను పాలింపుడు. ఆమెయే మీకు సర్వానందములు సమకూర్చును. మీరుచేసిన ఏకార్యమును ఫలరహితమైపోదు! హిమానువర్తుల దివ్యప్రేమలో మీరు లోకాతీత రహస్యముల గ్రహింతురు. నేను సదా మీప్రక్కనుంటిని. అటులనింకను ఉందును. మీరు అమితాభసామీప్యపదవి నందువరకు నుందును. ఆ వెనుక మనమిరువురము ఒకటియైపోదుము"

ఆ విచిత్రదర్శనముకరగి చేతిలోని జాంబూనద సాలభంజికలో చేరిపోయినట్లయినది.

ఆతడావిగ్రహమును హృదయమున కద్దుకొని, ముద్దిడుకొని, తన ఫాలమున

చేర్చి. సంధ్యారుణకాంతులు తన్నలమి, కరగిపోయి, చిరుచీకట్లలమి, వెన్నెలకాంతులు తనపై ప్రసరించువరకు అట్లనే నిలుచుండిపోయెను.

సువర్ణశ్రీ మహావీరుడు ప్రజ్ఞానిధి మహోత్తముడు. అతని తాను లోకోత్తముగ చేయును అతడే హిమబిందుకు ప్రాణేశ్వరుడగును, చారుగుప్తునితనయ సాధారణమానవుని ప్రేమింపదు. అతనిలో ఏ మహోత్తమ పవిత్రశక్తులున్నవో అవి ఆకాశోత్తాలమై విశ్వమున ప్రజ్వరిల్లుగాక! తన ఆత్మేశ్వరి ఆదేశము దివ్య ధర్మసూత్రమగుగాక

చక్రవర్తి యింతలో చారుగుప్తుని మందిరములోనికి వచ్చినాడు. చారుగుప్తుని హస్తములనున్న విగ్రహమా చీకటిలో మెరసిపోవుచున్నది.

చారుగుప్తుడు చక్రవర్తిని చూచి చకితుడై "మహాప్రభూ! తామే వచ్చినారేమి? వార్తనంపిన తమ్ము సేవింప నేనే వచ్చియుందునుగా?" అనెను.

"చారుగుప్తులవారూ! మీరు మాసోదరులు. మేము ఈ పాటలీపుత్రమున సింహాసన మధిష్ఠించువాడు. మీరును మా రాజప్రతినిధిగ మహారాజ సింహాసనమధివసింప. మేము మిమ్ము కోరుటకు వచ్చితిమి"

"మహాప్రభూ! నాకు సింహాసనాసీనత వలదు. నేను భగవద్ధర్మము పాలించుటయే ఈదేవికి ఇష్టము అది నా నిశ్చయము, తమయాజ్ఞ కన్నదు నెదురాడి ఎరుగని నేను నేడు మొదటిసారి, ఈమనవి చేసికొన సాహసించుచున్నాను."

"సువర్ణశ్రీకుమారులను మేము కళింగాధిపతిగ జేయుచున్నాము మీరును మా సంకల్పించిన సత్కారము స్వీకరింతురని అనుకొంటిని."

"నాబిడ్డను సువర్ణశ్రీకి అర్పింప నిశ్చయించుకొన్నాను దేవా! మీయాశీర్వాదమే నాకు సత్కారము"

"హిమాసువర్ణుల ప్రేమోదంతము కీర్తిగుప్తులవారు మాతో చెప్పియున్నారు. పాటలీపుత్ర మహారాజ్యము మీది. మీరది ఏమిచేసినను మీయిదియ! మీ బాలికరణమిందు, లేదా సువర్ణునకు—"

"ప్రభూ! ఎంత చక్కని ఉదారత మీది! మీసువర్ణునకే ఈ రాజ్యమిందు."

"తథాస్తు."

చక్రవర్తి వెడలిపోయెను.

ఆ జాంబూనద విగ్రహమును నవరత్నఖచిత పూజాపీఠికపైనమంచి, చారుగుప్తుడా సింహాసనముఎదుట పద్మాసనస్థుడైనాడు.



# పంచదశప్రకరణము

## వారణాశీయాత్ర

చారుగుప్తుడు శాంతానందసమ్యక్ స్థితినందిన హృదయముతో తన కుసుమపుర హర్మ్యమున హిమబిందుకుమారి వసించు శుద్ధాంతములకు పోవలెనని అనుకొను సమయమున పరిచారికలు భయముగదురు మనసులతో వడకుచు అవనతవదనలై చారుగుప్తునికడకు విచ్చేసిరి.

చారు:—ఏమిపని?

ఒకపరిచారిక:—ప్ర—ప్ర—భూ!

చారు:—ఏమమ్మా వణకిపోయెదవు. కన్నులనీరు నిండుచున్నది. భయములేదు. నీకు కావలయునది మనవి చేసుకొమ్మా!

పరిచారిక:—ప్రభూ! హిమబిందుదేవి తాను వారణాశి వెళ్ళుచున్నానని చెప్పి, బాలనాగితో గొందు రక్షకభటులతో రథముపూని వెళ్ళిపోయినది.

చారు:—(నువ్వునలేచి) ఏమీ! హిమబిందు వారణాశి వెళ్ళినదా?

చారుగుప్తుడు తన ప్రజాపతిమిత్ర విగ్రహమువైపు పదినిమేషములు అనిమిషుడై చూచినాడు. దగ్గిరనున్న జేగంటను మోగించినాడు. ఆమోత 'జయ్' అని మ్రోగినది. వెంటనే ఇంద్రగోపుడచ్చటకు వచ్చినాడు.

ఇంద్రగోపుడు:—ఏమిసెలవు స్వామీ?

చారు:—హిమబిందుదేవి వారణాశి పోయినదట. ఆమెకు కావలిగా రెండువేలసైన్యము పంపుము. ఆమె వెళ్ళినజాడ తీయుము. నేనును వారణాశికి ఈ సాయంకాలము ప్రయాణము. అతి వేగవంతమగు ఆశ్వికులు వేయిమంది నావెనుకవత్తురు. వేగవంతములగు గుఱ్ఱములను నారథమునకై సిద్ధము చేయుమని అంచెలవారిని పంపుము. నాప్రయాణము సిద్ధముచేయుము. ఇప్పుడె మా మామగారికి హిమబిందుకుమారి వారణాశికి పోయిన విషయము తెలియజేసి వారు నాతో వచ్చుటకు నా ఆహ్వానమందింపుము.

ఇంద్రగోప్తుడు నమస్కరించి "చిత్తము మహాప్రభూ!" అని వెడలిపోయెను. చారుగుప్తుడు పరిచారికలవైపు చూచి, "మీరు మా అత్తగారికి ఈ విషయము తెల్పుడు. ఆమెనుగూడ నాతో ప్రయాణమునకు సిద్ధము చేయుడు. మీలో నలుగురును, తారాదత్తయు, దాదులు నాతో వచ్చుటకు సిద్ధముకండు" అని ఆజ్ఞనిడెను. "చిత్తమని" వారు వెడలిపోయినారు.

వెంటనే చారుగుప్తుని దర్శింప శ్రీకృష్ణసాతవాహన మహారాజు వేంచేసినారని దౌవారికుడు మనవిచేసెను.

చారుగుప్తుడు చిరునగవున త్వరత్వరగ సభాభవనమునకు వచ్చినాడు. శ్రీకృష్ణ సాతవాహన మహారాజు విచ్చేయగనె చారుగుప్తుని మంత్రులు, సేనాపతులు సగౌరవముగ వారినెదుర్కొని తోడితెచ్చి సభాభవనము సువర్ణాసనముపై నధివసింపచేసిరి

చారుగుప్తుడు వచ్చుటయు మహారాజు లేచి ఆయనకు నమస్కరించి, వారిచ్చు ప్రతినమస్కారం బందుకొని, "దయచేయుడు!" అని చారుగుప్తుడు ప్రేమపూరితముగ తన్ను ప్రార్థింప ఆసన మలంకరించెను. చారుగుప్తుడును దాపుననున్న దంతాసన మలంకరించెను. మంత్రులు, సేనాపతులు సభామందిరమువీడి వెడలిపోయిరి.

శ్రీకృష్ణ సాతవాహనప్రభువు, చారుగుప్తునిజూచి, "చారుగుప్త ప్రభూ! నేను మీయెడ దోషమాచరించితిని. అందులకు క్షంతవ్యుడను" అని తెలిపెను.

"మహాప్రభూ! అర్హ భగవంతునిఇచ్ఛ! తామెట్లు తప్పుచేయగలరు?"

"నేను ఒక మహాభాగ్యమును చేతులార త్రోసివేసుకున్నాను."

"మహారాజా! తాము మనస్సున నేవిధమగు కించయును జొరనీయకుడు. నాబాలిక సువర్ణశ్రీని ప్రేమించినది. సువర్ణశ్రీ యామెను ప్రేమించినాడు. ఆమె ధర్మమున పరకీయయైనది. నేను నాతల్లివిషయమున మూర్ఖుడనై సంచరించితిని. ఆమె ఇష్టాయిష్టములు విచారింపనైతిని. శకటపందెమున విజయమందిన గిత్తలను తమకు బంగారు సంతరించిన బండితో సమర్పింపనెంచితిని. అది ఇంకొకదారి పట్టినది. విజయమందినది సువర్ణశ్రీ! అప్పుడు భగవానుడు నాకు జరుగబోవు విషయములు సూచించినాడు. అయినను మహామత్తతతో నేన భగవంతుడననినట్లు సంచరించితిని. నేమును, తమ్మంతమొందింప సంకల్పించిన స్థాలతిష్యమహర్షియు ధర్మముచే పరాభవ



మొందితిమి. తామును, విషకన్యయు, నా హిమబిందువు, సువర్ణశ్రీయు ఏమహత్తర దివ్యసంఘటన నెరవ జనించినారో ఎరికి తెలియును. మీ నలువురి ఆనందమే నా ఆనందము. తాము తథాగతుని పరమకరుణతో వర్ధిల్లుదురుగాక!"

"ప్రభూ! మీ అఖండానురాగము మన ఆంధ్రపథమునకు సాతవాహనులకు అనంతాశీర్వాదము."

శ్రీకృష్ణసాతవాహనుడు వెడలిపోయినాడు.

వారు వెడలిపోవుటయేమి కీర్తిగుప్తులవారు ముక్తావళీదేవియు వచ్చుటకు వచ్చినారు. కీర్తిగుప్తుడును ముక్తావళియు నల్లుని వందనములందుకొని యాశీర్వదించినారు. వారందరు లోనిమందిరమున కొకదానికి పోయినారు.

కీర్తి:—నాయనా!

చా:—మామగారూ మీరుచెప్పబోవు విషయము నాకు తెలియును. మీరు వెంటనే అత్తగారితో కాశీపురము ప్రయాణముకండు. హిమబిందు వారణాశివెళ్ళినది.

ఇంద్రగోప్తుడువచ్చి సువర్ణశ్రీ మూడుదినముల క్రిందటనే వారణాశి వెళ్ళినట్లును, అతని వెదకికొనుచు హిమబిందుకుమారి, మహారాజపథమువెంట అశ్వికులైన గోండు సైనికులు వెంటరా బాలనాగితో రథముపై కాశీపురము వెడలినట్లును విన్నవించినాడు.

కీర్తిగుప్తుడు అల్లునితో "నాయనా! మనము వెనువెంటనే వెళ్ళవలయును. వినయభిక్కులవారును మనతో వచ్చునట్లు చేయవలయును. ఆపనిలో నేనుండెదను. వర్జములేకుండ బయలుదేరిపోదము. మీ అత్తగారును మనతోవచ్చును" అని తెలిపినాడు.

వారిరువురు వెంటనే తమభవనము చేరిరి. కీర్తిగుప్తుడు సముచితవేషుడై రథమారోహించి కోటలోనికి శ్రీకృష్ణసాతవాహనుని మహాభవనమునకు బోయినాడు. కీర్తిగుప్తుడు మహారాజునుదర్శింప ననుమతి వచ్చుటయు, వారు లోనికిబోయిరి. శ్రీకృష్ణుడు సగౌరవముగ నాయన నెదుర్కొని ఆసనమధివసింపగోరి తానును అధివసించెను.

"వర్తకచక్రవర్తీ! తమరాకకు కారణము?"

"మహాప్రభూ! సువర్ణశ్రీ రాజభక్తిచే వారణాశి పోయినాడు."

"అదేమిస్వామీ?"

"తాము హిమబిందుకుమారిని ఉద్వాహమగుదురని యాతడు భావించినాడు."

"అవును! ఆతడు హిమబిందుదేవిని ప్రేమించినాడు. ఉత్తమశిల్పి. ధీరోదాత్తుడు, అతిరథశ్రేష్ఠుడౌ యువకుడు. ఆతడిచ్చట యుండుట, హిమబిందుదేవి తన్ను ప్రేమించుచున్నదని మాకు తెలియజేయుననియు, అది మా వివాహమునకు ప్రతిబంధకమగునని తలపోసి వెడలిపోయినాడు."

"ఈవిషయమే మనవిచేయవలెనని వచ్చినాను మహారాజా!"

"స్వామీ! ఇందు మా కర్తవ్యమొక్కటి యున్నది. మేము ప్రార్థించినగాని సువర్ణశ్రీ హిమబిందుకుమారిని వివాహమాడుట కియ్యకొనపోవచ్చును. మీరు వెంటనే పోయి ఆ మహాభాగుడు ఏవిధమగు తొందర పడకుండ చూడుడు. మేము మీ వెనువెంటనే వత్తుము."

కీర్తిగుప్తుని భావమును అరియ. అయన శ్రీకృష్ణుని వారణాశికంపని ఎటు ప్రార్థింపగలడు? ఉన్నవిషయమును మనవిచేసుకొన్నచో శ్రీకృష్ణప్రభువు గ్రహింపగల్గుననియే కీర్తిగుప్తుడట్లు చేసినాడు.

శ్రీకృష్ణ శాతవాహనప్రభువు వారణాశిపోయి సువర్ణశ్రీని కోరుటలో మహత్తరార్థము సువర్ణశ్రీకి గోచరించును. శ్రీకృష్ణప్రభువు రాకపోయిన ఎటులనో పాటలీపుత్రపురము ఆబాలుని గొనివచ్చి యువరాజుతో చెప్పింపదలంచెను.

కీర్తిగుప్తుడు సెలవునంది వెడలిపోయెను.



# షోడశ ప్రకరణము

## దుర్భరావేదన

యుద్ధములన్నియు పూర్తియైనవి. తన ఆంధ్ర చక్రవర్తి సకల జంబూద్వీపమునకును, చతుస్సముద్రవలయిత భూలోకమునకును చక్రవర్తియైనాడు. ఈమహాచక్రవర్తి చల్లని పాలనమున లోకమున సర్వధర్మములు పరమ శాంతితో సమన్వయింపబడుగాక! సర్వకళలు ఉత్తమాశయముల తేజరిల్లుగాక! సర్వదేశములు దివ్యసుఖము లనుభవించుగాక! సర్వప్రజలు నీతిమూర్తులు గాక, ద్వేషరహితులై చతుర్విధ పురుషార్థపరులై వృద్ధినందుదురుగాక! సువర్ణశ్రీ పాటలీపుత్ర మహాచైత్యముకడ ధ్యానముద్రలో బుద్ధభగవానుని అర్చించుకొన్నాడు.

ఇంటికడ పది ముహూర్తములైన ఉండలేదు. నాగబంధునికా సమాదర్శాల శేమ తనకానందము సమకూర్చునది, ఆవేదనయు నధికముచేసినది. దూరమున నుండి రైన హిమబిందుదేవిని చూడవలెనను కాంక్ష, ఆకాంక్ష భయంకర దీపవ్రాంతమని దుర్భరావేదన!

తనగురువు సోమదత్తాచార్యుని దర్శించును. వారితో ఏవేవియో చర్చించును, మనస్సుమాత్ర మొక్కెడనో యుండును. "ఏమి సువర్ణశ్రీకుమారా! నీవు మాటలాడుచుంటివి. నీవుమాత్ర మిచ్చటలేవు" అని సోమదత్తప్రభువు పలికి పకపక నవ్వును. సోమదత్తునకు శిష్యునిహృదయము పూర్తిగ అవగతమైనది. ఈ విచిత్ర సన్నివేశ సంక్లిష్టత నెట్లు తానుమాత్రము విడదీయగలడు. తన శిష్యుడు ఈ మారదేవ మాయ నుండి తానే తప్పించుకొనవలయును. సువర్ణుని నిట్టూర్పులు సోమదత్తుని హృదయమును గలంచును. సువర్ణశ్రీ తన ప్రాణమిత్రుడైన మహాబలగోండు యువరాజుతో కలిసి పూర్వశిల్పదర్శనము చేయును. శిల్పశాస్త్రములు చర్చించునుగాని, మహాబలుడు తన ప్రియమిత్రుని హృదయాంతరమున ఏదియో మహాబాధ విషరోగమై విజృంభించినదని గ్రహించినాడు.

"సువర్ణఅన్నా! మనకు కాని ఫలము దివ్యమైనను, మన జీవితమునుండి యా ఫలమునకై జన్మించిన వాంఛను నాశనము చేసుకొనవలదా?"

"అవును! నిస్సందేహముగ అట్టివాంఛను నాశనముచేసి తీరవలయును. లేనిచో ఆ మనుష్యుడే నాశనమైపోవును తమ్ముడూ!"

"అయినచో నీవేల ప్రయత్నము చేయవు?"

"ఆ ప్రయత్నమే నా జీవితభాగము చేసుకొనినాను. నేను విజయమునంది తీరవలయును. లేనిచో నాశనమైపోయెదను."

"నీవు నాశనమైపోయి ఏమిలాభము?"

"ఎవనికి లాభము?"

"లోకమునకు!"

"నేను నాశనమైన లోకమునకు నష్టమేమి తమ్ముడూ?

పారిజాత కుసుమము నే
వాంఛించిన యొక భృంగము
సిద్ధిగనక నశియించిన
చేటేమీ లోకమునకు?
అమృతము నే వాంఛించిన
-హీ పతి యొక దాశ చెడియు
నశియించిన చేటేమీ
నరలోకము నావంతయు?"

"అటులనుటవలన జీవితము నెదుర్కొనలేని నీరసత్వమే తెలియజేయును గాని—"

"అయిన భయమేమి?"

"మరల నీవు జన్మించి కర్మ దుర్విపాకము చెల్లించవలయును కాదా?"

"కర్మ అనంతము చేసికొందుమనుకొనుము. అప్పుడు ఏమియగును?"

"అనంతముగ దుఃఖము నందుచుందువు"



"దుఃఖము, ఆనందమునకు కావడికుండ. దుఃఖమైన, ఆనందమైననేమి? రెండును ఒకటియ!"

"అది యందరకు తెలియును. ఈవేదాంత విచారము మనమనుకొన్న కార్యములు జరుగనప్పుడు వచ్చునేమి? మన వాంఛలు తీరనప్పుడు లోకమంతయు దుఃఖమయమగునేమి? బాగుగా చదువుకొంటివే? అదియకాబోలు ఆర్ష ధర్మము, బౌద్ధ ధర్మము బోధించినది. మా ఆటవిక జాతులు జీవితము నెదుర్కొనుటలో ఇట్టి నెట్టి వేదాంతపు మాటలు మాటలాడరనుమా!"

"తమ్ముడూ నన్నేమి చేయమందువు?"

"ఏమి చేయమందును! నీవు ప్రపంచ శిరోమణివి కాదగిన శిల్పివి. శిల్పము సృష్టి. చతుర్విధ పురుషార్థదాయిని. మానవుడు తన జీవితమును వాంఛలను ఆశయ దృష్టిని తిలకించి. తనలోనవి జీర్ణించుకొనిన యపుడె ఉత్తమశిల్పియగునన్న విషయము పెదనాయనగారు నీకు బోధించలేదా? నీవు నిజముగ విశ్వబ్రహ్మవై విరాట్ సృష్టిని చేయవలయును. ఆ శిల్పమంతయు లోకమునకు లేకుండ చేయుదువా నీవర్పించు శిల్పము నిన్ను నిర్వాణపథమునకు గొనిపోదా? ఇది నీకు నేనా తెల్పవలసినది అన్నా! పో! దేశముల సంచారము చేయుము. ఆప్తులకడ మహాత్ములకడ శిల్ప రహస్యముల నెరిగిరమ్ము!"

మహాబలగోండ ప్రభువు తన హృదయములోని యాలోచనల నే మాటలతో పైకి తెలిపినాడు.

ఆశయ సౌందర్యము నిర్వాణపథము. అది నశ్వరమగు భౌతిక సౌందర్యము కాదు. భౌతిక సౌందర్యము పరమావధియైనను మానవునికి దుఃఖము కలుగజేయుటకే యగును.

సువర్ణశ్రీ యాత్రలు సలుప తలితండ్రుల యనుమతి గొన్నాడు. ధర్మనందియు, శక్తిమతీదేవియు సువర్ణశ్రీ చరిత్ర తెలిసికొనియుండిరి. వారు ఆశీర్వాదముల నాతనికి అనుమతి నొసంగిరి.

వెనుకనే హిమబిందునకు మహాబలగోండుని యనుమతితో నూరుగురు గోండు వీరులను అంగరక్షకులుగ సువర్ణశ్రీ ఇచ్చియుండెను. వారివి హిమబిందు యువరాణి

యగుపరకు నా జీవికడనె యుంచవలయునని గోండు యువరాజుతో తెలిపి సువర్ణశ్రీ యాత్రాభిముఖుడై బయలుదేరి పోయెను.

అతడు ప్రథమమున కపిలవస్తునగరము చేరెను. అచ్చట బాలుడగు సిద్ధార్థదేవుని మనమున ప్రత్యక్షమొనర్చుకొనెను. అచ్చట విహారమున మాయాదేవి స్వప్నము, ధవళదంతావళము ఆమెగర్భమును జొచ్చుట, లుంబినీవనమున తథాగతుని జన్మము, అబోధిసత్త్వుని జాతకము వ్రాయుట చిత్రించినాడు. ఆనాటి యాచారము చొప్పున సమంతభద్రుని మూర్తిగా చిత్రించక, పాదములు, ధర్మచక్రము, ఛత్రము, పూర్ణకలశము చిహ్నాలుగా చిత్రించెదరు. శిల్పము చెక్కుదరు. ఆ ఆచారము చొప్పుననె సువర్ణశ్రీ మహాశిల్పియు రచించెను.

కపిలవస్తునుండి సువర్ణశ్రీ లుంబినీవన సంఘారామమునకు బోయినాడు. అచ్చటనుండి విధురానగరముపోయి, వెనుకకుమరలి సువర్ణశ్రీ కాశీపురమువచ్చి మృగవన సంఘారామము చేరినాడు.

ఆ సంఘారామ కులపతి మహాశిల్పి ధర్మనంది పేరు వినియున్నాడు. అతని కొమరుడు సువర్ణశ్రీయని, ఆబాలశిల్పి ఆచార్యుల పాదముల కెరగుచు తెలుపుకొనినయపుడు, ఆనందమున సువర్ణశ్రీ తలపై చేయివైచి "కుమారా, మా సంఘారామ చైత్యవిహారముల నలంకరించి జగదద్భుతముగ నొనర్పుము" అని ఆశీర్వదించినాడు.

సువర్ణశ్రీ తనవిడిదికి వెడలిపోయినాడు. అవును అటులనే తానొనర్చును. శిల్పము చిత్రలేఖనము ఆ విహారములన్నియు నల్లుకొనిపోవుగాక. చైత్యములు పవిత్రమైన పూజలైపోవుగాక! యని హృదయమున మహాశిల్పి ఘనునకు నమస్కృతి యర్పించెను.



# సప్తదశ ప్రకరణము

## అమృత కన్య

అమృతపాదులబుద్ధిలో రెండు మహాప్రవాహములు [illegible] సంగమించినవి.

ఒకటి—చిన్ననాటినుండి స్థౌలతిష్య మహాద్రిజనితమై, వేగవంతమై, అదిని చిన్న శైవాలినిరూపమున, పోనుపోను మహానదియై ప్రవహించిన నందిదత్త జీవితము, అతని సంస్కారము, అతనిజ్ఞానము, అతనివిద్యయును. రెండు—గంగానదీజనితమై, ఆనందాశ్రమ పోషితమై, ఆనందాశ్రమ కులపతి ప్రజాపతి కాశ్యపాచార్యబోధితమై, ప్రవహించి ధాన్యకటక సంఘారామ కులపతులైన, అమృతపాదార్హతుల జీవితము, అతని సంస్కారము, అతనిజ్ఞానము, అతనివిద్యయును.

రెండును నేడు స్థౌలతిష్యుని దెబ్బతో, శస్త్రవైద్యముతో పర్వతముల ఛేదించుకొని ఈవల సంగమించినవి.

ఒకనది ధవళదేహ. ఒకనది నీలశరీర. ఈనాడు రెండునుకలిసి ఏమియగును? అతడు బౌద్ధుడా వేదవ్రతుడా? అతడు సన్యాసియా, విధురుడైన గృహస్థా?

మానవధర్మము, మానవాతీతధర్మము నాతనిలో సంఘర్షణకు పాల్పడినవి.

రెండు చిత్తసంస్కారములు అమృతపాదులను కలతపెట్టినవి. ఆరోగ్యముకుదిరి ఇటునటు నడయాడుచున్న దినములలో స్థౌలతిష్యులు తనకుమారుని జాగరూకతతో గమనించుచుండెను. చక్రవర్తి వచ్చెను. చారుగుప్తుడు, శ్రీకృష్ణసాతవాహనుడు, అచీర్ణుడు, సైవ్రతుడు, ధర్మనంది, మహారాణి ఆనందాదేవి, శక్తిమతీదేవి, నాగబంధనిక, అమృతలతాదేవి, ముక్తావళీదేవి, సమవర్తి, కీర్తిగుప్తుడు అనేకులు ఆంధ్రపల్లవాధరలు. పురుషసింహములు అమృతపాదులను దర్శింప వచ్చుచుండిరి. అనేకులీ విచిత్రము చూడవచ్చుచుండిరి.

ఏమి విడ్డూరము! ఈ అద్భుతసంఘటన ఎట్లు జరిగినది. తనకుమారుని ఈమహర్షి ఎట్లు రక్షించుకొనినాడు. అని స్థాలతిష్యునకు, అమృతపాదులకు నమస్కరించుచు వేలకొలది జనులు బౌద్ధులు, భిక్షుకులు, బ్రాహ్మణులు, సన్యాసులు దర్శనము చేసుకొనుచు వచ్చుచుండిరి.

స్థాలతిష్యుడు గూడ నీయద్భుతఘటనచే తీక్ష్ణజిజ్ఞాసువైనాడు. తన పుత్రుండేల బౌద్ధుడైనాడు. అతనికి పూర్వస్మృతి పోవుటయేమి. అతడు మరల ఆరునెలలలో సర్వశాస్త్రములు నేర్చుకొనుటయేమి? బౌద్ధసన్యాసియగుటయేమి? అర్హతుడై కులపతియై తన చరితమువలన, మహోత్తమ బోధనలవలన ఆంధ్రదేశమున బౌద్ధధర్మము విరివిగ వ్యాపింపచేయుటేమి?

సహజప్రతిభచే, సహజసత్య శాంతిశీలముచే, పరమకరుణాపూరిత హృదయముచే బ్రాహ్మణుల కోటానుకోట్లుగ నాకర్షించినాడు. బుద్ధుడే మరల నవతరించినాడని బ్రాహ్మణులనుకొందురట. తన కర్తవ్యమేమి?

తన పుత్రుడు ఆర్యధర్మము వీడనట్లా? వీడినట్లా? పూర్వస్మృతిలేనప్పుడు, సంపూర్ణజ్ఞానము లేనట్లుకదా? అట్టివాడు బాలకుడేయగును. బాలకుడు స్వధర్మమెట్లు వదలుకొనును? పరధర్మమెట్లు గైకొనుటయగును?

క్షణికవాదము పరాకాష్ఠస్థితికి పోయినకొలది అమృతపాదులకు లంబికాయోగము పండినది; పూర్తిగ మెలకువ వచ్చినది.

తనకేదియో అనుభూతి, ఏదియో మహాస్మృతి కలిగినది. తాను నందిదత్తుడు, తండ్రికడ వేదములు, వేదాంగములు, ఉపనిషత్తులు, దర్శనములు సూత్రములు, ధర్మసూత్రములు, ధర్మశాస్త్రములు జ్యోతిషాది షట్‌శాస్త్రములు, వీనియన్నిటిలో మహాపండితుడైనాడు. తమ నివాసమగు కాశిలో, ఒకనాడు తాను తనభార్య, తన చిన్నబిడ్డ, తనతండ్రి తనతల్లి వ్యాసకాశి పోవుచుండిరి. గంగానది వేగముగా ప్రవహించుచుండెను. గాలి వీచినది, అనేకములగు పడవలును దాటుచుండెను. ఇంతలో తమ పడవయు, వేరొకపడవయు తారసిల్లి గట్టిగ కొట్టుకొన్నవి. తమపడవ మునిగిపోయినది.



ఆవెనుక తనకేమియు స్మృతిలేకపోయినది. తనతండ్రి తన్నుకొట్టి, శస్త్రవైద్యముచేసి, తనకు పూర్వస్మృతి తెచ్చినాడు.

ఎంతవిచిత్రము! నీటిలోబడిన తన్ను పాటలీపుత్రపురమున కొనువను, ఆనందాశ్రమతీరమున గంగలోనుండి భిక్షుకులు పైకితీసినారు. తాను విద్యలు నేర్చుకొనెను. పలుచని తెరవలెనుండిన స్మృతి వెనుకనుండి చదువులుమాత్రము వచ్చినవి. అచ్చటనుండి తాను బౌద్ధసన్యాసియాయెను. అర్హతుడాయెను.

తనభార్య ఉత్తమాంగన మహాసాధ్వి కనబడదేమి? తమ యనురాగము ఎంత ఉచ్ఛస్థితిని నడిచినది. తనబిడ్డ చంద్రబాల వెన్నముద్దలతల్లియై, బంగారుబాలయై మాటలప్పుడే నేర్చుచున్నది.

తనతల్లి, అపరలోపాముద్ర, ఉత్తమచరిత్ర ఏమయినది. వీరందరేమయిరి? వీరును కనంబడలేదు. తండ్రియొక్కడే రక్షింపబడినారా?

ఈ ఆలోచనలతో అమృతపాదులు తండ్రికడకుపోయి "నాయనా! ఏమయినది. చంద్రబాలయు మీకోడలును ఏమయిరి?" అని ఆతురతతో ప్రశ్నిం

"నాయనా! నీతల్లి పదిరెండేళ్ళక్రిందట మరణించినది. ఎంత చదువుకొ అయిననేమి? కుమారుని స్మరింపనిదినము లేకపోయినదామెకు నీపేరు తలచుకొ చిక్కి శల్యమై, పదియేడులు ధైర్యమున ఈ లోకమునందుండి దేహము చాలిం మనపడవ మునిగినవెంటనే నేను తేలి ఈదుచు, నీబిడ్డను కోడలిని బ్రతికించుకొ మీయమ్మను మనపడవకు తగిలిన పడవ నావికుడొకడు రక్షించినాడు. నీవుమా కనంబడవైతివి. నీభార్య, బిడ్డను హృదయమునకు గట్టిగ అదుముకొనియే మూ యినది. ఆమె మూర్ఛబోయినది. ఆమెను ఒక్కపడవలోనికందిచ్చి, నీకై యా నదిలో వెదకితిని, వెదకితిని, అనేకులు వెదకిరి నీవు దొరకలేదు. తండ్రీ! గం నగ శిష్యులనేకులు వెదకిరి. పడవలమీదపోయి వెదకిరి. నీకు లంబికాయోగము వందుకు, నీవు వెంటనే ఆరోగ్యము ప్రాణరక్షణార్థము సంధించితివికాబోలు! నీ నీకై బెంగగొని, మూడేడులు కృశించి, నీదేవతార్చన మంజూషను పూజచేయు ఒకరోజున నీకూతు నాకప్పగించి ప్రాణము విడిచినది. చంద్రను మీయమ్మ కొం లము పెంచినది. ఆ బాలికకై బ్రతికి చివరిప్రాణము వదలినది."

"ఓహో! ఎట్టి విధిసంఘటనము? చంద్ర ఏది తండ్రీ?"

"చంద్ర నీకు కావలయునా?"

"నాకు కావలయుననియు చెప్పలేను. అక్కరలేదనియు చెప్పలేను. నా హృదయ చిత్తము పరిపరివిధముల పోవుచున్నది."

...న్యాసికావు బౌద్ధుడవుకావు. నీవు స్వేచ్ఛవాగు
...యు. కెరటమై వచ్చినది కలమై పోయినది."
...లేను వెంటనే ఆమోదింపలేను. నా జీవితము
...వరల కలుసుకొనినది కావున నా ఆత్మలో
...లేను ఆలోచింపగ విషకన్యయే చంద్రియని నాకు
...ము పాత్రికనని నాతో చెప్పినది. తనతండ్రి నవి
...ది. తండ్రీ. మహర్షి! ఆమెనేనా మీరు విష



# అష్టాదశ ప్రకరణము

## నిర్వికల్పపథము

కుమారుడు ఎప్పుడు తన్ను "తండ్రీ! మహర్షి ఆమెనేనా మీరు విషకన్యను చేసినది?" అని ప్రశ్నించినాడో, అవెంటనే తాను పాతాళమునకు క్రుంగిపోయినట్లు భావించుకొన్నాడు స్థౌలతిష్యుడు.

కుమారునకు ప్రతివచనమీయక కన్నులు నిమీలితము చేసెను. ఈబాలిక కాక పోయిన, వేరొక బాలికను విషకన్యను చేయవలయును కదా! ఇతరబాలికలను చేయుటకంటె తనబాలికయే విషకన్యయగుట యుత్తమము కదా!

విషకన్యకాప్రయోగము ఉత్తమధర్మమా? ఏలకాదు తానధర్మమెట్లు చేయగలడు? మఱి ధర్మమైనచో అట్టికార్యము విఫలమగునా?

అమృతపాదులు తండ్రిముఖము గమనించెను. తనలో ఒక విశ్వాంబోధి మథనమగుచున్నది. అతడు తండ్రిఎదుట పద్మాసనాసీనుడై, యోగాసనబద్ధుడై నిర్వికల్ప సమాధిలోనికి బోయినాడు. అటు స్థౌలతిష్యుడును సమాధిలోనికి పోయెను.

రెండును నిర్వికల్పములే. నిర్వికల్పము రెండురూపుల నెట్లుండును? నిత్యమొక్కటియె! అందు వారిరువురును లయమైరి. వారిఆత్మలు రెండును ఒకటై, ఆ ఏకత్వము విశ్వమున లయమై, సర్వమును నిత్యమున లయమైనది. ఇరువురును ఒక్కసారి ప్రపంచమునకు దిగిరి.

వారికి మాటలురావు. బౌద్ధుడు నిజము. శ్రీకృష్ణభగవానుడు నిజము, శ్రీకృష్ణనిభక్తుడు వ్యాసుడు నిజము. బుద్ధనిభక్తుడు ఆనందుడు నిజము. ఈ ఆలోచన వారిరువురకు ఒక్కసారి తట్టినది.

స్థౌల:-భిక్షూ! నిర్వికల్పపథగాములమైనమేమి: నిర్వాణపథగాములగుమీరేమి ఒక్కరమే! దిగువ మీదారిమీది, మాదారిమాది. విషకన్య అమృతకన్యయగును, ఆమెను శ్రీకృష్ణుడు వివాహమాడును. వారివంశము మహాసామ్రాజ్యభారము వహించుగాక!

అమృత:—మహర్షీ! అవిద్య, అనాత్మ, నిర్వాణములను ముఖ్యసూత్రములేమి, అనిత్యప్రత్యగాత్మ, బ్రహ్మసాయుజ్యమను ముఖ్యసూత్రములేమి, రెండును ఒకటియే! ఆర్యధర్మమే వేదములు, ఆర్యధర్మసారమే బుద్ధుడు. జనకరాజర్షికి బిమ్మట శ్రీకృష్ణావతారము, వేదవ్యాసుల పరిణతియే బుద్ధావతారము.

స్థౌల:—ఈ విశ్వాతివిశ్వములో సూక్ష్మరూపమైగాని, స్థూలమైగాని సత్యమై నిత్యమై, సర్వాతీతమై, సర్వజ్ఞానపూర్ణమై, సర్వశక్తియుతమైన బ్రహ్మపదార్థము లేదు; విశ్వములో సృష్టులు, భావములు, వికారములు పొంగుచుండును. అందుండి మరియు గాఢమైనవి మనుష్యభావములై పరిణమించును. అవియే శరీరములగును. అవి నశ్వరములేకాని వట్టి మాయకావు. అంతియకాని మాయాచ్ఛాదితమైన బ్రహ్మము ప్రత్యగాత్మస్వరూపుడుట అసత్యమని బుద్ధుడు ప్రవచించినాడు. ఆత్మభావమే సకలదుఃఖములకు హేతువందురు. బుద్ధుడట్లు చెప్పినంతమాత్రమున పరమాత్మ నిజమైనచో, అది అసత్యముకాదు. పరమాత్మ లేనిమాట సత్యమైనచో, ఉన్నదన్నమాత్రమున అది యుండదు. మీదారి ధర్మపథము, మాదారి ధర్మపరము. మీలో అనధికారులు బుద్ధధాతువును నిక్షిప్తమొనర్చి, స్తూపమని, చైత్యమని దానిని పూజలొనర్తురు. "బుద్ధం శరణంగచ్ఛామి" అందురు. మాలో అనధికారులు పూజలు, భక్తి, యోగము, యజ్ఞము, యాగము మొదలగునవి చేయుదురు! వీనితోనేమి, పోనిమ్ము. ఉత్తమచరిత్రమే ఎల్లరకు శిరోధార్యము.

అమృత:—ఆర్యా! ఈ దినములలో ఈ విశాలప్రపంచమున ఎన్ని ఆత్మవిచారణ లుద్భవింపలేదు? సంజయవైరత్తిపుత్రవాదులు, ఆత్మ లేదందురు విశ్వజ్ఞానము మానవునకెప్పుడు అలభ్యమందురు. అజితకేశకంబలీమతస్థులు ఆత్మలేదందురు. మనుష్యుడు చాతుర్భూతాత్మకమందురు. పూర్ణకాశ్యపులు ధర్మములేదు, అధర్మములేదు, పాపపుణ్యములు లేవు అందురు. మస్కరిన గోశాలులు, ఆజీవకులు కర్మలేదని మనుష్యునికి అధికారము లేదని అందురు అంతయు నియతమే అందురు. మహాజీవతము సంతియకదా! ఆత్మలున్నవని మహావీరుడు బోధించెను. ప్రత్యగాత్మ చావుతో నంతముకాదనెను; పరకాయప్రవేశ మున్నదనెను; పుణ్యపాపములు ఉన్నవనెను, పాపములు చేయువాడు హీనజన్మమెత్తుననెను; పురుగులు, వృక్షములు, రాళ్ళుజన్మల నెత్తు



ననెను. మోక్షమునకు దారి సంసారత్యాగము, కర్మరాహిత్యము, అహింస. చివరకు ప్రాయోపవేశము అనెను. ఇట్టిమతములు మనుష్యులున్నంతకాలము ఉద్భవించును. సత్యము మానవునకు లభ్యమే! లేదనునది మేము ఒప్పము. కాని నాలో రెండు నదులు సంగమించి అనేక విచిత్రమనోభావములు రూపెత్తుచున్నవి. పరమపవిత్రమైన వేదధర్మము, బుద్ధధర్మము రెండును నాలో విడకొని తపస్సునకు పోదును. నేనేమి కనుంగొనెదనో!

స్థౌల:—స్వామీ! మీ పూర్వాశ్రమరూపమైన నా పుత్రుని ఆశీర్వదించుచున్నాను. మిమ్ము 'నారాయణ' మహానామమున సాగనంపుచున్నాను. నాకు అద్భుతానందము విశ్వమునిండి సూక్ష్మాతిసూక్ష్మమై, బ్రహ్మమై దర్శనమిచ్చుచున్నది. ఈ అమృతత్వమే సర్వము నిండును. అదిగో చంద్రి!

ఇంతలో స్యందనమెక్కి విషకన్య అచ్చటకు వచ్చినది. విషవైద్యులు, ఆయుర్వేదజ్ఞులు, విషవేత్తలు, మంత్రవేత్తలు కూడనుండిరి.

విషకన్య పరుగునవచ్చి తాతగారి కాళ్ళకడ సమాలింగితభూతల యైనది.

అమృతపాదుల కన్నులు చెమరించినవి. స్థౌలతిష్యులామెను ఒడిలోనికి తీసికొని, "తల్లీ! నీ దివ్యచరిత్ర విషాతీతమై ప్రేమమయమైనదా? నీ విషము అమృతమే అయినదా! నీవలన సర్వలోకములు జయింపబడినవా? తల్లీ, అదిగో ఆ మహానుభావుని ఎరుంగుదువా?" అని ఆనందమున ననెను.

విషకన్య:—అమృతపాదాచార్యులు నాగురువులు తాతగారూ?

స్థౌల:—వారు నీకు ఏమిగా కనంబడిరి?

విష:—వారిని చూచినప్పుడు నిన్ను చూచినట్లయినది. వారును, నీవును ఒకటయిరి. వారెవరు తాతయ్యా!

స్థౌల:—తల్లీ, ఆయన నీతండ్రి. ఆ తండ్రిని నీ చిన్నతనమున పోగొట్టుకొంటివి. నేడాతడు మహర్షియై నాకడకు వచ్చినాడు

స్థౌలతిష్యుని శిష్యుడొకడు కొన్ని మాత్రలను అమృతపాదులకిచ్చెను. వేరొక మాత్రను విషకన్యచే సేవింపజేసెను.

స్థౌలతిష్యుడప్పుడు కలశమెత్తి

"ఘృణిం తే అన్యద్యజతం తే అన్యద్విషురూపే అహనీ ద్యౌరివాసి।

విశ్వాహిమాయా అవసిస్వధావో భద్రాతే పూషన్నిహరాతిరస్తు॥"

అని సూర్యమంత్రము పఠించెను. బ్రాహ్మణులందరు కంఠములు గలిపిరి.

ఇంతలో చక్రవర్తియు, శ్రీకృష్ణసాతవాహనుడు, మహారాజ్ఞి అందరునువచ్చి స్థౌలతిష్యునకు అమృతపాదులకు నమస్కరించిరి.

విషకన్య తండ్రికడకుపోయి నమస్కరించినది. అమృతపాదులామెను అక్కునజేర్చికొని, మూర్ధమునముద్దిడి "తల్లీ! నీవలన నాకు బ్రహ్మజ్ఞానము వచ్చినది. నాతండ్రి, నీతాతగారు! ప్రేమస్వరూపులైనారు. నీవు అమృతకన్యవగుదువు. నీవు ప్రేమించిన ఈ శ్రీకృష్ణమహారాజునే చెట్టపట్టుము" అని ఆశీర్వదించెను.

శ్రీకృష్ణసాతవాహనుడు:— స్థౌలతిష్యమహర్షీ! తాతగారూ! ప్రథమమున నన్ను చిరంజీవ అని ఆశీర్వదించిరి. అనియే నిజము. తమబాలికను నాకు ప్రసాదింపుడు!

స్థౌల:— మహారాజా! నానోటినుండి మొదటవచ్చినదే సత్యము! నీప్రియురాలు మృత్యుంజయుని శరణ్యమునే పొందినది. ఇంక మీతండ్రి ఆంధ్ర చక్రవర్తిని, సకలజంబూద్వీపమునకు చక్రవర్తిగా నేనే ఈ పాటలీపుత్ర సింహాసనమున అభిషేకింతును. మీ మామగారును అభిషేకింతురు. ఇంక ఆరునెలలలో చంద్రబాల అమృతకన్యయగును. నీవామెనప్పుడుద్వాహమగుదువుగాక!

అందరు తథాస్తనిరి. చక్రవర్తి స్థౌలతిష్యునికడ మోకరించెను.



# ఏకోనవింశతి ప్రకరణము

## విషకన్యకా శ్రీకృష్ణులు

విషకన్యక తాతగారి ఆశ్రమమునందే వాసముచేయ శ్రీకృష్ణుడు పంపించెను. ఆమెను గగనియు, కాశ్యపియు, అగస్తియు కలుసుకొని హృదయమార కౌగిలించుకొనిరి. ఆ పుణ్యబాలకను వారికిని కన్నులనీరు తిరిగినవి. వారు అత్యంతానందమున యథార్థ పరిచర్యచేయ నారంభించిరి.

స్థౌలతిష్యునకు ఇన్ని సంవత్సరములు అణగియుండిన ఆపేక్ష నేడు పొంగి వరదలై ప్రవహించినది. ఋషి జడభరతునకు కురంగ శాబకముపై ప్రేమ పూర్వకర్మ వశమున నదియై ప్రవహించినట్లు, నేడు నిష్కామ వ్రతదీక్ష నందిన స్థౌలతిష్య బ్రహ్మర్షికి మనుమరాలిపై ప్రేమ మిన్నుముట్టినది. ఇన్ని సంవత్సరములు తన మనుమరాలిని భయంకర మారణయంత్రముగ సిద్ధముచేసినాడు. తన హృదయమున చుట్టియుండిన ప్రేమపాశముల కర్కశములనొనర్చి ఎట్టికరుణయు తనకడకు రానీక బౌద్ధజినధర్మ నిర్మూలనగ మొనర్ప సంకల్పించిన యా మహావృద్ధునకు నేడు సర్వావేశములును సూర్యకిరణములు స్పర్శమాత్రమున మంచులు మాయమైనట్లు మాయమైనవి.

తన మనుమరాలే తనకు దేశికత్వము వహించినదా యని యా తపస్వి తలపోసినాడు. సర్వ కాంతిపూత జ్యోత్స్నా విలసితమూర్తియై, ప్రాపంచికాద్భుత సుందర శ్రీవిలసితయై, అగస్తీ, గగనీ కాశ్యపీ మధ్యస్థయై, కృష్ణాజినాసనయై యున్న యా బాలికనుజూచి స్థౌలతిష్యుడు కౌశికుడైన విశ్వామిత్రుని బారినుండి రక్షింపబడిన నందినీ ధేనువును జూచిన వసిష్ఠ మహాఋషివలె ఆనందపూర్ణహృదయుడయ్యెను.

విశాలములైన యామె కన్నుల కోటి తారాద్యుతులువెలుగు నిర్మలయామినీ కాంతులు నృత్యము చేయుచున్నవి. గుండ్రమును, కోలయు నగు నామె మోమున బాలికారేఖలుబోయి ఆర్ద్రములు ప్రవహించు క్షీరనదీరేఖలు వికసించినవి. ఆటవిక బింబ భయంకర మూర్తిమంతములైన యామె పెదవులు, పాలసముద్ర మధ్యస్థ శ్రీమన్నారాయణ శయనిత కోటిపుట దివ్యసుందర పూర్ణకమల పరిసరజనిత సరోజ కుట్మలములై అమృతస్విన్నము లైనవి.

స్థౌలతిష్య మహర్షి సంకల్ప మీనాడా బాలికను అమృతకన్యనుచేసి, శ్రీకృష్ణ శాతవాహన ప్రభువున కుద్వాహ మొనరింపవలయు ననియే! కేవలంత్రి ప్రఖ్యాతమైన మహాఋషుల పావిత్ర్యమే జంబూద్వీపమును సకలధర్మ సంయుక్తము చేయుచుండును. ఏ మహావీరుడో, ఏ గౌతమబుద్ధుడో జనించి, వేదస్థములై, పరికాళించు వివిధభావములు ధర్మానేకములై ఒక్కొక్కయుగమున ఒక్కొక్కటి విలసిల్లుగాక. యాగమేమి దోషమున్నది? అమృతకన్యయగు విషకన్యకా ప్రభావమున శాతవాహన మహారాజులే యజ్ఞ యాగాది క్రతువు లొనర్తురు. వారు సర్వధర్మ దక్షిణాపథము లగుదురుగాక యని తపసావేశుడైనాడు

విషకన్యక చంద్రబాలయే యైనది. ఆమె గగనితో తాంత్రికముల చర్చించును, కాత్యాయనితో దార్శనికములు వాదించును, అగస్తితో త్రియోగతములగు మహాసత్యముల విచారణచేయును. అమృతమయమైన దివ్యౌషధుల సేవించును, పూర్ణశశిసితము లగు అంగములకు, విషపువిరుగుడు తైలముల పూయించుకొనును. ఆమె దినదినము పూర్ణిమోన్ముఖమైన చంద్రబింబమువలె వృద్ధినందు తేజస్సును తాల్చుచున్నది

ఆమె వీణియపై ఆనందగీతము లాలపించుచు దినదినము తన్ను చూచుటకువచ్చు ప్రియునిరాకకై ఎదురుచూచు చుండును.

కీర్తిగుప్తుడు తనకడకు వచ్చిన సాయంకాలము శ్రీకృష్ణ శాతవాహన మహారాజ చక్రవర్తి దర్శనము చేసికొనెను.

“మహాప్రభూ! సువర్ణశ్రీప్రభువు వారణాశి మృగవన సంఘారామానికి వెడలిపోయినాడు.”

“అవునుకుమారా! మీరుపోయి మా ప్రతినిధులై సువర్ణశ్రీప్రభువును సార్వభౌమ ప్రతినిధిగ పాటలీపుత్ర సింహాసన మధివసింప పిలువుడు.”

“అవధరింపుమటులే మహాప్రభూ! హిమబిందుదేవియు, సువర్ణశ్రీ ప్రభువును ఒకరినొకరు [illegible]కొన్నారు.”

“[illegible] శ్రీకృష్ణ శాతవాహన మహారాజా బాలికను వివాహమాడునని తాను పాటలీపుత్రపురమున నుండుటవలన హిమబిందుదేవి వివశయైన బాధపడుచేమో యనుకొని ఆ మహాశిల్పకుమారుడు పారిపోయినాడు. మీరు వెంటనేపోయి ఆబాల ప్రభువుని వెంటగొనిరండు. మీ వివాహమునకా శిల్పమూర్తిని ఆహ్వానింప నేను కొందరి మంత్రుల నంపెదను.”



శ్రీకృష్ణమహారాజు జనకుని పాదముల కెరగిన, యాచక్రవర్తి కొమరుని గాఢముగ కౌగిలించుకొనెను. తండ్రి యనుమతినంది యువరాజు రథముపై, సేనాపతులు మంత్రులు కొలువ గంగాతీరస్థమగు స్థౌలతిష్యాశ్రమమునకు వెడలెను.

స్థౌలతిష్య మహర్షికి పాదాభివందన మాచరించి, వారి ఆశీర్వాదము లంది యువరాజు విషకన్యకాదేవిని చూడ లోని ఆరామములకు ఒంటిగ బోయినాడు.

తనస్వామి వచ్చుచున్నాడని వినిన చంద్రబాల గగన్యాదుల వదలి ఆనందపులకిత హృదయయై, రాజహంసివలె నడచుచు ప్రియుని ఎదుర్కొనినది.

ఒకరినొకరు చూచుకొని యా వనాంతరమున పూలపొదల వికసించియున్న యాస్థలమున నటులనె నిలుచుండిపోయినారు. సర్వభూషణోపేతయై కణ్వాశ్రమమున శకుంతలవలె ఆబాలిక రూపొందిన వెలుగు బాలికవలె నిలుచుండిపోయినది. విడిపడిన యాబాలిక పెదవులు చిరునవ్వులగూడి ఉషారుణములు పొదివికొనిన మందార కుసుమ కోరకము లైనవి.

శ్రీకృష్ణప్రభువు హిమాచలతనయను చూచిన కైలాసేశునివలె వెలిగిపోయినాడు.

చంద్రబాల చేతులుచాచి, “ప్రభూ! వచ్చితిరా! సర్వకాలముల మీ పాదముల మ్రోల అధివసించియుండు భాగ్యము నాకెప్పుడు?”

“దేవీ! ఆ పొదరింట కూరుచుందము రమ్ము!”

“మందులు పుచ్చుకొనియే వచ్చితిరా!”

“తాతయ్యగారు ఔషధముల సేవింపనీక నన్ను నీకడకు పంపెదరా ఆత్మేశ్వరి!”

“తాతపాదుల దయ అనంతము.”

ఇరువురు పొదరింట అధివసించిరి. ఆ పొదరింట పూలపరీమళములలో చంద్రబాల శివజటాజూట నృత్తాంకితమూర్తి శ్వేతపన్నగివలె సాత్వికాభిరూప యైనది. ఆమె వెనుకనే స్వచ్ఛోదగి ఉలూపి మెరుపువలెతోచి నాగవరాళి రాగిణ్యాలాపనలైన బుసల నాపొదరిల్లు నింపి శ్రీకృష్ణప్రభువు ఒడిలోనికి ప్రవహించి వచ్చెను.

“దేవీ ఉలూపి! ఈ దినములలో మెరుపువలె వెలిగిపోవుచున్నది. ఆమెకింత యానందమేమి?”

“ప్రభువు ధూర్తులగుచున్నారు. నా ఆనందమూ పన్నగరాణిదియూను!”

“అటులనా!”

ఉలూపి ఎటులవచ్చినదో అటులనే మాయమైనది. విషకన్యకడకు శ్రీకృష్ణుడు చటుక్కున చేరి యామె నక్కున చేర్చుకొని, మందాకిని, పాలసముద్రము చేపట్టి, రాకాపూర్ణిమాజ్యోత్స్న సుధాకర హృదయమున చేపట్టి అమృత మధురములగు చుంబనముల నా అమృతబాలిక పెదవుల కురిపించుచు, నామెను హృదయమున బిగి కౌగిలించుకొనెను.

అప్పుడు విషకన్యక

“చంద్రస్త్వాం, చంద్రికాహం,
దివిజసరిదహం, భాస్వర స్సాగర స్త్వాం,
ఏతద్విశ్వాంబుజంత్వం
సతతపరిచరద్గంధసందోహికా హమ్

ఆమె మోము హాసప్రఫుల్లమైనది. “ఇది నేను రచించు నొక రూపకము లోనిది సుమండి!

ఈ శ్లోక పాదాలు కూడా వినండి

ఏషా నే యం ధ్వని రహ మమృతా,
త్వం మహాకాశరూపః
ఓం త్వం, త్వం తత్. త దహం, మహా మహో
సృష్టి రేషా సమస్తా”

అవి తోడిరాగిణీయుక్తమగు కాకలీస్వర పూరితమునగు శ్లోకములు పాడినది.

శ్రీకృష్ణప్రభుని యానందము వర్ణనాతీతము.

“దేవీ నేను హిమబిందుకుమారిని ఉద్వాహమగుదుననుకొని సువర్ణశ్రీ ప్రభువు వారణాసి పారిపోయినాడు. రేపు పణివాతని ఆయనను తోడితే వారణాసి పోవుచున్నాను.”

కవిబాల “తప్పక కొనిరండు. మీరు ప్రార్థించినగాని యా మహాశిల్పి రాడు సుమండీ!” యనెను.



# వింశతి ప్రకరణము

## శిల్పి – ప్రణయిని

సువర్ణశ్రీ అచ్చట శిల్పగృహమున ఒకబోధిసత్త్వుని విగ్రహము చెక్కుచుండెను. ఆబోధిసత్త్వుడు త్రిభంగిమై నిలుచుండి లీలాకమలము కుడిచేతధరించియుండెను. సువర్ణశ్రీ తన ఆవేదన యంతయు నావిగ్రహమున ఆవేదనాతీతుడగు మహానుభావునియందు మూర్తింపజేసెను.

మృగాజిన యజ్ఞోపవీతధారియై, మణిస్థగితకుండలకర్ణుడై, విశాలనేత్రుడై, విపుల భుజాస్కంధుడై, యాబోధిసత్త్వుడు సువర్ణశ్రీ పోలికనే వరించెను.

“నీపోలిక నీవిగ్రహమేల చెక్కితివి?” అని గాంధారనివాసియగు నొక బౌద్ధభిక్షుకు డడిగినాడు.

“నేను పొందలేని అర్హత్వము నీవిధమున పొందించ చేసికొంటిని.”

“ఓయి వెఱ్ఱివాడా, నీవుమాత్రమేల బోధిసత్త్వుడవు కాలేవు?”

“కొన్ని జన్మలవరకు కాలేనని నాకు నిశ్చయముగ తెలుసును. నామనస్సు అద్భుతమగు నొకవిషయమున తగులము నందినది. ఆవస్తువే నాకు స్వప్నము. ఆవస్తువును మనసా నేను విడిచియుండలేను.”

“ఏల నీవావస్తువును పొందకూడదు?”

“అదినేను పొందదగినదికాదు. అది పరకీయము. నేను కోవిధముల పూజింపదగిన మహాపురుషునిదది.”

ఆ భిక్షుకుడు ఈ బాలశిల్పి ఒకపరకీయను బహుశః గురుపత్నిని ఆశించెనేమో యని ఎంచినాడు.

“కుమారా! నీవు దీక్షగైకొనుము. దీక్షయే ఈ ప్రపంచవాసనలనుండి నీకు విముక్తి కలుగజేయును” అని బోధించెను.

సువర్ణశ్రీ ఆలోచనాతీక్ష్ణమగు వదనమున “నేను దీక్ష పుచ్చుకొందును. ఏనాటి దినముననే పుచ్చుకొందును. బుద్ధుని చరణముతప్ప నాకు వేరుగతి లేదు!” అని చెప్పెను.

"అయిన నీదీక్షకువలయు కర్మకాండమంతయు సిద్ధము చేయించెదా" నని భిక్షుకు డాశిల్పభవనమునుండి వెడలెను.

సువర్ణశ్రీ అర్ధనిమీలితనేత్రుడై బుద్ధదేవుని ధ్యానించుచుండ, మనోనయనమున హిమబిందు ప్రత్యక్షమయ్యెను.

హృదయము చెదరి సువర్ణశ్రీ కన్నులు తెరచెను. ఎదుట చిరునవ్వు నవ్వుచు హిమబిందు నిలచియున్నది.

ఎదుట చిరునవ్వు నవ్వుచు హిమబిందుమూర్తి ప్రత్యక్షమగుటయు, సువర్ణశ్రీ కళ్ళు మరియు గట్టిగా మూసుకొనినాడు. ఆమె ఇంకను కనులలోనే నిలిచియున్నది.

బుద్ధదేవునికి కామదేవుడటులనే ప్రత్యక్షమైనాడు. ఆమె అటుల తనచూపులలో సర్వస్వములో ప్రత్యక్షమగుట అతనికి సంతోషమే కూర్చినది. అటులనానంద ముద్భవించుట గమనించి యాతడు కించపడినాడు.

తాను భిక్షుకుడయ్యు ఈదేవిని మరచిపోలేడా? ఈ అద్భుత సుందరీమణిని, సకలకళాధిదేవిని తాను మరువలేడా? తనహృదయము, చిత్తము నిజముగా భిక్షుత్వ మందలేదా?

"దేవీ! హిమబిందూ, నాకళాతపస్సు మూర్తీభవించిన అపర తారాదేవీ! ఆనందమయీ! సౌందర్యమయీ! నిన్ను విడచి ఎట్లు నేను బౌద్ధభిక్షుకుడను కాగలను? కట్టినపట్టముల కాషాయవర్ణములు, భావములు కాంక్షాపూర్ణములు" అని అతడు పెదవులు కదలించెను.

"అవునయ్యా! నీవు బౌద్ధభిక్షుకుడ వెట్లుకాగలవు" అని తీయనిమాటలు వినబడినవి.

అతడామాటలు తన హృదయమునుండి వినంబడినవనుకొనెను.

"నా బుద్ధసేవకు నీవడ్డమురావలదు దేవీ! నిన్ను ప్రేమించితిని, ప్రేమించుచున్నాను. నిన్ను మరచిపోవుశక్తి నాకు నీవే ప్రసాదింపవలయును."

అతడు కన్నులుతెరచెను. హిమబిందు కన్నుల నీరునిండ, అతనిఎదుట చేతులు జోడించి నిలిచియున్నది.

"స్వామీ! మీరునన్ను నిజముగా మరచిపోవలయుననియే సంకల్పించినారా?"



అతడు చకితుడై తనఎదుటనున్నది హిమబిందే అని గ్రహించి, లేచి నిలుచుండినాడు. అతడు గజగజ వణకినాడు. అతనికి తనభావములే అర్థముకాలేదు. ఒక్కసారి పెరచింతలెల్లవిడిచి ఈ దివ్యమూర్తిని తనహృదయమున కదిమికొని, మనుష్యలోకమునకు దూరముగ నామెను తస్కరించుకొనిపోయి, ఆమెయే తానై ఆనిర్జనపథములలో దివ్యానంద మనుభవింపవలయు ననుకొనినాడు.

ఒకసారి ఈబాలిక ఈ మహోత్తమచరిత్రి మహారాజ్ఞియై చక్రవర్తినియై లోకమేల నున్నప్పుడు, తానామెకు ధూమకేతువువలె ఆమెపాలిటి దుర్దయివమువలె తటస్థించుట మహాదోషము అనుకొనును.

ఈమె ఇట్లేలవచ్చినది. య్యయ్యో ఏమనుకొందురు! ఎంతతప్పు! తనకై ఇట్లువచ్చుటఏమి? తాను వృషభశకట పరీక్షలో నెగ్గుటయే ఈ యనర్థములకన్నిటికి మూలము. తామిద్దరట్లు ప్రేమించుకొననేల? తథాగతుడు తనకేదారి చూపునో? ఇంతదనుక తాను భిక్షుకత్వమేల పుచ్చుకొనలేక పోయినాడు?

"సువర్ణశ్రీకుమారా! మాటలాడరేమి? నేనేమి దోషమొనర్చితినని ఇటుల పారిపోయి వచ్చితిరి?"

"దేవీ! నీవు దోషమొనర్చుటా? నేనే దోషములముద్దను. మా నాయనగారి మాటలు విన్నచో నాప్రభువుకు, నాధర్మమునకు దోషము వచ్చెడిదిగాదు.

"మీరేమిదోష మొనరించినారు నాదే దోషమంతయు; నాకీవిద్యలెందుకు నాకీ జన్మమెందుకు? ఏల నేను మాతండ్రికి ఉద్భవించినాను. మిమ్ము ప్రేమించితి మీరు నాకు భర్తలు. ఒండొకని భర్తగా ఎట్లంగీకరించగలను. అది ఆర్యధర్మముకాదు స్త్రీ ధర్మ మంతకన్నను గాదు. మీరు భిక్షుకులగుదురా నేనును భిక్షుకురాలనగుదును మీకు సేవచేయుదును."

"నీవు మహారాజ్ఞివికావలయును! భారతవర్షమును నీవును పూజ్యులగు చా గుప్తులవారును, రక్షింపవలయును ధర్మభారమునకై ఉద్భవించిన నీకు భిక్షుకత్వ తగదు."

"మీకన్న నాకితరధర్మము, దైవము లేదు. కానినాడు నాకీప్రాణము నిలువవు."

"బుద్ధ! బుద్ధ! అట్టిమాటలనకు దేవీ!"

సువర్ణశ్రీ ఏమిచేయును. ఎదుట తానురచించిన బోధిసత్త్వవిగ్రహము! కుడివైపున హిమబిందు! ఆమె బోధిసత్త్వుని దేవియై, యాతనికి తోచినది. కాని ఆబోధిసత్త్వుడు తనపోలిక! ఆబోధిసత్త్వుడే తానయినాడు.

హిమబిందునకు ధైర్యము పటాపంచలగుచున్నది. తాను చారుగుప్తుని తనయయై తన చిరకాంక్షితమును తాను పొందలేకపోయినది. భిక్షురాలై సంఘసేవచేయుచు ఈ మహాత్మువి, ఈ బోధిసత్త్వావతారుని, మనస్సులో పూజించుచు, నశించిపోవుట కన్న మార్గమింకొకటిలేదని యామె తలంచి భయపడి గజగజ వణకిపోయినది. ఆమె ముడుచుకొని కుంగిపోయినది. తానెట్లు మరల తండ్రియింటికి పోగలదు. తనకు చక్రవర్తినీత్వ మావంతయు అవసరములేదు. తనకు కుబేరవైభవము వలదు. ఏల తాను ఒక కర్షకసుతయై జన్మింపలేదు. ఎందరు భిక్షురాండ్రు మానుజాపకు సేవచేయుటలేదు. అటులనే తానుకూడ తనచేతనైనసేవ కావించును.

సుందరీనందుల చరిత్ర ఏమైనది. అటులనే తామును సన్న్యాసము పుచ్చుకొందురుగాక! దూరమునుండియే తాను తనస్వామిని దర్శించును ఆయనకొరకే తన సన్న్యాసము. ఆయన తన తపస్సు, ఆయన తన నిర్వాణము!

“ప్రభూ! మీరు సన్న్యాసులగుడు, నన్నును దీక్ష పుచ్చుకొననిండు. అంతియ నా తుదికోర్కె!” అని హిమబిందు సువర్ణునిఎదుట మోకరించినది.

సువర్ణశ్రీ “వలదు, హిమబిందూ! అట్లనకుము. నీ పితృదేవులకోర్కె నిరాకరింపకుము. బుద్ధదేవుడు నిన్ను రక్షించును. నీకు సన్న్యాసమేమి?” అని చేతులురెండు జోడించి విచారముతో, గద్గదికముతో పలికి, ఆవేదనతో నిలుచుండెను.

“సువర్ణశ్రీకుమారా! నీకుమాత్రము సన్న్యాసమెందుకయ్యా?” అని చారుగుప్తుడా మందిరములోనికి వచ్చెను చారుగుప్తునివెనుక ఆ సంఘారామకులపతియు, వారివెనుక కీర్తిగుప్తుడును వచ్చిరి.



# ఏకవింశతి ప్రకరణము

## రాజప్రతినిధీ జయ!

హిమబిందు లేచి నిలుచున్నది. ఆమె భీతచిత్తయై, ధైర్యము కుదుర్చుకొని, కోపఘూర్ణయగు ఆడుపులియైనది.

చారుగుప్తుడు తనయను గట్టిగ హృదయమున కదుముకొని, “నాతల్లీ! నిన్ను సువర్ణశ్రీకి ఉద్వాహమొనరింప నేను సంపూర్ణముగ సంకల్పించుకొనినాను. నేనందులకే నీవెంటవచ్చితినితల్లీ! అందుకే మీ తాతగారును నీ మామగారును వచ్చినారు. మేము నీవెనుకనే ఈ మందిరముకడకువచ్చి, గుమ్మముకడఆగి మీసంభాషణ వినుచుంటిమి. సువర్ణశ్రీ నీవు పవిత్రచరిత్రుడవు. నేను మూర్ఖుడనై ఐహికభోగములు కాంక్షించితిని. నీవు నాతల్లిని నీ ఆత్మతోడనే ప్రేమించితివి. నీవు సన్న్యాసమెట్లు గ్రహింపగలవు నాయనా? నీవు భిక్షుకత్వము స్వీకరించి, ధర్మమునకు ద్రోహము చేతువా?” అని సువర్ణునివైపుతిరిగి యనెను.

హిమబిందు తండ్రిమాటలకు చకితయై తండ్రి కంఠముచుట్టూ చేతులువైచి, అతని హృదయమున తనమోము దాచుకొని, అతిసంతోషమున వెక్కివెక్కి ఏడ్చినది.

సువర్ణశ్రీ ఇది కలయనుకొన్నాడు. తన్ను తాను నమ్మలేకపోయినాడు. చారుగుప్తునివైపు వెఱ్ఱివానివలె చూచినాడు. కీర్తిగుప్తునివైపు చూచినాడు. ఆవెనుక ఆచార్యులచూచి మోము వాల్చినాడు.

“బిడ్డా! నీవు భిక్షుకుడ వెట్లగుదువుతండ్రీ! నాకా గాంధారభిక్షుకుడు వచ్చి చెప్పినప్పుడే నవ్వువచ్చినది. నీకు కాబోవు తాతగారికి, మామగారికి నమస్కరింపుము!” అనినారు.

సువర్ణశ్రీ తెల్లబోయి ఇటునటు చూచినాడు. ఎటు వీరందరిచ్చటికి వచ్చినారు? వీరు తనసంకల్పమును కొనసాగనీయరా?

హిమబిందువచ్చినది, ఆమెతండ్రి వచ్చినాడు. ఆమె తాతయు వచ్చినాడు

చారుగుప్తుడు కొమరితపై యత్యంతప్రేమచే యామెకోర్కెనే పాలించుటకు వచ్చినారా? లేక ఆబాలికను తనఎదుట యువరాజునకై ఒప్పించుటకా? మొదటి

విషయము నిజమైనచో తానెట్లు ఒప్పుకొనగలడు? రెండవవిషయమున హిమబిందునే ఒప్పించుటకు తాను ఆమెపాదముల బడను

ఏదికర్తవ్యం? ఏమిటిది? తనకై ఇంతమంతివచ్చిరి. తానెప్పుడు ఇట్టిసంకటములే ఇతరులకు తీసుకొనివచ్చుచుండునా? ఏది కర్తవ్యము?

తనప్రభువునకు తాను ద్రోహమెట్లు చేయును? ఇదేతనకు మారపరీక్ష? తథాగతుడు తనపక్షము రానేరాడా? తనలోని దోషములే తన్నీ పరీక్షకు తెచ్చినది.

ఓం నమచ్ఛాక్యమునయే

సువర్ణశ్రీ మ్రాన్పడిపోయెను. అతడు కన్నులమూసెను. అతడు రచించిన బోధిసత్త్వుడైన తానే తనఎదుట తనకు ప్రత్యక్షమైనాడు.

కన్నులుతెరచి, హిమబిందును చూచినాడు. ఆమె కన్నులనీరు కారిపోవుచున్నది. చారుగుప్తుడు చిరునవ్వు నవ్వుచున్నాడు. కీర్తిగుప్తుడు తనపై కరుణార్ద్ర చంద్రికలగు చూపుల బరచుచున్నాడు. సంఘారామకులపతి భ్రూయుగ్మముమధ్య ఈ ప్రపంచమున ఇట్టి దుఃఖమయచరిత్రలు వ్యక్తమగుట నాగదేవుని మహిమయేగదా యను విచారణాత్మకములగు కాంతులు ప్రసరించుచున్నవి.

మంజుశ్రీ మూర్తిమంతుడు, సుందరశ్రీ రేఖాసమన్వితుడు, మనోహరకాంతియుతుడు, వీరావతంసుడు, మహాశిల్పి, సువర్ణశ్రీకుమారుడు ఏమియు మాటలాడలేక మాన్పడి నిలుచుండెను.

చారుగుప్తుడు "నీకుమాత్రము సన్యాసమెందుకయ్యా?" అని గంభీరములు, ఆర్ద్రములు, ప్రేమమయములయిన వాక్యములు పలికిన పలుకులే అతనికి స్తూపఘంటికానిస్వనములై, వీణాతీగలమ్రోతలై, వినిపించినవి.

ఆపలుకులు వినంబడి ఇరువదినిమేషములైన కాలము జరుగలేదు. సువర్ణశ్రీ ఆ శిల్పశాలయందుండియే చతుర్దశభువనములు మహావేగమున పరిభ్రమించి పోవుచున్నాడు.

ఏభావము స్పష్టముగ దర్శనమీయదు. ఏవెలుగును పూర్ణకాంతియుతము కాదు. ఏచీకటియు గాఢతమస్సుకాదు

అతడు గడగడ వణంకిపోవుచు కీర్తిగుప్తునుచూచి ఆ బాలునికడకుపోయి, "నాతండ్రీ! నీవు హిమబిందును ప్రేమింపలేదా, ప్రేమించి వదలుకొంటివా?" అని అస్పష్టముగ ప్రశ్నించెను. కాని కీర్తిగుప్తుని కన్నులు నవ్వుచున్నవి.



చారుగుప్తుడు కొమరితచుట్టును తనచేయిచుట్టి, సువర్ణశ్రీనిచూచి, "కుమారా! ఈబాలిక నీపై ప్రాణముపెట్టుకొని బ్రతికియున్నది. ఆమెపై ప్రాణముంచుకొని, నేను బ్రతికియుంటిని—" అని అనుచుండ సంఘారామకులపతి, "మీపై జంబూద్వీపమంతయు నాధారపడియున్నది వర్తకసార్వభౌమా!" అని యనినాడు.

సువర్ణశ్రీ ఏమిచేయవలయునో, ఏమియనవలయునో తెలియక మౌనమూర్తియై నిలుచుండెను. ఒక్కొక్కలిప్త ఒక యుగమువలె జరుగుచున్నది. తనమహారాజు, హిమబిందు, తాను, చారుగుప్తుడు—మహారాజు, హిమబిందు—

"జయజయ! జగన్మహాపథనృత్యత్ కీర్తిసుందరీపాదా! జయచతుస్సముద్రముద్రితధరావలయ సార్వభౌమకుమారా! శాతవాహన పవిత్రవంశ పారావారరాకాసుధాకరా! జయశ్రీ ప్రతిష్ఠాననగర మహాపాలక, జయధరుకచ్ఛపట్టణచంద్ర సైంహికేయా, జయజయమాళవా, భీర, కుంతలాశికాశ్మికాది నానాదేశరాజన్య కిరీటరత్ననీరాజిత సుందరశ్రీపాదుకా, జయ జయ జయశ్రీ ఆనందీపుత్ర శ్రీకృష్ణసాతవాహన మహారాజా!!" అన్న జయవాక్యములు గంభీరస్వరమున ఆవిహారమున మారుమ్రోగ అందరు చకితులై యావంక కనుగొనిరి.

శ్రీకృష్ణసాతవాహనమహారాజు, వినయభిక్కులు, ధర్మనందియు, శక్తిమతీదేవియు, ముక్తావళీదేవియు లోనికివిచ్చేసిరి. వారివెనుకనే హర్షగోపుడు పెన్నిధిని వెదకు లోభివలె వచ్చెను. హిమబిందు వెంటనే ముక్తావళీదేవికడకు పరువిడి యామె కౌగిలిలో వ్రాలినది. ముక్తావళిదేవి కనులనీరు చెమరింప "నాతల్లీ!" అని ఆమెమూరము పుణికినది.

శక్తిమతీదేవి నవ్వుచు, "కోడలా! క్షేమమా తల్లీ!" అని ప్రశ్నించినది.

సువర్ణశ్రీ మహారాజునకు వీరనమస్కారమిడి, తండ్రికి పాదాభివందన మాచరించి, ముక్తావళీదేవికి, తనతల్లికి నమస్కృతు లిడెను.

శ్రీకృష్ణసాతవాహనుడు సంఘారామ కులపతికి నమస్కారమిడి ఆశీర్వాదమందెను. ఆ మహారాజు సువర్ణశ్రీని కనుంగొని, "ఏమి సువర్ణశ్రీప్రభూ! యాత్రలన్నియు పూర్తియైనచో మిమ్ము గొనిరమ్మని సార్వభౌములు మాకాజ్ఞనిడిరి. మిమ్ము చక్రవర్తి సామ్రాజ్యాభిషేకమునకు, మీ వివాహమునకు, మాసమవర్తి సోదరుల వివాహమునకు ఆహ్వానింప మేమేవచ్చితిమి!" అని సాభిప్రాయపూరితములను చూపుల గరపెను.

సువర్ణశ్రీ "మహాప్రభూ! అవధరించుమంటిని" అని వినయముతో బలికెను

యువరాజు "సువర్ణశ్రీప్రభూ! చారుగుప్తులవారు తమపుత్రికను హిమబిందు దేవిని తమకు పాణిగ్రహము సలుపకోరుటకు వచ్చిరి. తమప్రతినిధిగ సార్వభౌములు మమ్మంపిరి. కాని మాకన్న ముందుగనె శ్రీ చారుగుప్తమహాభాగులు విజయము చేసినారు" అని దరహాసితవదనముగ పలికినాడు.

సువర్ణశ్రీ "మ—మ—హారాజా!" అని గద్గదికనొందినాడు.

శ్రీకృష్ణుడు "సువర్ణశ్రీమహాప్రభూ! మీరుకుసుమపురమున సకలధరాధీశులైన శ్రీ శ్రీముఖసాతవాహన చక్రవర్తుల రాజప్రతినిధులుగా సింహాసన మధివసింప చక్రవర్తులు మిమ్ము ఆహ్వానింప మాకాజ్ఞ నిచ్చినారు" అని గంభీరస్వనముల పలికినాడు.

మాగధులు:- జయజయశ్రీ సువర్ణశ్రీ మహారాజులకు! జయ విరోధివీరమత్తేభ కుంభవిదారణ కంఠీరవులకు. జయజయశ్రీ పాటలీపుత్రపుర సింహాసనాధీశా జయజయ సకలభూమండల ప్రసర్పిత శ్వేతచ్ఛత్రాధిప శ్రీ శ్రీముఖశాతవాహన మహారాజాధిరాజ ప్రసాద లబ్ధసింహాసనా!" అని జయధ్వానములు పలికినారు.

చారుగుప్త ధర్మనంది కీర్తిగుప్తుల హృదయములు ఝల్లుమనిపోయినవి. శక్తిమతీ ముక్తావళీదేవులు ఉప్పొంగిపోయినారు.

సువర్ణశ్రీకడకు శ్రీకృష్ణశాతవాహనుడుపోయి చెవిలో "మిత్రమా! సువర్ణప్రభూ! నాకు హిమబిందుదేవి ఎప్పుడును చెల్లెలు. నీవు వేరభిప్రాయమంది నాకు తలవంపులు తెచ్చెదవా! నాచెల్లెలు హిమబిందుకుమారి నీ అర్ధాంగిసుమా!" అని రహస్యము చెప్పెను.

సువర్ణశ్రీ ఆచార్యుని పాదములకడనే సాష్టాంగపడినాడు. ఆచార్యులంత అత్యంతదయతో సువర్ణుని లేవనెత్తి ఆతనిచేతిలో హిమబిందు చేయి నుంచినారు.

అక్కడచేరిన భిక్షుకులు

"నమశ్శాక్యమునయే
తథాగతాయ, అర్హతే
సంయక్ సంబుద్ధాయ"

అని పాడిరి.

# ద్వావింశ ప్రకరణము

## అఖండభూవలయ సామ్రాజ్యాభిషేకము

"అగ్నిః పూర్వేభి ర్ఋషిభి రీడ్యో నూతనై రుత స దేవాం ఏహ వక్షతి."

అను మంత్రముచే అగ్ని ప్రజ్వరిల్లుచుండెను. మహర్షులు మంత్రములు చదువుచుండిరి. స్థాలతిష్యమహర్షి పరిష్ఠుడయ్యెను.

"ఇంద్రస్యను వీర్యాణి ప్రవోచం యానిచకార ప్రథమాని వజ్రీ
అహ న్నహి మన్వప స్తతర్ద ప్రవక్షణా అభిన త్పర్వతానాం"

ఇంద్రమంత్రములైనవి.

"తత్సూర్యస్య దేవత్వం తన్మహిత్వం మధ్యా కర్తోర్వితతం సంజభార
యదే దయుక్త హరితః సధస్థా దాద్రాత్రీ వాస స్తనుతే సిమస్మై."

సూర్యుని పూజించినారు. సర్వదేవతలను అర్చించినారు.

"నా విష్ణుః పృథివీపతిః" గావున విష్ణు నర్చించిరి.

"తద్విష్ణోః పరమం పదం సదా పశ్యంతి సూరయః
దివీవ చక్షు రాతతం॥
తద్విప్రాసో విపన్యవో జాగృవాంసః సమింధతే
విష్ణోర్య త్పరమం పదం॥"

చక్రవర్తి సింహాసనమహావితర్దికకు దిగువను ఒక సామాన్యసింహాసనముపై శ్రీముఖ సాతవాహనుడు శ్రావణశుద్ధ పంచమినాడు, ఉత్తరఫల్గునీ నక్షత్ర తృతీయ పాదయుక్త కన్యాలగ్నమునందు, సింహాసనారూఢుడుకా సముచితాలంకారుడై అధివసించియుండెను.

కర్కాటకమున రవియు, దశమమున బుధశుక్రులును, మీనమునందు గురువును బలవంతులైయుండి, చంద్రుడు లగ్నమందుండెను.

ఈమహాముహూర్తమునందు సింహాసనాభిషేకము నేర్పాటుచేసినాడు స్థాలతిష్యుడు. అంతకు ముందునుండియు అనేక హోమములు జరుగుచున్నవి.

పాటలీపుత్రము దేవనగరివలె నలంకరింపబడెను. మగధదేశమంతయు [illegible] రింపబడెను. ధాన్యకటకమహానగరము వైకుంఠమే ఆయెను.

ఆంధ్రదేశమంతయు పండుగలే! సకలభూవలయము మహాంధ్రదేశమయినది వారికి.

మహాంధ్రసార్వభౌముడు హరిశ్చంద్రాది మహాచక్రవర్తుల వంశములోని వాడైనాడు.

తెల్లని భద్రదంతావళముపై నధిరోహించి చక్రవర్తి ఆ ముందురాత్రియంతయు నూరేగినాడు. ఆ దంతావళాలంకారమే కోటిఘనములు విలువచేయునట.

చక్రవర్తి సింహాసనమున కెడమభాగమున దేవి ఆనందమహారాజ్ఞి వేరొక సింహాసనముపై నధివసించియుండెను. ఆమె కెడమప్రక్క రెండు సింహాసనములపై శ్రీకృష్ణ సాతవాహనమహారాజు, మంజుశ్రీ రాజకుమారు లధివసించియుండిరి.

దేశదేశములనుండి మహారాజులు, మహాప్రభువులు, భూపతులు, సామంతులు, సేనాధికారులు, వర్తకచక్రవర్తులు, మహామంత్రులు, మహాపండితులు వచ్చియుండిరి.

లోకమంతయు ప్రసిద్ధినందిన గాయకులు, కవులు, శిల్పులు, నాట్యవేత్తలు వచ్చియుండిరి.

సాముగరడీలవారు, ఆయుధవిద్యావిశారదులు, మంత్రవేత్తలు మల్ల ముష్టి యుద్ధనిపుణులు వచ్చిరి.

ఉత్సవమునందు పాల్గొన అనేకులు జానపదులు, నాగరులు [illegible]దేశముల నుండి వచ్చిరి. యవనరాజ్యరాయబారులు, మ్లేచ్ఛదేశరాయబారులు వచ్చియుండిరి.

స్త్రీమండలమున కౌస్తుభమణివలె చంద్రబాల [illegible] సింహాసనము నలంకరించియుండెను. ఆమె ప్రక్కను చక్రవర్తికుమారికలు మాయాదేవియు, శాంతశ్రీదేవియు అధివసించియుండిరి. చంద్రబాలకు కుడిప్రక్కనే అపరప్రజ్ఞాపరమితాదేవివలె హిమబిందు అధివసించియుండెను. అచ్చటనే ముక్తావళియు, అమృతలతాదేవియు, శక్తిమతీదేవియు, నాగబంధునికా, [illegible]నికలు ఉచితాసనముల నధివసించియుండిరి.

చక్రవర్తి కుడివైపున ఉచితసింహాసనముపై చారుగుప్త వర్తకసార్వభౌములు [illegible]వసించియుండిరి. వారివెనుక అచీర్ణమహామంత్రియు, ధర్మనందియు అధివసించి



సంపూర్ణ కవచాధ్యులై నైతురిలవారు సార్వభౌమసింహాసనముకడ కత్తి [illegible]యుండిరి.

ఆవలప్రక్క సోమదత్తాచార్యులుండిరి. సింహాసనవితర్దికా సోపానపంక్తి మొదల సమవర్తి శాతవాహనుడు, శుకబాణులవారును సువర్ణశ్రీయు ఉండిరి.

స్థౌలతిష్యునకు చంద్రస్వామి ఉపనశిష్యుడాయెను.

అమృతపాదార్హతులు సింహాసనమునకు ఎడమప్రక్క సువర్ణ పద్మపీఠముపై అధివసించియుండిరి. వారిననుసరించి వివిధసంఘారామ కులపతులు, అర్హతులు, ఆచార్యులు, భిక్షులు పీఠములపై అధివసించియుండిరి.

మంజుశ్రీని పెంచిన చంద్రస్వామి చెల్లెలు కరుణశ్రీదేవి ఆనందమహారాణి వెనుక పీఠమున అధివసించియుండెను. ఆమెభర్త గౌతమపండితులు, స్థౌలతిష్యునిశిష్యులు వారికి యాజకత్వమున సహాయము చేయుచుండిరి.

అభిషేకము జరిగినది.

బౌద్ధులు బౌద్ధవిధానమున వినయపిటకమునుండియు, దమ్మసుత్తములనుండి మంత్రములు పఠించిరి.

"నమో తస్స భగవతో అర్హతో,
సమ్మా సమ్బుద్ధస్స!
బుద్ధం శరణం గచ్ఛామి,
దమ్మం శరణం గచ్ఛామి,
సంఘం శరణం గచ్ఛామి,
దుతియంపి బుద్ధం శరణం గచ్ఛామి,
దుతియంపి దమ్మం శరణం గచ్ఛామి,
దుతియంపి సంఘం శరణం గచ్ఛామి,
తతియంపి బుద్ధం శరణం గచ్ఛామి,
తతియంపి దమ్మం శరణం గచ్ఛామి,
తతియంపి సంఘం శరణం గచ్ఛామి.
పాణాతిపాతా వెరమణీ సిక్ఖాపదం సమాదియామి

అదిన్నాదానా వెరమణీ సిక్ఖాపదం సమాదియామి.
కామేసు మిచ్ఛాచారా వెరమణీ సిక్ఖాపదం సమాదియామి.
ముసావాదా వెరమణీ సిక్ఖాపదం సమాదియామి.
సురా - మేరయా మజ్జ-పమాద-ట్ఠానా వెరమణీ,
సిక్ఖాపదం సమాదియామి"

అని పాడిరి.

బౌద్ధధర్మాభిషేకవిధానమును, ఆర్యధర్మాభిషేకవిధానమును ఒకటియే.

రెండుధర్మముల ప్రకారము అభిషేకము జరిగెను. చారుగుప్తుని భుజముపై కుడిచేయినిడి చక్రవర్తియు, అతని ఎడమపార్శ్వమున చక్రవర్తినియు, చెలికత్తె శక్తిమతి చేయిబట్టియు సింహాసనముచెంతకు వచ్చిరి. సర్వవాద్యములు మ్రోగుచున్నవి నృత్యగీతాది కళాప్రదర్శనములు జరుగుచున్నవి.

ఐతరేయబ్రాహ్మణము ననుసరించి శ్రౌతవ్యమహర్షి సార్వభౌమ పట్టాభిషేక మొనర్చె. సార్వభౌమకిరీటములు వారి తలలపైనుంచెను. మహదాశీర్వచనము, సుమంగళుల హారతియు జరిగినవి.

దమ్మసూత్తముల ననుసరించి బౌద్ధభారతశిరోమణియైన అమృతపాదులు మహారాజు, వర్తికి అభిషేకము చేసెను.

చక్రవర్తి చారుగుప్తుని సకలజంబూద్వీప సామ్రాజ్యమునకు మహాసామంతులు మొదల అభిషేకముచేసి ముద్రికలందిచ్చెను.



# త్రయోవింశతి ప్రకరణము

## శుభమంగళ గీతములు

షేక మహోత్సవములు సకల భారతావనియందును కొన్ని నెలలుజరిగినవి. కుసుమపురము కన్నుల వైకుంఠమై, ఆనంద కోలాహలమై పోయినది.

అభిషేకమహోత్సవమైన కొలదిదినములకు శుభ ముహూర్తమున సువర్ణశ్రీ హిమబిందుల వివాహమును, నాగబంధునికా సమదర్శుల వివాహమును జరిగినది.

సమదర్శి శాతవాహనుడు ఆంధ్రశత్రువులకు సమవర్తి కావున, సమవర్తి బిరుదు నామ ప్రసిద్ధుడు. అతడు రాజముద్రికలంది, భార్యా ద్వితీయుడై, చంద్రస్వామి మహాపండితయుక్తుడై, తన సైన్యము గూడుకొని భరుకచ్ఛ పట్టణమునకు

న నాగబంధునికా సమదర్శులకు రాజప్రతి
ము జరిగెను.

సమవర్తియే. నాగబంధునికయు, భర్తను
రదేశములకు ప్రయాణము చేయుచు. ఆంధ్ర

వర్తకము సర్వతోముఖముగ వృద్ధినంద సమదర్శి

దర్శికి చక్రవర్తి శాసనము. ఇరువురు సమముగ
ముగ సభయందధివసించి తీర్పుల నిత్తురు. ఇరు
మి మొదలగు మంత్రులతో రాజవ్యవహారము

చియు తలితండ్రులకడకు పురిటికి వెడలిపోవ
కోడలిపిచూచి తనయంత యదృష్టవంతురాలు

లేదని పొంగిపోవుచుండునది. నాగబంధునికి పురిటికి శక్తిమతీదేవియు, సిద్ధార్థునికి ధర్మనందియు వచ్చేసిరి.

అక్కకు పుట్టిన బంగారు శిశువును చెల్లెలు వదలునదికాదు. శిశువునకు నెలలు వచ్చువరకు ధర్మనంది కుటుంబములో భరుకచ్ఛముననే యుండెను. ఆక్ర నౌకచైత్య నిర్మాణము తలపెట్టి ధర్మనంది ఆరునెలలలో ముగించెను. అచ్చట యొక సంఘమును స్థాపించి మహాచైత్యవాద శతమునకుజెందిన సంఘారామ నిర్మించెను.

నవశిశువును శక్తిమతియే పెంచునది నాగబంధునిక మరల సమదర్శికిమం అంగరక్షక సేనాపతియు నైనది.

♦ ♦ ♦

వివాహమైన కొలది దినములను చక్రవర్తి సువర్ణశ్రీమహారాజునకు హిమబింద నకు పాటలీపుత్రమున ఉత్తరాంధ్రసామ్రాజ్యమునకు రాజప్రతినిధి పట్టము గట్టినాడు

జ్యోతిష్యులు వీరపురి కుమారుడు చారుగుప్తమహారాజ నామధేయుడై ఒక మహాసామ్రాజ్యమునకు పాటలీపుత్రపురమున మూలపురుషుడగునని నెలవిచ్చి యుండిరి. ఆవిషయము స్థౌలతిషులవారీవరకే భవిష్యత్తును తెలిపియుండిరి

ధాన్యకటకమునకు చక్రవర్తియు, శ్రీకృష్ణసాతవాహన నందియు, శక్తిమతీదేవియుమహామంత్రులు సైన్యాధ్యక్షులు, సే. వారందరు తరలిపోయిరి.

ఆరునెలలు శ్రీకృష్ణమహారాజునకు చంద్రదేవికిని (విషకన్య) ఎట్లు స్థౌలతిష్యుల ఆశ్రమమునందు విషకన్యక అమృతకన్యక యగుచుండెను శ్రీకృష్ణమహా రాజునకు మహర్షి దివ్య ఓషధులసేవింప జేయుచుండెను.

శ్రీకృష్ణసాతవాహనప్రభువు తన భవిష్యద్దేవిని దర్శింపని దినమొక్కటియు లేదు. విషకన్యక అపరాజితాదేవివలె ప్రకాశించిపోవుచుండె అమృతసౌందర్యా తండ్రిని అప్పుడప్పుడు దర్శించుచు వివిధ వాదముల విశ్వాలత్వము నిర్ణయించుకొను చుండెను. తండ్రితాతగారల వాదనలలో విషకన్యక బ్రహ్మానందసుఖమనుభవించున తనప్రియుని మూర్తియే తనకు పూజామూర్తిగా దినదినాభివృద్ధిగ చంద్రోల్ల



తేజస్సున విలసిల్లిపోవుచు, ప్రియుని హృదయానచేరు శుభముహూర్త మెప్పుడని ఎదురు చూచుచున్నది.

♦ ♦ ♦

పాటలీపుత్రపురమును పాలించుచు సువర్ణశ్రీ కోసలదేశమున స్తూపమునకొక గోపురము స్వయముగ విన్యసించి యర్పించెను.

సువర్ణశ్రీ హిమబిందుల ప్రేమ మహాకావ్యముల కవులచే పాడబడినది.

హిమబిందు సువర్ణశ్రీల ప్రేమ అతిలోకసుందరమైమహాద్భుత శిల్ప విన్యాసరూపమై ఆర్యావర్తమంతయు విలసిల్లిపోయినది. సువర్ణశ్రీ శిష్యులు గాంధార పారశీకాహారస్థాన, బాహ్లీక, మంగోలు, కాశ్యప సముద్రదేశాదులుపోయి ఆంధ్రశిల్ప, చిత్రలేఖనాదులువికసింప యత్నముననుండిరి.

శిల్పదీక్ష ఎంతప్రతిభాయుక్తమైయున్నదో సువర్ణశ్రీకి రాజ్యపాలనాదక్షతయు నంతపట్టుబడినది. ముక్తావళీదేవియు, కీర్తిగుప్తులవారును పాటలీపుత్రపురము ఆగిపోయిరి. చారుగుప్తనిశీక్స్వర్గభౌముడు హిమబిందు ఆనందములో తాను మహ వంశమనుభవించుచు ఆంధ్రమహాసామ్రాజ్యమును వేయి కన్నులకాపాడుచు, పాటలీ పుత్ర, ధాన్యకటకనగరముల మధ్య తిరుగుచుండెను.

హిమబిందు సౌందర్యము సంపూర్ణ వికాసమందినది. ఆమెయే యరణముగ శాలవాగికిని హర్షగోపునకును వివాహముచేయించి హర్షగోపునకు పాటలీపుత్ర మున ఉద్యోగమిప్పించినది.

హిమబిందు మహాసౌందర్యమును అణువు అణువు పూజించుచు సువర్ణశ్రీ దివ్యపథముల సంచరించుచున్నట్లు జీవితాన్వేషియైనాడు. హిమబిందు వా సువర్ణశ్రీ శశికళాప్రియంభావుకుడు.

హిమబిందు:—ఆత్మేశ్వరా! ఏమట్లు మీరు అత్యంత తీవ్రాలోచనాధీ లయ్యెదరు?

సువర్ణశ్రీ:—జీవితేశ్వరీ! నాకీరాజ్యభారము వహించుట ఎందుకు? ఏ శిల్పము చేసుకొనువానికి?

